# ఆంధ్రవాల్మీకి

# రామాయణము

## మూడవ భాగము

(సర్గలు - పూర్వోక్త ప్రకరణములు)



రచయిత:

మల్లావఝుల వేంకట సుబ్బరామశాస్త్రి

శ్రీ

# ఆంధ్ర వాసిష్ఠ రామాయణము

## మూడవ భాగము

(నిర్వాణ, పూర్వార్ధ ప్రకరణములు)

✻

(రచయిత)

వఝ్ఝావఝుల వేంకటసుబ్బరామశాస్త్రి

✻



[మూల్యము : రు. 100-00

సాదాబైండు రు. 100-00

ప్రథమ ముద్రణము

ఆగస్టు 1982

విజయ ఆర్టు ప్రెస్

తెనాలి - గుంటూరు జిల్లా.

మూల్యము- హాఫ్ కాలికో అట్టబైండు రు. 100-00

సాదా బైండు రు. 80-00

ఈ గ్రంథము తిరుమల-తిరుపతి దేవస్థానమువారి
ఆర్థికసహాయముతో ముద్రింపబడినది.

గ్రంథ ప్రాప్తిస్థానము :

M. V. సుబ్బరామశాస్త్రి లేక

M. V. సుబ్రహ్మణ్యం, B. Sc. B. Ed.

21 దయానందకాలనీ - లక్ష్మీపురం (P. O.)

వరంగలు - 13

ఆంధ్ర వాసిష్ఠ రామాయణము నిర్వాణ
ప్రకరణము, పూర్వార్ధమునందలి.

# విషయానుక్రమణిక

క్రమసంఖ్య | పేజీ

స మా ప్త ము



ఈ గ్రంథ ముద్రణమునకు కె. శివానందమూర్తిగారు
రు. 1000-00 వెయ్యిరూపాయలు ద్రవ్యసహాయము చేసిరి.



శ్రీ శారదాంబాయై నమః

# ఆంధ్ర వాసిష్ఠ రామాయణము

## షోడశ భాగము

## నిర్వాణప్రకరణము-పూర్వార్థము

### ౧. దివసవ్యవహారవర్ణనము

వసి॥ రామచంద్రా! ఉపశమప్రకరణం పూర్తి అయింది. ఇంక నిర్వాణప్రకరణం చెబుతాను విను. ఇదే మోక్షం ఇచ్చేది సుమా! అన్నారు వసిష్ఠులు-వసిష్ఠ మహాముని చెప్పనారంభించారు. శ్రీరాముడు విననుద్యుక్తుడై ఉన్నాడు- రాజలోకం అంతా మునినోటినుండి వచ్చేడి విషయమునందు మనస్సునుంచి పటములోని బొమ్మమాదిరి నిశ్చలంగా ఉంది- మునిపుంగవులు తర్జనీవ్రేలుమీటుతూ(కదల్చుచూ) వసిష్ఠ వచనముల అర్థమును విచారిస్తున్నారు. పురంధ్రవర్గము ఆశ్చర్య రసంలో మునిగిపోతోంది- సూర్యుడు పగటికాలంలో నాల్గవభాగం మాత్రమే మిగిలి సౌమ్యంగా ఉన్నాడు- వాయువు వీరి సంభాషణ వినుటకొరకువలె నిస్పందంగా (నిశ్చలంగా) ఉన్నాడు- పూలగుత్తులందు తుమ్మెదలు జ్ఞాతజ్ఞేయములై ధ్యానించుచున్నవివలె ఉన్నాయి- దశరథుని యిల్లు చాలా సంకులంగా ఉంది- అస్తమయం కావస్తోంది- దానికి సూచకంగా భేరీపటహశంఖములను పూరించారు- ఆధ్వని ముందర వసిష్ఠుని మాటలు వినిపించటంలేదు- దానిధ్వని క్రమంగా

తగ్గింది- తరువాత వసిష్ఠులు అప్పటివిషయం ముగింపదలచి రామునితో సభామధ్యమున ఇలా అన్నారు-

వసి॥ రామా ! నేను నావాగ్జాలమనే వలను నీకు ప్రసాదించాను. దానితో నీచిత్తమనే పక్షిని పట్టుకొని హృదయంలో నిరోధించుకొని ఆత్మస్వరూపమును అందుకో- నామాటల సారమును గ్రహించావుకదా ! హంస నీటినివిడిచి పాలనుగ్రహించినట్లు- ఇదేవిషయాన్ని విచారణలో పెట్టుకొని మోక్షమును పొందునీవు-నీవీదృష్టిలో ఉన్నచో బద్ధుడవుకావు- లేకుంటే అధఃపతనం తప్పదు. నామాటలను శిరసావహించి ఆచరించకపోతివా గ్రుడ్డివాడూ, దీపములేనివాడూ, చీకటిరాత్రులలో గోతులలో పడినట్లు సంసారమనే గోతిలో పడతావుసుమా! నేను చెప్పిన విషయం నీకు ఫలించాలంటే నీవు నిస్సంగంగా వ్యవహరించాలి- నేను చెప్పినదంతా సర్వశాస్త్ర సిద్ధాంతరహస్యంగా భావించాలి- మనస్సులో పెట్టుకోవాలి-

ఓ సభ్యులారా ! ఓ, దశరథమహారాజా ! ఓ రామలక్ష్మణులారా! మీరందరూ మీఆహ్నికాలను తీర్చుకోండి- సూర్యాస్తమయం కావస్తోంది- మిగిలినవిషయం రేపుప్రొద్దున విచారిద్దాం అన్నారు వసిష్ఠులు-

వాల్మీ॥ భరద్వాజా! వసిష్ఠమహాముని ఇలా అనేసరికి సభ అంతా లేచింది- రాజులందరు తమతమ మకాములు చేరారు- విశ్వామిత్రునితోకూడ వసిష్ఠుడు తన ఆశ్రమానికి వెళ్లుటకు లేచాడు ఆసనము నుండి-దశరథుడు మున్నగు రాజులూ నభశ్చరులూ వసిష్ఠుని అనుసరించి బయలుదేరారు- వసిష్ఠునివద్ద సెలవుతీసికొని నభశ్చరులు గగన ప్రదేశంచేరారు- దశరథుడు తన భార్యలతోకూడ వసిష్ఠుని పాదముల మీద పుష్పాంజలినిచల్లి ఇంట్లోకివెళ్ళారు- రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు వసిష్ఠాశ్రమంవరకు వెళ్ళి భక్తితో గురువుగారిని పూజించి

రాజమందిరమునకు తిరిగివచ్చారు- అందరూ ఇల్లుచేరి స్నానమాడి తమ విధిప్రకారం దేవబ్రాహ్మణపూజలను నెరవేర్చుకున్నారు- అభ్యవహారాది కృత్యములను నెరవేర్చుకున్నారు రాత్రి అయింది- తమతమ పడకలమీద పడుకున్నారు- వీరందరూ ఎవరికివారు వసిష్ఠుడు ఉపదేశించిన సంసార తరణోపాయమును ఏకాగ్రమనస్సుతో ఆలోచించారు- నిద్రించారు- వేకువఝామున ఇంకొకఝామునకు తెల్లవారుతుంది యనగా భావిమోక్షఫలసూచకంగా రమణీయమయిన కలకన్నారు- రామలక్ష్మణశత్రుఘ్నులు మాత్రం రాత్రి మూడుఝాములూ వసిష్ఠోపదేశాన్ని ఆలోచిస్తూనే ఉన్నారు- ఇంకసుమారు నాలుగు గడియలకు తెల్లవారుననగా కనుమూసి (నిద్రించి) వెంటనే శుభసూచకమయిన కలకన్నారు- ఇంతలో తెల్లవారింది-

2. వెన్నెల వెలవెలపారింది- చీకటి విడిపోయింది- రాత్రి క్షీణించింది- ఉదయాద్రియందు సూర్యుడుదయించాడు- ప్రాఙ్ముఖంగా ఉన్న జనులకు వెలుగు కనిపిస్తోంది- ఇంతలో రామ లక్ష్మణ శత్రుఘ్నులు అనుచరులతోసహా లేచారు- స్నానసంధ్యాదికృత్యాలు తీర్చుకున్నారు- వసిష్ఠాశ్రమమును చేరారు- వసిష్ఠులును స్నానమాడి సంధ్యాది కృత్యములను తీర్చుకుని ఆశ్రమమునుండి బయలుదేరారు- ఇంతలో రామాదులువచ్చి అర్ఘ్యపాద్యాదులతో పాదపూజచేశారు వసిష్ఠులకు- క్షణకాలంలో వసిష్ఠాశ్రమము మునులతోను, బ్రాహ్మణులతోను, రాజులతోను హస్తి అశ్వరథయానములతోనూ క్రిక్కిరిసిపోయింది- పిదప ఆమునిపుంగవుడు ఆ పరివారంతోనూ, రామాదులతోనూ, రాజమందిరం (దశరథగృహమును) చేరాడు- ఇంతలో దశరథుడు తన కృత్యములను దీర్చుకొని వసిష్ఠులు దూరంగా ఉండగనే ఎదురేగి అత్యాదరంతో పూజించాడు- పుష్పములతోనూ, ముక్తాహారములతోనూ, మణిహారములతోనూ చక్కగా అలంకరింపబడిన సభను ప్రవేశించారు- అందరూ తమతమ ఆసనములను అలంకరించారు- అదే

సమయంలో నిన్నటిరోజున విన్న సభశ్చరులూ, రాజులూ మరల వినటానికి వచ్చారు- అందరు వారివారి ఆచారప్రకారం ఒకరినొకరు నమస్కరించుకొని సౌమ్యంగా (ప్రశాంతంగా) కూర్చున్నారు- వందిమాగధులు ఆసభలో ఒకమూలకూర్చుని స్తుతిపాఠములను పఠించారు- సభ అంతా నిశ్శబ్దంగా ఉంది- శ్రీరాముడు వసిష్ఠుని ముఖముమీద దృష్టినిల్పి ఉన్నాడు- వాక్యార్థకోవిదులయిన వసిష్ఠులు క్రమంగా ఇలా అన్నారు శ్రీరామునితో-

వసి॥ రామచంద్రా! నేను నిన్న చెప్పిన విషయం జ్ఞాపకమున్నదా! గంభీరార్థముగల విషయం అది- పరమార్థమును తెలుపునది- ఇక ముందు నేను చెప్పబోవు దానిని కూడ శ్రద్ధగావిను- మోక్షం సిద్ధిస్తుంది- వైరాగ్యంవల్లనూ, తత్త్వజ్ఞానంవల్లనూ, అభ్యాసయోగము వల్లనూ, మానవుడు ముక్తిపొందగలడు- కనుక వాటినే నీవుకూడ చక్కగా అభ్యసించు- తత్త్వజ్ఞానంవల్ల అజ్ఞానంపోయి అభ్యాసయోగం వల్ల వాసనాక్షయంకలిగితే శోకరహితమయినస్థానం దొరకుతుంది- దేశకాలాది పరిచ్ఛేదరహితమై, భేదరహితమైన బ్రహ్మమే ప్రపంచంఅంతా నిండిఉన్నది- బ్రహ్మయందు ద్వితీయవస్తువు (ద్వైతము) ఉండుట అసంభవము- ఇలా బ్రహ్మస్వభావమును గుర్తించి నీవు అహమను అభిమానమునువిడిచి పరమానందమును బొందుము- పరమార్థదృష్టిలో చిత్తములేదు- అవిద్యలేదు- మనస్సులేదు, జీవుడులేడు. ఈ కల్పనలన్నీ బ్రహ్మయందు ఏర్పడ్డాయి- మనమనుకొనే భోగ్యపదార్థములు, భోగవృత్తులు, చిదాభాసులు, భోగేచ్ఛలు, ఇవన్నీ బ్రహ్మస్వరూపములే బ్రహ్మభిన్నములుకావు- పాతాళమునందూ, భూతలమునందూ, స్వర్గమునందూ, తృణమునందూ, ప్రాణులహృదయాకాశమునందూ, నిండియున్నది బ్రహ్మముకాని మరొకటికాదు- ఆబ్రహ్మమే ఇలా విజృంభిస్తోంది- అజ్ఞానం ఉన్నంతవరకూ, బ్రహ్మభావన కలగనంత వరకూ, ప్రపంచమందు సత్యతాబుద్ధి ఉన్నంతవరకూ, చిత్మమూ,

జీవుడూ, ఆపదలూ, సంపదలూ, అనేకల్పనలు తప్పవు- దేహమునందు అహంభావమున్నంతవరకూ, దృశ్యమునందు మమతఉన్నంతవరకూ, చిత్తాదిభ్రాంతులు కలుగుతూనే ఉంటాయి- సజ్జనసహవాసంచేత నీకు పరిపూర్ణ భావం లభించేటంతవరకూ మనస్సులో మౌఢ్యం వదలేటంత వరకూ నీచిత్తానికి నీచస్థితి తప్పదు- సమ్యగ్జ్ఞానముయొక్క సామర్థ్యం చేత ప్రపంచభావన సడలకపోతే మనోబుద్ధి అహంకారాదులు స్ఫుటంగా ఉండిపోతాయి-

అజ్ఞానాంధకారమూ, విషయపారవశ్యమూ, అత్యంత అవివేకమూ, ఉన్నంతవరకూ, చిత్తాదికల్పన తప్పదు- హృదయమనే అడవిలో ఆశలనే విషవాయువు వీచునంతవరకు ఆత్మవిచారమనే చకోర పక్షి లోపల ప్రవేశించదు- భోగములందు ఆశవదలి, మనస్సు ప్రశాంతమై, ఆశాపాశాలు తెగిపోతే చిత్తవిలాసాలు అంతరిస్తాయి- తృష్ణామోహములు అంతరించిన ప్రశాంతచిత్తునకు చిత్తభూమి చక్కగా ప్రబోధఫలమును ప్రసాదిస్తుంది- తన శరీరము అనుపయుక్తమనీ, అపద్రూపమనీ, (అనగా అనిత్యమనీ) నిరాదరణగా చూచేవాడికి చిత్తమనేది పుట్టనేపుట్టదు- శ్రవణ, మనన, నిదిధ్యాసనలచే పరిష్కృతమయిన చిన్మాత్రమే తన ఆత్మరూపమని భావించి, ప్రపంచమును మనస్సులో లయింప చేసికొన్నవానికి, జీవుడు చిత్తము మున్నగు భ్రాంతులు దూరంగా పోతాయి- అజ్ఞానము నశించి, సమ్యగ్జ్ఞానము నశిస్తే, చిత్తం దగ్ధపర్ణాకారంగా ఉంటుంది- (అనగా తగలబడిన ఆకువలె ఉంటుంది)- మహానుభావులయిన జీవన్ముక్తులయొక్క చిత్తమార్గమే శుద్ధసత్వం అంటారు. జీవన్ముక్తులయందుగల వాసన వ్యవహారమును నడపుచున్నా అది చిత్తవాసన (మనోవాసన) అనిపించుకోదు- సత్వస్థితినే పొంది ఉంటుంది అది- జీవన్ముక్తులు నిరీహులై లీలామాత్రంగా వ్యవహరిస్తూ ఉంటారు. అలా వ్యవహరిస్తూ ఉన్నా ఆత్మచైతన్యము సాక్షాత్కారము అవుతూనే ఉంటుంది వాళ్ళకు.

ప్రపంచవాసన పెరగదు ఏమాత్రమూ- అంతర్ముఖులై చిద్వహ్నిలో ముల్లోకములను తృణములను హోమంచేస్తూ ఉంటారువాళ్లు- కాలిన గింజ (బీజము) మొలకరించినట్లు వివేకముచే నిర్మలమయిన చిత్తము మోహమును మొలకరింపచేయదు-

మూఢులయొక్క చిత్తమునకే చిత్తమని పేరు. దీనియందే అవివేకము మొలకఎత్తును- ఆత్మబోధవల్ల అది విపరీత మవుతుంది. (అనగా చిత్తస్థితిపోయి సత్త్వస్థితి కలుగుతుంది దానికి) రామా! నీవు పొందదగిన స్థితిని పొందావు- నీచిత్తము జ్ఞానాగ్నిచే దగ్ధమయింది- ఇంక మొలకరించదు- ఏషణావిద్ధమయిన చిత్తము మొలకరిస్తుంది- కత్తితో కోసినగడ్డి మరల మొలచును. ఏషణారహితమయిన చిత్తము మరల మొలవదు. అగ్నిచే దగ్ధమయిన తృణము మొలకరించదు- బ్రహ్మయొక్క అభివృద్ధియే జగత్తు- జగత్తే బ్రహ్మయొక్క అభివృద్ధి ఈ రెంటికీ భేదములేదు- చిజ్జగత్తులకు భేదమునునది సున్న- కనుక ఉత్పత్తి ప్రలయములనేవి భ్రాంతిమాత్రములు లోకశాస్త్రప్రసిద్ధములయిన 'అస్తినాస్తి' అను వ్యవహారములు కేవల వాసనామాత్రములు. కనుక రామా! సదసత్స్వభావమయిన శరీరము నీవుకావు. పరితపించ వలసిన పనిలేదు. అది (శరీరము) అచిన్మయము లేనిది- లేనిదానికొరకు పరితాపము అనవసరము- ఇంక శరీరము చిన్మయమని తలచే యెడల ఆచైతన్యమునే విచారించు. త్రివిధపరిచ్ఛేదరహితమయిన ఆచైతన్యమునందు ఈభేదకల్పన ఎక్కడిది? కనుక నీవు నిరవయవుడవు- చిద్రూపుడవు- పరిచ్ఛేదరహితుడవు- నీ నిజరూపమును నీవు స్మరించుకో- అది మరచి పరిచ్ఛేదమును చెందమాకు- పరిపూర్ణచైతన్యస్థితినిపొంది, నిరతిశయానందమునొంది, పరిచ్ఛిన్నమయిన ప్రపంచాన్ని సంపాదించు- రామా! నీవు అపరిచ్ఛిన్నరూపుడవు- శాంతుడవు- చిద్రూపుడవు- బ్రహ్మస్వరూపుడవు- నీకు నానాత్వములేదు- కాని నానారూపముగు ప్రపంచభ్రాంతి యొక్క నాశమునకు అధిష్ఠానంగా మిగిలిఉన్నావు-

నీవు సద్రూపుడవు-ప్రపంచము నీయందు కల్పితమగుటచే తద్రూపుడవు కూడ నీవే- నీ నిజరూపమేదో నీకున్నది. విశేషాకారమయిన భేదము మాత్రము నీది కాదు- భిన్నమగు ప్రపంచము నీదురూపము కాదు. స్వయంప్రకాశచైతన్యమే నీదుస్వరూపము-

## 3. బ్రహ్మైక్యప్రతిపాదనము.

వసి॥ రామా! సముద్రంలోని తరంగములకు సముద్రోదకము వలె ఈ ప్రపంచము లన్నింటికి చైతన్యమే అధిష్ఠానము- సర్వప్రపంచాధిష్ఠానమయిన ఆచైతన్యమే నీవు- ఈభావనతో ఉండి ప్రపంచవాసనలను విడిచిపెట్టునీవు- 'నేను జీవుడు' 'ఇది వాసనాజాలము' అనే కల్పనలన్నీ చైతన్యమునందే కలుగుచున్నవి- ఈచిద్వస్తువునందు అచిచ్ఛబ్దమునకును, దానియర్థమునకును ఏమాత్రమూ ప్రసక్తి లేదు.

రామా! నీవు ప్రపంచములనే తరంగములతో విరాజిల్లుచున్న చిత్సముద్రుడవు నీవు. నిత్యానందరూపుడవూ, చిదాత్మవూ అగు నీయందు యోగులు రమించుచున్నారుకనుకనే నీకు రాముడను పేరు సార్థకమయినది.

రామా! నిప్పుకంటె వేడిమి వేరుకాదు- పద్మముకంటె పరిమళము వేరుకాదు- కాటుకకంటె నలుపు వేరుకాదు- మంచుకంటె తెలుపు వేరుకాదు- చెరకుముక్కకంటె మాధుర్యము వేరుకాదు- తేజస్సుకంటె వెలుతురు(ప్రకాశము) వేరుకాదు- అలాగే చైతన్యముకంటె అనుభూతి వేరుకాదు- (వృత్తి ప్రతిబింబితచైతన్యము వేరుకాదు-)నీటికంటె తరంగము వేరుకానట్లు; చిత్స్వభావముకంటె జగత్తు వేరుకాదు- మూలాధిష్ఠాన చైతన్యముకంటె చిదాభాసుడు వేరుకాదు- చిదాభాసునికంటె సమష్టివ్యష్టి అహంకారము వేరుకాదు- దీనికంటె జీవుడనువాడు వేరుకాదు- జీవునికంటె మనస్సు వేరుకాదు- మనస్సుకంటె ఇంద్రియము వేరుకాదు-ఇంద్రియములకంటె శరీరము వేరుకాదు-

శరీర మకంటె జగత్తు వేరు కాదు- జగత్తుకంటె వేరయినది మరొకటి లేదు- ఈ జగచ్చక్రము చైతన్యమునుంచియే ప్రవర్తింపజేయబడినది- పరమార్థదృష్టిలో పరమేశ్వర చైతన్యము ప్రవర్తింపచేసినదీ లేదు- అది ఉన్నదీ లేదు- సర్వ ప్రపంచము పరిపూర్ణచైతన్యము. పరిచ్ఛిన్నాకాశములన్నీ మహాకాశమునందే ఉండియున్నవి. శూన్యమునందే శూన్యమున్నది. బ్రహ్మయందే బ్రహ్మమున్నది. సత్యమునందే సత్యమున్నది పూర్ణమునందు పూర్ణమున్నది.

ప్రాపంచిక పదార్థములు లేవని భావించడమే తప్ప అందు గ్రహింపదగిన అంశము మరొకటిలేదు- జ్ఞానికి ఈ భావముండును- కనుకనే అతనికి కర్తృత్వభోక్తృత్వము లంటవు- ఉపాదేయ బుద్ధితో వాటిని చూచేయడల అవి సుఖదుఃఖములకు హేతుభూతములగును- ఆకాశము రెండాకాశములు, అనేకాశములు, అనుమాటలు ఎంతటి సార్థకములో అంతటి సార్థకములే ఆత్మ జగచ్ఛబ్దములుకూడ- "ఆత్మ, ప్రపంచము" అనే క్రమమే శూన్యమయినది. అనగా పనికిరానిది- కనుక రామా! పరిశుద్ధమయిన చిదాకాశరూపుడవగుచు, బాహ్యమున సదాచారముతో మెలగుచు, హర్షామర్షాది వికారములందు కాష్ఠలోష్ఠాదులవలె నుండుము- అప్పటికప్పుడు చంపుటకువచ్చిన శత్రువును అకృత్రిమ (సహజ) మిత్రునిగా చూచువాడే జ్ఞాని. నదీప్రవాహము ఒడ్డునఉన్న చెట్లును వ్రేళ్ళతోకూడ పెళ్ళగించివేసినట్లు రాగద్వేషములను, (సౌహృదమును, మత్సరమును) సమూలము నశింపచేసికొను వాడే హర్షామర్షదోషములను చంపుకొనువాడు. రాగద్వేషముల యొక్క తత్త్వమునుగాని, వానికార్యములయిన వికారములయొక్క తత్త్వమునుగాని, మనసా విచారించనివారు ఎంతటి సజ్జనులయినా, వారు అసజ్జనులే. అలాంటివార్లను ఎంతసేవించినా ఏమీలాభము లేదు- ఎందువల్లనంటె రాగద్వేషముల తత్త్వం తెలియకపోతే వానిని మూలోచ్ఛేదము చేయుట సంభవించదు- కాన వార్లకు మరల రాగ

ద్వేషాలు కలుగుట అనివార్యమవును. కనుక వార్తను సేవించినందు వల్ల ప్రయోజనం లేదని భావము. కనుకనే గీతలలో శ్రీకృష్ణుడు "ఎవ్వనికి అహంకారము ఉండదో, ఎవనిబుద్ధి ప్రాపంచిక విషయభోగములందు లిప్తముకాదో వాడు ఎంతమందిని చంపినను, చంపినవాడుకాడు— హనన (హింసా) దోషము అంటదు అతనికి" అని చెప్పాడు శ్రీకృష్ణుడు— కనుక అహంకారమనగా మాయ, అనగా అజ్ఞానము— అనగా లేని దానిని ఉన్నదనుకొనుటయు— సన్నివృత్తి ఆత్మనిత్యత్వజ్ఞానమువలననే కలుగును— చమురుతోడి దీపమువలె ఎవని మనస్సులో ప్రపంచవాసనా భరము శాంతించునో వాడే జయించినవాడు— కాని ఆ జయము పటము లోని రాజు శత్రువు తలనరికి జయించినట్లు అసత్యము కాని సత్యము కాదు— అనగా ప్రపంచం సత్యమయితే దాని జయము సత్యమవును— అదే అసత్యమయినప్పుడు దాని జయము సత్యమగుట అసంభవము— కనుక నిత్యనిరస్తమయిన సంసారమును జయించినవాడుగా అనుకొన వలెను. దానివలన నిత్యసిద్ధమయిన అద్వితీయపూర్ణాత్మభావము దానికి సిద్ధించును— ఈరెండును కనుక ఉన్నవే కాని యిప్పుడు క్రొత్తగా కలిగినవి కావు— కనుక రామా! ఏపురుషధౌరేయునకు ఈసమస్తభోగ్య పదార్థజాతమున్నా ఎల్లప్పుడు మిథ్యయగుటచే ఆత్మస్వరూపముగా తలంపునో ఆమహానుభావునకు ఆభోగ్యజాతము అనుపాదేయమగుచూ సంయోగవియోగకాలమందు సుఖదుఃఖములకు హేతువుకాదు—అట్టివాడు జీవించిఉన్ననూ ముక్తుడే అన్నారు వసిష్ఠులు—

## ౨. రాఘవవిశ్రాంతి వర్ణనము.

శ్రీరా॥ మహాత్మా! మీరుపదేశించిన విషయమును నేను మనసా భావనచేసి పరిపూర్ణచిదేకరసాత్మభావమును పొందాను— నాకంటి యెదుటనున్న జగజ్జాలమంతా మటుమాయమైనది— (శాంతించింది) అనావృష్టిచే చిరకాలం ఎండినభూమి (తపించినభూమి) వర్షముచే

సుఖించినట్లు నేనుకూడా అఖండానందాన్ని పొందాను- శాంతినొందాను- శీతలాకారుడనయినాను- సుఖంగా ఉన్నాను- కొలనులో దిగిన ఏనుగు ఒడ్డుకెక్కితే ఆకొలను నిర్మలంగాఉన్నట్లు నా అజ్ఞానం పోయి నేను నిర్మలంగా ఉన్నాను- మంచువిడిచిన దేహమువలె దిఙ్మండలమంతా అతిప్రసన్నంగా కనిపిస్తోందినాకు- నాసందేహాలన్నీ పటాపంచలయినాయి- నా ఆశామృగతృష్ణికలు అంతరించాయి- నారాగద్వేషాలు పలాయనం చెప్పాయి- నాశరహితమయిన పరమానందాన్ని అనుభవిస్తున్నాను- అమృతరసాస్వాదంకూడా నాకు గడ్డిపరకమాత్రం అయింది- అంతటి నీరసమయింది యీఆనందంముందర- స్వామీ! ఇపుడు నేను పారమార్థికస్వరూపంలో ఉన్నాను- ఇప్పటికి నేను లోకారాముడనగు రాముడనయినాను- అనగా లోకులందరూ ఏ ఆనందమును ఆధారపరచుకొని జీవిస్తున్నారో అట్టి ఆనందరూపుడనయినాను. ఇప్పటికి నాపేరు నాకు సార్థక్యమయింది- ఇలాంటి నా స్వరూపానికి నేను నమస్కరిస్తున్నాను. ఇదంతా మీఅనుగ్రహంవల్ల కనుక మీకు నమస్కారము- ఆసంశయాలూ, ఆభ్రాంతులూ, అన్నీ అడుగంటిపోయాయి- రాత్రి చీకట్లో దయ్యంలాగ కనిపించినది, తెల్లవారేసరికి మాయమయినట్లయింది ఈ ప్రపంచంనాకు- శరత్కాలంలోని తటాకంవలె నామనస్సు విక్షేపరహితమయింది- విశ్రాంతిని చెందినది- ఆనందభరితమయినది-

"చిదేకరసుడయిన ఆత్మకు అజ్ఞానమనే కలంకం ఎలాకలిగింది? అది స్వయంప్రకాశరూపునియందు ఎలాఉంది? అసంగుడూ, అపరిచ్ఛిన్నుడూ, అయిన ఆత్మను ఈఅజ్ఞానం ఎలా ఆవరించింది? కూటస్థచైతన్యమునకు సాంసారిక వికారానుభవం ఎలాతటస్థించింది? అని ఇలాంటి సంశయాలు ఎన్నోఉండేవి ఇదివరకు నామతిలో సర్వసంశయాలకు మూలమయిన అజ్ఞానం పోయేసరికి ఆసంశయాలన్నీ నిర్మూలములయినాయి- చంద్రకిరణాలు సోకేసరికి చీకటికి పట్టినగతి పట్టిందివాటికి.

భేదబుద్ధి నశించినది- సర్వాత్మభావం కలిగినది- నేను ఇప్పుడు ఆత్మానుభవంలోఉండి, "లోగడ ఆశాపాశాబద్ధుడనై నేనెలాఉంటినో కదా!" అని నన్ను నేనే పరిహసించుకొంటున్నాను-

ఆ! ఇప్పుడునాకు జ్ఞాపకానికి వచ్చింది- మీ వాగమృతపూరముచే స్నాతుడనై ఈ పరమార్థ స్వరూపస్థితిలోకి వచ్చాను- భూలోకంలో ఉండిరనే బ్రహ్మలోకాన్ని అధిష్ఠించానునేను- దీనికి సూర్యలోకం పైదీకాదు- క్రిందిదీకాదు- కార్యబ్రహ్మలోకంద్వారా సూర్యలోకం క్రిందిది భూలోకముద్వారం పైది- పరబ్రహ్మలోకంద్వారం అది క్రిందదీకాదు- పైదీకాదు- సంసారసముద్రాన్ని దాటి స్వస్వరూపస్థితిని పొందిన నాకు నేను నమస్కరించుచున్నాను- మహాత్మా! నాకీ జీవన్ముక్తావస్థ మీ వచోవిశేషంవల్లకదా! కలిగింది అన్నాడు రాముడు.

## ౬. మోహమాహాత్మ్యము.

వసి॥ రామచంద్రా! నీకొక గొప్పమాట చెబుతావిను- ఇది నీమీదనున్న ప్రేమతో నీహితన్నుగోరి చెబుతున్నాను విను- (ఇచట రాముని నిమిత్తముగా జేసికొని యితరులకు ప్రబోధచేయుటయే వసిష్ఠుని తాత్పర్యము.) కనుక నిరతిశయానందానుభవానికి తగియున్న నీకు సర్వజనహితవును గోరిచెబుతున్నానని అర్థము- కనుక నీకు అజ్ఞానంపోయినా మరల ఈచెప్పడం, వినడం ఇంక నాకెందుకని అనుకొనకు- బాధితానువృత్తిచే (పోయిన అజ్ఞానం మరల వెంటబడుటచే) భేదభావాన్ని అంగీకరించి నీవు వినవచ్చు- దానివల్ల నీకు మరింతగా జ్ఞానం వృద్ధిఅవుతుంది- నీద్వారా అల్పబుద్ధులను ఉద్ధరించడంకూడ తటస్థించగలదు.

దేహమువందు ఆత్మభావన (బుద్ధి) గల అజ్ఞానిని ఇంద్రియములనే శత్రువులు అతికోపంతో పరాభవించును- దేహాత్మభావనలేక సత్యాత్మజ్ఞానంగల మానవునకు ఇంద్రియములు సంతోషపూర్వకంగా

స్నేహితులయి చాణక్యోపాసితాలయి- ఏమాత్రం చెడగొట్టవు- ఇతఃస్త్రీ భోగ్యవస్తువులందు ఎల్లప్పుడూ దోషాలనే వెదుకుతూ వాటిని నిందించడమే వ్రతంగా పెట్టుకొన్నవానికి దేహమునందు ఆత్మభావన (నేనను బుద్ధి) ఎలా కలుగుతుంది? అసంభవం. ఆత్మ చిత్పదార్థము- దేహము జడపదార్థము- కనుక ఈ రెంటికీ అత్యంతవిరోధము- కనుకనే ఈ రెంటికీ ఏవిధమయిన సంబంధమూ కుదరదు- ఆధారాధేయభావమే ఆ రెంటికీ అసంభవం- అలాంటి అప్పుడు తాదాత్మ్యమనేదానికి తావేలేదు- ఆత్మ షడ్భావ వికారరహితుడు- (పుట్టు పదార్థములకుండెడి ఆరువికారములు లేనివాడు) నిర్లిప్తుడు- ఉదయాస్తమయరహితుడు- దేహాదులిందుకు విరుద్ధములు. శరీరము జడము- అజ్ఞము- తుచ్ఛము- కృతఘ్నము- (అనగా ఆత్మవల్ల తాను ప్రకాశమునొంది తుదకాత్మకే దుఃఖమును తెచ్చిపెట్టెడిది) దానికి తనకాస్తి అగుగాక- అది ఎన్నటికీ చిన్మయము కానేరదు- విచారణమీద నిలిచేది దానికి జడత్వమే-

దేహాత్మలు పరస్పర ధర్మవినిమయమువలన సమానధర్మములు కలవిగా (సమానసుఖదుఃఖములు గలవిగ) భాసించినా, విచారణమీదట అది నిలవదు- దేహాత్మలకు సుఖదుఃఖములు సమానమనునది పరమార్థ సత్యము కాదు- భ్రాంతిమాత్రము. అసంగుడూ, పరమసూక్ష్ముడూ అయిన ఆత్మతో స్థూలమయిన శరీరానికి కలయిక అనేదే అసంభవము. ఇంక ఐక్యమనేదే అసలేమున్న- స్థూలము అణువు కానేరదు- అణువు స్థూలము కానేరదు. దేహాత్మలు రెంటిలో ఒకదానికి అభివృద్ధి (ఉదయము) ఉంటే రెండవదానికి తప్పులేదు- పగలుంటే రాత్రి ఉండదు- రాత్రి ఉంటేగా పగలుండదు- జ్ఞానము అజ్ఞానము కాదు- జ్ఞానరూపుడయిన ఆత్మ అజ్ఞానాత్మకమయిన దేహము కానేరదు- ఎండ నీడ కాదు నీడ ఎండ కాదు. సద్రూపుడగు బ్రహ్మ అసద్రూపమగు దేహాదికము కానేరదు- కనుక సద్రూపుడయిన ఆత్మకు తనయందు దృశ్యాస్త

మాయిక దేహాదులతో సంశ్లేషము (కలయిక) సంబంధము ఏమాత్రమూ పొసగదు- ఆత్మ సర్వవ్యాపకుడు- కనుక దేహంలో కూడా ఉంటాడు- అయినా దేహంతో సంబంధం (సంశ్లేషము) లేదు ఆత్మకు- నీటిలో ఉన్ననూ, తామరాకునకు నీటితో సంబంధము (సంశ్లేషము) లేదు- ఆకాశము గాలికి కదలదు- ఎండదు, దుమ్ము అంటదు. గాలివల్ల ఆకాశానికి ఏవిధమయిన దోషములు అంటవు- అలాగే శరీరేంద్రియాదుల వల్లకూడా ఆత్మకు జరామరణాదిదోషము లంటవు- లేవు- కనుక రామా! నీవు సుఖముగ నుండుము- దేహమే ఆత్మ అను దృష్టిలో జన్మజరామరణాదిభ్రమలు కలుగుచున్ననూ బ్రహ్మాత్మ దృష్టిలో అవి అన్నీ బ్రహ్మమాత్రములే అగుచున్నవి- ఉదకములందు తరంగ సమూహామువలె బ్రహ్మయందు దేహజన్మజరామరణాదిభ్రమలు కనిపించుచున్నవి- ఇవి ఆత్మయొక్క సత్తను (ఉనికిని) ఆధారపరచుకొని యున్నవి- కనుక ఆత్మ వీనిని అనుభవించుచున్నట్లు లోకవ్యవహారము- సూర్యప్రతిబింబమునకు ఆధారమయిన జలాదులు చలించినంతమాత్రమున సూర్యునకు చలనము లేదు- అలాగే దేహమువలన చిదాభాసునకు క్షోభము (చలనము) కలిగినను దేహసాక్షియగు చిదాత్మకు మాత్రము ఏవిధమగు చలనము లేక- సమ్యగ్జ్ఞానముకలిగినచో ఆత్మను స్వస్వరూపస్థితియే కలుగును- దేహామయమయిన అజ్ఞానభ్రమలు అంతరించిపోవును- ఆత్మానాత్మవివేచనచే, దేహాదులు అసద్రూపములనియు, తత్సాక్షి సద్రూపుడనియును జ్ఞానము కలుగును- దీపము వచ్చేసరికి తమస్సు అసద్రూపమగును.

సమ్యగ్జ్ఞానము లేనివానికి మాత్రము శరీరముయొక్క రాకపోకలచే నిరర్థకములయిన వ్యామోహములు పుట్టుతూఉంటాయి- అజ్ఞులకు ఆత్మతత్త్వమునుగూర్చి ఏమాత్రము పర్యాలోచనముండదు- చిదంశమును పరామర్శించే లేనివారు- అట్టి మూఢులు గడ్డిపోచలవలె చేతనారహితులై తిరుగుతూ ఉంటారు- అచేతనమయిన దేహమునందు

ఆత్మబుద్ధి (నేననుబుద్ధి) గల మూఢులు చేతనులని యెన్నటికీ అనగూడదు- వెదురుబొంగులలో గాలిదూరితే ధ్వని పుట్టినట్లు వీర్లకుగూడ ముఖనాసికాది గోళములందు సంచరించెడి వాయువుచే ధ్వనికలుగును- మాటాడుతారు- సంచరిస్తారు- వ్యవహరిస్తారు- తృణకాష్ఠాదులను తీసికొనివస్తారు- పరిత్యజిస్తారు- శబ్దస్పర్శాది విషయలాభముచేతనే వారు కృతార్థులను కుంటారు- భోగాభినివేశముచే మత్తులయిపోతారు-

నదీ మొదలగు వానియొక్క పెద్దపెద్ద ప్రవాహాలు జడములే కాని చేతనములుకావు- అయిననూ వాటికికూడా రాకడ, పోకడ, మొదలగు చేష్టలు కలుగుచున్నవి- అలాగే మూఢులకుకూడా చేష్టలు కలుగుచున్నాయి- కాని మూఢులకు అందఱితో బాటు ఆత్మచైతన్యము లేకపోలేదు ఉన్నది- కాని అది బోధకొరకుపయోగపడుట లేదు- అంచేత అది వ్యర్థమయినది- మూర్ఖుని ముక్కోణములనుంచి బయలుదేరెడి శ్వాససమూహములు లోహకారుని (కమ్మరివాని) కొలిమితిత్తినుండి వచ్చెడి గాలివంటివి మాత్రమే అయినవి- అంతకంటే వేరుప్రయోజనం కనిపించడంలేదు వారి శ్వాసలకు- జఠరాగ్నిని మాత్రం లేపి ఆకలిని పుట్టిస్తాయి అవి- ఇలాంటి మూఢులు ఇతరులను భయపెడతారు. గర్జిస్తారు- అంతమాత్రంచేత అవి వాళ్ళ చేతనత్వానికి చిహ్నములుగావు- మరణాద్యనర్థములకు హేతువులగుటచే ధనుస్సుయొక్క అల్లెత్రాటి చప్పుడుల వంటివనవచ్చును- మూఢులయొక్క సంసారఫలానుభవముకూడ అడవిలోని చెట్లు ఫలించుటవంటిది- వానియందు విశ్రమించడం తప్తశిలాఫలకమునందు(కాగిన రాతిబండమీద) పరుండుటమే వారితో సంగమము (కలయిక) వేళ్లు తెగకొట్టిన చెట్టు నేలతో కలిసినట్లు- అలాంటి మూఢులకొరకు ఉపకార మొనర్చుట ఆకాశమును కర్రలతో కొట్టడమన్నమాటే- అలాంటి నీచునకు దానమిచ్చుట బురదలో పోసినట్లు- వానితో సంభాషించడం ఆకాశానకుక్కను పిలచుటయే- కనుక అజ్ఞానమనేది నిఖిలాపదలకు నిలయము-

అజ్ఞానకు కలుగని ఆపదఏమున్నది? ఈ సంసారసరణియావత్తూ అజ్ఞాని యొక్క ప్రమాదమువల్లనే జరుగుతూ ఉన్నది- అజ్ఞానికి కలిగే దుఃఖాలూ ఘోరములే- సుఖాలూ ఘోరములే- పైగా అతిదృఢములు- ఉల్లంఘించ శక్యముకావు- ఇవి మాటిమాటికి వస్తూపోతూ ఉంటాయి- శరీరధనదారాదులందు ఆస్థగలవానికి ఇవి యెన్నటికీ తప్పవు- అనాత్మమగు దేహమునందు ఆత్మభావ మున్నంతవరకు ఈఘోరసంసారదుఃఖం ఏడికెన్నటికీ శాంతించదు- దుర్భావములతో వ్యాప్తమయిన బుద్ధిగలవానికి అజ్ఞానమయమయిన మాయ ఎట్లు నశించును? గ్రుడ్డివానికి వస్తువునందలి ఆంధ్యము ఎట్లు నశించును? గ్రుడ్డివానికి వస్తువెట్లు కనిపించును?

అసద్వస్తువును (మిథ్యావస్తువును) మాటిమాటికి చూస్తూ అభినివేశంతో అనుభవిస్తూ ఉంటే చంద్రుడినుంచి విషంపుడుతుంది, పుష్పమునుండి పరిమళంపుట్టినట్లు. నేలమీద గరికమొలచినట్లు, పాలలో ముళ్లబయలు దేరుతాయి- బాగావ్యవసాయంచేసిన భూమినుంచి వరి పైరుపుట్టినట్లు(పెరిగినట్లు) అజ్ఞానికి ఆశలుపెరుగుతాయి- ఇవి దేహమనే బూరుగుదూది చెట్టులోని పాములు- మనస్సు అనే మదపుటేనుగునకు సంకెళ్లు- పాపములనే పాములతో కూడుకొని నరకలక్ష్మి అజ్ఞానిని యెదురుచూస్తూ ఉంటుంది- ఆడనెమలి మేఘాన్ని నిరీక్షించుచున్నట్లు- స్త్రీ అనేది యొక విషతీగ- ఇది మూర్ఖులయెడ బాగాపూచి వికసించి ఉంటుంది- ఈ విషతీగకు నేత్రములే తుమ్మెదలు- స్ఫురించెడి అధరములే పల్లవములు- అజ్ఞానియొక్క హృదయభూమియందే అనురాగమనే పగడచెట్టు ఏపుగా పుటుతుంది- ఇతని హృదయమందు ద్వేషమనే దావాగ్ని పుటుతుంది- అజ్ఞానికే ఈర్ష్యాసూయాదులు- ఇతనికే జన్మప్రభృతి ఘోరదుఃఖకల్లోలాలు- జరామరణాలు కూడా ఇతనికే- ప్రపంచమనే ఘటీయంత్రంలో (ఏతాములో) సంసారమనే త్రాటితో కట్టబడిన కుండవలె మునుగుతూ, తేలుతూ ఉంటాడు అజ్ఞాని- జ్ఞానికి

ఈ ప్రపంచం కొద్దిపాటి నీటిబుడుగువంటిది- ఇదే అజ్ఞానికి అగాధమయిన సాగరము. అజ్ఞానియొక్క చిత్తము ఉదరపోషణాసక్తిలో మునిగిపోయి యెన్నటికినీ సంసారసముద్రమును దాటలేదు- విషయపంకములందు నిమగ్నములయిన ఇంద్రియములను లేవదీసి శోధించుకొనుటకు సాధ్యముకాదు మానవునకు- ఇందుకు ప్రమాణము "పరాంచిఖాని వ్యతృణాత్ స్వయంభూః తస్మాత్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్" అనుశ్రుతి- అజ్ఞానిఅనే వేటకాడు, అనురాగమనే మృగయావ్యసనంచేత (వేటమీద వ్యసనంచేత) ఇంద్రియములనే డేగలకొగిను సంసారమనే అరణ్యంలో శరీరమనే వలను పన్నినాడు- అందులో మనుష్యపశ్వాది భూతములూ, వింధ్యహిమవదాది పర్వతములూ, మొదలగు చిత్ర విచిత్ర పదార్థజాలము అజ్ఞానమువల్ల ఆమిషపిండమువలె (మాంసపుముక్కవలె) కల్పింపబడుచున్నవి- అత్యధికములయిన సంకల్పకలనా లక్షణమయిన కల్పవృక్షము ప్రపంచంలో చాలా గొప్పగా వృద్ధిచెందుతోంది- దాని ఆకులే యీలోకాలన్నీ- జన్మలు చిగురాకులు- కర్మజాలము మొగ్గలు పుణ్యపాపములు దాని ఫలములు- సంపదలు దాని పూగుత్తులు-

సంసారమనే వనఖండంలో స్త్రీలనే ఓషధులు అజ్ఞానమనే చంద్రుడు ఉదయించడంచేత మిక్కిలి శోభిస్తున్నవి- అజ్ఞానమనే చంద్రుడు జన్మజాలమనే కళలతో పరిపూర్ణుడై, అవివేకమనే సూర్యాస్తమయకాలంలో (వివేకమనే) సూర్యుడు అస్తమించినకాలంలో నిష్ప్రపంచమగు బ్రహ్మయందు పుట్టినవాడై, దోషాకరుడై వెలుగుతున్నాడు- అజ్ఞానమనే చంద్రునియొక్క అనుగ్రహంచేత వాసనలనే అమృతం స్రవిస్తోంది- దానిచే ఆశలనే చకోరములు తృప్తి చెందుతున్నాయి- అంచేత రాజహంసలవంటి విలాసలుగలిగి మంచుఅనే తెల్లని శరీరము గలిగి, లోలలోచనములనే తుమ్మెదలు గలిగి కొప్పులనే చీకట్లుకలిగి తెలుపుతనమనే పయోధరముగల స్త్రీలనే రాత్రులు చక్కగా ప్రకా

శిస్తున్నవి- ఇదంతా మూర్ఖ్యముయొక్క విలాసముకాని మరొకటేమీ కాదు-

రామా ! శబ్దస్పర్శాదివిషయములు ఆపాతమధురముగానుండుట (అనగా చూడగానే యింపుగా నుండుట) పర్యవసానమందు అనర్థదాయకములగుట, ఉత్పత్తివినాశములు కలిగియుండుట, పరిచ్ఛిన్నములగుట, అన్ని పరిస్థితులందును నశ్వరములగుట ఇదిఅంతా అజ్ఞానమనే చెట్టుయొక్క నానాకారముగల పండ్లుసుమా ! కనుక అజ్ఞానమే మొట్టమొదట ఛేదింపదగినది-

## ౭. అజ్ఞానమాహాత్మ్యము.

వసి॥ రామా ! చూడు దీని విలాసము- మదమనే చంద్రుడుదయించేసరికి మన్మథుడనే పాలసముద్రుడు పొంగిపోతాడు- అందులో బయలుదేరినతరంగాలు స్త్రీలంటె వీళ్లు ముత్యాలహారాలతో, రత్నాల ఆభరణాలతోను ప్రకాశిస్తూ ఉంటారు- బంగారు పద్మంలోని చంచల చంచరీకాలవలె (ఎప్పుడూ తిరిగెడి తుమ్మెదలవలె) ఉంటాయి వీళ్ళ నేత్రాలు చెంపకు చేరడేసి- వసంతఋతువులో ఉద్యానవనములందూ, భూమియందూ, విహరించెడి మన్మథునకు కింకరీలు వీళ్లు- కాముకులకు మదాన్ని పుట్టిస్తారు- రక్తమాంస పూరితమయిన వీళ్ళ స్తనపంక్తి బంగారు కమలమువలెనూ, పద్మముల మొగ్గవలెనూ, లవంగగుత్తివలెనూ కనుపిస్తూ ఉంటుంది కాముకులకు- ఇది అంతా అవిద్యయొక్క విలాసంకాని మరొకటికాదు-

పులులకూ, గద్దలకూ, నక్కలకూ, కుక్కలకూ, ఆహారమయిన శరీరముగల ఆడువారిని చంద్రునితోను, చందనముతోను, పద్మములతోను పోల్చుట అజ్ఞానముయొక్క విలాసము- వారి అధరోష్ఠములందలి లాలాజలంతో నిండిన (తడిసిన) మాంసలవమును, చంద్రబింబమునుండి స్రవించెడి అమృతంతో సమానంగా చూస్తారు యువ

కులు- పోలుస్తారుకవులు- ఇదీ అజ్ఞానవిలాసమే- మధ్యమధ్య పర్వములు గల ఎముకముక్కలను కవులు యేమేమో చిత్రవిచిత్రంగా వర్ణిస్తారు- వారి ఊరువులను (తొడలను) అరటిస్తంభాలంటారు- కుచములు చూడ ముచ్చట అయిన కలశములంటారు. (కుండలంటారు) వడ్డాణము మన్మథుని కొంపకు తోరణమయిన పూలమాలట. కవుల ఈవర్ణనలూ యువకుల చూపులూ ఇదంతా అజ్ఞాన విజృంభణముకాక మరేమి?

కాంతలవిషయం ఇలాఉండగా, ఇంకకనకం విషయంచూసు- మూఢులకు ఆర్జించే సమయంలో తియ్యగా ఉంటుంది- మధ్యలో ఖర్చుపెట్టవచ్చేసరికి రాగద్వేషాలు పుట్టించి చంపుతుంది. ఇంతాచేస్తే అదీ ఎంతోకాలం ఉండదు- చూస్తూఉండగా కొద్దిలోనే నశిస్తుంది- ఎంతప్రయత్నించినా కొద్దిమందికే లభిస్తుంది- కాని అందరను ఆశ్రయించదు- అందులో నీచులనూ, లోభులనూ, మహాప్రేమిస్తుంది. దానిమీద ఆశపెట్టుకున్నవానికి దుఃఖంఖాయం- సుఖం శతశాఖలవుతుంది- కర్మఫలములయిన సంపదలన్నీ దుఃఖశాఖలేకాని మరొకటి కాదు- ఇది అంతా అజ్ఞానవిలసితము- సంపదలు అజ్ఞాన విజృంతములు కనుకనే ఆసంపదలను కోరి కామ్యకర్మలను చేయుమని విధించెడి కర్మకాండ వేదములుగూడ అజ్ఞానంలోనే పడ్డాయి- ఆ వేదవాక్యాలు జైలుకు తీసికుపోయే వాళ్ళకువలె దేవాదఋణములుగల మానవులకు సంకెళ్ళయిపోయాయి-

అసలే మోహంలో పడిపోయిన మానవాళిని మరింత అంధకూపంలోకి నెట్టుచున్నాయి కర్మకాండవాక్యాలు- భోగలంపటునకు క్రమంగా పుత్రపౌత్రాదులందు అనురాగం పెరుగుతుంది- తుదకు వారితో వియోగం కలిగేసరికి దుఃఖపరంపర సంప్రాప్తమవుతుంది- తుదకు వీడుకూడ మృత్యుముఖంలో పడతాడు- యముడు ఇలా బాగా తయారయిన పంక్షనువలె లోకములను ఎన్నిటినో పొట్టనపెట్టుకున్నాడు. అయినా తృప్తితీరలా అతడికి-

మోహమనే గాలితో బ్రతుకుతూ స్థూలదేహములనే కుబుసములనుధరించి కుటిలంగా సంచరించే ఈజీవులు బ్రహ్మగారియొక్క ప్రకాశరూపులయి ఈసంసారంలో చిత్రమయిన పాములుగా సంచరిస్తున్నారు- ఇలాంటి అజ్ఞజీవులు ప్రశాంతమయిన బ్రహ్మయొక్క ప్రకాశరూపులు- వీళ్లు యీసంసారంలో ఓవిధమయిన విచిత్రసర్పములు. మోహమనే గాలిపీల్చి బ్రతుకుతారు. స్థూలదేహమనే కుబుసమును ధరించిఉంటారు. కుటిలంగా సంచరిస్తారు- కనుక వీళ్ళను పాములనవచ్చు-

మోక్షసాధనములయిన వివేక వైరాగ్య శ్రవణాదులందుపయోగపడుటలేదు కనుక వీరి యౌవనముకూడ నిరర్థకం. ఎల్లప్పుడూ వీరి నాలుక కోపించిన స్త్రీ పుత్రాదులను ఓదార్చుటలోనే వినియుక్తమవుతుంది. శ్రీనాథు వర్ణనకు ఉపయోగపడదు- వీళ్ళకు దారిద్ర్యమనే దృఢమయిన పెద్దబూరుగచెట్టు తయారవుతుంది వెయ్యికొమ్మలతో. దానికి దుఃఖాలూ, శోకాలూ, పెద్దపెద్దముడులు- కష్టాలుకంటకాలు- దీనిమీద లోభమనే గుడ్లగూబ అవివేకమనే రాత్రికాలంలో తిరుగుతూ ఉంటుంది- ఇలాజర అనే పిల్లి యౌవనమనే ఎలుకను దవడలు పట్టుకొని కొరికేస్తుంది- నురుగురాశివలె నిస్సారమయిన ఈ ప్రపంచసృష్టి అంతా అజ్ఞానంవల్లనే ఆరంభం అవుతోంది- ఈ సృష్టిలో వ్యవహారసత్త అనేది ఒకతీగ చిదాభాసులు ఆతీగకు పుష్పాలు- లోకాలు చిగురాకులు- ధర్మార్థములు ఫలములు-

ఈత్రిజగత్తు (ముల్లోకము) అనేది ఒకపెద్ద గృహము- దీనికి పర్వతాలు స్తంభాలు గగనము (ఆకాశము) కప్పు- సూర్యచంద్రులు కిటికీలు అతి సుందరమయినది యీగృహము- ఈ సంసారమనేది ఒక పెద్ద సరస్సు- అందులో తయారయినాయి శరీరములనే కోనేర్లు. అందులో ఉన్న చిద్రూపరసమును పానంచేయు స్వభావంగలవి ప్రాణాలనే తుమ్మెదలు- ఇందులో ఆకాశమనేది ఇంద్రనీలమణి నిర్మితమయిన కృత్రిమభూభాగము- అందులో ఎప్పుడూ వెలుగుతూ ఉంటుంది

సూర్యుడనే దీపం- ఇది అంతా అజ్ఞానవిజృంభితము- ప్రపంచమనే ఒకజీర్ణపక్షి (ముసలిపక్షి) ఆశలనే దారాలతో కట్టివేయబడినది- కర్మ వాసనలనే యినపశలాకలతో తయారయిన ఇంద్రియ పంజరంలో (దేహమునందు) ఉంచబడినది- సంసారమనే తీగ ప్రాణవాయువనే గాలికి కదిలేసరికి భూతములనే ఆకులు తెగరాలిపోతున్నాయి- జీవులు రక్తమాంసమలమూత్రాది సహితమయిన దేహమనే నరకపంకంలో పడియున్నారు- అయినా ఒక్కరికీ యీభావంలేదు. ఈ శంకయేలేదు. పైగా "మేము గొప్పకులంలోనివార్లం" "సదాచారపరులం" "శ్రోత్రియులం" "మహాపండితులం" అని యేమెమో విర్రవీగుతూ ఉంటారు- మహా ఆనందపడుతూ ఉంటారు- ఇదంతా అజ్ఞానవిలాసం కాక మరేమిటి? స్వర్గంలో దేవతలు మొనగాళ్ళమని విర్రవీగటంకూడా అజ్ఞానమే- అది కామ్యకర్మలయొక్క ఫలరూపమని అనటంకూడా అజ్ఞానమే- ప్రపంచమనే నీటిమడుగులో సృష్టిఅనే చేప ఎగిరిపడుతోంది- ఎప్పుడో యముడనే ముసలిగద్ద వచ్చి వేసుకుపోతుంది- ఈప్రపంచం ఆరోజుకారోజు (ప్రతిదినమూ) చంద్రకళవలె విచిత్రంగా పరిణామం చెందుతుంది- కాలమనే కులాలుడు (కుమ్మరి) క్షణభంగురమయిన భూతములనే కుండలను తయారుచేయడానికి సంసారమనే చక్రం త్రిప్పుతున్నాడు-

బ్రహ్మయందు అసంఖ్యాకములయిన (లెక్కింపశక్యముకాని) కల్పాలు పుట్టాయి- యుగాంతమనే నిప్పుచే ఎన్నో దగ్ధమయినాయి- ప్రపంచస్థితి అంతులేని గమనాగమనములతోను అంతులేని సుఖదుఃఖ దశలతోనూ విపరిణామాన్ని చెందుతూనే ఉంటుంది ఎప్పుడూ- అబ్బా! ఈ అనర్థపరంపరను ఇలాచూస్తూఉన్నా అజ్ఞానులకు నిర్వేదం (వైరాగ్యం) కలగడంలేదు- వీళ్ళమౌర్ఖ్యం వాసనలనే యినపగొలుసులచే గట్టిగా కట్టబడింది- అంచేత ఎవరికీ తెంచసాధ్యం కాకుండా ఉంది- వజ్రాయుధంతోకూడా తెగేటట్లులేదు యీమౌర్ఖ్యం వీళ్ళకు ఎన్ని యుగాలు మారినా-

జ్ఞానంవల్ల అజ్ఞానం నశించినా అధికారప్రాపకమయిన ప్రారబ్ధ కర్మయొక్క ప్రాబల్యంచేత ఇంద్రాది శరీరాన్ని మన్వంతరకాలపర్యంతం ధరించే ఉంటుంది కర్మవాసన- దానికి మరో దానివల్ల నాశమనేది మధ్యలో అసంభవం- భూతసృష్టి అనే పరాగపరంపర నియతి అనే గాలికి ఎగిరిపోయి కాలమనే సర్పముయొక్క నోట్లో ప్రవేశిస్తుంది- ప్రాపంచికపదార్థాలన్నీ నాశమనే బడబాగ్నియొక్క నోట్లో ప్రవేశించేవే కాని స్థిరంగా ఉండేది ఒక్కటీలేదు- ప్రాపంచికపదార్థాలు అధిష్ఠానమయిన బ్రహ్మయొక్క సత్తతో స్వరూపమునొంది ఊహింపనలవి కాని వాసనా వైచిత్ర్యంతో ప్రసరించడం (వ్యాపించడం) అనేది అజ్ఞానవిజృంభణము- లోకములనే మదపుటేనుగులను యముడనే మత్తకేసరి (మదించిన సింహము) కబళించడంకూడా దానిమహిమే- హిమవదాది కులశైలములు ఉపభోగ్యముగా గలిగి మేఘములు రెక్కలుగాగల జీవులనే పక్షులు మాటిమాటికి పుట్టుతూ, పెరుగుతూ, చస్తూ ఉండటం అజ్ఞానముయొక్క విలాసము- బ్రహ్మదేవుడనే చిత్రకారుడు చైతన్యమను గోడమీాద పంచేంద్రియములనే పంచరంగులతో సంసారమనే తమాషాబొమ్మలను తయారుచేస్తున్నాడు. ఇందులో స్థావరజాతులు (స్థావరపదార్థములు) తాము జగదాకారంగా వివర్తించింది అతిసూక్ష్మమయిన కాలగతిని బాహ్యవ్యవహారమునకు యోగ్యము కాని అంతరమగు ధ్యానముచేతనే అనుభవిస్తూ ఉన్నాయి- ఇంక జంగమజాతులుమాత్రం రాగద్వేషాలతోనూ, సుఖదుఃఖాలతోనూ, జరామరణాలతోనూ, జీర్ణమవుతూ ఉంటాయి- అందులో కృమికీటకాదులు అతి దుష్కృతఫలమయిన దుఃఖాన్ని అనుభవిస్తూ భూమిమీాద నియతికి కట్టుబడి బాధపడుతూ ఉంటాయి- ఈ రెండువిధములయిన ప్రాణి జాతులను కాలమనే సర్పము కనిపించకుండా వచ్చి మ్రింగివేస్తుంది సులువుగా- ఇందులో స్థావరములు నియతకాలంలో ఫలించడం, పుష్పించడం మొదలయిన పరిణామాలను పొందుతూ ఉంటాయి- అనివార్యంగా చలిని సహిస్తాయి- ఎండను సహిస్తాయి-

పైగా మనుష్య, పక్షి, సర్పాదులచే, స్వశరీరబాధనుకూడ పొందు తాయి- ఇందులో కొంతవరకు తనఅదృష్టము కొంతవరకు ఇతరుల అదృష్టమున్ను నిమిత్తం (కారణం) అవుతుంది- ఆయా వసంతాది కాలములంగో నియతంగా ఫలపుష్పాదులతో తులతూగుతూఉంటాయి- కనుకనే తపః, శమ, దమ, తితిక్షాది, శీలముగలవివలె కాలంగడుపుతూ ఉంటాయి-

నీటియొక్క సమూహామందు విశ్రాంతి చెందియున్న ముల్లోకము లనే మూడుపద్మములందు జంగమప్రాణులు తుమ్మెదవలె తిరుగుతూ ఘుంఘుమధ్వని చేస్తూ ఉంటాయి- కాలీశక్తి (కాలికాదేవి) బ్రహ్మాండమనే భిక్షాపాత్రలో భూతభిక్షను మాటిమాటికి గ్రహించి, తన భర్తయగు కాలానికి యిచ్చి, మళ్ళీ భిక్షమెత్తుతూనే ఉంటుంది- ఈత్రిలోకీ అనేది ఒక వృద్ధకామినీ (ముసల బోగంది) దీనికి అంధ కారం తలకొప్పు- సూర్యచంద్రులు నేత్రాలు- బ్రహ్మోపేంద్రమహేం ద్రాదులూ ధరాగిరివరాదులూ శరీరం- బ్రహ్మతత్త్వమనేది పిటకము ( ) మేఘములు స్తనములు- చిచ్ఛక్తి అనేది దీనికి తల్లి- నక్షత్రసమూహాం దంతములు- బిసలతలు (తామరతీగలు) చేతులు- అమరావతీపట్టణము (స్వర్గలోకము) ముఖము- సప్తసము ద్రాలు, ముత్యాలహారములు- ఆకాశము పమిటిగుడ్డ- (పైగుడ్డ) జంబూద్వీపము బొడ్డు- వనపంక్తి రోమరాజి- ఈ హాంగుతో ఉండి, ఉండి నశిస్తుంది ఇది- కాలమనే మహాసముద్రంలో బ్రహ్మాండాలు ప్రతికల్పమనే క్షణాలలో పుడుతూ చస్తూ ఉంటాయి- అగాధమయిన దాని రసస్పందంలో హిరణ్యగర్భాదులు మునుగుతూ తేలుతూ ఉం టారు- కాలమనే యెత్తయిన తాటిచెట్టునుండి బ్రహ్మాండములనే తాటిపండ్లు పడుతూ ఉంటాయి- వానినుండి విష్ణురుద్రాది దేవతలు అనేకులు బయులుదేరుతారు- పరమకారణమయిన పరమాత్మయొక్క ఉన్మేషమునుండి సృష్టి నిమేషము (కనుమూత) నుంచి ప్రళయము

జరుగుతూ ఉంటుంది- ఆ పరమకారణమయిన చిద్రూపమునందు అనేకమంది రుద్రులు, అనేకమంది విష్ణువులు గతించారు- గతించ నున్నారు- ఈసృష్టిస్థితి అనంతము- (అసంఖ్యాకము) ఇది అంతయూ మాయవల్ల సంభవిస్తోంది- ఇదియంతయు అజ్ఞానము యొక్క మహిమ తప్ప మరియొకటికాదు- రామా! లోకంలో సంపదలు, ఆపదలు, బాల్య, యౌవన, కౌమార, వార్థకములు, సుఖదుఃఖపరంపరలు, ఇవి అన్నీ అజ్ఞానాంధకారముయొక్క విభూతులని గట్టిగానమ్ము-

## ౮. తూలావిద్యావిలాసము.

వసి॥ రామా! ఇంతవరకు నీకు మూలావిద్యయొక్క విభూతి (మహిమ) (విలాసము) చెప్పాను- ఇకముందు తూలావిద్య (కార్యా విద్య) యొక్క విలాసం చెబుతావిను- సంసారమనే అడవిలో చైతన్య మను పర్వతచరియమీద కార్యావిద్య అనే తీగపుట్టి ఎప్పుడు వికసిం చిందోకాని మహోవిపుగా పెరుగుతోంది- ఈఅవిద్యాలతకు మేర్వాది పర్వతాలు కణుపులు- బ్రహ్మాండావరణములు చర్మములు- జనులు (లోకులు)పత్ర అంకురాదులు-ముల్లోకము దీనికి దేహయష్టి-సుఖమూ, దుఃఖమూ, జన్మమూ, స్థితీ, జ్ఞానమూ, అజ్ఞానమూ అనేవి ప్రతిదినము వృద్ధిపొందే స్వభావముగల వేరులు, ఫలములు (పండ్లు) ను దీనికి- లోకంలో అనుభవింపబడుచున్న సుఖమునుండి "యికముందుకూడ నాకు ఇలాంటి సుఖమే అధికంగా కలుగుగాక" అని అనురాగరూప మయిన అవిద్యపుటుతుంది- దానిచే యజ్ఞము, దానము, మున్నగు ధర్మములను చేస్తాదు- వాటివల్ల సుఖం కలుగుతుంది- కనుక అవిద్య వల్లనే సుఖం ఫలించిందన్నమాట- కాబట్టి సుఖంవల్ల అవిద్యపుటుతుం దనీ, ఆఅవిద్యే తుదకు సుఖాన్ని ఇస్తుందనీ, ఒకన్యాయం ఏర్పడింది- ఇలాగే దారిద్ర్యదుఃఖమువల్ల ధనాశఅనే అవిద్య పుటుతుంది- ఈఅవిద్య పాపవాసనచే దుష్ప్రతిగ్రహమునందో (దుష్ప్రతిగ్రహ మనగా నీచుని నుండి దానమును పట్టుట) చౌర్యమునందో మరియే యితర అధర్మము

నందో ప్రవృత్తిని కలిగిస్తుంది- తద్వారా మరల మరింత దుఃఖాన్ని కలిగిస్తుంది- ఇలాగే జన్మవల్ల అవిద్యపుటుతుంది- అది మళ్ళీ జన్మనే ఇస్తుంది- స్థితివల్ల అవిద్యపుటుతుంది- అది మళ్ళీ స్థితి (ఉనికి)నే ఇస్తుంది- అజ్ఞానంవల్ల అజ్ఞానంపుట్టి మరల అజ్ఞానాన్నే ఎక్కువగా పుట్టిస్తుంది- జ్ఞానంవల్ల అవిద్య పుటుతుంది- అది మరల జ్ఞానాన్నే మరింతగా కలిగిస్తుంది- ఇలా ఈఅవిద్యాలత మహోఉల్లాసంతో క్రొత్త క్రొత్త వాసనలనే పరిమళంతో విజృంభిస్తూ ఉంటుంది- దీనికి పగటి కాలములు పువ్వులు- రాత్రికాలములు తుమ్మెదలు- ప్రాణులు చిగురాకులు- ఈతీగ ఇలా పెరుగుతూవచ్చి, వచ్చి, ఒకానొక అధికారి అనే చిగురాకు అంశలో వివేకమనే ఏనుగుయొక్క పాలపడుతుంది- అది (ఆఏనుగు) విచారమనే కొమ్ముయొక్క అగ్రభాగంచేత ఒక్కదులుపు దులుపుతుంది- అంతటితో ఉన్న దుర్వాసనలనే పరాగం అంతా వదిలిపోతుంది- ఆపైన దైవాత్తూ ఆఏనుగుయొక్క తొండము నుండి తప్పించుకొని మళ్ళీ విషయజాతమనే చెట్టుమీాదికి పాకుతుంది- మళ్ళీదానికి మిత్రపశ్వాది ప్రవాళములూ, (చిగురాకులూ) పుత్ర పౌత్రాది అంకురాలూ బయలుదేరుతాయి- అక్కడనుంచి మళ్ళీ జన్మమరణాలనే పర్వములూ, అందులో సుఖదుఃఖాలనే పాములూ, విషయానుభవమనే మకరందమూ, అప్పుడప్పుడు విచారమనే పురుగు పట్టడమూ, నవగ్రహాలూ, చంద్రసూర్యులూ, అనేపుష్పాలు ప్రతి దినమూ పుష్పించడమూ, కలిగి సర్వాబుతు కుసుములతో కూడుకొని కలకలలాడుతూ ఉంటుంది యీాతీగ- నక్షత్రాలు ఈతీగకు మొగ్గలు- చంద్రసూర్యాగ్నుల వెలుగులు పుప్పొడి- ఈ పుప్పొడిచే పచ్చని స్త్రీవలె మానవుల చిత్తములను అకర్షిస్తుంది- మనస్సు అనే ఏనుగుచే కదులుతూ ఉంటుంది- సంకల్పాలనే కోకిలలు కూస్తూ ఉంటాయి ఈతీగమీాద ఇంద్రియాలనే పాములతో క్రిక్కిరిసి ఉంటుంది- తృష్ణ అనే దీనితోలు, నల్లని ఆకాశమనే తాపింఛవృక్షాన్ని ఆధారం జేసికొని మెత్తగా పెరుగుతుంది- క్రిందనున్న బ్రహ్మాండ ఖండాలలోని

సప్తసముద్రాలు కుదుర్లు- లోకాలనే ఉద్యానభాగాలమీద మొలిచింది- కామ్యకర్మలక్షణమయిన నేలతోయము, భ్రమరములు- రమణులు (స్త్రీలు) పుష్పపుంజము- పాపకర్మలు తొలిగిను దాగియున్న అజగరములు- (పెద్ద సర్పములు) స్వర్గసంపద పుష్పమంజరము- జీవులనెట్క- జీవకోశాయములతో నిండి ఉంటుంది- విషయవాసనాగంధములతో మూఢులను మదింపజేస్తుంది- వివేకవంతులకు ఉపశమనమై చిత్త్వముచే నానావిధపుష్పములతో కూడుకొని ఉంటుంది- అనేకరకాల ఫలాలు- అనేకరకాల మకరందాలు- అనేకములయిన కుసుమలు- అనేక పక్షులకు బ్రతుకుతెరువు- అనేకవిధమయిన పరాగము- పర్వతములు మొగ్గలు. నానావనములు ఉత్పత్తి స్థానములు- నానాగిరికటములంకు అధిష్ఠించింది- అనేకరకాల ఆకులు. ఇలాంటి సామగ్రితో, ఈ అవిద్యాలత వెనుకపుట్టింది- ఇప్పుడు పుడుతోంది- వెనుక చచ్చింది- ఇప్పుడు చావనున్నది- సగం తెగిఉంది- అసలు తెగకుండానూ కొంతఉంది- గడచినా వర్తమానమువలె ఉంటుంది- సత్యంగాను కనిపిస్తుంది- అసత్యంగానూ కనిపిస్తుంది- ఎల్లప్పుడు తారుణ్యంతోనూ ఉంటుంది- ఎండిపోయీ ఉంటుంది- ఇది మహావిషలత- ఒకసారి ముట్టుకుంటే చాలు దీన్ని- సంసారమనే విషమొక్క- మూర్ఛపోతారు జనులు- కొంచెం దీని స్వరూపస్వభావాలు విచారిస్తేమా ఇంకనచ్చి ఉంటుంది ఇది- విచారించినవానియొక్క- పూర్ణాత్మయందు బాధితమై ఉంటుంది- అజ్ఞానియందు అనువృత్తమయియే ఉంటుంది-

చూడు దీని ఆకారమూ, విలాసమూ- ఒకప్రక్క- జలం మరొకప్రక్క- కొండలు- ఇంకొకచెంప ఏనుగులు- మరొకవైపున దేవతలు- ఒకచోటపృథివి- ఇంకొకచోట స్వర్గం- ఒకప్రక్క- సూర్యచంద్రులు- ఇంకొకప్రక్క- నక్షత్రములు- ఒకప్రక్క చీకటి- ఒకప్రక్క- వెలుతురు- ఒకప్రక్క- ఆకాశము(శూన్యము) ఒకప్రక్క- సర్వసస్యాఢ్యమగుభూమి- ఒకప్రక్క- శాస్త్రము- ఒకప్రక్క- వేదము- ఒకప్రక్క- ఈరెండూ లేకుం

నుట– ఒకవైపున పక్షివలె ఎగురుట– ఇంకొకప్రక్క దేవతవలె లేచుట– ఒకతూరి స్థాణువువలె నుండుట ఇంకొకతూరి గాలివలె చలించుట– ఒకపుడు నరకమున నుండుట–మరొకపుడు స్వర్గమెక్కుట– ఒకప్పుడు దేవతాజన్మ– మరొకపుడు క్రిమికీటకాదజన్మ– ఒకచోట విష్ణువు– మరొకచోట రుద్రుడు– ఇంకొకచోట బ్రహ్మ– ఒకచోట సూర్యుడు– ఒకచోట అగ్ని–ఒకచోట వాయువు–ఒకచోట చంద్రుడు– ఒకచోట యముడు– రామా! ఇంత ఎందుకు? లోకంలో ఏకొద్ది దృశ్యమయినాసరే స్ఫురిస్తూఉంటే అదంతా అవిద్య అని తెలుసుకో– దానిని చంపుకున్నామా? అపుడు ఆత్మకు మోక్షము స్థిరము– అన్నారు వసిష్ఠులు–

## ౯. విద్యానిరాకరణము.

శ్రీరా॥ స్వామీ! హరిహరాదులు సచ్చిదానంద పరబ్రహ్మ రూపులని శ్రుతులు చెప్పుచున్నవే– అలాంటి వారుకూడా, అవిద్యకు లంటారే మీరు ఇది ఎలా! శ్రుతివిరుద్ధంకదా? మీరుచెప్పేమాట! అని అడిగాడు శ్రీరాముడు– వసిష్ఠులు జవాబు చెబుతారు–

వసి॥ రామా! సృష్టికిపూర్వం జగదాకార రహితమయిన సర్వాత్మకమయిన సచ్చిత్ప్రకాశరూపమయిన సద్రూపబ్రహ్మము కలదు– అతనియందు సృష్టిప్రారంభంలో చిదాభాసస్ఫూర్తి ఆవిర్భవించినది నీటినుండి సుడిగుండమువలె– అది (చిదాభాసస్ఫూర్తి) సూక్ష్మము, మధ్యమము, స్థూలము అని మూడు విధములయినది– సూక్ష్మకల్పనానంతరము ఆచిత్పదార్థము, మనోరూపంతో హిరణ్యగర్భుడుగానూ, తరువాత స్థూల విరాడాకారమయిన శరీరంతో విరాట్టుగాను ఉన్నది–

అవ్యాకృతోపాధియగు ప్రకృతి సత్త్వ, రజస్తమోగుణములచే మూడువిధములుగ నుండి, సూక్ష్మ, మధ్య, స్థూలావస్థలందు మరల

మూడువిధములుగ గల్పింపబడుతోంది- సత్త్వరజస్తమోగుణాత్మక మగు ప్రకృతినే అవిద్యయని అంటారు- ఈఅవిద్యయే ప్రాణుల సంసార సంబంధమునకు మూలకారణము- దీని అవలిభాగము పరమపదము- (మోక్షము) ఈమూడు గుణములును మరల ప్రత్యేక ప్రత్యేకముగ మూడుభేదములయినవి- కాన మొత్తము అవిద్య (ప్రకృతి) తొమ్మిది విధములయిన దన్నమాట- ఈకనిపించే దృశ్యమంతా (ప్రపంచం అంతా) ఈతొమ్మిది రకములయిన అవిద్యను ఆశ్రయించియే ఉంది.

రామచంద్రా! ఇందులో ఋషులూ, మునులూ, సిద్ధులూ, నాగులూ, విద్యాధరులూ, సురలూ, అవిద్యయొక్క సత్త్వగుణము పాలు (భాగము) నకు సంబంధించినవారు- ఇందులో మళ్ళీ నాగులూ, విద్యాధరులు, సత్త్వగుణములోని తమోభాగమునకు సంబంధించిన వారే- మునులూ, సిద్ధులూ, సత్త్వగుణములోని రజోభాగమునకు సంబంధించినవారు- హరి, హర, బ్రహ్మలు, సత్త్వగుణములోని శుద్ధ సాత్త్వికభాగమునకు సంబంధించినవారు- హరిహరాదులు సత్త్వ గుణమువల్ల బుట్టిన దేవయోనులలోబుట్టి స్వాభావికమయిన ఆత్మ విద్యచే అవిద్యావరణశూన్యమయిన ఆత్మపదమును పొందారు- అందు వల్ల ఆముగ్గురు శుద్ధసత్త్వ స్వరూపులు- దీనివల్ల బ్రహ్మ రజోగుణ రూపుడనియు శివుడు (హరుడు) తమోగుణరూపుడనియును, మూఢు లనుకొనుమాట నిరాకృతమయినది- కాన ఆముగ్గురిలో ఉత్కృష్టా పకర్ష భావమును (న్యూనాధికభావమును) తలంచకూడదు- కనుకనే "అయం పరస్త్వయం నేతి సంరంభాభినివేశినః । యాతుధానాశ్చ జాయంతే పిశాచాశ్చ న సంశయః ॥" హరిహరాదులలో "వాడుగొప్ప, వీరుతక్కువ" అని పట్టుదలగలవారు రాక్షసులుగాను, పిశాచములు గాను బుట్టుదురని నిందింపబడినది- కనుక శుద్ధసాత్త్వికులయిన ఆము గ్గురిని ఉపాసనచేసినవారికిగూడ జ్ఞానోదయంగలిగి పునర్జన్మరహితు లగుదురు- కాన త్రిమూర్త్యుపాసకులు ముక్తులని నమ్మ-

శ్రీమూర్తులకు (హరిహరబ్రహ్మలకు) అవిద్యావరణము లేదు- అందుచేత అనాగంతుకం (స్వాభావికం) జీవన్ముక్తి వాళ్ళకు- యావద్దేహం (దేహమున్నంతవరకు) అధికారపదవిలో ఉంటారు వారు- దేహావసానమున (కల్పాంతమందు) శుద్ధబ్రహ్మయందు విదేహముక్తిని పొందుతారు ఈవిధంగా శ్రీమూర్తులు అవిద్యాభాగమయినారు- మరల విద్యాస్వరూపులన్నమన్నారు- అనగా సత్త్వరజస్తమోగుణములు అను ఉపాధులనుబట్టి వారు (శ్రీమూర్తులు) అవిద్యాభాగమని చెప్పబడిరి- ఉపాధి, అవిద్యవల్ల పుట్టినదికాని, ఉపహితచైతన్యముకాదని నిశ్చయము- కనుక కారణావిద్యయే సృష్ట్యారంభంలో కార్యావిద్యాస్వరూపాన్ని చెందుతుంది- మరల ప్రళయంలో కారణస్వరూపాన్ని చెందుతోంది-

కారణావిద్య యందలి శుద్ధసత్త్వభాగముకూడ అవిద్యయే- దానినుండియే కార్యావిద్యరూపమగు సృష్టిపుట్టుతుంది- ప్రళయంలో మళ్ళీ ఆ అవిద్యయందే లయిస్తుంది- ఇదంతా నీటిలో బుడగలు పుట్టి అవి ఆనీటిలోనే లయించినట్లు కల్పితము- భావనామాత్రంచేతనే నీటికి తరంగానికి భేదము. పరమార్థదృష్టిలో అభేదం ఆరెంటికి అలాగే విద్యావిద్యలకుకూడ భేదము కల్పితము- అభేదము పారమార్థికము- కనుక రామా! విద్యావిద్యాదృష్టులను విడిచి మిగిలినది వస్తువని (సత్యమని) గ్రహించు- అనగా బాధ్యమయిన అవిద్య లేకపోతే తద్బాధకమయిన విద్యకూడ లేదని తాత్పర్యము- విద్యయందలి బాధకత బాధ్యమయిన అవిద్యాధీనము- కనుక బాధ్యము లేకపోతే యింక బాధకమెక్కడిది? కనుక ఈ రెండూ లేకపోతే మిగిలినది చిదంశము మాత్రమే- అదే అవిద్యావృతమై అవిద్యయనబడుతోంది- అది (ఆచైతన్యాంశము) తెలియబడితే అవిద్యానాశము- విద్యఅనేదికూడా లేనందున (పరమార్థము కానందున) అవిద్య అనేది మిథ్య అని గ్రహించు- కనుక ఈ రెంటిలో అవిద్య అనేది మనస్సునందు బాధింప

బడి లయిస్తే (నశిస్తే) అప్పుడు విద్యకూడ నశించినట్లే— కనుక రామా! ఈ రెండూ దేనియందు లయించియున్నవో అదే మిగిలింది. అవిద్య నశిస్తే అవిద్యానాశకమయిన విద్యమాత్రం ఉండకూడదు? అని నీకు శంక కలుగవచ్చు— అదెట్లాగు— కట్టెలు నశిస్తే దానినంటుకున్న నిప్పు మిగులుతుందా చెప్పు? అంతే ఇక్కడకూడ— కనుక అవిద్య నశిస్తే విద్యకూడ లేనట్లే— ఆదశలో మిగిలినది నకించిత్ =(ఏమీలేదు) సర్వబాధాత్మకము కనుక— (కించిత్—ఏదియోయొకటి) పరమార్థ స్వరూపము కనుక— కాబట్టి ఇలా శాస్త్రదృష్టిలో ఉంటే సర్వము గ్రహించినట్లే— మాయికరూపంతో ఏదీ తెలియనట్లే— భ్రాంతిదశలో సర్వం కల్పితమే కనుక మనకు తెలిసినదంతా లేనిదే— కనుక ఏదీ తెలియలేదని యర్థము—

అజ్ఞానావరణదశలో కూడ పరమార్థంగా ఏవస్తువూ పరమాత్మయందు లేకున్నా మర్రిగింజలో మర్రిచెట్టు అవ్యాకృతరూపంతో ఇమిడి ఉన్నట్లు ఈప్రపంచంఅంతా అవ్యాకృతరూపంతో (నామరూప విశేషాకారము లేని రూపంతో) చిత్పదార్థమునందు ఇమిడియే ఉంది— ఉండబట్టిగదా దేశకాలక్రమంచేత ఆచిత్పదార్థమునుంచి బయలు దేరుతోంది ప్రపంచం— కనుకనే అగ్ని విస్ఫులింగాది దృష్టాంతంగా జీవులు ఉపాధులతో సహా ఆచిత్పదార్థమునుండి బయలుదేరుచున్నారని శ్రుతి చెబుతోంది— కనుక ప్రపంచం సూర్యకాంతమణిలో అగ్ని ఉన్నట్లూ, పాలలో నెయ్యి ఉన్నట్లూ, ప్రపంచం పరమాత్మయందిమిడి ఉంది— అది మాయ సూర్యునినుండి కిరణములూ, అగ్నినుండి మిణుగురులూ బయలు వెడలినట్లు బయలుదేరుతోంది— కనుకనే బ్రహ్మ జీవచైతన్యములను కోరేది— (సృష్టి)— అయినా జీవవ్యక్తులు బ్రహ్మకంటె వేరుగ నున్నవనటము భ్రాంతి— జీవులు బ్రహ్మనుండి బయలుదేరటం అనేది, కడవపగిలితే కడవలోని ఆకాశం కడవనుండి బయలుదేరి పోయిందనే మాటవంటిది— ఇలాగే జీవులకు కర్తృత్వంకూడా ఔపచారికంకాని

వాస్తవికంకాదు- అయస్కాంతమణికి అయోచలనము విషయమై (ఇనుపసూది కదలుట విషయమై) కర్తృత్వమెట్టిదో అట్టిదే జీవచైతన్యముయొక్క కర్తృత్వముకూడ చిత్సాన్నిధ్యంచేతనే దేహాదులు చలిస్తున్నాయి-

## ౧౦. అవిద్యాచికిత్స.

వసి॥ కనుక రామా! ప్రపంచము, జీవులు, అనుభేదము (అనగా బ్రహ్మ భిన్నముగా గోచరించే ప్రపంచం) నీకు అజ్ఞాతముయిన (తెలియబడని) బ్రహ్మమాత్రమే కాని బ్రహ్మకంటె వేరుకాదు- కనుక దీనిని కోరుట వ్యర్థము- "నాదినేను" అని మనం మనస్సులో దేనిని అనుకుంటున్నామో గట్టిగా విచారణచేస్తే ఒక్కటికూడా మనదిగా కనిపించడంలేదు- భ్రాంతిసిద్ధముయిన పామువంటిదయింది దీనిగతి- భ్రమదశలో తెలియబడనివాడే భ్రాంతినశించి జ్ఞానం కలిగేసరికి తెలియబడి ఆత్మయగుచున్నాడు- అన్ని జ్ఞానాలకు ఈజ్ఞానమే పర్యవసానము- చిత్తు చేత్యములతో కూడిఉంటే అవిద్య- అది చేత్యములను (విషయములను) విడచుటయే ఆత్మ- అవిద్యాకార్యములయిన మనోబుద్ధి దేహేంద్రియాలవల్లనే ఆత్మకు బంధము- పుట్టుపురుగు తనకడుపులోని దారములతో తాను కట్టువడినట్లు జీవుడు తన కుపాధియయిన చిత్తమును అంటుకొనియున్న వాసనలనే దారాలతో కట్టువడ్డాడు- వివేకం లేనందున ఈ విషయాన్ని గ్రహించలేకపోతున్నాడు-

శ్రీరా॥ స్వామీ! చేతనులయిన జీవులస్థితే ఇలాఉంటె యింతకంటె ఘనమయిన అవివేకంగల (అతిమూఢమయిన) స్థావరజీవుల గతి యేమి? వాటి చిత్తస్థితి ఎలా ఉంటుంది? చెప్పండి? అని అడిగాడు రాముడు-

వసి॥ రామా! స్థావరజీవుల చిత్తము సుషుప్తియందువలె లయించి ఉండదు- జాగ్రతయందువలె పూర్వాపర పరామర్శకు

యోగ్యమయినా ఉండదు– కేవలం మూఢమై ఉంటుంది– ఆశరీరంలో వాటికి ముక్తి అనేది శూన్యం– అసంభవం– వాటికీ ముక్తికీ చాలా దూరం– స్థావరపదార్థములందు పుర్యష్టకము కేవలము వివేకమునకు అసమర్థమై ఉంటుంది– కర్మేంద్రియాలు లేవు. జ్ఞానేంద్రియాల ప్రచారము లేదు– మానస ప్రసారము లేదు– చైతన్యం కేవలము సత్తామాత్రంతో ఉంటుంది– అన్నారు వసిష్ఠులు–

శ్రీరా॥ స్వామీ! అయితే వాటికి ముక్తి చాలా దగ్గరే కా! వాటికీ ముక్తికీ చాలాదూరం అంటారేం మీరు? ఇంద్రియవ్యాపారాలు (ఇంద్రియ వృత్తులు) లేనందున యోగులకువలె స్థావరములకు వాసనాక్షయ, మనోనాశములు సులువుగా సంభవిస్తాయిగా! ఇలాంటి స్థితిలో వాటికి ముక్తి లేదంటారే మీరు మీ అభిప్రాయం ఏమిటి? అని అడిగాడు శ్రీరాముడు–

వసిష్ఠులు సమాధానం చెబుతారు– రామా! శాస్త్రవిహితమయిన కర్మలను ఆచరించాలి. చిత్తం పరిపక్వం కావాలి. సాధన చతుష్టయసంపత్తి కలగాలి– శ్రవణమననిదిధ్యాసలు చెయ్యాలి– తత్త్వసాక్షాత్కారం కావాలి– వాసనాక్షయ మనోనాశములు సిద్ధించాలి. ఆత్మసత్తా సామాన్యంతో (సద్రూపంతో) ఉండాలి– ఇదీ ముక్తి అంటే– ఇలాంటిముక్తి, అనంతములయిన దుష్కృతవాసనా బీజములతో పుట్టి నరకవాసులతో తుల్యములయిన స్థావరములకు శాస్త్రాధికారజన్మయే దుర్లభమయితే ముక్తిమరింత దుర్లభమనటంలో ఆశ్చర్యమేమి? బుద్ధిపూర్వకంగా ప్రపంచంలో సత్యాసత్యాలు విచారించి, అసత్యమయిన ప్రపంచమును మరచి, పరమార్థ సత్యమయిన పరమాత్మభావంతో ఉండిపోవడం ముక్తి– ఇది స్థావరజీవులకు ఎలా తటస్థిస్తుంది? తెలిసికొని త్యజిస్తే వాసనాక్షయము అంటారు కాని, అసలు తెలివే లేకపోతే వాసనాక్షయం ఎలాఅది! బీజమునందు అంకురాదులవలె వాసనలు లోపల దాగిఉంటే అది సుషుప్తదశవంటిది అంటారు– ఈ

స్థితి మళ్ళీజన్మను ఇస్తుంది- స్థావరములయొక్క స్థితి ఇలాంటిదే- కనుక ఇవి మాటిమాటికి పుట్టుటకు యోగ్యములు కాని ముక్తికి యోగ్యములు కావు- కొంతమంది మూఢులు స్థావరపదార్థములంగా వాసనలే ఉండవని అంటారు- అది ఎంతమాత్రము ఉచితముకాదు- బీజములందు అంకురాదులూ మట్టియందు ఘటాకారమూ ఇమిడిఉన్నట్లు స్థావర పదార్థములందు వాసనలుకూడా ఇమిడిఉన్నాయి- అంకురించే శక్తి గలవాసనలు గల స్థితి సుషుప్తమని అంటారు- అది జన్మకు కారణమగునుగాని మోక్షసిద్ధికి కారణముకాదు- అంకురించే శక్తిలేని వాసనలుగల స్థితిని తురీయస్థితి అంటారు- ఈస్థితిలో ముక్తి సులభం- అంకురించే శక్తిగల వాసన ఏమాత్రం మిగిలిఉన్నా కొంప తీస్తుంది- అనగా అనేకముంగా పెరిగి పెరిగి సంసారకూపంలో పడేస్తుంది జీవుణ్ణి- కనుకనే వహ్నిశేషమూ, ఋణశేషమూ, వ్యాధి శేషమూ, వైరశేషమూ, విషశేషమూ, ఎలాంటివో, వాసనాశేషం కూడా అలాంటిదేనని అంటారు పెద్దలు- కనుక వాసనల యొక్క బీజశక్తి నశించిన తరువాత వాడు సదేహుడయినా విదేహుడయినా మళ్ళీపుట్టడు- స్థావరపదార్థములందు చిచ్ఛక్తి బీజశక్తిగల వాసనలతో ఆవృతమైఉంది- ఈచిచ్ఛక్తి లోకంలో ఆయాపదార్థాలయందు ఆయా ఆకారాలతో ఉంటుంది- అనగా బీజములందు మొలకెత్తించే శక్తి రూపంతో ఉంటుంది- ధనరత్నాదులందు కోరుటకు కారణమయిన భవ్యభావముతో ఉంటుంది- ఇతరమయిన జడములందు కాఠిన్య రూపంతో ఉంటుంది- ఇలా విచిత్రరూపంగా ఉంటుంది పదార్థాలను బట్టికాని అన్నిటియందూ సత్తాసామాన్యరూపం మాత్రం తప్పదు చైతన్యానికి- సత్యాసామాన్యరూపంతో ఉండే ఘటంలో జలాద్యాహరణశక్తితోనూ, పటంలో శీతనివారణశక్తితోను స్ఫురిస్తుంది- అజ్ఞానావృతమయిన చిచ్ఛక్తియొక్క స్వరూపం ఇలాంటిది- దీని స్వరూపం విచారించి తెలిసికోనినచో సంసారభ్రాంతిని కలిగించి దుఃఖ పరంపరలను కలిగిస్తుంది- విచారించి తెలిసికుంటే సర్వదుఃఖనివృత్తి

కలుగుతుంది— ఈచిచ్ఛక్తియొక్క నిజరూపమును విచారించి తెలిసి కొనక పోవడమే అవిద్య అని అంటారు— ఈవిద్య ఉండువరకు సంసార సంబంధం తప్పదు జీవులకు— దీనికొక స్వరూపమనేదిలేదు— విచారించి తెలిసికొనునంతవరకు ఉన్నట్లు గోచరిస్తూనే ఉంటుంది— కొంచెము విచారణ చేస్తిమా! ఇంక ఎండలో మంచుబిందువు ఎగిరిపోయినట్లు పోతుందియిది— చేతిలో దీపం పెట్టుకొనివస్తే చీకటి పారిపోయినట్లు పారిపోతుంది— ఎండసోకితే నెయ్యి కరిగినట్లు విలీనమవుతుంది— దీపం తీసికొనివస్తే చీకటియొక్క స్వరూపం కనిపించదు— అలాగే విచారణ చేస్తే అవిద్యయొక్క స్వరూపంకూడా కనిపించదు— రక్తమాంసాస్థి యంత్రమయిన ఈశరీరంలో "నేనెవడిని"? అని తాను విచారణచేసి కొనుచో అవిద్య చల్లగా జారుకుంటుంది— ఇలా విచారణాయుక్త మయిన మనస్సుతో ఈదృశ్యజాతం ఆద్యంతములందు లేదని నిర్ణయం కలిగితే అప్పుడు మిగిలిఉండే చిదాత్మయే అవిద్యానాశము— (అనగా అధ్యస్త పదార్థములయొక్క నాశము అధిష్ఠానస్వరూపమని యర్థము—) దీనికి (అవిద్యకు) ఒక స్వరూపం లేదని దానిపేరును బట్టియే తెలుస్తుంది— "మాయా", "అవిద్యా" మొదలగు పేరులు స్వరూపములేని వస్తువులనే బోధిస్తాయి— నాలుకమీద వేసిన పదార్థముయొక్క రుచిని మరొకరు మనకు చెప్పవలసిన పనిలేదు— కనుక రామా! అవిద్యఅనేది ఎక్కడా లేదు— అఖండమయిన బ్రహ్మపదార్థమే ఈ ప్రపంచంఅంతా వ్యాపించిఉంది— కనుక రామా! "నేదంబ్రహ్మ" అని అనుకోవడము అవిద్యయొక్క స్వరూపము. "ఇదంబ్రహ్మ" అని అనుకోవడము అవిద్యాక్షయము— కనుక అవిద్యాక్షయమునకు "ఇదంబ్రహ్మ" అని నిశ్చయమే ఉపాయం మరోఉపాయంలేదు— అన్నారు వసిష్ఠులు—

## ౧౧. జీవన్ముక్త నిశ్చయయోగము.

వసి॥ రామా! నీకు బోధపడుటకు ఇదేవిషయం మాటిమాటికి చెబుతున్నాను— పలుమారు అభ్యసించనిదే ఆత్మభావన అలవడదు—

అజ్ఞానము అనంతకోటి జన్మాభ్యస్త ద్వైతవాసనా జాలంచే స్థిరీకృత మయింది- ఇలాంటిది ఒక్కమారు ఉపదేశంతో నశించదు- దేహ మున్నపుడు జాగరాద్యవస్థలయందు ఇంద్రియములచే అనుభవింపబడు తోంది- మరణ ప్రళయాద్యవస్థలందు సాక్షిచైతన్యముచే అనుభవింప బడుతోంది- కనుక అనుభవబలంచేత మిక్కిలి గట్టిపడింది ఇది- (అజ్ఞానం) ఆత్మతత్త్వమనేది ఏయింద్రియానికీ గోచరంకాదు- సత్తా మాత్రంతో ఉంటుంది ఆరుయింద్రియములు ముడుచుకొన్నపుడు ఆరు యింద్రియవృత్తులకు అందని ఆత్మతత్త్వము ప్రత్యక్షమగుట అసంభవం- కాబట్టే పలుమారు ఉపదేశమూ (అసకృదుపదేశమూ) మననాద్య భ్యాసములూ ఈ అవిద్యాలతాచ్ఛేదమునకు అవసరపడుచున్నాయి- రామా! నీవుకూడ నీ హృదయకోశంలో మొలచిన అవిద్యాలతను జ్ఞానాభ్యాసవిలాసాలనే అసిపాతములచే (కత్తిదెబ్బలచే) తెగగొట్టుకో- అపుడే నీకు మోక్షసిద్ధి- జనకమహారాజు ఆత్మతత్త్వమును గుర్తెఱిగి జ్ఞానాభ్యాసపరుడై విహరించాడు- నీవుకూడ అలాగే జ్ఞానాభ్యాసంతో విహరించు- రాజ్యకార్యములందునూ, బాహ్యాపనులందునూ, సమాధి యందునూ విహరిస్తున్నా జనకునకు ఆత్మనిశ్చయము తొలగలేదు- అలాంటి దృఢమయిన జ్ఞానాభ్యాసంచేతనే ఆత్మతత్త్వం అభివ్యక్త మవుతుంది- సామాన్యజ్ఞానానికి లొంగదు ఆత్మతత్త్వము-

ఇలాంటి సుదృఢమయిన ఆత్మనిశ్చయంతో ఉండబట్టే విష్ణు మూర్తి గర్భవాసాదిక్లేశాలుగల నానాయోనులందు అవతరించినా వానిసంబంధమయిన దుఃఖాలు అతనికి అంటలేదు- అర్ధనారీశ్వరు డయిన శివునకుగూడ ఇలాంటి నిశ్చయమేఉంది- విరాగి అయిన బ్రహ్మకుకూడ ఇలాంటి నిశ్చయమేకద్దు- బృహస్పతికీ, శుక్రాచార్యు నకూ, సూర్యచంద్రులకూ, అగ్నిమారుతములకూ, నారద, పులస్త్య, అంగిరసాది, ఋషులకూ, వరుణునకూ, భృగువునకూ, క్రతువునకూ, అత్రికీ, శుకమహర్షికీ, మరి యితర బ్రహ్మర్షి, రాజర్షులకునూ, జీవ

స్మకర్తలందరకూ ఇలాంటి నిశ్చయమేకలదు- అదే నిశ్చయం నీకు గూడ కలుగుగాక అన్నారు వసిష్ఠులు- శ్రీరాముడు విన్నాడు ఈ విషయం- ఇలా అడిగాడు- వసిష్ఠుణ్ణి-

శ్రీరా॥ స్వామీ! మీరు సెలవిచ్చిన యీ మహానుభావులందరూ ఏనిశ్చయంతో ఆత్యంతిక దుఃఖనివృత్తిని చెందిరో! దానిని నిజంగా చెప్పండి! అని-

వసిష్ఠులు జవాబిస్తారు- రామా! విను వారి మనోనిశ్చయ క్రమం- అంతా వివరంగా స్పష్టంగా చెబుతా నీకు- "విశాలమయిన ఈజగజ్జాలం అంతా మాయికమయిన తనరూపాన్ని విడిచి పారమార్థికమయిన (త్రికాలాబాధ్యమయిన) బ్రహ్మస్వరూపమునందున్నదని వాళ్ళమనోనిశ్చయం"- బ్రహ్మచిద్రూపం- బ్రహ్మలోకాలు- బ్రహ్మయేభూతపరంపరలు- బ్రహ్మయేనేను- బ్రహ్మేనాశత్రువు- బ్రహ్మేనామిత్రుడు- బ్రహ్మే నాబంధువులు- బ్రహ్మే కాలత్రయము- సర్వమూ బ్రహ్మయందేఉంది- సముద్రము తరంగసమూహారూపంతో విజృంభిస్తోంది- బ్రహ్మ ప్రాపంచిక పదార్థస్వరూపంతో విజృంభిస్తున్నాడు- ఈత్రిపుటి యావత్తూ బ్రహ్మస్వరూపము- బ్రహ్మయందు బ్రహ్మయే మాయావివర్తములతో వృద్ధిపొందుతున్నాడు- (పెరుగుచున్నాడు.) బ్రహ్మయే నాశత్రువుయొక్క స్వరూపము- నాదురూపం కూడా బ్రహ్మే కనుక నాకునేనే అపకారం చేసికొంటున్నా నన్నమాట- ఇంకనాకు ఇతరుడు చేసిందేమున్నది? రాగద్వేషాలు ఆకాశవృక్షమువలె కల్పితాలు- వాటినిగూర్చి సంకల్పమే లేకుండాఉంటే అవి నశించిపోతాయి- రాగద్వేషాలకు ప్రసక్తేఉండదు సంకల్పరాహిత్యం అయితే- అడుగుతీసి అడుగుపెడితే అంతా బ్రహ్మస్వరూపంతప్ప వేరేమీలేదు- సర్వమూ బ్రహ్మస్వరూపంగా స్ఫురిస్తూం (భాసిస్తుం)టే ఇంక సుఖమెక్కడిది? దుఃఖమెక్కడిది? సర్వమూ బ్రహ్మయందేఉంది- బ్రహ్మకంటె వేరుగ "అహం" "నేను" అనే

వాగా లేదు- "ఘటం బ్రహ్మ", "పటం బ్రహ్మ", "కుడ్యం బ్రహ్మ", "కాసూలం బ్రహ్మ", "సర్వం బ్రహ్మ"- ఇందులో రాగద్వేషాలకు ఏమాత్రం ప్రసక్తి లేదు- అది కల్పనామాత్రం. మరణమనే బ్రహ్మ దేహమనే బ్రహ్మతో కలిస్తే దుఃఖమెందుకు? త్రాడునుచూచి పాము అనుకున్నట్లు- సంభోగాదులందుకూడా బ్రహ్మరూపులయిన స్త్రీ పురుషులు కలిస్తే బ్రహ్మయందే సుఖం కలుగుతోంది- ఆసుఖం నాది అని పీడనుకోవటం పొరపాటు- తరంగంలో స్పందశక్తిగల నీళ్ళుకంటె వేరేమీ లేదు. అలాగే సంభోగాదులందుకుండా స్పందశక్తిగల బ్రహ్మ పదార్థంకంటె వేరుగ ఏమీ లేదు- కనుక (త్వత్తామత్తలు) నీవు నేను అనే భావాలు వృథా- స్పందరూపమగు బ్రహ్మగుండా గువి లేవు- సుడిగుండమనేది నశిస్తే అందులో నీటికంటె వేరేమీ లేదు- నీరే గుండ్రంగా తిరిగితే సుడిగుండం అంటున్నారు- కనుక మరణమంటే దేహబ్రహ్మమృతి బ్రహ్మను పొందాడన్నమాట. ఇందులో మరణించింది యేదీ లేదు-

కదిలేనీరు, కదలనినీరు అని రెండురకాల నీరు లేదు- అలాగే పరమాత్మయందు జడరూపమనీ, అజడరూపమనీ, రెండురూపాలు లేవు- బంగారానికి కటకత్వమూ, నీటికి ఆవర్తమూ ఎలాంటివో, అలాగే బ్రహ్మకుకూడా ప్రపంచభావమనేది ప్రకృతి అయింది- (మాయికమయింది)- ఇది జీవరూపమయిన ఆత్మ అనీ, ఇది జడరూపమయిన ఆత్మ అనీ భ్రాంతి అజ్ఞానికిగాని జ్ఞానికిలేదు- అజ్ఞానియొక్క దృష్టిలో ప్రపంచం దుఃఖమయము- జ్ఞానియొక్క దృష్టిలో ప్రపంచం ఆనందైకరసం- గ్రుడ్డివాడికి ప్రపంచం అంతా గ్రుడ్డిది- కన్నుగలవానికి ప్రపంచం అంతా ప్రకాశాత్మకం- చిన్నపిల్లవాడికి రాత్రికాలం దయ్యంలాగ గోచరిస్తుంది- యువకునికిగాని, వృద్ధునకుగాని, కేవలం రాత్రిగానే గోచరిస్తుంది- అలాగే బ్రహ్మస్వరూపమయిన అమృతఘటము ఎల్లప్పుడూ అంతటా ఏకపథంగా ఉంటే ఇందులో ఏదీ చచ్చిందిలేదు-

పుట్టిందీ లేదు- మహాసముద్రంలో తరంగాలు ఉల్లాసవిలాసాలతో తుళ్ళుతూ ఉంటే అందులో తరంగాలు పుట్టుట చచ్చుట ఎలా లేదో అలాగే భూతరాశికూడా పరమాత్మయందు పుట్టటం చావటం అనేది మృష- పరమాత్మయందు "ఇది ఉన్నది" "ఇది లేదు" అనేది భ్రాంతి- మాయాశక్తి అనేది నిష్కారణంగానే బ్రహ్మలో స్ఫురిస్తూ ఉంటుంది స్ఫటికమణిలోని కాంతివలె- స్ఫటికమణిలో ఒకవిధమయిన స్వచ్ఛమయినకాంతి ప్రకాశిస్తూ ఉంటుంది. అది అనేకరకమయిన ప్రతిబింబాలను గ్రహిస్తుంది- వాటివాటి గుణక్రియావైచిత్ర్యంతో ప్రకాశిస్తూ ఉంటుంది- అలాగే మాయాశక్తికూడా ప్రపంచాత్మనా (ప్రపంచ రూపంతో) ప్రకాశిస్తూ ఉంటుంది- ఆ పథఅంతా బ్రహ్మ స్వరూపమే కాని మరొకటి కాదు- ఉదకం తనయందలి తరంగకణ సమూహంలోనే ఘనీభావం చెందుతుంది- కనుక శరీరం నశిస్తే బ్రహ్మ యందు చచ్చాడనే బుద్ధిపుట్టటం ఏమిటి? బ్రహ్మకంటె వేరుగా శరీర మనేది నిజంలో లేనేలేదే! సముద్రంలో నీటికంటె వేరే తరంగాదు లనేవి లేవే- కణమన్నా, కణికఅన్నా, వీచిఅన్నా, తరంగమన్నా, ఫేనమన్నా, లహరీ అన్నా, ఇవిఅన్నీ నీరేకాని, నీటికంటె వేరుకాదు- అలాగే దేహమన్నా, ఇంద్రియవ్యాపారమన్నా, దృశ్యమన్నా, సంప ద్విపదములన్నా, హర్షవిషాదములన్నా, పురుషార్థములన్నా, ఇదంతా బ్రహ్మస్వరూపమేకాని బ్రహ్మకంటె వేరుకాదు- బ్రహ్మయొక్క ఆకార రచన (సంస్థాన రచన) అతివిచిత్రము- సువర్ణము ఎన్నిరకాల ఆకారాన్ని ధరించునో అంతకంటె మించి ఆకారములను ధరించగలదు బ్రహ్మ- ఎన్ని ఆకారములుగా కనిపించినా అదంతా సువర్ణమే- అలాగే ప్రపంచంలో ఎన్ని ఆకారాలు కనిపించినా అది అంతా బ్రహ్మమే- భిన్నముకాదు- మూఢులకుమాత్రం బ్రహ్మ భిన్నంగా గోచరిస్తాయి అవి- కనుక మనోబుద్ధి అహంకారాలు తన్మాత్రలు ఇంద్రియాలు ఇవన్నీ బ్రహ్మయే- అనాత్మలుకావు- కనుక ఇందులో సుఖదుఃఖాలకు ప్రసక్తి లేదు-

పర్వతసన్నిధిలో మనం మాట్లాడితే ప్రతిధ్వనించి మరలనెవ్వరో మాట్లాడినట్లుండును– అలాగే "వాడు, వీడు, నేను, నీవు, నాది, నీది, అనే పలుకులన్నీ బ్రహ్మశబ్దమునకు మారుపలుకులు–అనగా బ్రహ్మనే, "దేహమూ, చిత్తమూ, బాహ్యార్థములూ" అను నామభేదములతో విజృంభిస్తున్నాడు– కనుక బ్రహ్మయే జీవభావాన్ని జగద్భావాన్ని చెందాడు– స్వప్నంలో ఆత్మయందే అనేక చిత్రవిచిత్ర వస్తువులు కల్పింపబడుచున్నాయి– కనుకనే బాదరాయణులు తమసూత్ర గ్రంథమందు– "ఆత్మని చైవవిచిత్రాశ్చహి" అని అన్నారు– బ్రహ్మ రూపంగా భావింపబడని బ్రహ్మ అజ్ఞానమలము (అజ్ఞానకార్యము) అగును. సువర్ణముగా భావింపబడని సువర్ణము మట్టియగును. (అనగా మట్టివలె గోచరించును.) కనుక అజ్ఞానులకే బ్రహ్మ అజ్ఞానరూపముగ గోచరిస్తాడు– తత్త్వవేత్తలకట్లు గోచరించడు, తత్త్వవేత్తలు బ్రహ్మను బ్రహ్మనుగానే తెలిసికొంటారు– అపరిజ్ఞాతమయిన (తెలియబడని) బ్రహ్మయే "అజ్ఞానం" "అజ్ఞానం" అని అనబడుతుంది– బ్రహ్మ తెలియబడితే క్షణంలో ఆ అజ్ఞానం కాస్తా బ్రహ్మఅయి పోతుంది– బంగారమును బంగారముగ గుర్తిస్తే లోగడ అనుకొన్న మట్టి క్షణంలో బంగారం అయిపోతుంది– కనుక ఆత్మనే బ్రహ్మ– అతడు సర్వశక్తియుక్తుడు– జీవరూపంగా భావిస్తే జీవరూపంగానూ, జగద్రూపంగాభావిస్తే జగద్రూపంగానూ, లేక తాత్త్వికబ్రహ్మరూపంగా భావిస్తే బ్రహ్మగానూ, బ్రహ్మయే భాసిస్తాడు– ఇంతయెందుకు ? కొంతకాలం చూడకపోతే లోకంలో తనచుట్టమే పరాయివాడవుతాడు. మరల వానిని చుట్టమని తెలిసికొంటే క్షణంలో చుట్టమవుతాడు– కనుక ఇక్కడ జ్ఞానాజ్ఞానాలు ఎలాకారణాలో అలాగే బ్రహ్మవిషయంలోకూడా !

అయితే అందరకు జీవజగత్తులందు బ్రహ్మమాత్రభావన ఏల పుట్టటంలేదు ? అని శంక కలుగుతుంది– దానికి కారణాలు చాలా

ఉన్నాయి- చెబుతావిను. 1. ప్రపంచమందు వైరాగ్యం లేకపోవటం ఒకకారణం- జీవజగద్భ్రమాపము విచారసహము కాదని తెలిసికొంటె వాటియందు బ్రహ్మభావన కలుగుతుంది- లోకంలో శుక్తిరజతాదుల నుండి వైరస్యము ప్రసిద్ధము- అలాగే ప్రపంచంకూడా శుక్తిరజతాది తుల్యమనిగ్రహిస్తే భోగ్యమునుండికూడా విరక్తుడవుతాడు మానవుడు- అపుడు బ్రహ్మాత్మభావన కలుగుతుంది అతనికి- 2. దేహాది కార్య కారణ సంఘాతము నేనుకాదను జ్ఞానము లేకపోవడం రెండవకారణం. దేహాది కార్యకారణ సంఘాతము నేనుకాదను తెలివి కలిగితే బ్రహ్మ భావన కలుగుతుంది- "బ్రహ్మైవాహం" నేనే బ్రహ్మను అను నిశ్చయంవల్లకూడ ఆత్మభావన కలుగుతుంది- అఖండాకారబోధ కలిగిన తరువాత ఉన్న ప్రపంచంకూడా సదేకరసమగు బ్రహ్మస్వరూపమేకాని దుఃఖరూపంకాదు- కనుకనే సర్వం బ్రహ్మస్వరూపంగా గ్రహిస్తాడు అట్టిమానవుడు-

ఆస్థితిలో ఉన్నవాడికి దుఃఖంగోచరించదు- కర్మలు (పనులు) స్ఫురించవు- మోహముండదు- కోరికలుండవు- సర్వసముడుగానూ, స్వస్థుడుగానూ, శోకరహితుడుగానూ ఉంటాడు- "బ్రహ్మాహం" అను పరమార్థసత్యమయిన భావనమాత్రం విడిచిపెట్టడు వాణ్ణి- కల్పనా కలంకములన్నీ రూపుమాసిపోతాయి- నిరామయుడుగా ఉంటాడు- హేయోపాదేయములుండవు- 'నేనే రక్తము' 'నేనే మాంసము' 'నేనే ఎముకలు' 'నేనే శరీరము' 'నేనే చేతనము' 'నేనే బ్రహ్మను' 'నేనే స్వర్గము' 'నేనే సూర్యుడు' 'నేనే దిక్కులు' 'నేనే భూమి' 'నేనే ఘట పటాదులు' 'నేనే తృణము' 'నేనే పృథివి' 'నేనే లతాగుల్మాదులు' 'నేనే కాననాదులు' 'నేనే శైలసాగరములు' 'ప్రాణిసంఘంఅంతానేను' 'ప్రాణిధర్మములుకూడా నేనే' 'సర్వమూ చిదాత్మరూపము' సర్వ ప్రపంచము చిదాత్మాంతర్గతము' అతడే ఆనందఘనమగు పరబ్రహ్మము- ఎవనియందు సర్వము ఇమిడియున్నదో, ఎవనివల్ల సర్వము బయల్పడి

వదో, ఎవడు సర్వరూపుడో, ఎవనివల్ల సర్వము వృద్ధిచెందుచున్నదో, ఎవడు అద్వితీయాత్మ అని చెప్పబడినాడో, వాడే పరబ్రహ్మ అని నిశ్చయము— అతడే "చిదాత్మ, బ్రహ్మ, సత్, సత్యం, ఋతం, జ్ఞః" అను నామములచే చెప్పబడుచున్నాడు— ఇతడే సర్వవ్యాపకముయిన తత్త్వము— ఇతడే చైతన్యవర్జితుడు— ఆభాసమాత్రమయిన ప్రపంచం అంతా నిర్మలమయిన చిద్బ్రహ్మ అని బ్రహ్మవేత్త అనుభవము— సర్వప్రాణులకు మనోబుద్ధీంద్రియవృత్తులు వేరు— అనగా ఎవరి మనస్సు వారికి వేరు— ఎవరిబుద్ధి వారికి వేరు— ఎవరి యింద్రియాలు వారికి వేరు— అయినా వాటివృత్తులందు అనుగతమయిన చైతన్యం ఒక్కటే కాని వేరు కాదు— ఆ చైతన్యమే బ్రహ్మ— ఆ బ్రహ్మమే నేను— శబ్దస్పర్శాది తన్మాత్రలకూ తత్కారణములయిన పంచభూతాలకూ, ఈ రెంటివలన ఏర్పడిన ప్రపంచస్థితికి సత్తాప్రకాశలను కలిగించెడి బ్రహ్మను నేను— లోకంలో జీవరూపంగా బయలువెడలిన చిద్ధారలకు గనియయిన చిద్ఘన బ్రహ్మను నేను— మానుషానందము మొదలు హిరణ్యగర్భానందము వరకు నుండు ఆనందములకంటె కూడ ఉత్తమమయిన అఖండానంద స్వరూపబ్రహ్మను నేను— రసనాది ఇంద్రియములు ఖండశర్కరాదుల యందున్న పరిచ్ఛిన్నమయిన స్వాదుత్వమునే గ్రహించగలవు— అచ్చట సర్వప్రపంచాధిష్ఠానమయిన బ్రహ్మయొక్క స్వరూపానందమే ఉపాధి సంబంధముచే పరిచ్ఛిన్నమయిఉన్నది— ఆ ఉపాధులుకూడ స్వప్రకాశ ఆనందైకరస బ్రహ్మస్వరూపములని గ్రహిస్తే పరిచ్ఛిన్నములయిన ఉపాధులు నశించినా ఆనందముమాత్రం చ్యుతి (నాశము) లేనిదై నిరతిశయమగును— అట్టి నిరతిశయానంద బ్రహ్మను నేను— నేలమీదనున్న మానవుని దృష్టి ఆకాశమున వెలిగెడి చంద్రబింబమునందు ప్రసరిస్తే అపుడు ఆమానవుని నేత్రేంద్రియముద్వారా బయలువెడలిన చైతన్యము చంద్రమండల ప్రదేశమునకు లోగడ ఆకాశప్రదేశమునందు నిర్విషయము (నిరుపాధికము) గానే యుండును— అట్టి నిరుపాధిక చైతన్యమే నేను— ఉదాసీనులకు సుఖదుఃఖాద్యాకారవృత్తులు లేనిదశలో

నిరుపాధికముగు ఆత్మప్రకాశము ప్రసిద్ధము- అలాగే ఇచ్చోటనున్న మానవునియొక్క మనస్సు ఎచ్చటో చాలదూరము నందలి వస్తువు మీద వ్యాపించి యుండును. అప్పుడు యీ మనోవృత్తి ద్వారా ఇతని ఆత్మచైతన్యము ఇతని మనఃప్రదేశమునుండి దూరస్థవిషయపర్యంతము వ్యాపించియున్నదనాలి- అట్టి చైతన్యమునకు మధ్యమార్గంలోనున్న పదార్థములతో సంబంధంలేనందున మార్గమధ్యమందు అయ్యాది (ఆచైతన్యము) నిర్విషయము (నిరుపాధికము) అనకతప్పదు- పైయుక్తి ననుబట్టి పరమార్థంలో ఆత్మచైతన్యం నిరుపాధికమని తేలింది-

ఇలాంటి నిరూపాధికచైతన్యమే తాను అను నిశ్చయముండును బ్రహ్మవేత్తలకు- నేల, నీరు, గాలి, విత్తనము, వీటికి పరస్పరసంబంధం ఉంటే అంకురమనే కార్యము పుట్టును. అట్టి అంకురమను కార్యమును పుట్టించెడి శక్తియే బ్రహ్మము- ఆబ్రహ్మమే నేనను నిశ్చయం బ్రహ్మవేత్తలకుండును- ఖర్జూరాది ఫలములలోనున్న స్వాదుసత్త (రుచి యొక్క యునికియే) చిత్బ్రహ్మ- ఆబ్రహ్మమే నేను అను నిశ్చయముండును బ్రహ్మవేత్తలకు- ఇష్టవస్తువు లభించినపుడు ఆనందముతో కూడిన సంవిత్తును, అది లభించనపుడు ఖేదముతో కూడిన సంవిత్తును ఉండును- అదే సంవిత్తు మనన నిదిధ్యాసలచే శోధనచేసే శుద్ధచైతన్యమవును- అదే బ్రహ్మము- అట్టి బ్రహ్మమే నేనను నిశ్చయముండును-

భూమిమీదనుండి సూర్యునిజూచువాని కన్ను (దృష్టి) భూమినుంచి సూర్యుని పర్యంతము వ్యాపించియుండగా నేత్రమునకూ సూర్యుడికీ మధ్యనుండు భాగమున చైతన్యమునకు నేత్రమూ ఉపాధికాదు, సూర్యుడూ ఉపాధికాడు- ఆభాగమునయుండు చైతన్యము నిరుపాధికమనక తీరదు- అలాగే విషయములను ప్రకాశింపచేసెడి చైతన్యము కూడ నిరుపాధికమే- అలాంటి నిరుపాధిక చైతన్యమే నేను-

జాగ్రదాద్యవస్థాత్రయమునకు సాక్షియగు తుర్యబ్రహ్మనే నేను. అనేక క్షేత్రములలో పుట్టిన చెరకుగడలన్నిటియందును తీపితనము

సమానముగా నున్నటుల మానవులందరియందును సమానముగా నుండు చిద్రూపబ్రహ్మమే నేను. సూర్యునికాంతి అంతటా సమానముగా ప్రకాశించినట్లు, ప్రపంచమంతటా సమానాకారముగా ప్రకాశించెడి చిత్ప్రకాశబ్రహ్మమే నేను- సంభోగానందలవము వారివారికి మాత్రమే అనుభవమాత్రంచేతనే గోచరమగును- అమృతముయొక్క ఆస్వాదము (రుచి) కూడ అనుభవమాత్రగోచరమే యగును- అట్లే అనుభవ మాత్రగోచరమగు చిద్బ్రహ్మను నేను- బిసము (తామరఖండము)నందు దారములున్నట్లు దేహమునందంతట పడుగుపేకరూపముగ వ్యాపించి యుండి దేహము భిన్నమయినను, దేహము భిన్నమయినను, స్ఫురించెడి చిద్బ్రహ్మను నేను- లోకములన్నింటిని వ్యాపించియున్నను, జీవాణువులనే కల్పితాకారముగల అనుభూతి మాత్రసారముగల చిద్బ్రహ్మను నేను- క్షీరమునందు ఘృతమున్నట్లు అనుభూతి, ప్రేమలు, రెండును లోన ఇమిడియున్న చిద్బ్రహ్మను నేను- పదార్థజాలము యొక్క బాహ్యాంతర్భాగములందు సత్తాసామాన్యరూపంతో నున్న చిద్బ్రహ్మను నేను- అనుభవ వృత్తి భేదములన్నిటికీ ఆదర్శమై మల లేఖలకు అగమ్యమయిన చిత్తత్త్వమే నేను- సర్వసంకల్పములను ఫలింపజేయుచు, సర్వతేజస్సులను ప్రకాశింపజేయుచు, ఉపాదేయములన్నిటికి పరమావధియగు చిదాత్మను నేనుపాసించుచున్నాను- అవయవరహితుడయినను సర్వావయవములందును విశ్రమించి యెల్లపుడు ప్రకాశించుచున్న చిదాత్మను నేను ఉపాసించుచున్నాను- ఘటపటాదులందంతటా సద్రూపముతో నున్నట్టియు జాగ్రదవస్థయందుకూడా నిద్రించినవానివలె నున్న నిర్విశేషముగానున్న చిదాత్మను నేను- అగ్నియందు ఉష్ణరూపముగాను, హిమమునందు శీతముగాను, అన్నమునందు మృష్టరూపముగాను (మాధుర్యరూపముగాను) క్షురమందు (కత్తియందు) తీక్ష్ణరూపముగాను, ధ్వాంతమందు (చీకటియందు) కృష్ణ (నలుపు) రూపముగానూ, చంద్రునియందు తెలుపురూపముగాను, ఉన్న చిదాత్మను ఉపాసించుచున్నాను- స్వయంప్రకాశరూపుడు- బహిరంతర్వ్యాపకుడు- అదిూరు

డయినను దూరస్థునివలె నుండువాడు— ఇలాంటి చిదాత్మను ఉపాసించుచున్నాను— మధురవస్తువులందు మాధుర్యరూపముతోను, తీక్ష్ణవస్తువులందు తైక్ష్ణ్యరూపముతోను, ఇట్లు సకల పదార్థములందును ఇమిడియున్న చిదాత్మను ఉపాసించుచున్నాను— సర్వసంకల్పరహితుడును, విషయాభిలాషలకు దూరుడును, క్రోధరహితుడును అగు చిదాత్మను ఉపాసించుచున్నాను— కామరహితుడు, క్రోధవర్జితుడు, ప్రయత్నశూన్యుడు, చేష్టారహితుడు, నిరంశుడు, నిరహంకారుడునగు చిదాత్మను నేనుపాసించుచున్నాను— సర్వపదార్థములందును లోపలనుండి సర్వపదార్థములకును ఆవలివాడై ప్రతిబింబచైతన్యముతో అంతులేని పనులను ఆరంభించెడి చిదాత్మను ఉపాసించుచున్నాను— త్రైలోక్యమునందలి దేహములనే ముత్యములకు తంతుప్రాయమై యుండి, జాగ్రత్స్వప్నసుషుప్తులను కలిగించెడి చిదాత్మను నేను ఉపాసించుచున్నాను— లోపలా వెలుపలా తనచే వ్యాప్తమైయున్న లోకములనే పక్షులను లోపలనుంచుకొని ప్రచ్ఛన్నముగానున్న చిదాత్మను ఉపాసించుచున్నాను— సృష్టికాలంలో సద్రూపుడునూ, ప్రళయకాలంలో అసద్రూపుడునూ, చిదేకరసుడునూ, సుఖలవములకు ఆస్పదుడునూ, సర్వాకారములతో విహరించెడివాడునూ, అగు చిదాత్మను నేనుపొందాను— నిరుపాధికమగు ప్రేమకు ఆధారమయినట్టియు, దేహాదిజడాధ్యాసలతో చెడిపోనట్టియూ, భ్రాంతదృష్టిలో అధ్యాసాయుక్తుడునూ, తత్త్వదృష్టిలో అధ్యాసారహితుడునూఅగు చిదాత్మను ఉపాసించుచున్నాము. హృదయమనే సరస్సులోని తామరతీగయొక్క దుంపవలె గూఢముగానున్నట్టియు, హస్తపాదాద్యవయవములకు దృఢవిష్టంభకమగు (గట్టిగా కట్టుటకాధారమయిన) రజ్జువువలె నున్నట్టియు, జనసమూహమునకు జీవనోపాయమగు చిదాత్మను పొందానునేను— పాలసముద్రమునందు బుట్టనట్టియు, కళంకములేనట్టియు, అపహరింపసాధ్యముకానట్టియు, అమృతమయమయిన చిదాత్మను ఉపాసించుచున్నాము— శబ్దస్పర్శరూపరసగంధములతో రహితమయినట్టియు, శబ్దస్పర్శాదులచే అభి

వ్యక్తమగు చిదాత్మను మేము పొందితిమి. ఆకాశమువలె అతివిశదమయినట్టియు, సకల ప్రపంచమునకు అభివ్యంజకమయినట్టియు, తత్త్వదృష్టిలో రంజకమూ కాక, ఆకాశమువలె విశదమూ (నిర్మలమూ) కాని చిదాత్మను నేను పొందాను- మహామహిమాశాలి నిజంలో ఏ మహిమా లేదు- కర్తృత్వం ఉన్నట్లు కనిపిస్తున్నా నిజంలో కర్త కాదు అట్టి చిదాత్మను పొందాను-

తాదాత్మ్యధ్యారోపదృష్టిలో ఈ ప్రపంచం అంతా నేను- సంసర్గాధ్యారోపదృష్టిలో అంతా నాది- అపవాదదృష్టిలో అహంకారము కూడా నేను కాను- తదితరము బొత్తిగా నేను కాను- ఇలా అధ్యారోపాపవాదములచేత తత్త్వం తెలిసికొన్న నాకు ప్రపంచకృత్యము మాయామయము అగుగాక- లేక పరమార్థమయిన ఆత్మస్వరూపమే అగుగాక- ఎట్లయినను నేను గతజ్వరుడను- నాకు సంసారబాధ లేదు-

## ౧౨. జీవన్ముక్తసంశయనిరూపణము.

వసి॥ రామా! ఇలాంటి నిశ్చయంచేత, ఆ మహానుభావులు (జనకాదులు) పరమార్థసత్యమయిన శోధిత తత్పదార్థమందు సుఖంగా ఉండిపోయారు- వాళ్ళందరూ పరిపూర్ణజ్ఞానులు- సర్వసములు- విరాగులు- వాళ్లు మరణాన్ని నిందించరు- జీవితాన్ని మెచ్చుకోరు- రెండూ సమానమే వాళ్ళకు- వాళ్ళ నడవడిలోని చమత్కారం గుర్తించడానికి సాధ్యంకాదు- స్థావరాకారమును విడిచి, ఋజుభావము నాశ్రయించి సంచరించే అపర మేరుపర్వతములవలె ఉంటారు వాళ్లు-

వారు వనఖండములలో చరిస్తారు- ద్వీపములలో విహరిస్తారు- నగరములలో తిరుగుతారు- దేవతలవలె స్వర్గలోకంలో సంచరిస్తారు- కుసుమపూర్ణములయిన వనపంక్తులూ, శిలామయమయిన మేరుశృంగశిఖరములూ, వాళ్ళకు సమానములు- శత్రుజయం చేసికొని రాజ్యాలు ఏలుతారు- శిష్టాచారప్రాప్తమయిన ధర్మాలనూ ఆచరిస్తారు- శ్రుతి

స్మృత్యుక్తమయిన క్రతువులను సాంగంగా అనుష్ఠించారు- రమణీయము లయిన భోగభూములలో ప్రవేశించారు- అప్సరస్త్రీల గానంతో తుల దూగే నందనోద్యానభూములలో విహరించారు- నిఖిలజంతువులను సుఖపరచెడి యజ్ఞక్రియా కలాపాలలో గార్హస్థ్యాశ్రమాలలోనూ ప్రవే శించారు- భేరీభాంకారములచే అతిభయంకరమయిన రణరంగములను నిస్తరించారు- (దాటారు.) శత్రువులవల్ల ఓడిపోయి ఆపదలనుభవిం చారు- ఎన్నిజరిగినా వారిమనస్సు విరాగము- నిరుపాధికము- గత భ్రమము- అసంసక్తము- ఆశావిరహితము- శుద్ధసాత్త్వికము- ఎంతటి మహత్తర సంకటాలలోకూడా వాళ్లు మునగలేదు- వేనికీ తొణకలేదు- కులశైలములు నదీప్రవాహాలకు కదలవు- పరిపూర్ణ చంద్రకాంతికి జలరాశి (సముద్రుడు) పొంగినట్లు, విలాసవతియగు లక్ష్మిని జూచి ఉప్పొంగలేదు- దుఃఖశోకాలచే ఖేదపడలేదు- భోగపుంజాలకు ఆనం దించలేదు- కర్తృత్వాభినివేశ రహితులై కామభోగములను అనుభ వించుచున్ననూ, ఇష్టానిష్టఫలములను అభిలషించలేదు- వద్దని విడిచి పెట్టనూలేదు- మోహహేతువులగు కష్టాలలో వ్యామోహం చెంద లేదు- ఆపద లాక్రమించినా అందులో మునగనూలేదు- రామా! నీవలెనే శుభములకు ఆనందించలేదు- దుఃఖాలకు ఏడ్వలేదు- తమతమ కులోచితమయిన ఆచారాలు సంప్రాప్తమయినపుడు వానిని నెరవేర్చు కుంటూ, నిరాడంబరంగా నిశ్చలంగా ఉండేవారు- రామా! నీవుకూడా వాళ్ళదృష్టినే అవలంబించి, శుద్ధచైతన్యము నందాత్మబుద్ధి గలవాడవై సంచరించు- ఈసృష్టి పరంపరయొక్క పరిస్థితిని గుర్తించి భ్రాంతి చెందక, మేరువువలె స్థిరుడవుగా నుండు- సముద్రునివలె గంభీరంగా ఉండు- చిన్మాత్రమే (చైతన్యమే) ఇలా సర్వప్రపంచ రూపంగా ఆభాసచెంది కనిపిస్తోంది- ఇందులో సత్యమూలేదు- అసత్యమూలేదు- నీవుమాత్రం బ్రహ్మతత్త్వమును అవలంబించి, ప్రపంచాన్ని తృణీకరించి, అంతటా అసక్తుడవై ఉండు- భవబంధరోగం నశిస్తుంది- మూఢుని వలె నీకు దుఃఖమెందుకు? పరితాపమెందుకు? సుడిగుండంలో గడ్డి

పరకలాగ ఈ సంసారంలో ఎన్నాళ్ళుతిరిగితే మాత్రం ఏంలాభం ఉంది ? అన్నారు వసిష్ఠులు- విన్నాడు- రాముడు-

శ్రీరా॥ స్వామీ ! మీయనుగ్రహంచేత నేను ప్రబుద్ధుణ్ణి అయ్యాను- అజ్ఞానమలం అడుగంటింది- ప్రపంచభ్రాంతి రూపు మాసింది- నా సందేహాలన్నీ పటాపంచలయ్యాయి- మీయాజ్ఞ తప్పక శిరసావహిస్తాను- మీరు చెప్పినట్లు చేస్తాను- ఇంక ఏమాత్రం సందేహంలేదు- అన్నాడు శ్రీరాముడు-

శిష్యుడు॥ గురూ ! ఇందులో వసిష్ఠులు- "స చరాచరభూతేషు విశ్రాంతాఖిలజంతుషు యజ్ఞక్రియాకలాపేషు" అని నిఖిలజంతువులు యజ్ఞక్రియాకలాపాలలో సుఖిస్తారంటారే ? ఏమిటది. వానిలో ఏమి సుఖముంది ?

గురు॥ శిష్యా ! ఇదా నీసందేహం- "యథైవ క్షుధితా బాలా మాతరంపర్యుపాసతే। ఏవం సర్వాణి భూతాని అగ్నిహోత్రముపాసతే" ఆకలికొన్న బాలురు తల్లిని సేవించినట్లు నిఖిల భూతములు అగ్నిహోత్రుని సేవింతురు- అని ప్రమాణంఉంది- కాబట్టి అలా అన్నారు వసిష్ఠులు- ఇందులో పెద్దగా సందేహించ తగినంతపనిలేదు-

## ౧౩. వాసనాక్షయమునకు ప్రాణనిరోధాత్మక యోగమునుపదేశించుట- లేక యోగోపదేశము.

ఉపశమప్రకరణంలో, వాసనాక్షయమునకు, జ్ఞానమూ, యోగమూ అని క్రమములు ఉపదేశించబడ్డాయి- అందు జ్ఞానము ఉత్తమాధికారి విషయము- యోగము మందమధ్యమాధికారాది విషయము- వీనిలో జ్ఞానంచేత వాసనాక్షయమగు విషయమును విని శ్రీరాముడు మధ్యమాధికారుల యుపయోగంకొరకు యోగమార్గంచేత వాసనాక్షయమగు మార్గమును అడుగుచున్నాడు-

శ్రీరా॥ స్వామీ! సమ్యగ్జ్ఞానంచేత వాసనాక్షయం కలిగి జీవన్ముక్తస్థితిలో ఉన్నాను నేను- ఇంక ప్రాణస్పంద నిరోధంచేత వాసనావిలయం కలిగి జీవన్ముక్తస్థానంలో ఉండేది ఎలాగో చెప్పండి? అని అడిగాడు రాముడు- వసిష్ఠులు జవాబిస్తారు-

వసి॥ రామా! సంసారోత్తరణమునకు ఉపాయభూతమగు మార్గము యోగమని అంటారు పెద్దలు- అది రెండురీతులు- ఒకటి జ్ఞానము- రెండు ప్రాణసంరోధమగు యోగము- అని ఇందు ఏరీతిని అవలంబించినా మనశ్శాంతి కలుగుతుంది-

శ్రీరా॥ మహర్షీ! అయితే ఈరెంటిలో ఏదిసులభం? ఏది క్లేశ రహితం! దేనిని ఆచరిస్తే మరల చిత్తవిక్షేపం కలగకుండా ఉంటుంది? సెలవివ్వండి అన్నాడు రాముడు-

వసి॥ రామా! ఈరెండు మార్గాలకు యోగమనే పేరుఉంది- కాని ప్రాణనిరోధమునందే యోగమనునది నిరూఢమయింది గట్టిగా- సంసారోత్తరణంలో యోగమూ, జ్ఞానమూ, అని రెండు ఉపాయాలు చెప్పబడ్డాయి- ఈరెండూ సమానములే- ఒకే ఫలాన్ని సాధిస్తాయి రెండూ- కాని కొందరకు యోగం అసాధ్యం- కొందరికి జ్ఞానం అసాధ్యం- నా అభిప్రాయంమాత్రం జ్ఞానయోగమే సుసాధ్యమని- అనగా సుకుమారమయిన చిత్తం గలవానికి ప్రాణసంరోధమనే హఠయోగం అసాధ్యం- విచారకుశలుడుకాని కఠినచిత్తునకు తత్త్వనిశ్చయమనే జ్ఞానయోగము అసాధ్యము- శుద్ధచిత్తుడగు విచారకుశలునకు జ్ఞానయోగమును సుసాధ్యమని నా అభిప్రాయం- కాబట్టి జ్ఞానం అంటే ఏమిటో అజ్ఞానంఅంటే ఏమిటో ఆరెంటియొక్క స్వరూపం తెలిస్తేకాని విచారకుశలత కలగదు- అజ్ఞానము ఎల్లపుడు సాక్షిచైతన్యముచే అనుభవింపబడుతూ ఉంటుంది- జ్ఞానమనేది స్వప్రకాశము- స్వతఃప్రసిద్ధము- కనుక ఈరెంటికీ వైధర్మ్యమనేది అనుభవంలోనే ప్రసిద్ధమయిఉంది- కనుక జ్ఞానాజ్ఞానములకు వివేకము (భేదము) సులభంగా తెలుస్తూ

ఉన్నందువల్ల జ్ఞానం సుకరము- యోగము అలాసుకరము కాదు- మరియు ప్రశస్త ప్రదేశమునూ, ప్రశస్త కాలమునూ, ప్రశస్తవిషయాదులనూ, అపేక్షించి యుండుటచేతకూడా యోగము దుష్కరము- అయినా శాస్త్రసిద్ధములయిన ఉపాయములలో సౌకర్యాసౌకర్య విచారణ పనికిరాదు- జ్ఞానము, యోగము అని రెండుమార్గాలు శాస్త్రమునందు చెప్పబడినవి- అందు జ్ఞానయోగమును నీకు ఉపదేశించాను ఇపుడు ప్రాణాపానములను సమానస్థితిలో నుంచుటతో ప్రసిద్ధమయి ఖేచరత్వాది అనంతసిద్ధుల నొసగుచు సాక్షాత్కార హేతువగు యోగమును జెప్పెదవినుము- దానిని ఆచరించికూడా నీవు నిరతిశయానంద రూపుడవు కాగలవు-

## ౧౮. భుశుండోపాఖ్యానము - మేరుశిఖర వర్ణనము.

వసి॥ రామా ! ఈ ప్రపంచ పరిస్పందము (బ్రహ్మాండాకారమయిన వివర్తము) ఆ పరమాత్మయందు మరుభూమియందు మృగతృష్ణిక వంటిది- అందుకు నిమిత్తభూతుడు మాతండ్రియగు కమలసంభవుడు- అతనికి నేను మానసపుత్రుడను- నా పేరు వసిష్ఠుడు- నాచేష్టలు శ్రేష్ఠములు- నేనొకానొకపుడు సప్తర్షిలోకమున వైవస్వతమన్వంతరమునుగూర్చి నిరీక్షించుచున్నాను- ఒకానొకపుడు దేవేంద్రుని ఆస్థానమునకు వెళ్ళితిని- అచ్చట నారదాది మహామునులు చిరజీవులయొక్క (చాలకాలము బ్రతికిన వారలయొక్క) కథలను చెప్పుచున్నారు- ఆప్రసంగంలో శాతాతపుడను ఒకమహాముని ఇలా అన్నాడు-

"మేరుపర్వతమునకు ఈశాన్యవైపున పద్మరాగమణి వికారమయిన నొకశిఖరమునందు "చూతము" అను పేరుతో ప్రసిద్ధమయిన కల్పవృక్షము ఒకటిఉన్నది- ఆచెట్టుయొక్క దక్షిణవైపు స్కంధపుతొర్రలో ఒక పక్షిగూడు కలదు- అందులో భుశుండమను వాయసమొకటి (కాకి) నివసించుచున్నది- దానికి రాగద్వేషాలులేవు- దీర్ఘాయువు- మహాదొడ్డబుద్ధికలది- ప్రశాంతమయిన మతికలది- త్రికాల

జ్ఞానము కలదు దానికి— అది బ్రతికినంతకాలము స్వర్గలోకంలో దేవతలు కూడా ఇదివరకెవ్వరూ బ్రతకలేదు— ఇకముందెవ్వరూ బ్రతకపోగు— అది బ్రతికినంతకాలము లోకంలో ఎవ్వరయినా బ్రతికేయడల వారి జీవితము చాలాదీర్ఘమయినదీ, పుణ్యమయినదీ, పరమపురుషార్థయుక్తమయినదీ కాగలదు—(అగుగాక) అని అన్నాడు శాతాతపుడు మాతో—

మేము మాటిమాటికి ఎన్నిసారులడిగినా ఆభుశుండుని గూర్చి అలాగే చెప్పాడు అతడు— అది దేవసభకనుక అతడు అబద్ధం(అనృతం) చెప్పడనే నమ్మిక కలిగింది మాకందరకు— అంతకొంతసేపటికి ఆకథా ప్రసంగం ముగిసింది— దేవతాబృందం వారివారి తావుకు వెళ్ళింది— నాకు ఆభుశుండమును చూడ కుతూహలం కలిగింది— నేనా మేరుశిఖరమునకు బయలుదేరాను— క్షణకాలంలో పద్మరాగమయమయిన ఆశిఖరం చేరాను— రత్నములతోనూ, గైరికధాతువులతోనూ మహామనోహరంగాఉంది ఆశిఖరం— నిప్పువలె ప్రకాశిస్తోంది— కల్లుగొయొక్క రసం త్రాగినవాని కండ్లను యెఱ్ఱపరచినట్లు దిక్కులను ఎఱ్ఱపరచుచున్నది ఇది— ప్రళయకాలాగ్నిజ్వాలలు రాశిఅయి ఈపర్వతాకారాన్ని చెందినవా ఏమి అన్నట్లున్నది— ఇందనీలమణులకాంతులు పైకి ప్రసరించి పొగలవలె అగపడుచున్నవి— ఇతరమణుల కాంతులతో ఆకాశంఅంతా ఎఱ్ఱనైపోయింది— వర్ణనాతీతంగా ఉంది దానిసొంపు—

౧౪—౧౫. భుశుండదర్శనము. (వసిష్ఠ భుశుండసమాగమము)

ఆశిఖరముయొక్క శిరోభాగమున అతివిచిత్రమయిన శాతాతపుడు చెప్పిన చూతతరువును చూచానునేను— దాని కొమ్మల గుబురులో పూగుత్తులచాటున దాగియున్న పక్షులుకొన్ని నాకంటపడినవి— అందులో కొన్నిహంసలు— కొన్ని చిలుకలు— కొన్ని మయూరములు— కొన్ని అంబరపక్షులు— కొన్ని భరద్వాజపక్షులు— కొన్ని కలవింకములు— గృధ్రములు— కోకిలలు— క్రౌంచపక్షులు— కుక్కుటములు— (కోళ్లు) భాసపక్షులు (         ) చాషపక్షులు (         ) బెగ్గురుపక్షులు—

ఈ మొదలయిన ప్రాణిసంఘమును అంతా చూచాను నేనా చెట్టుమీద- తనువాలి కొంతదూరంగా ఆచెట్టు స్కంధమునొక్క దక్షిణపువైపు కొమ్మమీద పూలగుత్తులచాటున కాకులగుంపు కనిపించింది- ఆవంకకు చూస్తూ ఉండగా ఆస్కంధమునొక్క తొర్రలో ఆ కాకులమధ్యగా శాతాతపుడు వర్ణించిచెప్పిన భుశుండమను వాయసము ప్రత్యక్షమయింది నాకు గాజముక్కలమధ్య ఇంద్రనీలమణివలె- నేనును దాని కంటబడ్డాను- ఆకాకులగుంపు కొంచెం బెదిరింది- నారాకకు కారణము లేకున్నా నేను వసిష్ఠుడనని గుర్తించింది ఆ భుశుండము- మధురాక్షరములతో నాకు స్వాగతమును చెప్పినది- తాను స్వయముగా ఆసనమును తెచ్చి యిచ్చింది నాకు- నేనా భుశుండునితోడ కూడ కూర్చున్నాను ఆసనముమీద- భుశుండుడు అర్ఘ్యపాద్యాదులతో పూజించాడు- సంతసించాడు- మధురోక్తులతో ఇలా అన్నాడు నాతో- "మహాత్మా మీరు పరిపూర్ణానుగ్రహించినారు నామీద- మీ దర్శనామృతసేకముతో మేము స్నానమాడాము- చిరకాలార్జితమయిన పుణ్యాతిశేషంచేత లోకమాన్యమాన్యులగు మీరు మాకడకు రాగలిగారు- ఎచ్చోటనుంచి వచ్చుచుంటిరో తెలియకున్నది- మహాజ్ఞాన కార్యమయిన యీ ప్రపంచంలో సంచరించే మీచిత్తంలో సర్వసమభావమే అఖండితంగా ఉంటుంది- అయినా తమరాకకు కారణమును తెలిసికొనగోరిక మాకునిండాకలదు- సెలవివ్వండి- మునీంద్రా! మీ పాదదర్శనమువల్లనే నాకు విషయంఅంతా అవగతమయింది- మీరాకచే మేము కొంతపుణ్యాత్ములమైతిమి- చిరంజీవులకొక్క ప్రసంగంలో మేము మీకుతలపుకు వచ్చితిమి- అందుచే మీరిచ్చోటని పాదధూళిచే పవిత్రమొనర్చినారు- మీరాకకు కారణం నాకు తెలిసింది- అయినా మీవాగమృతమును ఆస్వాదింపగోరి నేను మిమ్ముల నిట్లడిగితిని-" అని అన్నది త్రికాలవేదియగు భుశుండమునాతో- అదివిని నేనాభుశుండముతో ఇలా అన్నాను- "ఓ పక్షిరాజా! నీవన్నది నిజము- చిరంజీవియగు నిన్నుచూచుటకే నేనువచ్చాను- ప్రశాంతాంతఃకరణయగు

నీవు కుశలమా ! నీవు భయంకరమగు సంసారవాగురను (వల) లో పడలేదు. నాకీసందేహంతీర్చు. "నీకుశలమేది ? నీవు ఆత్మతత్త్వమును ఎలా తెలిసికున్నావు ? నీకు ఆయుర్దాయమెంత ? నీయొక్క లోగడి వృత్తాంతం నీకు జ్ఞాపకమేనా ? ఈవృక్షమును ఆశ్రయించి ఉండుటకు కారణమేమి ? ఈవిషయాలు నాకు నిజంగా చెప్పు"అని అడిగాను నేను-

భుశుం॥ మునిసత్తమా ! మీరడిగిన దంతయు యథార్థతథంగా చెబుతాను- సావధానంగా వినండి- మీలాంటివారలు వినెడికథలు చెప్పెడి వారలయొక్కయు, వినెడివారలయొక్కయు, పాపములను పారద్రోలును- కనుక దయచేసి వినండి అని అన్నాడు భుశుండమునితో-

### ౧౭-౧౮. మాతృవ్యవహారవర్ణనము.

భుశుం॥ స్వామీ ! లోకంలో సకలదేవతలకు ఉపాస్యుడగు హరుడను గొప్పవాడుకలడు- హైమవతి ఆతనికి అర్థాంగి- చంద్రుడు చూడామణి- కాలకూటము కంఠాభరణము- మాయాశబలబ్రహ్మ-తనివంటిమీఁదిభస్మ- హిరణ్యగర్భాగులశిరాలు ఎముకలు- చంద్రుడనే సుధ (సున్నము) తో కడగబడి (అమృతముతో తడుపబడి) నల్లని మేఘములు అంచులుగాగలిగి నక్షత్రములనే ముక్కలతో చిత్రిచిత్రంగాఉండే ఆకాశం అతనికి వస్త్రం- శ్మశానము గృహము- సప్తమాతలు బంధువులు- భుజగములు (పాములు) కంకణములు- దృష్టిప్రసారంచేత కులశైలాలను తగలపెడుతూ ప్రపంచాన్ని మ్రింగజూచే భయంకరమయిన చరిత్రము అతనికి విలాసచేష్ట- కరస్పందము అసురక్షయము- ప్రమథగణములు క్రీడాసహాయులు- కులమాతలు పరివారము- శవముల హస్తపాదాద్యవయవములు పూలమాలలు- జయవిజయ అను అష్టమాతలు కులదేవతలు- చాముండాది శతకోటిమాతలలో ఈ యెనమండుగురు ప్రధానులు- వీరిని అనుసరించి ఉండేవారే మిగిలిన వారందరు- ఈ అష్టమాతలు చాలా గొప్పవారు- అందులో

“అలంబుసా అను నామె ప్రసిద్ధురాలు- ఈమె ఏడవది- ఈమెకు చండమను కాకము వాహనము- ఈ అష్టమాతలు ఒకానొకప్పుడు ఏదో కారణంచేత సమావేశమై తుంబురు” అను రుద్రుని ఆశ్రయించి గొప్ప ఉత్సవంచేశారు- జగత్పూజ్యులయిన తుంబురు భైరవులను పూజించారు- మదిరాపానమత్తులై విచిత్రమయిన కథాగోష్ఠిలో దిగారు-

ఆగోష్ఠీ ప్రసంగంలో “మమ్ములను ఉమాపతియగు రుద్రుడు ఎందుకు అవమానించుచున్నాడు? మళ్ళీమెప్పుడూ అవమానపరచకుండ ఉండులాగున మనప్రభావం చూపుదాం” అని నిశ్చయించుకున్నారు- రుద్రశక్తిని వశపరచుకుని మంత్రోదకంతో ప్రోక్షించారు- మాతృ మండల మధ్యస్థమయిన ఆ ఉమను శపించారు- భక్ష్య, భోజ్య, లేహ్య, పేయ, రూపురాలగునట్లుగా- ఆ రోజు వాళ్ళకు గొప్ప ఉత్సవరోజు- నృత్యగేయాలతో మనోహరంగా ఉంది ఆరోజు- అత్యానందంతో మారుమ్రోగిపోయింది ఆకాశం- కొంతమంది అరచుకుంటూ చప్పట్లు కొట్టుకుంటూ నవ్వారు- మరికొంతమంది కొండగుహాలు దద్దరిల్లిపోవులాగ పాటలుపాడారు- మరికొంతమంది తలకాయ మొదలుకొని అరికాలివరకు మంచిగంధం పూసికొని మద్యపానం చేశారు. వారిచ్చవచ్చినట్లు మధుపానమత్తులై ఉన్మత్తచేష్టలు చేశారు-

## ౧౯. ఆలయులాభము.

ఇలాంటి ఉత్సవసమయంలో సరస్వతీదేవికి సంబంధించిన రథహంసలు (ఆడువి) అలంబుసయను నామెకు వాహనమగు “చండ” అను పేరుగల కాకమున్ను ఒకచోటచేరి నాట్యమాడారు- మద్యపానం చేస్తూ నాట్యంచేసే ఆ ఆడహంసలకు సముద్రపు వేలాప్రాంతమున అనురాగము కలిగింది- మధుపానంచేత మదించిన ఆ ఆడహంసలు వాని కంటె నీచజాతిలోని కాకితో కూడా రమించాయి- ఏడుకులహంసలకు

భర్తయగు ఈవాయసం క్రమంగా ఒక్కొక ఆడహంసకోరిక తీరునట్లుగా రమించింది— పిమ్మట ఆ ఆడహంసలు గర్భమును ధరించాయి— రతికి సంతోషించాయి— మాతృదేవతలు నాట్యంచాలించి సుప్రశాంత మయిన రుద్రునిచేరారు— చతుర్విధాహారరూపమును చెందిన పార్వతిని ఈశ్వరునకు భోజనముకొరకు సమర్పించారు— తన భార్యను తన కాహా రంగాచేసి సమర్పించారని తెలిసికొని కోపించాడు శశిశేఖరుడగు ఈశ్వ రుడు— అంతట ఈమాతృగణము తమతమ అవయవములనుండి ఒక్కొక అవయవమును నిర్మించి పార్వతిని తయారుచేసి తిరిగి ఆయన (శివుని) కిచ్చి విధివిధానముగ పాణిగ్రహణము చేశారు. అంతట మాతృ దేవతలూ, ఈశ్వరుడూ తమతమ పరివారంతో సంతోషపూర్వకంగా యథాస్థానాన్ని చేరారు— ఓ వసిష్ఠమహాముని! ఆ ఆడహంసలు ఏడును గర్భం ధరించాయి— జరిగిన వృత్తాంతమంతా బ్రహ్మపత్ని (సరస్వతి)కి యథాతథంగా చెప్పినవి—

బ్రాహ్మీదేవి॥ "ఓగర్భధారిణులయిన హంసలారా! మీరు ఇంక నాకు రథకర్మయందు తగదు— మీయిష్టానుసారంగా సంచరించండి"— అని చెప్పి సరస్వతీదేవి నిర్వికల్పసమాధిలో ఉండిపోయింది— ఈరాజ హంసలు గర్భాలసలై విష్ణుమూర్తి యొక్క నాభికమలముగల సరస్సు లో సంచరించాయి— అందులోనే మృదువయిన అండములను పెట్టినవి. ఆ అండములు (ఇరువదియొకటి) క్రమంగా పగిలి గ్రుడ్లు అయినవి— ఆ అండములనుండియే మేమందరము పుట్టాము— ఈఇరువది యొక కాకులు ఆచండమను పేరుగల వాయస సంతతివారమే— అదే కమలా కరంలో క్రమంగా పెరిగి రెక్కలువచ్చి నభోమార్గానికి ఎగిరిపోయే సామర్థ్యంవచ్చువరకు వృద్ధిచెందాము—

తరువాత కొంతకాలానికి మేము ఆమాతృగణంతోకూడ కలసి చాలకాలం సరస్వతిని ఆరాధించాము— ఆమె ప్రసన్నురాలయింది— మాకు తత్త్వసాక్షాత్కార ఫలాన్ని ప్రసాదించింది—, మేము కూడా

ముక్తులవుతామని సంతసించాము- ప్రశాంత మనస్సుకలవారమై ఏకాంతంలో ధ్యానమార్గంలో ఉండిపోదలచాము- మా తండ్రి సాన్నిధ్యం చేరాము- తండ్రి మమ్ము కౌగలించుకున్నాడు- అలంబుసయను కులమాత మమ్ము గౌరవించింది- అనుగ్రహించినది- కొంతకాలం వినయాది గుణములు కలవారమై అక్కడ ఉండిపోయాము-

చండము॥ కుమారులారా! మీకు అంతులేని వాసనాతంతువులతో తయారయిన సంసారమనే వలనుండి బయటపడ్డారా! నిజంగా? లేకుంటే భృత్యవత్సలయగు ఆ భగవతిని (సరస్వతిని) ప్రార్థిద్దాం- ఆమె అనుగ్రహంవల్ల మీరు జ్ఞానపారగులవుతారు- అని అన్నది కుమారులతో చండము వాయసము-

కాకా॥ నాయనా! సరస్వతి అనుగ్రహంవల్ల మాకు తెలియ తగిన ఆత్మతత్త్వం తెలిసింది- కాని ఏకాంతంగా ఉండటానికి తగిన స్థానం వెతుకుకుంటున్నాము-

చండ॥ తనయులారా! "సకల దేవతలకు నిలయమయిన మేరువను పర్వతమొకటికలదు- అది చాల యెత్తయినది- దాని క్రింది భాగం పదునారువేల ఆమడలున్నది నేలలో- దీనికి యెనుబదివేల ప్రాంత పర్వతములున్నవి- సురలోకంలోని సురగంధర్వకిన్నరులుకూడా దీనిని పూజిస్తారు- పదునాలుగురకముల భూతములు దీనినాధారపరచుకుని బ్రతుకుచున్నాయి- ఈ మేరుపర్వతముయొక్క ఈశాన్యభాగమున పద్మరాగమయమయిన శిఖరమొకటి కలదు- చాలాపెద్దది అది- దాని వెనుకప్రక్క ఒకపెద్ద కల్పవృక్షంకలదు- దాని దక్షిణస్కంధమున నొకకొమ్మ ఉన్నది- దాని చిగురాకులు బంగారుమయములు- పూగుత్తులు రత్నాలు- వెనుక నేను ఆకొమ్మయందు ఒకగూటిని తయారుచేశాను- సరస్వతీదేవి ధ్యానమార్గంలో నుండగా నేనాగూటిలో రమించాను- కుమారులారా! మీరచటికి వెళ్ళండి- దేవతలకుకూడా దుర్లభం అది- మీరక్కడ ఉన్నచో నిర్విఘ్నంగా భోగమోక్షము

లను పొందగలరు"— అని చెప్పి మాతో మమ్ముల ముద్దు పెట్టుకొని, కౌగలించుకొని, ఆ సరస్వతీదేవినుండి తెచ్చిన మాంసమును మాకు ఇచ్చింది మాతండ్రియగు వాయసము— మేము దానిని భక్షించి సరస్వతీదేవి కాళ్ళకు మ్రొక్కి మాతండ్రికి నమస్కరించి వింధ్యగుహను విడచి, అలంబుసా నివాసమునుండి బయలు దేరి క్రమంగా ఆకాశమున కెగిరి, వాయులో కాదులు దాటుకుంటూ బ్రహ్మలోకం చేరాము.

అచ్చట ప్రణామపూర్వకంగా మాతండ్రిగారిమాట ఆసరస్వతీ దేవికి మాతల్లికి విన్నవించాము— వాళ్ళిద్దరు స్నేహపూర్వకంగా మమ్ముల కౌగలించుకొని వెళ్ళమని ఆజ్ఞ యిచ్చారు— మేమున్నూ వారికి నమస్కరించి బ్రహ్మలోకంనుంచి బయలు దేరాము— క్రమంగా లోకాలన్నీ దాటుకుంటూ ఈ మేరుశిఖరం చేర ఈకల్పవృక్షమున ప్రవేశించి ఈ గూటిలో నివసించాము— నిర్బాధగా సుఖంగా ఉంటున్నాము— కనుక మహర్షీ ! మాజన్మవృత్తాంతమూ మేము జ్ఞానమార్గమును పొందిన విధానమునూ యథాతథంగా మనవి చేసికున్నాము— మీరడిగిన మిగిలిన ప్రశ్నలనుకూడా సమాధానం చెబుతాం మీరు ఆజ్ఞ ఇచ్చేటట్లయితే అని అన్నాయి ఆ వాయసములు—

## ౨౦. భుసుండ స్వరూపనిరూపణము.

భుసుండః॥ మహర్షీ! ఇదిఅంతా గతకల్పంలో జరిగింది— అవయవ సంస్థానము నందునూ, ఆకృత్యాదులందునూ, ఈకల్పంలోని పదార్థాలవలెనే ఉండటంచేత అవి ఆభేదారోపం చేసి సన్నిహితములను బుద్ధితో ఈకల్పవృక్షమును నిర్దేశించి చెప్పాను— నా పూర్వపుణ్యాము లన్నీ ఫలించాయి మిమ్ము నిర్విఘ్నంగా దర్శించుటచేత— ఈగూడున్నూ, ఈకొమ్మా ఈకల్పవృక్షమూ, మీదర్శనభాగ్యంవల్ల ఇపుడు పవిత్ర మయినాయి— ఇదిగో అర్ఘ్యము— ఇదో పాద్యము— వీనిని గ్రహించి మమ్ముల పవిత్రం చేయండి— ఇంక మాకు ఏమి సెలవిస్తారో ఇయ్యండి—

మీయాజ్ఞప్రకారం మీకు సేవచేయడానికి సిద్ధంగా ఉన్నాము మేము— అన్నది భుశుండము—

వసి॥ రామా! ఆ భుశుండము రెండవసారికూడా అర్ఘ్యపాద్యా లిచ్చేసరికి నాకు సంతోషంకలిగి నేను దానితో ఇలా అన్నాను— "ఓ భుశుండమా! నీ అన్నదమ్ములు ఎవ్వరూ కనిపించరే! నీవొక్కడివే కనిపిస్తావేం?" అని—

భుశుండము॥ మహర్షీ! మోక్షమార్గంలో ఉంటున్న మాకు కొన్నికల్పాలు గడచాయి— ఇందులో మాతమ్ములందరూ శరీరంవిడిచి గడ్డిపోచలాగ ముక్తిపొందారు— ఎంతటి ఆయుర్దాయం కలవారయినా ఎంతటిగొప్పవారయినా! బలవంతులయినా! సత్పురుషులయినా! కాలానికి లోకువే కదా! కనుపడకుండా వచ్చి మ్రింగివేస్తుంది కాలం! అని అన్నది భుశుండము—

వసి॥ భుశుండమా! నీవు నివసించియున్న కల్పవృక్షముయొక్క స్కంధములందు ద్వాదశాదిత్యులూ, చంద్రులూ, పంక్త్యాకారంగా ఉన్నారు— ప్రళయకాలవాయుభేదములన్నీ ప్రసారంచేస్తున్నాయి— సూర్యకిరణములకు శైలేంద్రములు తగలపడుతున్నాయి— వనపంక్తులు మాడిపోతున్నాయి— చంద్రకిరణాలవల్ల స్రవించిననీళ్లు గడ్డకట్టి పాషాణ ప్రాయమై రాళ్ళవానలాగ కురుస్తున్నాయి— ప్రళయకాలమేఘాలన్నీ ఇక్కడనే మకాంపెట్టి గండ్రగొడ్డళ్ళనుకూడా చీల్చివేసే మంచుధార లను తయారుచేస్తున్నాయి—ఇలాంటి ప్రపంచసంబంధమయిన విషసంక్షో భాలకు ఇంత ఎత్తయిన చెట్టుమీదఉండి నీవు ఎలాబాధపడకుండా ఉంటున్నావు? ఈకల్పవృక్షం చాలఎత్తయినదికదా? అని అన్నారు వసిష్ఠులు—

భుశుం॥ మహాత్మా! మాకు ఆకాశమే నివాసస్థానము— మేము పక్షిజాతివారము కనుక. అందరకు చులకనయినాము— అన్ని భూతముల

ముళ్ళకంచెమీదవలె మెల్లగా నడుస్తాము- తత్త్వదృష్టిలో మాత్రం సంసారోచ్ఛేదము చేస్తున్నాము కనుక కృతార్థంగా ఉంటాము- వీతరాగ భయక్రోధులయిన మీబోటి ఉత్తమపురుషులు చాలమంది అనుగ్రహించినందువల్లకూడ మాకు సంసారంలో భేదప్రసక్తి లేదు- వ్యవహార మాత్రంకొరకు మనస్సు చలించినా రాగాదివృత్తులందు జారదు- తత్త్వాన్ని పరామర్శించకుండా ఉండదు- పర్వములందు సముద్రములు పొంగినట్లు మా మనస్సు నిర్వికారమయిన ఆత్మతత్త్వమునందు ఉపశాంతమయ్యే సరికి బ్రహ్మాకారవృత్తి అనే చంద్రోదయంవల్ల ఉద్రిక్తమయి బోధతరంగాలు పెరిగిపోయాయిమాకు- స్వామీ! మీరాకవల్ల మేము సంతుష్టాంతరంగులమయినాము. మథనంచేత పాలసముద్రము అమృతపూరితమయినట్లు- ఇంతకంటె మాకు కావలసిన శుభము మరొకటిలేదు- వీతరాగులయిన మహర్షులు మమ్మ్మ అనుసరించటం కంటె మాకు కావలసినదేమి? ఆపాతరమ్యములయిన భోగములవల్ల కలిగెడిఫలమేమి? సత్సంగమను చింతామణివల్ల సర్వసారమయిన జ్ఞానము సంప్రాప్తమవుతుంది- త్రైలోక్యమనే పద్మకోశంలో స్నిగ్ధ, గంభీర, మసృణ, మధురోదార, ధీరవాక్కులయిన తమరొక్కరే తుమ్మెదవలె ఆచరిస్తున్నారు నేనింతకుముందు ఆత్మతత్త్వమును తెలిసికొనియున్నా మిమ్ముల దర్శించినందున నాపాపములు పోయినట్లున్నూ, నాజన్మసఫలమయినట్లున్నూ, నేనుతలుస్తున్నాను- సాధుసంగమమనునది సకల భయాపహముకదా!

## ౨౧. చిరజీవిత వృత్తాంతకథనము.

భుశుం॥ మహర్షి! ఈ కల్పవృక్షం ప్రళయకాలములందుకూడా కదలదు. స్థిరంగా ఉంటుంది- లోకాంతరములందు సంచరించేడి భూతములేవీ దీనిమీదికి రాలేవు- అందువల్ల మేము సుఖంగా ఉంటున్నాము. హిరణ్యాక్షుడు భూమిని చాపచుట్టగా చుట్టినప్పుడుకూడ

ఈచెట్టు కదలలేదు- ఆదివరాహావతారం భూమిని మరలప్రతిష్ఠ చేయు నపుడుకూడ కదలలేదు-శ్రీమహావిష్ణువు మేరుపర్వతమును రెండు చేతులతో పట్టుకొని మిగిలినరెండు చేతులతో మందరపర్వతాన్ని లేవదీసినపుడుకూడ ఇది కదలలేదు- సురాసురలిరువురు ఇరువైపుల లాగునపుడు ఆ సంక్షోభానికి సూర్యచంద్రమండలాలైనా కదిలాయికాని యీ చెట్టు కదలలేదు- ఇంద్రనీలశిలలు పెళ్ళగిలినవి- ప్రళయవాయువులు బయలుదేరాయి- మేరు తరువులు కదిలాయి- కాని యీకల్పవృక్షం కదలలేదు- ప్రళయకాలపు మేఘపంక్తులు పాలసముద్రంలో తిరిగే (కదిలే) కొండగుహాలలోని వాయువులకు అటునిటు తిరిగినవికాని యిదిమాత్రం కదలలేదు- కాలనేమి కౌగిలిలో పట్టుకొని పైకిలేపగా మేరువయినా కదిలినదికాని ఇది కదలలేదు- అమృతమును తీసికొని వచ్చునపుడు జరిగిన యుద్ధంలో గరుత్మంతుని రెక్కలవల్ల కలిగినగాలికి సిద్ధులయినా వణకిపోయారు- కాని ఇదిమాత్రం కదలలేదు- రుద్రుడు (సంకర్షణరుద్రుడు) ఆదిశేషుని ఆకారమును ధరించినపుడుకాని, గరుత్మంతుడు ఎగిరి బ్రహ్మలోకానికి వెళ్లినపుడుకాని యీ కల్పవృక్షము కదలలేదు- ఆదిశేషుడు పడగలనుండి ప్రళయకాలాగ్నిజ్వాలలను వదలినపుడుకూడ ఇది కదలలేదు- స్వామీ! ఈచెట్టు ఇలాఉండగా మాకు ఆపదలు ఎక్కడివి? దుస్థితి పుట్టినపుడుకదా! ఆపదలు వచ్చునది- అని అన్నది భుశుండము-

వసి॥ ఓ భుశుండమా! వెయ్యిమహాయుగములు గడచిన తరువాత మహాప్రళయమందు ప్రళయవాయువులు వీచుచుండగా సూర్యచంద్రులు నేలపడుచుండగా నీవు ఎలా నిర్బాధగా ఉంటున్నావు? అని అన్నారు వసిష్ఠులు-

భుశుం॥ మహర్షీ! ప్రాపంచిక వ్యవహారమంతా రూపుమాసిపోయే ప్రళయకాలంలో కృతఘ్నుడు సన్మిత్రుని (మంచిస్నేహితుని) విడిచినట్లు ఈగూటిని విడుస్తాను నేను- కేవలం ఆకాశంలో అన్నివిక

ల్పాలు విడిచి ఉంటాను- సర్వారంభములను నిశ్చలంగా చేసికొంటాను- సాంసారికమయిన వాసనలను నిశ్చలంగా ఉంటాను- కొండలను ముక్కలుముక్కలుగా చేసే ప్రళయకాలమారుత్యాలు పడిపోగానే అప్పుడు "వరుణ దేవుడే నేనని" నిశ్చయించుకొని నిరంతరధారణతో ఉంటాను- పర్వతశ్రేణులను కదల్చేడి ప్రళయ వాయువులు వీచునపుడు "నేను పర్వతాన్ని" నిరంతరధారణతో ఉంటాను- బ్రహ్మాండమంతో ఏకార్ణవమయినప్పుడు "నేను వాయువును" ధారణతో ఉంటాను- ఇలా ఉండి చతుర్వింశతి తత్త్వములు లయము పొందినప్పుడు నిర్వికల్పసమాధిలో ఉంటాను- ఇలా బ్రహ్మదేవుడు పునస్సృష్టిని ప్రారంభించేటంతవరకు ఉండి ఆయనగారు సృష్టిని ప్రారంభించిన తరువాత నాగూటికి నేను చేరుతాను- అని చెప్పాడు భుశుండుడు-

వసి॥ ఓ భుశుండుడా! నీవు ఈ ధారణాయోగములతో కల్పాంతములందున్నట్లు ఇతర యోగులు ఏల ఉండరు? అని అడిగాడు వసిష్ఠుడు-

భుశుం॥ బ్రహ్మర్షీ! పరమేశ్వరుని సంకల్పము (నియతి) దుర్లంఘ్యము- నేను ఇలా ఉండాలని, ఇతరులు అలా ఉండాలనీ పరమేశ్వరుడు సంకల్పించాడు- ఇలాంటి విషయాలలో ఒకరితో నొకరికి పోలిక పెట్టటానికి వీలులేదు- భవితవ్యత అవశ్యం జరిగితీరుతుంది- ఏది ఎలా జరగాలో అది అలాజరిగి తీరుతుంది- ఇది నియతియొక్క బలము- నాసంకల్పబలం చేతనే ప్రతికల్పమందూ ఈ గిరిశృంగమందు ఈ కల్పవృక్షం ఇలా ఉంటుంది- అన్నాడు భుశుండుడు-

వసి॥ ఓయా! మహామతివి సుకీర్తిమానవు దీర్ఘాయుం కలవాడవు నీవు- పురాతన చరిత్రలను నిర్దేశించి చెప్పుటలో మొనగాడవు- (గొప్పవాడవు.) జ్ఞానవిజ్ఞానవంతుడవు- అతీంద్రియుడవు- యోగనిపుణమయిన మనస్సు కలవాడవు- అనేక సృష్టి స్థితి ప్రళయములను చూచియున్నావు నీవు- వాటిలో నీకు తోచిన ఆశ్చర్యము చెప్పు? కొంచెం చెప్పనావు- అన్నాడు వసిష్ఠులు-

భుశుం॥ మహాత్మా! ఈ మేరుపర్వతముక్రింద గడ్డి తీగలూ లేక పెద్దచెట్లూ, రాళ్లూ గల ఈభూమి నాకుగుర్తు ఉంది- పదివేల వత్సరములూ, పదివందలవత్సరములూ భస్మపూరితమై ఉన్న ఈభూమిని నేను గుర్తిస్తున్నాను- సూర్యచంద్రులు పుట్టక సూర్యచంద్రుల వెలుగు మేరుపర్వతపు కాంతులతో కలిసిపోయిన ఈభూమిని నేను సంస్మరించుచున్నాను- మేరుపర్వత మందలి రత్నాలకాంతులచే సగము సగము గుహాలు కనిపిస్తూ లోకాలోకపర్వతంవలె ఉన్న ఈ కొండభూమిని స్మరిస్తున్నాను- దేవాసురసంగ్రామం బాగా విజృంభించినపుడు జను లందరూ వలసపోవుచున్న ఇచ్చోటును నేను స్మరిస్తున్నాను- నాలుగు యుగాలు రాక్షసులు మదించి ఇచ్చోటును ఆక్రమించి ఉన్నట్లు నాకు గుర్తుఉంది- మేర్వతిరిక్త ప్రదేశమంతా సముద్రంతో ఆచ్ఛాదించబడి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ మిగిలియున్న ఈజగత్కుటిని నేను స్మరించుచున్నాను- రెండు యుగాలపాటు కేవలం అడవిచెట్లు తప్ప మిగిలినవేమియూ లేని ఈభూమిని నేను స్మరిస్తున్నాను- అలాగే నాలుగుయుగాల పాతికకాలం దట్టంగా కొండలుతప్ప మిగిలిన జనసంచారం లేని ఈభూమిని నేను స్మరించుచున్నాను- పదివేల సంవత్సరాలు మృతులయిన దైత్యుల ఎముకలతోనూ, కొండలతో నిండి యున్న ఈభూమిని స్మరిస్తున్నాను- రాక్షసులవలని భయంచేత వైమానికులగు నభశ్చరులు దాగికొనిఉన్న అంతరిక్షాదిలోకాలనూ, పూర్తిగా చెట్లూచామలూ ఏమీలేకుండా కేవలం అంధకారప్రాయంగా ఉన్న ఈభూలోకాన్ని నేనుగుర్తిస్తున్నాను-

మేరుపర్వతంతో స్పర్థపెట్టుకొని వింధ్యపర్వతం పెరిగింది- అప్పుడు- మలయపర్వతమూ, దర్దురపర్వతమూ, సహ్యాద్రీ, అనేభేదం లేకుండా ప్రపంచంఅంతా ఒకే పర్వతాకారమయింది- ఆవిషయం నాకు తెలుసు- ఇవీ ఇంకా మరికొన్ని వృత్తాంతాలు నాకు జ్ఞాపకమున్నాయి- చాలాచాలావిషయాలు నాకు తెలుసు- అవి అన్నీ చెప్పి యిప్పుడు ఏమిలాభం? సంక్షేపంగా సారం చెబుతావిను-

మహర్షీ! మహామహిమాతిశాలురయిన మనువులు లెక్కలేనంత మంది నాకు తెలుసు— వందలకొలది చతుర్యుగాలు నాకు తెలుసు— మరో ఆశ్చర్యం చెబుతా వినండి— బ్రహ్మాండాకారుడయిన విరాట్పురుషుడు పుట్టి కొంతకాలం స్వాత్మతత్వాన్ని పర్యాలోచన చేయటానికి సమాధిలో ఉన్నాడు— అపుడు మానవులు లేరు— సురాసురులు లేరు— తేజోరాశిఅగు బ్రహ్మాండము మాత్రముకద్దు— ఇంకొక సృష్టికూడా నే నెరుగుదును— అది కలియుగ సృష్టి— అందులో కల్లుతాగే బ్రాహ్మణులూ, దేవతలను నిందించే (తిట్టే) శూద్రులూ, అనేకమంది భర్తలు గల ఆడవారూ జాస్తి— మరిన్నీ సముద్రమును నిర్మించిన ప్రియవ్రతుడు పుట్టకపూర్వం స్త్రీ పురుషసంబంధం అక్కరలేకుండా కేవలం మానసిక సృష్టివల్ల భృగ్వాది పురుషులు పుట్టారు— ఆ విషయంకూడా నాకు జ్ఞాపకం ఉంది— ఒకానొక సృష్టిలో పర్వతాలుండవు— భూమిఉండదు— దేవతలూ, మానవులూ, యోగసిద్ధులూ, ఆకాశంలోనే ఉంటారు— సూర్యచంద్రుల వెలుతురుండదు— ఇలాంటి సర్గము (సృష్టి) కూడా నాకొకటి తెలుసు— మరొకసృష్టిలో ఇంద్రుడుండడు— రాజులు లేరు— ఉత్తమమధ్యమాధములు లేరు— దిక్చక్రములన్నీ కేవలం అంధకారం బంధురంగా ఉంటాయి—

మహర్షీ! సృష్టిప్రారంభం కొరకు బ్రహ్మదేవునిసంకల్పమూ, ముల్లోకముల విభాగమూ, కులపర్వతముల ప్రదేశాకారభేదమూ, జంబూద్వీపంలో బ్రాహ్మణాదివర్ణముల యొక్కయు, వారి ధర్మముల యొక్కయు, విభాగమూ, నక్షత్ర మండలము యొక్క సంస్థానమూ, ధ్రువలోకనిర్మాణమూ, సూర్యచంద్రుల ఉత్పత్తి ఇంద్రోపేంద్రుల వ్యవస్థ భూమిని హిరణ్యాక్షుడు అపహరించుటా, వరాహావతారంతో విష్ణుమూర్తి దానిని ఉద్ధరించుటా, దేవదానవమానవులలో ప్రత్యేకం రాజులను కల్పించుటా, మత్స్యావతారంలో వేదములను తెచ్చుటా, మందరపర్వతమును పెళ్ళగించుటా, అమృతముకొరకు సముద్రమును

పుట్టించుటా, రెక్కలులేని గరుత్మంతుడు పుట్టుటా, సముద్రములు పుట్టుటా, ఇలాంటి విషయాలు అనేకం చూశాను. తక్కువ వయస్సు గల మీలాంటివారుకూడా స్మరిస్తూనే ఉన్నారు. అందులో విశేషం లేదు. గొప్ప ఆశ్చర్యం మరొకటి చెబుతావినండి. గరుడవాహను డయిన విష్ణువు హంసవాహనుడై (అనగా బ్రహ్మయై) దేవదైత్యాదు లను సృష్టించుట నేనుచూచాను. అలాగే విహగవాహనుడయిన బ్రహ్మ వృషభవాహనుడై (ఈశ్వరుడై) సంహారాధికారాన్ని చలా యిస్తూ ఉండటం చూచానునేను. అలాగే వృషభవాహనుడయిన రుద్రుడు, గరుడవాహనుడై (విష్ణుశరీరమునుధరించి) పరిపాలనాధికారం నెరవేర్చుచుండగా నేనెరుగుదును. ఇది నా ఆయుర్దాయంలో జరిగిన గొప్ప ఆశ్చర్యరహస్యము.

## ౨౨. చిరజీవితవర్ణనము.

భుశుం॥ మహాత్మా! తరువాత కొంతకాలం గడచింది. ఇప్పటి సృష్టులు ప్రారంభం అయ్యాయి. మీలాంటివారందరూ పుట్టారు. భరద్వాజ, పులస్త్య, అత్రి, నారద, ఇంద్ర, మరీచి, పులహ, ఉద్దాలక, క్రతు, భృగు, అంగిరస, సనత్కుమార, భృంగీశ, స్కంద, ఇభవదనా దులు ఉద్భవించారు. ఇందు కొందరు బ్రహ్మర్షులు, కొందరు సిద్ధర్షులు, మరికొందరు శివపార్షదులు, గౌరీ, సరస్వతీ, లక్ష్మీ, గాయత్ర్యాది, శక్తిస్వరూపిణులయిన దేవతలు పుట్టారు. మేరుమందరాది కులాచల ములు ఉద్భవించాయి. హయగ్రీవ, హిరణ్యాక్ష, కాలనేమి హిరణ్య కశిపు, క్రాథ, బలి, ప్రహ్లాదాది దానవులు ఉద్భవించారు. నల, మాం ధాతృ, సగర, దిలీప, నహుషాది, రాజన్యులు పుట్టారు. ఆత్రేయ, వ్యాస, వాల్మీకి, శుక, వాత్స్యాయనాది మునులు జన్మించారు. వీర్లను నేను స్మరించుట అనేది లెక్కలోనిదికాదు. మహర్షీ! బ్రహ్మపుత్రుడ వయిన మీకు ఇది యెనిమిదవజన్మ. ఎనిమిదవజన్మలో మీరు నాకు

పదిసార్లు- ఎనిమిది జన్మలలోనూ మీరు బ్రహ్మగారినుంచే పుట్టలేదు- ప్రతిజన్మలోనూ వేదాశ్వసు- వినండి చెబుతాను- ఒకజన్మలో ఆకాశం నుంచి పుట్టారు- మరో జన్మలో నీటినుండి పుట్టారు- మరో జన్మలో గాలినుండి పుట్టారు- ఇంకొక జన్మలో భూమినుండి పుట్టారు- మరో జన్మలో అగ్నినుండి పుట్టారు- అన్నికల్పాలలోనూ అధికారిక పురుషులకు నామరూపాలు సమానంగానే ఉంటాయి- కాని ఆకార సన్నివేశం కాని, ఆచారంకాని సమానంగా ఉండదు- కాకతాళీయంగా ఒకానొకప్పుడు సమానంగానూ, ఒకానొకప్పుడు విషమంగానూ, ఉంటుంది వారి ఆచారాది వ్యవహారము- మూడు సృష్టులలో, (కల్పములలో) మీ ఆకార ఆచారాలూ సమానంగా ఉండటం నేనెరుగుదును-

పదికల్పములలో దేవతలు సమానమయిన ఆకారమూ, సమానమయిన ఆచారమూ, సమానమయిన ఆయుర్దాయమూ, కలవార్లనుగా నేనెరుగుదును- వసిష్ఠమహాముని! భూమి అయిగుసృష్టులలో నీటిలో మునిగియుండగా కూర్మమే ఉద్ధరించింది- వరాహము ఉద్ధరించలేదు- పన్నెండుసారులు దేవదానవులు మందరాకర్షణముతో సముద్రమును మథించుట నేనెరుగుదును- హిరణ్యాక్షుడు భూమిని మూమ్మారు పాతాళమునకు తీసికొనిపోయాడు- విష్ణుమూర్తి ఆరుసారులు రేణుకాగర్భ సంభూతుడై క్షత్రియనాశ మొనర్చాడు- కొన్నికల్పములలో పరశురామావతారమే లేదు మధ్యమధ్య- అలాంటి కల్పాలు కూడా నాకు తెలుసు- విష్ణుమూర్తి నూరుసారులు బుద్ధావతారం ధరించి, నూరు కలియుగాలలో శుద్ధోదనుడను పేరుగల రాజకుమారుడుగ పుట్టి కీకట దేశములకు రాజుగానుండుట నాకు జ్ఞాపకమున్నది- ముప్పదికల్పములలో ముప్పది త్రిపురములను ఈశ్వరుడు దహింపచేశాడు- ప్రతికల్పంలోను రెండేసి దఫాలు దక్షాధ్వరధ్వంస మొనర్చాడు- తొమ్మండుగురు దేవేంద్రులను తనకు తప్పుచేసిన వారిని పదభ్రష్టులనుగా జేసి కొండగుహాలలో నిరోధించాడు శివుడు- ఇదినాకు తెలుసు- శివకేశవు

లను బాణాసురుని నిమిత్తమై మాహేశ్వరజ్వర వైష్ణవజ్వరములను అణచుటకై ఎనిమిదిసారులు యుద్ధం జరిగినట్లు నాకు తెలుసు- ప్రతి యుగమందూ వేదాధ్యయనంచేసే పురుషులయొక్క బుద్ధివైచిత్ర్యమూ, బ్రహ్మచర్య గురుశుశ్రూషా భూమిశయనాదిక్రియా వైచిత్ర్యమూ, స్వరవర్ణాద్యుచ్చారణా వైచిత్ర్యమూ నాకు తెలుసు- ప్రతి ద్వాపరమందునూ నిర్మింపబడెడి పురాణములను నేనెరుగుదును. వేదవేత్తలయిన వ్యాసవాల్మీకాదులచే రచింపబడెడి మహాభారతరామాయణాది ఇతిహాసములను నేనెరుగుదును- మహారామాయణము పేరుగల బ్రహ్మగారు వసిష్ఠవిశ్వామిత్రాదుల కుపదేశించిన జ్ఞానశాస్త్రమును నేనెరుగుదును- అయ్యది "రామునివలె వర్తింపుడు, రావణునివలె వర్తింపకుడు" అను జ్ఞానమును కరతలామలకమొనర్చినది- అద్దానిని వాల్మీకి ఇంతకుముందు రచించియున్నాడు- ఇకముందుగూడ ముప్పది రెండువేల శ్లోకములుగల మహారామాయణమను గ్రంథమును వాల్మీకి రచింపగలడు- దివ్యజ్ఞానబలంచేత ఇద్దానిని నేను తెలుసుకున్నాను- స్మరించి నీకు చెబుతున్నాను- కాలవశంచేత నీవుకూడ తెలిసికొనగలవు.

వసిష్ఠరామసంవాదరూపమగు నీరామాయణము చదువువారలు పరంపరగా విచ్ఛిన్నముకాగా విస్మృతమయినందున ఇపుడీవాల్మీకి దీనిని పన్నెండవసారి రచించుచున్నాడు- పూర్వకల్పంలో వ్యాసుడే రచించాడో, వానిపేరుగల మరొకడు రచించాడో కాని క్రమంగా మరపుకు వచ్చేసరికి ఇప్పుడితడు ఏడవసారి భారతమును రచించుచున్నాడు- ప్రతి యుగమందూ ప్రవర్తించెడి అఖ్యానకాలను, శాస్త్రాలను, క్రొత్తక్రొత్త వాటిని స్మరించుచున్నాను- ప్రతియుగమందూ పదార్థజాలము సమానంగానే ఉంటుంది- కొన్నిపదార్థాలు వేరుగాకుండ ఉండగలవు- రాక్షస సంహారం కొరకు అవతరించెడి శ్రీమహావిష్ణువునకు ఇది పదునొకండవ రామావతారము- శ్రీమహావిష్ణువు నారసింహావతారములో మూడు

పర్యాయములు హిరణ్యకశిపుని సంహరించాడు. వసుదేవుని యింటిలో ఇపుడు పదునారవపర్యాయం కృష్ణావతారము జరుగగలదు. ఈ ప్రాపంచిక భ్రాంతి యెప్పుడూ పరమార్థముకాదు. నీటిలో బుడగల వంటిది. అనిత్యము. సముద్రంలో తరంగాలవలె ఆత్మయందు లోపల పుట్టుతూ చస్తూ ఉంటుంది.

ప్రతికల్పమందూ లోకాదులయొక్క సన్నివేశంకూడా పూర్తిగా సమానంగా ఉండదు. అందలి భూతములుకూడా కొన్ని సమానంగానూ, కొన్నిభిన్నంగానూ ఉంటాయి. వానిపనులూ, వాని ఆచారాలూకూడా నాకు తెలుసు.

మహాత్మా! ప్రతిమన్వంతరంలోనూ, ప్రపంచక్రమం తారుమారవుతూ (మారుతూ) ఉండటం మామూలు. కనుకనే నాకు క్రొత్త స్నేహితులూ, క్రొత్తబంధువులూ, క్రొత్తక్రొత్తభృత్యులూ, క్రొత్త క్రొత్తనివాసాలు ఏర్పడుచున్నాయి. ఒకపుడు నాకు వింధ్య గుహానివాసము. ఒకానొకపుడు సహ్యాద్రినివాసము. మరొకపుడు దర్దుర పర్వతము నివాసము. ఇంకొకపుడు హిమవంతము నివాసము. మరొకపుడు మలయాచలము నివాసము. మరొకపుడు వెనుకటి సన్నివేశంతో యీ భూధరమును పొంది చూతవృక్షముయొక్క కొమ్మమీద గూడు యేర్పరచుకొన్నాను. అనాద్యంతములయిన ఈయుగములు ఇలా గడచిపోతూ ఉండగా ఈచెట్టు మామూలురూపంతోనే పుట్టుతూ ఉంటుంది. మార్పును చెందదు. మాతండ్రి (చండుడు) బ్రతికిఉండగా ఎలాంటి శోభఉన్నదో యీచెట్టుకు అలాంటిశోభే ఇప్పుడూ ఉంది.

వెనుకటి ఆకారముతో సామ్యముండుటను బట్టి "అదేయిది" అని అనుకొనుటయే కాని, నిజస్థితిలో అదేభూధరము ఇదికాదు. అదే వృక్షము ఇదికాదు. అదేఉత్తరదిక్కు ఇదికాదు. కాని నేను మాత్రం అలామారలేదు. నాశరీరం మార్పుచెందలేదు. నాకు ఒకే శరీర సంస్థానంలో అనేక బ్రహ్మప్రళయాలు గడచాయి. ప్రతి కల్పాంతం

లోనూ, నిర్వికల్పక సమాధినిపూనిఉండి సమాధ్యవసానమునందు జరుగు చున్న పునస్సృష్టినిజూచి, ఈ మేరుపర్వతమును, ఈ పాదపమునూ,ప్రత్యభిజ్ఞ చేస్తూఉన్నాను—కనుక ధారణావశంచేత(యోగబలం) శరీరమును మార్పుచెందనీయలేదు నేను— ఈదిగ్విభాగముకూడా సూర్యాది గ్రహములయొక్క సంచారముమీాద ఆధారపడిఉన్నది—అంతేకాని ఉత్తరత్వ పూర్వత్వములు ఆయాదిక్కులకు నియతములుకావు— అయ్యావి మిథ్య— అలాగే ప్రపంచక్రమం అంతా మిథ్య— అదిసత్తూ—కాదు— అసత్తూ కాదు— ఆత్మస్పందముయొక్క చమత్కారంవల్ల ఇదంతా ఇలా విజృంభిస్తోంది— కొడుకు తండ్రి అవుతున్నాడు— మిత్రుడు శత్రువగుచున్నాడు— స్త్రీలు పురుషులగుచున్నారు— కలియుగంలో కృతయుగాచారాలు నేనెరుగుదును—త్రేతాలో ద్వాపరాచారాలు నేనెరుగుదును— వేదవేదార్థాలు బొత్తుగా తెలియక స్వేచ్ఛావిహారులయిన మానవులుగల కలియుగసృష్టులను నేనెరుగుదును. మహాత్మా! వెయ్యిపర్యాయములు నాలుగుయుగములు గడచిన తరువాత చతుర్ముఖ బ్రహ్మ నీటిలోపలుండి యోగనిద్ర అనుమిషతో పరమాత్మను ధ్యానించుచుండగా ప్రపంచంఅంతా శూన్యంగా ఉండటం నాకు తెలుసు— బిందవులగు రాజులు మనోమననంచేత సృష్టించిన సృష్టులన్నీ ఇప్పుడు నాకు గుర్తు ఉన్నవి— బ్రహ్మకల్పాలలో జరిగే చిత్రవిచిత్రాలన్నీ నేను స్మరిస్తున్నాను— అన్నది భుశుండము—

## ౨౩. సమాధాన సంకల్పనిరాకరణము.

వసి॥ రామా! నేను ఇంకా విషయం తెలుసుకుందామని ఆవాయసశ్రేష్ఠమును ఇలా అడిగాను. "ఓ భుశుండమా! జగత్కోశంలో వ్యవహరిస్తూ ఉండేవారికి మృత్యుబాధ ఎందుకుండదు?" అని—

భుశుండుడు॥ మహాత్మా! మీారు సర్వజ్ఞులు— మీాకు తెలియనివిలేవు— తెలిసే నన్ను అడుగుతున్నారు. ప్రభువులు ఎప్పుడూ భృత్యు

అనోటి నుంచే చెప్పిస్తాను అన్ని విషయాలు- కానింకు- తమరడిగిన ప్రశ్నకు సమాధానం చెబుతాను- సత్పురుషుల ఆజ్ఞను శిరసావహించి, నెరవేర్చడమే సజ్జనసేవ- కామక్రోధాది సకలదోషములకు ఆధారము వాసనాజాలము- అట్టి వాసనాజాలము ఎవరి హృదయమందు నశించునో వారిని మృత్యువు బాధించదు- (చంపదు) వాసనాక్షయమయితే మృత్యుబాధ ఉండదనిభావము- మనశ్చింతలు లేనివారలను మృత్యువు చంపదు- ఆశాపాశబద్ధులుకాని వార్లను మృత్యువు బాధించదు- రాగద్వేషలోభమోహాములు లేని వారలను మృత్యువు బాధించదు- క్రోధమనేది శరీరమనే సముద్రంలో బడబాగ్ని- అది వివేకమనే ఉదకమును నిశ్శేషంగా త్రాగేస్తుంది- జీవుణ్ణి మంటపెటుతుంది- అలాంటి క్రోధము లేనివాణ్ణి మృత్యువు చంపదు- మన్మథుడు బాధించనివానిని మృత్యువుబాధించదు- పరమపవిత్రమూ, పరిశుద్ధమూ, అద్వితీయమూ అగు ఆత్మతత్త్వమునందు చిత్తము విశ్రాంతి చెందినవాణ్ణి మృత్యువు బాధించదు- నిశ్చలమనస్కుని మృత్యువు బాధించదు- మహర్షీ! ఈ పైన చెప్పినవన్నీ మహాదోషములు- సంసారవ్యాధికి హేతువులు- సమాహితమగు చిత్తమును ఈదోషములు బాధించవు-సమాహితచిత్తుని ఆధివ్యాధిసముత్థితములయిన దుఃఖములు బాధించవు- సమాహితచిత్తునకు ఉదయాస్తమయములు (ఉత్పత్తి వినాశములు) లేవు- సంస్మృతివిస్మృతులు లేవు- జాగ్రత్స్వప్నములు లేవు- సమాహితచిత్తునకు మనశ్చింతలు ఏమాత్రము అపకారకములు కానేరవు- సమాహితచిత్తుడు శాస్త్రప్రకారము వ్యవహరించుచున్నను ఏపని చేసినవాడు కాడు- సమాహితమగు చిత్తమును దురర్థములుకాని, దురారంభములుకాని, దుర్గుణములుకాని, దురుదాహరణములుకాని, దుర్నీతులు కాని, చెడుఫలమునిచ్చి బాధించలేవు- సమాహితచిత్తునకు సకలసుఖములు సులువుగా సంప్రాప్తములవుతాయి- మానవు డెప్పుడు తన మనస్సు ఉత్తరకాలసుఖమునకు అనుకూలపరచవలెను- అపాయములేని దానినిగ చేయవలెను- దురీహారహితముగ జేయవలెను- భ్రమరహిత

మయినదిగా జేయవలెను– చిత్తమునకు పురుషార్థ వైధుర్యము (అనగా పురుషార్థమును సంపాదింపలేకుండుట) పనికిరాదు– భేదబుద్ధి పనికిరాదు– ఆదిమధ్యావసనములందు సుఖమునిచ్చేడిది జ్ఞానమొక్కటే మరొకటి లేదు– చిత్తమును అట్టిదానికభిముఖ మొనర్పవలెను– ఆత్మసుఖాయత్త మొనర్పవలెను– స్వర్గలోకమందలి సుఖము శాశ్వతము (సుస్థిరము) కాదు– అచట దేవతలు, గంధర్వులు, కిన్నరులు, విద్యాధరులు, అప్సరసలు, ఇంకెందరో ఉండుగాక– అలాగే భూతలంలో చెట్లుండుగాక– నరాధీశులుండుగాక– పర్వతములూ, పురములూ, పల్లెలూ ఉండుగాక– నదులూ, సముద్రాలూ ఉండుగాక– ఏమయినాకాని భూలోకంలో కూడా సుఖంలేదు. అలాగే ఏసంపదఉన్నా పాతాళంలోకూడా సుఖం లేదు– ఇంతఎందుకు? ఈ ప్రపంచంలో ఎక్కడా సుఖంలేదు– క్రియా ఫలములయిన లోకములందు సుఖమనేది సున్న– మానసికక్రియలందు శాశ్వతసుఖమనేది సున్న– బాహ్యేంద్రియ చేష్టలందునూ శాశ్వత సుఖములేదు– కనుక ప్రపంచంఅంతా అశాశ్వతం– అతితుచ్ఛం– అందులో శాశ్వతసుఖమునునది వివేకవంతులచే కోరతగదు– వివేకవంతులయొక్క మనస్సు ఎచట విశ్రాంతి చెందియుండునో దానితో భూతలంలోని ఏకచ్ఛత్రాధిపత్యం తులతూగదు– అమరాధిపత్యం సరిపోదు– పాతాళరాజ్యాధిపత్యంకూడా సమానంకాదు– పదునాల్గువిద్యలందలి పాండిత్యంకూడా సరిపోదు– లోకానురంజన సామర్థ్యంకూడా ప్రయోజనంలేదు–భారతాది ఇతిహాసములందలి కథలను వర్ణించిచెప్పెడి సామర్థ్యంకూడా ఉపయోగంలేదు– ఆధిప్రచురమయిన (మనశ్చింతలతో మునిగితేలుచున్న) చిరజీవితము (దీర్ఘాయుర్దాయము) లాభము లేదు– మరణమూ లాభములేదు– నరకమూ లాభంలేదు– స్వర్గమూ లాభంలేదు– వివేకవంతుడయినవానికి విచారిస్తే ప్రపంచ క్రమములు ఏమీ రమ్యములుకావు– అశాశ్వతమయిన పదార్థమునందు మహానుభావుల చిత్తము విశ్రాంతి చెందదు–

౨౮. ప్రాణవిచారణము-

భుశుం॥ మహాత్మా! ఆత్మదృష్టి ఒక్కటే లోకంలో నిరపాయమైనది- అదే స్థిరమయినది- అదే శ్రేయస్కరమయినది- అదే సకల జ్ఞానములలోను శ్రేష్ఠమయినది- ఆత్మచింతనము (ఆత్మవిచారము) సకల దుఃఖాపహారకము- చిరకాలమునుంచి కామకర్మవాసనలచే సంపాదించబడిన సంసారభ్రమను పోగొట్టెడిది- ప్రత్యగాత్మాంగణమునందు సంచరించెడిది- సంప్రాప్తములయిన సర్వదుఃఖములను తుడిచిపెట్టెడిది- రాబోవు దుఃఖములను అనుసంధానమును చేసికొనుటవలన కలిగెడి దిగులు మొదలగు సకలానర్థములను నశింపజేయును- వెన్నెల చీకట్లను పోగొట్టినట్లు ఆత్మవిచారము సంసారదుఃఖములను పూర్తిగా రూపుమాపును- అట్టి ఆత్మవిచారము మహాత్మా! సర్వసంకల్ప వర్జితము- యుష్మదాదులకు (మీబోటివార్లకు) దుష్ప్రాపము- (పొందశక్యము కాదు) అస్మదాదులకు అసలే పొందశక్యముగాదు. సమస్త భేదకలనాతీతమును, సర్వోత్కృష్టమును అగుస్థానమును ప్రాకృతబుద్ధులు చేరలేరు- అయితే అలాంటి ఆత్మచింత (ఆత్మవిచారము) నీకెలా అలవడిందని మీరడుగుతారేమో నన్ను చెబుతావినండి-

ఆత్మచింత అనే విలాసినీ స్త్రీకి కొందరు చెలికత్తెలున్నారు- వాళ్లుకూడా ఆమెతో కొంచెం పోలిక కలవారే- విజ్ఞానచంద్రునిచే శీతలములయినవారే- కనుక ఆత్మచింతతో (ఆత్మవిచారముతో) సమానులయిన ఆమె చెలికత్తెలలో ముఖ్యమయిన చెలికత్తెను ఒకదానిని నేను ఆశ్రయించాను- ఆమె అనుగ్రహంచేత నేనీ ఆత్మవిచారమును సంపాదించాను- అని అన్నది భుశుండము-

వసి॥ రామచంద్రా! ఇలా నాతో ఆభుశుండమనగా నాకా విషయమంతా తెలిసిఉన్నా ఉత్సాహంతో నేనాభుశుండాన్ని ఇలా అడిగాను-"సకలసంశయాలు తీర్చగల సామర్థ్యంకలిగిన ఓ భుశుండమా! ఆప్రాణచింత అంటే ఎలాంటిదో నాకు నిర్ణయించి చెప్పు!" అని-

భుశుం॥ మునీ! మీరు సకల వేదాంతవేత్తలు సర్వ సంశయము లను తీర్చెడి సత్తాగలవారు– వాయసమయిన నన్ను పరిహాసంగా ఇలా అడుగుతున్నారు– అథవా మీసాన్నిధ్యంలో ఆ ప్రాణదర్శనమును గురించి విశేషంగా తెలుసుకోటానికి మీరడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరం చెబుతాను. తప్పేమి? నాకుపోయిందేమి? మహర్షి! నాకు జీవితాన్ని ఇచ్చింది ఈ ప్రాణచింతనము– ఆత్మలాభాన్ని కలిగించింది ఈప్రాణ చింతనము– దానిని గురించి చెబుతావినండి–

స్వామీ! నా దేహమనే గేహాన్ని (కొంపను) చూడండి– మనోరమంగా ఉంది– ఈకొంపకు వాత, పిత్త, కఫములనేవి మూడు లావయిన స్తంభాలు– తొమ్మిది ఇంద్రియాలు తొమ్మిదిద్వారాలు– పుర్యష్టకమనేది బంధువర్గము. (పుర్యష్టకశబ్దార్థము లోగడ చెప్పబడి నది) అహంకారమనే గృహస్థుచే కాపాడబడుతోంది– దీనికి కర్ణ శష్కులులు రెండూ శిరోగృహాలు– ఇది కేశములనే రెల్లుచే కప్ప బడింది– విశాలమయిన కళ్లు ఈకొంపకు కిటికీలు– ముఖమనేది సింహ ద్వారము– భుజపార్శ్వములు రెండూ ఉపమందిరాలు– దంతపంక్తి సింహ ద్వారానికి కట్టిన తోరణమాల– (తోరణపుదండ) జ్ఞానేంద్రియాలు నిత్యము కాపలా కాచే ద్వారపాలకులు– సర్వత్రవ్యాప్తమయిన ఆత్మ లోకంతో, (ఆత్మప్రకాశంతో) వ్యాప్తమయింది– (అనగా ఆత్మప్రకాశ మనేది ఈయింటికి దీపమని భావము.) కనుగుడ్లు అలిందములు– ( ) రక్తమాంస వసాది ద్రవ్యములతో మృద్గోమయములతో వలె పూయబడింది అలుకబడినది– నరములయొక్క సమూహంతో కట్టబడినది– స్థూలమయిన ఎముకలనే రాళ్ళతో కట్టినగోడలు కలది– మునిశ్రేష్ఠుడా! ఈ దేహమనే కొంపయొక్క మధ్య "ఇడా, పింగళ" అనే రెండు అతికోమలములయిన సూక్ష్మనాడులు ఉన్నాయి– అవి వామ దక్షిణ పార్శ్వములందు ఉంటాయి– అయ్యవి కనిపించవు– ముక్కోణములందు ప్రాణవాయుసంచారమను లింగముతో (గుర్తుతో)

అభివ్యక్తమగుచూ ఉంటాయి- అచ్చటనే హృత్పద్మమనే మూడు యంత్రాలు ఉన్నాయి- అవి పద్మయుగ్మత్రితయాకారములుగ నుండును. (అనగా కాడతో కూడికొని ముడుచుకొనియున్న రెండేసి పద్మముల జంటలవలె నుండును) ఆ యంత్రములు అస్థిమాంసమయములు- అతి కోమలములు- ఈహృత్పద్మమనే యంత్రత్రయమునకే పురీతత్ అని పేరు- ఈయంత్రములందే డెబ్బది రెండువేల నాడులు గుమికూడి యుండును- (ఈ యంత్రత్రయమే డెబ్బది రెండువేల నాడీ ప్రభేదము లకు మూలము.) (అనగా ఈహృత్పద్మమునందే డెబ్బది రెండువేల నాడులు చేరియుండెడి సన్ననిరంధ్రము (జాలము) లుండును- ఈమూడును ఒకదానితో నొకటి కలసియుండుటచే కోమలమయిన దలములు (పూరేకులు) కలిసియున్న పద్మములవలె నుండును- కనుకనే అవి ప్రత్యేకం యంత్రాకారములు- అగు నాసాగ్రము మొదలు పాదాంతము వరకునుండు సకల దేహాకాశమునందును సంచరించెడి అపాన వాయువను అమృతముతో తడియుటచే ఆదళములు వికసించియుండును- కనుకనే ఆయంత్రముయొక్క పత్రములు ప్రాణవాయువుచే వ్యాప్తము లయి మెల్లగా చలించుచూ ప్రతిఉచ్ఛ్వాసనిశ్వాసములందునూ కొద్దిగా ముడుచుకొనుచునూ కొద్దిగా వికసించుచునూ ఉండును- ఆదళములు కదలుచుండగా ఆకదలికచే ప్రాణవాయువు (గాలి) వృద్ధిచెంది నాడీ రంధ్రములద్వారా నాడులలోకిచేరి ఊర్ధ్వాధోభాగములం దుండెడి నాడులన్నిటిలోను ప్రవేశించి దేహమంతటను ప్రసరించును- (ఒకే ప్రాణవాయువు హృదయ, పాయు, నాభి, కంఠ, సర్వాంగములను స్థానభేదములను కల్పించుకొని ప్రాణాపానవ్యానోదానసమానములను సంజ్ఞలను చెందినదగుచూ శరీరంలో ఊర్ధ్వాధోభాగములందుండెడి డెబ్బది రెండువేలనాడులందును నూటఒక్క ప్రధాననాడులందును ప్రవేశించి దేహమునందు ప్రసరించుచుండు ననిభావము.) చంద్రబింబము నందు చంద్రకిరణములన్నీ ఇమిడియున్నట్లు ఈహృత్పద్మమనే యంత్ర త్రయమందు ప్రాణశక్తులన్నీ ఊర్ధ్వాధోభాగములకు ప్రసరిస్తూ దేహము

వండుండును- ఆప్రాణశక్తులు అన్నరసమును దేహమంతటను వ్యాపింపఁ జేయుటకు ఆయానాడులందు ఆయాపనులును చేయుచుండును- వచ్చుట, పోవుట, వెదజల్లుట, హరించుట, విహరించుట, ఎగురుట, పడుట అనేవి ప్రాణశక్తుల వ్యాపారములు- ఈశరీరంలో హృదయమే ముఖ్యస్థానము- ఇంద్రియములన్నిటిలోనూ ప్రాణమే ముఖ్యము- మిగిలినవన్నియు ప్రాణవాయువుయొక్క వృత్తిభేదములేకాని వేరు కాదు- కనుక ప్రాణవాయువొక్కటియే సకల శరీరేంద్రియాది చేష్టలను శక్తిభేదములచే (వృత్తిభేదములచే) చేయుచున్నది- ప్రాణవాయువు యొక్క ఒకానొకశక్తి చక్షురింద్రియమునందు పనిచేస్తోంది- ఇంకొక శక్తి త్వగింద్రియమునందు పనిచేస్తోంది- మరొకటి నాసికేంద్రియము నందు పనిచేస్తోంది- ఇంకొకశక్తి అన్నమును జీర్ణముచేస్తోంది- మరొకటి మాట్లాడింపచేస్తోంది- పెక్కుమాటలేల మహాత్మా! శరీరమునందు జరిగెడి సమస్తపనులూ ప్రాణవాయువు వలననే జరుగుచున్నాయి- కొయ్యబొమ్మను యంత్రసూత్రధారుడు ఆడించినట్లు ఈశరీరమును ప్రాణవాయువే ఆడించుచున్నది-

మహర్షీ! ప్రాణవాయువు ఒక్కటియే శరీరమంతటా నడుస్తోందనీ, దానికే స్థానభేదంచేత పేరుభేదం వచ్చిందనీ చెప్పితినికదా! అందులో రెండే ప్రధానములు- ఊర్ధ్వగమనముగల వాయువునకు ప్రాణవాయువనీ, అధోగమనముగల దానికి అపానవాయువనీ సంకేతము- ఈరెండే ముఖ్యములు- నేనీ రెండువాయువులయొక్క నడక ననుసరించి మాత్రమే ఉన్నాను- అనగా ఆధ్యాత్మిక పరిచ్ఛేదమును వదలి, ఆధిదైవికమగు సూత్రాత్మరూపములు ఇవి(ప్రాణాపానవాయువు) యని నిత్యము ధారణచేయుచు విషయాసంగముచే పాపదూషితమయిన సర్వేంద్రియవ్రతమును పరిత్యజించి, ప్రాణవాయువ్రతమును మాత్రమునే ఆచరిస్తూ ఉన్నాను- అనగా వాగాదీంద్రియములు వచనము మున్నగు తమతమ విషయములందు వ్యసనముగలవి- అందువల్ల

విషయాసంగముచే పాపదూషితములయినాయి- కనుక అవి శ్రమరూప మయిన మృత్యువు చే చెడిపోయాయి- ప్రాణవాయువునకు ముఖనాసికా గోళకములందు సంచరించుటయే వ్రతము కాని వేరే విషయాసంగము లేదు- కనుక పాపదూషితముకాదు ప్రాణవాయువు- (ప్రాణము)- కనుక ప్రాణమొక్కటియే వ్రతభంగశూన్యమయినది- కనుకనే మృత్యు గ్రస్తముకాదు- అందుచే ఆప్రాణమునే సూత్రాత్మస్వరూపముగా నేను ధారణ చేయుచుండుటచే నేను మృత్యువును జయించి ఉన్నాను- ఇదే నేనొనర్చెడి ప్రాణచింతనము- ప్రాణధారణ సహితమయిన ఇలాంటి ప్రాణచింతనము బృహదారణ్యకమునందు "అథాతో వ్రతమీమాంసా" అను వాక్యముతో నారంభించి "తస్మాదేకమేవవ్రతం చరేత్ప్రాణ్యా చ్చైవాపాన్యాచ్చ నేత్పాప్మా మృత్యురాప్నువత్" అనియు, "యద్యు చ్చరేత్సమాపిపియిషేత్తే నోఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోక తాం జయతి" అనియు నుండు గ్రంథముచే విస్తరించి చెప్పబడినది-

ఈ ప్రాణాపానములు రెంటిలో నొకటి చల్లని శరీరముగలది- మరొకటి వెచ్చని శరీరముగలది- ఈ రెండునూ దేహాకాశమునందు సంచరించెడి బాటసారులు- (పాంథులు) కలేబరమను మహాయంత్ర మును నడపువారలు- శ్రమరహితములు- హృదయాకాశమందలి సూర్య చంద్రులు- అగ్నిషోమరూపులు- శరీరమను పురమును పాలించుచున్న మనస్సుయొక్క రథచక్రములు- అహంకారమనే రాజుగారికి ఇష్టమైన అతి ప్రశస్త తురంగములు-(గుర్రములు) ఈయవి మూడవస్థలయందును ఏకరూపములు- ఆ ప్రాణాపానములు అను శారీరక వాయువులను యావజ్జీవము ఉపాసించుచున్ననాకు నిద్రించుచున్న వానికివలె రోజులు సుఖంగా గడచిపోతున్నాయి- ఒక తామరతూడుయొక్క దారమును వెయ్యిముక్కలుగా తెరచితే అపుడు ఒక్కొక ముక్క ఎంతసూక్ష్మ ముగా దుర్లక్ష్యముగా నుండునో అట్లే ఈ ప్రాణాపానముల గతికూడ అతిసూక్ష్మము అతిదుర్లక్ష్యము- మహాత్మా! హృదయాది స్థానము

లందు ఎల్లపుడు సంచారముగల ఈప్రాణాపానవాయువుల పరిస్థితి అనేక శ్రుతులలో ప్రాణోపాసనా ప్రకరణమునందు అనేకవిధములుగ ప్రశంశించి చెప్పబడినది. నిర్దోషములనీ, గతశ్రమములనీ, అభగ్నవ్రతము లనీ, సంవర్గరూపములనీ, ఇంకా అనేక గుణములుగలవనీ నిరూపింప బడినవిఇవి-అది తెలిసికొని నేను వానిని ఉపాసించి మృత్యుపాశరహితుడ నగుచూ, జీవన్ముక్తుడనై ఈసంసారంలో మరల పుట్టుటలేదు సుమా! అని అన్నది భుశుండను వసిష్ఠునితో-

## ౨౫. సమాధివర్ణనము.

వసి॥ రామచంద్రా! ఇలా ఆపక్షి (భుశుండమను వాయసము) చెపుతూఉండగా "ఆ ప్రాణవాయువుయొక్క గతి (నడక) ఎలాంటిదో చెప్పమని నేనుమళ్ళీ" అడిగాను దాన్ని-

భుశుం॥ మునీ! మీరు తెలిసిఉండే నన్నువిలాసగా అడుగు చున్నారు- మీరడిగిన దానికి సరిగా నేను జవాబు చెబుతున్నాను- వినండి నామాట-

మహర్షీ! ప్రాణవాయువునందు రెండుపదములు ప్రవర్తించు చున్నవి- ఒకటి ప్రాణశబ్దము- రెండు ప్రాణగతి శబ్దము- ఇందు ప్రాణ శబ్దము రూఢము. రెండవది (ప్రాణగతిశబ్దము) యౌగికము- ఇది ఆ ప్రాణవాయువుయొక్క లక్షణమును చెప్పును. బ్రహ్మర్షీ! ప్రాణ మనునది ఎల్లపుడు స్పందశక్తికలది. సదాగతి" యని దీనికి పేరుకలదు- ఇది యీ శరీరంలో ఊర్ధ్వభాగము నందుండును- అపానమనునది కూడ స్పందశక్తి కలదే- సదాగతికలదే- కాని అయ్యది బాహ్యాభ్యంతర శరీరంలో అధోభాగమునం దుండును- ఈ రెంటిలో (ప్రాణాపానములు రెంటిలో) మెలకువతో నున్నవానికిగాని, నిద్రించుచున్న వానికి, ప్రాణాయామమనునది ఉత్తమమయినది- అదే శ్రేయస్కర మయినది- వినండి దానివిధానం (ప్రాణాయామవిధానం) చెబుతాను

హృత్పద్మకోటరమునుండి మూర్ధపర్యంతము ప్రాణవాయువులు బయలు దేరి బాహ్యోన్ముఖమగుట రేచకమందురు- మూర్ధప్రదేశమునుండి బయలుదేరిన ప్రాణవాయువులు, బయట (వెలుపల) ద్వాదశాంగుళ ముల పర్యంతము (పన్నెండు అంగుళాల పర్యంత ప్రదేశమును) ఆక్ర మించుట పూరకమనబడును- మొదటిది అంతర రేచకమనీ రెండవది బాహ్యపూరకమనీ అంటారు యోగులు- నాసాగ్రము మొదలు మూర్ధ పర్యంతమునుండి వాయుస్పర్శకాని, మూర్ధప్రదేశమునుండి హృదయ పర్యంతమునుండు వాయుస్పర్శకాని అంతఃపూరకమని అనబడును- అపానవాయువు ప్రశాంతమై ప్రాణవాయువు హృదయభాగమునందు ఉత్పన్నముకానిచో ఆస్థితి కుంభకావస్థయని అందురు యోగులు- ఇలా రేచకము కుంభకము, పూరకము అని మూడు విధములుగ నున్నది ప్రాణాయామము- అపానవాయువుయొక్క ఉత్పత్తిస్థానమం దునూ,నాసాగ్రమునకు బయట ద్వాదశాంగుళపర్యంత ప్రదేశమందును, ప్రయత్నరహితంగా స్వతస్సిద్ధంగా సర్వకాలములయందూ పుట్టెడి రేచకాదులను చెప్పెదను వినండి- నాసాగ్రమునకు వెలుపల పన్నెం డంగుళముల ప్రదేశమునకు ఆవల అభిముఖముగా నుండెడి వాయువు నకు ఆ బాహ్యప్రదేశమునందే రేచక పూరక కుంభకాదులను ఆలో చించవచ్చును- మట్టిలోపల అనభివ్యక్తముగ నున్నకుండవలె పన్నెం డంగుళముల పర్యంతప్రదేశమున ఆకాశమునందు నిత్యము బాహ్య వాయువు లోపలనుండెడి అపానవాయువునకు కుంభకస్థితిని గ్రహించ వలెను- బాహ్యోన్ముఖమయిన వాయువునకు నాసాగ్రావధియగు (ముక్కుయొక్క చివరవరకునుండు) గతి (నడక) ఏదికలదో దానిని యోగులు బాహ్యపూరకమందురు- నాసాగ్రమునుంచికూడ బయలు దేరి పన్నెండంగుళ ప్రదేశమువరకుగల వాయుగతిని మరియొక బాహ్య పూరకమందురు- ప్రాణవాయువు బయటికిరాక యెంతవరకు అపాన వాయువు బయటికి పుట్టునో అంతవరకు బాహ్యపూరకమని యందురు-

అపానవాయువుయొక్క చలనము లేకుండగ వాయువునకు అంతర్ముఖత్వమునది బాహ్యరేచకమనబడును- అపానవాయువు బయలుదేరి నాసాగ్రపర్యంతము చలించుచు స్వరూపాభివ్యక్తితో బలియుట మరొకవిధమయిన బాహ్యపూరకము- ఎల్లపుడు అప్రయత్నముగా జరిగెడి ఈబాహ్యాభ్యంతర కుంభక పూరక రేచకములను ప్రాణాపాన స్వభావముగలవానిని తెలిసికొన్నవానికి మరలజన్మ యుండదు ఈ యెనిమిది విధములయిన రేచకకుంభకాదులు దేహవాయువులకు రాత్రింబవళ్లు స్వతస్సిద్ధముగా జరిగెడివి. వాయువులు అతిచంచలములు- కనుక నీయవి నడచువానికీ, నిలచున్నవానికీ, మెలకువతో నున్నవానికీ, నిద్రించువానికీ కూడ సహజముగా జరిగెడిది నిరోధాభ్యాసమునకు ఈ భావన శాంతివరకు నుపయోగపడును- వీనినిట్లు అభ్యాసము చేసినందువలన కొంతకాలమునకు ప్రాణనిరోధముకూడ అలవడును- వీని అభ్యాసముచే కర్తృత్వభోక్తృత్వాభ్యాసము కూడ నశిస్తుంది- ఇలాఉండి క్రమంగా బాహ్యదృష్టిని పరిత్యజించుచో లోపల ఆత్మజ్ఞానోదయము కలిగి పరమపదప్రాప్తి కూడ సిద్ధించును దీనివలన బాహ్యమునంగు వీనిని అభ్యసించుపురుషునకు బాహ్యవిషయములందు చిత్తము అనురాగము చెందదు- కుక్కతోలు తిత్తిలోని పాలమీద బ్రాహ్మణునికి కోరిక ఉండనట్లు- ఈదృష్టికలిగి ఇందులో ఆరితేరినవారికి పొందదగినదంతయు పొందబడినట్లే- వీరికింక బంధనముండదు- ప్రాణాపాన చింతనమువల్ల ఆత్మబోధకలిగినవారికి రాగాదిమలము శాంతించును- మనస్సు స్వచ్ఛమగును- బాహ్యాకాశమునకు ఉన్ముఖమయిన ప్రాణవాయువు అగ్నిజ్వాలవలె వెచ్చగానుండును- పైకిప్రసరించును- హృదయాకాశమునకు ఉన్ముఖమయిన అపానవాయువు నీటివలె నిమ్నభాగమునకు ప్రసరించును- చల్లగానుండును- అపానము చంద్రునివలె దేహమంతయును తృప్తిపరచును- (చల్లపరచును.) ప్రాణవాయువు సూర్యునివంటిది- లేక అగ్నివంటిది- శరీరమంతయును పచనము చేయును- ప్రాణవాయువు ప్రతిక్షణము హృదయాకాశమును తపింపజేసి తరువాత

ముఖాగ్రమందలి ఆకాశమును తపింపజేయును సూర్యుడు ఆకాశమును తపింపజేసినట్లు— అపానవాయువను చంద్రుడు ముఖాగ్రమును ఆనంద పరచి, తరువాత హృదయాకాశమును ఆనందపరచును— అంతస్థమయిన అపానవాయువుయొక్క కళ ప్రాణవాయువను సూర్యునిచే నెపుడు గ్రసింపబడునో అపుడు సంసారదుఃఖముండదు మానవునకు— అలాగే ప్రాణవాయువుయొక్క కళ అపానవాయువను చంద్రునిచే గ్రసింపబడిన దశలో మానవునకు సంసారదుఃఖముండదు— తత్త్వదృష్టిలో విచారించి నచో ఒక్కప్రాణమే రవిశశిభావమును జెందును— ద్వాదశాంగుళ పర్యంతము ప్రసృతమయిన ప్రాణము జౌష్ణ్యమును విడిచి యెంతవరకు శైత్యమును (చల్లదనమును) పొందనో అంతవరకు అది ప్రాణాపానము లకు సంధ్యవస్థ— ఆయవస్థలో దేహమునకు వెలుపల ప్రాణము లయిం చుటవలన ఆత్మకు నిర్దేహాత్వ, నిష్క్రియత్వ, నిర్మనస్త్వాదులు ఊహింప సాధ్యమగుటచే విచారింపబడు చుండును— బాహ్యకుంభకమునందు దేహాది దేశపరిచ్ఛేదము లేనందునను చంద్రసూర్యాత్మకమయిన ప్రాణా పానక్రియాప్రయుక్తమయిన ఆయుఃకాలపరిచ్ఛేదము లేనందునను, దేశ కాలములను ఆత్మయందు ప్రతిష్ఠించుకున్న (నిలుపుకున్న) యోగి దుఃఖిం చడు— ఇలాగే అంతఃకుంభకమందుకూడ హృదయమందలి ప్రాణాపాన సంధిదశలో ప్రతిష్ఠితమయిన మనస్సునకు అధిష్ఠానమయిన పరమాత్మ తత్త్వబోధ అవశ్యంభావియగుటచే జన్మాదిప్రసక్తి లేదు— హృదయము నందున్న ఆత్మయే ప్రాణసూర్యుడనియు అతడే అపానరూపుడగు చంద్రుడుగ ఉదయాస్తమయములుగల వ్యాసాది వృత్తిభేదముచే వివర్తముచెందుచున్నాడనియు, అంతకంటె వేరుగ మరొకడు లేడనియు ఉపాసించుట ఆత్మదర్శనమునకు హేతువు— బాహ్యజ్యోతిస్సువలన బాహ్యతమస్సు క్షీణించినను (నశించినను) బాహ్యములయిన రూపా దులే కనిపించునుగాని వెలపల ఆత్మదర్శనము కలుగదు— కనుక వెలు పలకూడ ఆత్మ అంతరతమస్సు (లోపలి అజ్ఞానాంధకారము) చేతనే

వ్యాప్తమయియున్నాడు-అందుచే అంతరతమస్సును పోగొట్టెడి అంతర జ్యోతిస్సును- (వివేకప్రకాశమును) అన్వేషింపవలెనుగాని బాహ్య జ్యోతిస్సును అన్వేషించినందున లాభంలేదు- కనుక హృదయమందు ఆత్మసాక్షాత్కారమే ఉపయోగకరము-

కాక బాహ్యాంధకారకల్పనకూడ హార్ధధ్వాంత(హృదయమందలి అజ్ఞానాంధకారము) వలననే ఏర్పడినది కాని హార్ధాంధకారము నశించి నచో బాహ్యాంధకారనాశము దానంతట అదే నశించును- దానికొరకు వేరుప్రయత్నము అక్కరలేదు- బాహ్యాంధకారము నశించినచో ప్రపంచ స్వరూపము అభివ్యక్తమగును- హార్దాంధకారము నశించినచో ఆత్మ స్వరూపము అభివ్యక్తమగును- హార్ధాంధకారమును నశింపజేసెడి జ్ఞాన మును సంపాదించిననే ముక్తికలుగును- హృత్పద్మకోటరంలో అపాన చంద్రుడు అస్తంగతుడయ్యేసరికి ఆస్థానమునుండి ప్రాణార్కుడు బహి ర్ముఖుడగును- (అనగా వెలుపలికి వచ్చుటకుద్యుక్తుడగును.) నీడతగ్గితే అచ్చోట ఎండబయలుదేరును- అలాగే అపానము అస్తంగతమయితే హృత్పద్మమునుండి ప్రాణము ఉత్పన్నమవును- ఎండ తగ్గిపోతే నీడ బయలుదేరుతుంది- అలాగే ప్రాణము అస్తంగతమయితే ఒక్క క్షణంలో బాహ్యమునుండి అపానము ఉత్పన్నమవును. మహర్షీ! ప్రాణవాయువు ఉత్పన్నమయిన ప్రదేశంలో అపానవాయువు నశించి నట్లు గ్రహించండి- అలాగే అపానవాయువు జన్మించినప్రదేశంలో ప్రాణవాయువు నశించినట్లు గ్రహించండి- ప్రాణవాయువు అస్తంగతమై అపానవాయువు పుట్టుటకుద్యుక్తమైనపుడు బాహ్యకుంభకమును అవలం బించిన మానవుడు సంసారదుఃఖమునొందడు- అపానవాయువు అస్త మించి ప్రాణవాయువు కొంచెము వృద్ధిచెందుట కుద్యుక్తమయినపుడు అంతఃకుంభకమును అవలంబించిన మానవుడు సంసారదుఃఖము నొం దడు- ప్రాణవాయువు బయటికి విడుచుట ప్రారంభించి పదునారంగు ళముల ప్రదేశమువరకు ప్రసరించు దానినిగ జేసి స్వచ్ఛమయిన కుంభ

కమును అభ్యసించినవాడు సంసారతాపము నొందడుమఱి- అపానవాయువు నాసావివరమునుండి లోపలప్రవేశించి యుండగా బాహ్యరేచకమున కాధారమయిన ప్రాణవాయుపూరణముకొరకు దేహాంతర్గతమయిన పూరకమును ఉపాసించిన మానవుడు పునర్జన్మము నొందడు- ఎవని హృదయాకాశమందు ప్రాణాపానములు రెండునూ విలయమును జెందునో అట్టిదశ పరమశాంతిమయినది- ఆస్థితిలో ఆత్మకు సంసారపరితాపమేమాత్రము ఉండదు- ప్రాణలయమునకు అధిష్ఠానమగు చైతన్యమునందు కాని, లోపలిప్రాణవాయువు బయటికివచ్చుటకు అపానమగు చైతన్యమునందు కాని దేశకాలవస్తువులు బాధింపబడుటచే దేశకాలవస్తువులు నిష్కలచిన్మాత్రములేకాని వేరుకాదని ఇట్టి విచారణగల మానవునకు పునర్జన్మయుండదు- క్షణకాలము ప్రాణము అస్తమించియు, అపానము ఉదయించకయు నుండును- ఈదశ ప్రాణాపానసంధి క్షణంలో ఎల్లప్రాణులకు ఉండును- కాని యోగులు దానిని తెలిసికొందురు- ఇతరులు తెలిసికొనలేరు- ఇట్టిస్థితిని అప్రయత్నసిద్ధమయిన బాహ్యకుంభకమందురు- అప్రయత్నసిద్ధమయిన లోపలి కుంభకమే (అంతస్థకుంభకము) పరమపదము- అదియేముక్తి- అదే ఆత్మయొక్క రూపము- అదేపరిశుద్ధమైన చైతన్యము- అదే స్వరూపము- ఈపదవిని పొందినవానికి సంసారశోకముండదు- పుష్పములో పరిమళమున్నట్లు ప్రాణవాయువులో అధిష్ఠానచైతన్యమున్నది- దానినే మేముపాసించుచున్నాము- నీటిలో మాధుర్యమున్నట్లు అపానమునందు చిదాత్మఉన్నాడు- అతడు ప్రాణమూకాదు- అపానమూకాదు- అట్టి చిదాత్మను మేము ఉపాసించుచున్నాము- (చిద్రూపాత్మయొక్క పరిచయముకొరకు ప్రాణాపానములందున్నట్లు చెప్పబడినదికాని ప్రాణాపానోపహితుడుగా ఆత్మను ఉపాసించుమని కాదు.) ప్రాణనాశమున కధిష్ఠానమయినట్టియు అపాననాశమున కధిష్ఠానమయినట్టియు ప్రాణాపానముల మధ్యనున్న చిదాత్మను ఉపాసించుచున్నాము- ప్రాణమునకు ప్రాణమును, జీవమునకు జీవనమును, దేహమునకు ధారణమును,

(దేహమును)అగు చిదాత్మను మేము ఉపాసించుచున్నాము-మనస్సునకు మననశక్తిని కలిగించునట్టియు, బుద్ధికి బోధశక్తి నిచ్చునట్టియు, అహంకృతికి అహంకారమయినట్టియు చిదాత్మను ఉపాసించుచున్నాము. ఎవనియందు సర్వమూ ఉన్నదో, ఎవనినుంచి సర్వము పుట్టినదో, ఎవడు సర్వరూపుడో, ఎవడు సర్వవ్యాపకుడో, ఎవడు నిత్యమూ సర్వప్రపంచమయుడో అట్టి చిత్తత్త్వమును మేము ఉపాసించుచున్నాము- ప్రకాశములకు ప్రకాశమునిచ్చువాడు- పావనములకు పావనుడు- మనో బుద్ధ్యాదివికారములకు లొంగనివాడు- (వికారమును చెందనివాడు.) అట్టి చిదాత్మను ఉపాసించుచున్నాము- ఏచిదాత్మయందు అపానము ఉదయింపలేదో ఏచిదాత్మయందు ప్రాణము అస్తమించినదో ఏచిదాత్మ నాసాగ్రమనే గగనమునందలి ఆవర్తమో అట్టి చిదాత్మను ఉపాసించుచున్నాము. ప్రాణాపానోద్భవస్థానముల కధిష్ఠానమగు చిదాత్మను ఉపాసించుచున్నాము. ప్రాణాపానోపాధులను రథమును అధిష్ఠించియున్నట్టియు, పరిచ్ఛిన్నమగుచూ ప్రాణాపానశక్తులను కలిగించునట్టియు, ఇతర శక్తులన్నిటికీ శక్తిరూపమయినట్టియు చిదాత్మను ఉపాసించుచున్నాము. రేచకపూరకకుంభకాదిభావములతో వివర్తమును జెందు చిదాత్మను ఉపాసించుచున్నాము- ఇంద్రియప్రవృత్తులకునూ, విషయోపభోగములకును కారణమగు చిదాత్మను ఉపాసించుచున్నాము- పరమార్థ దృష్టిలో భేదరహితమయినట్టియు, ఆపాతదృష్టిలో ప్రాణాదిషోడశకలాగణముతో కూడిఉన్నట్టియు, నిరతిశయానందరూపమగునట్టియు, సురప్రణుతమయిన పరతత్త్వమును ఉపాసించుచున్నాము-

## ౨౬. సర్గ.

భుశుం॥ మహాత్మా! ఇలాంటి చిత్తవిశ్రాంతిని నేను యోగం చేత (ప్రాణసమాధిచేత) క్రమంగా సంపాదించాను- ఈదృష్టిని అవలంబించి ఉండుటవలననే ఒక్కనిముషముకూడ కదలక మేరుపర్వతమువలె నున్నాను- ఈఆత్మసమాధి నాకు వెళ్లుచున్నా,నిలుచున్నా, నిద్రించినా,

మేలుకున్నా, కలలోనున్నా చలించను- నిత్యానిత్యములయిన ప్రపంచ విషయాలలో విక్షేపరహితంగా అంతర్ముఖుడుగా ఉన్నాను స్వచ్ఛందంగా గాలిని మూటకట్టవచ్చు- నీటిని అడ్డగించవచ్చు- నా యీ సమాధిని మాత్రం అడ్డపరచజాలదు విషయజాతమేదియు- మహర్షీ! ఈ ప్రాణాపానచింతనమువల్లనూ, పరమాత్మజ్ఞానమువల్లనూ, శోకరహితమగుస్థితిని పొందాను- మహాప్రళయమునుంచియు భూతములు ఈ సంసారసముద్రంలో మునుగుచూ, తేలుచూ ఉండుటను నేను చూచుచునే బ్రతుకుచున్నాను- గడచినదానిని ఆలోచించను నేను- రానున్న దానినీ ఆలోచించను- కేవలము వర్తమానదృష్టినిమాత్ర మవలంబించి కాలంగడపుతున్నాను- యథాప్రాప్తమయిన పనులందు ఫలేచ్ఛను వదలి నిరభిమానంగా ఉంటున్నాను- ఇష్టానిష్టముల విషయమయిన చింత హేయమని(పనికిరాదని)నిశ్చయించుకొని ఆత్మను నమ్మి జీవించుచున్నాను- ప్రాణాపానముల సంధిదశలో ప్రకాశించెడి బ్రహ్మను సంస్మరించుచు ఆత్మతుష్టితో జీవించుచున్నాను. "ఇది నాకు లభించినది" "ఇది నాకు లభింపనున్నది" అను చింత నాజీవితంలో లేదు- నేను ఎవరినీ స్తుతించను- ఎవరినీ నిందించను- నన్నుకాని, ఇతరునికాని, నాకు స్వపరభేదము ఏమాత్రమూలేదు- మంచికలిగితే సంతసించను- చెడుకలిగితే ఖేదపడను- నామనస్సు నిత్యము సర్వసమముగా నుండును. సర్వద్వైతబాధరూపమగు త్యాగమును అవలంబించాను- అంచేత జీవితంమీద అభినివేశమును కూడ వదలాను- అందువల్ల మునీంద్రా! నామనస్సు ప్రశాంతంగా ఉంది- శోకరహితంగా ఉంది- స్వస్థంగా ఉంది- కాష్ఠమును చూచినా విలాసవతియగు వేశ్యనుచూచినా, రాతిని చూచినా, గడ్డిపోచనుచూచినా, నిప్పునుచూచినా మంచును చూచినా, శూన్యమయిన ఆకాశమును చూచినా, నామనస్సు ఒకేతీరుగా ఉంటుంది- నాకిపుడు ఏమిలభించింది? తెల్లవారి నాకేమి లభించగలదు? అనే చింతయే నామతికి లేదు- జరామరణదుఃఖములకు భయపడను- రాజ్యలాభసుఖములకు సంతసించను- "వీడు బంధువు", "వీడు

పరాయివాడు" అనే భావం నాజీవితంలో నాకు లేదు- సర్వప్రపంచము చిన్మయమనుభావము నాకు స్థిరపడింది- నేనే పనిచేస్తున్నా నాకు దేహాభిమానం ఏమాత్రం లేదు-అంచేత నాకు చిరజీవితము ప్రాప్తించింది ఈప్రపంచకార్యం అంతా సుషుప్తిగా భావించి నేను లేనిదానినిగా గుర్తించాను- ప్రారబ్ధకర్మను అనుసరించిన భోగకాలంలో ప్రాప్తము లయిన అర్థానర్థములు రెండూ నాకు సమానములు- శరీరమునకున్న చేతులు రెండూ శరీరమునకు ఎలా సమానములో అలాగే- మనస్థైర్యము తోనూ, ఆత్మౌపమ్యముతోనూ, సర్వత్ర అకుటిలమగు బ్రహ్మమును చూస్తూ ఉంటాను- ఆపాదమస్తకపర్యంతమైన ఈదేహమందు నాకు మమకారం ఏమాత్రం లేదు- అహంకారాన్ని వదలి జీవిస్తున్నాను- ఏపని చేస్తున్నా, దేనిని అనుభవిస్తున్నా, నాకు వానిమీద అభిమానం లేదు- అంచేత శరీరంతో చేస్తున్నా, అనుభవిస్తున్నా, నామనస్సు నైష్కర్మ్యమును చెందింది- మునీ! నాకు జ్ఞానము పెరిగినకొలది వినయము పెరుగుచున్నదికాని అవినయము పెరుగుటలేదు- నేనెంతటి సమర్థుడనయినా ఇతరులను పరిభవింపను- ఇతరులు నన్ను పరిభవించినా నేను సహింతునుకాని ఖేదపడను- దరిద్రుడనయినా దేనిని కోరను నేను నాశరీరమందు చిన్మాత్రదృష్టితో ఎలా ఉంటున్నానో, ఇతర భూతముల శరీరమందుకూడా నాకు అలాంటి చిన్మాత్రదృష్టే కద్దునాకు- ఆశాపాశబద్ధమయిన చిత్తవృత్తికి నాహృదయంలో నేనెంత మాత్రము ప్రవేశమివ్వను- ప్రపంచముయొక్క అసత్తనూ, ఆత్మయొక్క సత్తనూ, నేను చేతిలోని మారేడుపండువలె చూస్తూ ఉంటాను- బాహ్యదృష్టిలో నిద్రిస్తూ ప్రపంచముయొక్క అసత్తను చూస్తూ ఉంటాను- లోపల మెలకువకలవాడనై ఆత్మసత్తను చూస్తూ ఉంటాను- జీర్ణమయినదానిని క్రొత్తదాన్నిగా చూస్తాను- విరిగిపోయిన దానిని క్రొత్తదానినిగ చూస్తాను- వ్యాపృతావయవములుగలదానిని క్రొత్తగా చూస్తాను- సంచూర్ణితావయవములు కలదానిని నూతనంగా చూస్తాను-

సుఖితునిజూచి సుఖంగా ఉంటాను- దుఃఖితుణ్ణి చూచి దుఃఖముచెందుదును- అందరకు ప్రియమిత్రునిగా ఉంటాను- ఆపదలందు ధైర్యంగా ఉంటాను- సంపదలందు ప్రపంచమిత్రుడను- సంపద్విపత్తులందు నాకభినివేశములేదు- "నేను" అనుభావము నాకు లేదు- "అన్యుడు" అనుభావం నాకులేదు- నేనే ప్రపంచము- నేనే ఆకాశము- నేనే దేశకాల క్రియలు- నేనే క్రియ, కర్మ- ఘటముచిత్తు- పటముచిత్తు- ఆకాశము చిత్తు- వనముచిత్తు- శకటముచిత్తు- సర్వమూచిత్తు- మహాత్మా! ఈ ఈ భావములు కలదాననయినందున నేను చిరకాలము జీవించి యున్నాను- "మునిశార్దూలమా! భుశుండమని ప్రసిద్ధిచెందిన కాకోలమగు నేను ఇలా మనవిచేసికొనుచున్నాను"- అని అన్నది భుశుండము-

౨౭. సర్గ.

భుశుం॥ మహర్షీ! మీయాజ్ఞను అనుసరించి నేనునెట్లు చిరకాలము జీవించినదీ ఈకార్యకారణ సంఘాతమయిన దేహంలో పరమార్థంగా ఎలాఉన్నదీ! ధార్ష్ట్యముతో చెప్పాను- అన్నది భుశుండము_

వసి॥ భుశుండమా! ఎంతటి ఆశ్చర్యము! నీవృత్తాంతము శ్రుతిభూషణమయినది- (చెవులకు అలంకారమయినది) (వేదశ్రుతికి అలంకారమయినది) రెండవబ్రహ్మవలెనున్న నిన్ను జూచినవారు ధన్యులు- వారి నేత్రములు ధన్యములు- పరమపవిత్రమయిన నీవృత్తాంతమంతయు చెప్పితివి- మేము నలుదిక్కులా దేవతలయొక్కయూ, విద్వాంసులయొక్కయూ, జ్ఞానైశ్వర్యసంపదలను చూచాము. కాని మీబోటివార్లను ఎక్కడా చూడలేదు- ఒకవేళ చాలప్రయత్నంచేసి వెతకితే తత్త్వజ్ఞుడయిన మహానుభావుడు ఒకానొకడు అతికష్టంమీద దొరకవచ్చునుకాని, అతనుకూడ నీవలె సులభుడుకాడు- వెదురువనంలో ఒకానొక వెదురుబొంగులో మౌక్తికము బయలుదేరునట్లు జగత్కాండంలో నీబోటివాళ్లు బయలుదేరుతారు అరుదుగా- పుణ్యశరీరముగల

నిన్ను చూడటంచేత నేను మహత్తరమయిన కార్యమును నెరవేర్చి నాను- గొప్పపుణ్యమును సంపాదించాను- నీకు శుభమగుగాక- ఇంక నీగుహను చేరుము- నాకు మధ్యాహ్నకాలమయింది- నాస్వగృహము నకు పోవలెను- (అనగా నేను సప్తర్షిలోకమును చేరవలయును-) అన్నారు వసిష్ఠులు- ఆమాటవిని భుశుండము ఆవృక్షమునుంచిలేచి సంకల్పమాత్రంచేత చేతులను తయారుచేసికొన్నది- వానిచే బంగారు, చిగురుటాకులును సంపాదించుకున్నది- కల్పవృక్ష తీగలందలి పుష్పాడి తోనూ, మంచు బిందువులతోనూ, క్రొత్తికములతోనూ అర్ఘ్యపాత్రను పూరించినది- రామా! ఆ అర్ఘ్యపాద్యపుష్పములతో త్రినేత్రునివలె నన్ను పూజించింది- అపాదమస్తకమూ అతిభక్తితో-

రామా! ఆపైన నేను "ఓఖగేంద్రమా! నీవు లేచి నన్ననుస రించి వచ్చుట"యను శ్రమ నీకవసరములేదు- అని దానితో చెప్పి నేను ఆసనమునుంచి లేచి పక్షివలె ఎగిరివచ్చాను- అదియు ఆకాశమునందు ఒక ఆమడదూరం నన్ను సాగనంపుటకు నాకూడవచ్చినది- తుదకు నేను (కరంకరేణావష్టభ్య) (చేతినిచేతితోపట్టుకొని) (అనగా షేక్‌హాండు ఇచ్చి బలాత్కారంగా మరలించానుదాన్ని- నేను బయలుదేరాను క్షణంలో నభోమార్గంలో నాకు కనిపించకుండా పోయింది భుశుండము- సత్పురుషుల సాంగత్యమును విడచుట అతికష్టముకదా! అంతట మేము ఉభయులమూ ఒకరికొకరము అదృశ్యులమయినాము- అవిచ్ఛి న్నమయిన ఖగస్మృతితో సప్తర్షిమండలంచేరి మునులనుచూచాను- అచట నాభార్యయగు అరుంధతిచే పూజింపబడ్డాను- రామా! కృత యుగముయొక్క ఆదిలో రెండువందల సంవత్సరాలు గడచినతరువాత నేనాభుశుండమును కలసినాను మేరుశృంగమున వటవృక్షమునందు- ఇపుడు కృతయుగము గడచిపోయింది- త్రేత జరుగుచున్నది- నీవు ఈ త్రేతాయుగముయొక్క మధ్యలో పుట్టావు- మరల యిప్పుడు ఎనిమిది సంవత్సరముల క్రిందట ఆ పర్వతంమీద అభుశుండమును

కలిసికున్నాను- అది అప్పుడు కృతయుగంలో ఎలాఉన్నదో అలాగే ఉంది యిప్పుడుకూడా- కనుక ఇదీ భుశుండముయొక్క- చరిత్ర- అతి విచిత్రమయినది- దీనినివిని విచారించి నేనుచెప్పినదానిని ఆచరించు- ఈభుశుండనుయొక్క- సత్కథను లోకంలో ఎవడు మంచిమనసుతో విచారిస్తాడో వాడు భవభయమును విడచి సంసారసాగరమును దాట గలడు అన్నారు వసిష్ఠులు-

భుశుండోపాఖ్యానము సమాప్తము.

౨౮. పరమార్థయోగోపదేశము.

వసి॥ రామా! ఇదీ భుశుండుని వృత్తాంతము- ఈ జ్ఞానంతో భుశుండుడు మోహసంకటనుండి తరించాడు- నీవుకూడా దానివలె ప్రాణనిరోధమనే యోగమును అభ్యసించి సంసారార్ణవమును దాటు- జ్ఞానముచేతను, యోగముచేతను, భుశుండము పొందిన స్థితిని పొందు- (చేరినతావుచేరు) నిరీహులందరు భుశుండునివలె పరతత్త్వంలో ఉండి పోతారు యోగాభ్యాసంచేత- ఇలా చిత్రవిచిత్రములయిన విజ్ఞానదృష్టు లను కొన్నిటిని చెప్పానునీకు- విన్నావు నీవు వాటిని- ఇకమీాదట వివేకంతెచ్చుకొని నీకు ఎలాతోస్తే అలాచెయ్యి-

శ్రీరా॥ మహర్షీ! మీారు భూలోకభాస్కరులు- మీావద్ద జ్ఞాన కిరణాలు అనేకంగా ఉన్నాయి- నాహృదయంలో అజ్ఞానాంధకారం గట్టిగాఉంది- దాన్నిపోగొట్టారు- జ్ఞానకిరణాలచే- ఇపుడు తెలివి వచ్చింది- ఆనందించాం- స్వస్వరూపాన్ని పొందాము- రెండవ మీావలె తెలియదగిన తత్త్వాన్ని తెలిసికున్నాము- అబ్బా! మీారు సెలవిచ్చిన భుశుండవృత్తాంతము చాలాఆశ్చర్యకరమయినది- అమూల్యార్థమును బోధించునది- మీారు సెలవిచ్చిన భుశుండ చరితంలో మాంసచర్మా స్థినిర్మితమయిన శరీరగృహమని అన్నారే! తమరు- అది ఎవరు

తయారుచేశారు? ఎలాపుట్టింది ? ఎలా ఇంతకాలం ఉంది ? అందులో ఉన్నవాడెవడు ? చెప్పండి అని అడిగాడు శ్రీరాముడు–

వసి॥ రామా ! చెబుతావిను– దీనితో నీమనోదోషం పోతుంది– పరమార్థజ్ఞానం కలుగుతుంది– రామచంద్రా ! నేను చెప్పిన శరీరగృహమనేది ఎముకలు అను స్తంభాలు గలది– తొమ్మిది ద్వారాలు కలది– రక్తమాంసాలతో కూడినది– దాన్ని ఎవరూ తయారుచేయలేదు– ఇది ఆభాసమాసమాత్రము– (అలాకనిపించడమే దాని స్వభావము.) ఆకాశాన ద్విచంద్రభ్రాంతి భాసించినట్లు– ఈశరీర సదనంకూడా అలా భాసిస్తూ ఉంటుంది– ఉండిలేనట్లుగా ఉన్నదిది–ఆకాశాన ఇద్దరు చంద్రులున్నట్లు కనిపించుచున్నంతవరకు చంద్రునియందు ద్విత్వము ఉండనే ఉంటుంది– వస్తుతః అక్కడఉన్నది ఒక్కడే చంద్రుడు– అలాగే ఈదేహంకూడా– లేనిది ఉన్నట్లు కనిపిస్తూ ఉంటుంది కనుకనే ఇది సదసదాత్మకమని పేరుపొందింది– కలలో కలయొక్క జ్ఞానం అంతానిజమే. మెలకువవచ్చిన తరువాత అదిఅంతా అబద్ధము– (మిథ్య) నీటిలో బుడగ కనిపించునంతవరకు బుడగనిజమే. ఆ తరువాత అదినీరే. దేహదృష్టి ఉన్నంతవరకు దేహముసత్యమే– పరమార్థసత్యమయిన ఆత్మదృష్టి కలిగినతరువాత అది (దేహము) అసత్యమే జలదృష్టి ఉన్నంతవరకు మృగతృష్ణికాజలము జలమే. ఆదృష్టిపోయిన తరువాత అక్కడ జలంలేదు– సూర్యకిరణప్రసారమే ఉంటుంది– కాబట్టి శరీరగృహమనేది ఆభాసమాత్రమే కాని నిజమయినదికాదు.

ప్రతివారికీ మాంసాస్థిమయమయిన దేహము "నేను" అనే భ్రాంతి ఉన్నది లోకంలో. ఆభ్రాంతిని విడిచిపెట్టు నీవు– ప్రతివారికీ సంకల్పంవల్ల తయారయ్యే దేహాలు వేలకొలది ఉన్నాయి– రామా ! చూడునీవు సుఖంగా పడకమీద పరుండిఉండి స్వప్నదేహంతో దిగంతాలవరకూ తిరుగుతావు– ఆ దేహం నీకెక్కడిది ? జాగరావస్థలో కూడా మనోరాజ్యంలో స్వర్గపురం (అమరావతి) ప్రవేశిస్తావు– మేరు

పర్వతం అధిష్ఠిస్తావు- ఆ దేహం నీ కెక్కడిది ? స్వప్నములలో కూడా మరో స్వప్నం వస్తుంది- దానితో (ఆశరీరంతో) భూలోకం అంతా తిరుగుతావు- ఎక్కడిది నీకాశరీరం ? మనోరాజ్యంలో నీవు గడచిన శరీరాలతో చిత్రవిచిత్రములయిన పనులు అనేకం చేశావు- ఆశరీరాలు అన్ని ఏమయినాయి ? గట్టి అనురాగంగల సంకల్పాత్మక వేశ్యా కాంతతో మహాఆనందం (సంభోగసుఖం) అనుభవించావు- ఆశరీరం ఏమయినది ? ఎక్కడ ఉన్నది ? రామా ! ఈశరీరాలన్నీ సంకల్ప రూప ములు- అలాగే ఇప్పుడు భుశుండవృత్తాంతంలో నేను చెప్పిన శరీరం కూడా సంకల్పాత్మకమే-

అలాగే "ఇదినాధనము" "ఇదినాదేహము" "ఇది నాదేశము" అనే జ్ఞానము భ్రాంతి- అదిఅంతా మనస్సంకల్పములయొక్క విజృం భణము- రామా ! ఈ సంసారమనేది ఒకదీర్ఘ స్వప్నము- నీకు ఎప్పుడు భగవదనుగ్రహంవల్ల తత్త్వజ్ఞానం కలుగుతుందో అప్పుడు దీని తత్త్వం తెలిసికుంటావు- సూర్యోదయానన్తరం కలయొక్క నిజం తెలుసు కున్నట్లు- స్వప్నప్రపంచం ఎలాంటిదో జాగ్రత్ప్రపంచంకూడా అలాం టిదే రెండూ మిథ్యాభూతములే- నీకీవిషయం పూర్వము ఉత్పత్తి ప్రకరణంలోనే విస్తృతంగా చెప్పాను. కమలభవునివల్ల ప్రపంచం పుట్టిందన్నాను- కమలభవుడంటె సమష్టిమనస్తత్త్వము- అతనివల్ల ప్రపంచోత్పత్తి అనగా మనస్తత్త్వమునందలి సంకల్పములవల్ల పుట్టినదని అర్థము- కాబట్టి ప్రపంచంఅంతా సంకల్పకలనా మాత్రమనినమ్మి- చూడు సంకల్పబలంచేత ఐందవులు చతుర్ముఖబ్రహ్మ లయ్యారు- అలాగే ఉత్క్రాంతిసమయంలో పూర్వదేహంతో ఎలాంటి దేహాన్ని సంకల్పిస్తే అలాంటి దేహం తయారవుతుంది- వాసనాతిశయంచేత ఎలాంటిదేహాన్ని చిదాభ్యాసం చేస్తే ఆ దేహం తయారవుతుంది- కాబట్టి రామా ! పురుషప్రయత్నంచేత మనస్సును మరల్చుకొని దేహ ప్రపంచాకారమయిన సంకల్పము చిద్రూపమేనని గ్రహించు- ఏది

ఎలాభావింపబడునో అది అలా కనిపిస్తూ ఉంటుంది- ప్రపంచాన్ని ప్రపంచంగా భావిస్తే ప్రపంచాకారంగా భాసిస్తుంది- ఆత్మాకారంగా భావిస్తే ఆత్మాకారంగా భాసిస్తుంది- అత్యంతవల్లభయగు కాంతను పగటికాలంలో చిరకాలంభావిస్తే రాత్రి స్వప్నంలో ఆమె భాసిస్తూ ఉంటుంది- అలాగే సంసారంకూడా- స్వప్నంలో ఒక్క-క్షణం ముప్పది గడియలుగల పగలుగా భాసిస్తుంది-అలా దీర్ఘకాలంగల పగలు ఒక్క-క్షణంలాగ భాసిస్తుంది- ఆకాశంలో (మరుభూమిలో) మృగతృష్ణానది ఎలాభాసిస్తుందో అలాగే ఈభూమ్యాదికముకూడా లేనిదయియే సంకల్పబలంచేత భాసిస్తోంది- దృష్టిదోషంచేత ఆకాశమునందు (బర్హాముష్టి)పిడికెడు నెమలిపింఛములకట్ట కనిపిస్తూ ఉంటుంది- అజ్ఞానం చేత (భ్రాంతిచేత) ప్రపంచం గోచరిస్తూ ఉంటుంది- దృష్టిదోషంలేని వాడికి ఆకసమున నెమలిపింఛము కనిపించదు- సమ్యగ్దృష్టిగలవానికి ప్రపంచమూ గోచరించదు- ఎంతటి భయస్థుడయినా తన మనో రాజ్యంలో కల్పించుకున్న ఏనుగునకు బెబ్బులికీ భయపడడు- అలాగే వివేకి (ఆత్మజ్ఞాని) తన సంకల్పంచేత కల్పించుకున్న సంసారంలో భీతి చెందడు- కల అని తెలిసిన తరువాత కలలో కనిపించిన పెద్దపులికి భయపడు వాడెవ్వడును లేడు- ఆత్మస్వభావమే ఇలా ప్రపంచంగా గోచరిస్తుంది బహిర్ముఖదశలో- నిజంలో ఆత్మవ్యతిరిక్తమయిన దేదీలేదు- కనుక ప్రపంచపరిస్థితిలో ఎవరూ దేనికీ భయపడవలసిన పనిలేదు- కాని అలాభయపడువాడెవ్వడేని యున్నచో వానినే కొంచెము సంశోధన చేయవలెను- వాడుకూడ సంశోధనచేత చిత్తశుద్ధినిజెంది నిర్మలుడయితే వాడియందుకూడ సంసారభయం ఉండదు- సంసారభయమును మోహం అద్వితీయమగు శుద్ధాత్మయందుండదు-

అయితే ఆత్మను పరిశుద్ధిచేసికొను ఉపాయమేదియా? అనేది యిక్కడ విచారణీయాంశము-సమ్యగ్జ్ఞానమే ఆత్మశుద్ధికి ఉపాయము- బంగారాన్ని భ్రాంతివల్ల రాగి అనుకున్నాం- కుంపటిలోబెట్టి కరిగి

చూచాం- స్వచ్ఛమయిన మేలిమి బంగారమని మనకు వ్యక్తమయింది- ఇంక మనకు మళ్ళీ అది తామ్రమనే భ్రాంతిపుట్టదు- అలాగే సమ్యగ్జ్ఞానంచేత ఆత్మపరిశుద్ధుడయితే మళ్ళీ సంసార మాలిన్యాన్ని చెందడు- ప్రపంచం అంతా ఆభాసమాత్రం కనుక దర్శనమాత్రంచేత (ఆత్మజ్ఞానమాత్రంచేత)నే అది తొలగగలదు- కనుక సమ్యగ్జ్ఞానమే సంసార భ్రాంతి నివృత్తికి ముఖ్యకారణం- "జన్మమరణములూ, స్వర్గనరకములూ, జ్ఞానాజ్ఞానములూ మొదలగునవన్నీ చిత్ప్రకాశకంటె వేరు కావు"- అను జ్ఞానమే సమ్యగ్జ్ఞానము అనగా సర్వప్రపంచం ఆత్మస్వరూపమేకాని ఆత్మకంటె వేరువస్తువేదీ లేదనుజ్ఞానమే సమ్యగ్జ్ఞానము- "త్వంతా అహంతలే సంసారం- (త్వంతా అనగా నీవనే భావము) (అహంతయన నేననే భావము) ఈ రెండే సంసారమనే శబ్దాని కర్థాలు- ఈ రెండే ఆత్మను లోకాంతరాలలో కూలద్రోస్తాయి- విషయజాలంలో ముంచిపారవేస్తాయి- కాబట్టి పదదిక్కులా కనిపించే దృశ్యజాతంఅంతా ఆత్మస్వరూపంకంటె వేరుగాదు- చిదాభాసమాత్రమే" అనే జ్ఞానమే సమ్యగ్జ్ఞానము- ఈజ్ఞానం కలిగితే ఇంక మరల సంకల్పవికల్పాలుదయించవు- నశించవుకూడ- (అనగా మనస్సు సంకల్ప వికల్పాత్మకం కాదని భావము)- ఇలా సర్వపదార్థాలకు బాధ (వినాశం) (నిషేధం) నిర్ణయించుకొని ప్రపంచం అధిష్ఠాన సన్మాత్ర పరిశేషమని నిశ్చయించుకొని మనస్సు నిష్కామం అవుతుంది- తాపత్రయాలన్నీ శాంతిస్తాయి- ఎవరినీ నిందించదు మనస్సు- ఎవరినీ స్తుతించదు- హర్షించదు- దుఃఖించదు- అతి శీతలమవుతుంది- బంధువులకు మరణం అనివార్యము- కనుక బంధువియోగంవల్ల పరితపించడం వృథ- అజ్ఞానదశలో తనకే మరణం ప్రాప్తిస్తుంటె ఇంక బంధుమరణానికి దుఃఖించటం ఎందుకు? అలాగే పుట్టినవాళ్ళందరూ కొద్దో గొప్పో ఏదో ఒకవిధమయిన ఐశ్వర్యమును పొందతీరవలసిందే- అందు సంతోషంమాత్రం ఎందుకు? సంసారంలో వ్యవహారమార్గంలో ఉండే ప్రతివాడికీ ఆపద (దారిద్ర్యమనే దురవస్థ) కలుగుతూనే ఉంటుంది- అందుకు

దుఃఖించవలసిన పనియేమి? సముద్రంలో బుడగలు అంతులేకుండా పుడుతూఉంటాయి– ఈజగజ్జాలంకూడా అలాంటిదే కనుక దీనికి పరితపించవలసిన పనియేమి? ప్రపంచంలో సద్వస్తువెప్పుడూ సద్వస్తువే– అసద్వస్తువెప్పుడూ అసద్వస్తువే– ఇంద్రజాలికునియొక్క క్రియావైచిత్ర్యమాత్రాత్మకం ఈప్రపంచం– ఇందులో ఏడువదగినదేదీలేదు– నేను అహంకారస్వరూపడను కాను– వెనుక అట్లుండలేదు– ఇకముందు అట్లుండబోను– ఈశరీరం నాకు అవిద్యాదోషంవల్ల పుట్టింది– దీనిని గురించి నేను పరితపించవలసిన పనిలేదు– నేనేమో దేహముకంటే వేరు– దేహమూ చిదాభాసరూపం– ఈస్థితిలో నాకు సదసద్భావాలు ఎక్కడివి? నేనెందుకు పరితపించాలి?” అని యిలాంటి నిశ్చయం గలవాని మనస్సు ఉదయాస్తమయాలు చెందదు– పరితాపమును పొందదు– అనుత్తమ పదంలో ఉన్న బ్రహ్మవేత్త సర్వపదార్థములందునూ, బాధపరిశిష్టతను, (నాశమేమిగులుగా కలవగుటను) అనగా (బ్రహ్మరూపత్వమును స్వీకరిస్తాడు– అంతేకాని ప్రతీతికాలంలోని స్వారస్యాన్ని గ్రహించడు– తిత్తిరిపక్షి (తీతువపిట్ట) తాను గూడుకట్టుకోటానికి గడ్డిపరకలయొక్క మొదటనుండే గట్టిభాగములను విడిచిపెట్టి మృదువయిన అగ్రభాగమునె గ్రహిస్తుంది– ఇదేపరిస్థితి బ్రహ్మవేత్తకుకూడా– ఇందుకొరకు అసత్యమయిన ఈసంసారంలో ఆదరణయేమాత్రము కూడదు– గట్టితాడు ఎద్దును బంధించినట్లు ఆస్థ (ప్రేమ) అనేది మానవుని సంసారంలో బంధిస్తుంది– కనుక ప్రపంచంలో ఆస్థను (ఆదరమును) విడిచి వ్యవహరించాలి– చేయతగినదానినే చెయ్యాలి– చేయతగని దానిని చేయు రాదు– ఉపేక్షించి ఊరుకోవలెను– సంసారంలో ఆస్థానాస్థలను విడిచి, లీలామాత్రంగా వ్యవహరించాలి– ప్రపంచం చిదాభాసమాత్రమని ఎవరికితోస్తుందో వాడి మనస్సు చల్లపడుతుంది– గ్రీష్మకాలంలో సాయంకాలమున లోకం చల్లపడినట్లు– కనుక రామా! పదార్థముల యొక్క విశేషదృష్టిని విడచి ఘటపటాది విషయపుంజమునందు చిదాభాసరూపమును సామాన్యదృష్టితో నుండుము– ఆచిదాభాసరూపము

కూడ మనఃకల్పనతో కూడినదికాన దానిని గూడ విడిచి నిరాభాసుడ వగుము. (అనశుద్ధ చిద్రూపుడవగుము.) ఆభాస పరిత్యాగముచే నీవు ఏకాంతనిర్మలుడ వగుదువు. అందుకుపాయం చెబుతావిను. "నేను అహంకారరూపుడనుగాను. నాకీభోగములు సత్యములుగావు." అని నిరంతరం (ఎల్లపుడు) భావనచేస్తే నిరర్థకమయిన ఈ సంసారాడంబరం నీకు అనర్థకారి కాదు.

రామా! ఈజ్ఞానములు రెండూ ముఖ్యములే. ఈ రెండూ నిజంగా మోక్షసిద్ధిని కలిగించేవే. ఇందు ఒకటి సర్వబాధచింతనము (అనగా ప్రపంచమంతయు లేదనుభావన) రెండవది ప్రపంచమంతయు చిదాత్మ స్వరూపమే నను భావన. రామా! ఈ రెంటిలో నీకేది నచ్చితే ఏది బాగా అలవడితే దానినాశ్రయించు. లేకపోతే ఈ రెండు దర్శనముల వల్లగూడా ప్రపంచంలో రాగద్వేషాలను చంపుకుంటూ విహరించు. రాగద్వేషాది దోషములులేని వాడియందే ఈ రెండు దర్శనములు ఫలిస్తాయి. ఇతరుని యందు ఫలించవు. పృథివీ లోకంలోకాని, అంతరిక్ష స్వర్లోకములలోకాని, ఉన్నవస్తుజాలము రాగద్వేష పరిక్షయమువలననే లభించును. రామా! రాగద్వేషాది సహితమయిన బుద్ధితో ఎవరెవరు దేనినాచరించినా అదిఅంతా తుదకు వారికే విపరీతమవును. రాగ ద్వేషాలతో కూడిన చిత్తవృత్తులందు (చిత్తములందు) శమాదిగుణ ములు నిలకడ జెందవు. (అనగా శమాదులు కలుగనే కలగవు. కలిగినా చిరకాలము నిలువవు.) కాలి చల్లారిన అడవిభూములలో హరిణములు (లేళ్లు) సంచరించవు. ఒకవేళ తప్పిజారి వచ్చినా అవి అక్కడ నివసిం చవు. వాటికి కావలసిన పచ్చిక లేకపోవడమే అచట కారణము. రామా! ఎవనియొక్క మనస్సు అనే బిలంలో రాగము, ద్వేషము, అనే సర్పాలు రెండూ విలీనములుకావో (అనగా నశించవో) వాడు కల్పవృక్షమంతటి వాడయితేనేమి? వాడికి సంప్రాప్తముకాని దుఃఖమే లోకంలో ఉండదు. సకలదుఃఖములు వాడివే. కనుక ఎవరు ప్రాజ్ఞులై,

నేర్పరులై, సుశిక్షితులై, శాస్త్రాదివిద్యల నేర్చినవారయినా వారు రాగ ద్వేషాలు గలవారయితే వాళ్లు నక్కలు- ఛీ! వాళ్లు ముఖం చూడ కూడదు- "వాడు నాడబ్బు అపహరించాడు- వీడికొఱకింత డబ్బు నేను ఖర్చుపెట్టాను" అని అభినివేశంతో అపహరించినవాణ్ణి వధింప బూనుట, ఖర్చుపెట్టినవాణ్ణి నిర్బంధించబూనుట, రాగద్వేషాలయొక్క లక్షణాలు- ఛీ! ఇంతటి తుచ్ఛములు మరేవీలేవు- ఎందువల్లనంటె ధనములూ, బంధుగులూ, మిత్రులూ, మాటిమాటికి వస్తూ ఉంటారు- పోతూఉంటారు- వీటిమీద మానవుడికి ఇంత అనురాగ మెందుకు! ఇంతటి ద్వేషమెందుకు? సంసారభోగాలన్నీ భావాభావములు గలవే- (అనగా వస్తూ పోతూ ఉండేవే) పరమేశ్వరునియొక్క మాయాస్వభావమే ఇలాంటిది- అది (మాయ) సంసారరచన అంతా ఇలాంటిదే- ఇది (ఈసంసారము) లంపటుడయినవానిని అధోగతిపాలు చేస్తుంది- రామా! నిజంలో డబ్బూ, బంధుగులూ, మిత్రులూ ఇందులో ఏవీ సత్యములుగావు- ఇవన్నీ మిథ్య అనియే నిర్ణయించబడ్డాయి- మిథ్యగానే చూడబడుచున్నాయి- చూడు అందుకు యుక్తి- ఇవి మొదట లేవు. తుదకు ఉండవు- మధ్యలో కనిపిస్తూ ఉంటాయి- అప్పుడుకూడా స్థిరంగా ఉంటాయా అంటే అదీ లేదు- అప్పుడూ (మధ్యలోనూ) అస్థిరత్వమే వాటిగతి- మరొకడు కల్పించుకున్న (నిర్మించుకున్న) కల్పవృక్షంమీద ప్రాజ్ఞుడయిన వాడెవడు అనురాగం చెందుతున్నాడు? ఆకాశంలో ఒకడు స్త్రీని కల్పించుకున్నాడు- ఆమెను దూరంగా ఉన్న మరొకడు అనుభవిస్తున్నాడు- ఇలాఉంది సంసారరచన అంతా- కనుక ఇలాంటి సంసారంమీద నీవు భ్రమచెందమాక. భూతములయొక్క రాకడలుగలిగి ప్రవాహరూపమున నడుస్తూ అతి విస్తృతమయిన నీప్రపంచం ఆకాశంలో నిర్మించుకున్న గంధర్వనగర నిర్మాణంతో సమానమని అంటారు పెద్దలు- కలలో కల్పించుకున్న పత్తనమువలె లేనిదే ఇది- ఈ సంసారం అంతటా ఉండే ఉన్నది- కాని కల జారిపోయినట్లు (అనగా కలలోని వస్తువులు జారిపోయినట్లు) జారిపోతుంది- (విడిపోతుంది.)

దీనిని దీర్ఘస్వప్నంగాను, గంధర్వపురంగాను, ఆకాశవృక్షంగాను, చూస్తూనే ఉన్నావునీవు- అజ్ఞానమనే దీర్ఘనిద్రలో ఉన్నంతవరకు ఇది అనుస్యూతంగా ఉంటూనే ఉంటుంది-సంసారమనే స్వప్నంలో సంభ్రాంతుడవై నీవు ఇందులో ఉంటున్నావు- శుభవాసనలుగల నీవు అజ్ఞానరూపమగు ఈనిద్రను విడిచిపెట్టు- నిధిదొరకిన మానవోత్తముడు దారిద్ర్యాన్ని విడిచినట్లు మెలకువ (వివేకం) తెచ్చుకో. నీ నిర్వికల్ప చిత్ప్రకాశాన్ని సాక్షాత్కారం చేసికో- మేలుకో, మేలుకో, మళ్ళీచెబుతున్నా నేను మేలుకో- నీ ఆత్మాకారుని నీవుచూచుకో ప్రాతఃకాల పద్మం సూర్యుని చూచుకున్నట్లు- నేను చల్లని జ్ఞానోదకాన్ని వర్షిస్తున్నాను- సుశబ్దాలతో ప్రకాశమానంగా ఉంది యీ జ్ఞానోదకం- దీనితో నీసంసారతాపం పటాపంచలవుతుంది- ఇప్పుడే చరమజ్ఞానం సంపాదించుకొని స్వస్వరూపమును సాక్షాత్కరించుకో- అలీకమయిన ఈజగత్తును విడిచి నిజమయిన ఆత్మతత్త్వాన్ని దర్శించు- నీకింక జన్మ ఉండదు- దుఃఖముండదు- రాగద్వేషాదిదోషాలుండవు- సంసారభ్రమలుండవు- సర్వసంకల్పాలు విడిచి ఆత్మస్వరూపంలో ఉండిపో- రామా! నీవు వితతపరహితమయిన దృష్టిలో చూచుకుంటే సర్వవ్యాపకమయిన బ్రహ్మవే- కనుక మోక్షసంసిద్ధి కొరకు సముపశాంతాత్మయందే సమాధిని పొందు- అన్నారు వసిష్ఠులు-

## ౨౯. శివోపదేశము (సర్వము పరమాత్మమయమని వర్ణించుట.)

వాల్మీకి॥ భరద్వాజా! ఇలా వసిష్ఠుడు ఉపదేశచమత్కారాలతో చెబుతున్నాడు- శ్రీరామచంద్రుడు స్వస్థచిత్తుడై వింటున్నాడు- పరమానంద భరితుడైనాడు- ఆత్మవిశ్రాంతిని పొందాడు- అచ్చటి వారందరూ ఆత్మయందు విశ్రాంతిని పొందారు- వసిష్ఠమహర్షి వాగమృతమును వర్షింప విరమించాడు- ఇలా అర్థముహూర్తకాలం గడచింది. (అనగా ఒకటింపాతిక ఘడియ) మళ్ళీ వసిష్ఠులే సమాధినుంచి

మేలుకొలిపాడు శ్రీరాముని- లోగడి విషయమునే దృఢపడుటకుగాను చెప్పనారంభించాడు-

వసి॥ రామా! నీకు చక్కని జ్ఞానం కలిగింది- (సమ్యగ్జ్ఞానం కలిగింది.) పరమార్థమయిన ఆత్మతత్త్వాన్ని గ్రహించావు. దీనినే ఆశ్రయించి ఉండు- మళ్ళీ సంసారంలో అడుగు పెట్టకుసుమా! లోకంలో బండిచక్రానికి కుండగట్టిగా పట్టుకుంటే యింక చక్రం చచ్చినా కదలదు- అలాగే సంసారచక్రానికి కూడా సంకల్పమనేది కుండ- దానిని గట్టిగా నిరోధిస్తివా ఇక సంసారచక్రం కదలదు- మనస్సును రాగద్వేషాలతో కలవరపరచితివా నీవు ఎంతప్రయాసపడి నిరోధింపదలచినా సంసార చక్రం అతివేగంతో దొర్లుతూనే ఉంటుంది- కాబట్టి అభ్యాసవైరాగ్యాలతో గట్టి పౌరుషం అవలంబించి ప్రజ్ఞాబలములను సంపాదించుకొని యుక్తితో సంసారచక్రానికి నాభిఅయిన చిత్తమును నిరోధించు- ప్రజ్ఞా సహితమయిన పౌరుషానికి సౌజన్యముతో కూడిన పౌరుషానికి శాస్త్ర సమ్మతమయిన పౌరుషానికి లభ్యంకానిది ఏదీలేదు- (అనగా పౌరుషానికి బుద్ధిబలం అవసరం- సౌజన్యం (మంచితనం) అవసరం- శాస్త్ర సమ్మతి అవసరం అన్నమాట) కనుక చాతకాని వాళ్లుపలికే "అంతా దైవం, అంతాదైవం" అనే పలుకులు పలుకక ప్రయత్నంచేసి మొదట చిత్తాన్ని నిరోధించు- పిపీలికాది బ్రహ్మలోకపర్యంతము నుండు ప్రపంచంఅంతా అజ్ఞానకల్పితమే- లేనిదే ఉన్నట్లు కనిపిస్తుంది- దృశ్యములయిన యీ ప్రపంచాకారములన్నీ అజ్ఞానజన్యమయిన భ్రాంతి విస్తృతములే ఈశరీరాలన్నీ సంకల్పమువల్ల తయారయినవే- అంచేత సంకల్పాలు చంపుకోవాలికాని దేహాన్ని చంపుకొని లాభంలేదు- కనుక దేహాన్నిగూర్చి సుఖదుఃఖవిచారము ఎన్నడూ చేయరాదు- దేహామును గురించి సుఖదుఃఖ విచారణచేసే మానవుడు చిత్రలిఖిత (పటములో వ్రాయబడిన) మానవుని కంటె అధముడు- ఎందుకంటె పీడిముఖం దుఃఖంతో వాడుతూ ఉంటుంది- చెమటతోను కన్నీటి

తోను తడుస్తూ ఉంటుంది- పటంలో చిత్రితమయిన మనిషియొక్క- ముఖం అలా వాడదు- తడవదు- ప్రసన్నంగా ఉంటుంది- అంచేత వీడికంటె వాడు తుచ్ఛుడు- ఆధివ్యాధులలో కృశిస్తూ కష్టపడుతూ తుదకు నశించే మానవశరీరంకంటె పటమునందలి మనిషియొక్క- శరీరం స్థిరంగా ఉంటుంది- పైగా మాంసమయ మయిన మానవశరీరం నిర్నిమిత్తంగా నశిస్తుంది- (అనగా ఇంకొకడు చంపవలసిన పనిలేదు- దానంతటఅదే నశిస్తుంది) చిత్రమునందలి శరీరం అలా నశించదు- మరొకడు చెడగొట్టితేనే నశిస్తుంది- (చెడిపోతుంది) చిత్రమానవుని జాగ్రత్తగా కాపాడుకుంటే స్థిరమయిన కాంతితో ప్రకాశిస్తాడు- మాంసమయ మానవుణ్ణి ఎంతకాపాడినా క్రమంగా నశిస్తుందే కాని వృద్ధిపొందదు- కాబట్టి యీపై కారణాలచేత సంకల్పకృతమయిన దేహముకంటె చిత్రదేహమే శ్రేష్ఠము- చిత్రదేహంలో ఉండే గుణాలలో ఒక్క-గుణం కూడా సంకల్పదేహంలో- జడమయిన చిత్రదేహంకంటెకూడా అతి తుచ్ఛమయిన ఈమాంసమయ దేహంమీద ఇంత ఆదరము (ప్రేమ) ఎందుకు ? లోకానికి రామా ! (ఈపైన వ్రాయబడిన చిత్రదేహమనే పదమునకు పటములోని మానవ శరీరమని అర్థమును గ్రహించవలెను.)

మరియు స్వప్నసంకల్పమువల్ల పుట్టే శరీరంమీద అయినా కొంచెం ఆదరం ఉండవచ్చునుగాని, దీర్ఘసంకల్పంవల్ల తయారయిన యీజాగ్రచ్ఛరీరంమీద ప్రేమ బొత్తుగా పనికిరాదు- అతితుచ్ఛము దీనిని ప్రేమించడం- ఎంచేతనంటె స్వప్నశరీరం కొద్దిపాటి సంకల్పంవల్ల తయారవుతుంది- దానికి ఉండే సుఖదుఃఖాలుకూడా కొద్దివే- దీర్ఘకాలపు సుఖదుఃఖాలు దానికంటవు- దీర్ఘసంకల్పంవల్ల తయారయిన ఈజాగ్రచ్ఛరీరం దీర్ఘకాలం దుఃఖంతో దుఃఖిస్తూ ఉంటుంది- కనుక సంకల్పమయమయిన ఈ దేహము అసలు లేనేలేదు- ఒకవేళ ఉన్నదనుకున్నా అదిమనది (ఆత్మది) కాదు- ఎంచేతనంటే ఆత్మ అసంగుడు కనుక- ఎందుకు మానవుడు వృథాగా దీనికొరకు ఇంతగా కష్టపడతాడు?

కాబట్టి చిత్రమయుడయిన పురుషుడు నశిస్తే మనం ఎలా బాధపడమో అలాగే సంకల్పపురుషుడు నశించినా మనకు బాధలేదు— మనోరాజ్యమయుడు నశిస్తే మనకు ఏమీ బాధలేదు. రెండవచంద్రుడు నశిస్తే మనకేమీ బాధలేదు— స్వప్నసమారంభం నశిస్తే మనకేమీ బాధ లేదు— మృగతృష్ణానదీజలం నశిస్తే మనకు బాధలేదు— అలాగే సంకల్పమాత్రంచేత తయారై సహజంగా నశించు స్వభావంగల ఈశరీరయంత్రం నశిస్తే మనకేమి బాధ? చిత్తసంకల్పమువల్ల కల్పితమై దీర్ఘస్వప్నమయమయిన ఈశరీరాన్ని అలంకరిస్తేనేమి? చెడగొట్టితేనేమి? చైతన్యమునకేమి చెడిపోయింది— చిత్తునశించదు— ఆత్మచలించదు— బ్రహ్మవికారమును జెందదు— ఇంక దేహక్షయంవల్ల చెరుపేమి? గిరగిరతిరిగే చక్రముయొక్క పైభాగమున కూర్చున్నవాడు దాని సమీపంలో ఉన్న మరొకచక్రంకూడా తిరుగుచున్నట్లు దిక్భ్రమునందు భ్రాంతిపడతాడు— అలాగే మిథ్యాజ్ఞానమనే చక్రమునందున్న జీవుడు కూడా దేహపరంపరఅనే చక్రాన్ని చూస్తూ ఉంటాడు తనకు నిరూఢమయిన మిథ్యాజ్ఞానంచేత— కనుక గట్టిధైర్యమును అవలంబించి ఘనమయిన (అతిదృఢమయిన) ఈ భ్రాంతిని విడిచి పెట్టాలి— సంకల్పంవల్ల తయారయిన ఈశరీరము మిథ్యాజ్ఞానంచేత ప్రతీతిదశలో ఉన్నట్లు కనిపిస్తున్నా పరమార్థంలో లేనిదే అజ్ఞానంచేత కల్పింపబడినందున యిదెప్పుడూ సత్యంకానేరదు— త్రాటిమీద లేనిసర్పాన్ని కల్పించుకున్నట్లు చైతన్యంమీద లేనిశరీరాన్ని కల్పించుకున్నారు— ఇది అసత్యమయిన ప్రపంచవ్యవహారాన్ని సత్యమయినదానినిగా చేస్తుంది— జడమయిన శరీరంచే చేయబడినపని చేయబడినదే కాదు— దేహము ఒకవేళ ఏదయినా ఒకపనిని చేస్తున్నా అది అపుడు ఆపనికి కర్త కాదు— "ఇచ్ఛతి" "కరోతి" అను న్యాయప్రకారం కర్తృత్వము ఇచ్ఛాపూర్వకము— జడమయిన దేహానికి ఇచ్ఛలేదు— నిర్వికారమయిన చైతన్యానికీ ఇచ్ఛ లేదు— కాబట్టి కర్తృత్వమనేది శరీరాత్మలకు రెంటికీ లేదని తేలింది— గాలిలేనిచోట దీపం తన రూపంతో నిర్వికారంగా ఉన్నట్లు జీవుడు

కూడా సర్వభావములందూ సాక్షిగా నుండవలెను- రామా! సూర్యుడు తనరూపంలో తానుండియే పగటికృత్యములను ఎల్లు నెరవేర్చుతున్నాడో అలాగే నీవుకూడా నిర్వికారంగా నుండియే రాజ్యకార్యములను చేయవలెను-

ఇది ఇలా ఉండగా లేనిపోని ఈదేహమనే శూన్యగృహం స్థితిని పొందే సరికి (ఉన్నట్లు భాసించేసరికి) ఎక్కడనుంచి వచ్చాడో కాని అహంకారమనే దుష్టభృత్యుడు అందులో ప్రవేశించాడు- వీనియొద్ద సారమేమీలేదు- సజ్జను లెవ్వరికీ పనికిరాడు- వీడికి చిత్తమనికూడ మరో పేరుకలదు- రామా ! నీవు మాత్రం ఆ అహంకారమనే దుర్మతికి దాసుడవు (భృత్యుడవు) కాకుసుమా ! అయితివా పొరపాటున ఇంక నీకు నరకం తప్ప వేరే ఫలంలేదు- ఈదేహగేహంలో ఆదుర్మార్గుడు (చిత్తవేతాళుడు) విలాసగా షికారుచేస్తున్నాడు- వీనిచేష్టకు భీతిల్లియే మహానుభావులందరు సమాధియందు నియతులయినారు- తన శరీరమనే కొంపలోనుంచి చిత్తమనే వేతాళుని ఉద్వాసన చెప్పిస్తే శూన్యమయిన దేహగేహంలో ఎవనికీ ఎప్పటికీ భయంలేదు- చిత్తమనే దయ్యంతో అభిభూతమయిన ఈశరీరగృహంలో ఆసక్తులయినవారు ఇప్పటికి దేహతాదాత్మ్యంలో కూడుకొని ఉండుట నాకు చాలావిచిత్రంగా ఉంది- శరీరతాదాత్మ్యంవల్ల యింతకాలం దుఃఖం అనుభవించికూడా దాన్ని విఘటనచేసికొనుటకు ప్రయత్నించకపోవడం నాకు చాలా విచిత్రంగా ఉంది- చిత్తమనే పిశాచంపట్టి ఉండగా దేహగేహంలో మరణించిన వాళ్ళకు ఆ పిశాచసంబంధమయిన భావాలే ఏర్పడతాయికాని పిశాచం పట్టని వానిభావాలు అలవడవు- ఎప్పుడూ తాపత్రయమనే నిప్పులో తగలబడే శరీరంమీాద ప్రేమతో వ్యవహరించే మానవుడు పిశాచమే కాని మానవుడుగాడు- అది స్థిరమయినది కాకపోవడమే అందుకు కారణము- అనగా క్షణభంగురమయిన శరీరాన్ని ప్రేమించడమే పిశాచమనుటకు కారణము- కనుక మొదట అహంకారానికి

"దాసోఽహ" మనుట మానుకోవలెను-పిదప యోగభూమికాక్రమంతో దానిమాటయే మరచిపోవాలి- అపైన వెంటనే ఆత్మతత్వాన్ని పట్టుకోవాలి- అహంకార పిశాచగ్రస్తులై నరకమునకు పాల్పడే అజ్ఞానులకు మిత్రులూ లేరు- బంధువులూ లేరు- అహంకారపూరితమయినబుద్ధి చేసెడికర్మ తనచావుకే హేతువు- విషలతకు పుట్టినపండు దాని నాశనకే హేతువగును- ధైర్యమును వదలి వివేకమును విడిచి కేవల అహంకారమహోత్సవంలో మునిగిన మూర్ఖుడు నశించినవాడే కాని బ్రతికియున్నవాడుగాడు-

రాఘవా ! అహంకారపిశాచానికి లొంగిపోయిన నీచులు నరకంలోని అగ్నులకు కట్టెలు- దేహమనే చెట్టుయొక్క తొర్రలో అహంకారమనే సర్పము నివసించియున్నచో ఆచెట్టు అచిరకాలంలో పడగొట్టబడును- అహంకారమనే పిశాచం ఈశరీరంలో ఉండనీ, పోనీ, నీవు మాత్రం దాన్ని మనస్సుతో కూడా తలచమాకు- దానిని అనుసరిస్తే దానివలన మనకనర్థముకాని దానిని తిరస్కరించినా, ఉపేక్షించినా దానివల్ల అనర్థంలేదు మనకు- దేహాలయంలో ఇది ప్రకాశిస్తూఉన్నా అనంతములయిన విలాసములుగల ఆత్మకు ఏమిఒరగినది- అహంకార పిశాచగ్రస్తులయిన మానవులకు కలిగే ఆపదలను నూరుసంవత్సరాలయినా లెక్కింపనలవికావు- "హాహతోస్మి" "హాదగ్ధోఽస్మి" అనుదుఃఖవృత్తులన్నీ అహంకారపిశాచముయొక్క శక్తులేకాని ఇతరములుకావు-

రామా ! సుఖదుఃఖాదివృత్తులు ఆత్మవికాని అహంకారానివి కావని నైయాయికాదులంటారు- అది వాళ్ళ భ్రాంతికాని నిజంకాదు- ఆకాశము అంతటాఉన్నా దేనితోను అంటదు- అలాగే ఆత్మ సర్వవ్యాపకుడయినా అహంకారంతో సంబంధించదు- (అంటదు) సుఖదుఃఖాది వృత్తులతోనూ అంటదు- రామా ! ప్రాణవాయువనే త్రాటితోకూడి ఈ దేహయంత్రము ఏపనిచేసినా అది అహంకారానిది కాని ఆత్మదికాదు-

అయితే ఆత్మ ఏపనికీ కర్త కాకపోతే "కేనేషితం పతతి ప్రేషితం మనః" "ఊర్ధ్వం ప్రాణ మున్నయతి అపానం ప్రత్యగస్యతి" ఇత్యాది శ్రుతివిరోధము వాటిల్లును గదా! ఈ శ్రుతులు ఇంద్రియ ప్రేరకుడు ఆత్మయనియు ప్రాణాపానాది వాయు ప్రేరకుడు ఆత్మయనియు చెప్పుచున్నవికదా! అని అంటారు- వృక్షోత్పత్తిలో (చెట్టుపుట్టుటలో) ఆకాశము కర్త గాకున్ననూ కారణమగుచున్నది- స్వరూపప్రతిష్ఠితుడగు (స్వస్వరూపముతోనున్న) ఆత్మకూడా చిత్తచేష్టలందు అలాంటి కారణమే- ఆత్మయొక్క సాన్నిధ్యమాత్రంచేత మనస్సుకొక ఆకారం ఏర్పడుతుంది- దీపసాన్నిధ్యంచేత గోడకొక నిర్మలమయినరూపం తయారవుతుంది- రామా! చిజ్జడములయిన ఆత్మచిత్తములు ఎప్పుడూ విడివిడిగా నుండువారే ద్యావాపృథువులవలె- ఈ రెంటికీ ఏలాటి సంబంధము ?

అయితే ఆత్మకు మన ఆదులతో సంబంధం లేదంటారా! మన ఆదులకు సత్తాస్ఫూర్తి సిద్ధించదు- ఉందంటారా! ఆత్మకు అసంగత్వము సిద్ధించదు- ఉభయధా దోషమే అను ప్రశ్న ఉన్నది యిచట- విను సమాధానం చెబుతాను- చపలస్వభావముగలవానిని, స్పందన స్వభావముగలవానిని ప్రేరేపణ జేయుశక్తులు ప్రాణవాయువునకు గలవు- (అనగా క్రియాశక్తి యుక్తమయిన ప్రాణమే ఇంద్రియాదులను ప్రేరేపించును.) అట్టి శక్తులచే వశీకృతమయినది చిత్తము- దానితో తాదాత్మ్యాధ్యాస ఆత్మకుండుటచే ఆత్మయే మనఆదులకు ప్రేరకమని అజ్ఞానులను కొనుచున్నారు- కాని వస్తువృత్తంలో అది నిజంకాదు-

ఆత్మ చిత్తములకు రెంటికీ పూర్తి విరోధమున్నది- సంబంధం కుదరదువాటికి- చూడు- ఆత్మ ప్రకాశరూపుడు- నిత్యుడు- సర్వవ్యాపకుడు- సర్వాంతర్యామి- చిత్తముజడము- అనిత్యము- పరిచ్ఛిన్నము- వంచకము-

రామా! నీవు సర్వజ్ఞుడయిన పరమాత్మవు- మనస్సు కావు- మనోమోహాన్ని దూరంగా ఉంచు- రామా! మనఃపిశాచము శూన్యమయిన దేహగేహంలో ఉండికూడ తనను అంటని ఆత్మనుకూడ తననంటిన వానినిగా భావిస్తూ ఉంటుంది- ఇది భవప్రదము- అమంగళకరము- ధైర్యమును మొదలంట అపహరించు స్వభావంగలది- దీనిని విడు- చిత్తమనే దయ్యమువట్టిన వానిని శాస్త్రాలు రక్షించలేవు- బంధువులు రక్షించలేరు- గురువులు రక్షింపలేరు. ఆ దయ్యాం వదలిన మానవుని గురు, శాస్త్ర, బాంధవులు ఉద్ధరించగలరు- (అనగా శుద్ధచిత్తుని ఉద్ధరించగలరని తాత్పర్యం- అంతేకాని బొత్తుగా మతిపోని వానినని కాదు-) ఈ ప్రపంచంలో దేహగేహములన్నీ ఈ దయ్యం (చిత్తపిశాచము) కలవే- ఈదయ్యంలేని కొంపలు (దేహములు) లోకంలో చాలకొద్దిగా ఉంటాయి- అవి ఏ సజ్జనులలో తటస్థిస్తాయి- అజ్ఞ దేహాలకు ఈ భాగ్యం పట్టదు- విజ్ఞుల దేహాలకే దయ్యంవదిలే దశపడుతుంది- నలుదిక్కులా అజ్ఞ దేహాలు శ్మశానవాటికలే- కనుక ధైర్యం తెచ్చుకొని నీ మనస్సుచే ఆత్మను ఉద్ధరించుకో- రామా! ఈ ప్రపంచమనే అరణ్యంలో లేడిపిల్లలవలె నీరసములయిన విషయరసాలకు ఆశపడి సంచరించే వాళ్లున్నారు- నీవు మాత్రం అలాంటివాడవు కాకుము- నా బంధువులూ, మిత్రులూ ఎలాఉంటే నేనుకూడా అలాగే ఉంటానని అనుకొనకు- బంధ్యాసక్తి అనే బురదలో కాలుపెడితివా! చింత అనే రాక్షసివచ్చి మింగివేస్తుంది- భోగాభోగములు (భోగవిస్తారములు) బహిష్కరించాలి- పెద్దలస్థితిని అనుసరించాలి- ఫలబలమును విచారించాలి- ఆత్మను ఆశ్రయించాలి- అపవిత్రము, అతితుచ్ఛము, దురాకారము అయిన దేహముకొరకు ఊబిలో దిగకూడదు- చింతఅనే రాక్షసి పొట్టన పెట్టుకుంటుంది-కర్మవల్ల శరీరం వచ్చింది-అందులో అహంకారమనే యక్షుడు ప్రవేశించాడు- దానివల్ల దుఃఖం మనస్సుకు- అనుభవించేది జీవుడు- చూడు ఈ చిత్రం- వీళ్లలో ఒకడి కొకడికి పొత్తు లేదు- ఇదెంతటి మూర్ఖమో విచారించు- రాతికి కాఠిన్యమనేది ఒక్కటే

రూపము. అలాగే ఆత్మకు సత్తాసామాన్యం (సద్రూపత్వం) ఒక్కటే రూపం. ఇతరరూపాలేవీ ఇతనికి సంభవించవు. రాతియందలి కాఠిన్యం రాతికంటె వేరు కాదు. అలాగే సమష్టివ్యష్టి మనస్సమూహాత్మక మయిన సూక్ష్మప్రపంచమూ, తత్కార్యమయిన స్థూలప్రపంచమూ, సద్రూపమయిన పరమాత్మతో అభిన్నమే కాని పరమాత్మకంటె వేరు కాదు. పరమాత్మకంటె వేరుగ దీనికి ఉనికి లేదు. ఉపలత్వము ఉపల ముకంటె వేరు కాదు. ఘటత్వము ఘటముకంటె వేరు కాదు. అలాగే ప్రపంచం ఆత్మకంటె వేరు కాదు. రామా! ఈ ప్రాపంచిక వ్యామోహాన్ని నశింపజేసే విషయాన్ని మరొకదానిని చెబుతాను విను. మానస శివపూజాలక్షణమయిన అదృష్టిలో ఉంటివా ఇంక ఈవ్యామోహం స్వరూపనాశ మవుతుంది.

## ౩౦. మానసశివపూజావర్ణనము.

వసి॥ రామచంద్రా! స్వర్గలోకానికి ఇంకాపైన చంద్రకిరణముల సమూహమువలె భాసురమయిన కైలాసమను పర్వతమొకటి కలదు. అది పార్వతీపతికి నివాసస్థానము. దానిమీద చంద్రకళాధరుడగు ఈశ్వరుడున్నాడు. నేను పూర్వం ఒకప్పుడు శివుని పూజించుకుంటూ ఆపర్వతంమీద ఉండేవాడను. కృచ్ఛ్రచాంద్రయణాది తపములనేకము ఆచరించాను. అనేకమంది సిద్ధులతో కలసినాను. శాస్త్రచర్చలు చేశాను. ఇలా నాకు చాలాకాలం గడచింది. ఇలాఉండగా ఒకానొకపుడు శ్రావణబహుళ అష్టమినాడు ప్రదోషకాలం శివపూజా జప ధ్యానాదులతో గడవగా దిక్కులన్నీ సంశాంతరూపములై అంధకార బంధురములయినాయి. ఇంతలో మొదటి యామము గడచేటప్పటికి నేను సమాధిని చాలించి బాహ్యదృష్టిలో మగ్నుడనయ్యాను. వెంటనే ఆ అడవిలో బయలుదేరిన ఒకవిధమయిన తేజస్సును చూచాను. స్వచ్ఛమయిన మేఘపుంజమువలె నున్నదది. చంద్రబింబ సమూహం

వలె ఉంది- దిక్కుంజము ప్రకాశింపజేస్తోంది- చూచాను- ఆశ్చర్య పడ్డాను- బాహ్యదృష్టితో చూచిన ఆ తేజస్సును గురించి అంతర్దృష్టితో ఆలోచించాను- ఇంతలో చంద్రకళాధరుడగు శివుడు ఆచరియ మీదకువచ్చాడు- తనచేతితో పార్వతీదేవి చేయిపుచ్చుకున్నాడు- నందీశ్వరుడు మున్నగు వారల ముందుబెట్టుకున్నాడు- నేను శిష్యులను లేపి యీవిషయం తెలిపి అర్ఘ్యం తీసికొని సావధానుడనై ఆయనగారి యెదుటకు వెళ్ళితిని- అచట పుష్పాంజలినిచ్చి అర్ఘ్యమిచ్చి సాష్టాంగ నమస్కారంచేసి ఆపరమేశ్వరుని స్తుతించాను దూరంగా ఉండే- అతడు సర్వార్తిహారిణియగు (అన్నిబాధలను పోగొట్టెడు) చల్లనిచూపుతో చూచాడు నన్ను చాలకాలం-పుష్పాసనువునందు కూర్చున్నాడు- నేను ఇంకా దగ్గరకువెళ్ళి అర్ఘ్యపాద్యాలిచ్చి పుష్పాలతో పూజించాను- మందారపూగుత్తులను దోసెళ్ళకొలది గుప్పాను- అనేకవిధాల నమస్కారాలు అనేకవిధాల స్తోత్రాలుచేసి అర్చించాను సదాశివుని- సఖీయుక్తయగు పార్వతిదేవినికూడా శివునితో సమానంగా పూజించాను- పూజావసానంలో చంద్రకిరణములవలె అమృతము ఒలికే చల్లని వాక్కుతో ఇలా అన్నాడు నన్నుగూర్చి అక్కడ కూర్చుని యుండగా-

శివు॥ మహర్షీ! నీచిత్తవృత్తులు పరమప్రశాంతములు- సంసారోపరతములు- నిశ్రేయసదాయకములు- పరమాత్మవస్తువునందున్నవా అవి? నీతపస్సు నిర్విఘ్నమేనా? మంచిగా జరుగుచున్నదా! నీకు కావలసినది సంప్రాప్తమయినదా? పొందదగినదానిని పొందావా? నీ భీతులు తీరినవా? అని ఆయనగారు అనునయశాలియగు వాక్కుతో అడుగుచుండగా నేనిలా అన్నాను-స్వామీ! మహేశ్వరుని మనస్సులో జ్ఞాపకముండునట్టి భాగ్యవంతులకు పొందదగనిది ఉండదు- ఏవిధమయిన భయములూ ఉండవు- నీ స్మరణమువలన కలిగెడి ఆనందంలో మునిగి తేలుచున్న చిత్తముగల వారలను నమస్కరించని ప్రాణి లోకంలో ఉండదు- నీస్మరణ తత్పరులగు జనులు నివసించెడి దేశములే దేశములు-

అవే జనపదములు- అవేదిక్కులు- అవే పర్వతములు- మీస్మరణము వెనుకటి పుణ్యమునకు ఫలము- ఇప్పటి పుణ్యమునకు అమృత సేకము వలె అభివర్ధకము- చేయుబోవు పుణ్యమునకు బీజము- జ్ఞానామృతము నకు కలశము- ధైర్యచంద్రికకు నిశాకరుడు- మోక్షమునకు పురద్వారము- స్వామీ! మీస్మరణమనే చింతామణిని చేతబూని నేను ఆపద లన్నిటిమీద కాలుపెట్టాను-(అనగా ఆపదలను కాలితో తన్ని వేశాను)-

వసి॥ రామా! ఇలా అనేసరికి ప్రసన్నుడయినాడు మహేశ్వరుడు- నమస్కరించాను- మళ్ళీ ఇలా అన్నాను- విను చెబుతా ఆ వృత్తాంతం-

భగవన్! మీ అనుగ్రహంచేత నాకు ఇష్టార్థములన్నీ పరిపూర్ణములయినాయి- కాని ఒక్క సందేహం ఉంది- దానిని నిర్ణయించి చెప్పండి- "చిత్తవిక్షోభానికి కారణముకాని దేవార్చనవిధానం ఎలాంటిదో సెలవివ్వండి" అని-

ఈశ్వ॥ బ్రహ్మర్షీ! చెబుతావిను- మొదట దేవుడంటే యెవరో నీకు తెలుసునా? పుండరీకాక్షుడు దేవుడుగాడు- త్రినేత్రుడు దేవుడు గాడు- కమలసంభవుడు (బ్రహ్మ) దేవుడుగాడు- ఇంద్రుడు దేవుడు గాడు "గాలి, సూర్యుడు, అగ్ని, చంద్రుడు, బ్రాహ్మణుడు, క్షత్రియుడు, నేను, నీవు" వీరెవ్వరూ దేవులుగారు- దేవుడు దేహరూపుడు గాడు- మతిస్వరూపుడుగాడు- నిరతిశయానంద చిత్ప్రకాశము దేవుడు- అదే దేవశబ్దముతో చెప్పబడుతోంది శ్రుతులందు- దానినే (ఆచిత్ప్రకాశమునే) పూజించాలి- ఆమడదూరం నడవలేని వానికి రెండు క్రోసులు గలదారి చూపినట్లు, శివతత్త్వమును తెలియనివారికి, ఆకారార్చనము చెప్పబడినది- రుద్రాలను అర్చించినందున కలిగెడి ఫలము పరిచ్ఛిన్నము- అకృత్రిమము, అనాద్యంతము, అగుఫలము ఆనందము- అది తత్త్వసాక్షాత్కార పర్యంతమయిన పూజచే ప్రసన్నమయిన ఆత్మతత్త్వము వలననే కలుగును- అకృత్రిమఫలమును విడిచి కృత్రిమఫల

మును గోరువాడు మందారవనమును వదిలి జిల్లేడు అడవికి బోవువాడు- ఈపూజకు సామగ్రి 1. జ్ఞానము, 2. సామ్యము. (సర్వత్ర ఆత్మోప మ్యానదర్శనము) 3. శమము. ఇవి పుష్పాలు- చిన్మాత్రమయిన శివ తత్త్వము పూజనీయము- శమము, బోధ, మున్నగు పూలతో జేసెడి ఆత్మార్చనమే దేవార్చనముకాని ఆకారార్చనము దేవపూజకాదు- ఆత్మజ్ఞానరూపమయిన దేవపూజను విడచి కృత్రిమూర్త్యవలయందు సక్తులయిన మానవులు చిరకాలము సంసారక్లేశము ననుభవింతురు- తత్త్వజ్ఞానులుకూడా కొందరెవరయినా ఆత్మధ్యానమునుండి వ్యుత్థితులై సాకారదేవపూజను చేసినట్లు కనిపిస్తే వారు చిన్నపిల్లల చేష్టలవలె అర్థంలేకుండా (ఐడియాలేకుండా) చేశారనాలికాని కృత్రిమభోగాల మీాద ఆశతో చేశారనటానికి వీలులేదు- కనుక పర్యవసానము ఆత్మయే దేవుడు అతడే పరమకారణము- అతణ్ణి జ్ఞానముతో అర్చించాలి- ఎల్లపుడు-

మహర్షీ! నీవు జీవుడే అకృత్రిమమయిన చిదాకాశబ్రహ్మమని తెలిసికో- అతనినే జ్ఞానంచేత పూజించాలి- ఇతరమయిన అనాత్మ పదార్థాలను పూజించరాదు- జ్ఞానలక్షణపూజయే పూజకాని యితర పూజలు పూజలుకావు- అన్నారు సదాశివుడు- విన్నారు వసిష్ఠులు ఇంతవరకు- ఇలా అడిగారు ఏదోసందేహం కలిగి-

వసి॥ దేవా! బ్రహ్మయే (చిదాకాశమే) జగద్రూపముగాను, జీవరూపంగానూ, ఈరెంటికిగల సంసరణరూపంగాను ఉన్నట్లు సెల విచ్చారే తమరు అచ్చట యుక్తిని చెప్పండి- అని-

ఈశ్వ॥ మహర్షీ! వినుసమాధానం- త్రివిధ పరిచ్ఛేద రహిత మయిన చిదాకాశమే నిఖిలజగద్రూపంగానూ, జీవరూపంగానూ ఉంది- చిదాకాశంకంటె జగత్తూలేదు- జీవులూలేరు- చిత్తుయొక్క భానము లేనిదే చైత్యమునకు (ప్రపంచవిషయములకు) భానమెట్లులేదో చిత్స త్తను విడిచి చైత్యమునకు సత్తగూడ అట్లేలేదు- అనగా చిదాత్మ

ప్రకాశించనిదే ఘటపటాది విషయములు ప్రకాశించవు- అలాగే వానియొక్క- ఉనికిగూడ చైతన్యముయొక్క- ఉనికిమీదనే ఆధారపడి ఉన్నదికాని వేరుగలేదని యర్థము-

లేకపోతే మరొకయుక్తిని చెప్తానువిను- చిదాత్మ త్రివిధపరిచ్ఛేద రహితుడు కదా! చిదాత్మకంటె ఇతరవస్తువులు లేనప్పుడుకదా! చిదాత్మకు వస్తుపరిచ్ఛేదరాహిత్యము సంభవించునది- కనుక శ్రుతులు ఏకకంఠ్యముగ ఘోషించెడి పరిచ్ఛేదరాహిత్యము చిదాత్మకు నిలబెట్ట వలె నన్నచో సృష్టికాలమందుగూడ చైత్యములు (విషయములు) వేరుగ లేవనియే చెప్పవలెను- (చిదాత్మా)- సర్గకాలేఽపి అసంభవ చైత్యః- పారావార (పరిచ్ఛేద) శూన్యత్వాత్- ప్రళయకాలవత్- (చిదాకాశము- సృష్టికాలమందుగూడ- చైత్యపదార్థములులేనిది- త్రివిధపరిచ్ఛేదరహితమయినందువలన ప్రలయకాలమందువలె.) అను అనుమానము నీవడిగినదానికి ఉపపత్తి (యుక్తి) కాగలదు-

అయితే ప్రపంచము ఉన్నటుల ఎలాప్రకాశిస్తోంది? అని ప్రశ్న కలుగుతుంది- కాని, లోకంలో సూర్యచంద్రప్రదీపాది తేజః పదార్థములు స్వయంగా ప్రకాశిస్తూఉంటే వాటి స్పందనము మరొకతావున వ్యాపించుట ప్రసిద్ధము- అద్దానిని అజ్ఞానులు తేజఃపదార్థముయొక్క- స్పందనమని గ్రహించలేక వేరుగ భావించెదరు- అలాగే చిదాత్మ స్వయంగా ప్రకాశిస్తూ ఉంటే అతని స్వప్రకాశము స్వబింబము (తన బింబము) నందు ఇమడక బింబముకంటె వెలుపల ప్రభాకారముతో స్పందనమును (చలనమును) జెందేసరికి అద్దానిని (అస్పందనమును) అజ్ఞులు నీలపీతాదిరూపముగు ప్రపంచమని అనుకొంటున్నారు- కనుక స్వప్నపురంవలె భాసించే విచిత్రరూపమయిన ఈప్రపంచం చిద్రూపమే- అందుకు సందేహం లేదు- చిదాకాశమాత్రమే దీని స్వరూపం- వేరే స్వరూపం లేదుదీనికి- అంతమాత్రంచేత చిత్తుయే(చైతన్యమే)చైత్యాకారముగ (విషయాకారముగ) పరిణామం చెందుచున్నదని యనరాదు.

చిత్తునకు పరిణామమనునది అత్యంతాసంభవము- పైగా చిత్తు అద్వితీయము అవికారియును- కనుక చైతన్యముయొక్క- అన్యథాభానమే యీదృశ్యమగు ప్రపంచం- అంతకంటె వేరుకాదు- కల్పితసర్పము అనగా రజ్జువుయొక్క- అన్యథాభానమే- అంతే యిక్కడకూడా-కాబట్టి దీనిని స్వప్నపురతుల్యమనుటలో సందేహంలేదు- ఆకాశంచిన్మాత్రం- గిరులు చిన్మాత్రములు- భూతసంతతి చిన్మాత్రము- జీవాత్మ చిన్మాత్రుడు- స్వర్గమర్త్యపాతాళములందెచ్చటా చిన్మాత్రముకంటె భిన్నమయినది ఏదీలేదు- ఉంటే నిరూపించి చెప్పమనుచూతాం వారిసత్తా- కనుక ఆకాశమన్నా, పరమాకాశమన్నా. బ్రహ్మాకాశమన్నా, జగత్తు అన్నా, చిత్తుఅన్నా, ఒకటేఅర్థం- ఇవన్నీ పర్యాయపదాలు- పాదపము, వృక్షము, తరువు అన్నట్లు-

అయితే భూతాకాశము, అవ్యాకృతాకాశము, చిదాకాశము, అనుపదములకు వేరువేరు అర్థములు ప్రసిద్ధములై ఉన్నవి- కాని ఆమూటికి నొకే యర్థము కుదురుతుంది- "కాశృదీప్తౌ" అను ధాతువుయొక్క- అర్థము పైమూడు పదములందును అనుగతమై ఉంది- కనుక సీధాత్వర్థానుగతిని బట్టి ఆమూడు పదములు స్వయంప్రకాశమయిన చిన్మాత్రమును బోధించును- అలాగే "జగత్" అను పదముకూడ "యేగత్యర్థాః తేజ్ఞానార్థాః" అను అనుశాసముండుటవలనను "వర్తమానే పృషన్మహద్బృహజ్జగచ్ఛతృవచ్చ" అను సూత్రమువలన క్విప్ప్రత్యయముచేర్చి ద్విత్వమును నిపతించి నప్పటికీ ఆధాతువుయొక్క- జ్ఞానార్థత్వమునకు భంగము లేకుండుటవలననూ, చిచ్ఛబ్దమునకు పర్యాయపదమగును-కనుక పైవిధముగ పైనాలుగు పదములు (ఆకాశ, అవ్యాకృతాశ, చిదాకాశ, జగత్, పర్యాయపదములనుట యుచితము-

ఇలా ద్వైతమంతా స్వప్నసదృశమనీ, తత్త్వదృష్టిలో చిదాకాశమే పరమార్థమనీ భావము- స్వప్నంలో చిదాకాశమే ప్రపంచాకారంగా ఎలాగోచరిస్తూ ఉందో జాగ్రత్తుఅనే స్వప్నంలోకూడా ఆచిదా

కాశమే ప్రపంచాకారంగా భాసిస్తోంది- స్వప్నపురంలో చిదాకాశము కంటె వేరుగా వస్తువులు ఎలాలేవో అలాగే జాగ్రతయందుకూడా చిదాకాశముకంటె వేరువస్తువులు లేవు- ఇలా చైత్యమనే వస్తువునకు ఉనికి లేకపోయేసరికి (చైత్యమనే వస్తువే వేరేలేకపోయ్యేసరికి) మొత్తం ప్రపంచం అంతా సన్మాత్రమని తేలినది- పరమాకాశమయిన బ్రహ్మ గొుక్క- మొదటి సంకల్పనే ముల్లోకములయి ద్వితీయవస్తువవలె తయారయినది- ఇది కేవల భ్రాంతిము- కలలో కనిపించిన ఘటపటాదులు చిన్మాత్రములేకాని అంతకంటె వేరుకాగుకదా! కనుక భూత భవిష్య ద్వర్తమాన కాలీనములయిన పదార్థములన్నీ చిదాకాశమాత్రములే- సర్వము చిదాకాశమాత్రమే-

ఆ చిదాకాశరూపుడే జ్ఞానముచే పూజించవగిన దేవుడు- నీవూ నేనూ, ఈప్రపంచమూ అంతా ఆచిదాకాశ దేవుడే- సమస్త వస్తుజాత మునకూ, నీకూ, నాకూ, పారమార్థిక స్వరూపము, ఆచిదాకాశమయిన పరమాత్మయే ఇతరముకాదు-

కనుక హిరణ్యగర్భుని సృష్టి మొదలుకొని ప్రవృత్తమయిన ఈ ప్రపంచంలో చిదాకాశముకంటె వేరువస్తువేదియు లేదు-

## ౩౦. శివపూజోపాఖ్యానమున, చైతోన్ముఖ చిద్విచారము.

ఈశ్వరుడు॥ మరియు, వసిష్ఠా! ఈ ప్రపంచంఅంతా కేవల పరమాత్మే- పరమాత్మ అంటే పరబ్రహ్మ- అతడే పరదేవుడు- అతనిని పూజించినందువల్లనే ఆత్యంతికశ్రేయస్సు- సకలఫలములు అందేఉన్నది- ఆ పరబ్రహ్మము అకృత్రిమము- అనాద్యంతము- అద్వితీయము- అఖండితము- (పరిపూర్ణము.) బాహ్యసాధనములకు అసాధ్యము- అతని పూజవలననే సుఖప్రాప్తి-

మునిశ్రేష్ఠా! నీవు వివేకివి- అందేత నీకు నేను చెబుతున్నాను- దేవాతిదేవుడయిన యీ పరమాత్మను పూజించటానికి గంధ పుష్ప

ధూప దీప నైవేద్యాదులు అవసరంలేదు. మూర్తివంతములయిన దేవతలను అర్చించటానికి అవి కావలయును- దానికధికారులు అవ్యుత్పన్నమతులు- అనగా వివేకరహితులు- అలాంటివార్లకే కృత్రిమ దేవార్చనము చెప్పబడినది- వరిఅన్నం లేకపోతే కొర్రగంజి తాగినట్లు శమాది గుణసంపద, ఆత్మబోధ లేకపోతే పుష్పాదులతో సాకార దేవతలను పూజించటం విధింపబడింది- వారు దానితో సంతోషిస్తారు- స్వప్న ప్రాయములయిన రంభాసంభోగాలనూ, విమానయానాలనూ, స్వర్గ సుఖాలనూ, ఎలాగో పొందుతారు- కాబట్టి మూఢులకు పుష్పధూపార్చనము కల్పింపబడింది-

మీబోటివాళ్ళకు యోగ్యమయిన పూజను చెబుతావినుచక్షురాది దృశ్యమూర్తి రూపుడయిన దేవుడు మాయామయుడు- దేవుడనగా త్రిభువనాధాగుడు అవాఙ్మానసగోచరుడునగు పరమాత్మే- కాని యితరుడుగాడు- విషయభోగ సంకల్పాలతో కూడిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సర్వసాధనరూపులుగారు- సర్వఫలరూపులూకారు- తనుతమ ఉపాసనా తారతమ్యమును బట్టి సుఖలేశమే వార్లయందు లభ్యమౌను- ఆత్మదేవుడు, పూజావస్థయందూ, ఫలావస్థయందూ కూడా నిత్యనిరతిశయ పరమార్థసత్య పూర్ణానందైక స్వభావుడే- అతడే దేవుడనుమాటకు తగినవాడు- సర్వకలాతీతమూ, సర్వభావాంతర స్థితమూ, సర్వసత్తాప్రదమూ అగు సంవిత్తుయే దేవి- సర్వసాక్షియై మూర్తామూర్తములందు అంతరాలికసాక్షి చిన్మాత్రరూపుడగు పరమాత్మయే దేవుడు- అతడే సూర్యాదులకంటె భిన్నయగు ప్రకాశ రూపుడు- అతడే ఉపనిషత్తులలో "ఓమ్" కారముచే చెప్పబడ్డాడు- సర్వసముడు- సద్రూపుడు- చిద్రూపుడు- పరమార్థస్వరూపుడు- అతడు తీగలలో రసమున్నట్లు అంతటా అంతరాత్మగా నున్నాడు- ఓ మహర్షి! నీధర్మపత్నియగు అరుంధతియందలి చిత్తత్వము నీలోని చిత్తత్వము పార్వతీదేవి యందున్న చిత్తత్వము ప్రమథగణములలోని చిత్తత్వము, నాలోని చిత్తత్వము ఈ జగత్త్రయంలోని చిత్తత్వము ఏదికలదో

ఆచిత్తత్త్వమే దేవుడని ఉత్తమబుద్ధిగల తత్త్వజ్ఞులు తెలిసికొన్నారు- కరచరణాద్యవయవములు గలవాడు దేవుడుగా కల్పితుడుగాని పరమార్థమయిన దేవుడుగాడు- మునీంద్రా! లోకంలో సంవిన్మాత్రముకంటె సారమేమున్నది? చెప్పు- సంసారంలో చిన్మాత్రమే సారము- సర్వవస్తుజాలమందును సారము చైతన్యమే- కనుక ఆచైతన్యమే దేవుడు- పరిపూర్ణమయిన ఆదేవుడే నేను- ఆచిద్రూపదేవుడు ఎక్కడో దూరంగా లేడు- పొందశక్యముకాని వాడుగాడు- అంతటా ఆకాశమున్నట్లు అందరి దేహంలోనూ సదా ఉన్నాడు- అతడే సర్వక్రియాకర్త- సర్వఫలభోక్త- "స ఏష ఇహ ప్రవిష్టః ఆనఖాగ్రేభ్యః" అను శ్రుతి ప్రమాణమునుబట్టి యీశరీరమనే పట్టణమునందే ఉన్నాడు-

ఈ శరీరమనే మహాగృహంలో అన్నమయాది పంచకోశములనే అంతర్గృహాలు కొన్ని ఉన్నాయి- వీటిని విడదీసి తెలిసికొనుట చాల కష్టము. అందులో బుద్ధి అనే గుహ ఒకటిఉంది- అదే ఆనందమయకోశము- దానికి అధిపతి యితడు-మనస్సుతో కలుపుకొని ఆరుయింద్రియముల ఆచారమునకూ అతీతుడయిన ఈపరబ్రహ్మకు ఉపదేశించుటకు వ్యవహరించుటకును "చిత్" అనే పేరు కల్పింపబడినది యితనికి-చిన్మయుడూ,సూక్ష్ముడు,సర్వవ్యాపీ, నిరంజనుడూఅగు ఆపరమాత్మ ఈఆభాస ప్రపంచాన్ని ఆరోపదశలో చేస్తున్నాడు- అపవాదదశలో చేయడం లేదు- వసంతఋతువు తీగలను శోభింపచేస్తుంది- ఈచిదాత్మ ప్రపంచం కొరకు సృష్టిక్రియను శోభింపచేస్తాడు- ఈచిదాత్మయందు అతి సుందరమయిన చమత్కారాలు అనేకం ఉన్నాయి- తనయందున్న సత్తను (ఉనికిని) ఆరోప్యమునందు అర్పిస్తుంది- తనచైతన్యమును జడమునకు అర్పిస్తుంది- ఆచిచ్చమత్కారాలే కొన్ని ఆకాశలనీ మరికొన్ని జీవులనీ మరికొన్ని చిత్తములనీ, కాలములనీ, దేశములనీ, క్రియలనీ, ద్రవ్యములనీ, షడ్భావవికారముల వైచిత్ర్యంతోను, ఔచిత్యముతోను, విచిత్రములయిన పదార్థాలుగా తయారవుతున్నాయి- అందులో కొన్ని

సూర్యచంద్రాగ్నులు మున్నగునవి ప్రకాశరూపాలు- మరికొన్ని శైలాగులు కేవల తమోరూపాలు- వసంతఋతువు సంకల్పం (కోరిక) లేకుండగనే మొలకను తయారుచేస్తుంది- అలాగే పరమాత్మ తనకు భోగేచ్ఛ లేకుండగనే ప్రపంచమును నిర్మిస్తాడు-

త్రైలోక్యమనే సముద్రంలో వాస్తవమయిన తత్త్వము చైతన్యమనే జలం తప్ప వేరేమీ లేదు- సురాసురగంధర్వశైలార్ణవాదులతో గూడిన యీప్రపంచం అంతా చైతన్యమనే సముద్రంలోనే తిరుగుతోంది- ఈ సంసారచక్రం చిచ్చక్రంమీదనే ఆధారపడి తిరుగుతోంది-

ఈచైతన్యమే విష్ణుమూర్తి అనే రూపంతో అసురమండలాన్ని సంహరిస్తోంది- కాలం మేఘఖండంతో (చిన్న మేఖంతో) ఎండను ఖండించినట్లు- త్రినేత్రుడనే రూపంతో వృషభవాహనారూఢమై, చంద్రకలాభూషణమై, గౌరీదేవిని ఆనందపరచేది యీచైతన్యమే- విష్ణుమూర్తి యొక్క నాభికమలంలో తుమ్మెదయి (అనగా చతుర్ముఖబ్రహ్మ అయి) వేదక్రియాఖ్యమనే నళినికి (తామరతీగకు) సరస్సు అయినది యీ చైతన్యమే- బ్రహ్మర్షీ! ఈచిదాత్మకు ఇంకా విచిత్రములయిన శరీరాలు అనేకం ఉన్నాయి- వాటిని లెక్కింపలేము- చెట్టుకు ఆకులెన్నో లెక్కింపలేము- బంగారంతో తయారయ్యే ఆభరణాలెన్నో లెక్కింపలేము- అలాగే యీచైతన్య శరీరాలు కూడా లెక్కింపలేము. ఈ చైతన్యమే సమస్త సురానీకముచే నమస్కరింపబడుచూ, ముల్లోక శిఖామణి యగుచున్నది- ఈచిదాత్మయే సూర్యుడై త్రైలోక్యోదరంలో ఉదయాస్తమయములను జెందుచున్నాడు- ఈ చిచ్చంద్రికయే నలుదిక్కులా ప్రకాశిస్తూ సకల భూతములనే కుముదద్వతిని వికసింపజేస్తోంది- ఈ చిద్దర్పణ మహాలక్ష్మియే త్రైలోక్య ప్రతిబింబాన్ని గ్రహించియుంది- రసశక్తి జలసమూహరూపమై సముద్రస్వరూపాన్ని దాల్చింది- ఈచిచ్ఛక్తి భూతస్వరూపమై పదునాలుగు లోకములలోని భూతములయొక్క స్వరూపాన్ని ధరించింది- ఈచిద్రూపలత, అవ్యాకృ

తాకాశమనే క్షేత్రంలో మొలచి హిరణ్యగర్భుడనే అంకురమయింది- సర్వపదార్థముల సత్యత్వమనే ఫలమును ప్రసవించింది- ఈతీగకు జీవజాలమే పుష్పాళి- సవికల్పజ్ఞానములు చర్మము-చిత్తవృత్తులు మొగ్గలు-గడచిన అసంఖ్యాకములయిన ముల్లోకాలు కింజల్కాలు- సర్వాఋతువులూ కణువుకణువుకూ ఉండుపుష్పాలు- జడములయిన కొండలు మొదలయినవి మొదళ్లు- చతుర్విధశరీరాలు కణుపులు- ఆమూలాగ్రము ప్రవృత్తికర్మలనే దారలతో చుట్టుకొని ఉంది- ఇలాంటి యీతీగకు దృశ్యప్రపంచము పుష్పము- పరామర్శచేస్తే నిలువదు దీని శరీరం- యీదృశ్యకుసుమముమీాద అందరకు అంతులేని అభిమానం అది ఆరోజు కారోజు పెరుగుతోందికాని యెవరికీ యేమాత్రం తగ్గటంలేదు- ఈ చైతన్యవల్లనే సూర్యచంద్రాదులు ప్రకాశిస్తున్నారు- వస్తుతః అమంగలములయినా చిజ్జడములనే దాంపత్యదేహాలు అందరకు అతిప్రీతి విషయాలు అయినాయి- (మహారుచిస్తున్నాయి-) చైతన్యమనే సుడిగాలిలో జగజ్జాలమనే పరాగం చిత్తుకంటె వేరయినదివలె బలేతమాషాగా నాట్యమాడుతోంది- దీపపు కాగడా యెదుటనున్న వస్తువును కనుపరచినట్లు యీచిత్తు (చైతన్యం)ప్రపంచాన్ని అంతా ప్రకటిస్తోంది- చైతన్యమనే నిర్మలమయిన చంద్రబింబంలో కళంకమువలెనుండి కనిపిస్తోంది ప్రాపంచికపదార్థ సంపదంతా ప్రాపంచికపదార్థపటలము చైతన్యమనే రసాయనంతో తడసి ప్రకాసిస్తోంది వర్షముచే తడిసిన లతవలె- పంచీకరణముతో తేజోవ్యాప్తమయిన యింటిలో చీకటియున్నట్లు చిద్వ్యాప్తమయిన ప్రపంచంలో జాడ్యంవుంటోంది- శరీరం లోపలనున్న ప్రమాతృచైతన్యము యొక్క- చమత్కారమువల్లనే గవాక్షఘటపటాద్యాకారవైచిత్ర్యము సిద్ధిస్తోంది- సౌరాద్యాలోకవశంచేత గృహప్రాసాదాదుల యాకారవైచిత్ర్యము ఏర్పడినట్లు- ఈ సాకారపదార్థములు చిచ్ఛాయాజాడ్యములను విడిచినట్లయితే వాటి ఆకారంకూడా ఉండేదికాదు- చిదాకాశమువల్ల ప్రకాశించెడి యీ దేహగేహంలో సంకల్పమును శైశవావస్థగల విహితనిషిద్ధకర్మలయందలి ప్రవృత్తి

కులాంగన ఇటునటు తిరుగుతోంది- చిత్ప్రకాశలేనిచో ఎవనికి మాత్రం ఎలానాలుకచివరనున్న రసము ప్రకటమవును-

ఓ రామా! విను చిద్వ్యాప్తిలేని దేహవృక్షము బ్రతకనే బ్రతుకదు- చైతన్యాధీనమయియే ఆచెట్టు పెరుగుతోంది- పుటుతోంది- చస్తోంది- తరంగమంతా జలమయము- ప్రపంచమంతా చిన్మయము- తరంగంలో జలంకంటె వేరు లేదు- ప్రపంచంలో చైతన్యంకంటె వేరు లేదు- అన్నాడు శివుడు వసిష్ఠునితో- ఇలా అడిగాడు మళ్ళీ వసిష్ఠుడు-

వసి॥ రామా! నాతో ఆ త్రినేత్రుడు యిలా చెప్పేసరికి నేను వారిని యిలా అడిగాను- శంకరా! ప్రపంచంఅంతా చైతన్యమే అయితే శరీరం చిదాత్మకమే అయితే యీశరీరం నిద్రా మరణ మూర్ఛాదులలో ఏమీ తెలిసికొనుటలేదే! మొద్దులాగ ఉంటోందే ఏమికారణం? "ఈ దేహాదికము లోగడ చైతన్యముగలది"- "ఇపుడు చైతన్యము లేనిది" అనే అనుభవం లోకం అందరకు ప్రత్యక్షసిద్ధమేకదా!

ఈశ్వ॥ మునీంద్రా! నీవు బ్రహ్మవేత్తలలో మొనగాడవు గనుక చాలా గొప్పప్రశ్న వేశావు- విను సమాధానం చెబుతాను-

సమష్టివ్యష్ట్యాత్మకమయిన బుద్ధిలో ప్రతిబింబించడానికి అభిముఖమయిన నిర్వికల్పచైతన్యం యీశరీరంలోఉన్నది- ఆచైతన్యం తన సంకల్పంచేత తననే జీవరూపంతో తెలిసికుంటూ ఇతరమయినదివలె (అనగా రెండవదివలె) ఉంటోంది- ఎలాగంటే మంచిసుశీలయగు ఆడది కలలో మరొకవిటునితో సంభోగింప సంకల్పము గలదయి దుస్స్వభావాన్నిపొంది మరోస్త్రీగా తయారయినట్లు- ఆమె స్వప్నంలో సంకల్పించిన ఆవిటపురుషుడు కుపితుడై క్షణంలో అతి క్రూరుడవుతాడు- అలాగే తనను జీవరూపంగా భావించిన ఆచైతన్యం క్షణంలో అనేక వికల్పాలను కల్పించుకొంటుంది- తన స్వరూపంనుంచి దిగజారుతుంది- క్రమంగా జడతాదాత్మ్యన్ని తనయందు భావించుకుంటుంది- తన

కల్పనచేతనే తాను సవికల్పమై పోతుంది- క్రమంగా చైత్యాకారాన్ని చెందుతుంది- మొట్టమొదట శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, తన్మాత్రల తాదాత్మ్యభావనతో భూతసూక్ష్మాకారాన్ని చెందుతుంది- ఆవల పంచీకరణంచేత స్థూలభూత స్వరూపమును జెంది క్రమంగా జీవ, బుద్ధి, మనోరూపములను దాల్చి సంసారంలో మునుగుతుంది- బ్రాహ్మణు- "నేను చండాలుడను" అని నిరంతరం మననంచేస్తే వానికి చండాలత్వమే సంప్రాప్తమవుతుంది- అలాగే బ్రహ్మచైతన్యం అజ్ఞానంతో కేవలరూపాన్ని చెంది దేహాకారంగానూ, జీవాకారంగానూ, తనను కల్పించుకొంటుంది- తత్ప్రయుక్తమయిన జాడ్యంచేత తన సర్వాత్మ్యాన్ని కోల్పోతుంది- ఎల్లప్పుడు భోగసంకల్పాలను పెంచుకుంటుంది- సంసారమును పొందుతుంది- మంచునీరు గడ్డకట్టి కరకమ (మంచుగడ్డ) యయినట్లు చైతన్యమే దృఢమయిన జీవత్వభ్రమను చెందుతుంది- ఆపైన చిత్తం, మనస్సు, మోహము, మాయ, అనే నానా పేరులను పొందుతుంది- సంసారమును పొందుతుంది- కామక్రోధతృష్ణాది వికారాలను చెందుతుంది- భార్యాపుత్రాది వియోగంలో దుఃఖాదివికారం చెందుతుంది- ధనదారిద్ర్యాలను పొందుతుంది- పరిచ్ఛిన్నమయిన దేహమాత్రమునందు ఆదరమును చెంది అతిదైన్యంలో మునుగుతుంది- తుదకు ముసలి అడవి యేనుగు బురదలో దిగబడినట్లు మోహపంకంలో దిగపడుతుంది- భావాభావములనే ఊయలమీద ఊగుతుంది- అస్థిరమయిన శరీరాలు ధరిస్తుంది- అంతులేని వికారాలతో సంసారంలో వ్యవహరిస్తుంది- రాగద్వేషాలతో కుంగిపోతుంది- తుదకు గుంపునుంచి చెదరిన ఆడలేడివలె అతిదైన్యాం చెందుతుంది- భూతమాత్రలు ఆవిర్భవిస్తే ఆకారం ధరిస్తుంది- అవి తిరోభవనుయితే తాను తిరోభావం చెందుతుంది- ఆడఒంటె అడవిలో ముళ్ళతీగల ఆకులూ, చేదుతీగల ఆకులూ నవులుతూ, వానియందు మధురరసం ఉన్నదనిభావించి ఆభావనతో అలాంటి ఆకులనే కాంక్షిస్తుంది- అలాగే యీఆత్మచైతన్యం కూడా దుఃఖబహుళమయిన ప్రాపంచిక విషయములందు సుఖమున్న

దనుకొని మాటిమాటికి ఆవిషయాలను కోరుతూ ఉంటుంది- మధ్య మధ్య నరకగోతులలో పడుతుంది- మిక్కిలి వైషమ్యాన్ని చెందుతుంది- సంకటాలకు గురిఅవుతుంది- దుఃఖపరంపరలకు పుట్టిల్లు అవుతుంది- ఆపదలకుగని- అనర్థాలకు నిలయం- వికారచేష్టలకు పరవశం- కష్టపరంపరలకు నివాసస్థానం- పరితాపాలకు ప్రాప్తిస్థానం అయి క్రమంగా మనుష్యజన్మ దైవయోగంవల్ల లభించినా వ్యవహారమార్గంలో కౌశలం (నేర్పు) సంపాదించుకొని దానిచేత కావ్యనాటకాలంకారతర్కాదులను అభ్యసిస్తుంది- తనకు బంధమయిన ధనగృహక్షేత్రపరివారాదులను నిర్మించుకొనుటలో పరాక్రమాన్ని చూపుతుంది- ఇంతేకాని మోక్షానికి ఉపయోగించే వివేకపదాన్ని మాత్రం పొందదు- వయఃకాలం అంతా ఇలా గడుపుకొని తుదకు ఆయుర్దాయం సరిపోయే సరికి చస్తానని భయపడుతుంది- నీరులేని చెరువులో చాపవలె ఇటునటూ పొర్లాడుతూ కొట్టుకుంటుంది-

ఈ చైతన్యానికి(చిదాత్మకు) బాల్యంలో భోగాలు పరాధీనాలు- యౌవనంలో విషయచింతలు- (అదికావాలి ఇదికావాలి అనేకోరికలు) వార్ధక్యంలో అతిదుఃఖాలు- ఆధివ్యాధులును- క్రమంగా మరణమున్నూ- ఇవి తప్పవు- తరువాత మళ్ళీ స్వర్గంలో దేవతగానో, పాతాళంలో ఆడపాముగానో, దైత్య (అసుర) లోకంలో అసురస్త్రీగానో, వసుధాతలంలో మనుష్యస్త్రీగానో, రాక్షసలోకంలో రాక్షసస్త్రీగానో, అడవిలో ఆడకోతిగనో, కొండగుహలో ఆడసింహముగానో, కులపర్వతంలో కిన్నరస్త్రీగానో, మేరుపర్వతమందు విద్యాధరస్త్రీగానో, అడవిపుట్టల (గోతుల)లో, కొండచలవ (పాము) గానో, చెట్లగుబురులందు తీగగానో,గూళ్ళలో ఆడపక్షిగానో,అడవిలో ఆడలేడిగానోపుట్టుతుంది-

లేకపోతే పాలసముద్రంలో శ్రీ మన్నారాయణమూర్తిగా పడుంటుంది- బ్రహ్మపురంలో కమలజునివలె ధ్యానిస్తూ ఉంటుంది- రజతాద్రిమీద అర్ధనారీశ్వరుడుగా ఉంటుంది- స్వర్గలోకంలో దేవేం

ద్రుడుగా ఉం:టుంది- సూర్యుడుగా తయారై పగటిని కలిగిస్తుంది- మేఘమై నీటిని వర్షిస్తుంది- గాలిఅయి పర్వత మహోదధులను కదిలిస్తుంది- కాలరూపమై ఋతుచక్రాన్ని సంవత్సరయుగమన్వంతరాలను దొర్లిస్తుంది- దినరూపమై వెలుతురును రాత్రిరూపమై చీకటిని క్రమంగా కలిగిస్తుంది- వృక్షాదులందు బీజరసంగా ప్రకాశిస్తుంది- మరొకచోట పాషాణాలతో సమానంగా ఉంటుంది- ఇంకొకచోట నదీ రూపము- మరొకచోట కుముద్వతి- ఒకానొకచోట పరిపక్వమయిన ఫలపంక్తి- ఒకానొకచోట కాష్ఠానలాదులు- ఒకానొకచోట చల్లని నీరు- ఒకానొకచోట ఆకసము, వాయువును- ఒకానొకచోట ఏమీ లేదు- ఒకానొకచోట చోరశక్యము కానిచోట ఉండే ఉజ్వలమయిన శిల- ఒకచోట నలుపు, ఒకచోట ఆకుపచ్చన, ఒకచోట అగ్ని, ఒక చోట భూమి- ఇలా అనేకరూపములుగ ఉంటుంది యీచైతన్యం- సర్వపదార్థరూపము సర్వవ్యాపకము, సర్వశక్తియుక్తమును ఇది- అంచేత సమస్త జగద్రూపంగా ఉంటుంది- అయినా అతి స్వచ్ఛమయినది ఆచైతన్యం-

ఈ చైతన్యము తనను ఎప్పుడు ఎలా వివర్తపరచుకొనవలెనని తలుస్తుందో అప్పుడప్పుడు ఆయాభావమును అనుభవిస్తుంది-

హంసీ క్రౌంచీ బకీ కాకీ సారసీ తురగీ వృకీ
బకీ బలాకా హరిణీ వానరీ కిన్నరీ శునీ
వటీకా పింగలీ శాలీ మక్షికా భ్రమరీ శుకీ
ధీః శ్రీః హ్రీః ప్రీతీ రతిశ్చ శంబరీ శర్వరీ శశీ ॥

అని అనేకయోనులందు పరిభ్రమిస్తుంది-(ఇందు వటీకా,పింగలీ, శాలీ) అనునవి పక్షివిశేషములు- మిగిలిన పక్షిపేరులు స్పష్టము-

ఇలా సుడిగుండంలో తృణము తిరిగినట్లు సంసారంలో తిరుగుతూ ఈచైతన్యం తన సంకల్పంవల్ల తానే భయపడుతుంది- గాడిద తాను

అరచి తన అఱపుకు తానే భయపడుతుంది- దీనితో సమానమయిన దుర్బలమయినది మరొకటి లేదు- రామా! అలాంటి జీవశక్తిని నీకు విపులంగా చెప్పాను- ఈజీవశక్తి కర్మానుసారంగా నడుస్తూ ఉంటుంది- దీనిని జూచి పరమాత్మ దుఃఖిస్తాడు- అనంతము దుఃఖబహుళము అయిన సంసారమలాన్ని ఆక్రమించింది- ఈజీవశక్తి తనకు స్వస్వరూపావస్థలో సహజంగా ఉన్నసంపదను పోగొట్టుకొని దౌర్భాగ్యంతో పరితాపపడుతూ జీవత్వాన్నిపొంది మొగుడులేని వెధవముండవలె ఏడుస్తూ ఉంటుంది అనాధయై-

కాబట్టి రామా! నీవు అవిద్యయొక్క సామర్థ్యాన్ని ఆలోచించు! దీనిసత్తావల్ల చైతన్యం పరిపూర్ణానందస్వభావం కలదయినా తనలో సకల లోకాలను అంతర్భావం చేసుకొనగల సామర్థ్యమున్నా తాను దేహమాత్రపరిచ్ఛిన్నమయిన దానను భావాన్ని పొంది ప్రాపంచిక భోగసమృద్ధిమయిన పుణ్యంకాస్తా ఖర్చుపడేసరికి తనకు రిక్తత పట్టినట్లు తలచి (అనగా తనకేమీ లేనట్లు తలచి) మాటిమాటికి అధఃపతనాన్ని చెందుతుంది- అది ఏలాగంటే దృష్టాంతం చెబుతావిను-

లోకంలో ఏతాంబానకు ఒకకుండ తగిలిస్తారు- ఆకుండలో కొంత ఆకాశం(అవకాశం)ఉంటుంది- ఈఆకాశం నిజస్థితిలో పరిపూర్ణ స్వభావంకలది- పెద్దపెద్ద సముద్రాది జలమునుగూడ తనలో నిలుపుకొనకలిగినదే అయినా తనపరిపూర్ణభావాన్ని తానుమరచి ఘటీమాత్ర పరిచ్ఛిన్నమయిన దానను అను పరిచ్ఛేదభావాన్ని పొంది, ఆకుండలోని నీరుకాస్తా కారిపోయేసరికి మాటికి మాటికి ఆఘటీ ఆకాశం క్రిందకు పడుతూ ఉంటుంది- అలాగే ఉంది యీచైతన్యముయొక్క పరిస్థితికూడా అని అన్నారు వసిష్ఠులు శ్రీరామునితో- లేక అన్నారు శంకరులు వసిష్ఠునితో-

## ౩౧. మనస్సు ప్రాణము ఒక్కటేనని ప్రతిపాదించుట.

ఈశ్వ॥ మునీంద్రా! ఇలా జీవజగద్భావం అసత్తు- (లేనిది) ఆరోపముచే ఏర్పడుతోంది- కలలో కల్లుతాగి మత్తెక్కి పడిపోయినట్లు- అక్కడ కల్లూలేదు- తాగడంలేదు- మత్తూలేదు- పడిపోవడం లేదు అంతాకల్పనే- అంతే యీప్రపంచం కూడా- బ్రతికిఉన్న ఆనది చచ్చినట్లు కలవచ్చి ఏడ్చుట ఎలాంటిదో నాశరహితమయిన యీ చిదాత్మ నశించితినని అనుకోటంకూడా అలాంటిదే- గిరగిర తిరిగెడి కులాలచక్రము నిశ్చలంగా ఉన్నదని అనుకొనుట ఎలాంటిదో అస్థిరమయిన ప్రపంచాన్ని స్థిరమని అనుకోవడం కూడా అలాంటిదే- చిత్తు (చైతన్యం) సంసారమనుభవించటానికి చిత్తం కారణం- చిద్భిన్నమయిన వస్తువే నిజంలో లేదుకనుక సంసారకారణమయిన యీచిత్తం కూడా లేనిదన్నమాటే- అదే లేకపోతే దానివల్ల ఏర్పడిన జగత్తు కూడా లేదన్నమాటే- ఇలా చిత్తి చైత్యములు లేకపోతే చైతన్యం శుద్ధమన్నమాటే- కనుక రాతిలో చమురులేనట్లు దృక్కునందు దృశ్య, దర్శన, ద్రష్టృ రూపాలులేవు- చంద్రునియందు నలుపుతనం లేనట్లు కర్తృకర్మక్రియలులేవు- ఆకాశమున అంకురము మొలవనట్లు మాతృమాన మేయములులేవు- నందనవనంలో ఖదిరవృక్షము లేనట్లు చిచ్చేతన చేత్యాది విభాగంలేదు- ఆకాశంలో పర్వతం లేనట్లు అహంతా మమతలులేవు- కాటుకకొండలో శంఖం పుట్టనట్లు సదేహత్వ విదేహత్వాలులేవు- అణువులో మేరుపర్వతము లేనట్లు నానాత్వ అనానాత్వములులేవు- సూర్యమండలంలో రాత్రిలేనట్లు "నేతి నేతి" అనే ఉపదేశాలులేవు- మంచులో వేడితనం లేనట్లు శూన్యత్వాశూన్యత్వములు లేవు- రాతికడుపులో చెట్టు లేనట్లు వస్తుత్వావస్తుత్వములులేవు- కనుక చైతన్యమునందు కేవలీభావ లక్షణమయిన స్వరూపస్వస్థితియే మిగిలి ఉన్నది- ఏమాత్రము భేదప్రపంచములేదు- అన్నాడు శివుడు-

వసి॥ ఓ యీశ్వరా ! హిరణ్యగర్భుడనే సమష్టిచిత్తమే యీ చైతన్యమునకు సర్వానర్థ హేతువయింది- దానివల్లనే యీ చైతన్యం చతుర్విధ శరీరాలలో ప్రవేశించి సంసారదుఃఖం అనుభవిస్తోంది- ఈ యనర్థాన్ని తొలగించడం మనకు సాధ్యంకాదు కదా ?

ఈశ్వ॥ అలాకాదు- హిరణ్యగర్భుని (సమష్టిచిత్తము) వల్ల యీఅనర్థం సంప్రాప్తమగుటలేదు- దేహేంద్రియాదులందలి అహం మమాభిమానం చేతనే యీ సంసారానర్థం సంప్రాప్తమవుతోంది- కనుకనే తత్త్వజ్ఞానియందు అలాంటి అహంమమాభిమానం లేకపోవడం చేత ఈ యనర్థం తొలగిపోతుంది- త్రిలోకము లందలి పదార్థములన్నీ నిజంలో గడ్డిపోచవంటివి- అంత తేలికవి- అయినా భావనాబలంచేత అతత్త్వవేత్తలు (అజ్ఞానులు) వాటిని కదల్చలేకపోతున్నారు- ప్రయత్నం లేకపోవడం చేతనే ఎంతటి సులభమయినా భావనాత్యాగము (అభిమానత్యాగము) అందరికీ అసాధ్యం అవుతోంది- గడ్డిపోచ అయినా చెయ్యిచాచందే లభించదుకదా ! నోటితో ఊదనిదే కదలదుగదా ! భావనామాత్రమును విడిచిపెట్టితిమా పరమ పురుషార్థరూపమయిన పరమార్థచైతన్యము ఘటపటాది ప్రపంచమందంతటా సులభంగా గోచరిస్తుంది- దీపం తాను తనరూపంలో ఉండే ఇతర పదార్థాలను ప్రకాశింప చేస్తుంది కాని, అందుకొరకు వేరుపనిని చేయదు- అలాగే నిర్వికల్పచైతన్యంకూడా సాక్షిమాత్రంగా ఉండే సర్వప్రపంచాన్ని ప్రకాశింపచేస్తుంది- ఇంతే కాని తాను కర్తృత్వాది వికారమును ఏమాత్రము పొందదు- ఇలాంటి చైతన్యంకూడా దేహాదులందలి అహం మమాది భావనచేత అమలినమయిన దయినా మలినముగా తయారవుతుంది- నిర్వికల్పమయినా సవికల్పమవుతుంది-

నిర్వికల్పమూ, అతిసూక్ష్మమూ, అయిన ఆచైతన్యము, ప్రాణవాయు ప్రధానమయిన లింగదేహమునందు ప్రతిబింబభావంతో ప్రవేశించి హస్తపాదాది అవయవములనూ, హృదయాది మర్మస్థానములనూ,

డెబ్బది రెండు వేల నాడీభేదమును వ్యాపించి సర్వవ్యాపకమయిన తన చిచ్ఛక్తిని (చైతన్యమును) ఆకర్షించుకొని (కుంచింపజేసికొని) వృద్ధి చెందుతుంది– ఎలాగంటే! సన్నని పొడవైన పట్టుదారమును సాలెవాడు, సూదికిగాని, కండెకుగాని, యంత్రంతో చుట్టేసరికి తానెంత పొడవయినా దానిని తగ్గించుకొని తావన్మాత్రంలో ఉపసంహారం చెంది లావుగా ఉండమొక్క ఆకారాన్ని చెందుతుంది– అలాగే యీ చైతన్యమువొక్క పరిస్థితి–

కనుకనే యీ చైతన్యము జాగ్రదవస్థలో బాహ్యవిషయాకారాన్నీ, లోపల మనోమయాకారాన్నీ చెంది, బాహ్యవిషయములను ఆంతర (లోపలి) విషయములను తెలిసికొంటూఉన్నది– నిద్రపోతూ అందులో స్వప్నం వచ్చినపుడు వాసనామయమయిన మనోవృత్తులతో కూడుకొని లోపలి విషయములను తెలుసుకుంటూనూ, బాహ్యవిషయాలను తెలిసికొనలేకుండగనూ ఉంటుంది– గాఢనిద్రలో అజ్ఞానమునకు సాక్షిగాఉండి సద్రూపమయినా అసద్రూపమయినదై (ఉన్ననూ లేని దానితో సమానమై) అబోధపక్షంలోనే పడిపోతుంది– అనగా ఏమీ తెలియని దానిక్రిందనే లెక్కకు వస్తుంది– అతిస్వచ్ఛమయిన యీ బ్రహ్మచైతన్యం దేహేంద్రియాదులతో తాదాత్మ్యాధ్యాసను చెందుటచే ఆ దేహేంద్రియాదుల అనుకూల్యప్రాప్తి ప్రాతికూల్య పరిహారముల విషయముగు చింతలోనే మునిగి ఉంటుంది– అనగా దేహేంద్రియాలకు అనుకూలమయిన విషయములను పొందడం ఎలాగా! వాటికి ప్రతికూలమయిన విషయాలను తొలగించుకొనడం ఎలాగా! అనే ఆందోళనలోనే ఎల్లకాలం ఉంటుందని అర్థం– ఇది ఎలాగంటె ఎంతటి సజ్జనుడయినా దుర్జనసాంగత్యంతో చిరకాలం చిత్తమును సంస్కరింపచేసికొనేసరికి ఆదుర్జనుని యొక్క కోరికలే అలవాటుపడి తుదకు ఈ సజ్జనుడు దుర్జనుడే అవుతాడు– అదేస్థితి పట్టింది యీ బ్రహ్మచైతన్యమునకు కూడా! మరల బ్రహ్మాత్మభావనతో చిత్తం సంస్కరింపబడితే బ్రహ్మే అవుతాడు– యీ జీవుడు–

బంగారం మలినమయితే రాగివలె తయారవుతుంది- "తేజాపు" చేసి మాలిన్యం తీసివేస్తే మరల మేలిమి బంగారం అవుతుంది- అలాగే యీ చైతన్యంకూడా- మంచి అద్దంమీద గాలికి దుమ్ముపడేసరికి దాని నైజశక్తి తగ్గిపోతుంది- అనగా దాని స్వచ్ఛత నశిస్తుంది- ఆదుమ్ము తుడిచివేస్తే మరలదాని స్వచ్ఛతను పొందుతుంది- అనగా నిర్మల మవుతుంది- అలాగే బ్రహ్మచైతన్యం అజ్ఞానంవల్ల జీవభావాన్ని చెందినదివలె ఉండి తత్త్వజ్ఞానంవల్ల కైవల్యాన్ని పొందుతుంది- అజ్ఞానంవల్ల సంసారం- స్వరూపజ్ఞానంవల్ల ముక్తి- అజ్ఞానంవల్ల లేనిపోని భేదభావాన్ని పొంది చావులేని చైతన్యం చావు తెచ్చిపెట్టుకుంటుంది- తొడిమనంటుకొని యున్నపండు కొమ్మ కొద్దిగా కదిలేసరికి చెట్టునుంచి పడుతుంది- బ్రహ్మచైతన్యానికి కొద్దిగా చలనం కలిగేసరికి జీవభావాన్ని పొంది అధఃపాతమును చెందుతుంది-

అధ్యస్తములు అధిష్ఠానముకంటె భిన్నములుగావు- శబ్దస్పర్శాది ప్రాపంచికపదార్థాలు బ్రహ్మచైతన్యంకంటె భిన్నములుకావు- అజ్ఞానకల్పితములూ జ్ఞానముచే నశించేవే- సూర్యుని వెలుగు సత్తామాత్రంగా ఉంటే లోకులకు పనులందు ప్రవృత్తి కలుగుతోంది- చైతన్యం సాక్షిమాత్రంగాఉంటే చిత్తమునకు(మనస్సుకు) ఇంద్రియాదులందు ప్రవృత్తి కలుగుతోంది- ఇంద్రియాదులకు రూపాదివిషయములందు ప్రవృత్తి కూడా అంతే-

చిత్సాన్నిధ్యంవల్ల వ్యానవాయువు ప్రేరితమవుతుంది- దానివల్ల కంటిపాపలకు (గుడ్డునకు) చలనం కలుగుతుంది- కంటిపాపలందున్న దీప్తియే "తైజసమనీ, ఇంద్రియమనీ, దృష్టియనీ, చక్షుస్సు" అనీ చెప్పబడుతుంది- ఆదీప్తిద్వారా చైతన్యంవచ్చి బాహ్యవిషయాకారాన్ని చెంది ఘటపటాదిజ్ఞానాన్ని కలిగిస్తుంది- ఇదంతా ఆపరాచిత్తుయే కాని మరొకటికాదు- ఈపరిస్థితి స్పార్శన ఘ్రాణనాది త్రిపుటులయందు కూడ సమానమే- జ్ఞానేంద్రియములందంతటా యీవిధానము తప్పదు-

ఇంక కర్మేంద్రియములందు కూడా ఇంతే- ఎలాగంటే కర్మేంద్రియములయొక్క ప్రవృత్తికి సంకల్పాత్మక మనోవృత్తి కారణం- ఆ మనోవృత్తికి సాక్షీ యీఆత్మచైతన్యమే- సంకల్పంవల్ల కర్మేంద్రియములు క్రియోన్ముఖములగును- సంకల్పము మనోవ్యాపారము- (మననము) మననమనగా చిత్తకాలుష్యము- చిత్తమునకు చైతన్యాధ్యాసయే కాలుష్యము- ఆచైతన్యము స్వతస్సిద్ధంగా నిర్మలము-

స్ఫటికశిల వనగిరినద్యాదుల ప్రతిబింబమును ధరించియున్నట్లు యీ ప్రకాశాత్మకమయిన చైతన్యము తనలో జగత్తంతయును ధరించి ఉంది- జగదధిష్ఠానమయిన యీచైతన్యం స్వయముగ వికారరహితమై పుట్టదు- చావదు- కదలదు- మెదలదు- పెరగదు- తఱగదు-దీనికి సంకల్పమువల్ల జీవత్వమూ, నిస్సంకల్పంవల్ల స్వస్వరూపస్థితీ- (కైవల్యమూ) ఏర్పడుతోంది-

ఈ చైతన్యమునకు జీవుడు రథము-జీవునకు అహంకారం రథము- అహంకారమునకు బుద్ధి రథము- బుద్ధికి మనస్సు రథము- మనస్సునకు ప్రాణము రథము- ప్రాణమునకు ఇంద్రియగణము రథము- ఇంద్రియగణమునకు దేహము రథము- దేహానికి కర్మేంద్రియసమూహము రథము- ఈ రథాలన్నీ సంసారంలో తిరగటమేపని- ఇలాంటి సంసార చక్రం పరమేశ్వరుని యొక్క విభూతివల్ల (మాయాఐశ్వర్యం) వల్ల తయారయింది- కనుకనే క్షణకాలంకూడా నిజమని నమ్మటానికి వీలు కాదు ఇది-

మునీంద్రా ! మానస కల్పనకు ప్రాణము రథమని చెప్పాను నేను- ఆప్రాణము బలవత్తరమయింది- అన్నిటినీ ధరించగలదు- అన్నిటినీ చలింపజేయగలదు- అలాగే మనస్సుకూడా ప్రాణానికి ఆధారమే- ఇది లేకపోతే అదీ ఏమీచేయలేదు- మనస్సు హృదయాకాశంలో లీనమయితే ప్రాణవాయువు ఏయింద్రియాన్ని లేపలేదు- ఎంతటి క్రియాశక్తి ప్రధానమయినదయినా ఏయింద్రియంచేతనూ ఏపనీ చేయించ

లేదు— వెలుతురు లేకపోతే రూపం కనిపించనట్లు— అలాగే ప్రాణవాయువు భూతవాయువులో లయిస్తే మనస్సుకూడా ఏపనీ చేయులేదు— గాలిలేకపోతే దుమ్ము కదలదు— కనుక ప్రాణము ఎక్కడఉంటే మనస్సు అక్కడ ఉంటుంది— రథం ఎక్కడ ఉంటే సారధి అక్కడ ఉంటాడు— ప్రాణవాయుప్రేరితమయిన మనస్సు క్షణంలో దేశాంతరం వెళ్ళుతుంది— యంత్రమునుండి విడిచిన యినుపగుండువలె— ప్రాణనిరోధమును చేసితిమా ! మనస్సు క్షణంలో నశిస్తుంది— పుష్పమున్నచోట పరిమళం ఉంటుంది—నిప్పు ఉన్నచోట వేడిఉంటుంది—ప్రాణమున్నచోట మనస్సూ మనోవృత్తులూ ఉంటాయి— ప్రాణవాయువు వ్యానమనేరూపంతో అన్నరసం సర్వావయవములందూ ప్రవేశించుట కొరకు సర్వనాడులతోనూ సంబంధించి ఉంటుంది— మనస్సుమాత్రం ప్రాణకోటరంలోనే (హృదయాకాశంలోనే) ఉంటుంది— ఆకాశమువలె నిర్మలమయిన చైతన్యంమాత్రం జడాజడములందంతటా ఉంటుంది— కాని లింగదేహంలో ప్రాణస్పందంవల్ల స్ఫుటంగా అభివ్యక్తమై అనుభవింపబడుతుంది— మొదట నానావిధములయిన ఉల్లాసములతో ఏశరీరం నాటకమాడిందో అదేశరీరం ప్రాణములేచిపోయేసరికి కదలనయినా కదలదు—

ఓ వసిష్ఠమహామునీ ! పరచైతన్యం పుర్యష్టకంలో ప్రతిబింబించి ఉంటుంది— అద్దంలోనే ప్రతిబింబం కనిపిస్తుంది— రాతిలో ప్రతిబింబం కనిపించదు—

శ్లో॥ భూతాంతఃకరణ ప్రాణ జ్ఞానకర్మేంద్రియై ర్యుతమ్ ।
అవిద్యాకామకర్మాఢ్యం లింగం పుర్యష్టకం విదుః ॥

1. పంచమహాభూతములూ, 2. అంతఃకరణమూ, 3. పంచప్రాణములూ, 4. పంచజ్ఞానేంద్రియములూ, 5. పంచకర్మేంద్రియములూ, 6. అవిద్య, 7. కామము, 8. కర్మ, యీ ఎనిమిదితో గూడిన లింగదేహము పుర్యష్టక మనబడుతుంది—

నిజస్థితిలో మనస్సు ఒక్కటే పుర్యష్టకం- అన్నిపనులకూ ఇదే ముఖ్యకారణం- కొందరు ఆచార్యులుమాత్రం తమ శిష్యులకు బోధించ డంలో పై యెనిమిదింటిని పుర్యష్టకమని కల్పించి చెప్పారు-

రామచంద్రా! ఈ దృశ్యజాలమంతా చిదేకరసమాత్రమగు బ్రహ్మవల్ల పుటుతోంది- బ్రహ్మయందు ఉంటోంది- బ్రహ్మయందే లయమవుతోంది- కాబట్టి యీ ప్రపంచంఅంతా బ్రహ్మమే అని గ్రహించు- అన్నారు వసిష్ఠులు-

## ౩౨. దేహపాతవిచారము.

శ్రీ॥ వసిష్ఠమునీ! .పరాచిత్తు మానవుల పుర్యష్టకంలో ప్రవే శించి, ఐహికాముష్మిక కర్మలను ఎలా చేయిస్తోందో? ఆయా దేహము లను చలింపజేస్తూ "వాడు స్నానమాడు చున్నాడు" "వీడు భుజించు చున్నాడు" "వాడు యజ్ఞము చేయుచున్నాడు, వీడు బ్రాహ్మడు, వాడుక్షత్రియుడు, వీడు దేవదత్తుడు, వాడు యజ్ఞదత్తుడు" ఈ మొద లయిన సంజ్ఞలను ఎలా పొందుతోందో అదంతా చెబుతావిను-

అనాది మాయారూపమగు బ్రహ్మశక్తి తనయందున్న ఆవరణ శక్తితో తాను ఆశ్రయించియున్న (తన కాశ్రయమగు) బ్రహ్మను చెడగొట్టుతోంది- అనగా "నాస్తి, నభాతి" లేదు, ప్రకాశించుట లేదు, అనే ప్రతీతికి యోగ్యమయిన వానినిగా బ్రహ్మను తయారు చేస్తోంది-

ఆ తరువాత మాయాశక్తి అనాదికాలమునుంచి సంపాదించుకొని యున్నట్టియూ, మిక్కిలి పుష్టిచెంది యున్నట్టియూ, కామవాసనల తోనూ, వాక్కాయచేష్టారూపములయిన విహితనిషిద్ధకర్మవ్రాతముల తోనూ, పుర్యష్టకాత్మకమగు మనస్సుగా పరిణమిస్తోంది-

ఆపైన అదే మాయాశక్తి తన కధిష్ఠానమయిన చైతన్యము యొక్క సత్తాబలంవల్ల కొంత చిద్రూపంగానూ, స్వస్వభావబలంవల్ల

కొంతభాగం జడంగానూ, ఇలా మిశ్రభావాన్ని చెంది జ్ఞానకర్మ వ్యవహారమునకు అర్హతను పొందుతోంది. కనుక ఇలా బ్రహ్మశక్తిరూపమయిన మాయే జ్ఞానకర్మేంద్రియములద్వారా ద్రష్ట, దృశ్య, దర్శనరూపమగు సంసారరూపంగా నాట్యమాడుతోంది. ఇదంతా బ్రహ్మశక్తి విలాసమే కాని మరొకటియేమీలేదు.

వసిష్ఠా! దేహము చలించడానికి చిత్ప్రతిబింబమగు జీవచలనము కారణము. ఆ జీవచలనమునకు తదుపాధిభూతమగు మనస్సు కారణము. దానికి వాస్తవికమగు చిత్స్వభావాన్ని కప్పిపుచ్చేడి మాయాశక్తి పరిణామము కారణము. అట్టి పరిణామమునకు పూర్వాపూర్వ దేహములచే సంపాదించుకొన్న కర్మరాశి కారణము. బంధమంతా కర్మమీదనే ఆధారపడిఉంది. [ఈవిషయం బృహదారణ్యకం పంచమాధ్యాయం ద్వితీయబ్రాహ్మణంలో "కర్మహైవ తదూచతుః కర్మైతత్ప్రశశంసతుః" అని] చెప్పబడినది.

ఈ మాయాశక్తియొక్క అనుగ్రహంచేత చైతన్యము (చిత్తు) కలంకమును జెంది గంధర్వనగరిప్రాయమయిన ప్రపంచాన్ని పుట్టిస్తోంద-పుట్టించడమూ లేదు. అయితే బ్రహ్మచైతన్యముయొక్క సాన్నిధ్యం వల్ల దేహమే సర్వమూ చేయవచ్చుకదా! ఇంక మనోబుద్ధి చిత్తాహంకారాలు ఎందుకు? అని యనవచ్చును. కాని అది ఉచితముకాదు. మనోబుద్ధిచిత్తాహంకారాలు లేకపోతే దేహం మూగవానివలెను, గోడవలెనూ, ఉండిపోతుంది. అవిఉంటె మాత్రం చక్కగా స్ఫురిస్తుంది. దేహము, ఆకాశము పరుగెత్తెడి రాతివలె స్ఫురించినట్లు. లేక ఆకాశము విసిరివేయబడిన రాతివలె కనిపించినట్లు. అతిజడమయిన సూది అయస్కాంతముయొక్క సాన్నిధ్యంవల్ల కదలినట్లు సర్వవ్యాపకుడయిన పరమాత్మయొక్క సాన్నిధ్యంవల్ల జీవుడు చలిస్తున్నాడు-జీవుడు ఆత్మరూపమగు చిచ్ఛక్తిచేతనే తనను ఇతరమును ప్రకాశపరుప సమర్థ

డగుచున్నాడు- అనగా తనను ప్రకాశింప జేసికొనుచున్నాడు- ఇతరము
మును ప్రకాశింప జేయుచున్నాడు-

అయితే జీవునకుపాధియగు లింగశరీరము భూతములవల్ల తయారయింది- భూతములు ద్రవ్యములు కాబట్టి ఈలింగశరీరంకూడా ద్రవ్య స్వభావముగలదనియే అనాలి- బ్రహ్మనో, ద్రవ్యస్వభావము గలవాడు కాడు- (అనగా ద్రవ్యముగాడు)- కనుక ద్రవ్యము ద్రవ్యముయొక్క ప్రతిబింబాన్ని గ్రహిస్తుందికాని అద్రవ్యమయిన బ్రహ్మయొక్క ప్రతిబింబాన్ని ఎలాగ్రహిస్తుంది" అని యొక ప్రశ్న పుడుతుంది- కాని ఇది నిలవదు- లోకంలో ద్రవ్యమయిన అద్దం ద్రవ్యస్వభావమందులేని గుణక్రియాజాత్యాదుల యొక్క ప్రతిబింబాన్ని గ్రహిస్తోంది- కనుక ద్రవ్యం ద్రవ్యమునుంచే ప్రతిబింబాన్ని గ్రహించాలనే నియమంలేదు- స్వచ్ఛమయిన బ్రాహ్మడు దుస్సహవాసంచేత క్రమంగా తన జాతిని మరచి తాను శూద్రుడనుకొంటాడు- అలాగే జీవుడు బ్రహ్మప్రతిబింబమయినా అజ్ఞానంచేత తన స్వభావాన్ని మరచి నిద్రా, ఆలస్య, జాడ్యలను అనుభవిస్తున్నాడు- చిత్తు (చైతన్యము) తన స్వభావాన్ని మరచి చిత్తధర్మములయిన జాడ్యమాలిన్యాదులను పొందింది- మహానుభావులయిన గాధి, లవణ, హరిశ్చంద్రాదులు, మోహవశంచేత అతిదైన్యాన్ని పొందినట్లు- చిత్తముయొక్క తాదాత్మ్యాధ్యాసవల్ల దాని ధర్మాలను పొందినట్లు ప్రాణవాయువుయొక్క తాదాత్మ్యాధ్యాసవల్ల ప్రాణధర్మమయిన చలనహేతుత్వాన్ని పొందింది చైతన్యం- కనుకనే జీవచైతన్యం దేహచలనానికి కారణమవుతోంది- తెరచాప గుడ్డకు పరవశమయిన (స్వాధీనమయిన) గాలిచే పడవలోని రాళ్లు చేర్చవలసిన ఊరికి చేర్చబడుచున్నట్లు మనస్సుతోను, ప్రాణవాయువుతోను తాదాత్మ్యాన్నిచెంది, ఆరెంటికి పరవశమయిన ఈజీవుడనే నీచునిచే దేహములనే యంత్రాలు వాటికభిమతమయిన దేశానికి తీసికొని పోబడుచున్నాయి- శరీరములనే శకటములను లాగటానికి బ్రహ్మదేవుడు

బలిష్ఠమయిన యొడ్లను రెంటిని తయారుచేశాడు- ఒకటి ప్రాణశక్తి రెండు మనఃశక్తి అని-

చైతన్యం ఈవిధంగా జడమయిన జీవత్వాన్ని పొంది మనస్సు అనే రథాన్ని అధిష్ఠించి ప్రాణములనే గుఱ్ఱాలను దానికమర్చుకొని జాగ్రత్స్వప్నములందు పుట్టిన అనేక పదార్థాలను సుషుప్తియందు పదార్థములయొక్క నాశస్థితిని అవిద్యఅనే ఒక్కపదార్థము మిగిలియుండుటను అనుభవించినదివలె ఉంటూ, తన నిజరూపాన్ని పూర్తిగా వదలకుండానే భిన్నభిన్నంగా గోచరిస్తుంది- జీవప్రపంచంఅంతా బ్రహ్మసత్తను ఆధారపరచుకొనే ప్రకాశిస్తుంది- రూపసంపద వెలుతురును ఆధారపరచుకొనే ప్రకాశిస్తుంది- దీపం ఉంటేనే గృహం వెలుతురుగా ఉంటుంది- లేకుంటే వెలుతురుగా ఉండదు- పారమార్థికమయిన చిత్త్వం నిరామయంగా ఉంటేనే జీవుడు జీవించి ఉంటాడు-

ఈశరీరం బాగా బలిసేసరికి, ఆధులూ, వ్యాధులూ అంటుకుంటాయి దీనికి- నీరు బాగా అభివృద్ధి చెందేసరికి తరంగాలు బయలుదేరుతాయి- తరంగాలు బలమయ్యేసరికి నురుగు బయలుదేరుతుంది- ఇలా శరీరం ఆధిగ్రస్తమూ, వ్యాధిగ్రస్తమూ అయ్యేసరికి దానిని ఆశ్రయించుకొనియున్న జీవుడు విషమస్థితిలో పడిపోతాడు- దైన్యాన్ని పొందుతాడు- దుఃఖమనుభవిస్తాడు- సూర్యుడు తనచే ప్రకాశింపజేయబడెడి మేఘములచే తాను ఆచ్ఛాదింపబడుట, కాంతిరహితుడగుట, తటస్థించినట్లు చిచ్ఛక్తి "నేను చిత్తును" అను భావన లేనందున దేహానికి పరవశమై దేహధర్మములయిన ఆధివ్యాధులచే కృశించిపోతుంది- దేహధర్మాలకు పరవశమయిన జీవుడు తన సంవిద్రూపాన్ని గుర్తించలేడు- మదిరాపానమత్తుడు తన శరీరచ్ఛేదనమును తాను గుర్తించలేడు- కర్మవశంచేత ఎన్నటికయినా ఆత్మస్వరూపానుసంధానం కలిగితే అపుడు ఈమోహం అంతా నశిస్తుంది-

ప్రాణవాయువుయొక్క చలనశక్తి జీవసంవిత్తును లింగశరీరము నందు ఉపసంహారమొనర్చుటచే హస్తపాదాదులను అనుసంధానము చేయలేడు. కుష్ఠురోగి చెడిపోయిన తన వ్రేళ్ళను కదల్ప దలచడు. అలాగే హృత్పుండరీకము ప్రాణవాయువు సంచరించుట కనుకూలంగా చలించదు. హృత్పుండరీకము స్తంభించేసరికి క్రమంగా యింద్రియా లన్నీ శాంతిస్తాయి. విసనకర్ర ఆడకపోతే బయటికి గాలి రాకపోవడం సహజం. ఇంద్రియాలన్నీ శాంతించేసరికి పూర్తిగా మూగివాడయి పోతాడు జీవుడు. ఆకాశంలో గాలిలేకపోతే దుమ్ములేవక పోవడము సహజమే కదా! అప్పుడు మనస్సుకూడా కారణస్వరూపాన్ని పొంది మిగిలిఉంటుంది. ఇలా ఇంద్రియ సమూహమంతా వైకల్యం చెందే సరికి పుర్యష్టకం శాంతించి పోతుంది. దేహం నిశ్చలమై పడిపోతుంది. ఇదే ఈచిచ్ఛక్తికి దేహత్యాగము.

తన స్వరూపాన్ని తాను మరచేసరికి చైతన్యానికి విషయాకార స్ఫురణ మేర్పడుతుంది. దానివల్ల వాసనాస్పందము వాసనాస్పందం వల్ల పూర్వాపూర్వజన్మములందలి భోక్తృత్వస్మృతి. దాని వలన హృత్పుండరీక చలనము. దానివల్ల మరలపుర్యష్టకముయొక్క ఉత్పత్తి. ఇలా మళ్ళీ దేహసంబంధం ఏర్పడుతుంది జీవునికి. హృత్పుండరీకము చలిస్తేకాని పుర్యష్టకము స్ఫుటపడదు. హృత్పద్మయంత్రము నిశ్చల మయితే పుర్యష్టకం నశిస్తుంది. దేహమునందు పుర్యష్టకమున్నంతవరకు దేహము జీవించి ఉంటుంది. అదిశాంతిస్తే దేహము మరణిస్తుంది. వాతపిత్త కఫములయొక్క ప్రకోపంవల్లకాని, రాగద్వేషాది వాసనా మలముల యొక్క ప్రకోపంవల్లకాని, శస్త్రాదులచే దేహచ్ఛేదము దేహభేదనము కలుగుటవల్లకాని, దేహంలోనున్న హృత్పద్మము ప్రస్ఫురించదు. అప్పుడు క్రమంగా పుర్యష్టకం శాంతిస్తుంది. "ఫ్యాన్" ఆగిపోతే గాలి ఆగిపోతుంది. జీవుడు తన సంకల్పవశంచేత మరణాది దుఃఖసహస్రాలను అనుభవిస్తున్నాడు. శరీరమునందలి హృత్పద్మము అనర్థపరంపరలను అనుభవిస్తోంది.

ఎవరి హృదయమందు నిత్యమూ శుద్ధవాసనలుంటునో వారు సదా జీవన్ముక్తులు- హృత్పుండరీకమునందు ప్రాణవాయువును నిరోధిస్తే ప్రాణవాయువు శాంతిస్తే శరీరము కాష్ఠలోష్టసమానమై పడిపోతుంది- ప్రాణవాయువునందు పుర్యష్టకము లీనముకాగానే మనస్సుకూడా అక్కడే లయిస్తుంది- అనాదికాలమునుంచి అభ్యాసము చెందియున్న మనస్సు ఎచ్చెచ్చట వాసనాఖచితమవునో అచ్చట స్వర్గనరక భోగాలను అనుభవిస్తుంది- మనస్సులేని శరీరము శవమే- సర్వవ్యాపకమయిన చైతన్యమే జీవత్వాన్ని చెంది, మనోరూపాన్ని చెంది, పుర్యష్టకమై ఆతివాహిక దేహమయింది- పంచతన్మాత్రలయొక్క సంఘాతమే చిత్తము- అదే ఆతివాహిక దేహమనే పుర్యష్టకము- ఇదే సంకల్పము వల్ల స్థూలప్రపంచాన్ని చూస్తుంది- ఆ స్థూలప్రపంచమునందు దృఢమయిన భావనగలదై స్థూలశరీరమునందు అహంభావము (నేనను భావము) నొంది క్రమంగా ఆతివాహికస్వరూపాన్ని, తన సూక్ష్మరూపాన్ని మరచిపోతుంది- అసత్యమయిన స్థూలశరీరాన్ని సత్యమనీ, సత్యమయిన బ్రహ్మభావమును అసత్యమనీ తెలుస్తుంది-

సర్వవ్యాపకమగు చైతన్యము చిదంశతో జీవత్వాన్ని చెంది మనస్సు అవుతుంది- మనస్సుఅయి పుర్యష్టకరథాన్ని ఆక్రమిస్తుంది- తర్వాత ప్రపంచభావాన్ని చెందుతుంది- ప్రాణవాయు ప్రచురమయిన యీపుర్యష్టకము దేహాన్ని కదలుస్తుంది- బయలు దేరతీస్తుంది- ఏమేమో చేయిస్తుంది దీనిచేత- అపుడు దేహము జీవించి యున్నదని అంటారు లోకులు- ఈపుర్యష్టకం క్షీణించేసరికి శరీరం మరణించినదని అంటారు- జీవుడు తనకు అజరామరభావమును మరచి జరతమయిన దేహమునందలి అసామర్థ్యమును పొందుతాడు- కాలవశంచేత పచ్చి ఆకు ఎండి రాలిపోయినట్లు- జీవశక్తి తగ్గి హృత్పుంపరీకము ఆగిపోయి (గుండెఆగిపోయి) ప్రాణవాయువు స్తంభించి పోయేసరికి మానవుడు మరణించుచున్నాడు- ఇలా మానవులకు జన్మమరణములు కాలవశంచేత

నిరంతరము జరుగుతూనే ఉంటాయి- చెట్టుకు ఆకులు పుట్టటం, అవి ఎండటం, రాలిపోవటం, ఎలాగో, అలాగే జీవులకు జన్మమరణాలు కూడా- కనుక వాటిని గురించి పరిదేవన పనికిరాదు చిత్సముద్రంలో బుడగలవలె యీ దేహాలు బయలుదేరుతున్నాయి వేనవేలుగా- వీటి యందు ఆదరము పనికిరాదు- సర్వవ్యాపకమయిన చైతన్యమును చిత్తము ప్రతిబింబింపచేసి కుంటుంది- అద్దముకంటె మరొకటి యేదీ పదార్థాన్ని తనలో నింపుకోలేదు- కనుక రామా! ఈ చిదాకాశము నందే ఆపాతరమణీయములయిన జీవజగద్రూపములయిన కల్పనలన్నీ ప్రతిభాసిస్తున్నాయి- వీటినిగురించి మురియవలసిన పని లేదు-

## 33. అద్వైతప్రతిపాదనము.

వసి॥ స్వామీ! చంద్రశేఖరా! బ్రహ్మతత్త్వము దిక్కాలవస్తు పరిచ్ఛేదశూన్యము- ఏకరూపము- సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యము- చిద్రూపము- అనికదా! అంటారు పెద్దలు- ఇలాంటి బ్రహ్మకు సజాతీయజీవరూపంగా కాని, విజాతీయ జడప్రపంచరూపంగా కాని, ద్వైతం (భేదం)ఎలావచ్చింది? అనగా అద్వితీయమయిన బ్రహ్మ చిద్రూపులయిన యింతమంది జీవులుగా ఎలాఅయింది? జడరూపమయిన యింతటి ప్రపంచంగా ఎలాతయారయింది? అని నాప్రశ్న-

అంటే బ్రహ్మ తనంతటతానే స్వయంగా జీవరూపంగానూ, జగద్రూపంగానూ తయారయినాడా? లేక ఏదయినా యితరకారణంవల్ల ఇలా తయారయినాడా? తేల్చి చెప్పండి- నేను ఆట్టే విచారించుకుంటే వికారాలేవీ లేవుకాబట్టీ, అవయవాలు లేవుకాబట్టీ, స్వయంగా ఇలా తయారు కావడానికి వీలులేదనీ, రెండవ వస్తువే లేదుకనుక ఇతర కారణంవల్ల ఇలా తయారవుటకు వీలులేదనీ తోస్తోంది- ఇంక నిర్నిమిత్తంగా తయారయి యున్నట్లయితే పూర్తిగా నిరూఢమైయున్న ఈ

సంసారబంధం ఆగంతుకంగా వచ్చిన తత్త్వజ్ఞానంవల్ల నశించడం ఎలా? అఖండానందరూపమయిన మోక్షం ప్రాప్తించడం ఎలా?

నిర్నిమిత్తంగా (సహజంగా) ఉన్న వేవీపోవు- ఒకవేళ యేవొక టయినా పోయినా, ఇంకా అనేకం అలామిగిలే ఉంటాయి- వాటితో బంధం ఎలాగో తప్పదు-

ఇక బ్రహ్మకు మాయ అనే శక్తి యొకటి ఉన్నదనీ అది ఆ మాయాశక్తి ఈబంధానికంతా కారణమనీ అనుకుందామంటే అదీ కుదిరేటట్లు కనిపించటంలేదు- ఎంచేతఅంటే ఆ మాయాశక్తి ఆగంతుక మందామా? సహజమందామా? సహజమంటే అగ్నియందలి ఔష్ణ్య శక్తి అగ్నినివిడిచి యెన్నటికీ పోనట్లు సహజమయిన మాయాశక్తి కూడా బ్రహ్మను విడచి ఎన్నటికీపోదు- అది పోనంతవరకు బంధం తప్పదు- ఇక మాయాశక్తి ఆగంతుకమయితే అపుడుకూడా దానంతట అది ఆగంతుకంగా వచ్చిందా? లేక ఇంకొకదాని సంబంధంవల్ల వచ్చిందా? అనే ప్రశ్నపుటుతుంది- ఇపుడుకూడా అనిర్మోక్ష అనవ స్థాది దోషాలు తప్పవు-

మరియు మాయాశక్తి మిథ్యయా? సత్యమా? మిథ్య అంటే మిథ్యావస్తువువల్ల మరొక సత్యవస్తువు పుట్టటానికి వీలులేదు- అపుడు ద్వైతప్రపంచం అంతా నిష్కారణంగా వచ్చినట్లవుతుంది- సత్యమంటే సత్యమయినది జ్ఞానంవల్ల నివర్తించడానికి వీలులేదు- కాబట్టి అనిర్మోక్ష ప్రసక్తి తప్పదు కనుక ఎటయినా మెడకు ఉరియే- సత్యాసత్యముల కంటె అతిరిక్తంగా మూడోమార్గం నిరూపించడానికి ఎవ్వరికీ సాధ్యం కాదు- కాబట్టి స్వామీ! ఈచిక్కు ఎలాతీరుస్తారో తీర్చండి- అని అన్నారు వసిష్ఠులు-

ఈశ్వరుడు ఇలా సమాధానం చెబుతారు- "మహర్షీ! మేము జగజ్జీవాది ద్వైతప్రపంచాన్ని ప్రమాణజాలంతో నిరూపించడానికి

బయలు దేరలేదు- మరేమంటే అజ్ఞానంచేత అనాదికాలంనుంచీ ప్రసక్త మయిన ప్రపంచాన్ని అధ్యారోపాపవాదన్యాయంచేత నిషేధించడానికి బయలుదేరినాము-

అంచేత అధ్యారోపపక్షంలో సర్గాదియందు కామకర్మవాసనాది నిమిత్తకారణములయొక్క కల్పనముకాని, బ్రహ్మవిద్యాది ఉపాదాన కారణములయొక్క కల్పనముకాని, వియదాదిక్రమముయొక్క కల్పనముకాని, స్థూలసూక్ష్మ వ్యష్టి సమష్టి ప్రపంచముయొక్క కల్పనము కాని, అసత్యమయినా సత్యమయిన బ్రహ్మవస్తువును పరిచయము చేయుటకుపాయముగా శ్రుతిచే నిరూపించబడింది-

ఈకల్పన పరమార్థసత్యమయిన మరొక ప్రయోజనమును సాధించుటకు ఉపయోగపడుటనుబట్టి ఇతరవాదులయొక్క ప్రపంచకల్పనముకంటె శ్రుతిసమ్మతమయిన ప్రపంచకల్పనము కొంచెం శ్రేష్ఠము- దీనియందు శ్రోతలకు నమ్మిక పుట్టుటకుగాను లోకదృష్టిని అనుసరించే శాస్త్రముకూడా ప్రపంచకల్పనను సమర్థించినది-

సర్వవ్యాపకమయిన చిద్రూపబ్రహ్మము పరిచయము కాగానే ఆ బ్రహ్మకు అద్వితీయత్వమును బోధింపదలచి శ్రుతి పరమార్థదృష్టి నవలంబించి ప్రపంచాన్ని పూర్తిగా నిషేధించింది- కాబట్టి బ్రహ్మ అద్వితీయమని తెలిసికొన్న నీకు అతనియందు ద్వైతప్రపంచం ఉండ వచ్చుననే ఊహ నీమతానికీ విరుద్ధమే- శాస్త్రసిద్ధాంతానికీ విరుద్ధమే- ఇంతమాత్రం నీకెందుకు తోచటంలేదో నాకు బోధపడకున్నది అని సమాధానం చెప్పడం ప్రారంభించారు యాజ్ఞ్వరులు-

వసిష్ఠా! బ్రహ్మ వ్యవహారదృష్టిలో సర్వశక్తియుక్తమనీ, పరమార్థదృష్టిలో అద్వితీయమనీ, పరమార్థసత్యమనీ తెలిసికొన్నతరువాత (వ్యవస్థను అంగీకరించిం తరువాత) భేదప్రపంచాక్షేపము నిర్మూలము- వ్యవహారదృష్టిలో జీవజగద్ద్వైత ప్రపంచము అనుపపన్నముగాదు-

పరమార్థదృష్టిలోమాత్రం "తదేతత్ బ్రహ్మ అపూర్వ మనపర మనంతర మబాహ్యమ్" "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా" ఇత్యాది శ్రుతి ప్రమాణమునుబట్టి ద్వైత ప్రపంచము అనుపపన్నము కావచ్చును- పరమార్థదశలో ద్విత్వం లేనట్లు ఏకత్వంకూడా లేదు- ద్విత్వం ఉంటే ఏకత్వం ఉంటుంది- ఏకత్వం ఉంటేనే ద్విత్వం ఉంటుంది- అనగా ద్విత్వం ప్రసిద్ధమయితేనే ఏకత్వం కల్పింపబడుతుంది- ఏకత్వం ఉన్నప్పుడే మరొక ఏకత్వంతో కూడిన ద్విత్వం కల్పింపబడుతుంది- కనుక ఈ రెండూ సమానములు- రెండూ చిద్రూపాలే- కనుక చిద్భిన్నంగా ఈ రెండూ లేవు- చిదతిరిక్తంగా ఏకత్వమనే ధర్మం ఉన్నప్పటికీ బ్రహ్మయొక్క చిదేకరసత్వానికి భంగం కలిగేతీరుతుంది- కాబట్టి బ్రహ్మ భిన్నంగా ఏకత్వంకూడా లేదని అంగీకరించవలసిందే-

పరమార్థదృష్టి గమ్యమయిన పరమాత్మయందు ద్విత్వముగాని, తద్విరుద్ధమగు ఏకత్వముగాని ప్రసక్తముకాదు- కనుక అచట అది యెట్లేర్పడింది? అని ప్రశ్నించటం కూడా వెర్రితనమే-

పరమార్థస్వరూపమయిన పరమాత్మయందు వ్యావహారిక సత్త గల జీవుడూ, జగత్తూ, అను ద్వైతవస్తువుండుటలో విరోధము లేదు- కారణమయిన బీజమే (విత్తనమే) కార్యమయిన ఫలరూపముగా పరిణమించినందున ఆ రెండూ ఏకరూపమయిన వికారదశనుబట్టి నానాత్వ కల్పన యెట్లో అట్లే చిత్తుకూడా చైత్యముయొక్క వికల్పముతో చైత్యాకారముగా స్ఫురిస్తోంది- ఆ చైత్యపదార్థజాతమే పరమార్థదశలో చిదభిన్నమగుటచే (చిద్రూపమగుటచే) చిత్తుకంటె భిన్నముగాదు- కావున మాయయు దాని కార్యములున్ను బ్రహ్మకంటె వేరుగా ఉన్నవనే పక్షముగాని, బ్రహ్మరూపముతోనే ఉన్నవనుపక్షముగాని, అవి యసలు లేనేలేవను పక్షముగాని, సత్యాసత్యపక్షములకంటె వేరగు మూడవపక్షముగాని మరియు ఇతరవాదులు కల్పించి చెప్పిన ప్రధాన

కారణవాదము కాని, పరమాణు కారణవాదము కాని, క్షణిక విజ్ఞాన వాదము కాని, శూన్యవాదము కాని ఇందులో మీరు దేనినాశ్రయించినా అవన్నియు అసంగాద్వయ చిన్మాత్రమును అంటనిదియు, చిదధీనములై సిద్ధించుననియూ చిద్వికల్పమాత్రములునూ కనుక చిత్తునకు బంధ ప్రసక్తియే లేదు. ఈస్థితిలో అనిర్మోక్షదోషమును లేవదీయుట సుతరాం కుదరదు.

ఘటపటాది వికారములన్ని షడ్భావవికారముల నాశ్రయించిన వికల్పమాత్రములు. ఇవి సద్వస్తువు (ఆత్మ) వల్ల పుట్టి జలాహరణాది క్రియలచే (నీరుతీసికొని వచ్చుట మున్నగు పనులచే) సార్థక్యమును జెంది భోగపర్యవసానమును చెందుచున్నవి. భోగమనగా చిదవసానతయే. అనగా చిదాత్మకు అక్కరకు వచ్చుటయే. కనుక ప్రాపంచిక పదార్థము లన్నియు చిదాత్మకు మాత్రమే అక్కరకువచ్చుచున్నవి. కనుక అవి అన్ని చిన్మాత్రసారములనే అనాలి.

అయితే ఇట్లు ప్రపంచం అంతా వికల్పనామాత్రమయితే ఇం దులో కొన్ని జలతరంగాదులు వ్యావహారికములనీ మరుమరీచికాదులు ప్రాతిభాసికములనీ వంధ్యాపుత్ర శశశృంగాదులు (గొడ్రాలిబిడ్డ కుందేటి కొమ్ము మొదలయినవి) అత్యంతా అసత్తులనీ చెప్పే అవాంతర వైల క్షణ్య వికల్పము ఎలావచ్చింది ? అనే ప్రశ్న పుట్టుతుంది. కాని ఈ వైలక్షణ్య వికల్పాలు అజ్ఞానికేగాని జ్ఞానికిగావు. సర్వమూ బ్రహ్మ స్వరూపంతోనే సత్యమనుకొనే జ్ఞానికి, నీటిలో ప్రసిద్ధమయిన తరం గాలూ, మరుమరీచికా జలతరంగాలూ రెండు సమానమూతే. స్వతః లేకుండుటా బ్రహ్మసత్తతో ఉండుటయూ, పై మూటియందూ సమా నంగాఉంటే ఇంక వాటిలో తేడా కల్పించటం కుదరదు.

కనుక "ఇవి వ్యావహారిక సత్యములు, ఇవి ప్రాతిభాసికములు, ఇవి అత్యంతాసత్తులు" అను వికల్పములను తత్వసాక్షాత్కారము మాత్రమే ఏకముచేయగలదు. పగిలిన ముక్కలను మళ్ళీ కలిపితేనే

ఏకమవుతాయి- ఈస్థితిలో కేవలం యుక్తులతోనూ, ఉపన్యాసాలతోనూ పొందే ఫలంలేదు-వస్తుతత్త్వ సాక్షాత్కారము కానిదే నోటితో యుక్తులెన్ని చెప్పినా ప్రత్యక్షప్రమాసిద్ధమయిన ద్వైతబుద్ధి అంతరించదు- తత్త్వదృష్టితో చూస్తే బ్రహ్మయొక్క సర్వప్రపంచాకారమయిన మాయికరూపము భేదించదు- తరంగాలన్నిటిలోనో నీరు ఏకరూపమే కాని భిన్నరూపంగా నుండదు- పత్రపుష్పపల్లవాదులు లతకంటె వేరుగావు- ద్విత్వ ఏకత్వ జగత్వ త్వంత్వ అహంత్వాదులు చైతన్యముకంటె వేరుగావు- దేశకాల క్రియాది శక్తులన్నీ చిదాత్మికములే కాని చిన్నభిన్నములుగావు- ఇట్లే బ్రహ్మాది స్తంబపర్యంతమయిన నామప్రపంచమూ, రూపప్రపంచమూ చిద్రూపమే కాని వేరుకాదు- వీచీ తరంగిబుద్బుదాదులు నీటికంటె వేరుకాదు- ఆ పరబ్రహ్మమే బ్రహ్మఅనీ శివుడని, విష్ణువనీ, శూన్యమనీ, అనేక నామములతో చెప్పబడుతోంది- నామరూపరహితమయిన ఆ బ్రహ్మతత్త్వము వాచామగోచరము- కనుక ఈకనిపించే దృశ్యప్రపంచం అంతా ఆ బిల్లతయొక్క పత్రపుష్పపల్లవాదిరూపమే-

అస్మృతమయిన జీవజగద్భావాన్నే వివేకం కలుగుటకొరకు నీవడుగుచో చెప్పెద వినుము-

అదే బ్రహ్మచైతన్యం అవిద్యఅనే ఒకమహాశక్తి చిత్రవిచిత్రమయిన వేషం వేసుకొనే సరికి ఒకే చంద్రుడు ఇద్దరుగా కనిపించినట్లు జీవజగద్భావంతో గోచరిస్తోంది- తాను చిద్రూపము కాననుకొంటుంది- ఈభావనతో తుదకు చిత్తుకంటె వేరనుకొంటుంది- నిష్కలంక చిద్రూపమయిన తాను (ఆబ్రహ్మమే) సకలంకమయిన పుర్యష్టకరూపాన్ని కల్పించుకుంటుంది- దానితో సంసారసాగరాన్ని ప్రవేశిస్తుంది- అజ్ఞానోపాధిక చైతన్యంతోటే వ్యవహరిస్తుంది- తాను కల్పించుకున్న పుర్యష్టకమనే శరీరంతో తాదాత్మ్యాధ్యాసను పొంది ప్రాణనాది క్రియను పొందుతుంది- ఇలా సర్వవ్యాపకమయిన చైతన్యం చిత్తంలో ప్రతిబింబాన్ని పొందుతుంది- కనుక ఈ ఆక్షేపం కుదరదు-

తరువాత ఈపుర్యష్టకంమీద (సూక్ష్మశరీరంమీద) దృఢభావనతో అనురాగం పెరిగి పెరిగి పాంచభౌతికమయిన స్థూలదేహమును ధరించగల సంస్కారరూపంతో ఉండి తుదకు ఆదేహాన్ని పొందుటకు వ్రీహి యవ తిల మాషాది ద్రవ్యముగా నేను తయారయితినని అనుకుంటుంది- ఇందుకు "త ఇహ వ్రీహియ వా స్తిలమాషా ఇతి జాయంతే" అను శ్రుతి ప్రమాణము- (ఈశ్రుతియందలి ఇతిశబ్దము భావి దేహానుకూలమయిన ద్రవ్యమునకు ఉపలక్షణము.) కనుక స్థావరమయిన స్వేదజాది దేహప్రాప్తిస్థలమందు ఆయాదేహ బీజముల కనుకూలమగు జలాదిద్రవ్యభావముకూడా ఈజీవునకు కలుగుతుందని గ్రహించవలెను- ఆద్రవ్యము ప్రాణిచే అనుభవించబడి (భుజింపబడి) రేతోరూపాన్ని చెందుతుంది- వృక్షాది జన్మలందు ఆచెట్టు కనుకూలమగు విత్తనరూపంగా తయారవుతుంది-

తరువాత ఆరేతస్సు స్త్రీయందు నిషిక్తమై(ఉంచబడి) క్రమంగా ప్రాణంగల స్థూలదేహం అవుతుంది- ఆస్థూలదేహమే నేననుకొంటాడు జీవుడు- ఇలా అనుభూతి రూపమయిన బ్రహ్మయే స్థూలదేహానుభవ భ్రమలోపడి చక్షురాది ఇంద్రియములద్వారా బాహ్యమయిన స్థావర జంగమ ప్రపంచాన్ని తెలిసికుంటాడు- మళ్ళీ ఆవాసనతో తానుకూడా ఆస్థావరజంగమాకారాన్ని చెందుతాడు-

అయితే వెనుకటి మశకాది దేహమును విడిచి ఆ దేహాకారమయిన వాసనారూపంతో సూక్ష్మంగా ఉంటున్న పుర్యష్టకమునకు (సూక్ష్మశరీరం) కాని దృఢాభ్యస్తమయిన మశకాకారముయొక్క సూక్ష్మదశకు కాని నివృత్తి ఎలా? అలవాటులోని స్థూలమయిన గజాకారముయొక్క ప్రాప్తి కాని ఎలా? అనే ప్రశ్న ఇక్కడ పుడుతుంది- అనగా పూర్వం దోమగా ఉన్నజీవుడు మరణిస్తే వాని సూక్ష్మశరీరం మశకాకారంతో అలవాటుపడి ఉన్నది కాని ఏనుగ యొక్క ఆకారంగా అలవాటుపడి లేదుకదా! ఇలాంటి స్థితిలో అలవాటుపడ్డ దోమ

శరీరం పోవడం ఎలా? అలవాటులో లేని యేనుగు శరీరం రావటం ఎలా? అని పై ప్రశ్నకు తాత్పర్యం-

ఇందుకు సమాధానం- కాకసంబంధమయిన శరీరం హఠాత్తుగా మరణించడానికి కాకతాలీయంగా వచ్చిపడిన కర్మయే ప్రయోజకం-(కారణం) అలాగే మశకశరీరానికి కూడా. మరణప్రయోజకమయిన ఆకర్మయే ఆశరీరమందున్న దృఢమయిన అభ్యాసవాసనను కూడా తిరస్కరింప జేస్తుంది- (పోగొటుతుంది) ఎప్పటినుంచో (చాలాకాలం క్రిందటినుంచి) దాగియున్న ఏనుగ మొదలయిన శరీరముల యొక్క వాసనను ప్రకటింపచేస్తుంది- కాబట్టి దీనికంతకూ మరణప్రాపకమయిన కర్మే కారణంకాని మరొకటి కాదు- కనుక మరణప్రాపకమయిన కర్మవల్ల హఠాత్తుగా ఉద్భూతమయిన హస్తివాసనాంతరము (ఏనుగ శరీర సంస్కారము) యొక్క సంస్కారమువల్ల చాలాకాలంనుంచి అలవాటులో ఉండిఉన్ననూ సూక్ష్మమగు మశకాకారమును విడిచిపెటుతుంది అపుర్యష్టకం- విరోధివాసన (సంస్కారం) వల్ల పూర్వవాసన పోవటంలో దృష్టాంతాలు అనేకం ఉన్నాయి- ఒకే చంద్రుణ్ణి యిద్దరుగా భావించేసరికి ఆచంద్రుని యందలి ఏకత్వవాసన అనగా చంద్రుడొకడను వాసన నశిస్తుంది- పురుషుడు వేతాళుడని భావించేసరికి వేతాళుడుగానే గోచరిస్తాడు- అద్వైతభావనచే ప్రపంచముయొక్క ద్విత్వము నివృత్తమవుతుంది- అకర్తృత్వం భావనచే కర్తృతాబుద్ధి నశిస్తుంది-

జీవాత్మ పరమాత్మరూపుడగుటచే అతనియందు ద్విత్వములేదు- పరమాత్మ నిర్వికారుడు సర్వవ్యాపకుడును-కనుక ఇతనియందు ద్విత్వము అసంభవము-

ఇదీగాక తన సంకల్పంవల్ల రచించుకున్నదంతా సంకల్పక్షయం వల్ల నశించి తీరుతుంది- కలలోని మనోరాజ్యమూ, జాగ్రదవస్థలోని గంధర్వనగరమూ ఇందుకుదాహరణము- కనుక సంకల్పించుకొనుటలో (అనగా మానసప్రయత్నంచేత నిర్మించుకొనటంలో) ప్రయాసకాని

సంకల్పవినాశంలో ప్రయాసలేదు- సంకల్పమనే శిల్పి గంధర్వపురమును సృష్టించుకొనటంలో మొనగాడేకాని దానిని నశింపజేయుటలో వాని మొనగాని తన యేమీలేదు- కనుక బలవత్తరమయిన సంకల్పబలంచేత సంసారదుఃఖం ఏర్పడుతోంది- ఇలాంటి సంసారదుఃఖం అసంకల్ప మాత్రంచేత నశించిపోతుంది- ఇందులో ప్రయాసయేమి? ఏదియో యొకదానిని సంకల్పించి మానవుడు దుఃఖంలో మునుగుతున్నాడు- దేనినీ సంకల్పించకుండా నిత్యసుఖాన్ని పొందుతున్నాడు- కనుక నీ చిత్తము సంకల్పమనే సర్పముచే గ్రస్తమై (పట్టుకోబడి) యెంతకాలం ఉంటుందో అంతవరకూ నిన్ను తీసికొనిపోయి నందనోద్యానంలో ఉంచినా నీవు ప్రకాశించవు- సుఖించవు- కాబట్టి మహర్షీ! నీ వివేక మనే గాలులచే సంకల్పమనే మేఘాలను పారద్రోలి ప్రశాంతస్థితిని (నైర్మల్యాన్ని) పొందు- సంకల్పమనే నదిని మణిమంత్రాదులచే ఎండగట్టి అందులో కొట్టుకొనిపోయే నీవు బయటపడు- సంకల్పమనే మాలిన్యాన్ని రూపుమాపుకొని మిగుల నైర్మల్యాన్ని పొందు- అప్పుడు కాని నీవు పరమానందాన్ని పొందనేరవు-

వసిష్ఠా! ఈప్రపంచం అంతా సంకల్పమాత్రం వల్లనే తయారయింది- కనుకనే మిథ్య- సంకల్ప నాశంచేత ఎగిరిపోతుంది- సంకల్ప మనే తూర్పుగాలికి బయలుదేరిన జన్మలనే మేఘముల సముదాయం సంకల్పరాహిత్యమనే తూర్పుగాలి సోకేసరికి ఎగిరిపోయి బ్రహ్మా కాశంలో లీనమవుతోంది- కనుక సంకల్పమనే మూలాన్ని (కుంకటి వేరును) పీకి పారవేస్తేనే కాని తృష్ణాలత చావదు- ఈ సంసారభ్రమ ప్రతిభాస మాత్రంచేత పుట్టుతోంది- ప్రతిభాస క్షయంచేత నశిస్తుంది- కనుకనే జీవన్ముక్తులు దీన్ని ప్రాతిభాసికమన్నారు- అజ్ఞానం ఉన్నంత వరకే యీజగత్ప్రతిభాస- ఆవలఉండదు- ప్రభువయినవాడు తాను ప్రభువను మాటమరచి తనకాస్మృతికలిగే వరకు దుఃఖిస్తూ ఉంటాడు- అలాగే జీవుడు కూడా తాను బ్రహ్మకానను కొని బ్రహ్మననే స్మృతి

కలిగే వరకు సంసారంలోపడి దుఃఖిస్తూ ఉంటాడు- ఆరాజునకు ఆప్త మిత్రుడెవ్వడేని వచ్చి నీవు రాజువ (ప్రభువ) ని చెప్పినచో తనకు తన నిజస్థితి స్మృతికివచ్చి యిఁక దుఃఖించడు- అలాగే గురూపదేశంవల్ల ఈజీవునకు కూడా బ్రహ్మోపదేశం జరిగితే అపుడు అవిస్మృతి నశించి బ్రహ్మత్వస్మృతి కలిగి ఆమీద సంసారదుఃఖాన్ని పొందడు- ఈప్రణాళికలో వర్తమానజన్మ కలిగిన "బ్రహ్మాస్మి" నేను బ్రహ్మను అనుస్మృతి వెనుక అనేకజన్మలనుంచి అలవాటు పడియున్న సంసారస్మృతి పరంపరచే కప్పపడి పోతా! అను శంక తగదు- ఇందు కొకటె దృష్టాంతము- శరత్కాలముచే పోగొట్టబడిన వర్షకాలము మేఘజాడ్యముచే ఆకాశమును ఆచ్ఛాదింపనేరదు- అలాగే రాజునకుగాని జీవునకుగాని "భూపోఽస్మి" "బ్రహ్మోఽస్మి"అను స్మృతిచే బాధింప(పోగొట్ట)బడిన ప్రాక్తన దుఃఖస్మృతి మరల తన జాడ్యముచే వెనుకటి స్మృతులను ఆచ్ఛాదింప సమర్థము కానేరదు-

అయితే "బ్రహ్మత్వస్మృతి బ్రహ్మత్వవిస్మృతి" అనగా నేను బ్రహ్మననుస్మృతీ, బ్రహ్మను కానను విస్మృతీ ఇవి రెండూ చిత్తచేష్టలే-కాని యిందులో నేను బ్రహ్మననుస్మృతి శ్రవణమనన నిదిధ్యాసనములను పురుషప్రయత్నంచే దృఢమయిన ప్రవాహరూపాన్ని చెందింది-అందువల్ల ఇది ప్రబలమయింది- కనుక ఇతరమయిన దుఃఖస్మృతిని తిరస్కరింపగలదు- ఇంతేకాని అది దీనిని తిరస్కరింపలేదు- తారమంద్రములను తంత్రీస్వరములు రెంటిలో ఏది ఉచ్చైస్స్వరమో అదే రెండవదానిని తిరస్కరించి శ్రోత్రాన్ని ఆక్రమిస్తుంది- అనగా వినబడుతుంది- రెండవది వినబడదు-

కనుక వసిష్ఠమహర్షీ! "నేను అద్వితీయమయిన దేవుడను-(శివుడను) నేను నిత్యాపరోక్ష చిదేకరసస్వరూపుడను" అను భావనను అవిచ్ఛిన్నపరచుకో- నీవు ఇలాంటి భావనతో ఉంటె నిజంగా శివుడవే అవుతావు- మరో బాహ్యపూజచేత కానేరవు- కనుక ఈవిధంగా

బాహ్యపూజనము నీలాంటివాళ్ళకు తగదు- తుచ్ఛఫలములను కోరే వాళ్ళకే బాహ్యపూజనము చెల్లుతుంది- నీకు అపరమపదమయిన బ్రహ్మతత్త్వమే తగినది- ఎందువల్లనంటే బాహ్యపూజలలో పూజ కుడూ, షోడశోపచారములతో పూజనమూ, పూజింపతగిన ప్రతిమా లింగాదులూ, ఇవన్నీ మనస్సంకల్పమాత్రములగుటచే తుచ్ఛములు- కనుక బాహ్యపూజనముకంటె వివేకవంతునకు అంతరపూజనమే ఉత్తమ మన్నాడు ఈశ్వరుడు-

## ౩౮. పరమేశ్వరోపదేశము.

ఇంకా ఈశ్వరుడు ఇలా అన్నాడు-

మునీంద్రా! ఇలా దేవపూజచే పూజింపబడుచున్న ప్రపంచం అంతా అధిష్ఠానదృష్టిలో సద్రూపం- బాధదృష్టిలో అసద్రూపం- నిజస్థితిలో చిదాత్మయందు ద్విత్వమూ లేదు ఏకత్వమూ లేదు- వ్యవహార దశలో ఈ రెండూ కలవు- చైతన్యానికి అవిద్య (మాయ) అనే కలంకం వల్ల వైరూప్యం ఏర్పడింది- అంచేతనే సంసార సంబంధం ఏర్పడింది- అట్టి కలంకరాహిత్యంవల్ల అసంసారిత్వం (సంసారసంబంధం లేకుండుట) తటస్థించింది-

తాను దృశ్యమయిన దేహాదిరూపుడనని అనుకోటంచేతనే చిదాత్మకు బంధమేర్పడింది- తన అభేదస్థితి చెడిపోయింది- అర్థాకార మును భావన చేయటంచేత ద్విత్వాన్ని (భేదభావాన్ని పొందటం తన అఖండమయిన సద్రూపాన్ని విస్మరించటం కలిగింది- దేహసంబంధ మయిన సుఖదుఃఖాదులలోపడి అసత్యమయిన తనస్థితినే సత్యమయిన దానినిగా గ్రహిస్తున్నాడు- ఇదే చిదాత్మకు సకలంకస్థితి-

ఇంక నిష్కలంక స్థితి చెబుతావిను-

నిష్కలంకమయిన (శుద్ధమయిన) చిదాత్మ సత్య అసత్యాది శబ్దార్థములతో సంబంధించదు- వ్యవహారదశలో సర్వం నామరూపా

త్మకమయిననూ చైతన్యం పరమార్థంలో శూన్యస్వభావం- అనగా వికల్పాలతో అంటదు-

పరిపూర్ణమయిన శుద్ధబ్రహ్మమే తన మాయాశక్తివలన జాగ్రస్వప్నసుషుప్తులతోగాని, సృష్టిస్థితి సంహారములతోగాని, అధ్యాత్మ అధిదైవ అధిభూతములతోగాని మూడు మార్గములతో ప్రవర్తించిన ప్రపంచంగా విజృంభించింది- కేవలం మనోమాత్రము- తత్త్వసాక్షాత్కారంచేత మనస్సు నశిస్తే ప్రపంచం అంతా నశిస్తుంది-

కాలిన వత్తినములవలె ఉన్న జీవునియొక్క స్థితియే ఉపనిషత్తులందు "స్వపితి" అను నామముతో వ్యవహరింప బడింది- ఈస్థితికి జీవునకు తత్త్వసాక్షాత్కారానంతరమే కలుగుతుంది- అజ్ఞానికికూడా "స్వపితి" అను నామకరణము కద్దు- కాని అతనికి ఆపదలో ఉపాధిలయము లేనందున అజ్ఞానికి ఆపేరు సార్థకంకాదు-

ఇలాగే తత్త్వజ్ఞానంగల జీవుడికి "పశ్యంతి" అను నామముకూడ కద్దు- దృశ్యప్రపంచం బాధింపబడుటవలననూ, తత్త్వసాక్షాత్కారం కలగటం చేతనూ, దృశ్యప్రపంచాన్ని విస్మరించటం చేతనూ యీ నామం ఏర్పడింది- ఇలాంటివాడి చిత్తాకాశంలో మోహమనే మేఘాలుండవు- అంచేత అది శరదాకాశంవలె నిర్మలంగా ఉంటుంది- ఇంతకు పూర్వం విషయసంకల్పాలచే చంచలంగా ఉన్నా ఇప్పుడుమాత్రం చిత్స్వభావమాత్రంగా ఉంటుంది- కేవలం సద్రూపంగా ఉంటుంది ఆజీవచైతన్యం- జీవద్దశయందే సంసారసాగరాన్ని తరించి ఉంటుంది-

సుషుప్తిదశలో జీవునిదశ అత్యుత్కృష్టమయింది- సుషుప్తి అనే పదానికి రెండురకాల వ్యుత్పత్తిని చెబుతారు పెద్దలు- ఒకటి "సౌషుప్తం" అనగా "సుష్ఠు×సుప్తం" సుషుప్తం సుషుప్తమేవ సౌషుప్తం" అని దీనియర్థము- సుష్ఠు- నిరతిశయానందాత్మకముగా "సుప్తం" స్వరూపలాభాత్మక మయిన నిద్రకాన సుషుప్తం- అని ఒక

అర్థము- ఇట్టి దశపొందుటకు అనుకూలమయిన శాస్త్రజన్యజ్ఞానమే పాండిత్యము- ఇలాంటి పాండిత్యంచేత నిరతిశయానంద ఘనమై ఉం టుంది ఆచిత్తు-

రెండు "సుషు×సుప్తం" సుషు లెస్సగా సుప్తం- అవిద్యా మౌర్ఖ్యము (అనగా అజ్ఞానం జనితమయిన మూఢత్వము) నిరస్త మయినది (పోగొట్టుకొనబడినది) కాన "సౌషుప్తం" సౌషుప్త మన బడును- ఇట్టి సౌషుప్తస్థాన సంబంధమయిన పాండిత్యమనగా అవిద్యా మౌర్ఖ్యమును పూర్తిగా రూపుమాపుకొని యున్న చిదేకఘన పూర్ణా నంద స్వప్రకాశస్వరూపము- దీనితో నిండినది చిత్తు- అని రెండో అర్థము- ఇలాంటి జీవచైతన్యం పరిపూర్ణమయిన పరమపదమందు విశ్రాంతిచెంది ఉంటుంది- కనుకనే యీచిత్తు భాగత్యాగలక్షణచే "మహాసుప్తపదం" అనే పేరునుకూడ పొందుతుంది- ఈస్థితి జీవుడికి మనోలయమయిన పిదప (సంకల్పనాశమయిన తరువాత) కలుగుతుంది- ఇది మొదటి స్థానము- దీనిని చెప్పితిని-

ఇంక మునీంద్రా! ఈచిచ్ఛక్తి యొక్క రెండవస్థానమును చెబుతావిను- ఇదే చిచ్ఛక్తి సంకల్పవికల్పాలులేనిదై ప్రశాంతస్థితిలో ఉంటుంది- సూర్యచంద్ర అగ్న్యాదులను వాగాది యింద్రియాలనూ అపేక్షించదు- అంధకార తత్కార్యములను అపేక్షింపదు- ఆకాశం వలె అతినిర్మలమై గాఢసుషుప్తి లేఖవలెనూ, రాతిలోని సారము వలెనూ, సైంధవములో రసమువలెనూ, గాలిలోని స్పంద (చలన) శక్తివలెనూ, ఉండి అభ్యాసవశంచేత గొప్ప పరిణతిని పొందుతుంది- శూన్యశక్తి ఆకాశాన్ని పొందినట్లు ఈచిచ్ఛక్తి చిదేకఘన బ్రహ్మా కాశ భావాన్ని పొంది విషయజాలానికి అభిముఖమయే దశను విడిచి పెట్టుతుంది- నీరు చాపల్యాన్ని విడిచినట్లు- గాలి చలనమును విడిచి నట్లు- పువ్వు సౌరభాన్ని(పరిమళాన్ని) విడిచినట్లు- ఇంక తన స్వరూపం నుంచి వ్యుత్థితిని చెందదు- కాలధర్మమయిన చేష్టనూ, ఆకాశధర్మ

మయిన వస్తువులనూ విడచి (అనగా పరిచ్ఛిన్నమై అవకాశమును అపే క్షించెడి)వస్తువు ఆకాశకల అని యర్థము– దానిని విడచి అని భావము– జడాజడములకు వ్యతిరిక్తమై ఉంటుంది– మాటలతో చెప్పనలవికాని పరిస్థితిలో ఉంటుంది– విరాట్ హిరణ్యగర్భావ్యాకృతుల కంటే అతీత మయిన అంశలో ఉంటుంది– స్వప్రకాశ స్వరూపంలో ఉంటుంది– తురీయమనే పేరుగల ద్వితీయభూమిక యొక్క పరిస్థితి యిది–

ఇక తృతీయభూమిక యొక్క పరిస్థితిని చెబుతాను విను–

అఖండ బ్రహ్మాకారమయిన వృత్తి ఆవృత్తివ్యాప్తమయిన బ్రహ్మమూ ఈరెండూ పాలునీళ్లవలె ఏకీభావమును చెందుటచే అఖండాకారాన్ని చెంది ఉంటుంది– బ్రహ్మ ఆత్మ ఇత్యాది పదములకు వాక్యమునకు అతీతమవుతుంది–ఈపరిస్థితి అసంప్రజ్ఞాతసమాధి గమ్యము– లోగడ చెప్పిన రెండవభూమిక సంప్రజ్ఞాతసమాధి గమ్యం– ఇదీ ఈ రెండు భూమికలకు గలభేదము– ఇదియే షడ్భావవికారరహితమయిన స్థితి– ఇదే పరమపురుషార్థరూపం– నిశ్శ్రేయసరూపము– ముఖ్యము నిరవచ్ఛిన్నము– పరమపావనమయినస్థితి– ఇట్టి తృతీయాభూమికాస్థితి శైవాగమప్రసిద్ధమయిన మార్గములకు అతీతము– శ్రుతిప్రసిద్ధమయిన ధూమాదిమార్గ అర్చిరాదిమార్గముల కంటె అతీతము– ఆమార్గముల ద్వారా ఊర్ధ్వలోకానికి పోయినవార్లకుకూడ అతిదూరము– కనుక మునీంద్రా! నాకుకూడా ఈస్థితి మాటలతో చెప్పనలవి కాకుండా ఉంది– స్వయంగా అనుభవించబడుచూ మాత్రంఉంది– కనుక వసిష్ఠా! జాగ్రదాది మూడుస్థానములకంటెనూ, ఆమూటియొక్క అపేక్షగల తురీయస్థానముకంటెను అతీతమయిన దేవుడే సనాతనుడు– అతడే నిత్యుడు– మిగిలినదంతయు అనిత్యము– "అతో౽న్యదార్తం" అను శ్రుతి యిందుకు ప్రమాణము– నీవు యీస్థితిలోఉండు– తురీయాతీత స్థితియే ముక్తిస్థానము–

ప్రపంచమంతా ఏతన్మయము- అనగా ఈ చైతన్యమే ఉపాదాన కారణం ప్రపంచానికి- ఈ కారణజ్ఞానంవల్ల "ఇదీ అదీ" అనే వికల్పాలన్నీ అంతరిస్తాయి- మునీంద్రా! ప్రపంచంలో ప్రవర్తించేది ఏదీ లేదు- నివర్తించేదీ లేదు- శాంతమూ, సమసమాభాసమూ అగు చైతన్యమాత్రమే ప్రకాశిస్తోంది- ప్రపంచంలో రెండు వస్తువులుండి అవి యేకమగుట కానందుననూ, ఆత్మస్వరూపమునందు సంక్షోభము లేనందువలననూ, చిద్ఘనమగుటవలననూ, వికారాదులు లేనిదగుటవలననూ, నిత్యములయిన ఆకాశాదులుకూడ ఈ చైతన్యముకంటె అనిత్యములగుటవలననూ, బాలులచే కల్పించబడిన నభఃశిలాకోశములూ, ప్రపంచములూ, చిద్ఘనము లగుటవలననూ, ఉన్నవీ లేనివీ అనే భేదమేమీ లేదు- కనుక తురీయాతీతమయిన స్థానమే ప్రణవగమ్యము- అదే శాంతం- అదే సుశివం- అదే పరమపదము- అని చెప్పి భరద్వాజా! ఈశ్వరుడు వసిష్ఠాశ్రమమందు వసిష్ఠమునితోడనూ, స్కందాదులతోకూడా క్షణకాలం నిశ్చేష్టుడుగా ఉన్నాడు- అని అన్నారు వాల్మీకి మహర్షి భరద్వాజునితో-

### ౩౭. మహాదేవస్య పూజ్యసీమాంతోపదేశము.

వసి॥ రామచంద్రా! భక్తవాత్సల్యంచేత ఈశ్వరుడు తనంతటతానే కళ్లు తెరచాడు- నావంక చూచాడు- ఇలా అన్నాడు నాతో-

మునీంద్రా! నీవు నే చెప్పిన విషయాన్ని మననం చేసికో- అనర్థమూలమయిన అచిదంశాన్ని నమ్మకు- యుష్మత్ప్రత్యయ గోచరమయిన జడాంశము చిదంశమును మలిన పరుస్తోంది- త్యాజ్యములలో ఉపాదేయమయిన అంశమేమీ లేదంటారు తత్త్వవేత్తలు- ప్రాపంచిక విషయాలు కొన్ని చిత్తవిక్షేపకరాలు- మరికొన్ని చిత్తాశ్వాసకరాలు- వీటిని అన్నిటిని వదల్చుకోవాలి- ధీరుడవు కావాలి- ఆత్మద్రష్టవు కావాలి- ఇందుకు నీకు తగినసామర్థ్యం లేకపోతే అది కలిగేటంతవరకు

కొంతకాలం శ్రవణమననాలకు అనుకూలమయిన బాహ్యదృష్టిని అవలంబించాలి- నిరంతరం తత్త్వప్రాప్తికొరకు ప్రయత్నించు- ఒకానొకప్పుడు కూడా ప్రమాదము (అజాగ్రత) కూడదు- ఆత్మలాభానికి తగిన ప్రయత్నం లేకుండా ఉన్నందువల్ల ప్రయోజనంలేదు- అది పురుషార్థమయిన జన్మకాదు-

బాహ్యాకార దర్శనములన్నిటిలో దేహాత్మతా దర్శనమే (దేహమే ఆత్మ అను దృష్టియే) సర్వానర్థబీజం- రామా! దానిని నాశం పోగొట్టటానికే భగవంతుడు (ఈశ్వరుడు) ప్రవర్తించాడు- దేహాత్మభ్రాంతి మానుకొనమని నొక్కి చెప్పాడు- త్రుటిమాత్రకాలం కూడా వ్యర్థపోకుండా ఈవిషయంలో గ్రంథవిచారణ చెయ్యాలన్నాడు- ఇంకా ఇలా అన్నాడు ఈశ్వరుడు-

ఈశ్వ॥ మునీంద్రా! శరీరానికి క్రియాశక్తి (చలనానుకూలమయినశక్తి) గాలివల్ల (ప్రాణవాయువువలన) ఏర్పడుతుంది- సంవేదన శక్తి (చేతనశక్తి) (అనగా తెలిసికొనుశక్తి) ఆత్మచైతన్యమే-ఇందులో క్రియాశక్తి మూలమయిన వాయువు (ప్రాణవాయువు) నశిస్తుంది- క్రియాశక్తికి ఆశ్రయమయిన దేహమూ నశిస్తుంది- కాని దేహానికి తెలివినికలిగించే చిచ్ఛక్తిమాత్రం యెన్నటికీ నశించదు- లింగదేహములోకూడి (లేక లింగదేహమునందు) స్పష్టంగా ప్రకాశిస్తూనే ఉంటుంది- మకిలిపట్టని అద్దంలోనే ప్రతిబింబం స్పష్టంగా ప్రతిఫలిస్తుంది- అలాగే చైతన్యం అభివ్యక్తం కావటానికి మలినమయిన స్థూలదేహం తగినదికాదు- నిర్మలమయిన సూక్ష్మదేహమే యోగ్యమయింది- మలినమయిన అద్దానికి యెదురుగుండా వస్తువున్నా ప్రతిబింబం యేర్పడదు- అలాగే ప్రాణంలేని స్థూలదేహంలో (అనగా లింగదేహం లేచిపోయిన స్థూలదేహంలో) ఆత్మచైతన్యం సర్వవ్యాపకమయినా అభివ్యక్తంకాదు- కనుకనే చైతన్యం సర్వగతమయినా మాయాకలంకంచేత ఆవృతమయిన కారణంచేత లింగదేహంకంటె ఇతరచోట్ల బాహ్యక్రియ

లందు తనతత్త్వం తెలుసుకోవటమందునూ సమర్థముగాదు- లింగ దేహమునందు మాత్రం అనావృతం కనుక బుద్ధివృత్తిద్వారా బాహ్య క్రియలను తత్త్వబోధకు సమర్థమవుతుంది- అదే చైతన్యం బుద్ధివృత్తి ద్వారా బాహ్యాకారాకారితమై దేహస్పందానికి ఘటస్ఫందానికి సమర్థ మవుతుంది- అనగా దేహం చలించటానికీ ఘటపటాదివస్తుజాతం కనిపించ టానికి కారణమవుతుంది-

అదే బుద్ధివృత్తి బ్రహ్మాకారాకారితమయితే మాయాకలంకం లేని దవుతుంది- కనుక పరమకల్యాణమయిన కైవల్యరూపంతో ఉం టుంది- అదే చైతన్యముయొక్క అభివ్యక్త్యుత్కర్ష చే(మిక్కుటమయిన అభివ్యక్తిచే) హరియనీ, హరుడనీ, బ్రహ్మయనీ, ఇంద్రుడనీ, హిరణ్య గర్భుడనీ అంటున్నారు విద్వాంసులు-

అగ్ని, వాయు, చంద్ర, సూర్య రూపుడయిన పరమేశ్వరుడే సర్వ వ్యాపకచైతన్యమని చెప్పబడుచున్నాడు- ప్రపంచంలో సర్వవ్యాపక మయిన చైతన్యమును సాక్షాత్కరించుకొని మిథ్యామోహంలో పడని వారేలోకంలో బ్రహ్మవిష్ణురుద్రాది పరమదేవులని ప్రసిద్ధిచెందినారు- వారు తన్మాయఃపిండము యొక్క కణముల వంటివారు- సముద్రతరంగ ముల బిందువులవంటివారు- వీరు (బ్రహ్మరుద్రాదులు) గుణైకదేశము నందు అభిమానముగలవారు- సృష్ట్యాదికార్యముల కొరకు ఆవిర్భ వించారు-

ఇదంతా వ్యవహారదృష్టి ననుసరించి చెప్పాను- పరమార్థ దృష్టిలో హరిహరాదుల ఆవిర్భావమూ లేదు- వారుచేసే ప్రపంచ సృష్ట్యాది క్రియలూ లేవు- బ్రహ్మాండాధిపత్యమూ లేదు- తిరోభావమూ లేదు- ఇదిఅంతా అవిద్యాకృతమయిన భ్రాంతికాని వాస్తవముకాదు- వేదాలూ, వేదార్థాలూ, సృష్ట్యాదిక్రియలూ, ఉపాసనాభేదాలూ, బ్రహ్మతత్త్వాన్ని కనిపెట్టే ఉపాయభేదాలూ, వానియం దధికారులయిన జీవులూ, జీవులయొక్క కామకర్మవాసనలూ, వానివలన కలిగెడి జన్మ

జరామరణాద్యనర్థాలూ ఇది అంతా అవిద్యాయొక్క నోలుసుకట్టు- (పంక్తి) అవిద్యాయొక్క విలాసభేదములకు అంతు లేదు- వాటిని చెప్ప నలవికాదు- దీనిని వర్ణించి చెప్పగల సమర్థుడూ లేడు- చెప్పినందువల్ల ప్రయోజనమూ లేదు-

బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులుగూడ ఆచిదాత్మవల్ల శరీరోపాధిని పరిగ్రహించారు కనుక చిదాత్మ వార్లకుకూడ తండ్రిఅన్నమాట- ఆచిదాత్మే మహాదేవుడు- అతడే అందరకు ధ్యేయుడు- (ధ్యానింప తగినవాడు) చూడుడు- అథర్వశిరశ్శ్రుతిని- "ధ్యాయీత ఈశానం ప్రధ్యాయితవ్యం- సర్వమిదం బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాః తేసంప్రసూయంతే సర్వాణి చేంద్రియాణి సహభూతైః నకారణం కారణానాం ధాతాధ్యాతా కారణంతు ధ్యేయః సర్వైశ్వర్యేణ సంపన్నః సర్వేశ్వరశ్చ శంభురాకాశమధ్యే" అని- ఇలాగే పురాణముకూడా చెబుతుంది-

శ్లో॥ త్రయస్తే కారణాత్మానో జాతాః సాక్షాన్మహేశ్వరాత్ ।
తపసా తోషయిత్వా తం పితరం పరమేశ్వరం ।
పరస్పరస్మా జ్జాయంతే పరస్పరజయైషిణః ॥ అని-

ఈశ్వరుడు అపరిచ్ఛిన్నమయిన జ్ఞానైశ్వర్యయోగమందు పూజింప బడుచున్నాడు- కాన మహాదేవుడన బడుచున్నాడు- శ్రుతి యిందుకు ప్రమాణము- "యస్సర్వాన్ భావాన్పరిత్యజ్య ఆత్మజ్ఞానయోగైశ్వర్యే మహతి పూజ్యతే తస్మా దుచ్యతే మహాదేవ" ఇతి అని-

ఇతడే నిఖిలవస్తువులకు సత్తాప్రదుడు-(ఉనికినిచ్చువాడు) ప్రకాశరూపుడు- సర్వవంద్యుడు- సర్వపూజ్యుడు- సకలవస్తువులను ప్రకాశింపజేస్తూ తాను అందరికీ ప్రకాశిస్తూనే ఉన్నాడు- వస్తువును దగ్గరకు జేగుటకు ఆహ్వానమున్ను వస్తువును కనుపరచుటకు మంత్రములున్ను ఉపయోగపడుతున్నాయి- ఇతడు సర్వగతుడు కనుకనూ స్ఫురణరూపుడు కనుకనూ ఆహ్వానముకాని మంత్రములుకాని అక్కరలేదు-

అలాగే ప్రతిష్ఠాపనమూ పనిలేదు- అవగుంఠనమూ పనిలేదు- అవరోధనమూ పనిలేదు-

వస్త్వాకారము లంటూ దృష్టిగలవాళ్ళకూ వస్తుస్ఫురణతో తాను స్ఫురిస్తూనే ఉన్నాడు- కనుక మహాదేవుడే మొదట పూజించతగినవాడు- నమస్కరించ తగినవాడు- అర్చించతగినవాడు- మహానుభావులు తెలిసికొనతగినవారిలో గూడ ఇతడే ముఖ్యంగా తెలియతగినవాడు- ఇట్టి యీశ్వరతత్త్వమును తెలిసికొనినవాడు జరామరణముల బొందడు- సంసారంలో మునగడు- కాలి(గి)న గింజ మొలకరించదు-

వసిష్ఠా! సకల జంతువులందునూ అభయప్రదుడయినట్టియూ, విదితుడయినట్టియూ, ఆద్యుడునూ, ఉపాస్యుడునూ అయినట్టి ఆ యీశ్వరతత్త్వము నీవే- బాహ్యదృష్టిలోపడి వ్యామోహపడు చున్నావేమి?

## ౨౫. పరమేశ్వరవర్ణనము-

ఈశ్వ॥ చిద్రూపుడయిన ఈశ్వరుడు సర్వాంతరుడు- అనుభూతి రూపుడు- ప్రపంచాధిపతి- చిద్ధాతువు- కారణకారణుడు- బుద్ధివృత్తులకు ప్రకాశకుడు- ప్రాపంచిక విషయములకు అధిష్ఠానరూపుడు- చక్షురాదీంద్రియాలకు, సూర్యాదులకూ ప్రకాశకుడు- వాటిచే ప్రకాశింపబడడు- లోకవ్యాపకుడు- అయినా అలౌకికుడు- సత్యాసత్య వివర్జితుడు- ప్రపంచావ్యాకృతముల యొక్క సత్తకు సాక్షి- ప్రపంచవస్తువులందు అనురాగమును పుట్టించుటలో రాగాత్మ- (రాగరూపుడు)- విషయస్మృతికాలంలో చిత్తక్షోభ కలిగిస్తూ ఉన్నందువల్ల రంజకుడు- విషయసంబంధదశలో రంజనరూపుడు- విషయములతో వియోగము తటస్థించినపుడు రజోరూపుడు- ఈచిదాకాశం ప్రకాశిస్తూ ఉంటేనే ప్రపంచమనే మరుమరీచికలు బయలుదేరుతూ ఉంటాయి-

ఉష్ణస్వభావుడయిన అగ్ని ఉన్నంతవరకే విస్ఫులింగాలు- పరమాణురూపుడు- అయినా మేరువును గర్భంలో ధరించి ఉన్నాడు-

ఇతనికి దేశకాలాది పరిచ్ఛేదములులేవు- సప్తసముద్ర పర్యంతమయిన పృథివికూడా ఈతని అంతు కనుగొనలేదు-

ఇతడు చేయకుండగనే ప్రపంచకర్త అవబడుచున్నాడు- మహత్తరమయిన సృష్టికార్యమును చేస్తున్నా అకర్త అనిపించుకున్నాడు- నిఖిల ప్రపంచరూపుడూ అవును- నిఖిల ప్రపంచరూపుడూ కాడు- ద్రవ్యరూపుడు- అద్రవ్యుడు- మహాకాయుడు- అకాయుడు- నిఖిలకాల స్వరూపుడు- సకలకాలాతీతుడు- సుశబ్దరూపుడు- అపశబ్దరూపుడు- సకలశబ్దాతీతుడు- కనుక ఈతడు సర్వాత్మకుడు-

## 32. నియతినృత్యము.

మునీంద్రా! మాయాశబలమయి బ్రహ్మయందు మాయావిలాస రూపమయిన శక్తులు యేవి ప్రకాశించవు?

వ్రీహ్యాది బీజకణములయందున్న చిత్సత్త సహకార కారణ సామగ్రిచే మొలకరించి క్రమంగా తండులభావమును జెంది పురుష భోజ్యమయిన అన్నమగుచున్నది- అదే ఈశ్వరశక్తి రసరూపంతో జలమునందుండి పానీయరూపంగా జిహ్వేంద్రియ ద్వారా ఉదరమును చేరుతోంది- అట్లే గంధరూపంతో నాసాపుటమును పొందుతోంది కుసుమగుచ్ఛాలనుచేరి- ఇట్లే ఈశ్వరశక్తి శిలలో ప్రవేశించి గిరీంద్ర రూపంతో ఉండి తృణవృక్షలతాదికార్యాలను తయారుచేస్తోంది- స్పందరూపంతో గాలిలో ప్రవేశించి త్వగింద్రియాన్ని చేరుతోంది- ఇలాగే యితరేంద్రియాలలోకూడ ఈశ్వరశక్తులు ప్రవేశించాయి- నిషేధవాక్యములచే యీశక్తులన్నీ ఇలాగే నివృత్తిని కూడ చెందుతున్నాయి- అనగా ప్రవృత్తిశక్తితో భగవంతుడు సంసరించుట యెలాగో అలాగే నివృత్తిశక్తితో నివర్తించటంకూడా ఈశ్వరునకు ఈరూపములన్నీ ఆ సదాశివునికి ఆశ్రయించియున్న నియతి యొక్క మహిమ.

వసి॥ ఈశ్వరా! శివున కీశక్తులు ఎక్కడివి? ఇవి ఎలాఉంటాయి— ఇతడికి వాటియందు సాక్షిత్వమెలా ? ఆ శక్తులయొక్క నడకయెట్టిది ? చెప్పమన్నాడు వసిష్ఠుడు—

మునీంద్రా ! చిన్మాత్రుడూ అప్రమేయుడూ నిరాకారుడూ అయిన సదాశివునకు యీశక్తులు అనంతములు అన్నాడు—

వసి॥ అయితే ఈశ్వరా ! ఈశక్తులు ఎక్కడినుంచి వచ్చాయి ? ఇవి అనంతములు ఎలా అయ్యాయి? వీటి ఉత్పత్తి ఎలా? వీటి పరస్పర భేదం ఎలా గుర్తించాలి ? అని అడిగాడు మళ్ళీవసిష్ఠుడు—

ఈశ్వ॥ ఈశ్వరుడు ఇలా జవాబుచెబుతాడు— వసిష్ఠా ! ఇవన్నీ మాయయొక్క కల్పనచే ఏర్పడిన చిద్భేదములు— నిజంలో ఇవి శివుని కంటె భిన్నములు కావు— అభిన్నములే— కాబట్టి యిందులో విరోధం లేదు— స్వతస్సిద్ధంగా అనంతంగా ఉన్న శివుని మాయగుణమువల్లనూ, శక్తివల్లనూ, కార్యమువల్లనూ అనంతపరుస్తూ ఆయనగారి అనంత్యాన్ని వృద్ధిచేస్తుందికాని చెడగొట్టదు— తరంగఫేనాది వికల్పాలతో ఉదకం భిన్నంగా కనిపించినట్లు ఈచిదాత్మకూడ మాయావికల్పాలతో భిన్నంగా కనిపిస్తాడు—

ఋతుమాసాది కాలనియతి క్రమంచేత శిక్షితులయిన నటులు బ్రహ్మాండంలో నాట్యంచేసినట్లు ఈనియతికూడ నృత్యంచేస్తోంది— పరార్థద్వయ పర్యంతమయిన కాలముకాని అవాంతరకల్ప తదవయవరూప మయిన కాలముకాని నియతి అని చెప్పబడుతుంది— అది యీశ్వరుని యొక్క క్రియ అనండి యత్నమనండి లేక ఇచ్ఛ అనండి మీాకు ఏపేరు పెట్టినాసరే— అదిమాకు అనవసరం—

ఈనియతి రెండురకాలు— ఆకారనియతి— వికారనియతి— అని— తృణం మొదలు మహారుద్రపర్యంతం ఆకారనియతి— తృణము మొదలు కొని పద్మజస్పంద (బ్రహ్మస్పంద) పర్యంతం వికారనియతి—

ఇది తత్త్వజ్ఞానం కలిగేటంతవరకు ఇలా ఇది నాట్యం చేస్తూనే ఉంటుంది- ఆనాట్యంలో అదిచూపించే స్థాయి భావాలకూ సంచారి భావాలకూ శృంగారాది రసభేదాలకూ అంతు లేదు-

ఇలా నియతియొక్క విలాసరూపమయిన సంసారనాటకంలో సాక్షిరూపుడు పరమాత్మ- ప్రత్యగ్రూపుడు- ఆనటితోనూ దాని నాట్యంతోనూ భిన్నుడుగాడు ఇతడు పరమార్థంగా (నిజంగా)-

## ౩౮. సర్గ.

వసిష్ఠా ! నియతియొక్క నాటకానికి సాక్షిఅయిన ఆచిదాత్మయే పరదేవుడు- అతడే ఘటంలోనూ, పటంలోనూ, కుడ్యంలోనూ, వట వృక్షంలోనూ, వానరములోనూ, శకటంలోనూ ఇక్కడా అక్కడా ఏమిటి అంతటా ఉన్నాడు- అతడే (ఆచిదాత్మయే) శివుడనీ హరుడనీ హరియనీ బ్రహ్మఅనీ శక్రుడనీ (ఇంద్రుడు) కుబేరుడనీ యముడనీ చెప్ప బడుతున్నాడు- లోపలా వెలుపలా నిండియున్న ఆచిదాత్మయే బుద్ధి మంతులచే నానావిధములయిన క్రమములచే పూజింపబడుచున్నాడు- అతని బాహ్యపూజాక్రమంవిను- ఆవల అంతరపూజాక్రమాన్ని విందువుగానివి-

దేహమనే గేహం (కొంప) చాల పవిత్రమయింది- దీనికి శాస్త్రోక్తమయిన సంస్కారాలు చాలాభాగం లభించాయి- స్నానాచ మనాదులుగూడా లభించాయి- కనుక దేహగేహం (దేహమనేకొంప) చాలా పవిత్రమయింది- అయినా దాన్నికూడా విడిచి దానికి చైతన్య మునుయిచ్చే సాక్షిరూపమయిన చిత్ప్రకాశము యింకా చాలా పవిత్ర తమం- దాన్ని ప్రయత్నపూర్వకంగా గ్రహించాలి- ఇతని పూజకు సాధనమూ పూజా అంతా లోపలధ్యానమే- వేరేపూజలేదు- కాబట్టి త్రిభువనాధారుడయిన ఆసాక్షి చిత్ప్రకాశరూపుని ధ్యానంతోటే పూజించాలి-

ఇతడే సూర్యాది తేజఃపదార్థాలనూ బుద్ధివృత్తులనూ ప్రకాశింప చేసేవాడు- ఇతడే విశ్వరూపుడు- ఊర్ధ్వాధోలోకాలన్నీ ఇతని అవయవాలే- పురుషసూక్త ప్రతిపాద్యమయిన విరాడ్రూపమంతా ఈతనిదే- సర్వభూతాంతరావస్థుడయిన ఇతనిని ఇట్లు గుర్తించి పూజించాలి- ధూపదీపాదులతోను, ఫలపుష్పపహారాదులతోను ఇతడు పూజింపబడడు- నిరాయాసమయిన బోధమాత్రంచేతనే ఇతడు పూజింపబడతాడు- బోధ అనగా అఖండ బ్రహ్మసాక్షాత్కారమని అర్థము- ఇలాంటి సాక్షాత్కారవృత్తే ధ్యానము- ఇదియేపూజ- దీనికంటె గొప్పపూజాలేదు- గొప్పధ్యానమూ లేదు- అర్ఘ్యపాద్యాది ఉపచారములన్నీ ఈచిదాత్మకు అవబోధమాత్రంచేతనే (అఖండసాక్షాత్కారం చేతనే) సిద్ధిస్తాయి- ధ్యానమువినాగా మరోదానిచే దేనిచేతను ఇతడు లభించడు- ధ్యానమువలననే ప్రసన్నుడవుతాడు- అందువలన మనుష్యాది హిరణ్యగర్భాంతములయిన సుఖభోగములన్నీ అనుభవిస్తాడు ఆత్మ- దేహగేహంలో విషయసుఖాలు అనుభవించినట్లు-

తత్త్వసాక్షాత్కారం లభింపకున్నా కేవలధ్యానమాత్రం చేత కూడా ఫలోత్కర్ష కలదు- ఎంతటి మూఢుడయినా ౧౩ పదమూడు నిముషాలు ఈచిత్ప్రకాశరూపుని ధ్యానించినచో గోదానఫలమును పొందుతాడు- నూరునిముషములు ధ్యానిస్తే అశ్వమేధ యజ్ఞముయొక్క ఫలమును పొందుతాడు- ఈ చిదాత్మను అరఘడియకాలము ధ్యానిస్తే అశ్వమేధ సహస్రముయొక్క ఫలమును పొందుతాడు మానవుడు- ఒక ఘడియకాలము ధ్యానిస్తే రాజసూయయాగముయొక్క ఫలంవస్తుంది- ఇలా మధ్యాహ్న పర్యంతమూ బల్యుపహారాదులతో పూజిస్తే లక్ష రాజసూయయాగముల ఫలంలభిస్తుంది- ఒకరోజంతా పూజిస్తే పరతత్త్వంలోనే లీనమవుతాడు మానవుడు- ఇదే పరమ యోగము- ఇదే ఉత్తమమయినకర్మ- ఇలా బాహ్యసంపూజనం చెప్పాను నీకు- ఇది ఆత్మకు ఉత్తమమయినది- పవిత్రమయినది-

సకలపాపములను పోగొట్టునది- ఇలాంటి దానిని యేమానవుడయినా ఆయాసపడకుండా క్షణకాలమయినా ఆచరించే యెడల ఆ మానవుని సురాసురలోకపుంజము నమస్కరించగలదు నన్ను నమస్కరించినట్లు-

## ౩౯. దేవార్చనవిధి.

ఈశ్వ॥ మునీంద్రా! పరమపావనమూ అజ్ఞాననాశకమూ నగు అంతరపూజనమును చెబుతాను విను- ఇది కేవలము ధ్యానరూపము- దీనికి ఆచారనియమాలతో పనిలేదు- నిలచున్నా, పోతున్నా, కూర్చున్నా, ఎలాంటి దశలోనయినా శరీరమందున్న శివుని నిత్యమూ ధ్యానింపవచ్చు- ఇతడు సర్వప్రత్యయములకూ (బుద్ధివృత్తులకూ) సన్నిధిమాత్రంచేత కర్త అవుతున్నాడు- జాగ్రదాదివిషయాలను తనయందు అధ్యారోపముచేసికొని సృష్టిస్తూ ఉంటాడు- సకల కార్యాలకు సత్తను ఇస్తాడు- అయినా నిర్విక్షేప స్వభావంలో బోధలింగరూపుడు- ప్రారబ్ధ ప్రవాహ పతితములయిన భోగాలలో పడిపోతాడు- అశుద్ధిని పొందుతాడు- అయినా మాటిమాటికి అసంగ విశుద్ధ ఆత్మబోధ లక్షణమయిన స్నానంచేత సదాశుద్ధి గలవాడవుతాడు- ఇలాంటి పూజలో నీమనస్సు చీకటిలో (అజ్ఞానంలో) పడిపోయిందా! అపుడు అఖండితమయిన ఆదిత్యమండలాన్ని భావన చేయుము- (భావించు) అదే మనస్సు పరితాపంలో మునిగి పోయినచో అఖండితమయిన (పరిపూర్ణమయిన) చంద్రమండలాకారంగా ఆకాశాన్ని భావించు-

నభోమండలమందు ఆదిత్యరూపంగాను చంద్రరూపంగాను భాసిస్తూ ఉన్నాడు- లోపలి వెలుపలి బుద్ధివృత్తి ప్రతిభాసలందూ ఆబుద్ధివృత్తులచే భాసింపచేయబడిన (ప్రకాశింపచేయబడిన) పదార్థ సమూహములందూ నిత్యమూ సంవిద్రూపంగా ఉన్నాడు- ఇంద్రియములనే ద్వారములగుండా తన చిత్ప్రకాశలను వెలుపలి విషయప్రదేశాలకు పంపుతున్నాడు- జ్ఞేయములకు జ్ఞాతగా ఉన్నాడు- సర్వకర్మలకు కర్తగా

ఉన్నాడు- భోజ్యములన్నిటికీ భోక్తగా ఉన్నాడు- సకల సంవిత్తులకు స్మర్తగా (సాక్షిగా) ఉన్నాడు- విషయభావనలతోనూ అభావనలతోనూ గుర్తింపబడుతూ ఉన్నాడు-ఆభాసరూపములయిన సర్వప్రకాశాలకంటె ప్రకాశరూపుడు- సర్వగుడు- ఇలాంటి శివుని ధ్యానించాలి-

ఇంకా శివుడు వస్తుతః నిష్కలుడు- ఉపాధి సంబంధంవల్ల సకలుడు- హృదయాకాశంలో సంచరించు స్వభావంగలవాడు- అనగా శరీరంలోని హృత్పుండరీకంలో ప్రత్యక్షమవుతాడు కనుక అక్కడ సంచరించు స్వభావంగలవాడని అంటారు శాస్త్రకర్తలు- శరీరమంతటా వ్యాపించే బోధరూపుడు- మనస్సుకు మననశక్తి నిచ్చేవాడు- ప్రాణాది వాయువులకు ప్రాణనాదిశక్తులను ఇచ్చేవాడు- హృత్కంఠతాలువుల మధ్యనుండేవాడు- నాసాపుట పీఠమందుండువాడు- శైవాగమశాస్త్ర ప్రసిద్ధములయిన ముప్పదియారు తత్త్వములకు ఆవలివాడు- శివయోగ ప్రసిద్ధమయిన సబీజసమాధిరూపమయిన ఉన్మనీ దశకు అతీతుడు- మనస్సుకు శబ్దాది విషయజ్ఞానాలను అందించేవాడు- మనస్సు అనే పక్షిని విషయాలమీదికి పంపేవాడు- వ్యవహారదశలో వికల్పసమాధియందూ నిర్బీజసమాధిలోను, మోక్షదశలోను, నిర్వికల్పస్థితియందూ ఉండేవాడు- నువ్వగింజలో అంతటానూనె ఉన్నట్లు శరీరమంతటా అంతర్యామిరూపంతో నిండిఉన్నాడు- షోడశకళలయొక్క కళంకం లేనివాడు- స్థూలదేహరూపంగా పరిణమించిన భూతమాత్రలచే మూర్తంగా తయారయ్యాడు- పదకొండు ద్వారాలుగల శరీరంలో హృదయాకాశంలో ఉంటాడు- చిన్మాత్రుడు- శుద్ధమయిన ప్రకాశరూపుడు- ఆధ్యాసికములయిన వికల్పాలకు అధిష్ఠానరూపుడు- స్వస్వరూపాన్ని (తన నిజరూపాన్ని) విస్మరించినందువల్ల భోగార్థిగా తయారయినాడు- తనకంటె భిన్నమయిన పదార్థములయొక్క వేషాన్ని తానే వేసుకొని ఒక్కక్షణంలో ద్విత్వాన్ని పొందినవానివలె ఉంటాడు- చేతులు, కాళ్లు, గోళ్లు, వెంట్రుకలు, దంతాలు మొదలయిన అవయ

వాలు కలవాడువలె తయారవుతాడు- తుదకు దేహసంవిత్తులే అతనిని పరిచయం కలిగించేవి అయినాయి- ఇలాంటి శివునే ధ్యానించాలి-

ఉత్తముడయిన భర్తను భార్యలు సేవించినట్లు చిత్రవిచిత్రములయిన శక్తులనేకములు నన్ను సేవిస్తున్నాయి- నాకు మనస్సు అనే వాడు ద్వారపాలుడు- వాడు ముల్లోకాలలోని సంగతులనూ నాకందిస్తాడు- చింతఅనేది నాకు ప్రతీహారి- యెప్పుడూ ద్వారమునందుంటుంది- జ్ఞానశక్తి క్రియాశక్తులు రెండూ నాకు మిక్కిలి ప్రేమపాత్రములు- శాస్త్రీయములు లౌకికములయిన జ్ఞానములు నాకు భూషణములు- జ్ఞానేంద్రియములూ, కర్మేంద్రియములూ ద్వారములు- ఇలాంటి నేను భిన్నభిన్నములయిన శరీరాకారాలను విడచి అపరిచ్ఛిన్నుడనై పరిపూర్ణుడనుగా ఉంటున్నాను- ఇట్టి నాఅలౌకికమయిన చమత్కృతిని గ్రహించినవాడు దేవత్వముతో పరిపూర్ణుడై నిత్యపరిపూర్ణుడుగా ఉండిపోతాడు-

వాడుచావడు- పుట్టడు- సంతసించడు- కోపించడు- తృప్తి చెందడు- క్షోభించడు- దేనినికోరడు- విడువడు- సర్వసమంగా ఉంటాడు- యావద్దేహపర్యంతమూ అహర్నిశము దేవుని పూజిస్తూనే ఉంటాడు- దేహము చిత్తత్వముచే చలిస్తుంది- దీనికి అచిత్తత్వమే దేవుడు యథాప్రాప్తమయిన త్రిపుటీవస్తువుతో వృత్తిప్రతిబింబిత చైతన్యములకంటె పరమయిన బింబచైతన్యాన్ని పూజిస్తాడు జీవుడు-

కనుక యథాప్రాప్తమయిన వస్తువుతో పూజించాలి శివుని. అపూర్వములయిన గంధపుష్పాది వస్తువులు దొరకలేదని వానికోరకు ప్రయత్నించవలసిన పనిలేదు-

యథాప్రాప్తమయిన బ్రాహ్మణ క్షత్రియాది శరీరమున కుచితమయిన శాస్త్రీయవ్యావహారంతో దేహధారణమాత్రమునకు నిమిత్తమయిన అన్నపానాదులను సేవిస్తూ పూజించాలి శివుని- యదృచ్ఛా

ప్రాప్తములయిన భక్ష్యభోజ్యాది పదార్థములతో పూజించవచ్చు- పూజాపరికరములెట్లున్నా ఈశ్వరుని నిజరూపం గుర్తించి పూజించాలి- కాంతాన్నపాన సంభోగవిలాసాలతో గూడిన సుఖదశలో- అలాగే కర్మానుసారంగా సంప్రాప్తమయిన దుఃఖానుభవసమయంలో కూడా- ఇలాంటి పూజాబుద్ధే ఉండాలి కాని ఉద్వేగపడరాదు- అధివ్యాధులతో వ్యాప్తమయియున్నా మహామోహజాలంలో మునిగియున్నా సర్వోపద్రవదుఃఖాలతో బాధపడుతున్నా శివధ్యానం మానరాదు. ప్రాపంచిక వ్యవహారాలు యెన్ని నెత్తిన పడ్డా మరణం సంప్రాప్తమగుచున్నా ఆత్మచింతన మానరాదు- దారిద్ర్యం తటస్థించినా, రాజ్యంప్రాప్తించినా, యేయేపనులు అనివార్యములయినా, నానావిధములయిన కలహాలు సంప్రాప్తములయినా, రాగద్వేషాదివిలాసాలు చిత్తంలో నాట్యమాడు చున్నా శివధ్యానం మానరాదు- (ఆత్మచింతన విడువరాదు-)

కాని వీలయినంతవరకు సత్పురుషులు మెచ్చుకొనునట్టి చంద్రుని వలె శీతలమయిన మధురమయిన మైత్రితో హృత్పుండరీకమునందలి ఆత్మను పూజించాలి- మైత్రీ, కరుణా, ముదితో, పేక్షాయుక్తమయిన బోధతో ఆత్మను అర్చించాలి- యదృచ్ఛాప్రాప్తమయిన భోగంతో తృప్తి చెందాలి- భోగలంపటుడు కాకూడదు- అనిషిద్ధములు కాని, నిషిద్ధములు కాని, యేవయినా సరే అన్నిటినీ సర్వదా విడచుటయే ముఖ్యకల్పము- అనిషిద్ధములందు అనురాగంతో ఉండుట అనేది గౌణ కల్పము-వైరాగ్యమనే ధనంతో ఆత్మనుపూజించాలి- అయుక్తమయిన ధనాన్ని విడిచిపెట్టి యుక్తమయినధనంతో పూజించటం రెండవపక్షము-

పోయినదానికి ఉపేక్షించియుండుట దైవికంగా ప్రాప్తమయిన దానిని స్వీకరించుట ఈ రెంటియందూ నిర్వికారంగా ఉండడం ఉత్తమ మయిన పద్ధతి- సర్వసమత్వదృష్టితో ఆత్మపూజ చేయుట మంచిది- "సర్వం బ్రహ్మ" అను దృష్టితో అంతా శుభం అనుకోవాలి-సర్వమూ బ్రహ్మసంవలిత మాయామయమను దృష్టితో శుభాశుభమిశ్రమని

గ్రహించాలి- సర్వమూ ఆత్మమయమని అనుకుంటూనే ఆత్మపూజ చేయుట మంచిది- ఏది ఆపాతరమణీయమో, ఏది ఆపాతదుస్సహమో ఆ రెంటియందు సమతాబుద్ధితో నుండుటయే శ్రేయస్కరము- "నేను, వాడు", "నాది వానిది" అనే భేదబుద్ధి పనికిరాదు. "సర్వం బ్రహ్మ" అనే నిశ్చయంతోనే ఆత్మను అర్చించాలి- సర్వాకారములూ, సర్వ నామములూ భగవంతునివే అని భగవంతుని (ఆత్మను) పూజించాలి- అక్కరలేని దానిని(అనీహితం) మిథ్యాత్వబుద్ధితోనూ, కావలసినదానిని ఆత్మమాత్రమను బుద్ధితోనూ, ఉండికాని లేక రెంటిని మిథ్యాత్వ బుద్ధితోగాని, ఆత్మరూపములను బుద్ధితోగాని, ఆశ్రయించికాని ఆత్మను పూజించాలి- వాంఛతో భోగాలు అనుభవించకూడదు- అలాగే పరిత్యాగబుద్ధితోనూ అనుభవించకూడదు. సముద్రుడు నదులను అనుభవించినట్లు అనుభవించాలి భోగాలు- తుచ్ఛములందు (అవమానాదిదృష్టులందు) అతుచ్ఛములందు వధ, బంధ, సర్వనాశాది దృష్టులందు, సంప్రాప్తమయిన ఉద్వేగాన్ని చెందకూడదు- చాల కాలమునుండి అనువృత్తములయిన ఋజు, వక్ర, శీత, దాహాది, చిత్ర పదార్థములయెడ ఆకాశమున్నట్లు నిర్వికారంగా ఉండాలి- శుభా శుభాలు (మంచిచెడులు) దేశకాలక్రియాయోగమువల్ల సంప్రాప్తము లవుతాయి- అందు వికారం చెందకూడదు మానవుడు.

పూజాద్రవ్యములు సహజంగా కటు ఆమ్ల తిక్తాది (కారము, పులుపు, చేదు) మొన్నగు విషమరసము లు గలవయినా సమరసభావంతో ఆప్లావితములయితే (తడపబడితే) మధురైకరసములు కాగలవు. అంచేత మానవుడు పదార్థాలయొక్క రసభేదంచేత వికారంచెందవలసిన పనిలేదు-

పదార్థములన్నీ ఆనందైకరసవివర్తములగుటచే ఈభావంకలవా నికి కట్వాదిరసములే గోచరించవు- సర్వసమత్వదృష్టి గలవానికి సర్వమూ చంద్రునినుండి స్రవించెడి అమృతమువలె మధురముగానే

ఉంటుంది- సర్వసమత్వ దృష్టితో మనోలయమును చెందిఉండటమే ముఖ్యమయిన అర్చనము-

పూర్ణచంద్రునివలె పరిపూర్ణమయిన సమదృష్టితో ఉండాలి మానవుడు- స్ఫటికశిలవలె నిర్మలము దృఢము అయిన చిద్ఘనభావంతో ఉండాలి మానవుడు- అంతఃకరణలో ఆకాశమువలె నిర్మలుడూ, బయటికిమాత్రం కర్మలయందు ప్రవర్తించినవాడువలె ఉండు తత్త్వవేత్త పరిపూర్ణమయిన ఉపాసకుడు-

కనుక వసిష్ఠా ! సోమసూర్యులవంటి జ్ఞానప్రకాశకలిగి, మనస్సులో మాతృ మేయాది త్రిపుటి నశించి, అప్పుడు పుట్టిన పిల్లవానివలె వికల్పరహితుడవై యుండి, చిదాభాసునకు చిత్తమునకు మూలభూతమయిన స్వాత్మాభిన్నమయిన శివుని ప్రశాంతముగా సాక్షాత్కరించుకున్నవాడవై, జీవన్ముక్త పదమునందు అదేభావనతో ఉండు- స్వస్వరూపస్థితియే ముఖ్యమయిన శివపూజ-

## ౮౦. దేవతాతత్త్వవిచారము.

ఈశ్వ॥ వసిష్ఠా ! చిన్మాత్రుడయిన శివునకు యథాకాలము శక్తి కొలది చేసిన కృతాకృతమంతా శివార్చనమే- అతడు అంతమాత్రంతోనే నిరతిశయానందరూపాన్ని ప్రకటిస్తాడు- ఆవరణభంగాన్ని పొందుతాడు- పారమార్థిక స్వరూపంలో ఉండిపోతాడు-

అయితే మానవుల స్వాభావిక చేష్టలన్నీ రాగద్వేషాదులతో జరిగేవికనుక యివి అనర్థహేతువులు కదా ! ఈచేష్టలు శివపూజ ఎలా అవుతాయి ? అని సందేహం కలుగుతుంది- కాని ప్రపంచంలో ఈశ్వర స్వరూపంకంటె భిన్నంగా రాగద్వేషాలనే వికల్పాలులేవు- వహ్నియందు వహ్నికణములు వహ్నికంటె ఎలా భిన్నములుకావో అలాగే- కనుక సంపద్విభవములు, సుఖిత్వ దుఃఖిత్వాలు, క్షుత్పిపాసలు, ఇవన్నీ దేవునియందు పత్రపుష్పాది ఆరోపణమువంటివే- ఇవి ఆత్మీయములు

కాని, పరకీయములుకాని, ఇందులో తేడా లేదు- ప్రత్యగ్రూపుడయిన ఆత్మ వియదాది క్రమంతో ప్రపంచరూపంగానూ, జాగ్రదాదిక్రమంతో ఘటపటాదిరూపంగానూ అలంకరింపబడుచున్నాడు- ఇద్దానిని గుర్తించుటయే ఆత్మపూజనము- ఒక్క శివస్వరూపమే లేక ఒక్క ప్రత్యగాత్మ రూపమే జగత్ప్రత్యయంగా తయారయింది- అనగా ప్రపంచం ప్రపంచం అనే పేరుతో వ్యవహరింపబడుతోంది- అనగా ప్రత్యగాత్మయొక్క ప్రకాశతో ప్రకాశిస్తోంది- ప్రత్యగాత్మయొక్క ఉనికితో ఉనికి కలదవుతోంది-

ఇలా విమర్శించుకుంటే ప్రత్యగాత్మయే తనను తాను మరచినవానివలె జీవాదిస్వభావుడుగానూ, ఘటపటాది జగద్రూపముగానూ అర్థమవుతోంది- ఇంతకంటె వేరేమీ లేదు- ఇలా తత్త్వదృష్టిలో ఉంటే పూజ్యపూజకాది త్రిపుటిఅంతా (నేను పూజించేవాడను, దేవుడు నాచే పూజింపబడేవాడు, నేను చేసేది పూజ అనే త్రిపుటి) సున్న చుట్టుకుంది- అపరిచ్ఛిన్నుడయిన ప్రత్యగాత్మయందు పూజ్య పూజకాది రూపమయిన నియతాకారత (పరిచ్ఛిన్నాకారము) సంభవించదు- నిత్య నిర్మలమయిన ఈశ్వరస్వరూపమునకు పూజ్యపూజాద్యవచ్ఛిన్నమయిన దేవత్వము సంభవించదు- అనంతునకు అంతముగలరూపము అసంభవము- త్రిజగద్వ్యాప్తమయిన శుద్ధబోధస్వరూపుడయిన ప్రత్యగాత్మను పరిచ్ఛిన్నరూపుడగు దేవుడని మాటతో వ్యవహరించుటకుకూడ పనికిరాదు.

కాబట్టి మునీంద్రా! దేశకాలాద్యపరిచ్ఛిన్నుడయిన పరమేశ్వరుడు ఎవరిదృష్టిలో దేశకాలాదులతో పరిచ్ఛిన్నమయిన దేవుడుగా వ్యవహరింపబడతాడో వాళ్లు మాకు ఉపదేశ్యులు- విపశ్చితులు (విజ్ఞానులు) కారు- కనుక వసిష్ఠా! నీవు వారల దృష్టిని విడిచిపెట్టు- నేను చెప్పిన అపరిచ్ఛిన్నదృష్టిని అవలంబించు- సర్వాపమత్వమును అలవరచుకో- స్వచ్ఛమనస్కుడవుకా- పరమశాంతుడవుగా ప్రఖ్యాతి

చెందు- వీతరాగుడవై వ్యవహరించు- యథాప్రాప్తములయిన విషయ భోగాలతో మనస్సు చెడగొట్టుకొనక ఆత్మను బోధరూపంతో పూజిస్తూ ఉండు-

తత్త్వవివేకంచేత పంచకోశవివేకంచేత దేహముకంటె జీవుని వేరుపరచి అమానిత్వాది ఆత్మగుణముల నలవరచుకొని పూజ్య పూజకాది భేదభావాన్ని విడనాడి మాయాకలంకాన్ని రూపుమాపుకొని ప్రపంచ సంగరహితుడవయిన నీకు జన్మమరణాలు అంటవు- స్ఫటికపు రాళ్ళతో కట్టిన యిటిగోడలకు చుట్టూ నానారంగులుగల పూల చెట్లుండి ఆపూవులు రంగులు ఈస్ఫటిక శిలలందు సంక్రమించినా ప్రతిబింబరూపముతో ఆరంగులు ఈస్ఫటికములకు అంటుటలేదు- అంతే నీపరిస్థితికూడా-

## ౪౧. జగన్మిథ్యాత్వప్రతిపాదనం.

వసి॥ ఈశ్వరా! శివాది శబ్దప్రవృత్తికి నిమిత్తమగు ధర్మము ఏదయినా ఒకటి ఈశ్వరునియందు ఉన్నదా? లేదా? ఉన్నచో అతడు నిర్ధర్మకు డెట్లగును? ధర్మముగలవాడు సధర్ముడగును కాని నిర్ధర్మకుడు కానేరడు కదా! ఇక లేనిచో శివుడనీ, పరబ్రహ్మఅనీ, ఆత్మఅనీ, పరమాత్మఅనీ, వేరువేరుపేర్లు ఎలా వచ్చాయి? దేనిని ఆధారంగా చేసికొని యీపేర్లు పెట్టారు శాస్త్రకర్తలు- అలాగే తత్ అనీ, సత్ అనీ, కించిత్ అనీ, నకించిత్ అనీ, శూన్యంఅనీ, విజ్ఞానంఅనీ, వ్యపదేశించుటకు (శబ్దప్రయోగమును చేయుటకు) కారణం ఏమిటి? ఈవిషయం వివరించి చెప్పండి అని అడిగాడు శివుణ్ణి-

ఈశ్వ॥ శివుడు జవాబు చెబుతాడు ఇలా- వసిష్ఠమునీ! అద్యంతములులేని స్వయంప్రకాశమయిన సద్వస్తువు ఒకటి స్వస్వరూపమునందు ప్రతిష్ఠితమై ఉంది స్వతహాగా- అందుకు ప్రమాణము "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః" అనే శ్రుతి- ఇలాంటి వస్తువును బోధించడానికి శబ్దాలకు

ప్రవృత్తినిమిత్తం అక్కరలేదు. వ్యావర్తకధర్మమూ అవసరంలేదు- అలాగే "కించిత్, నకించిత్" అనే పదాలుకూడా ఈపేరులన్నీ మిథ్యాభూతములే.

వసి॥ మనో బుద్ధ్యహంకార చిత్తాదులు ఇంద్రియములచే గ్రహింపబడే వస్తువును మాత్రమే సంకల్పించటమో, నిశ్చయించటమో అభిమానించటమో స్మరించటమో జరుపగలవు- ఇతడు ఆత్మరూపుడయిన శివుడు ఇంద్రియగమ్యుడుకాడు- కనుక బుద్ధ్యాదులకు కూడ గోచరుడుకాడు- ఇలాంటి వాణ్ణి తెలుసుకోటానికి ఉపాయమనేది అసంభవం. ఇలాంటి స్థితిలో అధికారియగు జిజ్ఞాసువు బ్రహ్మను సాక్షాత్కారం చేసుకోవడం ఎలా? అని అడిగాడు వసిష్ఠుడు మళ్ళీ-

ఈశ్వ॥ వసిష్ఠా! వేదాంతవాక్య ప్రమాణజన్యమయిన బ్రహ్మాకారమగు శుద్ధసాత్త్విక మనోవృత్తిచే అవిద్యావరణము తొలగిపోతుంది- అవిద్యావరణ తొలగిపోగానే స్వప్రకాశరూపమగు బ్రహ్మ యథార్థరూపముతో ప్రకాశిస్తాడు- ఇదియే ఇతనికి బ్రహ్మసాక్షాత్కారం- ఇంతేకాని బుద్ధివృత్త్యభివ్యక్త చైతన్యవ్యాప్తి రూపము కాదు-

ముముక్షువుయొక్క మనస్సు శమదమాది సాధనసంపన్నగా ఉంటుంది. శుద్ధసాత్త్వికంగా ఉంటుంది- ఈసాత్త్వికమయిన అవిద్యాభాగము సచ్ఛాస్త్రమూ, సద్గురువూ, సత్సంగమూ, మొదలయిన పేర్లుగల అవిద్యాభాగములతో చేరుతుంది- శ్రవణమనన నిదిధ్యాసన సాక్షాత్కారములను వృత్తిపరంపర సంభృతమై ఉంటుంది- ఇలాంటివృత్తులు దీనికి (మనస్సునకు) అనేక జన్మార్జితమయిన యజ్ఞదానాది సుకృత విశేషంచేత లభిస్తాయి- ఈవృత్తి విశేషం అవిద్యను తొలగచేస్తుంది- కాబట్టి అవిద్యవల్లనే అవిద్యనాశంకావాలి- రజకుడు మలద్రవ్యము చేతనే మలాన్ని పోగొట్టతాడు- చవిటిమట్టి పేడనీళ్లు మొదలగు వాటితో గుడ్డలను తెలుపుచేస్తారు- ఇలా చిదాభ్యాసంచేత అఖండబ్రహ్మాకార

మయిన వృత్తిచే అవిద్య నశించగా పూర్తిగా నిరావరణమయిన ఆత్మ తనంతటతానే గోచరిస్తాడు- సాక్షాత్కారమవుతాడు- ఇదే ఆత్మ సాక్షాత్కారము- నిజమయిన స్వయంప్రకాశ స్వరూపంతో ఉండి పోతాడు- ఆత్మస్వభావమునకు ఇలాంటి పరిస్థితే (అనగా స్వప్రకాశ రూపంతో మిగిలి యుండుటే) నిశ్చయం- లేక అవిద్యకు ఇలా నాశం చెందటమే నిశ్చయం- దానికింతకంటె వేరేగతిలేదు- అనగా ఇచట రెండు విషయాలు స్పష్టపడుతున్నాయి- ఒకటి అవిద్యాంశంచేతనే అవిద్యనశించాలనీ, రెండు ఆత్మస్వరూపంచేతనే ఆత్మయొక్క నైర్మల్యం సిద్ధించాలనీ ఈ రెండు విషయాలకూ చక్కని దృష్టాంతం చూపుతాడు ఈశ్వరుడు- పిల్లవాడు రెండుబొగ్గులు చేతపుచ్చుకొని ఒకదానితో నొకదానిని రాపిడిచేస్తూ ఆడుకొనే వ్యసనంలో పడ్డాడు- రాయగా రాయగా బొగ్గులు రెండూ అయిపోయినాయి- మసిఅంతా రెండుచేతు లకూ అంటింది- చేతికి అంటుకున్న ఆమసి పోవాలి- చేతులు రెండూ నిర్మలంకావాలి- అందుకుగాను మళ్ళీ రెండుచేతులూ ఒకదానితో మరోదానిని కలిపి రుద్దుట మొదలు పెట్టాడు- కొంతసేపు రుద్దగా రుద్దగా చేతులకంటుకున్న మసి అంతాపోయింది- అంతటితో స్వత స్సిద్ధమయిన చేతులయొక్క నైర్మల్యం బయటపడింది- కాబట్టి మొదట చేతులకు అంటుకున్న బొగ్గుమసియొక్క నలుపు మళ్ళీ చేతులరెంటినీ పరస్పరం రుద్దగా రుద్దగా రెండుచేతులకు లోగడ అంటుకున్న (నిఘర్ష ణోపజనిత రేణుపరంపరా లక్షణకార్యము) నలుపు పోయి చేతుల యొక్క స్వతస్సిద్ధమయిన నైర్మల్యమును స్వయముగానే పొందుతాడు-

అలాగే సాత్త్వికము తామసమూ అగు అవిద్యాభాగము శాస్త్రము మొదలయిన అవిద్యాభాగలయొక్క సహాయముతో ఎంత కష్టపడి అయినా ఆత్మవిచారము చేసినచో రెండు అవిద్యాభాగములూ అనగా సాత్త్విక తామసావిద్యాభాగమూ శాస్త్రము మొదలగు అవిద్యా భాగాంతరమూ నశిస్తాయి- నిర్మలమయిన ఆత్మస్వరూపోదయము కలుగుతుంది-

ఇలా కాకతాలీయంగా అవిద్యాక్షయం కలిగితే ఆత్మయే ఆత్మ సాక్షాత్కారాన్ని పొందుతాడు— జడమయిన బుద్ధికి ఆత్మవిచారం చేయటానికి స్వాతంత్ర్యం లేదు— అంచేత ఆత్మే బుద్ధ్యాద్యుపాయాల చేత ఆత్మవిచారంచేసికొని అవిద్యను పోగొట్టుకొని స్వస్వరూపాన్ని (నిజరూపాన్ని) పొందుతాడు— కనుకనే గురువు శాస్త్రము మొదలగు భేదములు ఆత్మరూపములుగావు— ఆత్మజ్ఞానమునకు హేతువులూకావు— ఆత్మకాని, ఆత్మజ్ఞానముకాని, సాధనాంతరమును అపేక్షించదు— కనుకనే గురూపదేశాదులు ఆత్మజ్ఞానమునకు హేతువులుకావు— గురువు పుర్యష్టకరూపుడు— ఆత్మపుర్యష్టకరహితుడు— పుర్యష్టకం నశించినా ఆత్మ ప్రాప్యంకాదు— పుర్యష్టకంతో సంబంధం ఉన్నంతవరకు ఆత్మప్రాప్తి కలగదు— అయితే అంతమాత్రంచేత గురూపదేశాదులు వ్యర్థములు కావు— క్రమంగా (పరంపరగా) ఆత్మజ్ఞానసిద్ధికి కారణములు కాగలవు— మరచిపోయిన కంఠాభరణమును జ్ఞాపక పరచినట్లు గురూపదేశము విస్మృతమయిన స్వస్వరూపమును జ్ఞాపకపరచి ఆత్మలాభమునకు హేతువగును— కనుక ఇలాంటి ఉపాయములచే ఆత్మ అదృశ్యుడూ, అనిర్దేశ్యుడూ అయిననూ అభివ్యక్తుడగును— అయితే యివి ప్రతిబంధక నివర్తకములై పరంపరాసాధనములగును కాని సాక్షాత్ హేతువులు కానేరవు— కాబట్టి వీటికి అకారణత్వము చెప్పబడింది— ఆత్మజ్ఞానమొక్కటే ఆత్మస్వరూపప్రాప్తికి హేతువు— కనుకనే బోధనిరస్తసర్వామంగళుడయిన పరమానందాత్మయే శివుడు— ప్రవృత్తి నిమిత్త సాపేక్షుడు కాడు—

ఈ ప్రపంచం బాధదశలో లేదు— ఆరోపదశలో మాత్రం కలదు— అధిష్ఠానమయిన బ్రహ్మతత్త్వంమాత్రం ఎల్లప్పుడూ ఆకాశంవలె అపరిచ్ఛిన్నంగా కద్రూపంతో— ఇలాంటి అధిష్ఠానచైతన్యమునకే శివ విష్ణు బ్రహ్మ మొదలయిన సంజ్ఞలు కల్పింపబడినవి— నిజంలో చిదాత్మ నిస్సంజ్ఞుడు— ఉపాసకులయిన మముక్షువులకు నిత్యానిత్య (సత్యాసత్య)

వస్తువిచారణ చేసే వారలకు పరమార్థమునకు అతిసన్నిహితమయిన జీవన్ముక్తి మార్గంలో ఉండేవారికి మోక్షంకోరి నిరంతరం ఆత్మోపాసన చేసే భక్తులకు, బోధకోరకూ, తత్త్వజ్ఞానతదుపాయములను శాస్త్రతః నిరూపించుటకొరకునూ, పురాణములయొక్కయు, వేదాంతయొక్కయు, సిద్ధాంతాలనూ బాదరాయణుల సూత్రములు మున్నగువాని సిద్ధాంతాలనూ, సార్థక్యపరచుటకు చిత్ అనీ, బ్రహ్మఅనీ, శివఅనీ, ఆత్మఅనీ, ఈశ్వరుడనీ, పరమాత్మఅనీ నిస్సంజ్ఞకుడయిన చిదాత్మయందు వేరువేరు సంజ్ఞలు కల్పింపబడ్డాయి- కనుక ఓ వసిష్ఠా! ఈచేతనా చేతనమయిన ప్రపంచముయొక్క తత్త్వము బ్రహ్మస్వరూపమే కాని అంతకంటె వేరు కాదు అనే నిశ్చయంతో సుఖంగా ఉండు- బ్రహ్మయందు పేర్లుభేదమే కాని వస్తుభేదం లేదు- ఇలా తెలిసికొని నిత్యం దేవతార్చన చేసుకొనువాడు- పరమపదమును పొందుతాడు- ఆతావున మాబోటి వార్లముకూడా ఆయాపేరులు పెట్టుకొని సృష్ట్యాది క్రియలందు నియతులమై భృత్యులవలె ఉంటున్నామని అన్నాడు ఈశ్వరుడు-

వసి॥ ఇలా అడుగుతాడు వసిష్ఠుడు- స్వామీ! ఆ పరబ్రహ్మయందు జీవభావాది ప్రపంచభేదము లేదుకదా! నిజంలో- ఇది యింత నిజంగా ఉన్నట్లు గోచరించటానికి కారణం ఏమిటి? సంగ్రహంగా చెప్పండి అన్నాడు-

ఈశ్వ॥ ఈశ్వరుడు జబాబు చెపుతారు- మునీంద్రా! బ్రహ్మశబ్దార్థము కేవలసంవిత్తు- అది అతిస్వచ్ఛం- అతిసూక్ష్మం- అణువుకంటె మేరుపర్వతము ఎంతటి స్థూలమో బ్రహ్మకంటె ఆకాశంకూడా అంతటిస్థూలం- ఇంక బ్రహ్మ ఎంత సూక్ష్మమో గ్రహించు-

ఆసంవిత్తు చిదానందైకరసస్వభావంలో ఉండికూడా ఎపుడు వేద్యకల్పనకు అభిముఖమవుతుందో అపుడు చిత్ అనే ఒకానొక క్రియానామమునకు యోగ్యమవుతుంది- ఆపైన క్షణంలో వేద్యభావనచేత అహంతను పొందుతుంది- అనగా "అహమ్" అను పేరును పొందు

తుంది- స్వప్నంలో మగవాడయిన పురుషుడు క్షణంలో అడవియేనుగయినట్లు- ఆపైన దేశకాలభేదంచేత అనేకకల్పనలు పెరిగిపోతాయి- అవిఅన్నీ యీ అహంతకు చెల్లెండ్రు- వాటిఅన్నిటితోటి కూడుకొని స్పందవిజ్ఞానముకలదై జీవఅనే పేరును పొందుతుంది-"జీవప్రాణధారణే" అను ధాత్వర్థానుగమమును బట్టి ప్రాణవాయువును ధరిస్తుంది-తరువాత క్రమంగా నిశ్చయసంస్కారోద్బోధవలన బుధ్యాదిశబ్దవాచ్యముకూడా అవుతుంది- అంతట అజ్ఞానదశలో పడుతుంది- తరువాత కాయిక మానసిక వాచిక సంస్కారం ఉద్బుద్ధమై జ్ఞాన, క్రియా, శబ్దశక్తులతో కూడికొని అదే అహంత పూర్తిగా ఆత్మతత్త్వమును గ్రహింపలేనిదై మనస్సుఅనే పేరును పొందుతుంది అదే సంవిత్తు- ఈమనస్సే అనేక సంకల్పాలకు బీజం- దీనినే ఆతివాహిక దేహమని విద్వాంసులందురు-

ఆపైన అంతస్థమయిన బ్రహ్మశక్తితో (అనావృతసాక్షి రూపంతో) వ్యాప్తమై ప్రమాతృరూపాన్ని పొందుతుంది-

ఇలా అంతఃకల్పనలవల్లనే బాహ్యకల్పనలు ఏర్పడతాయి- అవియెట్లన ?

ఈసంవిదాత్మయొక్క స్వప్రకాశతాబలంవల్ల శరీరానికి వెలుపల వాతసత్త స్పందసత్త, స్పర్శసత్త, త్వక్సత్త, తేజస్సత్త, రూపసత్త, జలసత్త, స్వాదుసత్త, రససత్త, గంధసత్త, భూసత్త, బ్రహ్మాండపిండ సత్త, దేశకాలసత్తాలు ఏర్పడతాయి- ఈసత్తాగణమంతా కలిసి బీజాంకురభావాన్ని పొంది పుర్యష్టకమయింది- ఇదే వాసనారూపంతో ఆతివాహికదేహము- అపరిచ్ఛిన్నమయిన చిత్స్వరూపమే యీపై విభాగములుగా స్ఫురిస్తోంది- మునీంద్రా! ఇదీ ప్రపంచముయొక్క ఆరోపక్రమము- ఇక అపవాదక్రమం చెబుతావిను-

మునీంద్రా! ఇదిఅంతా అజ్ఞానియొక్కదృష్టిలో ఇలా తయారైనట్లు గోచరిస్తూ ఉందికాని తత్త్వదృష్టిలో ఏమీలేదు- చిదాభాసు

నితో వ్యాప్తమయిన ప్రత్యక్షకంకూడా లేనిదే- సముద్రములోని తరంగఫేనబుద్బుదాది విలాసవంటిది యీప్రపంచం- ఇది సంవిద్రూపమని తెలిసికొంటె సంవిదభిన్నమే- సంవిత్తుకంటె భిన్నంగా చూచినచో అచేతనమే- కనుక ఎట్లయినా దీనికి ప్రత్యేకంగా బ్రతుకులేదు- దీనిని తెలిసికొన్నందువల్లనూ ఇది వాస్తవంకాదు- తెలిసికొనకున్నా వాస్తవంకాదు- జ్ఞానాజ్ఞానముల రెంటియందూ దీనిగతి యింతే- ఒకవేళ బ్రహ్మ స్వతః చిన్మాత్రస్వభావముకలదయినా "బహుస్యాం ప్రజాయేయ" అని భగవంతుని సంకల్పంవల్ల తనలోనే (అతనియందే) దృశ్యత్వాన్ని చెందింది- అని అనే యెడల అప్పుడయినా సంకల్పమువల్ల కల్పితమయినందున దీనిని మిథ్యయనక తప్పదు- స్వప్నంలో సంకల్పాత్మకమయిన మనస్సువల్ల కల్పితములయిన వానిని మిథ్యయని అంగీకరించుచున్నాము- అదే ప్రకారం బ్రహ్మ సంకల్పమువల్ల తయారయిన ఈప్రపంచంకూడా మిథ్యకావలసిందే- కాబట్టి పరమసూక్ష్మమయిన పరమాత్మయొక్క చిత్స్వభావంతో సూక్ష్మదేహంతో తయారయి వాసనాభ్యాసంచేత స్థూలత్వాన్ని చెందుతుంది- (అనగా స్థూలమవుతోంది.) క్రమంగా స్థూలదేహసంబంధంవల్ల లోపలనున్న కోశచతుష్టయాన్ని బాహ్యవిషయజాతమునూ స్థూలత్వమును చెందిన ఆబ్రహ్మయే తన కల్పనచే చూస్తోంది- తరువాత హస్తపాదాది అవయవసంఘాతమునందు పురుషాకారభావన కలుగగా పురుషాకృతిని చెందుతోంది- ఆ పురుషాకారశరీరంతో కొన్నిపనులు జరగటం చూచి సంతోషిస్తోంది- పుష్టి చెందుతోంది- కనుక జీవదవస్థాకమయిన (జీవించియున్న) ఈ దేహాన్ని గంధర్వనగరాదులవలె లేనిదయినా ఉన్నదానినిగా చూస్తున్నాడు మానవుడు-

వసి॥ స్వామీ! ప్రపంచం గంధర్వనగరాకారమయినా స్వప్ననరాకారమయినా కాబట్టి ప్రపంచం మిథ్యఅని తెలిసినా అది దుఃఖాన్ని కలిగిస్తోనే ఉంది- కనుక మిథ్యాత్వజ్ఞానమాత్రంచేత దుఃఖానికి చికిత్స

కలిగేటట్లులేదు- దుఃఖం పోవటానికి వేరే మరొకటి కారణం ఉన్నదని అనవలసి వస్తోంది- అదియేదో శెలవివ్వండి! అన్నారు వసిష్ఠులు-

ఈశ్వ॥ మునీంద్రా! జగత్తు మృగతృష్ణాంబుభంగమువలె(ఎండమావులనీరువలె) లేనిదయినా వాసనావశంచేత ఉన్నదానివలె దుఃఖం కలిగిస్తోంది- ఆదుఃఖం పోవాలంటే అట్టి వాసనాక్షయపర్యంతం మిథ్యాత్వనిశ్చయాన్ని దృఢపరచుకోవాలి- ఆపాతమయిన (సామాన్యమయిన) మిథ్యాత్వనిశ్చయంవల్ల దుఃఖంపోదు- ప్రపంచం బొత్తుగా లేదనుకొంటేకాని దానిమీద వాసన పూర్తిగా తొలగిపోదు- కలలోని మానవుడు ఎండమావులనీటిని త్రాగుట సంభవించునా? కనుక లేని ప్రపంచంతో వాసన ఏమిటి? ఎవడికి వాసన? ఎలావాసన? కనుక ప్రమాతృ ప్రమాణ ప్రమేయాది త్రిపుటితో కూడిన ప్రపంచం లేనిదయితే (లేనిదనే భావనసిద్ధిస్తే) అపుడు సత్ పదార్థమయిన బ్రహ్మమొక్కటే మిగిలియుండగలదు- ఆదశలో వాసనాలేదు. వాస్యమూ లేదు- వాసకుడూ లేడు- కేవలీభావము మాత్రమే మిగులును- యక్షకుడు (వేతాళుడు) వ్యావహారిక సత్యుడయినా ప్రాతిభాసిక సత్యుడయినా వివేకవంతుని దృష్టిలో ఎప్పుడు శూన్యుడనే (లేడనే) నిశ్చయం ఉంటుందో! అప్పుడు వానికి కైవల్యమే (అద్వితీయత్వమే) మిగిలి ఉంటుంది- లేనివేతాళునివలె లేనిప్రపంచంవల్లనే యీచిత్తవాసన బయలుదేరుతోంది- అదిపూర్తిగా లేదనే దృఢనిశ్చయం కలిగితే కాని యీవాసన నశించదు- ప్రపంచంలో అహంతయందునూ మృగతృష్ణా జలమందునూ ఎవడు ఆస్థ (ఆదరము) కలవాడగునో వాడికి మోక్షశాస్త్రము ఉపదేశించకూడదు- ఆత్మజ్ఞులు అధికారివిశేషణములు గల వివేకికే జ్ఞానమార్గము నుపదేశించుచున్నారు- అవివేకియై దేహాద్యభిమానములుగల బాలునకు (మూఢునకు) తత్త్వమును ఉపదేశించుటలేదు- అట్లుపదేశించువాడు మేలిమి బంగారమువంటి ఛాయగల తనకూతుని స్వప్నదృష్టమయిన (కలలో కనిపించిన) మగవానికిచ్చిన వాడగును- అని అన్నాడు యీశ్వరుడు-

## ౪౨. పరమాత్మాభిధానము.

వసి॥ స్వామీ! ఆదిసృష్టిలో ఆజీవుడు చిదాకాశమునందుండి శరీరభ్రాంతిని పొంది ఏయవస్థలో పడ్డాడు? సెలవివ్వండి? అని అన్నారు వసిష్ఠులు—

ఈశ్వ॥ మునీంద్రా! స్వప్నపురుషుడు అతిసూక్ష్మతమములయిన నాడులందు అతివిశాలమయిన బ్రహ్మాండమును చూచినట్లు ఆదిజీవుడు పరమసూక్ష్మమయిన చిదాకాశమునందుండిగూడ చూచుచున్నాడు— నాడీఛిద్రముల యొక్క లోపల ప్రవేశించియుండినను చిదాత్మకు ఇలాంటి శక్తి యుండును. అది యిప్పటికి స్వప్నపురుషులందు లోకప్రసిద్ధమై యున్నది— దీనినే ఆత్మయొక్క స్వయంప్రకాశస్వరూపమని అంటారు పెద్దలు. సమష్టిఉపాధిగల హిరణ్యగర్భుడను ఆ ఆదిజీవుడు తన యందును బాహ్యవస్తువులందును నామభేదమునుగూడ పొందగలడు— కనుకనే అతడు సాత్త్విక రాజస తామస కల్పములందు సదాశివుడనీ విష్ణువనీ పితామహుడనీ దుర్గయనీ భైరవుడనీ వినాయకుడనీ మరేనో పేరులను (నామములను) పొందుతున్నాడు.

"సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ" అను శ్రుతి ప్రమాణమునుబట్టి యీ సదాశివాది పురుషులందరూ సంకల్పమయులే కాని వేరు కారు— హిరణ్యగర్భుడు సంకల్పాత్మకుడు కనుక అతనివలన తయారయిన వీరందరుకూడ సంకల్పరూపులే—

బ్రహ్మగారి ప్రథమసంకల్పమే సూక్ష్మభూతసృష్టిద్వారా పుష్టి చెంది తత్కాలసిద్ధమయిన సమష్టివ్యష్టిమనోరూపాన్ని పొంది హిరణ్యగర్భాదిరూపమయి లోకసృష్టి ప్రజాసృష్టి చేయునంతటి సామర్థ్యం కలదయింది— ఈప్రపంచక్రమం అంతా తత్త్వదృష్టిలో అసద్రూపం— భ్రమదృష్టిలో సద్రూపంగా (సత్యముగా) భాసిస్తోంది—

ఏ ఆదిపురుషుడు తాను సృష్టించిన ప్రపంచాన్ని చూచేవా డగుచు (తెలుసుకొనేవాడగుచు) న్నాడో, అతడు నిముషమాత్రంలో చిదాకాశమాత్రాన్ని పొందుతున్నాడు- మళ్ళీ తన నిజరూపాన్ని మరచాడా? క్షణంలో అపారమయిన సంసారంలో పడుతున్నాడు. ప్రతి పరమాణువునందూ, ప్రతి సూదిబెజ్జమంతటి అవకాశమందూ ప్రతిక్షణమందూ కూడా ఒకే సమయమున వాసనావశంచేత అనంతము లయిన సృష్టిలయములు జరుగుచున్నాయి- అవిగా జరుగుచున్నట్లు జీవుల వ్యవహారము జరుగుతోంది- ప్రపంచరూపాన్ని చెందిన జీవులచే ఈసృష్టులన్నీ గ్రహింపబడుచున్నాయి- ఇంతేకాని పరమార్థ చిదాకాశ రూపుడయిన పరమశివునియందు ఈసృష్టిస్థితిలయాలనేవి యేవీ లేవు- ఆదృష్టిలో ప్రపంచంఅంతా చిద్రూపమే-

స్వామీ! సృష్టులు (ప్రపంచములు) పరస్పరతా నిరపేక్షము లయినా స్వసత్తతో కాని, దేశకాలసంబంధివల్ల యేర్పడ్డ సత్తావల్ల కాని ఉండకూడదా? నిజమే! రామా! వాటికి ఆస్థితికూడా లేదు- అవి సత్తులూ కావు- అసత్తులూ కావు- ఏదో ఒకటి నియతమయిన స్వభావ ముగానూ వాటికి లేదు- అనియతస్వభావాలు- సదసద్రూపాలు- అందుచేత సర్గములచే దేశమూ ఆక్రమింపబడ లేదు- కాలమూ ఆక్రమింప బడలేదు. దేశకాలాలుకూడా సృష్టిలో చేరినవే- కనుక సృష్టియొక్క అపేక్ష వాటికీ ఉంది- సృష్టియొక్క అపేక్ష దేశకాలాలకూ, దేశ కాలాల అపేక్ష సృష్టికీ అని అన్యోన్యాశ్రయం పట్టుతుంది- ఆసృష్టికి స్వయంకర్తృత్వం కూడా లేదు- అందుచేత అది మరొకరకమయిన సత్తను (ఉనికిని) కల్పించుకోలేదు కూడా- కాబట్టి సర్గములు సద్రూపాలు కావు- వాటికి సత్త్వం మధ్యలో కల్పించడానికి వీలు లేదు- వైనాశిక మతమునందువలె వాటికి సత్వం క్షణరూపమనటానికి వీలు లేదు- క్షణరూపమయిన సత్త్వం ప్రతీతికాలపర్యంతం ఉండదు- కాబట్టి అత్యంతాప్రతీతం అది- ఎప్పుడూ ఎవనికి ప్రతీతం కాని సత్త్వాన్ని

అంగీకరిస్తే అప్పుడు అలీకపదార్థానికికూడా సత్త్వం అనేది ఒప్పవలసి వస్తుంది- కాబట్టి రామా! ఈప్రపంచంలో పుట్టిందీలేదు- చచ్చిందీ లేదు- సర్వమూ సంకల్పరూపంచేత చైతన్యముయొక్క చమత్కారమే యిది- కలలోని పట్టణనిర్మాణం వంటిది ప్రపంచసృష్టి- దాని నాశంవంటిది ప్రపంచనాశం- సంకల్పశైలానికి (మనోరథశైలానికి) దేశకాలాదులతో యెలాంటి సంబంధమో అలాంటి సంబంధమే ఈ ప్రపంచానికికూడా- ఉన్నతమయిన సంకల్పశైలం (మేరుశైలం) దేశకాలాదులను ఆక్రమించకుండానే సంకల్పసమయంలో ఆక్రమించి నట్లు ప్రతిభాసిస్తోంది- అలాగే ప్రపంచపరిస్థితి అంతా- పురుష కీట స్థావరాదుల జన్మవైచిత్ర్యమంతా సంకల్పానుసారంగానే జరుగుతోంది- జరాయుజాండజాది నాలుగు విధములయిన జీవరాసులూ ఇంతే- రుద్రుడు మొదలుకొని తృణపర్యంతమయిన (శివుడు మొదలు గడ్డిపోచ వరకు నుండు) జీవరాసులందరూ మాయాధిష్ఠాత అయిన పరమాత్మ యొక్క సంకల్పక్షణమందే ఉన్నారు- సూక్ష్మవాసనవల్ల పరమాణు రూపంగా ఉంటారు- కొంచెం స్థూలవాసనవల్ల త్రసరేణువులుగా (త్ర్యణుకాలుగా) ఉంటారు- వర్తమాన సృష్టివలెనే అతీతానాగత సృష్టులన్నీ జరుగుతూ ఉంటాయి-

పరమార్థ తత్త్వసాక్షాత్కారంచేత రుద్రాది తృణాది పదార్థాలకు ఉపశాంతి (నాశము) కలుగుతోంది- ఒక్కనిమిషం మాత్రమంత కాలం చిదాత్మకు బహిర్ముఖంగా ఉంటే కొన్నికోట్లకల్పాలు విస్తృత మయిన (అనుభవింపతగిన) అనర్థం తయారవుతుంది- చైతన్యము యొక్క స్వరూపప్రతిష్ఠయే బ్రహ్మత్వము- అభిమానం ప్రపంచంమీద పెరిగినకొద్దీ సృష్టి (ప్రపంచం) ముదురుతుంది- చిదాత్మయొక్క వికాసం తగ్గుతుంది- ఆత్మకు నీచత్వమున్నూ పటుతుంది- అసత్యము లయిన దిగ్దేశకాలాదులతో సంబంధించేసరికి ఆత్మకు మిక్కిలి క్షుద్ర త్వం ఏర్పడుతోంది- లింగశరీరసంబంధంచేత బ్రహ్మ జీవత్వాన్ని

పొంది దేహేంద్రియాదుల వలలోపడి మృగమో, లతయో, కీటమో, దేవతయో, అసురుడో అవుతాడు—

గట్టి దారంమీద పూలమాల కూర్చబడి యున్నట్లు ప్రపంచం అంతా సర్వవ్యాపకమయిన బ్రహ్మ అనే సూత్రంమీద గ్రథితమై (కూర్చబడి) ఉంది. వివేకంకల మానవునికి సర్వదిక్కాలాది పరిచ్ఛేద రహితమయిన బ్రహ్మతత్త్వం దూరంకాదు— దగ్గరకాదు— పైదికాదు— క్రిందదికాదు— పూర్వపుది కాదు— ఇప్పటిది కాదు— ప్రొద్దుటిది కాదు— ఉన్నదీ కాదు— లేనిదీ కాదు— అంత్యమూ కాదు— మధ్యమమూ కాదు— ఈవిషయమున వసిష్ఠా! అనుభవమే ప్రమాణం—

వసిష్ఠా! నీవడిగిన దానిని చెప్పితిని— నీకు శ్రేయస్సు కలుగు గాక— మేము మా నివాసానికేగెదము— లేచి రమ్ము పార్వతీ అని అన్నాడు శివుడు—

వసి॥ రామా! ఇలా రుద్రుడు నాతో చెప్పి నేను పూలు దోశెలితో చల్లుచుండగనే ఆతని పరివారంతో సహా అంబరవీధి కెగిరిపోయాడు శివుడు— త్రిభువనాధిపతి అయిన సదాశివుడు అంతర్ధానం కాగానే ఆయీశ్వరుని స్మరించుకుంటూ క్షణకాలం ఉండి ఆయనగారు నాకు ఉపదేశించిన నిత్యాపరోక్ష దేవార్చనమును అంగీకరించాను— ప్రాక్తనమయిన జడదేవార్చనాన్ని విడువదలచాను— అని అన్నాడు వసిష్ఠుడు—

## 43. విశ్రాంతివర్ణనము.

### శ్రీరాముడు విశ్రాంతిని గైకొనుట.

వసి॥ రామా! శివుడు ఇలా చెప్పాడు— నాకును ఇలాగే తెలుసు లోగడ— నీకును తెలుసు ఇదిఅంతా. అలీకమయిన మాయయందు అలీకోపాధితో ఏర్పడిన జీవుడు అలీకమయిన ప్రపంచాన్ని చూస్తు

న్నాడు- ఒకానొక కవిబ్రహ్మ ఒకానొకరాజును మహామేరుపర్వతంగా కాని, కల్పవృక్షంగా కాని వర్ణిస్తాడు వివిధ భావకల్పనలతోటి- అలా ఒక కావ్యంకూడా రచిస్తాడు అనుకో- అది అంతా ఆరాజువిని తాను మేరుపర్వతంఅనికాని,కల్పవృక్షంఅనికాని, నిజంగా కాదన్నా భావించుకుంటాడు. స్వయంగా అనుభవించుకుంటాడు- అలాంటి అనుభవమే ఆరాజుకు లేకపోతే ఆకావ్యార్థానుభవంవల్ల అతనికి చమత్కారాస్వాదం కలుగుతుంది- అతనికి అలాంటి చమత్కారమే కలగకపోతే ఆరాజువల్ల ఆకవికి యెక్కువగా డబ్బు ఎలాలభిస్తోంది ? గౌరవం యెలాకలుగుతోంది! లోకంలో ఇది అనుభవంలో ఉన్న విషయమే- కనుక ఆకవి కల్పన ఎలాంటిదో ఈప్రపంచ కల్పనకూడా అలాంటిదే- ఇందులో సందేహంలేదు- ఇలాంటికల్పన అజ్ఞాతుడయిన ఆత్మకు నీటికి ద్రవత్వ వలెనూ, గాలికి చలనవలెనూ, ఆకాశానికి శూన్యత్వమువలెనూ సహజమయింది-

ఇలా స్వాభావికమయిన వికల్పాభ్యారోపానికి అర్చనచేస్తున్నాననే చింతన అప్పటినుంచి యిప్పటిదాకా నేనుచేస్తూనేయున్నాను. ఇప్పుడు ప్రశాంతంగా అర్చావిధానంతో రోజులు అలా గడుపుతూనే ఉన్నాను- యథాప్రాప్తములయిన క్రియలతోను, ఆచారముతోను, పూజాది ద్రవ్యాలతో పూజచేస్తూనే యున్నాను- దానికి ఎడతెరిపి లేదు- ఒకవేళ సుషుప్తిదశలో వ్యుచ్ఛిన్నమయినట్లు కనిపించినా అప్పుడుకూడా "సుఖమహమస్వాప్సం నకించిదవేదిషం" అని నిద్రనుండి లేచినవానియొక్క ప్రత్యభిజ్ఞకు కారణమయిన అవిద్యావృత్తి పుష్పత్రయార్చన ఉండనే ఉంది-

అయితే ఇలాంటి శివార్చనము అజ్ఞానులకుకూడా ఎప్పుడూ ఉందికనుక మీకు వాళ్ళకంటె విశేషమేమిటని అడగవచ్చు నీవు- సమస్తప్రాణులకు గ్రాహ్యగ్రాహక సంబంధం సామాన్యమే- అయినా యోగికి అందు సావధానత్వం ఉంటుంది- మిగిలిన అజ్ఞానులకు అలాంటి

సావధానత ఉండదు- ఇదేవిశేషం అజ్ఞానులకంటె యోగులకు- సావధానత అంటే అసక్తిలేకుండుట- అనగా ఫలేచ్ఛ లేకుండుట- కనుక రామచంద్రా! నీవుకూడా ఇదే దృష్టిలోఉండి సంగరహితమయిన చిత్తంతో సంసారాటవిలో విహరించు- ఖేదపడకు- ధనవియోగంకాని, బంధువియోగంకాని తటస్థించి వాటివల్ల గొప్పదుఃఖం సంభవించినపుడు యీదృష్టిని ఆధారంచేసికొని విచారించు- ధన, బంధ్వాదుల ఉదయక్షయములందు సుఖదుఃఖాలకు తావు యియ్యకూడదు- సాధారణంగా సంసారపరిస్థితులే ఇలాంటివి- విషయాలయొక్క మోసగింప పద్ధతి నీకు తెలియనిదికాదు- ప్రాపంచిక విషయాలు మొదట వస్తాయి- తర్వాత పోతాయి- పురుషునకు తమమీద కొంత వ్యసనాన్ని కలిగించి పరిభవిస్తాయి- ప్రేమలు ధనములు కూడా ఇలాగే అవిచారితంగా నిమిత్తం లేకుండగనే వస్తూఉంటాయి పోతూఉంటాయి- ఓ నిర్మల స్వరూపుడా ఈప్రపంచ వ్యాపారాల పరిస్థితికూడా ఇంతే- వాటిలోపల నీవూలేవు- నీలోపల అవీలేవు- అవిఅన్నీ తుచ్ఛములు- ప్రపంచము యొక్క పరిస్థితి ఇలాంటిదే-ఎందుకూ వ్యర్థంగాపరితపిస్తావు-

నీవు జగత్తు తుచ్ఛమని నమ్మలేకపోతే నీవే జగత్తు అని అనుకో- అపుడు నీఅవయవాలు మారుతూ ఉంటే నీకు హర్షశోకాలు ఎలా ఉండవో అలాగే జగత్తు మారుతున్నా నీకు హర్షశోకాలకు ప్రసక్తి ఉండదు- ఇలా చిన్మయమయిన సంసారసముద్రంలో చిచ్చక్రము తిరుగుతున్నా సముద్రంలో తరంగాలు తిరుగుతున్నా హర్షశోకములు పొందవలసిన పనియుండదు- కనుక రామచంద్రా! ఇప్పటినుంచి నీవు సుషుప్తిదశలోవలె చిదేకరసుడవను భావంలో ఉండి తురీయావస్థను పొందు- వైషమ్యాలన్నిటినీ విడిచిపెట్టు- ఈఆభాసప్రపంచం బ్రహ్మస్వరూపమని గ్రహించు- ఆత్మార్చనచేసికొంటూ పరిపూర్ణసముద్రునివలె ఉండు-

రామా ! మొదట విచారప్రారంభంలో నీవడిగిన ప్రశ్నలకు ఇంతవరకు సమాధానాలు చెప్పితిని- ఇంకేమయినా మిగిలిఉంటే అడుగు అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ బ్రహ్మర్షీ! నాసంశయము పూర్తిగా తొలగిపోయింది- తెలిసికొనతగిన దానిని తెలిసికొన్నాను- తృప్తి కలిగింది- మునీంద్రా! ఇంక నాకు అజ్ఞానం లేదు- జీవబ్రహ్మభేదమూ లేదు- చైత్యమూ (జడప్రపంచమూ) లేదు- మనస్సూ లేదు- ఇంతకుమునుపు నాకు ఈప్రపంచమనే కలంకం ఆత్మకు సహజంగా కలదనే భావం అజ్ఞానంచేత ఉండేది- ఇపుడు అదిపోయింది నీ అనుగ్రహంవల్ల ఆత్మ పుట్టేవాడు కాడు- మరణించేవాడు కాడు- కలంకితుడు కాడు- ఈప్రపంచం అంతా బ్రహ్మవివర్తము- అనే భావం ఇపుడు స్పష్టపడింది- నాచిత్తం ప్రశ్నల నుండి విముక్తమయింది- సర్వసంశయాలనుంచీ నిర్ముక్తమయింది- సమస్తకోరికలనుంచి నిర్ముక్తమయింది- నాచిత్తం తంకుడు యంత్రంలో పెట్టి ఒరసినట్లు అతినిర్మలమయింది- సమస్తాచారాలను గురించిన ఉపదేశాలను మీవల్ల పొందాను- ఇపుడు నిరాకాంక్ష కలిగింది- నాకింక దేనిమీద ఆశలేదు- నాకు ఈప్సితమయిన దేదీ లేదు- హేయోపాదేయమయినదీ లేదు- ఉపేక్షింపతగినదీ లేదు- ఈభావాలన్నీ నాకు శాంతించాయి- నేను రౌరవనరకం ద్వేషించను- స్వర్గాన్ని కోరను- స్వస్వరూపంలో ఉండిపోతాను- ఇంతవరకు శ్రీరామ చంద్రుడనే మందరపర్వతాన్ని ముల్లోకములనే క్షీరసాగరంలో త్రిప్పి త్రిప్పి కావలసిన బోధామృతాన్ని పుట్టించావు- నేను కృతార్థుడ నయినాను- ఇంక ప్రశాంతంగా ఉంటాను-

మునీంద్రా ! ఇది అవస్తువు- (అసత్యం) ఇది వస్తువు-(సత్యము) అనే జ్ఞానం నాచిత్తంలో అణుకువని పోయింది- ఎవని చిత్తంలో ఈజగత్తు ఇలా ఉన్నదని (కనిపించే జగత్తు కనిపించేటట్లు నిజంగా ఉన్నదని) భావం ఉంటుందో వాడి చిత్తం (మనస్సు) సందేహాలలో

మండిపోతూ ఉంటుంది— అలాంటి మూఢపురుషుడు ప్రపంచంలో ధనాది భోగాలయందు కార్పణ్యం వహిస్తాడు— అలాంటి భోగపదార్థాలు మాబోటివాళ్ళకు తత్త్వదృష్టిలో గోచరించనే గోచరించవు— కారణం ఏమంటే మహాత్మా! మేము అశనాయాపిపాసాదిలక్షణమయిన (ఆకలి దప్పికల రూపమయి) పదార్థాలతో నిండి నిబిడీకృతమయియున్న భవసాగరంనుండి మీఅనుగ్రహంచేత ఉత్తీర్ణులమయినాము— సంపదల యొక్క సీమ (అవధి) అంతుచిక్కింది— ఆపదలయొక్క సీమకూడ తెలిసింది— సర్వసారమయిన భూమానందంలో కూడా మాకు దైన్యం లేదు— అదీ మాకు నిత్యలబ్ధమే— కాబట్టి పరిపూర్ణులము— మామనస్సు ఈ సంసారమనే సమరం (యుద్ధం) లో ఆశఅనే మత్తమాతంగాన్ని (మదపుటేనుగును) భేదించి ఇతరులచే భేదింపసాధ్యంకాని రణవీరుడని పించుకుంది—

మునీంద్రా! మామనస్సులోని వికల్పాలన్నీ రూపుమాసి పోయి నాయి— వాంఛలన్నీ నశించాయి— దైన్యమనే భావం అడుగంటింది— మూడులోకాలలో నిర్మలములయినవని ప్రసిద్ధిచెందిన పూర్ణచంద్రుడూ క్షీరసాగరమూ, శరత్కాలఆకాశమూ మొదలయిన వాటికంటె అతి నిర్మలమయింది మామనస్సు— కనుకనే పరిపూర్ణానందంతో సర్వోత్కృష్టంగా ఉంది— అని అన్నాడు శ్రీరాముడు—

## ౮౮. అసంగాద్యుపాయములనుబోధించుట.

వసి॥ స్థూణానిఖనన్యాయంచే జీవన్ముక్తదశను దృఢపరచుటకు వసిష్ఠుడు మరల అసంగాద్యుపాయాలను జెప్పుచున్నాడు—

రామచంద్రా! మనస్సులో ఫలవాంఛలేకుండా కర్తృత్వాభిమానం లేకుండా కేవలము ఇంద్రియాలతో ఎన్నివిషయాలు (ప్రాపంచికభోగాలు) అనుభవించినా అనర్థంరాదు— వస్తువు ప్రాప్తించిన క్షణంలోనే తృప్తికాని మరుక్షణంనుంచి అది దుఃఖకారణమే— ఈ

విషయం అందరకీ అనుభవంలో ఉన్నదే-కనుక "విషయాలు తృప్తిని కలిగిస్తాయి- అందువల్ల వాటిమీద రాగమును (వాంఛను) మేము వదలలేము" అని అనుకొనుట మూఢుల లక్షణం- కాబట్టి చిరకాలం అనర్థాన్ని యిచ్చి క్షణకాలం సుఖాన్నియిచ్చే భోగాలను కోరగూడదు- దేనిమీదా ఆసక్తి లేకపోవడమే సుఖానికి కారణం- దీనివల్ల వస్తులాభ ప్రయుక్తమయిన క్షణికమయిన వాంఛానిరోధమే సుఖహేతువయితే ఆత్యంతికవాంఛోచ్ఛేదము నిరతిశయానందహేతువని అర్థాత్ సిద్ధిస్తుంది-

రామా! నీవు పూర్ణానందాన్ని పొందావు- నీకు లౌకికవిషయాల యందు వాంఛ లేదు- కనుక నీకీవిషయం మళ్ళీ ఉపదేశించవలసిన పనిలేదు- కాని యెప్పుడయినా కాలవిపర్యయంవల్ల మళ్ళీ అహంభావమనే పంకంలో (బురదలో) ప్రవేశిస్తావేమో అని నీకు మళ్ళీ మళ్ళీ యీవిషయం ఉపదేశిస్తున్నాను- అయితే "యిలా మళ్ళీ మళ్ళీ గట్టి పరిస్తే మాత్రం నేను అహంభావ పంకంలో పడనని నియమమేమున్నది? ఇలా యెన్నిసారు లుపదేశించినా కాలవిపర్యయంవల్ల పడవచ్చుకదా!" అని నీకు ఉండవచ్చు- అలాకాదు- ఆత్మజ్ఞానంఅనే మేరుపర్వతం యొక్క శిఖరం యెక్కినవాడు మళ్ళీ అహంభావమనే గోతిలోపడడు- సత్యజ్ఞానానందస్వరూప జ్ఞానమనే మేరుపర్వతాన్ని అధిష్ఠించినవాడు మాతృగర్భప్రవేశమనే పాతాళంలో పడడు-

లేకపోతే ఇదంతా నేను నీకోరకు చెప్పటంలేదు- దీనివల్ల ఇతరులకు ఉపకారం కలగవచ్చునని చెబుతున్నాను- నీకు అజ్ఞానం నశించింది- ఆసంగతి నేను నీచిహ్నాలనుబట్టి గుర్తించాను- పూర్ణార్ణవము వలె నీమనస్సు నిర్మలమయింది- సర్వసమమయింది- నీవు స్వస్వరూపంలో ఉండిపోయావు- అసంగములో జీవించుచున్న నీకు ఆశ నిరాశతను జెందుగాక- భావన అభావనను పొందుగాక-మనస్సు అమనస్త్వమును పొందుగాక- నీకు కనిపించే ప్రతివస్తువునందూ సత్తాసామాన్య

రూపంతో చిద్ఘనమయిన బ్రహ్మ నిండిఉంది— అజ్ఞాతాత్మ లోకంలో బద్ధుడవుతాడు— విజ్ఞాతాత్మ బద్ధుడుకాడు. కనుక రామచంద్రా! మననాదులను దృఢపరచుకొని ఆత్మబోధను వృద్ధిచేసికో— భోగ సుఖాన్ని వాంఛించకుండా ప్రారబ్ధోపనీతమయిన దుఃఖాన్ని అనుభ విస్తూ ఉండటమే అవాసనత్వము— (అనగా వాసనాక్షయం) వాసనా రహితములయిన యింద్రియాలతో వ్యవహరించు— ఎన్నిసంక్షోభాలు వచ్చినా వికారాన్ని చెందవు— జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు ఏకాత్మభావ నతో చూచేవాడు భవసాగరంలో మరల జన్మించడు.

మనస్సు విప్పితే సంసారం— దానిని ముడిస్తే సంసారనాశం వాసనాక్షయంవల్లనూ, ప్రాణనిరోధంవల్లనూ మనోనాశాన్ని కలిగిం చుకో. ప్రాణవాయువుయొక్క ఉన్మేషనిమేషాలవల్ల కర్మలకు ఫల మోదయాలు కలుగుతాయి— అనగా ప్రాణవాయువు ఉన్మేషచెందితే కర్మలకు ఉదయం. అది నిమేషచెందితే కర్మలకునాశం— కనుక కర్మ క్షయం కావాలంటే అభ్యాసవైరాగ్యాలవల్ల దానిని ఉన్మేషరహితం చేసికో— అజ్ఞానం పెరిగితే కర్మ పెరుగుతుంది— అది తగ్గితే కర్మ తగ్గు తుంది— నశిస్తే కర్మ నశిస్తుంది— కనుక నీపురుషప్రయత్నంచేతనూ, గుర్వనుగ్రహంవల్లనూ, శాస్త్రార్థమననంవల్లనూ జ్ఞానాన్ని దృఢపరచు కొని అజ్ఞానాన్ని రూపుమాపుకో.

లోకంలో గాలియొక్క సంబంధవల్ల ఆకాశం కదులుతున్న ట్లునూ, పరాగంయొక్క సంబంధవల్ల మలినమయినట్లునూ యెలా అను కుంటున్నారో అలాగే చైతన్యమునకు చిత్తలక్షణమయిన చలనమువల్ల చైత్యములనే అనర్థజాతం పుట్టుతోంది— దృశ్యదర్శనముల యొక్క సంబంధంవల్లనే జగద్వ్యవహారము— గవాక్షాది ఛిద్రాలకుండా సౌరాలోకం (సూర్యునికి కిరణప్రసారం) బయలుదేరి గోడతో కలుసు కునేసరికి గోడకు ఒకవిధంగా తెలుపువర్ణంకాని మరొకవిధంగా చిత్ర వర్ణంకాని పుట్టుతుంది— దృశ్యదర్శనములకు సంబంధమే లేకపోతే

ప్రపంచం వ్యవహారమే లేదు- చిత్రవులో వ్రాయబడిన బొమ్మల హృదయంలో భావన లేనట్లు- చిత్తస్పందమువల్ల పుట్టిన మాయ చిత్తస్పందము లేకపోతే లయిస్తుంది- పయస్పందంవల్ల పుట్టిన వీచి (తరంగము) పయస్స్పందము (నీటిచలనము) తగ్గితే తగ్గుతుంది- వాసనాక్షయ, తత్త్వజ్ఞాన మనోనాశాలవల్ల చిత్తం నిశ్చలమయితే ఇంక ప్రపంచ వ్యవహారస్పందమే లేదు-వృత్తి నిరోధంవల్ల చిత్తం అచిత్తం అవుతుంది- ప్రాణనిరోధం వల్లకూడా చిత్తం అచిత్తం కావచ్చు- విషయేంద్రియాల యొక్క సంబంధంవల్ల కలిగే సుఖమూ పారమార్థికమయిన బ్రహ్మ సుఖమే- అందుకు "ఏతస్యైవానందస్య అన్యాని భూతాని మాత్రా ముపజీవంతి" అను శ్రుతి ప్రమాణము- ఈమానుషానందం మొదలుకొని ఆబ్రహ్మానందంవరకు బ్రహ్మదృష్టిఉంటే మనఃక్షయం (మనోనాశం) కలుగుతుంది- ఎక్కడ చిత్తంపుట్టదో (ప్రవర్తించదో) అదే బ్రహ్మ సుఖం- అది స్వర్గాదులలో లేదు- మేరుపర్వతం మీద లేదు- సరస్సులో ఉండదు- అలాంటి బ్రహ్మసుఖం క్షయాతిశయములతో కూడింది కాదు- ఆత్మబోధవల్ల చిత్తనాశం కలుగుతుంది- దుర్బోధవల్ల (ఆత్మాజ్ఞానంవల్ల) చిత్తం విజృంభిస్తుంది-

అయితే జ్ఞానులకుకూడ లోకవ్యవహారం ఉంటోంది- కనుక చిత్తం ఉన్నదని నీవు అనుకుంటావేమో అలా ఉన్నట్లు గోచరించినా అది జ్ఞానంవల్ల నశించి ఉంటుంది- బంగారంగా తయారుచేసిన రాగి బంగారంలాగ గోచరించినా అది బంగారం కానట్లే-

జ్ఞానియొక్క చిత్తం చిత్తముకాదు- అచిత్తమె సత్త్వమని చెప్పబడుతుంది- జ్ఞానంవల్ల ఆచిత్తం పేరునకూ, అర్థానికీ భిన్నమవుతుంది తామ్రసువర్ణమువలె- ఆత్మబోధవల్ల భ్రాంతి నశిస్తుంది-భ్రాంతి నాశంవల్ల చిత్తనాశం కలుగుతుంది- కాబట్టి అది లేనిదికాని ఉన్నది కాదు- ఉన్నదానికి స్వరూపనాశం సంభవించదు- కాబట్టి శ్రీరామ చంద్రా! చిత్తాదులు శశశృంగాదులవలె అవస్తువులేకాని వస్తువులు

కావు- చిత్రము మొదలగు వస్తుజాలమంతా ఆత్మయొక్క వివర్తము- కాబట్టి జీవన్ముక్తుల చిత్తముయొక్క వ్యావహారిక దశకూడా వాస్తవికంకాదు- అయ్యది బాధితానువృత్తిదశ- హృదయంలో మనోరథ పరికల్పితమయిన ప్రాసాద ఉపవన వాప్యాదుల సన్నివేశము యెలా లేదో అలాగే పరమసూక్ష్మ మయిన అచ్ఛిద్ర చిదేకరసమయిన బ్రహ్మయందు గూడ జగత్తు సమావేశం కావటానికి వీలులేదు- కాన అదిలేదు-

## ౭౫. బిల్వోపాఖ్యానము.

వసి॥ రామా ! ఈయర్థమునందు నీకు సులువుగా బోధపడుటకు అత్యాశ్చర్యమయిన క్రొత్తకథ ఒకటి చెబుతావిను- దీనిపేరు బిల్వాఖ్యానమని అంటారు పెద్దలు-

పూర్వకాలంలో ఒక బిల్వఫలం (మారేడుపండు) ఉండేది- వెయ్యామడ వైశాల్యముగలది ఆపండు- అతి నిర్మలమయింది- ఎన్ని యుగాలు గడచినా కుళ్ళనిదీ, ఎండనిదీ అది- అమృతంకంటె మించిన మాధుర్యరసంకలది- కంటికీ వంటికీ సుఖమయిన స్పర్శనిస్తూ బాలేందువువలె అతిసుందరంగా ఉండేది- భువనవ్యూహానికి మధ్యఉన్న మహామేరువు వంటిది- మందరాద్రివలె చలించనిదీ, దృఢమయినదీని, ప్రపంచాన్ని నిలబెట్టటానికి ఆధారమయిందా యేమి అన్నట్లు దానిమూలం అంతవిశాలంగా ఉండేది- అత్యున్నతం, అతివిశాలం- ఆబిల్వఫలం దానిదగ్గఱ ఈ బ్రహ్మాండాలన్నీ కొండక్రింద ఆవగింజల పంక్తివలె ఉండేవి- షడ్రసాలు ఆపండులో అనుభవగోచరమవుతూ ఉండేవి- దానిరసం ఎప్పుడూ స్రవిస్తూ ఉండేది- ఎంతపచ్చగా పండినా అది నేలమీద పడేదికాదు- తొడిమ నంటుకొనిఉండి ఎండిపొయ్యేదీకాదు- ఎంతపండినా ఆపండుకు ముదిమే కనిపించేదికాదు-

చిరాయువులగు బ్రహ్మవిష్ణు రుద్రాదులలో ఎవ్వరూ దాని పుట్టుకా తెలసికోలేదు- దాని మూలమూ తెలిసికోలేదు- దాని

తొడిమనూ తెలిసికోలేదు- ఆ చెట్టుయొక్క అంకురావస్థ తెలియదు ఎవరికీ- ఆపండుయొక్క పూతా తెలియదు- దాని వేరూ తెలియదు- ప్రమాణమూ తెలియదు- దాని శాఖలూ (కొమ్మలూ) తెలియవు- ఒకే పిండమువలె అతిస్థూలమయిన ఆకారంకలిగి ఉండేది- దాని ఉత్పత్తి కాని పరిణామంకాని యెవ్వరికీ తెలియదు- అన్ని పండ్లలోను సార మయిన యీపండుకు విత్తనం ఎక్కడా లేదు- నిర్వికారం నిరంజనం పెద్దరాతివలె అతిఘనంగా ఉండేది- చంద్రబింబంవలె నిరతిశయా నందరసాన్ని స్రవిస్తూ ఉంటుంది- మానుషానందాలన్నిటికీ హైరణ్యా గర్భానందంవలె సకలసౌఖ్యాలకూ ఇది కోశంవలె ఉంది- హైరణ్యా గర్భానంద ఫలంకంటెకూడా దీనిసారం అధికంగా ఉండేది- త్రివిధ పరిచ్ఛేదశూన్యస్వభావంతోనే రక్షింపబడింది యీబిల్వఫలం- ఇది ప్రపంచంలో అద్వితీయం-

ఇలాఉంటూ పారమార్థికమూ, లోకవిలక్షణమూ, అయిన తన ఆకారవిశేషాన్ని విడిచిపెట్టకుండగనే తన చమత్కారంచేత తన యందు భేదభావాన్ని కల్పించుకొని పరమ ప్రయోజనాన్ని పొందింది. తాను భేదభావాన్ని భావించుకుంది- తన స్థౌల్యాన్ని (లావుతనం) విడిచిపెట్టలేదు- అయినా అణువుకంటె అణువయింది- అలాగే మహత్తుకంటె కూడా మహత్తు అయింది- తాను ఎంతోకాలంనుంచి ఉన్నా బుద్ధ్యాదివికారాలను అనుసరించి అతిబాల (చిన్నది) అయింది- అజ్ఞానం (అవిద్య) వల్ల తనయందు లేనిభేదభావాన్ని కల్పించుకుంది- భూతాలు కల్పించుకుంది- భువనాలు తయారుచేసుకుంది- అహం భావాన్ని కల్పించుకుని వ్యష్టిసమష్టిశరీరాలు కల్పించుకొని వాటియందు అభిమానాన్నికూడా చెందింది- రామా! ఇలా అది తన స్వస్వరూ పాన్ని విడువకుండగనే చిచ్ఛక్తిస్వరూపాన్ని చెందింది తన సహజ చమత్కారంచేత- మళ్ళీ ప్రపంచాకారమయిన ఈదృష్టిని అంతా తన నిజమయిన నిర్వికారరూపంలో ప్రసరింపచేసింది- ప్రవేశపెట్టింది- ఇలా

అనుకుంది-"మహావిశాలమయిన ఈఆకాశం ఈచైతన్యమే- కాలమూ ఇదే- కర్మమూ ఇదే- (స్పందరూపమయిన క్రియా ఇదే)- ఇదంతా సంకల్పవిస్తారం- భ్రాంతిమయం- రాగద్వేషాలస్థితి- ఇదే హేయోపాదేయబుద్ధి "ఇదీ, అదీ, నాదీ" అనే బుద్ధులన్నీ దీనియందు కల్పితములే- పైనఉన్న బ్రహ్మాండాలు దిగువన ఉన్న బ్రహ్మాండాలు ముందూ, వెనుకా, ప్రక్కన, దూరమూ, దగ్గరా జరుగుచున్నదీ, జరగబోయేదీ, జరిగినదీ ఇదంతా (ఈభావాలన్నీ) అనంతములయిన కల్పనావిశేషాలచే తయారయినవే లోపల (మనస్సులో) ఈజీవులందరూ ఇలాంటి కల్పనలకు ఆలయాలు- ఈనభోవీధి సర్వతో వ్యాప్తమయిన మహారుద్రగణములతో నిండిఉంది- ఇది స్వర్గంనుంచి జారి పడుచున్న (పుణ్యం అయిపోగా క్రిందికి జారుచున్న) పుణ్యవంతులతో (స్వర్గులతో) ప్రకాశిస్తూ ఉంది- ఇక్కడ ఉత్తరదిక్కున ప్రపంచం అనే పద్మంయొక్క మొగ్గవలె ఉంది మేరుపర్వతం-చంద్రకిరణామృతంమీద లంపటులయిన (ఆసక్తులయిన) దేవతలు తుమ్మెదలవలె ఉన్నారు ఆపద్మంమీద- ఇక్కడ ప్రపంచంఅనే ముసలిచెట్టుయొక్క పరిమళం గల పూలగుత్తివలె ఉంది స్వర్గం- ఈచెట్టుకు రజోగుణ కార్యములయిన రాగద్వేషాదులు వ్రేళ్లు- నారకములయిన దుఃఖాలు కూడా వ్రేళ్లే- ఆకాశమనేది ఒకకొలను- ఇందులో నక్షత్రాలు కింజల్కాలు- బ్రహ్మార్ణవముయొక్క ఒడ్డున (దగ్గర) ఉంది ఇది- దీనిలోతు అంతు లేదు- ఈవల ఆవల గట్టుకూడ అంతులేవు- కాలమనేది ఒకసరస్సు- ఇందులో కర్మలనేవి మొసళ్లు- మాస ఋతు పక్ష తిథి వార నక్షత్రాలనేవి తరంగాలు- భూతపరంపరలనేవి సుడిగుండాలు- ప్రాణులయొక్క ఆయుఃపరిమాణంతో విస్తరించి ప్రసరిస్తూ ఉంటుంది- అగ్ని ఆదిత్య చంద్రులు కింజల్కాలు- ఆకాశమనేది యిందులోని పద్మం- శాస్త్రార్థ విజ్ఞానాలన్నీ భావవికారాలతో ప్రకాశించేవి- జరామరణములను సూచించేవి- విద్యావిద్యావిలాసాలతో ఒప్పుచుండేవి- ఇదంతా ఆచైతన్యముయొక్క చమత్కారం- అని అనుకొని శాంతించింది

ఆబిల్వఫలం- స్వస్థంగా ఉంది- నిరాబాధగా ఉంది- ఈభావనల నన్నిటినీ విడిచిపెట్టింది- నిర్వికారంగా ఉంది-

కాబట్టి రామచంద్రా! ఈచిచ్ఛక్తి ఏకమే- అయినా వివిధముగా భాసిస్తూ ఉంటుంది- అది నిజంలో ఏకమూకాదు- వివిధమూకాదు- ఏకత్వమూ అదే- ఏకమూ అదే- వివిధత్వమూ అదే- వివిధమూఅదే- ద్వైతవికారంఅంతా శాంతించటంచేత ఏకరూపంగా ఉంటుంది- సర్వాత్మకమగుటచే ఇదే అతి మహాత్తుగాకూడా ఉంటుంది అన్నారు వసిష్ఠులు-

## ౭౩. శిలోపాఖ్యానము.

శ్రీరా॥ మునీంద్రా! మీారు సర్వప్రపంచంలోని సారం గుర్తించిన మహానుభావులు- బిల్వరూపంతో మహాచైతన్యముయొక్క సత్తాను వర్ణించి చెప్పినారని నాయభిప్రాయం- ఈప్రపంచం అంతా చిద్ఘనమయిన బ్రహ్మస్వరూపం- అహంకారాదులవల్ల విస్తృతమయింది- కనుక బ్రహ్మప్రపంచములకు భేద మేమాత్రమూలేదు- అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామచంద్రా! ఈప్రపంచసృష్టి చైతన్యమనే బిల్వముయొక్క పరిణామంకాదు- పరిణామమయితే చైతన్యమునకు అనత్యము సంభవిస్తుంది- కనుక ప్రపంచం అనేది చైతన్యముయొక్క వివర్తరూపమయిన చమత్కృతి- రాతిలో శిల్పి మనస్సులో కల్పితమయిన పద్మవనము యొక్క సన్నివేశము వంటిది- ఈవిషయంలో సీకొక రమ్యమయిన కథచెబుతా విను-

పూర్వకాలంలో ఒక పెద్దరాయి (మహాశిల) ఉండేది- చాల నునుపయినది- తాకుటకు మృదువుగా ఉండేది- మహా మందపాటిది- దానిలోపల వికసించిన పద్మాలు కొలనులోపలె రమ్యంగా అంతు

లేకుండా ఉండేవి- వాటి రేకులు ఒకదానితో నొకటికలిసి ఉండేవి- కొన్ని కలియకుండా కూడా ఉండేవి- కొన్ని రేకులు కనిపించకుండాను కొన్ని కనిపించేటట్లును ఉన్నాయి- కొన్ని ఊర్ధ్వముఖాలు- మరికొన్ని అధోముఖాలు- ఇంకకొన్ని తిర్యఙ్ముఖాలు- కొన్ని కర్ణికాజాలము లందు మూలములు గలవి- తదితరములు కొన్ని అమూలములు- కొన్ని పద్మాలు శంఖాలవలె ముడుచుకొని ఉన్నాయి- మరికొన్ని చక్రాకారంగా వికసించి ఉన్నాయి-

శ్రీరా॥ స్వామీ! ఇది నిజం- నేను తీర్థయాత్ర చేసే టప్పుడు శాలగ్రామక్షేత్రంలో ఇలాంటి శిలచూచాను- అన్నాడు రాముడు-

వసి॥ రామా! నీవు ఇలాంటిశిలను చూచినట్లు గుర్తించు చున్నావుకదా! నేనుమాత్రం చూడలేదు- ఇది ఒక అపూర్వమయిన శిలఅనే చెబుతున్నాను- దీని కుక్షిలో సర్వమూ ఉన్నది- బాగా విచారిస్తే ఏమీలేదు- చైతన్యమునందు లోకములన్నీ ఉన్నాయి వ్యవహారదృష్టిలో- పరమార్థదృష్టితో విచారిస్తే ఏమీలేదు- అంచేత ఇదియొక చిచ్ఛిల (చైతన్యరూపమయినశిల) బ్రహ్మతో పాటు ఇది ఘనంగా ఉంది- ఏకరసం- అభేద్యం- కూటస్థం- కాబట్టి యీశిల చిద్రూపమనుటలో సందేహంలేదు- ఇది యెంతఘనంగా ఉన్నా, దట్టంగాఉన్నా దీనిలోపల జగత్తు అంతా ఇమిడిఉంది ఆకాశంలో గాలి యిమిడి ఉన్నట్లు-

ఆ రాతిలో స్వర్గంఉంది- పృథివి ఉంది- వాయువుఉంది- ఆకాశంఉంది- పర్వతాలు ఉన్నాయి- నదులు దిక్కులు ఉన్నాయి- కాని దానిలో ఏమాత్రం చిల్లి కనిపించదు- జగత్తు అనే పద్మవనం మాత్రం భాసిస్తోంది- ఆభాసించే జగత్తుకూడా వస్తుతః దానికంటె వేరుకాదు- శుద్ధచైతన్యాత్మకమూ కాదు-

శంఖపద్మాదులు రేఖారూపంలో శిల్పిచే ఎలా వ్రాయబడతాయో అలాగే ఆరాతిలో భూతభవ్యజగత్తు అంతా కనిపిస్తోంది-

వికారాకారంగా- పద్మము ఆశిలయొక్క కోశముకంటె భిన్నమెట్లుకాదో (ఎట్లు అభిన్నమో) అట్లే ఈప్రపంచంకూడా చిద్రూపంకంటె భిన్నము కాదు- (చిదభిన్నమే) శిల్పి టంకముతో చెక్కకపూర్వం ఆరాతిలో చక్రాకార రేఖలూ, పద్మాకార రేఖలూ సుషుప్తావస్థతో (అనగా అనభివ్యక్తావస్థతో) ఉన్నాయి- అలాగే ఈప్రపంచంకూడా (జగదావళికూడా) చైతన్యములో ఇమిడియే అనభివ్యక్తంగా ఉంది- రాతిలో పద్మరేఖలూ మిరియపుగింజలో కారమూ క్రొత్తగా పుట్టిందీ లేదు- చచ్చిందీలేదు- సృష్టికూడా యీచైతన్యంలో అంతే- కులాంగన అయిన భార్యయొక్క మనస్సులో ఆమెభర్త ఎప్పుడూ ఉన్నాడు- మారేడుపండులో జిగురు (బంక) ఎప్పుడూ ఉంది- అలాగే నానా వికారాలతో కూడిన యీ బ్రహ్మాండమండలం కూడా ఈచైతన్యంలో సదా ఉంది- వికారమును చెందెడి బ్రహ్మాండములన్నీ ఎప్పుడూ చిన్మాత్రములో అపుడు వాటియొక్క వికారములయిన లోకములయొక్క శరీరాది భేదములుకూడా చిన్మాత్రములే యని అర్థాత్ సిద్ధించినదే కనుక మరల చెప్పవలసిన పనిలేదు- అట్లు చెప్పుట వ్యర్థముకూడా- నీటిలోనుంచి నీటిబిందువులను యెప్పటికప్పుడు ఎలా తీసికొనుచున్నామో అలాగే చిన్మాత్రమునుంచి యీవికారాదులను చిన్మాత్రతా దర్శన క్షణమునందే (ఈయవి చిన్మాత్రములని యనుకొనినపుడే) పొందుచున్నాము-

ఈవికారములన్నీ మాటమాత్రముచేతనే పుట్టినవని శ్రుతి చెప్పుచున్నది- "సభూరితి వ్యాహరన్ భువ మసృజత । (వాడు (ప్రజాపతి) భూః అను వ్యాహృతిని ఉచ్చరించుచు భూమిని సృజించెను) "ఏతఇతి వై ప్రజాపతి ర్దేవా నసృజత అస్రుగమితి మనుష్యా నిందవ ఇతి పితౄన్" అని దీనివలన భువనములసృష్టి నామపూర్వకమనీ వాటికి నామములయముతో లయమనియు తేలుచున్నది- కనుక కనిపించునదంతయు బ్రహ్మమేకాని వికారాదులనేవికావు- వికారాదులు లేకపో

వటంకూడా ఒక బ్రహ్మభిన్నమయిన పదార్థమని అనరాదు- వర్జ్యా వర్జనములన్నీ (భావాభావములన్నీ) బ్రహ్మరూపములే-

పుష్పఫలాదులు బీజములో ఇమిడిఉన్నట్లు ముల్లోకములూ చిద్ఘనమయిన బ్రహ్మమందు ఇమిడి ఉన్నాయి-

ద్వైతమనేది ఏకత్వకల్పనాధీనము- కనుక అకల్పితమయిన చిన్మాత్రమే తత్త్వము- రెండు వస్తువులందుండెడి ఏకత్వమే ద్విత్వమనబడుతోంది- అయ్యేది ఆ రెండు వస్తువులూ నశించిన వెంటనే నశిస్తోంది- చిన్మాత్రమయిన వస్తువు (బ్రహ్మము) ఎప్పుడూ జడరూపమును దాల్చలేదు- కనుక ద్విత్వమనేదిలేదు- రాతిలో రేఖాకారమయిన పద్మాదులు ఎలా ఇమిడిఉన్నాయో అవ్యక్తంగా అలాగే త్రిలోకాత్మకమయిన ప్రపంచమంతా బ్రహ్మాత్మకంగా ఉంది-

రాతిలో అవ్యక్తంగా ఉన్న అబ్జాదులు ఎలా నిత్యమో అలాగే ప్రపంచంకూడా బ్రహ్మలో పుట్టిందీలేదు- చచ్చిందీలేదు.

శిలలోపలి రేఖాదులు ఆలోపలిభాగం కంటె భిన్నంకావు- అలాగే బ్రహ్మస్వరూపంలో కల్పితమయిన జీవేశ్వరులుకూడా బ్రహ్మ కంటె భిన్నులుకారు- వారలచే నిర్మించబడిన జగత్తుకూడా అంతే- తత్త్వదృష్టిలో రాతిలో పద్మాలూలేవు- బ్రహ్మయందు లోకాలూ లేవు- ఒకేరాయి అనేకమంది శిల్పులయొక్క కల్పనాభేదములకు గురి అవుతూ ఎలాఉన్నదో అలాగే బ్రహ్మకూడా అనేకమంది జీవులయొక్క విరుద్ధకల్పనలకు గురిఅవుతోంది- అయినా ఆ బ్రహ్మము తనరూపమును మారుటలేదు- కాబట్టి రామచంద్రా! రాతిలోని పద్మాలూ శంఖాలూ వలె బ్రహ్మలో ఈలోకాలన్నీ ఉన్నాయనీ అవి బ్రహ్మకంటె వేరు కావనీ గుర్తించమన్నాడు వసిష్ఠుడు-

## ౮౭. బిల్వశిలాఖ్యానతాత్పర్య వర్ణనము (చిద్ఘనోపదేశము)

అవ॥ బిల్వఫలం అచేతనం(జడం)దీన్ని దృష్టాంతంగా చూపాడు వసిష్ఠుడు బ్రహ్మచైతన్యానికి- అంచేత బిల్వఫలసమసత్తాకంగా దాని లోపలి గింజలూ గుజ్జూ (జిగురూ) మొదలయిన వానియొక్క సత్తె కూడ ఉండును- అలాగే బ్రహ్మచైతన్యమందు చూపబడిన సృష్టికి (ప్రపంచానికి) కూడా బ్రహ్మసమసత్తె ఉన్నదని భావం శ్రీరామునికి కలుగవచ్చు- దానిని తొలగించుటకు యీసర్గ ప్రారంభమయింది-

వసి॥ రామా! స్వస్వరూపప్రతిసంధానం కలుగునంతవరకే బ్రహ్మచైతన్యం సర్గగర్భముగ (తనయందు ప్రపంచము ఉన్నదానివలె) తోచును- ఆవల అట్లుతోచదు- కనుక బ్రహ్మచైతన్యమునందు స్వగతభేదములేదు- ప్రపంచం బ్రహ్మకంటె భిన్నంకాదు- శూన్యమూ కాదు- అత్యంతాసత్తే అయితే (బొత్తిగా లేనిదే అయితే) అది కనిపించుటయే ఉండదు- కాబట్టి మారేడుపండులో దానితో అభిన్నంగా మజ్జా బీజములయొక్క (జిగురు గింజలయొక్క) ఉనికి యెట్టిదో అట్టిదే బ్రహ్మయందు ప్రపంచంయొక్క ఉనికికూడా- చిద్దర్పణంలో జగన్నగరం ప్రతిబింబంగా కనిపిస్తోంది- ఇదే బిల్వాఖ్యానతాత్పర్యం-

అలాగే శిలాఖ్యానముయొక్క తాత్పర్యంకూడా గ్రహించాలి- చింతామణియందు చింతకుని యొక్క (జపించువానియొక్క) మనోరథ ఫలాలన్నీ ఉన్నట్లు చైతన్యమునందు జగత్తు అంతా ఉంది- సూర్యుడు తన స్వరూపముయొక్క ఆవిర్భావ తిరోభావములనే అహోరాత్రము లను కల్పిస్తూన్నాడు- అలాగే చిన్మణిశిలకూడా తనను తెలుసుకుంటె జగత్తు లేకపోవటాన్ని తెలుసుకోనకపోతే జగత్తు ఉండటాన్ని కల్పిస్తోంది- సముద్రముయొక్క గర్భంలో ఆవర్త తరంగ ఫేనాది భేదాలు (సుడిగుండాలూ, తరంగములూ, నురుగులూ) ఉన్నట్లు జగద్వికారాలన్నీ చిదాత్మయందు ఉన్నాయి-

రాతిమీద చెక్కిన బొమ్మగాని, చెక్కనిబొమ్మకాని, రాతి రూపమే- అలాగే వర్తమానప్రపంచంకాని, అతీతానాగతప్రపంచం కాని చిన్మాత్రమే-

బిల్వాఖ్యాన తాత్పర్యంకూడా ఇదే- బిల్వాది ఫలపదార్థముల యొక్క సంపద లోపలిగుజ్జు (జిగురు) సారముగా కలదియే- అలాగే ప్రపంచశ్రీకూడా చైతన్యము సారముగా కలదియే.

రాతిమీద చెక్కిన బొమ్మలకు రాతియొక్క స్వరూపాన్ని విడిచి కట్టితే పద్మంవేరు- శంఖంవేరు- హంసవేరు- వీటన్నిటికి స్వరూపం మాత్రం శిలాస్వరూపమే- అంతకంటె వేరుస్వరూపంలేదు- అలాగే ప్రపంచాన్ని చిత్తుకంటె విడదీస్తే ప్రపంచానికి వేరే రూపంలేదు- ఒకవేళ అలా విడదీయకున్నా అప్పుడుకూడా భిన్నంగా కనిపించే ప్రపంచం చిదాత్మకంగా అభిన్నంగానే ఉంటుందికాని భిన్నంగాలేదు- పద్మశంఖాదులకు శిలోదరానికి గల పరిస్థితికూడా ఇదే-

మరుమరీచ్యాదికము మృగములదృష్టిలో నిర్మలమయిన జల రాశి- స్థలధీగల విద్వాంసుల దృష్టిలో అది సూర్యాతపమే- అక్కడ నిజంగాఉన్న సూర్యాతపము అచటలేని జలాదికమువలె సదసచ్ఛరీర ముగా ఎలాభాసిస్తోందో అలాగే రామచంద్రా! చిత్స్వభావుడవయిన నీవుకూడా భాసిస్తున్నావు- నిజంలో నీవు సదసచ్ఛరీరుడవుకావు- సముద్రము నిజంలో స్పందము (చలనము) కలదికాదు- (అనగా నద్యాదులవలె ప్రవాహరూపంలో చలించునది కాదు.) అయినా ద్రవత్వగుణము కలదగుటచే తన గర్భకుహరంలో తాను చలిస్తూనే ఉంది- అలాగే అస్పందమయిన చిద్ఘనముయొక్క ఆంతరము స్పందించు చున్నదివలె నున్నది-

అయితే స్వామీ! రాతిలో చెక్కిన శంఖపద్మాదులు రాతి రూపములుగా (శిలామయములుగా) తెలియబడుచున్నవి- చైతన్యము

నందు కల్పింపబడిన శంఖపద్మాలు చైతన్యరూపములుగ (చిదాత్మకములుగ) తెలియబడవేమి ?

వసి॥ రామచంద్రా ! విను- నీకు శిలాదులయందు అధిష్ఠానజ్ఞానం ఉంది- బాహ్యశంఖాదులయందు నీకు అధిష్ఠానజ్ఞానం కలుగలేదు- అంతేకారణం- కనుక నీవు జాగతములయిన శంఖపద్మాదులు చిచ్ఛిలాంతరములని తెలిసికో- నీకు దృష్టాంతంగా చూపిన మహాశిల కూడా పరమార్థదృష్టిలో చిచ్ఛిలయొక్క ఉదరమే- బాహ్యశిల మీద శిల్పులెందరయినా ప్రయత్నపడి రంధ్రాదులను ఏర్పరచగలరు కాని, ఈచిచ్ఛిలయందు మాత్రం వెయ్యిమంది శిల్పులయిననూ రంధ్రము మున్నగువాటిని యేర్పరుపలేరు- కాలస్వరూపులయిన సూర్యచంద్రులకు సూర్యుడు తపించుచున్నాడు” చంద్రుడు “చల్లగా ప్రకాశించుచున్నాడు” అని అవాంతరభేదమును కల్పించి వ్యవహరించినట్లు “బ్రహ్మ జగత్తును ప్రకాశింప జేయుచున్నాడు” “బ్రహ్మ జగద్రూపమున ప్రకాశించుచున్నాడు” అని క్రియాకారకభావ భేదంతో వ్యవహారము కలుగుచున్నది-

కాబట్టి ఈప్రపంచం ఎప్పుడూ బ్రహ్మయందు వాసనామాత్రంగా ఉంటోంది- బ్రహ్మయందు బ్రహ్మత్వమనేది యెట్లో అట్లే బ్రహ్మయందు జగత్తుకూడా- ఈరెంటికీ భేదంలేదు- తరు పాదప శబ్దములకు అర్థభేదంలేదు- ఈలోకాలన్నీ చిదాకార బ్రహ్మకంటె భిన్నములు కావు- చిదాకారమునకు భావాభావములులేవు- ఈలోకాలకు కూడా భావాభావాలులేవు-కనుక బ్రహ్మమె జగద్రూపంగా భాసిస్తోంది-మరు భూమియందలి తాపము (ఎండ) నీరుగా భాసించినట్లు- మేర్వాది అతిస్థూల పదార్థంకూడా తత్త్వదృష్టితో చూస్తే శుద్ధమగు బ్రహ్మగానే కనిపిస్తుంది- (అవుతుంది) మంచుగడ్డ నీరయినట్లు-

కనుక బాహ్యములయిన తృణగుల్మాదులు మొదలుకొని లోపలి చిత్తాదులనుండి హిరణ్యగర్భుని వరకునుండు ఉత్తరోత్తరము సూక్ష్మ

తమమగు రూపమేది కలదో అదియు భూతసూక్ష్మ అవ్యాకృతాత్మ రాంతమగు రూపమును విడదీస్తే ఏది మిగిలియుండునో అదే పరబ్రహ్మ మని బ్రహ్మవేత్త లంటున్నారు- స్థూలములన్నీ సూక్ష్మములయొక్క- సమూహాత్మకములు- ఎలాగంటె పంచీకృత భూతములనగా అపంచీకృత భూతముల సమూహమే- సూక్ష్మపదార్థాలలోనున్న సారమే (చైతన్యసారమే) స్థూలములయందుకూడా ఉంది- కనుకనే అప్పరమాణువునందలి రసశక్తి స్థూలజలంలో ఇంద్రియగోచరమవుతోంది- అలాగే సూక్ష్మమయిన చిత్సత్తయే (బ్రహ్మసత్తయే) స్థూలములయిన ఘటపటాదులందు అనుభవగోచరమవుతోంది- స్థూలంలో తృణగుల్మలతాంభస్సుల యొక్క- రసశక్తి భిన్నభిన్నముగా ఎలా గోచరిస్తోందో అలాగే సామాన్యరూపమయిన (ఏకరూపమయిన) బ్రహ్మసత్తకూడా ఘటపటాది స్థూలవస్తువులందు భిన్నభిన్నంగా గోచరిస్తోంది- నీల పీతాది రూపవిలాసాలయొక్క- ప్రకాశకాని సూక్ష్మత (పరమాణుత) కాని యెలా ఏకరూపమో అలాగే బాహ్యప్రపంచంలోకూడా గుణ గుణులయందుండే పరాత్మత (బ్రహ్మసత్త) కూడా ఏకరూపమె- ఆవిర్భావదశలో కారణం కార్యరూపంతో యెలా ఉంటుందో అలాగే తిరోభావదశలోకూడా కార్యం కారణరూపంలో ఉంటోంది- నెమలి యొక్క- పింఛములూ, ఈకలూ, వాటికాఠిన్యమూ ఇది అంతా ఆ నెమలికి కారణమయిన అండరసంలో (బీజంలో) ఉన్నవి- అలాగే ప్రాపంచికవస్తువులయొక్క- వికారాలన్నీ బ్రహ్మాండరసంలోనే ఉన్నవి- వివేకదృష్టితో విచారిస్తే ఆపింఛాలన్నీ మయూరాండ రసముకంటె వేరుకాదు- ప్రాపంచపదార్థాల వికారాలన్నీ బ్రహ్మాండరసంకంటె వేరుకాదు-

అయితే స్వామీ! బ్రహ్మ ద్వైతాద్వైతాత్మకమగుగాక- బ్రహ్మవాస్తవం- జగత్తు అనేది భ్రమ- కాబట్టి బ్రహ్మద్వైతాద్వైతాత్మకం- ఇంతమాత్రంచేత వైషమ్యం ప్రసక్తించదు- సదసత్తు

లయిన ఆ రెండును సమసత్తాకముగనున్నటుల నిరూపించబడనిచో నప్పుడు వైషమ్యము ప్రసక్తించును- సదసత్తులయొక్క తత్త్వము సద్వస్తువుగానే పర్యవసన్నమయినది- శూన్యనిష్ఠముకాదు- అసద్వస్తువు పరబ్రహ్మము- అయ్యది అద్వయము- కనుక నానాత్మకముగాను అనానాత్మకముగాను ఉండజేరదు- అట్లుండుట అనుపపన్నము- అయినను బర్హి అండరస దృష్టాంతముతోనే ఏకరసత్వమును చెప్పవలెను. ప్రపంచమునందు చిదాత్మకమయిన తత్త్వము ఎలా అనుగతమయినదో అలాగే నెమలియందు తత్కారణమయిన అండరసము అనుగతమయింది- చిత్తత్త్వమునందు జగత్తు ఎలా అంతర్లీనమయినదో అలాగే అండరసమునందు బర్హి (నెమలి) అంతర్లీనమయి యున్నదని గ్రహించవలెను-

## ౭౮. బ్రహ్మైకాత్మ్యప్రతిపాదనము.

అవ॥ మయూర అండరసదృష్టాంతముచే చిత్రాతిచిత్రమయిన యీ జగత్తంతా తిరోభావంచెంది గర్భమందున్నట్టియు, చిదచిత్సంవలితమయినట్టియు, బీజశక్తిగల అవ్యాకృతమే కాని ఆతత్త్వము దానికావలనున్న శుద్ధపరతత్త్వము కాదను వ్యామోహము శ్రీరామునకు కలుగునేమో నని దానిని తొలగించుటకు వసిష్ఠుడు నిర్విశేష భూమానంద రూపమగు తత్త్వమును నిష్కర్షగా పరిచయము కలిగింపదలచి యీ యధ్యాయము నారంభించుచున్నాడు-

వసి॥ రామచంద్రా! అండమునందు మయూరమువలె అంతరమగు అహంతాది ప్రపంచము బాహ్యమగు వియదాదిప్రపంచమూ బ్రహ్మయందున్నదని చెప్పాను నీకు- ఆబ్రహ్మము మాయా శబలమనీ, అదే పరతత్త్వమనీ నీవు భ్రమపడతావేమో- అట్లు కాదుసుమా! ఈప్రపంచం అంతా కాలత్రయమందు కూడా అనుత్పన్న స్వరూపముగనే(పుట్టనిరూపముతోడనే) శుద్ధబ్రహ్మయందుకలదు- అశుద్ధబ్రహ్మ

నేను చెప్పిన దృష్టాంతమునకు విషయం— ఇంతేకాని మాయాశబల బ్రహ్మకాదు—

ఏశుద్ధ బ్రహ్మయందు పరమార్థముగా ఏఒక్కటీ పుట్టుటలేదో, ఆశుద్ధబ్రహ్మయందే జగత్తు అవిద్యతో ఉంటోంది— అదే తత్త్వం ఈశరీరంలో కూడా ప్రాణరూపంగా ఉంటూ వైషయిక సుఖసారమయిన చిత్తవృత్తి భేదముతో విచిత్రభోగాకారముగా స్ఫటిక దర్పణాదులందు చంద్రుడువలె ప్రతిబింబిస్తోంది— కాబట్టి విషయ సుఖానుభవ బలమువలన బింబభూతమయిన నిరతిశయానందము ఉన్నదని ఊహింపవలెను—

ఈ అంశంలో విద్వాంసుల అనుభవంకూడా ప్రమాణంగా చూపుతా చూడు— మునులు, దేవతలు, సిద్ధులు, గంధర్వులు, మహర్షులు, మున్నగువారంతా స్వాత్మభూతమయిన భూమానందమును అనుభవిస్తూ తురీయపదవి యందున్నారు— కాని కొందరు మాత్రం విషయలోలురు దృశ్యదర్శనాసక్తులై, విక్షిప్తచిత్తులై, ఆత్మానందాన్ని అనుభవించ లేకపోతున్నారు— కనుక చిత్తవిక్షేపాన్ని ప్రాణస్పందాన్ని (లేక విషయాసక్తినీ) పోగొట్టు కొనుటకు నాసాగ్రమందు దృష్టిని నిలిపి (కేంద్రీకరించి) (నిరోధించి) యోగులగుచున్నారు— ఈ పరిస్థితి చతుర్థ పంచమ షష్ఠ భూమికలను అధిష్ఠించని వారి విషయము— సప్తమ (ఏడవ) భూమికలోనికి వచ్చినవారు మాత్రం లోకంలో అందరివలె వ్యవహరిస్తున్న వారయినా షష్ఠాది భూమికలయందున్న వారితో సమానంగా సదా (ఎల్లపుడూ) ఆత్మసుఖాన్ని అనుభవిస్తూనే ఉన్నారు— వీరికి బాహ్యార్థములందు సత్యతాబుద్ధి (బాహ్యవస్తువులు సత్యములను భావన) కొంచెంకూడా ఉండదు— ఇంతకు పూర్వ భూమికలందున్న వారుకూడా చిచ్చైత్యముల సంబంధమును వదల్చుకొనునట్టి సమాధిలో ఉంటారు— వారి మనఃప్రాణములు బాహ్యవిషయాల మీదికి చలించవు— (ప్రసరించవు)— కాబట్టి కర్మలందున్నా వీరు

భూమానందపదమునందున్న వారితో సమానులే- షష్ఠాదిభూమికలలో నున్నవారు లోపల బ్రహ్మాకారమయిన అఖండవృత్తి ధారాస్పంద ముచే నిరతిశయానందాస్వాదలక్షణమయిన పరమపురుషార్థాన్ని యెలా సాధిస్తున్నారో అలాగే బహిః (వెలుపల) చిత్తచైత్త్యాది స్పందము వల్ల వ్యవహారస్థితిని కూడా నెరవేర్చుకుంటారు- ఈశ్వరుడు లోపల సదాస్వరూపానంద ప్రతిష్ఠుడయినప్పటికీ బయటికి మాయచే జగద్వ్యవస్థను ఎలా పరిపాలించుచున్నాడో అలాగే నని భావము-

ఇలాంటివారికి వ్యవహారదశలో బాహ్యవిషయాలమీద బుద్ధి వృత్తులు లగ్నమయినా (ప్రసరించినా) త్రిపుటియంగుకూడా అభివ్యక్తమయిన నిరతిశయానందాత్మ లోపల ఆనందపరుస్తూనే ఉంటాడు కనుక వారికి వ్యవహారమంతా సుఖరూపమే అవుతుంది- దీనికి దృష్టాంతం- చంద్రకిరణములు చెట్టుచిగురాకుల మధ్యగా ప్రవేశించి ఆనందపరుస్తూనే ఉన్నాయి- అలాగే వీరికికూడా- వీరికి ఇలాంటి స్వరూపసుఖం ఎల్లప్పుడూ విక్షేపరహితంగా ఉంటుంది- చంద్రుని తేజస్సు (చంద్రిక) దూరంగావెళ్ళి గోడమీద సోకినా లేక శుద్ధమయిన ఆకాశంలో ఉన్నా ఒకేతీరు- దానికి భేదంలేదు- అలాగే నిర్విక్షేపాహ్లాదరూపమునే వారు అనుభవిస్తూ ఉంటారు-

ఇలాంటి శుద్ధాత్మతత్త్వం దృశ్యంకాదు- ఉపదేశించటానికి వీలయిందికాదు- దగ్గరదికాదు- దూరానదీకాదు- కేవలానుభవము వల్ల పొందదగిన చిద్రూపం- ఈయది దేహముకాదు- ఇంద్రియసమూహంకాదు- చిత్తముకాదు- వాసనకాదు- జీవుడుకాదు- స్పందము కాదు- వృత్తిజ్ఞానముకాదు- జగత్తుకాదు- సత్తుకాదు- అసత్తూకాదు- మధ్యంకాదు- శూన్యంకాదు- అశూన్యమూకాదు- దేశకాలవస్త్వాదులుకాదు- అది అదియే- మరొకటికాదు- ఈ దేహాదులతోనూ, వాసనాపుంజంతోనూవినిర్ముక్తమైనదిఆత్మతత్త్వము-హృదయమునందు ఏ ఆత్మతత్త్వం ఉంటూ ఉండగా ఈదృశ్యము ఆవిర్భావ తిరోభావాల

చేత చలిస్తోందో ఆసన్మాత్రమే ఆత్మపదము— ఇలా కార్యకారణ విలక్షణము ఆత్మచైతన్యమని ఊహించవలెను—

ఏది మహాకల్పములయొక్క ఆదికాలంలో పుట్టే అవ్యాకృత మను పేరుగల కారణతత్త్వం కాదో, ప్రాకృతాది ప్రలయరూపం కాదో, సృష్టికాలంలోకూడా ఈలోకంలోకాని, పరలోకంలోకాని, అనిలానలాదులచే శోషణ దహన క్లేదన మోదనాది వికారములతో (ఎండుట తగలబడుట, తడియుట, సంతసించుట మున్నగు వికారములతో) ఎప్పుడూ తన స్వరూపమునుంచి అన్యథా మారదో (అనగా వికారాన్ని చెందదో) అదే శుద్ధాత్మ తత్త్వము— ఘటాకాశాలవంటి మహాకాశానికి ఖండనాదులు (ముక్కలగుట మున్నగునవి) ఎట్లు లేవో అట్లే దేహాది వికారాలవంటి తదనుగతమైన ఆత్మాకాశానికి కూడ వికారాదులులేవు— రామా! ఈ దేహాది వికారాలుకూడా నిజంలో లేవు— సమస్త ప్రపంచము ఆత్మరూపమే (ఆత్మయే) బోధ కొరకు అవి వేరుగ నున్నటుల చెప్పబడింది— ఇంతే నిజంగా అవి ఉండబట్టి కాదు—

కనుక రామా! శ్రవణ మననాది పరిష్కృతము గున బుద్ధితో ఈవిశ్వమంతా ఆత్మమయమని తెలిసికొని కార్యములయందు (అనగా నీ రాజ్యకార్యములందు) (అనగా నీరాజ్యమును నెరవేర్చు కొనుటకు తగిన పనులందు) ప్రకాశించుచున్న వాడవగుచు, (నిమగ్నుడవగుచూ) నిర్మముడుగా నుండుము—

రామచంద్రా! ఈ పరిదృశ్యమాన ప్రపంచమంతా నిర్ధర్మకము, నిర్గుణమూ, నిర్మలమూ, నిర్వికారమూ, అనాద్యంతమూ, నిత్యమూ, శాంతమూ, సమాత్మకమూ అయిన బ్రహ్మస్వరూపముగా గ్రహించు— అని అన్నారు వసిష్ఠులు—

## ౪౯. సంసృతి విచార యోగము.

విన్నాడు శ్రీరాముడు వసిష్ఠోపదేశాన్ని— తన మనస్సులో ఏదో సందేహం కలిగింది— ఇలా అడిగాడు వసిష్ఠుని—

శ్రీరా॥ స్వామీ! త్రివిధ పరిచ్ఛేదశూన్యమయిన బ్రహ్మ యందు వికారాది భూయిష్ఠమయిన ప్రపంచం లేనేలేకపోతే ఎలా ప్రకాశిస్తోంది ? (ఎలాకనిపిస్తోంది?) అని ప్రశ్నించాడు—

వసిష్ఠుడు సమాధానం చెబుతాడు—

వసి॥ రామచంద్రా! కారణమునందు కార్యము పుట్టుట అయిదు విధములు— ౧. అతిరోహిత ప్రాగవస్థము, ౨. ప్రతిబద్ధ ప్రాగవస్థము, ౩. ప్రచ్ఛన్న ప్రాగవస్థము, ౪. అప్రచ్ఛన్న ప్రాగవస్థము, ౫. వినష్ట ప్రాగవస్థము— అని.

౧. అతిరోహిత ప్రాగవస్థము :— ఆచ్ఛాదింపబడని ప్రాగవస్థగల కార్యము— ఉ=మృదాదికమునకు ఘటాది భావము— అనగా మట్టి కుండగా తయారయినను మట్టియొక్క— మొదటిదశ (మొదటి స్వరూపము) తిరోహితము కాలేదు.

౨. ప్రతిబద్ధ ప్రాగవస్థము :— అడ్డగించబడిన మొదటి యవస్థ గలది— ఉ=జలమునకు హిమకిరకాది భావము— (నీరు మంచుగడ్డ వడగంటి రాయి యగుట) అనగా నీరు మంచుగడ్డగా తయారయినపుడుకాని వడగంటి రాళ్లుగా తయారయినపుడుకాని నీటియొక్క— మొదటి యవస్థ వానియందు ప్రతిబద్ధమై యున్నది—

౩. ప్రచ్ఛన్న ప్రాగవస్థము :— మొదటియవస్థ దాగియున్నది ఉ=రజ్జువునకు సర్పభావము— త్రాడు సర్పముగా కనిపించినపుడు దాని మొదటి యవస్థయగు రజ్జుదశ ప్రచ్ఛన్నముగా దాగియున్నది—

౪. అప్రచ్ఛన్న ప్రాగవస్థము :— దాగియుండని మొదటి యవస్థకలది. ఉ=జలమునకు తరంగభావము— నీరు తరంగముగా లేచినపుడు

కూడ ఆనీటి యొక్క మొదటిదశ అప్రచ్ఛన్నమై ప్రకటమగు చునే ఉన్నది-

౫. వినష్టప్రాగవస్థము :- మొదటి యవస్థ నశించినది- ఉ=క్షీరము దధియగుట (పాలు పెరుగగుట) ఈదశలో ఆపాలయొక్క మొదటి యవస్థ నశించినది-

అని యిట్లు అయిదురకములు కారణము కార్యమగుట- ఇందు అందువరకము మాత్రమే పరిణామము- మిగిలిన నాలుగును వివర్తము యొక్క భేదములే-

రామా ! పాలు, పెరుగుగా మారినపుడు పాలగుటయను ధర్మము (పాలుగా నుండుట యను ధర్మము) దానియందు లేదు- క్షీరస్వరూపానకి విపర్యయమగు రూపమే దానియందుకలదు- అలాగే ధాన్యము పొట్టుపోయి బియ్యమయినపుడు దానియందు పూర్వపు ధాన్యరూపముగ నుండుట యనునదిలేదు- తద్విపరీతమగు తండులరూపమేకలదు- కనుక ఈస్థితియే పరిణామదశ అని అనిపించుకుంటుంది- ఆదశయే వికారదశఅనీ, సంస్కారమనీ అంటారు-

బ్రహ్మయందు జగల్లక్షణమయిన కార్యము అట్లుకాదు- చిద్రూపమయిన బ్రహ్మ ఆదిమధ్యావసానములం దెల్లపుడూ నిర్మలమయిన బ్రహ్మమే- బ్రహ్మయొక్క రూపమునకు మార్పు యెప్పుడూ లేదు- అంచేత క్షీరాదులు వికారులనిపించుకుంటాయికాని బ్రహ్మ వికారి అనిపించుకొనడు-

అలాగే బ్రహ్మయందు జగత్కార్యము తార్కికులు చెప్పినట్లు ఆరంభవాదముగూడ కానేరదు- తార్కికులు అవయవద్రవ్యములచే అవయవి ద్రవ్యము ఆరంభింపబడుననియు కారణగుణములు కార్యమునందు గుణమును ఆరంభించుననియు అందురు-

"ద్రవ్యాణి ద్రవ్యాంతర మారభంతే గుణాశ్చ గుణాంతరం" అని కణాదులు ప్రమాణమును ప్రదర్శింతురు- బ్రహ్మ ఆద్యంత విభా

గము గల వస్తువుకాదు- క్రియా సంయోగ విభాగములు గల వస్తువూ కాదు- అలాంటి వస్తువుకాని ఆరంభకారణము కానేరదు- కనుక బ్రహ్మ ఆరంభకారణముకాదు- కనుక జగత్కార్యము ఆరంభవాదము నందును జేరదు- పరిశేషన్యాయముచే (పరిణామ ఆరంభవాదములు రెండును చెల్లకుండుటచే) బ్రహ్మయందు జగత్కార్యము వివర్త వాదమునందే చేరును- ఆద్యంతములందు సమానముగావున్న వస్తువు నందు క్షణకాలంలో ఏవికారము కనిపించునో (ఏ అన్యథాభావము) (మార్పు) కనిపించునో అయ్యది వివర్తమనిపించుకుంటుంది కాని వికారము (పరిణామము) అనిపించుకోదు- బ్రహ్మకు ఆద్యంతములందు (సృష్టిప్రళయములందు) జగద్వికారముతో సంస్పర్శ (సంబంధం) లేదు కనుక మధ్యలోకూడ లేదని గ్రహించాలి- ఆత్మకు ప్రకాశస్వభావము ఎప్పుడూ సమానమనునది సర్వానుభవసిద్ధము-అట్టి బ్రహ్మకు అనాత్మ భావము అత్యంతా సంభావ్యము- బ్రహ్మనీరూపము- అద్వితీయము- నిత్యము- కనుక భావవికారాలాకి ఇది వశముకాదు-

శ్రీరా॥ మునీంద్రా! చిత్ప్రకాశైకరసమయిన బ్రహ్మయందు తద్విగూఢస్వభావమయిన అవిద్యకు ప్రసక్తిఎట్లు? అవిద్యకు ప్రసక్తిలేనిదే అతనియందు జగత్తు (ప్రపంచం) వివర్తము కానేరదుకదా!

వసి॥ రామచంద్రా! ప్రబుద్ధుల (జ్ఞానుల) దృష్టిలో అవిద్య ఉన్నదని మేమనటంలేదు- మరేమంటే అజ్ఞానులకు విషయం బోధించ డానికి అవిద్య ఉన్నదని కల్పించి చెబుతున్నాం-

బ్రహ్మతత్త్వమే కాలత్రయమందునూ ఈప్రపంచం అంతా పరిపూర్ణమై ఉంది- అయ్యది నిర్వికారము- ఆద్యంతరహితము- ఇంతేకాని అవిద్యఅనేది ఒకటి అతనియందు లేదు-

బ్రహ్మశబ్దము వాచకమనీ, బ్రహ్మఅనే పదార్థము వాచ్యమనీ ఏ వాచ్యవాచక భావమయితే చెప్పబడుతోందో అదికూడ నిజంలో బ్రహ్మకంటె భిన్నంగాలేదు- ఉపదేశము కొరకు అదీ కల్పింపబడినదే-

రామా! నీవూ నేనూ, ఈదిక్కులూ, పంచభూతములూ, ఇది అంతా అనాద్యంతమయిన బ్రహ్మమాత్రమే కాని మరొకటికాదు- ఇందులో అవిద్యఅనేది ఊహమాత్రంకూడాలేదు- అవిద్య అనేది పేరు మాత్రమే కాని అక్కడ వస్తువేమీలేదు- వట్టి భ్రాంతి ఏదోఉందని- కనుక రామా! అదే అసలు లేకపోతే అది నిజమెట్లవుతుంది? అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ స్వామీ! అవిద్యఅనేది లేనే లేకపోతే, మీరు ఉప శమప్రకరణంలో "యథా భ్రాంతి రవిద్యేయం తథేత్థంచ విచార్యతే" అని మీరే అవిద్య ఉన్నదని ఒప్పి (అంగీకరించి) చెప్పారే- ఎలా చెప్పారు? అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ రామా! నీవు ఇంతవరకు తత్త్వమును తెలిసికొనని స్థితిలో ఉన్నావు- నీకు తత్త్వం తెలుపవలసిన స్థితిపట్టింది- అంచేత నీబుద్ధిని అనుసరించి అవిద్యఅనేది ఒకటి ఉన్నదని కల్పించి యుక్తులతో బోధించాను-

"ఇది అవిద్య" "వీడు జీవుడు" అనే కల్పనాక్రమం అంతా తెలియనివాడికి విషయం తెలపటానికి పెద్దలు కల్పించారు- అప్రబుద్ధ మయిన (విషయం తెలియని) మనస్సు అవిద్యమున్నగు శాస్త్రీయ వ్యవహార కల్పనలేనిదే ఎంత నెత్తినోరు కొట్టుకున్నా ప్రబోధాన్ని పొందలేదు- యుక్తితో బోధించే జీవుని పరమాత్మలో లయం చేస్తు న్నారు పెద్దలు- యుక్తి శస్త్రమే అసంభావన మొదలగు పురుష దోషాలను ఛేదించునది- యుక్తిచే నెరవేర్చేడి పనిని ఇతర ప్రయ త్నాలు వెయ్యిచేసినా నెరవేర్చలేరు- దోషాలున్నంతవరకు తత్త్వోప దేశము వ్యర్థం- అప్రబుద్ధునకు (తెలివిహీనునకు) "సర్వం బ్రహ్మ" (అంతాబ్రహ్మ) అనిచెపితే వాడు ఒకస్థాణువు (మొద్దు) దగ్గరకువెళ్ళి స్నేహితధర్మంతో దానితో తన దుఃఖాన్ని చెప్పుకుంటాడు- మూఢు డికి యుక్తితో చెప్పాలి- ప్రాజ్ఞుడికి తత్త్వంతో (నిజంతో) చెప్పాలి-

యుక్తితో చెప్పనిదే మూఢుడికి తెలివిరాదు- కనుక రామా! ఇంత వరకు నీవు అబుద్ధ (తెలియనివాని) దశలో ఉన్నావు- అంచేత యుక్తితో బోధించాను నీకు- ఇప్పుడు నాబోధవల్ల తత్త్వం తెలుసుకున్నావు- ఆ బోధయొక్క స్వరూపాన్ని చెబుతావిను-

రామచంద్రా! నేను బ్రహ్మను- ఈలోకాలు మూడు బ్రహ్మ- దృశ్యప్రపంచం అంతా బ్రహ్మ- రెండవవస్తువు లేదు- ఈబోధ మనస్సులో నిలుపుకొని నీయిచ్ఛవచ్చినట్లు మెలగు- ఈప్రపంచం తెలియసాధ్యంకాని మహాసంవిత్తు అధిష్ఠానంగా కలది- ఇలాంటి అభేదబుద్ధితో (ఏకత్వబుద్ధితో) ఉన్నవాడు ఏపనిచేసినా లిప్తుడుకాడు-

రామా! నీవు నిలుచున్నా, వెళ్లుచున్నా, నిట్టూర్పు విడుస్తున్నా, నిద్రిస్తున్నా, నీలోపలనున్న అహంపదార్థము పరమాత్మ అని తెలుసుకో- రామా! నీవు నిజంగా నిర్మముడవూ (మమాభిమాన రహితుడవూ) నిరహంకారుడవూ, బుద్ధిమంతుడవూ అయినట్లయితే సర్వభూతములందున్న చిదేకరసమయిన బ్రహ్మవు అగుము- సర్వవ్యాపకమూ, అద్వితీయమూ, విశుద్ధమూ సంవిన్మయమూ అయిన నీవే ఆ శ్రుతిప్రసిద్ధమూ, అనాద్యంతమూ, ప్రపంచాభాసాధిష్ఠానమూ అయిన పరమపదము అగుచున్నావు-

బ్రహ్మ, ఆత్మ, తుర్యము, అవిద్య, ప్రకృతి, జగత్తు, ఇదంతా అభిన్న ఏకాత్మమాత్రము- కుండలు ఎన్నయినా వాటన్నిటియందూ ఉన్నది మట్టియే- ఆత్మకంటె ప్రకృతి వేరుకాదు- ఘటముకంటె మృన్మయత వేరుకాదు- కుండకు మృన్మయత అనేది వాస్తవం-అంటే అది మృన్మాత్రం అన్నమాట- అలాగే ప్రకృతి అంటే ఆత్మే- నీటికి సుడి యెలాంటిదో ప్రకృతికూడా ఆత్మకు అలాంటిదే- ఆత్మయొక్క వివర్తమే ప్రకృతి- గాలిఅన్నా చలనమన్నా ఒకటే- పేర్లువేరు- స్వరూపంలో భేదంలేదు- అలాగే ఆత్మఅన్నా, ప్రకృతిఅన్నా పేరుభేదమేకాని, వస్తుభేదంలేదు- అజ్ఞానంవల్ల ఈరెంటికీ భేదం గోచరిస్తూ

ఉంటుంది- బోధవల్ల (జ్ఞానంవల్ల) ఆ భేదబుద్ధి నశిస్తుంది- అవిద్యవల్లనే త్రాడుమీద సర్పభ్రాంతి కలుగుతుంది-

రామా! చైతన్యమనే క్షేత్రంలో కల్పనఅనే బీజం (విత్తనం) వేస్తే చిత్తమనే అంకురం (మొక్క) బయలు దేరుతుంది- ఇక దాని నుంచి సంసారమనే వనం తయారవుతుంది- ఆ అడవి ఆత్మజ్ఞానమనే అగ్నిచే తగలపెట్టబడినదగుచూ, వాసనలనే నీటిచే ఎంత తడిపినా మళ్ళీ మొలకలెత్తదు- ఉండి ఉండి ఆ వాసనలనే జలమే యింకి పోతుంది- చిత్ క్షేత్రంలో కల్పన అనే బీజం నాటనే నాటకపోతే చిత్తమనే మొలకలు పుట్టవు- శరీరాలనే చెట్లుపుట్టవు- సుఖదుఃఖాలనే పండ్లు కాయవు-

కాబట్టి రామా! ప్రపంచంలో భ్రాంతిచే తయారయిన ద్వైతాన్ని (భేదాన్ని) విడిచిపెట్టు- నీకు ఆత్మబోధ అబ్బింది- అద్వితీయాత్మానుభవరూపమయిన నిరతిశయానంద వైభవంచేత అభయ స్వరూపుడవగుము- నీకు దుఃఖమనేది కాలత్రయంలోనూ లేదు- ఇదే నాఉపదేశానికి పరమార్థమయిన సారము- అని అన్నారు వసిష్ఠులు-

## ౨౦. అక్షసంవేదన విచారయోగము.

అవ॥ శ్రీరామునకు తత్త్వసాక్షాత్కారంచేత సకలసంశయాలు విచ్ఛిన్నమయినాయి- అయినా ఇతరుల ఉపకారంకొరకు ఆ యా సంశయాలపట్ల అడగదలచి మొదట తన అనుభవాన్ని విప్పి చెపుతున్నాడు వసిష్ఠునకు-

శ్రీరా॥ మునీంద్రా! నాకు తెలియతగిన విషయమంతా తెలిసింది- గ్రహించతగిన దానిని సాక్ష్యముగా గ్రహించాను- మీరుపదేశించిన బ్రహ్మజ్ఞానామృతంచేత మేము పరిపూర్ణులమయినాము-

పూర్ణమగు బ్రహ్మనుంచి శరీరమను ఉపాధిలో ప్రవేశించి గోటి చివర పర్యంతము (ఆనఖాగ్రాత్) నిండియున్న ఈజీవరూపము పరమార్థముగ పరిపూర్ణబ్రహ్మమే-

పరిపూర్ణమగు బ్రహ్మనుంచి ఆకాశాదిక్రమంతో పుట్టెడి వ్యష్టి సమష్టి ఉపాధిరూపమగు ప్రపంచం కూడా ఆ పరిపూర్ణ బ్రహ్మమే- ఆ ప్రపంచంకూడా పూర్ణముగనే పుట్టుచున్నది- పూర్ణమగు బ్రహ్మ చేతనే పూర్ణమగు ప్రపంచం అంతా నిండియున్నది-

"అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యార్థజ్ఞానంచేత మొదలంట ఉపాధిపరిచ్ఛేదం పోతే పరిపూర్ణ బ్రహ్మతో నిండియున్న (ఆపూరితం) పూర్ణమగు జీవతత్త్వము అఖండైక్యముచే (అఖండాభేదముచే) నిండిఉన్నది- అనగా అంతకు లోగడనున్న కల్పితమయిన పూర్ణత భ్రాంతి పోయినందున పోగా మొదటనున్న పూర్ణతయే జీవునకు నిలిచి పోయిందని భావము- (ఇట "పూర్ణమదః పూర్ణమిదం" అను ఉపనిషచ్ఛ్రుత్యర్థము అనువదింపబడినది-)

కనుక మునీంద్రా! అయినా నేను లోకులనేకులకు బోధ అభివృద్ధి కావలెనని యెంచి విలాసగా మిమ్ముల నడుగుచున్నాను- పిల్లవాడి ప్రశ్నకు తండ్రికి కోపం రానట్లు మీరుకూడా నాప్రశ్నకు కోపపడకండి-

శ్రీరాముని ప్రశ్న :- స్వామీ! శ్రోత్రమూ, చక్షుస్సూ, స్పర్శనమూ, రసనమూ, ఘ్రాణమూ, (అనగా త్వక్చక్షుః శ్రోత్రజిహ్వా ఘ్రాణము) లను ఇంద్రియ గోళకములు మృతకళేబరానికి కూడా ఉన్నాయి- స్పష్టంగా కనబడుచున్నాయికూడా- అయిననూ ఆగోళకములు తమతమ విషయములను ఏదీ గ్రహించటంలేదే- జీవించినవాని యింద్రియ గోళకములు తమ విషయములను గ్రహించుచున్నవే- యిందుకు కారణమేమి?

గమనిక N.B:- ఈ ప్రశ్నలో ఒక మహత్తరమయిన శాస్త్రార్థమును గ్రహించవలెను-

(1) సర్వప్రాణులకూ హృదయమునందే అర్థానుభవము (విషయానుభవము) కనుపించుచున్నది-

(2) ప్రియాప్రియదర్శనమువలన కలిగెడి సుఖదుఃఖములుకూడా హృదయమునందే అనుభవింపబడుచున్నవి-

(3) చాలకాలము క్రిందట అనుభవించిన బాహ్యార్థములను కూడా హృదయమునందే స్మరించటం కనిపిస్తోంది-

ఈ పై మూడుకారణాలను బట్టి బాహ్యవిషయాలను అనుభవించుట హృదయమునందే జరుగుచున్నదని చెప్పవలెను-

ఇచట శ్రోత్ర చక్షురాది ఇంద్రియములకు బాహ్యార్థములను హృదయములోనికి తీసికొనివచ్చెడిశక్తి లేనందువల్లననూ, ఆ యింద్రియములు అచేతనములగుటచే స్వయముగ తాము బయటికివెళ్ళి అనుభవించి తిరిగివచ్చి చెప్పుటకు వాటికి శక్తిలేకుండుటవల్లనూ శ్రోత్రాది గోళకములకంటె అతిరిక్తమయిన ఇంద్రియముల నంగీకరించుట వ్యర్థము-

ఇక అంతఃకరణావచ్ఛిన్నమగు జీవచైతన్యమే ఇంద్రియముల ద్వారా బయటికివెళ్ళి బాహ్యఘటాదులను వ్యాపించి వాటిని అనుభవించుచున్నదను కల్పనకూడా ఉచితముగాదు- అలాంటియప్పుడు వెలుపలనే విషయానుభవమునకు ఉల్లేఖ యుండవలసివచ్చును-

ఇష్టానిష్ట వస్తుదర్శన ప్రయుక్తమయిన సుఖదుఃఖములుకూడా వెలుపలనే పుట్టవలసివచ్చును- కాలాంతరమునందు లోపల (అంతఃకరణమునందు) స్మృతి పుట్టక పోవలసివచ్చును- లోపలకు (అంతఃకరణములోనికి) విషయములు ప్రవేశించకుండా అంతఃకరణమునందు అనుభవముకాని స్మృతికాని కుదరనేరదు-

ఇక అంతఃకరణవృత్తి బాహ్యేంద్రియములద్వారా బయటికి ప్రసరించి విషయప్రదేశాన్ని వ్యాపించి తదాకారాకారితమై ఒకవిధమయిన తత్తద్విషయాకార సంస్కారమును లోపలప్రవేశించి నటునివలె ఆయా విషయాకారమును అనుకరించుచూ ఆ విషయములను

అనుభవింప జేయుననికాని, స్మరింప జేయుననికాని, మీరు కల్పింపదలచి నను అదియును కుదరదు-

ఏలయన ? ప్రమాస్థలంలో ఘటాద్యాకారానుభవములు భ్రమ స్థలంలోని ఘటాద్యాకారానుభవములును తత్తదాకారలాంఛిత మనో వృత్తి విషయములని కల్పించుచో భ్రమప్రమలకు రెంటికి విశేషము లేకపోవలసి వచ్చును- అందుచే సర్వత్ర (అంతట) అనాదరము ప్రస క్తించును- ఘటాదులు బాహ్యములను అనుభవముకూడ లేకపోవలసి వచ్చును-

ఇలా అనుభవము లోపలిది ఘటాదికము వెలుపలిది- ఈ రెంటికి సంబంధములేదు- కనుక ఎవ్విధముగ ఆలోచించినను బాహ్యవిషయ ముల అనుభవారోహణమును ఉపపాదింప మీతరముగాదు-

కనుకనే నైయాయికాదులు అనుభవమునకు విషయములతో విషయవిషయిభావ లక్షణమయిన స్వరూపసంబంధమే కాని సంశ్లేషాది లక్షణమగు సంబంధముకాదని యనుచున్నారు-

అదియును కుదురదు- అసంబంధ స్వరూపము (సంబంధములేని స్వరూపము) విషయములన్నిటికి సమానమగుటచే విషయ వ్యవస్థయే కుదు:రదు- ఇక "ఆత్మా మనసా సంయుజ్యతే" "మన ఇంద్రియేణ" "ఇంద్రియమర్థేన" (ఆత్మ మనసుతో కలియును- మనస్సు బాహ్యేం ద్రియముతో కలియును- ఇంద్రియము విషయముతో కలియును-

అను క్రమముతో "స్వాశ్రయ సంయుక్త సంయుక్త సంయో గాది రూపమయిన పరంపరా సంబంధ వ్యవస్థచే విషయవ్యవస్థ కుదురు ననుటకూడా చెల్లదు- అననుగతమయిన పరంపరాసంబంధము "ఇది స్మృతి" "ఇది అనుమితి" అని అనుగతమగు విషయములను వ్యవస్థ పరుపజాలదు-

మరియు పరంపరాసంబంధముతో బాహ్యార్థానుభవము (సాక్షాత్కారము) నిర్వహించుచున్నందున అదియే విషయ వ్యవస్థాపకమగుచుండగా స్వరూపసంబంధకల్పనము వ్యర్థమగును–

దీనిచే సన్నికర్షద్వారా ఏపదార్థము ఏజ్ఞానవ్యక్తిజనకమో ఆపదార్థము ఆజ్ఞానవ్యక్తికి విషయము అను వ్యవస్థకూడ నిరాకరింపబడినది– ఇట్లయినచో ఇంద్రియాదులుగూడ ఆయాజ్ఞానములందు విషయములు కావలసివచ్చును–

కనుక అఘటితఘటనా పటీయమగు మాయాశక్తియొక్క బలమువలననే బాహ్యార్థానుభవము జరుగుచున్నదని చెప్పవలెను–
ఇట్టితరి శ్రో|తాదిగోళకములకంటె అతిరిక్తమయిన ఇంద్రియములను అంగీకరించుటెందులకు ? అనుభవమునుబట్టి తద్ద్వారా చిదాత్మయే బాహ్యార్థమును అనుభవించుచున్నవాడగును–

అట్టి మృతశరీరమునందుగూడ కర్ణాది గోళములుండుటవలనను సర్వగతుడగు (సర్వవ్యాపకుడగు) ఆత్మకూడ సదా (ఎల్లపుడు) ఉండుటవలనను మృతశరీరమునందు కూడ బాహ్యార్థములను జీవులేల యనుభవించుటలేదు ? అని శ్రీరాముని శంక.

జడమయిన (పృథక్చేతనత్వములేని) యింద్రియములు తిరిగి వచ్చి చెప్పెడి శక్తిలేని యింద్రియములు స్వయముగ తాము బయటికి వెళ్ళి ఘటాది పదార్థములయొక్క బాహ్యత్వమును (బహిర్భావమును) అనుభవించి మరలివచ్చి లోపలప్రవేశించి చెప్పుచున్నవనుట యెట్లు పొసగును ?

ఓయి ! ఘటాదివిషయజాతము మొట్టమొదట చక్షురాదీంద్రియ జాతమును (సమూహమును) తన కాపునకు ఆకర్షించును– అట్లు ఆకర్షింపబడిన ఇంద్రియము విషయమునుచుట్టుకొని హృదయములోపలనున్న భోక్తకొరకు ఆవిషయమును ఏదియో యొక అంశముచే లోపల

చేర్చును- ఘ్రాణేంద్రియము గంధమును లోపలికి చేర్చినట్లు అనినచో అదియును చెల్లదు- ఏలయన ?

విషయములు ఇంద్రియములను కలిసికొని బయటికి లాగగలవు కాని కలిసికొనకుండా లాగలేవు- త్రాడు కుండతో కలిసికొని బావిలో నుంచి బయటికి కుండను లాగకలదు కాని కలియకుండా లాగలేదు- ఇంద్రియ గోళక ప్రదేశమును సమీపించి యుండని ఘటాదులకు ఇంద్రియములతో సంబంధము సంభవించదు- కాక ఇంద్రియములకు చేదత్రాటికివలె ఘటసంశ్లేషముకాని తదాకర్షకత్వముకాని (దానిని లాగుటకాని) లోకంలో ప్రసిద్ధమయి లేదు- ఇంద్రియములు, విషయములు, ఈ రెండును భిన్నప్రదేశమునందు పాతబడిన రెండుయినుప శిలాశలవలె భిన్నప్రదేశమునందున్నవి- ఇట్లు భిన్నప్రదేశమున నున్న వాటికి పరస్పరసంశ్లేషములేనిదే ఒకదానినొకటి ఆకర్షించుట యనునది పొసగనేరదు-

మరియు నేత్రాదిగోళముల కొద్దిసందులలో స్థూలమయిన ఘటాదులను ప్రవేశపెట్టుటయు ప్రపంచానుభవవిరుద్ధము- కనుక స్వామీ ! అశ్లిష్టములయిన (కలిసికొనని) ఘటాదులకును ఇంద్రియములకును పరస్పరాకర్షణ స్వభావము అసంభవము-

మునీంద్రా ! నాకీ విషయములు తెలుసు. అయినా అజ్ఞానుల యొక్క సంశయమును పోగొట్టదలచి నేను మిమ్ము అనేకపర్యాయములు గ్రుచ్చిగ్రుచ్చి అడుగుచున్నాను- దయచేసి కోపింపక సమాధానమును సెలవివ్వండి- అని అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా ! గోలకములకంటె అతిరిక్తముగ ఇంద్రియములు లేవని నీవన్నమాట అత్యల్పమయినది- గట్టిగా విచారిస్తే చైతన్యముకంటె వ్యతిరేకముగ ప్రమాతకాని ప్రమాణముకాని ప్రమేయముకాని ఉన్నదని నిరూపించుటకు ఏవాదికి సాధ్యంకాదు- కనుక చిద్వ్యతిరిక్త

ముగ ఇంద్రియాదులూ లేవు— చిత్తాదులూ లేవు— ఘటాదులూ లేవు— శుద్ధచైతన్య మొక్కటే ప్రపంచం అంతా నిండిఉన్నది—

కల్పనాదృష్టిలో ద్రష్టదృశ్యము ఉన్నట్లు దర్శనముకూడ ఉండ వచ్చును— ఆకాశముకంటె అతిస్వచ్ఛమయిన చైతన్యం మాయాశబల స్వభావముచేత పూర్వాపూర్వవాసనను అనుసరించి పుర్యష్టకముగా తన రూపాన్ని కల్పించుకున్నది— ఆపుర్యష్టకరూపమే ప్రకృతియై ప్రపంచ పరిస్థితికి కారణమయినది— ఆప్రకృతియొక్క అవయవములవలననే ఇంద్రియాదులు ఘటాదులు పుట్టినవి— ఇందుకుప్రమాణము—

"మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వ అస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్ రం" అను శ్రుతి— కనుక రామచంద్రా! పుర్యష్టకంలో చేరియున్న చిత్తమనేది బాహ్య ఘటాదులను వ్యాపించుటచే స్వవృత్తి ప్రతిబింబితములయిన ఘటా దులు బాహ్యాత్వాకారములోనే హృదయంలోకిచేరి కనిపించడమూ కాలాంతరంలో స్మృతీ స్వప్నంలో లోపలనున్న ఘటపటాదులే బాహ్య ములుగా అనుభవించుటయు, ఇదంతా కుదురుచున్నది— (ఉపపన్నమగు చున్నది.)

ఇలా (ఈరీతుగ) పుర్యష్టకత్వమును చెందిన చిద్రూపమగు తత్త్వమే ఆపుర్యష్టకమునకు చిత్తాదులతో చేరిన స్వభావము గలదగుట వలన తనకుతానే చిత్తవృత్తి(మనోవృత్తి) అను పేరుగల అవయవము అగుచున్నది— ఆ అవయవమందు(అనగా ఆ చిత్తవృత్తియందు బాహ్య మగు ఘటాదికము బాహ్యాకారముతోడనే ప్రతిబింబించుచున్నది—

మృతదేహమునందయితే పుర్యష్టకముతో కూడిన లింగశరీరాభి మాని (లింగాత్మ) యగు జీవుడు లీలోపాఖ్యానమునందు కనుపరచినట్లు తన కల్పనచేతనే శరీరమును విడిచి వెళ్ళినందున దర్శనాదిసామర్థ్యము అద్దానికి లేదు— అనగా దర్శన శ్రవణాదులు అందు జరుగుటలేదు—

కనుక నీవుచూపిన దోషములకు ఏమాత్రము తావులేదు అన్నారు వసిష్ఠులు–

శ్రీరా॥ స్వామీ! అలాఅయితే పంచీకృతభూతముల భాగమగు ప్రపంచముయొక్క ఆకారముగ పరిణమించుచున్నట్టియు, అపంచీకృత భూతముల కార్యమగు లింగశరీర భాగముతో ఆచిత్తత్త్వముయొక్క ప్రతిబింబమును గ్రహించుటకు దర్పణముగా తయారయియున్న ఆపుర్యష్టకముయొక్క రూపమేమిటో దానినే సెలవివ్వండి– అని అడిగాడు శ్రీరాముడు–

పుర్యష్టకముయొక్క స్వరూపాన్ని చెప్పదలచాడు వసిష్ఠుడు– దానికిముందు అజ్ఞాతమయిన బ్రహ్మతత్త్వాన్ని నిర్దేశించి చెబుతున్నాడు.

వసి॥ రామా! జగద్బీజమయిన బ్రహ్మ ఆద్యంతములు లేనిది– దోషరహితమయినది– శుద్ధమయినది– ప్రకాశస్వరూపము– దేశకాలాది పరిచ్ఛేద శూన్యము– చిన్మాత్రము– అట్టిబ్రహ్మ వియదాదిభూత సూక్ష్మములను సృజించి అపంచీకృతములయిన ఆభూతసూక్ష్మములతో లింగశరీరమునూ పంచీకృతములయిన భూతసూక్ష్మములతో (పంచీకృత భూతసూక్ష్మములనగా స్థూలభూతములు) బ్రహ్మాండమునూ సృష్టిస్తాడు– వానిలో (ఆశరీరములలో) ప్రవేశిస్తాడు– వానియందలి అభిమానంచేత సూత్రాత్మ, ప్రాణాత్మ (హిరణ్యగర్భుడు) జీవాత్మ అను పేర్లను పొందుతాడు– ఈజీవుడు ఈస్థూలశరీరంలోని వాసనాపుంజముతో వృద్ధినొంది లోపలి వెలుపలి పనులకు సమర్థుడవుతాడు– ఇతడే అభిమానభేదంచేత అహంకారమనీ, (అహంభావంచేత) మననంవల్ల మనస్సుఅనీ, బోధనిశ్చయంవల్ల బుద్ధిఅనీ, ఇంద్రియదృష్టివల్ల ఇంద్రియమనీ, దేహభావంచేత దేహమనీ, ఘటభావనచే ఘటమనీ వేరువేరు పేర్లను పొందుతాడు–

సర్వవ్యాపారములకు సాధారణమయిన స్వభావంతో పుర్యష్టక మని చెప్పబడతాడు. ఈజీవుడే జ్ఞానేంద్రియ వ్యాపారముచే జ్ఞానిఅనీ, కర్మేంద్రియవ్యాపారముచే కర్తయనీ, తత్ఫలమగు సుఖదుఃఖముల కాశ్రయమగుటచే భోక్తయనీ, అన్నిటికి ఉదాసీనుడుగా నుండి ప్రకాశించుచుండుటచే సాక్షియనీ అనబడతాడు. వీటియందు అభిమానము గల సంవిత్తు జీవుడు. ఇందలి జడాంశము పుర్యష్టకము కామ, క్రోధ, హర్ష, విషాదాది బుద్ధివృత్తులు పరస్పరభిన్నములగుటచే జీవుడుకూడ భిన్నుడగుచున్నాడు. వాసనాభేదంచే భేదం జీవునకు అనివార్యం అవుతోంది.

బీజము, అంకురమూ, కాండమూ, పల్లవమూ, శాఖ, ఉపశాఖ, పత్రపుష్ప ఫలాద్యాకారము చెందినట్లు ఈ ప్రపంచంఅంతా సమష్టి వ్యష్టి జీవునియొక్క ఆకారమే అగుచున్నది. కనుకనే మొదటి చిదాత్మ "నేను చిదాత్మను కాను శరీరాద్యాకారుడను" అను మిథ్యాజ్ఞానంచేత భ్రాంతిపడుచూ వాసనాపుంజంతో కూడుకొని క్రిందకు మీదకు ప్రపంచంలో తిరుగుచున్నాడు. సముద్రంలో తరంగములతో కొట్టుకొని పోయెడి కాష్ఠం ఊర్ధ్వాధోగమనములతో తిరుగుతున్నట్లు. ఇది సామాన్యజీవుల లక్షణం.

ఇక విశిష్టజీవులగు సనకాదులు మాత్రం మొదటిజన్మలోనే ఆత్మతత్త్వమును తెలిసికొని ఆద్యంతవర్జితమయిన పరమపదమును చెందుదురు. మరికొందరు అనేకయోనులందు బుట్టి జన్మల ననుభవించి తుదకు ఆత్మజ్ఞానమును సంపాదించుకొని ముక్తినొందుదురు. ఈ విభాగమంతా సాత్త్విక రాజస తామస జీవులను విభజించి చూపుట లోగడ ఉత్పత్తి ప్రకరణంలోనే గడచిపోయింది.

రామచంద్రా! జీవుడు శరీరాన్నిపొందిన క్రమంఅంతా ఇలా చెప్పాను. ఇక "జడములయిన ఇంద్రియములతో బాహ్యఘటాదులను లోపల జీవుడెట్లు తెలిసికొనును" అని నీవడిగిన ప్రశ్నకు జవాబు

చెబుతా విను- రామా! చైతన్యము పుర్యష్టకంలో ప్రవేశించి పరిచ్ఛిన్నమై నఖాగ్రపర్యంతమూ వ్యాపించిఉన్నది- అట్టి చైతన్యమునకు ఈ దేహము పరమాత్మ అయినది- (అనగా కొలతపాత్ర యయినది)- అందుచే సదా దేహపరిమితమయిన జీవచైతన్యము దేహాంతర్గతముగనే సుఖదుఃఖాదుల ననుభవించును- ఇంక బాహ్యములయిన ఘటాదులను చూడవలసి వచ్చినపుడు ఉద్రిక్తమయిన తటాకోదకము కాలువ ద్వారా బయలు వెడలినట్లు సకలదేహములనుండి ఉద్రిక్తమయిన చైతన్యము చక్షురాదీంద్రియములద్వారా బాహ్యఘటాది పర్యంతము బాహ్యాకాశమునందు బయలుదేరుతుంది- ఘటాదులను వ్యాపించి ఘటాద్యాకారమును చెందుతుంది- అపుడు ఘటావచ్ఛిన్నమయిన చైతన్యము (ఘటముతో కూడిన చైతన్యము) అంతఃకరణవృత్తిద్వారా ఘటాకారమును చెందిన జీవచైతన్యముతో ఐక్యమును చెందుతుంది- అపుడు ఆఘటము వృత్తివిషయమై అనుభవగోచర మవుతుంది- ఇలా విషయేంద్రియముల సంబంధము చిత్తముతో కూడి జీవించియున్నవానికే బాహ్యార్థములను తెలుసుకొనుట జరుగునుకాని, మృతునకుగాని, ముక్తునకుగాని జరుగదు-

అతిస్వచ్ఛమయిన అంతఃకరణ వృత్తియందుగాని, నయనరశ్మియందుగాని బాహ్యాకాశమునందు ఘటాదికము ప్రతిబింబించును- ఆ ప్రతిబింబము వృత్త్యంతర్గతమయిన జీవునితో కలిసికొనును- అపుడు జీవుడు లోపలనుండుటచే లోపలనే ఘటాద్యనుభవము జరుగును-

యద్యపి చైతన్యమునది బాహ్యమునకూడ కలదు- కాని ప్రాణములను ధరించిన చైతన్యమే జీవచైతన్య మనిపించుకొనునుగాని ధరించని చైతన్యము జీవచైతన్య మనిపించుకొనదు- ప్రాణధారణము చైతన్యమునకు శరీరములోపలనే జరుగునుగాని బయట జరగదు- ప్రాణములను ధరించిన చైతన్యమే "అహమ్"అని యనుకొనునుగాని ధరిం

చని చైతన్యమనుకొనదు- కనుక "వెలుపలనున్న నేను ఘటమును తెలుసుకొనుచున్నాన"ను ప్రతీతి (అనుభవము) కలుగదు-

ఇక ఘటాపటాద్యనుభవము ఇట్లు లోపలజరిగినను బాహ్య ఘటాకారము హృదయములోపల ప్రవేశించుటెట్లని నీకు శంకకలుగ వచ్చును.వినుము సమాధానమును చెప్పెదను-

కంటిగ్రుడ్లు రెండును ఒరపిడి పెట్టిన ఇంద్రనీలమణులవలె ప్రకాశించునవి యెప్పుడగునో అపుడు ఆనేత్రరశ్మియందు బాహ్యపదార్థము ప్రతిబింబించును- ఆ ప్రతిబింబము చిత్తవృత్తితో గూడికొని హృదయము లోపలకు ప్రవేశించును- తద్వారా లోపలనున్న జీవచైతన్యముతో బాహ్యపదార్థము కలిసికొనును- అపుడు బాహ్యవస్తువులోపలి జీవునిచే హృదయాకాశమునందే అనుభవింపబడును- చేతనునకు పదార్థ సంస్పర్శ (సంబంధము) ఎప్పుడు కలిగినదో అపుడు బాలుడు తెలిసికొనును- పశువు తెలిసికొనును- తుదకు స్థావరముకూడ తెలిసికొనును- స్థావరములలోగూడ గుల్మవిశేషములకు కొన్నిటికి స్పర్శమాత్రముచే పత్రసంపుటీకరణము (రెండేసి ఆకులు జంటగా పుట్టుట) కనిపించుచున్నది- కాన పదార్థస్పర్శచే పదార్థానుభవము బాల, పశు, స్థావరాదులన్నిటికి నియతము-

ఇంక దూరమందున్న విషయములకు (ఘటాదులకు) నయనగోళకముతో సంబంధము (సంస్పర్శ) ఎట్లని ? అడిగితివి-

విను సమాధానము- నయనగోళకముకంటె అతిరిక్తమయి స్వచ్ఛమయిన ఇంద్రియముయొక్క రశ్మిలు (కిరణములు) వెనుక చెప్పిన రీతిగ జీవవేష్టితములగుచు (జీవునితో కూడుకొనిన వగుచు) ఎదుట నున్న వస్తువును ఆలింగనము చేసికొనుచున్నవి- స్పర్శ, రస, గంధములను, తెలిసికొనుటలో ఇదే క్రమమును గుర్తింపుము-

శబ్దగ్రహణమునందు మాత్రము కొంచెము విశేషము కలదు- శబ్దము ఆకాశనిష్ఠము కనుక కర్ణాకాశము నందున్న దగుచూ,

ఒక్కక్షణంలో జీవాకాశమును పొందుచున్నది- అనగా శబ్దమునకు వృత్తి ప్రతిబింబనము అక్కరలేదు- అది అక్కరలేకుండగనే సాక్షాత్ శ్రోత్రముద్వారా అంతఃప్రవేశము నొందగలదు- ఇలా విషయేంద్రియముల సంబంధమువలన విషయానుభవము జీవచ్ఛరీరమునకు పొసగు చున్నది- మృతశరీరమున కదిపొసగుట లేదు-

శ్రీరా॥ మునీంద్రా! ప్రతిబింబములనేవి అనేకచోట్ల కలుగు చున్నవి- మనస్సులలో ప్రతిబింబం జరుగుతోంది- అద్దాలలో ప్రతిబింబం కలుగుతోంది- గాజు యంత్రాలలో, కంచుయంత్రాలలో, మణి వికారమయిన యంత్రాలలో, జలాది యంత్రాలలో చెట్టునుంచి బయలుదేరి క్రొత్తక్రొత్త చిగురాకులలోకూడ ప్రతిబింబములు కలుగు తున్నాయి- వాటిస్వరూపం కొంచెం వివరించి చెప్పండి- అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ వసిష్ఠుడు జబాబు చెబుతాడు- రామా! బింబచైతన్యము నిజమయినా చిత్ప్రతిబింబమయిన వ్యష్టిసమష్టి జీవులకు బింబాతిరిక్త మయిన రూపము నిజంలో లేదు- ఉన్నదని లోకులనుకునే రూపం భ్రాంతిమాత్రం-ఇదే ఇలాఉంటే అత్యంతజడములయిన ముఖదర్పణము లకుగాని, ఘటచిత్తవృత్తులకుగాని, పరస్పరసాపేక్షమయిన ప్రతిబింబ స్వరూపం దుర్వచని (చెప్పనలవికానిదని) వేరుగ చెప్పనేల? కాబట్టి ప్రతిబింబం అంతా భ్రాంతిమాత్రం- కేవలం ప్రతిబింబమేకాదు- ప్రపంచంఅంతా భ్రాంతిమాత్రమే- కాబట్టి నీకు దానిమీద విశ్వాసము వలదు-

"అహం మమ" నేను నాది ఇత్యాది ప్రపంచం తరంగస్థానీయం- ఇది చైతన్యమనే జలంలోనుంచి పుట్టింది- కాబట్టి చిజ్జలముకంటె వేరుగా ఇదిలేదు- ఎల్లప్పుడూ ఉండేది చిజ్జలమొక్కటే-

కనుక రామా! నీవు ఎప్పుడూ ప్రపంచమునందు అసక్తుడవుగా నుండు- సంతోషంతో ఉండు- ప్రాపంచిక సుఖదుఃఖములు మిథ్యఅని

తెలిసికో- మాయను తరించు- సమమయిన బ్రహ్మయందు నిలిచిపో- అని అన్నారు వసిష్ఠులు-

## ౫౧. ఇంద్రియార్థోపలంభవిచారము.

వసి॥ రామచంద్రా! మొదటలేని అహంకార దేహేంద్రియాదులకల్పన జీవసమష్టియగు చతుర్ముఖబ్రహ్మకువలె వ్యష్టియగు నీకుకూడా సమానము- ఇదీ నాతాత్పర్యము- ఇది నీకు తెలిసియే యున్నది- అనగా చతుర్ముఖబ్రహ్మకువలె సృష్టికిపూర్వము బ్రహ్మస్వభావంలోఉన్న నీకుకూడా చక్షురాదులు తయారుకాలేదన్న నా మాటల తాత్పర్యం నీవు గ్రహించావు-

సమష్టిలో బ్రహ్మయొక్క- సమష్టి పుర్యష్టకమునకు (దేహేంద్రియాదులకు) సృష్టి ప్రారంభంలో వ్యవహరింపదగిన పదార్థములయొక్క- జ్ఞానము ఎట్లు పుట్టినదో, అట్లే వ్యష్టిపుర్యష్టకములన్నిటికి పుట్టుచున్నది-

చూడు- వ్యష్టిజీవుడు గర్భస్థుడై యుండగనే చక్షురాదీంద్రియ విశిష్టుడై ఆరవమాసమున పుర్యష్టక స్వరూపుడగుచున్నాడు- అది మొదలుకొని ఏవస్తువును ఎలా వ్యవహరించాలని భావిస్తున్నాడో తన వాసనచే దానిని అలా తెలిసికొనుచున్నాడు- కనుక హిరణ్యగర్భునియొక్క- మనోవ్యాపారమునందు తన ఇంద్రియములను ఇంద్రియ విషయములనూ గురించి సజ్ఞానం కలిగినదో అలాగే వ్యష్టిలో నీకు కూడా కలుగుతోంది-

కాబట్టి సృష్టికి పూర్వమందు వ్యష్టిసమష్టులు రెంటియందును ఒకే శుద్ధచైతన్యము ఎట్లుకలదో అట్లే ఆతరువాతకూడా అహంకార రూపమయిన అనంతవ్యష్టి జీవపుర్యష్టకములతో కూడిన చైతన్యము కూడ ఒకటే అగుగాక- అపుడు పుర్యష్టకములు ఎన్నిమారినను సంవేదనము (చైతన్యము) యొక్క- స్వరూపముమాత్రము మారదన్నమాట- అది శుద్ధముగా సర్వానుగతమై యుండును- వేద్యములయొక్క- దోష

ములవల్ల వేదనమునకు (సంవేదనమునకు) దోషమంటదు- సంవేదనము (చైతన్యము) ఏకము- అనంతము- (అపరిచ్ఛిన్నము) అవేద్యము- కనుక ఈయది అనామయము- (దోషరహితము.) వేద్యములన్నీ దేశ కాల పరిచ్ఛిన్నములు- అనేకములు- (అనగా వస్తుపరిచ్ఛిన్నములు) స్థూలములు- కాబట్టి అవి అనామయములుగావు- సామయములు- అనగా దుష్టములు- కాన వీటియందు సత్యత్వము లేదు-

రామచంద్రా! చైతన్యము అహంకారముగగాని, మమకార ముగగాని, దేహేంద్రియాదిరూపముగాకాని, జీవరూపముగగాని వాస్త వముగ పరిణమింపదు- చైతన్యమునందు అహంతా మమతాది గోచర బుద్ధి వృత్తులయొక్క- అధ్యారోపము మాత్రమే జరుగుతుంది- వాస్త వంగా పరిణమిస్తే సంవేదనమునకు (చైతన్యమునకు) గూడ అసత్యత్వము ప్రాప్తిస్తుంది. నిజంలో ఆత్మస్వరూపసాక్షాత్కా-రమున కుపయో గించెడి విద్యావిలాసాదులుకూడ ఆరోపమాత్రములే నిజంలో లేవు. ఈకల్పనలకన్నిటికీ అధిష్ఠానమయిన పరమాత్మఒక్క-డే ఎల్లప్పుడుకలడు-

అయితే "తస్మాత్సర్వే ఏతే ఆత్మానః వ్యుచ్చరంతి" అను శ్రుతి అగ్నివిస్ఫులింగ దృష్టాంతంతో జీవసంపత్తిని ఎలా చెప్పిందని నీకు సందేహం కలుగవచ్చు- కాని అది కేవలం ఉపదేశంకొరకు శ్రుతి అలా చెబుతోంది- అంతేకాని అది నిజమనికాదు- కాబట్టి అవిద్యా రోగానికి మూలం వెతకకూడదు- చికిత్సయే ఆలోచించాలి- మూల కల్పన మొదలయినవన్నీ చికిత్సోపాయములేకాని వాస్తవములుకావు- అవిద్యామయమయిన సంసారవ్యాధి ఏదో ఒకరకంగా తత్త్వోపదేశం చేయగా తనలోతనకే విచారణకలిగి తుదకు నశించును- (నశిస్తుంది.) అపుడు ప్రశాంతమయిన స్వరూపజ్ఞానమే మిగిలియుండును-

అర్థక్రియాకారియగు వ్యావహారిక పదార్థజాతము వ్యావహారిక సత్యమయినను శూన్యమయిన దానివలె ఏబ్రహ్మపదార్థమునందున్నదో

నీవు నిర్మలమయిన ఆబ్రహ్మతత్త్వమునందుండుము– ప్రాపంచిక విషయములను వెంటనే విడువుము– జీవన్ముక్తుడవుగా శరీరంలో ఉండుము–

ఇక అవిద్యయొక్క స్వరూపం చెబుతావిను–

అవిద్యకు రూపంలేదు– కనిపించుచున్నట్లు ఉంటూనే నశిస్తుంది కనుబడదు– లేనివస్తువును ఎంతకాలంచూస్తే మాత్రం ఎలాకనిపిస్తుంది? ఎంతప్రయత్నించినా ఎండమావులనీరు లభ్యమగునా? కనుక అవిద్య అనగా లేనిదే– అది ఉన్నట్లు భాసిస్తుంది– "అది అసత్తు" అనుజ్ఞానం లేకపోవడంచేతనే దానికి సత్యత్వం ఏర్పడుతోంది– అనగా అజ్ఞానం చేత అది నిజమయినదని అనుకోవడంకాని నిజమయినందువల్లకాదు– జ్ఞానమువల్ల ఉన్నవస్తువు ఉన్నట్లు కనిపిస్తుంది– భ్రమ నశిస్తుంది– సత్య స్వరూపుడయిన ఆత్మయొక్క సన్నిధానంవలన అత్యంతాసత్యమయిన అవిద్యయొక్క కల్పన కల్పింపబడినది– నీకు (జీవునకు) తత్త్వోప దేశము చేయుటకొరకు ఆ అవిద్యవలన జీవకల్పన ఏర్పడినదని శాస్త్ర ములు ఘోషించుచున్నవి– అద్దానిని నీవు తదేకనిష్ఠతో (సావధాన ముగా) వినాలి–

చైతన్యము మాయాకలితమై బాహ్యవస్తువులను చూడాలని అనుకుంటుంది– ఏదేది ఎనాభావనచేస్తుందో దానినంతా అలా అనుభ విస్తుంది– అది నిజంకానీ, అబద్ధంకానీ నిజానిజాలతో నిమిత్తంలేదు– తాను అనుకున్నవస్తువల్లా నిజంగా ఉన్నట్లు గుర్తించవలసినదే– పిల్ల వాడు అనుకున్నయక్షకుడు (దయ్యము) నిజంగా ఉన్నట్లు గుర్తించిన విధంగా–

అలాగే కలంకితమయిన చైతన్యముకూడా పంచతన్మాత్రలు పంచీకృతములై సత్యముగా దేహేంద్రియాదులయినవని భావిస్తాడు– ఆదేహములో ఇంద్రియములున్నవని అనుకుంటాడు– ఈపంచతన్మాత్ర వల్ల అనేకవస్తువులు పుట్టినవనుకొని బాహ్యవస్తువులను ఇంద్రియముల ద్వారా చూస్తాడు– అందులో ఇంద్రియములు, మనస్సు, ప్రాణము

మొదలగునవి లోపలవనీ, ఘటపటాదులు వెలుపలవనీ నిశ్చయంతో ఉంటాడు. ఆనిశ్చయం దృఢపడి తుదకు అదే వాసన అవుతుంది.

ఇలా విషయేంద్రియసంయోగమువలన అభివ్యక్తమయిన ఆత్మ సుఖమునే విషయసుఖమునుగా భావిస్తాడు. స్వాభావికమయిన స్వవేదనమునే (తన జ్ఞానమునే) విషయసన్నికర్ష వలన పుట్టినదనీ, అహంకారాత్మయొక్క ధర్మమనీ అనుకుంటాడు. అంతట సాంసారికవిషయ భోగములందే పురుషార్థము పర్యవసానము (సమాప్తి) చెందినట్లు నిశ్చయించుకొని దాని ననుభవించుటకు ఇహలోక, పరలోక సంబంధమయిన కర్మలను ఆచరించితీరాలను నియమమును దృఢపరచుకుంటాడు. నశ్వరమయిన విషయసుఖాన్ని ఉద్దేశించి ఈలౌకికకర్మను నేను చేయవలెను. "ఈవైదికకర్మను నేనుచేయవలెను" అని ఊరట్లాగుతాడు. ఇందొకటి స్వాభావికమయిన రాగాదులవలన ఏర్పడినది. రెండవది శాస్త్రజన్యము.

ఈ రెండును తన సంకల్పమువలన ఏర్పడునవియే. ఇందులో ఒక్కొకప్పుడు ఒక్కొకటి రెండవదానిని జయించి స్వాభావిక పురుష ప్రయత్నంతో కలుగుతూ ఉంటుంది.

అద్వితీయముగు ఆత్మయే సమస్తద్వైతప్రపంచంగా వివర్తమగుచున్నాడు. మధురరసమే కండచక్కెరగా తయారయినట్లు మట్టికుండగా తయారయినట్లు. కండచక్కెర (ఖండశర్కర) తత్పూర్వ తన ద్రవావస్థ నశించినందువలన తయారవుతోంది. ఘటము (కుండ) దానికిముందున్న మట్టియొక్క పిండావస్థ (ముద్దగానుండుట) నశించినందున తయారవుతోంది. అందువల్ల ఆరెండు దృష్టాంతములు ఆఅంశమును పుచ్చుకొని వికారములనవలసినదే. కాని కండచక్కెరయందు మాధుర్యమూ, కుండయందు మృత్స్వరూపమూ (మట్టియొక్క రూపమూ) నశించనందున ఆ అంశనుపుచ్చుకొని వివర్తమునకు దృష్టాం

తములుగా ఆ రెండును వాడబడుచున్నవి- బ్రహ్మయందయితే ఆ మాత్రపు వికారావస్థకూడా లేదు-

లేకపోతే ఆ రెంటినీ వివర్తదృష్టాంతములనుగా చెప్పక "ఖండో మధురరసేనైవ" అను శ్లోకమును అన్యథాకూడా వ్యాఖ్యానము చేయవచ్చును- ఖండశబ్దమునకు వనఖండము అర్థము- వనఖండమనగా వృక్షము- మధురరసమనగా వసంతఋతు సంబంధమయిన ద్రవము- అనగా జలము- ఈయది వికారమును చెందకుండానే వృక్షవికారమునకు హేతువగుచున్నది- వృక్షములో ప్రవేశించియున్న జలభాగమే ఇటుపుష్పమూ, ఇటుపత్రమూ, ఇటుస్కంధమూ అని విచిత్రముగా పుట్టుచూ, జలమంతా ఒకటే అయినా ద్విత్వమును (భేదమును) వహించినట్లు అగపడుచున్నవి- అలాగే ప్రసిద్ధసత్తారూపముగు బ్రహ్మ కూడా ఇటుపటమూ, ఇటుకుడ్యమూ, ఇటునేను అను జీవాత్మ "ఇత్యాది భేదములతో తనయందు ద్విత్వాన్ని (భేదమును) వహించుచూ కనిపించుచున్నాడు- కనుక నిర్వికారమయిన జలమువివర్త దృష్టాంతముగ నీయవచ్చును-

మరియూ మేఘుడు గ్రీష్మకాలంలో (అర్కరుక్) ఎండస్వరూపంగానే ఉంటున్నాడు- తొలివానకాలమందు వానకురియునపుడు (వారిగుడు) నీరును ఇచ్చువాడుగా ఉంటున్నాడు- తరువాత నేలమీద పడి మొలకలోని నీరురూపముగా ప్రవేశించినపుడు (అంకురోఽహం) "ఇపుడు నేను మొక్కను" అను అంకురరూపంతో ఉంటున్నాడు- అలాగే బ్రహ్మకూడా కాలభేదంచేత భావపదార్థాకారుడూ, అభావ పదార్థాకారుడూ అగుచున్నాడు- కాని అతని స్వస్వరూపమునకు మాత్రం మార్పు లేదు-

కాన ప్రపంచం అంతా బ్రహ్మవివర్తము- అందును నియతమయిన క్రమముకలది- దీని క్రమమును అన్యథాచేయుటకు (మార్పు చేయుటకు) ఎవరికినీ సాధ్యముగాదు-అలాగే వస్తువులయొక్క భేదమూ

వాటియొక్క స్వభావనియమమూ కూడా మార్చుటకు ఎవరికినీ సాధ్య పడదు. అదెట్లన ? అద్దమువలె స్వచ్ఛమయిన ఆకాశమునందు ఆకాశముయొక్క భాగముకాని, ఆకాశముయొక్క కార్యముకాని, ప్రతిబింబించదు. ఆకాశమునందుకాని ఆకాశకార్యమగు భూతాంతరమందు కాని ఆకాశభేదములేదు. అదియే ఆకాశము స్వచ్ఛమయినా దానియందు ఆకాశముకాని, ఆకాశకార్యముకాని ప్రతిబింబించకపోవుటకు కారణము. అనగా ఆకాశ, ఆకాశకార్యములందు ఆకాశాభావము లేదనిభావము. మరేమన ప్రతిబింబములేని దర్పణమధ్యభాగమువలె స్వచ్ఛంగా ప్రకాశిస్తూ ఉంటుంది. అవిద్యాసహితమయిన బ్రహ్మ మాత్రం అలాకాదు. బ్రహ్మ అంతటా నిండియున్ననూ అవిద్యయందు జీవరూపంతో ప్రతిబింబిస్తూనే ఉంటాడు. సర్వవస్తువులందునూ వాటి వాటి శక్త్యాదిరూపంతో ప్రకాశిస్తూనే ఉంటాడు. స్వభావతః చిన్మయుడగుటచే తనయందు భేదములేకున్ననూ భేదకల్పనచే ద్వైతీభావమును చెందుతూ ఉంటాడు. సృష్ట్యారంభంలో ఏవస్తువు బ్రహ్మస్వభావంచేత (అవిద్యచేత) ప్రకాశిస్తూ ఉంటుందో అది నిజంలో ఆరూపంతో లేకున్నా దానికారూపం సత్యముకాకున్నా సత్యమయిన ఆత్మ దానిని సత్యముగానే తెలుసుకుంటాడు. ఈనియమము మాత్రము ఏయుగము లోనూ వ్యభిచరించదు. కాబట్టి ఇదంతా నియతిసిద్ధము. ఇట్టి నియతి ఏకల్పములోను అన్యథామారదు.

లోకంలో కారణము సత్యము. కార్యము అసత్యము. సువర్ణమయమయిన కటకము (మురుగు) నందు సువర్ణత్వమనునది సత్యము కటకత్వమనునది అసత్యమయినది. అలాగే ప్రాపంచికవస్తువులందు కూడా చిత్త్వమూ, అచిత్త్వమూ అని రెండు ధర్మములున్నవి.

అందు చిత్త్వము సత్యమయినది. అచిత్త్వము (జడత్వము) అసత్యమయినది. చైతన్యము (చిత్పదార్థము) సర్వవ్యాపకమయినది కనుక కటకమునందు సువర్ణత్వమువలె మన ఆదులందు చిత్త్వము

నిత్యము— (సత్యము) అచిత్త్వమనునది (జడత్వమనునది) కాదా చిత్కమ (అసత్యము) ఇలా చిత్త్వ జాడ్యముల స్వరూపమయిన చిత్తము ఎప్పుడు దేహాకారమునుకాని, విషయాకారమునుకాని దృఢ భావనతో భావిస్తుందో అప్పుడు అలాగే దేవతగానో, మనుష్యుడుగానో, స్థావరముగానో తయారవుతుంది— ఆయాదేహాకారాన్ని చెందుతుంది—

కనుకనే జీవుడు కాలభేదంచేత లోపలి వాసనావైచిత్ర్యమును బట్టి ఆయాఆకారములను భావించుచూ ఆయారూపములను చెందు తున్నాడు— ఎలాగంటె కలలో ఒకానొక గ్రామము అడవిగా చూడ బడితే అది ఆస్వప్నం ఉన్నంతవరకు అడవిగానే ఉంటుంది— అలాగే దేహభూతుడయిన ఈజీవుడుకూడా వాసనావశంచేత దేహమునుంచి దేహాంతరమును చెందుతున్నాడు— అనగా ఒకదేహమునుంచి మరొక దేహమును ప్రవేశించుచున్నాడు— కల ఎట్లు ప్రాతిభాసికమో ఈజాగ్ర త్ప్రపంచంకూడా జీవునకు అట్లు ప్రాతిభాసికమేకాని సత్యముకాదు—

కలలో కనిపించెడి నగుడు వెంటనే కుడ్య (గోడ)మ(య)గును— పటమగును— అలాగే అసత్యమయిన ఈశరీరముకూడా మరణమునందు మూర్ఛయందును స్వయముగనే మారిపోవును— (మరొక దేహమగును) పుట్టుట ప్రాతిభాసికమే— చచ్చుట ప్రాతిభాసికమే— మరణించినవాని దృష్టిలో— జీవించియున్నవారలకు ఇతరులదేహము దగ్ధమగుచున్నట్లు గోచరించినా అది అవిద్యాకల్పితమయిన దేహమునకేకాని వాసనా మయమయిన దేహమునకుగాదు— బాల్య యౌవన వార్థక్యాద్యవస్థల యందలి శరీరములు కాలవశంచేత పరిణామమును చెందుతున్నాయి— ఇక్కడ ఈదేహములకు అన్యథాభావము (దేహాంతరభావము) లేదు— "తదేవేదం" అదే ఈశరీరము అను ప్రత్యభిజ్ఞా నిశ్చయముచటయున్నది—

భూతభావిదేహములు అట్టివికావు— పుట్టినవాడు లోగడ మర ణించియున్న దేహమును ప్రత్యభిజ్ఞ చేయుటలేదు— (గుర్తించుటలేదు. 3–28)

మరణించినవాడు లోగడ జీవించియున్న దేహమును గుర్తించుటలేదు- కనుక ఈయవి పూర్తిగా వేరు- వాసనామయములు. వాసనాభేదము చేతనే వీటికిభేదము- వాసనావశంచేతనే వీటికి ఉత్పత్తి-

అయితే మానవుడు మరణించిన తరువాత దేవాదిశరీరమును ధరించునుకదా! అది వానికి వాసనవల్ల వచ్చినదనేయెడల వాడెప్పుడూ దేవాదిశరీరాన్ని మనుష్యశరీరంలో ఉండగా చూడలేరుకదా! చూడని వస్తువునకు అనుభవమే లేకపోతే అననుభూతమయిన వస్తువుయొక్క-వాసన ఎలా ఏర్పడుతుందను ప్రశ్న పుట్టవచ్చు- విను సమాధానము-

ఈ ప్రపంచంఅంతా జీవస్వప్నం. అనగా మెలకువతోనున్న వానికల- నిద్రఅనునది అర్థమృతి- అనగా సగము మరణము వంటిది- అందులో వచ్చెడికల మృతస్వప్నము- ఈప్రపంచ ప్రతిభానము అట్టిది కాదు- కనుక ఈయది జీవస్వప్నము- నిద్రాస్వప్నంలో అనుభూతము కానిది కనిపించును- "దృష్టంచ అదృష్టంచ శ్రుతంచ అశ్రుతంచ అనుభూతంచ అననుభూతంచ సర్వంపశ్యతి" అను శ్రుతి యిందుకు ప్రమాణము- (అయితే ఈజన్మలో అనుభవించని దానినికూడా చూడ గలడనియే దీనికి తాత్పర్యము- నిజస్థితిలో అనాదియగు ఈసంసార ములో ఎప్పుడో ఒకప్పుడు అనుభూతముకానిది ఉండదు.) అలాగే మానవునకుకూడా దేహాదిశరీరవాసన చూడకపోయినా వినుటవల్ల నయినా కలుగవచ్చు- కనుక మరణకాలంలో భావిదేహారంభక కర్మో ద్బోధిత వాసనాను సారముగనే (అనగా రాబోయెడి శరీరమును పుట్టించెడి కర్మవల్ల తయారయిన వాసననుసరించియే) దేహాంతరము పుట్టుచున్నది- అందుచే అది వాసనామయమనుటలో తగాదాలేదు-

ఇలాయితే మహావాక్యములవల్ల బ్రహ్మసాక్షాత్కారంకలిగి, దానివల్ల బ్రహ్మభావం కలుగుతుందికదా! అదికూడా దేహాంతరము వలె వాసనామయమయిన స్వప్నము ఏలకాకూడదు? అనే ప్రశ్న నీకు కలుగవచ్చు- కాని అదిసరికాదు- బ్రహ్మభావము వాసనామయ

మగు స్వప్నము కానేరదు- ఇది ఏజన్మలోను జాగ్రద్దశలో అనుభూతము కాలేదు- "శివ మద్వైతం చతుర్థం మన్యంతే" అను శ్రుతిచే స్వస్వరూపముగా తురీయముగా చెప్పబడిన పరమాత్మ స్వరూపమిది- దీనియనుభవము లోగడ ఎన్నడును లేనందున ఈయది వాసనామయ మనుటకు వీలులేదు- ఈబ్రహ్మభావమనునది స్వచ్ఛమయిన చిన్మాత్రాత్మకము- ఇట్టి చిదాత్మయే జీవుడై యిపుడు మహావాక్యములచే జెప్పబడిన నిజరూపమును గ్రహించుకొనుచున్నాడు-

జీవుడయిన చిదాత్మ చిత్స్వభావుడగుటచే జాగ్రద్దశలో శ్రోత్ర శ్రోత్రవిషయాలను ఎలా అనుభవించు (తెలిసికొను) చున్నాడో, అలాగే స్వస్వరూపమునుగూడ అనుభవించుచున్నాడు-

దీనినిబట్టి అననుభూత విషయమునందుకూడా భావనాప్రచయం చేత (నిదిధ్యాసపాటవంచేత) వాసనదృఢపడి అయ్యది పూర్వదృష్ట విషయవాసనను (లోగడ అనుభవించిన విషయముల సంబంధమయిన వాసనను)కూడ జయించుననీ పురుషప్రయత్న ప్రాబల్యమును గమనించవలెను- కాబట్టి ప్రాక్తనవాసన అద్యతన (ఇప్పటి) పురుషప్రయత్నం చేత నశించును- నిన్నటిరోజున చెడుపనిచేసినవాడు పురుషప్రయత్నం చేత ఈరోజు మంచిపని చేయువాడుగా మారిపోవును- రామా! ఇంతవరకు వాసనాపరిణామరూపమగు దేహాదిబంధము నీకు వర్ణించ బడినది- ఇకముందు ఈబంధనివృత్తి ఎప్పుడనే విషయాన్ని గురించి చెబుతావిను-

మోక్షకాలంలోతప్ప మరెప్పుడును జీవులకు ఈదేహాదిబంధము తొలగనేరదు- దేశకాలముల ననుసరించి ఇందులోపడి మునుగుతూ తేలుతూ ఉంటాడు- ఎట్లనో స్థూలదేహాన్ని వదల్చుకున్నా మోక్షం లేనిదే లింగదేహరూపమగు పుర్యష్టకము దుర్నివారము- 1. మనస్సు, 2. బుద్ధి, 3. అహంకారమూ తన్మాత్రపంచకమూ (5) ఈ యెనిమిది కలిసి పుర్యష్టకమనబడుతోంది- ఈయది వాసనామయము- ఆతివాహికము- ఇద్దానికి మోక్షపర్యంతము నాశములేదు-

స్వామీ! శాస్త్రంలో 1. జ్ఞానేంద్రియపంచకమూ, 2. కర్మేంద్రియపంచకమూ, 3. ప్రాణాపానాదివాయుపంచకమూ, 4. పృథివ్యాది భూతపంచకమూ, 5. అంతఃకరణమూ, 6. అవిద్య, 7. కామమూ, 8. కర్మ, ఈయెనిమిదికలిసి పుర్యష్టకమని చెప్పబడినదికదా! ఈయది పంచీకృతమయిన ఆకాశవాయ్వాదుల చిహ్నములతో గూడిన స్థూలాంతరమును మూర్తరూపమున్ను అగుచుండగా తమరు అమూర్తమయిన మనోబుద్ధ్యాద్యష్టకమే పుర్యష్టకమని చెప్పుచున్నారేమి? వినుము. రామా! నీవు చెప్పిన మూర్తపుర్యష్టకము తన్మాత్రలు పంచీకరణముచే స్థౌల్యమును చెందుచో కలిగెడిది- నేనిపుడు చెప్పినది తన్మాత్రరూపమున్ను, లింగరూపమున్ను అగు అమూర్తపుర్యష్టకము- దీనికి పంచీకృతాకాశత్వమూ నిరవధికమగు స్థౌల్యమూ, ఈరెండూ సంభవించవు- అమూర్తములయిన వాసనలను కోటెసి కలిపినా స్థౌల్యము రాదు- లోకములో ఎచ్చటను అట్లు అనుభవములేదు- ఎపుడు దీనికి ఖత్వమే (ఆకాశత్వమే) దుర్లభమో అపుడు మహావృక్షమువలె స్థూలవాతత (స్థూలమయిన గాలియగుట) మేరుపర్వతమువలె దేహాత (అతికఠినమయిన శరీరమగుట కూడా అత్యంతాసంభావితము- ఇలాగే స్థూలజమగుటకాని, స్థూలతేజస్సు అగుటకాని, స్థూలపృథివియగుట కూడా అసంభావితము-

వాసనామయమయిన దీనికి స్థూలభూతావస్థయే అసంభవమయితే పరమాణువుకంటె అతిసూక్ష్మమయిన ఈలింగదేహమునకు (ఆతివాహికపుర్యష్టకమునకు) అతికఠినమయిన స్థూలదేహత్వము అత్యంతాసంభావితము- కనుక పుర్యష్టకము భౌతికదేహాంతమని వర్ణింపబడుటలేదు- పైగా మోక్షశాస్త్రమునందు స్థూలదేహముతో ప్రయోజనముకూడా లేనందున ఇందుస్థూలసద్భావకల్పనము యుక్తముకాదు.

ఎందువల్లనంటె మనోమాత్రమే దేహాదిప్రపంచమని అంగీకరిస్తే మనస్సు వైరాగ్యాద్యభ్యాసమువలన నిర్మలమయి శమాదమాదిసాధన

సంపత్తి కలుగగా మహావాక్యశ్రవణంచేత క్రమంగా జ్ఞానోదయం కలిగి మనఃకల్పితమయిన స్వప్నప్రాయమగు ప్రపంచమూ, దానికికారణమగు అజ్ఞానమూ, బాధింపబడగా (నశించగా) కార్యకారణావస్థారూప బంధ ద్వయశూన్యమయిన ముక్తి ఉపపన్నమగును.

N. B. బంధము ద్వివిధము. కారణావస్థారూపము. 2. కార్యావస్థా రూపము అని. 1. లింగదేహాత్మకమయిన బంధము కార్యావస్థారూపము— అవిద్యావస్థ కారణాత్మకబంధము— ఈద్వివిధ బంధము నశించుటయే ముక్తి—స్థూలదేహాత్మకమయిన బంధము ఎప్పటికప్పుడు నశిస్తూనేఉంది— అంతమాత్రంచేత జీవునకు ముక్తి వచ్చుటలేదు— కనుక స్థూలదేహసద్భావముతో ఈశాస్త్రము నందు ప్రయోజనములేదు— కనుక దానిని వర్ణించుట ఇందు అనవసరము— ఇదియునుగాక స్థూలభూతభౌతిక ప్రపంచమును అంగీకరించినా దానికి తత్త్వజ్ఞానంచేత బాధ (నాశము) కనిపించ నందున ముక్తిసంభవించదు— కనుక సర్వథా మోక్షశాస్త్రము నందు స్థూలదేహమున్నదని వర్ణించుట అనుచితము—

ఈవిధమయిన నిష్కర్షలో స్వప్నసుషుప్తులు రెండే అవస్థలు— స్థూలపదార్థవిషయమగు జాగ్రత అనుపేరుగల మూడవయవస్థను నిరూపించుట ఎవరికిని సాధ్యముగాదు— జడములయిన ప్రాపంచిక పదార్థముల నన్నిటినీ వాసనా (సంస్కార) రూపముతో ఉపసంహారము (ప్రోగు) చేసికొనిన సుషుప్త్యవస్థ ఒకటి దేహేంద్రియాది ప్రత్యయములతో ఒప్పుచున్న స్వప్నావస్థ రెండవదీ అని రెండే యవస్థలు— ఇలా స్థావర జంగమాకారములతో ఆతివాహిక దేహమే మోక్షపర్యంతము తిరుగుతూ ఉంటుంది— ఈఆతివాహిక దేహము ఒకపుడు సుషుప్తిదశలో ఉంటుంది— ఒకపుడు స్వప్నదశలో ఉంటుంది— ఇలాంటి ఆతివాహిక దేహము అందరకుకలదు—

జీవుడు సుషుప్త్యవస్థలోనుండి వాసనాత్మనా లోపలి ప్రవేశించిన దుస్స్వప్నములతో విద్ధుడగునపుడు (కొట్టబడినవాడై) గతస్మృతియై (తెలివితప్పినవాడై) లోలోపల వెలుగుచుండును-

ఇంక సుషుప్తిదశలో నున్నపుడు స్థావరాదులవలెనూ, కల్ప వృక్షాదులవలెనూ, శిలాదులవలెనూ తరతమభావంతో తమఃప్రచురమై (అజ్ఞానప్రచురమై) ఉంటాడు-

కనుక చిత్తము (మనస్సు) నందలి జాడ్యాధిక్యమే సుషుప్తి- చిత్తభ్రమణమే (మనోవికారమే) సంసారము- చిత్తమునకు (మనస్సునకు) తత్త్వబోధయే ముక్తి- తురీయత్వమే జీవునకు జాగ్రత అని తేలినది-

రాగియను లోహంలోని మాలిన్యాన్ని తీసివేస్తే అది బంగారము అయినట్లు జీవునకు తత్త్వబోధకలిగి అంతఃకరణమాలిన్యాన్ని రూపు మాపుకుంటే పరమాత్మ అవుతాడు ఆజీవుడు-

తత్త్వజ్ఞానంవలన కలిగెడు ముక్తి రెండువిధములు- 1. జీవన్ముక్తి- 2. విదేహముక్తి- అని ఇందు తురీయావస్థ జీవన్ముక్తి అనబడుతుంది- తురీయాతీతావస్థ విదేహముక్తి- పురుప్రయత్నంచేత బోధరూపుడయిన జీవుడు ప్రబోధరూపుడు (ఉత్కృష్ట చిన్మాత్రబ్రహ్మరూపుడు) అవుతాడు-

తత్త్వతః తానెవరో తెలిసికొనిన జీవుడు సర్వాంతర్యామియగు సాక్షిస్వరూపుడగుచున్నాడు- తన స్వరూపము తనకు తెలియనివాడు కూడా నిజస్థితిలో పరమాత్మస్వరూపుడయినా అజ్ఞానంవల్ల రాతివలె అతిమూఢమయిన తన హృదయంలో అతిదీర్ఘమయిన స్వప్నవిభ్రమమును (అతితీవ్రమయిన సంసారభయమును) అనుభవిస్తూ ఉంటాడు-

జీవులహృదయంలో వాస్తవంలో చిత్కళయే ఉన్నదికాని మరొకటి ఏదీలేదు- కాని దానినే అన్యథా చూస్తూ వృథా దుఃఖిస్తూ

ఉంటాడు-జీవాణువులో పరమాత్మ స్వరూపముకంటె వేరేమీ లేకున్నా అక్కడపీడికి ప్రపంచభావన కలుగుట మాయావిలాసముకాని మరొకటి కాదు- స్థాలిచెంబులో కాగెడినీరు ఎన్నివిధముల భ్రమిస్తూ ఉంటుందో అలాగే జీవాణువులోకూడా మిథ్యాసంసారభ్రాంతులు తిరుగుతూ ఉండును- వాసనాబంధమే జీవునకుబంధము- వాసనాక్షయమే జీవునకు మోక్షము-

జీవునకు తురీయావస్థయందుకాని, తురీయాతీతావస్థయందుకాని వాసనలుండవు- కనుక వానికి సౌషుప్తదశయే వాసనలకు అవధియగు దశ- ఈవాసనాజాలము స్వప్నదశలో అతివిచిత్రంగా స్పష్టపడుతూ ఉంటుంది- అదిఎలాగంటె ఘనమయిన వాసనాబద్ధుడు స్థావరాది జన్మల నెత్తును- మధ్యస్థమయిన వాసనలు గలవాడు పురుషుడు గాను, మనుష్యగంధర్వ దేవగంధర్వుడుగను, పశుపక్ష్యాదిరూపము గను పుట్టుతూ ఉండును.

ఇక ఏజీవుడు "సుషుప్తివిచ్యుతికాలంలో (అనగా ఘనమయిన అజ్ఞానమువదలిన దశలో) నఖశిఖపర్యంతము వ్యాప్తమయిన అహం భావలక్షణమయిన మనోవృత్తితో "నేను దేహపరిమితుడనే" అను అంతఃపరిచ్ఛేదము ఉండునో వాడు బాహ్యములయిన ఘటాదులుగా బుట్టును- అపుడు చక్షురాదింద్రియములద్వారా బయలువెడలిన అంతః కరణద్వారా వృత్త్యవచ్ఛిన్నమగు జీవుడు బయలువెడలి ఘటాదులను వ్యాపించును- అపుడు జీవునకు "ఘటమహింజానామి" నేనుకుండను తెలిసికొనుచున్నాను" జ్ఞానమేర్పడును- అపుడు గ్రాహ్యగ్రాహకముల యొక్క- వాసనాత్మకయగు సత్త చిత్రాతిచిత్రముగ స్పష్టపడును-

అనగా లోపలనున్న జీవాత్మ ఎపుడు బహిః(వెలుపల) అనాత్మ పదార్థములతో సమాలీఢుడు (వ్యాపించినవాడు) అగునో అపుడు గ్రాహ్యము, గ్రాహకుడు అనునొకవిధమగు సంస్కారము మృగతృష్ణిక వలె పుట్టును- ప్రపంచంలో హేయమూ లేదు- ఉపాదేయమూ లేదు-

హేయమనగా విడిచిపెట్టతగినది- ఉపాదేయమనగా గ్రహింపతగినది- ఈ రెండూ వాస్తవంలో లేవు- కనుక హేయోపాదేయ వైచిత్ర్యము కూడా వాసనవల్ల అధ్యస్తమే కాని వాస్తవముకాదు_ బాహ్యాభ్యంతర కలాకారమయిన చిదాత్మ ఒక్కడే ప్రకాశించుచున్నాడు- మూడు లోకములూ చైతన్యముయొక్క చమత్కారము- భేదవికల్పములతో ప్రకాశించుచున్నది- తత్త్వజ్ఞానంచేత జీవులు చిద్రూపులుగా ప్రకాశించుచున్నారు- బాహ్యాభ్యంతర సహితమయిన ప్రపంచ మేమాత్రము ఎప్పుడూ చిద్వ్యతిరిక్తముగ లేదు-

రామచంద్రా! తత్త్వదృష్టితో విమర్శిస్తే సముద్రము తరంగ ఫేనబుద్బుదాది భేదరహితము- అనగా అలలు, నురుగు, బుడగలు అను భేదములేనిది- శుద్ధము స్వచ్ఛమయినజలమే అది- (సముద్రము)

అలాగే ఈ ప్రపంచాన్నికూడా తత్త్వతః విమర్శించి తెలిసికుంటే వాసనావైచిత్ర్యమువల్ల కలిగిన భేదజాతమేమీ లేనిదే- అలాంటి అనామయమగు ఆత్మతత్త్వమే పరమపదము-

ఇంద్రియార్థోపలంభ విచారమను 51 ఏకపంచా
శదధ్యాయము ముగిసినది.

## ౫౨. అర్జునోపాఖ్యానము.

వసిష్ఠమహాముని గతసర్గలో ౮౮వ శ్లోకం "జీవస్వప్నే జగద్రూపం విద్ధి వేద్యవిదాంవర" అని చెప్పియున్నారు- అనగా ఈపరి దృశ్యమాన ప్రపంచరూపము జీవస్వప్నమునందు(జీవునియొక్క కలలో) చేరిన దానినిగా తెలియుమని దీనియర్థము- ఇది వినినతోడనే శ్రీరామున కొక సందేహము కలిగినది- అదేమన? "జీవులందరకు స్వప్నము ప్రత్యేక ప్రత్యేకము భిన్నముకదా! జాగ్రత్ప్రపంచమయితే అందరకు

సాధారణముకదా! అందరు స్వప్నముకంటె విలక్షణముగ అనుభవించు చున్నారు కదా! ఇది స్వప్నం ఎలా అవుతుంది? అని-

ఇది గ్రహించారు వసిష్ఠులు- సమాధానం చెబుతారు-

వసి॥ రామా! నీసందేహము సరిఅయినది- కాని సర్వజీవ సమష్టిస్వరూపుడయిన హిరణ్యగర్భుడను ఆదిజీవునియొక్క స్వప్నమే మనయొక్క జాగ్రత్తు- (మెలకువ) ఇదేమన అందరకు కల్పితమయిన సంసారము- వ్యష్టిజీవులకువలె సమష్టిజీవుడయిన హిరణ్యగర్భునకు వేరేస్వప్నంలేదు- అంచేత మనకు జాగ్రదవస్థలో ప్రసిద్ధములయిన భూతభువనాది భావములే (గడచిన లోకములు మున్నగు పదార్థములే) ఆ హిరణ్యగర్భునకు జాగ్రత్స్వప్నోభయావస్థాపదార్థములు- అనగా అవే అతనికి జాగ్రద్వస్తువులు- అవే స్వాప్నికవస్తువులు- కనుక ఇది స్వప్నంకంటె భిన్నములుకావు- అందుచేత నేను ప్రపంచమంతా జీవ స్వప్నమని చెప్పాను-

కాని మనయొక్క స్వప్నము త్వరలో నశించేది- జాగ్రత్ప్ర పంచమనే యీజీవస్వప్నం. దీర్ఘకాలం ఉండేది- ఇంతే ఈరెంటికీ భేదం- అదీ సత్యముకాదు- ఇదీ సత్యముకాదు- దానికీ వస్తుత్వము లేదు- దీనికీ వస్తుత్వములేదు- ఒక కలలోనుంచి మరొకకలలోకి పోవుచున్నట్లు ఈజీవులు ఆదిజీవునియొక్క కలలోనుండియే అది అసత్య మయినా సత్యమని తలచుచూ ఇతరకలలను కనుచున్నారు- వాటిని మాత్రం అసత్యమని యెప్పటికప్పుడు తలంచుచున్నారు- అలాగే జీవులు భ్రాంతిచే అజడమయిన బ్రహ్మను జడమయిన ప్రపంచ మునుగా చూచుచున్నారు- జడమయిన అహంకారము మొదలుకొని దేహమువరకు నుండుదానిని చేతనమయిన ఆత్మనుగా తలచుచున్నారు- ఇలాంటి వస్తుస్వభావమునకు విపరీతముగా చూచుటనుబట్టికూడా ప్రపంచం స్వప్నమనతగి యున్నది- జీవులు ప్రతికల్పంలోను ఇలాంటి భేదకల్పనాపరంపరలలోపడి తిరుగుచునే యున్నారు-

ఇంతకూ కారణం వ్యష్టిఅయిన జీవుడు (తాను) నిజస్థితిలో సర్వవ్యాపకుడూ, అపరిచ్ఛిన్నుడూ, సత్యస్వరూపుడూ కనుక దేనిని భావిస్తూ ఉంటాడో, వెంటనే దానియందుండే ఆసక్తిచేత తనయొక్క సత్తాను దానియందు ఆరోపించి దానిని నిజమయిన దానినిగా గ్రహిస్తాడు- కాబట్టి దానిమీద (ప్రపంచంమీద) ఆసక్తిని విడిచిపెడితే అది సత్యమనే భ్రమ నశిస్తుంది- ఆపైన తత్త్వం తెలుస్తుంది- జీవన్ముక్తి కలుగుతుంది-

ఇందుకుగాను శ్రీకృష్ణ భగవానుడుపదేశించబోయెడి అసంసక్తి యోగమను పరమపవిత్రమయిన ఉపదేశమును చెబుతానీకు వినుము- దానిని విని పాండుపుత్రుడగు అర్జునుడు తన జీవితాన్ని సుఖంగా దుఃఖ రహితంగా గడుపుకోనగలడు- అని అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ బ్రహ్మర్షీ! పాండు పుత్రుడగు అర్జునుడు ఎప్పుడు పుట్టుతాడు- అతనికి శ్రీకృష్ణుడు అసంసక్తియోగాన్ని ఎప్పుడుపదేశిస్తాడు? అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ రామచంద్రా! స్వస్వరూపమునందు ప్రతిష్ఠితమై అతి నిర్మలమయిన పరమాత్మయందు మలాత్మకమయిన యీ ప్రపంచం కల్పితమయింది- బంగారమునందు కటకాదులూ, నీటిలో తరంగ బుద్బుదాదులూ, కల్పితమయినట్లు- ఈసంసారజాలంలో చతుర్దశ భువనములూ, భూతజాతులూ, పక్షులవలె పరిభ్రమించుచున్నవి- ఇందులో ఇంద్ర, అగ్ని, యమ, వరుణ, కుబేరాదులు దిక్పాలకులుగా నున్నారు వారు- శ్రుతి స్మృతి సదాచార విహితమయిన పుణ్యమును ఆచరింపుమనీ, తన్నిషిద్ధమయిన పాపము హేయమనీ ఒకవిధమయిన మర్యాదను ఏర్పాటుచేశారు వారివారి అధికారమునుబట్టి- ఈమర్యాదతో నడచే కాలప్రవాహంలో తన అధికారం తాను నెరవేర్చుకుంటూ స్థిరచిత్తుడుగా నున్నాడు యముడు- ఇతడు ప్రతి నాలుగు యుగములకు (చతుర్యుగమునకు) భూతహింసవలన పాపము వచ్చినదను

భావముచే కొంతకాలము తపస్సుచేయును— ఒకపుడు తొమ్మిది వత్సరములు— మరొకపుడు పదిసంవత్సరములు— ఇంకొకపుడు పన్నెండు సంవత్సరములు— మరొకపుడు 16 సంవత్సరములు— మరొకపుడు 17 సంవత్సరములును— కాలనియమం లేకుండా తపస్సుచేస్తూ ఉంటాడు— ఆయముడు అలాంటి తపోనియమంలో ఉన్నపుడు మృత్యువు ఏ భూతములనూ హింసించదు— అందుచేత మహీతలము (భూతలము) అనేకమంది ప్రాణిసమూహాములతో నిండి ఎక్కడా సంచరించటానికి సందులేకుండా ఉంది— బాధపడుతూ ఉంటుంది— వర్షాకాలంలో దోమలతో అడవిలో ఏనుగుబాధ పడినట్లు—

ఆస్థితిలో భూభారమును తీర్చదలచిన విష్ణ్వాదిదేవులు అంశలతో అవతరించి భారతయుద్ధము మొదలగు ఉపాయములతో భూతములను హింసించి భూభారమును తొలగింతురు— ఇదీ యుగచరిత్ర. ఇలాంటి యుగాలు యిప్పటికి కొన్నివందలూ, కొన్నివేలూ, అనేకమార్లు గడచాయి—

ఇపుడు వైవస్వతుడను యముడు పితృనాయకుడుగా వచ్చాడు— ఇతనిచే కొన్నిభూతాలు నశింపచేయబడ్డాయి— ఆపాపం పోగొట్టుకోటానికి, 12 సంవత్సరములు నిర్వికల్పసమాధిలో తపస్సుచేయదలచాడు— ప్రారంభిస్తాడు— అంచేత ప్రాణుల కింక మరణముండదు— మరణములేని ప్రాణులు కోట్లకొలది పెరిగిపోతారు— వారిలో భూదేవతకు అపారమయిన భారంకలుగుతుంది— దానితో బాధపడుతూ సహింపలేక విష్ణుమూర్తిని శరణమొందకలదు— దొంగలచేతిలో చిక్కిన ప్రియురాలు చెంతనున్న భర్తను శరణుజొచ్చినట్లు— అపుడు శ్రీమహావిష్ణువు రెండురూపాలతో భూలోకమున అవతరించగలడు— ఆ రెండవతారములే లోకంలో నరావతారమనీ నారాయణావతారమనీ అంటారు పెద్దలు— ఇతర దేవతలంతా వారివారి అంశలతో అతనికి సాహాయ్యంగా అవతరిస్తారు—

ఇందు వసుదేవుని కుమారుడగు వాసుదేవుడు (శ్రీకృష్ణుడు) విష్ణుమూర్తియొక్క- మొదటిశరీరము- పాండుపుత్రుడగు అర్జునుడు రెండవశరీరము- యమధర్మరాజునకు కుమారుడగు యుధిష్ఠిరుడను నొక ప్రసిద్ధరాజు ఉండగలడు- అతడు నాలుగు సముద్రములమధ్య నుండు భూవలయమును పాలింపగలడు- పాండురాజునకు పుత్రుడు- ధర్మవేత్త- దుర్యోధనుడని యీతని పినతండ్రికుమారు డొకడుండును- వీరిరువురకు పరస్పర రాజ్యకాంక్షతో యుద్ధము తటస్థించును- అందు ఇరువురుకలిసి 18 అక్షౌహిణీల సైన్యమును ప్రోగుచేసికొందురు- ఆ సైన్యమంతయును సంహారింపఁజేసి విష్ణుమూర్తి భూభారమును తీర్చ గలడు గాండీవమును చేతబూనిన అర్జునుడను దేహముతో-

రామచంద్రా! అర్జునుడను పేరుగల మొదటి శరీరంలో ప్రాకృత భావము ప్రవేశించినది- హర్షామర్షములతో కూడినది- అజ్ఞప్రాయ మయినది- అట్టి అర్జునుడనువాడు మరణోన్ముఖులై ఇరుసేనలమధ్య నున్న స్వజనమును చూచి దుఃఖించగలడు- యుద్ధమునకు ప్రయత్నింప బోడు- అట్టి అర్జునదేహమును గురించి శ్రీమహావిష్ణువు తానువచ్చిన పనిని నెరవేర్చుకొనుటకు శ్రీకృష్ణదేహంతో తత్త్వమును బోధించ గలడు- ఇదీ ఆతడొనర్చినబోధ-

అర్జునా ! ఆత్మ జన్మమరణాది షడ్భావవికారములు లేనివాడు- నిత్యుడు- శాశ్వతుడు- శరీరమును చంపినా ఆత్మచచ్చువాడుకాడు- "నేను ఆత్మను చంపువాడను" "ఆత్మ నాచేత చచ్చువాడు" అని యనుకొనెడివారిరువురూ అజ్ఞానులు- ఆత్మయందు నాశహేతువులేవీూ లేవు- కనుక ఆతడు నిత్యుడు- అపరిచ్ఛిన్నుడు- చైతన్యస్వరూపుడు- అజ్ఞానకార్యమయిన కలంకములేవీూ ఆతనికిలేవు- నీవు ఇట్టిశుద్ధాత్మ రూపుడవు- కనుక నీకు బంధుసంసక్తివలని దుఃఖముకాని తన్మరణా దులవలని దుఃఖముకాని ఉచితముకాదు- అని ఉపదేశించారు శ్రీకృష్ణులు అర్జునునకు అని అన్నారు వసిష్ఠులు-

## ౫౩ వ సర్గము.

వసి॥ రామా! ఇంకా ఇలా అన్నాడు భగవంతుడు-

భగవాన్॥ అర్జునా! నీవు హననాది వికారములుగలవాడవు కావు- కనుక "నేను చంపువాడను" అను అభిమానమును పూర్తిగా వదలు- "నేను కర్తను" అను అభిమానములేనివాడును, హర్షవిషాదాదులతో అంటనివాడునూ, ముల్లోకములనూ హింసించినా హింసా దోషమును చెందడు- నీహృదయంలో దేహేంద్రియాదులయందు అభిమానరూపమయిన ఏబుద్ధివృత్తిఉంటుందో "కార్యకారణ సంఘాతాత్మకమయిన నేను హంతను" "ఈ దేహసంబంధమయిన బంధ్వాదులు నావారు" అనే బుద్ధిని విడిచిపెట్టు- చంపుట, చంపబడుట, యను ధర్మములు శరీరానివికాని ఆత్మవికావు- అట్టి శరీరంతోటి తాదాత్మ్యభ్రాంతి ఉండేసరికి ఆత్మయందు ఆరెండూ భాసిస్తూ ఉంటాయి- కనుక ముందు ఆతాదాత్మ్యభ్రాంతినే విడిచిపెట్టాలి- సత్త్వాదిగుణవికారములయిన దేహేంద్రియాదులవల్లనే కర్మలు చేయబడుతున్నాయి- అహంకారవిమూఢుడు ఆపనులందు తానేకర్తనని అనుకుంటాడు- నాకన్ను చూస్తోంది- నాచెవివింటోంది- నాచర్మము స్పృశిస్తోంది- నానాలుక రుచి చూస్తోంది- నామనస్సు సంకల్పిస్తోంది- చేయుగాక ఇవన్నీ ఈపనులు- ఇందులో నేనెవడను? కన్నుకాదు- చెవినికాను- చర్మమునుకాదు- వీటన్నిటికి విలక్షణుడను- అనేస్థితి రావాలి ప్రతివాడికీ- ఈస్థితి అబ్బినవాడికి ఏకష్టము ఉండదు- అది అబ్బనివాడికే అన్నికష్టాలూ-

లోకంలో కొంతమంది సమూహంగా కలిసి ఒకపనిచేస్తే అది చెడిపోయినపుడు ఆసంఘంలో చేరిన ఒకొ్కడు సంఘాతంమీద అభిమానంచేత దుఃఖిస్తే లోకులు వాడిని ఎగతాళిచేస్తారు- సంఘాతంలో చేరినవాడిపరిస్థితే అవమానాస్పదమయితే దేహేంద్రియాది సంఘా

తమునకు బహిర్భూతుడగుచున ఆత్మ దేహేంద్రియాది పనులనుగురించి దుఃఖిస్తే ఇంకేమి చెప్పాలి?

కనుక అర్జునా! యోగులు నిరహంకారులై ఫలాసంగము లేకుండా మనోవాక్కాయేంద్రియములతో కర్మలు చేస్తున్నారు- అవి వారికి చిత్తశుద్ధిద్వారా జ్ఞానోద్దీపకములై పరమపురుషార్థమును ప్రసాదిస్తున్నాయి- కనుక నీవుకూడా నిరహంకారుడవై ఫలాసక్తిలేకుండా స్వధర్మమగు యుద్ధంచేస్తే దుఃఖంలేదు- అర్జునా! అహంకారమనేది విషచూర్ణము- ఇది ఒంటికి సోకిందా చంపుతుంది- సోకదా ఇంకోవాడు ఎన్నిపనులుచేసినా? ఎన్నిప్రాణాలుతీసినా? చేసినవాడూ కాడు- తీసినవాడూ కాడు- ఇలాంటివారే రాగాదిరోగాలు లేనివారు- రాగాది మలదూషితుడు లౌకికవ్యవహారానికీ పనికిరాడు- శాస్త్రీయవ్యవహారానికీ పనికిరాడు- వాడెంతయినా చదువనీ- ఎంతయినా వివేకవంతుడు కానీ- ఏమీ లాభంలేదు- ఆచదువుతోటీ, ఆవివేకంతోటీ ముఖ్యంగా అహంకారమమకారాలు లేకుండా ఉండాలి- ఇవి లేనివాడు ఎన్ని పనులుచేసినా నాటిఫలంతో లిప్తుడు కాడు-

కాబట్టి అర్జునా! యుద్ధమునీకు స్వకర్మ- అది ఉత్తమమయిన క్షాత్రధర్మం- అది ఎంతటి క్రూరమయినా శ్రేయోదాయకమే- ఎంతటి నీచమయినదయినా స్వకర్మశ్రేష్ఠమయినదే- కనుక నీవు నీస్వధర్మమును ఆచరించి విజయము పొందుము- లోకంలో మహాధమవకుకూడా స్వకర్మ శ్రేష్ఠమని చెప్పబడింది- ఇంక బుద్ధిమంతునకు ఏమని చెప్పాలి? అహంకారరహితమయినమతి ఎంత అపవిత్రమయినా ప్రత్యవాయమును చెందదు- కనుక అర్జునా! ఫలసిద్ధ్యసిద్ధులయందు సమతాబుద్ధితోనుండి ఫలేచ్ఛనువిడిచి స్వధర్మమగు యుద్ధమును ఆచరించు పాపమును పొందవు-

లేకపోతే బ్రహ్మార్పణబుద్ధితో శాస్త్రీయమయిన ఈకర్మను ఆచరించుము- అట్టి నిర్విశేషబ్రహ్మాత్మత్వజ్ఞానం నీకు కలుగకపోతే సగుణేశ్వరార్పణబుద్ధితో నయినా చేయుము-

లేక సర్వసంకల్పత్యాగ లక్షణమయిన సన్న్యాసముతో నయినా చేయుము- ఇందేవిధముగ జేసినా నీకు కర్మబంధమంటదు- అన్నాడు శ్రీకృష్ణభగవానుడు-

శ్రీరా॥ మహర్షీ! 1. సంగత్యాగమనగానేమి? 2. బ్రహ్మార్పణ మననేమి? 3. ఈశ్వరార్పణమననేమి? సన్న్యాసమననేమి? జ్ఞాన మననేమి! యోగమననేమి? వీటివిభాగమును ప్రత్యేకించి క్రమంగా చెప్పుమని అడిగాడు శ్రీరాముడు-

ఇందుకు సమాధానము చెప్పదలచారు వసిష్ఠులు. కాని ఆత్యం తిక సంగత్యాగము తత్త్వపరిజ్ఞానము లేనిదే సంభవించనందున వసిష్ఠులు మొట్టమొదట ఆత్మతత్త్వమునె (బ్రహ్మతత్త్వమునే) లక్షణపూర్వ కముగ నిర్దేశించుచున్నారు-

వసి॥ రామా! నిర్వికల్ప సమాధి పరిపాకదశలో సాక్షాత్కార మయ్యేడి నిష్ప్రపంచప్రత్యగాత్మరూపమే పరబ్రహ్మము- తదాకార మగు చిత్తవృత్తి జ్ఞానమనీ, ధారావాహికమగు తదాకారచిత్తవృత్తి యోగమనీ అందురు- సకలప్రపంచమూ "అహం" (నేను) బ్రహ్మనని తెలిసికొనుట బ్రహ్మార్పణమనియందురు- బ్రహ్మయందభిమానపడెడి ప్రపంచమునకూ, అభిమానించెడి అహంకారమునకూ బాధయే ముఖ్య మగు బ్రహ్మార్పణము-

బ్రహ్మ అంతఃశూన్యము- బహిశ్శూన్యము- పాషాణహృద యము (పాషాణముయొక్క మధ్యభాగమువలె) చిద్ఘనసారము- పరమ శాంతము- ఆకాశమువలె అతిస్వచ్ఛము- సర్వదృశ్యరహితము- దృగ్రూపము- (దృక్కునకు మరొకదృక్ లేదు- అట్లున్నచో మొదటి దృక్ నకు దృశ్యతాప్రయుక్తమయిన నిషేధము ప్రాప్తించెడిది-

ఇలాగంటి దృక్స్వరూపమునుంచి (లేక ఇలాంటి చిత్స్వభావము నుంచి) కొంచెము భిన్నముగా గోచరించుటయే (పుట్టుటయే) ప్రపంచ ప్రతిభాస- ఈయది గంధర్వనగరాకాశమువలె శూన్యమయినది-

అట్టి అఖండ చిత్స్వరూపమునుంచి "అహమ్" "నేను" అనే భావము పుట్టినది- ఇది యుచిదంశమే- కాని ఇది ఆ అఖండ చిదాకారములో కోటికోటి అంశము- ఈయది అత్యల్పమయిన అధ్యాస కనుక దీనియందు ఇంతటి ఆగ్రహము (అభినివేశము) ఎందుకు ?

ఈ అహం అనే భావము (అహం అనే చిదంశము) కూడా అధిష్ఠానచైతన్యముకంటె వేరుగాదు- వేరుగా కనుపడుతుంది- దీనికి కారణమేమంటే బ్రహ్మయందు పృథక్త్వమనేది (అనగా పరిచ్ఛేదము)లేదు- ఎందువల్లననగా లేనివాడెవడు ? (అసన్ అసద్రూపుడెవడు) "అహం" నేనని యనుకొనుటలేదు- "నేను" అని అనుకొనుచున్నాడు కనుక పృథక్త్వము ఉపపన్నమా ? లేక పృథక్త్వమున్నది కనుక నేనని తెలిసికొనుట ఉపపన్నమా ? అని విచారించి ఏదో ఒకదానిని తీసివేయవలసివస్తే అపుడు ఉపపత్తిరహితమయిన పృథక్త్వమునే విడువవలెను- (తీసివేయవలెను) అవగతిని తీసివేయరాదు- ఇది అఖండ చిదాకారాభిన్నము-

ఇదిఎలాగో మమతాభావముకూడా అలాగే- అనగా అఖండ చిదాకారబ్రహ్మముకంటె "అహంభావము" అహంఅనే పదార్థము వేరుగా ఎలాలేదో అలాగే ఈప్రత్యగాత్మయందు ఘటాది మమతేహా లక్షణమయిన (ఇది నాకుండ అను కోరికరూపమయిన) కోతికూడా వేరుగాలేదు- కనుక "అహమిహా మమ తేహా" అనునవి రెండును సముద్రమువలె పూర్ణబ్రహ్మాత్మకములే- కనుక మానవులకు అహంతాగ్రహముకాని, మమతాగ్రహముకాని యుక్తము కాదు-

మరియు అహంతా మమతాది నిఖిలవికల్పభేదము ఆయావిషయవైచిత్ర్యభేదముచే విచిత్రముగా స్ఫురించుచున్నా వాటియొక్క సత్తాస్ఫూర్తులకు (ఉనికిప్రకాశలకు) నిమిత్తమున్న అవస్థాత్రయమునందనుగతమున్న, సంవిత్సారమాత్రస్వభావమున్నా, (చిద్ఘనము) సర్వవికల్పములయొక్క ఆగమాపాయములకు సాక్షియు నగు ప్రత్యగాత్మ

యందు ఏకత్వముకూడా స్ఫురిస్తూనే యున్నది- ఈస్థితిలో ఆత్మై కత్వమునందుకూడా మానవులకు ఆగ్రహము (అభినివేశము) అవశ్యకము- అదియెక్కడా కనిపించుటలేదు- కారణమేమో తెలియదు-

కనుక రామా! ఇలా విమర్శించుకోవాలి- సారాసారవిభాగమును చక్కగా తెలిసికోవాలి బుద్ధియందు అహంతామమతాగ్రహము ("నేను, నాది" అనేభావము) నశించాలి- దానివలన సర్వకర్మఫలములందును నిస్పృహ అనేది అర్థాత్ సిద్ధిస్తుంది దీనినే త్యాగమంటారు- దీనివలన సర్వసంకల్పాలను విడచుట అనే అసంసంగం (సంగత్యాగము-౧) సిద్ధిస్తుంది- ఇల్లా మొదటిప్రశ్నకు జవాబు వచ్చింది-

౨) బ్రహ్మార్పణమనేది లోగడనే దీని ఉపోద్ఘాతంతో వివరించబడింది- కాన అదీ ఉత్పాదితమే- (సమాహితమే)-

3) సమస్త ద్వైతజాలము వాచారంభణశ్రుతియందు చెప్పినన్యాయముగ తదుపాదానకారణమయిన ఈశ్వరమాత్రముగ భావించుట (ద్వైతనిర్భాసము లేకుండుట) ఈశ్వరార్పణము-

ర) సర్వకర్మసన్యాసమను నాల్గవ ప్రశ్న సర్వసంకల్పత్యాగలక్షణమయిన అసంసంగమను మొదటి ప్రశ్నయొక్క సమాధానమునందే యిమిడియున్నది కాన అదియును సమాహితమే-

చిదాత్మయందు జీవులకు భేదభావన అజ్ఞానముచే కలుగుచున్నది- ప్రపంచమనే శబ్దమున కర్థము బోధరూపమయిన పరమాత్మయొక్కటే- ఇందు సందేహములేదు- దిక్కులు నేనే- కర్మ నేనే- కాలము నేనే- అద్వితీయమగు బ్రహ్మము నేనే- ద్వైతము నేనే- ప్రపంచము నేనే-

కనుక నేను సర్వాత్మస్వరూపుడను- నాకంటె భిన్నముగ ప్రపంచములో ఏదియులేదు- కనుక అర్జునా! నీవు నాయందు మనస్సును ఉంచు- భక్తికలిగిఉండు- నన్ను పూజించు- నన్ను నమస్కరించు- ఈయోగముతో ఉన్నచో నీవు నన్నే పొందగలవు- అని అన్నాడు శ్రీకృష్ణుడు-

అర్జు॥ స్వామీ ! మీకు రెండురూపాలు ఉన్నాయన్నారు- వానిలో నేను ఎప్పుడు ఏరూపాన్ని ఆశ్రయించేది? ఏకాలంలో ఏరూపాన్ని ఆశ్రయిస్తే ఫలిస్తుంది? ఈవిషయం కొంచెం సెలవివ్వండి- అని అడిగాడు అర్జునుడు-

భగవంతుడు॥ అర్జునా ! నాకు రెండురూపాలు ఉన్నమాట వాస్తవం- అందులో ఒకటి అందరకు సులభంగా తెలియతగినది- మరొకటి చిత్తశుద్ధిలేనివారికి తెలుసుకోటానికి సాధ్యంకానిది-

శంఖచక్రగదాద్యాయుధాలు ధరించి చేతులు కాళ్లూ కలది మొదటిరూపం- అనగా సర్వసాధారణరూపం- రెండవది ఆద్యంతములు లేనిది- సంసారవ్యాధులతో అంటనిది- బ్రహ్మ, ఆత్మ, పరమాత్మ అనే పేర్లు గలది-

నీకు చిత్తశుద్ధికలిగి జ్ఞానం ఉదయించేవరకు చతుర్భుజాద్యాకార విశిష్టమయిన మొదటిరూపాన్ని పూజించు- దీనివల్ల క్రమంగా చిత్తశుద్ధికలిగి జ్ఞానోదయం అయినదా నాపరరూపాన్ని తెలిసికోగలవు- ఆపైన నీకు పునర్జన్మ ఉండదు-

నీకు చిత్తశుద్ధి కలగలేదను కొని నేనీక్రమమును చెప్పాను- ఒకవేళ నీచిత్తం తెలిసికొనతగిన పరమార్థతత్వాన్ని తెలిసికొనతగినదే అయితే అపుడు శోధిత తత్పదార్థ స్వరూపమునే ఆశ్రయించు-

"అదినేను" "ఇదినేను" అని చెప్పటంలోకూడ నాతాత్పర్యం వాటికి అధిష్ఠానమయిన శుద్ధచిత్తత్వము నేననే నాఉపదేశాన్ని గ్రహించావని నేను విశ్వసిస్తున్నాను- స్వస్వరూపంలో విశ్రాంతి చెందావని నేను నమ్ముచున్నాను- నీకు సర్వసంకల్ప త్యాగంకలిగింది- సమదృష్టి కలిగి సర్వభూతములను నీఆత్మయందూ, సర్వభూతములందు నీఆత్మనూ చూచుకో ఈదృష్టితో ఉంటే ఇంకనీవు ఎలా వ్యవహరించినా పునర్జన్మ ఉండదు-

సర్వభూతములందును అధిష్ఠానముగా నున్న అద్వితీయాత్మను గ్రహించినవానికి కైవల్యము కరతలామలకము- అధిష్ఠానదృష్టిలో సర్వశబ్దార్థము అద్వితీయాత్మయే- అట్టి ఆత్మ చిత్స్వభావము(చిదాత్మకము) అయిననే అద్వితీయమగును- ఇలాంటి చిదాత్మకమగు ఆత్మ మూర్తములయిన భూతత్రయాత్మకముకాదు- అమూర్తమయిన సూక్ష్మభూత ద్వయాత్మకమున్నుకాదు- అనగా పృథివ్యప్తేజోరూపముకాదు- వాయ్వాకాశాత్మకమున్ను కాదని అర్థము.

ఇట్టి ఆత్మ చైతన్యము (చిదాత్మ) సర్వానుభవసిద్ధ మగుటచే పరోక్షముకాదు ఎవ్వరికి- లోకంలోని నీటియొక్కయూ, ఆవుపాల యొక్కయు, సముద్రములో బుట్టిన లవణాదులయొక్కయూ రసానుభవమే ఆత్మ- ఇది అపరోక్షానుభవమేకాని పరోక్షముకాదు- నేను "విషయజాతంతో ముక్తుడనయినాను" అని యెల్లప్రాణులకు లోపల కలిగెడి సూక్ష్మానుభవమే ఆత్మ-

పాలు అన్నిటిలోను నెయ్యి ఉన్నట్లు నిఖిలపదార్థములకు అధిష్ఠానంగా ఆత్మ ఉన్నాడు- నిఖిలదేహాలకు లోపల ప్రకాశకుడుగానూ ఉన్నాడు- రత్నముల లోపలనున్న తేజస్సు బయటకూడా ప్రకాశింపచేసినట్లు దేహాదుల లోపలఉన్న ఆత్మ దేహేంద్రియాదులతో అంటకుండా ఉండే వెలుపలనున్న విషయజాతమును ప్రకాశింపచేస్తున్నాడు- అర్జునా! వెయ్యికుండలలోను లోపల వెలుపల ఆకాశం ఉంటుంది- అలాగే ముల్లోకముయొక్క శరీరాలలో లోపల వెలుపలా నేనున్నాను- వేలకొలది ముత్యముల హారములో లోపలనున్న దారం కనిపించకుండా ఉంటుంది- అలాగే లక్షలకొలది దేహాలలో నేనుకూడా కనిపించకుండా ఉంటాను- బ్రహ్మాది స్తంబపర్యంతమయిన పదార్థసమూహంలో సామాన్యరూపంగా సత్తయే జన్మాది వికారరహితమైన ఆత్మ అని మహనీయులు గుర్తించారు- సర్వపదార్థాలలోనూ అధిష్ఠానరూపంగా ఉన్ననిర్వికారస్థితే వాస్తవమయిన బ్రహ్మత- (అనగా బ్రహ్మత్వము)

ఇక ముత్యాలలో దారంవలె అంతర్యామి రూపంగా ఉనికిన్నీ రత్నములలో కాంతివలె (ప్రభవలె) ప్రకటమయిన జీవుడుగా ఉనికిన్నీ, ఈ రెండూ అధ్యస్తపదార్థములయొక్క అపేక్షకలవి- కనుక ఆ రెండు సత్తలు (ఉనికులు) ప్రపంచవ్యవహారం కొరకు కల్పితాలు- వాస్తవములుకావు- కనుక అర్జునా! లోకంలో వాస్తవంగా చంపతగిందీ లేదు- చంపువాడూ లేడు- తత్ప్రయుక్తమయిన (అనగా చంపుటవల్ల వచ్చే) పాపమూ లేదు- ఆపాపఫలాన్ని యిచ్చే యీశ్వరుడూ ఆత్మకంటె వేరే లేడు- ఇదంతా వట్టి భ్రాంతి-

ప్రతిబింబాలకు అద్దం ఎలా ఆధారమో అలాగే ప్రపంచానికి అంతటికీ నేను ఆధారంగా సాక్షిమాత్రంగా ఉన్నాను- ప్రతిబింబంయొక్క వికారాలు అద్దానికి అంటవు- ప్రాపంచిక పదార్థాల వికారాలు అధిష్ఠానమయిన నాకూ అంటవు. లోకంలో సకల దేహాలలోను "నేను నేను" అని ప్రకాశించే చిదంశమే నేననీ (పరమాత్మ అనీ) జడమయిన దేహేంద్రియ విషయాంశము నేను కాదనీ (పరమాత్మ కాదనీ) మాటలలో విభాగము ఒకటికనిపిస్తోంది- ఈమాట మార్పు (విభాగోక్తి) కూడా ఒక అద్దంలో ప్రతిఫలించిన అనేక అద్దాలలోను, ఘటాదులలోను వ్యావృత్తమయిన (భిన్నమయిన) దర్పణస్వరూపమును పరిచయం చేయటానికి చెప్పిన దర్పణాదర్పణ విభాగోక్తివంటిదే కాని మరొకటి కాదు- కాబట్టి దర్పణమువలె నిర్లిప్తమయిన అద్వయపదార్థమే సర్వవ్యాపకమయిన పరమాత్మ అని గ్రహించాలి- సముద్రంలో నీటి తుంపురులు బయలు దేరినట్లు పరమాత్మయందే సృష్టిస్థిత్యాదివికారాలు బయలుదేరుతున్నాయి- ఇవి అహమభిమానముగల చిత్తంలో ఉండే వికారాలు- ఈచిత్తం పారమార్థికం కాదు- ఆత్మయే పారమార్థికుడు- కొండలన్నీ రాళ్ళరూపములే- చెట్లన్నీ కొయ్యలే- తరంగాలన్నీ జలరూపములే- అలాగే పదార్థాలన్నీ ఆత్మరూపములే- ఆత్మ సర్వభూతములందున్నాడనీ, ఆత్మయందు సర్వభూతములు ఉన్నవనీ, గ్రహింపగల

వాడే నిర్వికారమయిన ఆత్మను గుర్తించగలడు- అర్జునా! తరంగాలు ఎన్ని ఆకారవికారములుకలవి అయినా అవన్నీ ఎలా జలరూపములో ఆభరణములు ఎన్ని ఆకారములు కలవయినా అన్నీ ఎలా సువర్ణ (బంగారు) రూపములో అలాగే ప్రపంచ పదార్థాలన్నీ పరమాత్మ స్వరూపములే- తరంగాలన్నీ నీటిలో చలిస్తూ ఉంటాయి- బంగారంలో కటకకుండలాదులు తిరుగుతూ ఉంటాయి- అలాగే భూతాలన్నీ పరమాత్మయందే సంచరిస్తున్నాయి- కాబట్టి అర్జునా! ఈపదార్థ జాతమూ, ఈభూతములూ, సర్వవ్యాపకమయినా బ్రహ్మపదార్థమూ, ఇదంతా ఒకటేకాని యిందులో పృథక్త్వములేదు ఈమన్మాత్రము కూడా- ఈస్థితిలో ఎప్పుడు నిర్వికారమయిన బ్రహ్మఒక్కడో (అద్వితీయమో) అప్పుడు జన్మాది భావవికారాలకు ఆశ్రయమయిన వస్తువు మరొకటియేది? నీకు బంధువధాదులవలన కలిగెడి భావవికారాలు మాత్రం ఎక్కడివి? ప్రపంచంమాత్రం వేరే ఎక్కడిది- కాబట్టి ఎందుకు వృథాగా పరితపిస్తావు- మహనీయులయిన ఋషులు ఈవిషయం శ్రవణం చేసి భయరహితమయిన బ్రహ్మను మనసులో భావనచేసి, జీవన్ముక్తులుగా సంచరిస్తున్నారు- అలాంటివారికే ఎన్నటికయినా విదేహకైవల్యావాప్తికూడాలభ్యమవుతుంది- లేనివారికిలేదు. అహంకారరహితులై, నిస్సంగులై, ఆత్మనిష్ఠులై, నిష్కాములై సుఖదుఃఖాది ద్వంద్వరహితులకు విదేహకైవల్యం కరతలామలకం- (అరచేతిలోని ఉసిరిగపండు)

ఇలా అర్జునోపాఖ్యానమనే ౫౩ యేబదిమూడవసర్గ

సమాప్తము.

## ౫౪. ఆత్మజ్ఞానోపదేశము.

భగవానుడు॥ అర్జునా! నీమేలుకోరి మహత్తరమయిన మరో మాట చెబుతావిను- లోకంలో చాలమంది శబ్దస్పర్శాది విషయములే సుఖదుఃఖరూపములని అనుకొంటున్నారు- అదిచాలా పొరపాటు-

"మాత్రాస్పర్శాః శీతోష్ణసుఖదుఃఖదాః" ఇంద్రియాలకు విషయాలతో గల సంబంధములు సుఖదుఃఖముల నిచ్చుచున్నవి- అలాంటి విషయేంద్రియ సంబంధములు నిత్యములుగావు- కనుక ప్రియమయిన వస్తువులందు విరక్తి చెందు- అప్రియవస్తువులందు ఓర్పు జెందు- మరియు ఇంద్రియాలుకాని, విషయాలుకాని, సుఖదుఃఖాలుకాని ఇవియేవీ అద్వయపరిపూర్ణానంద స్వభావుడయిన పరమాత్మకంటె వేరుగావు- కనుక నీకు సుఖమెక్కడిది? దుఃఖమెక్కడిది? సుఖమంటే ఏమిటి? దుఃఖమంటే ఏమిటి? కొంచెం విచారించు- సుఖమంటె "అతిప్రియమయిన ధనపుత్రాది సంపదతో నేను పరిపూర్ణుడను" అనే భావమే కదా! దుఃఖమన్నా వాటివియోగమువల్ల కలిగే "ఖండితో౽హం" నేను చంపబడితిని" అనేభావమేకదా! ఈ రెండుభావాలూ భ్రాంతిసిద్ధములు- ఆద్యంతములు లేనివాడై నిరవయవుడయిన పరమాత్మయందు పూరణముకాని ఖండనముకాని ఎలాసంభవిస్తుంది? కనుక విషయేంద్రియములు సత్యములనే ప్రతీతి ఎవనికి నశిస్తుందో (ఎవనికుండదో) వాడే (ఆజీవుడే) ధీరుడు- వాడే సుఖదుఃఖములందు సమతాబుద్ధి గలవాడు) వాడే ముక్తిబొంద సర్హుడు-

అయితే దుఃఖాదులు అప్రియములు కదా! అవి ప్రతికూల వేదనీయములుకదా! వాటియందు ఆభావాన్ని రూపుమాపుకొనడం ఎలాగు? వాటిని సహించడం ఎలాగు? అనే సందేహం నీకు కలగవచ్చు- కాని సరియయిన సందేహంకాదు- కారణంఏమంటే? ప్రపంచం అంతా నిరతిశయానందైకరసస్వరూపుడయిన ఆత్మస్వరూపమేకాని అతనికంటె వేరుకాదు- కనుక ప్రపంచాంతర్గతములయిన దుఃఖాదులు కూడా ఆనందైకరూపుడయిన ఆత్మస్వరూపములే- ఈస్థితిలో దుఃఖాదులయందు మాత్రం (ప్రతికూలవేదనీయతాభావము) నాకీయవి ప్రతికూలములను భావము ఎలాకలుగుతుంది? కలిగితేమాత్రం అదియుక్తికి నిలిచేదిఎలా? ప్రతికూలవేదనీయములనుకుంటే అవి ఆరూపంతో అస

ద్రూపాలే- ఆత్మస్వరూపంతో కాని సద్రూపములు కావు- ఆరూపంతో ప్రతికూలవేదనీయములుగావు- ప్రతికూలవేదనీయములయినప్పుడు అసద్రూపములే అవి- అసద్రూపములనగా లేనివని యర్థము- లేనివాటిని సహించడంలో బాధ ఏమి ? ఎంచేతసహించకూడదు ? కాబట్టి అర్జునా ! ఎలావిచారించినా సుఖదుఃఖాలనేవి ఏమాత్రమూ లేవు- ఉన్నదంతా ఆత్మతత్త్వమొక్కటే- అనాత్మపదార్థానికి సత్త (ఉనికి) లేదు-

లేని అనాత్మపదార్థానికికూడా ఉత్పత్తి (పుట్టుక) ఉన్నదని కణభక్షాక్షచరణులు (కణాదగౌతములు)అంటారు- స్వసత్తాసంబంధము కాని, అవ్యక్తణసంబంధము కాని ఉత్పత్తి (పుట్టుక) అని వాళ్ళమతం- అది నిలువదు- "నాసతో విద్యతేభావః నాభావో విద్యతేసతః" లేని సుఖాదుఃఖాది అనాత్మపదార్థాలకు (భావః - సత్త) ఉనికిలేదు- ఉన్న ఆత్మపదార్థానికి "అభావః" (అసత్త) లేకుండుట లేదు- పదార్థాలకు స్వభావవైపరీత్యము అసంభవం- దాని స్వభావం- అదివిడువదు- వాచారంభణాదిశ్రుతులు వికారజాతమంతా అసత్తు (లేనిద)ని నిశ్చయించాయి-

అయితే "కారణజాతమంతా కార్యస్వరూపముతో ఆలింగితమయియే అంటుకునే ఉంటుందని సత్కార్యవాదుల సిద్ధాంతం- వికారానాలింగితమయిన ప్రకృతి ఉండదు- అనగా కార్యముయొక్క సూక్ష్మస్వరూపము యిమిడి ఉండని కారణ వస్తువే అసంభవమని భావము- ఆపరిస్థితిలో కార్యము లేనిదయితే దానితో ఆలింగితమయియున్న కారణముకూడా లేనిదే- కాన శూన్యమే మిగులునుకదా ? అని ఒకప్రశ్న పుటుతుంది- అది సరియయిన ప్రశ్న కాదు- కారణమేమంటే కార్యముతో పాటు కారణముకూడా లేకపోతే "ఘటఃఅసన్ పటఃఅసన్" "ఘటము లేనిది, పటము లేనిది" అనే ప్రతీతే లోకంలో ఉండేది- అలా లోకంలో ప్రతీతి లేదు- "ఘటఃసన్ పటస్సన్" ఘటము ఉన్నది- పటము ఉన్నది- అనేప్రతీతే ఉంది- ఈప్రతీతికి కారణం

అధిష్ఠానముయొక్క (కారణముయొక్క) సత్తానుగతి (సత్తావేధ) యే కారణం- కనుక కారణవస్తువునందుండెడి సత్తను పుచ్చుకొనే కార్యము లందు సత్తాప్రతీతి కలుగుతోంది- అందువలన కారణం సద్రూపమే అవుతుంది- కాబట్టి శూన్యవాదము ప్రసక్తించదు- కాబట్టి అర్జునా! ప్రపంచమునందు సత్యతాబుద్ధిని విడిచిపెట్టు- ఆత్మయందు అసత్వ బుద్ధిని విడిచిపెట్టు- ఈజగదాత్మలనదుము ఆ రెంటియొక్క సంఘటనకు నిమిత్తమయిన మనస్సు అజ్ఞానమూ ఈ రెండూ అతి తుచ్ఛములని దూరంగా విడిచిపెట్టు- అపుడు మిగిలిన చిదాత్మయందు ప్రతిష్ఠితుడ వగుము- ఇదే నేను చేసే బోధనీకు-

అర్జునా! ఆత్మ సుఖములచే సంతసించే వాడుకాడు- దుఃఖా లచే కృశించే వాడూకాడు- దృశ్యములయిన హర్షవిషాదాలకు సాక్షి ఆత్మ- శరీరంలో ఉంటూనే వాటిని చూస్తూ ఉంటాడు- దృశ్యాలు ఎన్నటికీ దృక్పదార్థముయొక్క ధర్మాలుకావు- కానేరవుకూడా- జడమయిన చిత్తాదులే సుఖదుఃఖాదులకు భాజనములు- (స్థానాలు)- అవే దానికి దేహము (శరీరము)- అలాంటి చిత్తం దెబ్బతిన్నా నశిం చినా ఆత్మకేమీ బాధలేదు- నాశమూలేదు- జడమయిన చిత్తాది ఘటితమయిన జీవరూపము మాయామాత్రం- (భ్రాంతి సిద్ధం) నిజ స్థితిలో ఆత్మకంటె వేరుగా దేహాదులూలేవు- దుఃఖాదులూలేవు- ఇక ఎవరిచే ఏది ఎలా అనుభవింపబడుతుందో చెప్పు- అజ్ఞానంవల్లనే ఇది పుట్టింది- సమ్యగ్బోధచేతనే ఇది నశించాలి- ఇక్కడ నీకొక దృష్టాంతం చెబుతావిను-

త్రాడునుచూచి అజ్ఞానంచేత పాము అని కలిగిన భయం త్రాడు అనే జ్ఞానంచేత ఎలానశిస్తుందో అలాగే ఆత్మయందు అజ్ఞానంవల్ల కలిగిన దేహాదులు దుఃఖాదులుకూడా ఆత్మబోధవల్లనే నశించాలి- వేరే ఉపాయంలేదు- ప్రపంచం అంతా జన్మాదివికారాలులేని పరిపూర్ణ బ్రహ్మమే- అది (బ్రహ్మము) పుట్టదు- చావదు- అని నిజంగా

గ్రహించు- ఇదే పరమబోధ- బ్రహ్మఅనే సముద్రంలో ప్రపంచం అనేది ఒకతరంగం- అది అప్పుడప్పుడు పుట్టి బ్రహ్మఅనే సుడిగుండంలో కొంతకాలం తిరుగుతూ తుదకు బ్రహ్మఅనే సముద్రంలో లీనమవుతుంది- కాబట్టి నీవుకూడా నిరామయమయిన బ్రహ్మస్వరూపుడవే- సమస్త కాలకర్మ దేశములన్నీ బ్రహ్మగారి పరిస్పందమాత్రములు- నీవు నేను ఈ సైనికులవలె ఇవి "ఉన్నవి, లేవు" అనేది వట్టిభ్రాంతి- ఆభ్రాంతే ఉండకూడదు- కనుక అర్జునా! నీవు భయ, మాన, మద, శోక, ఇచ్ఛా సుఖదుఃఖాలను విడిచిపెట్టు- ఇది అంతాద్వైతం- అప్రమేయము- నీవు అద్వితీయమయిన సద్రూపుడవు- ఈనిశ్చయంలో ఉండు- ఇక ముందు నీవు చేయబోయే అనేకాక్షౌహిణుల సైన్యముయొక్క నాశము కూడా బ్రహ్మస్వరూపమే- ఈవిధమయిన అనుభవంతో శుద్ధబ్రహ్మ వగు నీవు ఈయుద్ధంతో అంతా బ్రహ్మమయము చేయుము- (బ్రహ్మ బ్రహ్మమయంకురు) సుఖదుఃఖలాభాలాభ జయాజయాలను ఆరూపంతో చూడక బ్రహ్మరూపంతో చూస్తూ శుద్ధబ్రహ్మతో ఏకత్వాన్ని పొందు- లాభాలాభములను సమానముగా చూచుకో- ఆత్మతత్త్వ నిశ్చయంతో ఉండు- ప్రాపంచికమయిన దేహాది రూపుడవు కాకుము- గుహాపరిచ్ఛిన్నమయిన (గుహాలోయిమిడియున్న) గాలి నిశ్చలంగా ఉండి నీ ప్రకృతకార్యాన్ని ఆచరించు- అనుష్ఠించు-

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
యత్కరిష్యసి కౌంతేయ తదాత్మేఽతిస్థిరోభవ ॥

అర్జునా! నీవుచేసే సర్వక్రియలు బ్రహ్మస్వరూపములనే స్థిరనిశ్చయంతో ఉండు- చిత్తము యదాకారముతో (దేని ఆకారముతో ఉంటుందో వాడు తదాకారాన్ని పొందుతాడు- ఇది నిజము- కాబట్టి నీవు సత్యమయిన బ్రహ్మస్వరూపాన్ని పొందాలని అనుకుంటె ముందు నీచిత్తాన్ని బ్రహ్మకారంగా తయారుచేసికో- బ్రహ్మజ్ఞులయినవారు

సర్వకామోపరతియే పరమపురుషార్థమని భావించి బ్రహ్మనిష్క్రియయే మని గ్రహించి వృథాచేష్టారూపమయిన కర్మను చేస్తున్నారు- కర్మ యందు అకర్మభావమును అకర్మయందు కర్మభావమును గ్రహించెడి పురుషుడే వివేకి- వాడే నిఖిలకర్మలను ఆచరించినవాడు- వాడే సమస్త ఫలములను పొందువాడు- అర్జునా! నీవు కర్మఫలములయిన లాభా లాభాలు ప్రవృత్తినిమిత్తములుగా కలవాడవు కాకుము- (అనగా లాభాలాభములనుద్దేశించి ప్రవర్తించువాడవు నివర్తించువాడవును కాకుము) నీకు ప్రాప్తమయిన కర్మను చేయకుండుటయందు గూడ నీకు ఆసక్తి ఉండకూడదు- సిద్ధ్యసిద్ధులయందు సమదృష్టితో కర్మలను ఆచరించాలి-

మాకర్మఫలహేతుర్భూః మాతే సంగోస్త్వకర్మణి ।
యోగస్థః కురుకర్మాణి సంగంత్యక్త్వా ధనంజయ ॥

అర్జునా! కర్మలందు ఆసక్తికూడదు- తత్త్వదృష్టిలో ప్రమాదమూ కూడదు- కర్మరాహిత్యమూ కూడదు- యథోచితంగా సమభావంతో ప్రవర్తించాలి- కర్మఫలమును అపేక్షించక నిత్యతృప్తుడై కర్మలయందు ప్రవర్తించినను తానేమీ చేసినవాడుకాడు ఫలాసక్తియే కర్తృత్వము- కేవలం కర్మలు చేయటంకాదు- అని శాస్త్రవేత్తల సిద్ధాంతం-ఫలాసక్తి అనేది అకర్తకుకూడా ఉంటుంది మనస్సులో ప్రమాదం (తత్త్వదృష్టియందు వేమరపాటు) అనేది ఉన్నట్లయితే- దానివల్ల యింక ఎన్ని అనర్థాలయినా సంభవిస్తాయి- కాబట్టి మూఢతను విడిచి పెట్టు- పరతత్త్వమును గుర్తించినవానికి అనాసక్తి సులువుగా అబ్బు తుంది-అలాంటివాడు సర్వకర్మరతుడయినా వాడికి కర్తృత్వముండదు- అకర్తృత్వం అనాయాసంగా సిద్ధిస్తుంది- ఆపైన అభోక్తృత్వం, పిదప సమైకత్వం, తరువాత అనంతత్వం, ఆవల పరిపూర్ణబ్రహ్మత్వం, ఇలా భూమికాక్రమంతో విదేహకైవల్యాంతం ఫలం సిద్ధిస్తుంది- అర్జునా! భేదదృష్టి అనేమాలిన్యం దూరంగా పారద్రోలి బ్రహ్మభేదదృష్టియందు

స్థిరపడినవాడు కార్యాకార్యములను చేయుచున్నా వాడు (కర్త) చేయువాడు కాడు. కనుకనే అభియుక్తులు అంటున్నారు ఇలా—

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితంబుధాః ॥

అని కోరిక, సంకల్పము, లేనివానిపనులు (కర్మలు) అంకురింపవు. ఫలమునీయవు. వాడికర్మలు జ్ఞానాగ్నిచే దహింపబడునని పండితు లంటారు— సముడు, సౌమ్యుడు, స్థిరుడు, స్వస్థుడు, శాంతుడు, సర్వార్థము లందును నిస్పృహుడు, అగువాడు సక్రియుడయినా అక్రియుడే అగును— అర్జునా! నీవు ద్వంద్వరహితుడవు, సత్త్వసంపత్తి గలవాడవు, యోగ క్షేమములందాశలేనివాడవు, ఆత్మజ్ఞానము గలవాడవు, యదృచ్ఛా లాభసంతుష్టుడవు, నయి నీవు భూమికి అలంకారభూతుడవగుము.

అలాకాక కర్మేంద్రియాలు బిగగట్టుకొని మనసా శబ్దస్పర్శాది విషయాలను స్మరించేవాడు మూఢుడు— వాడు మిథ్యాచారుడు— అని అంటారు పెద్దలు— ఇలాకాక కర్మేంద్రియాలను, మనస్సును, రెంటిని నిగ్రహించుకొని ఫలాసక్తి విడచి, కర్మేంద్రియాలతో కర్మయోగమును ఆచరించేవాడు చాలాగొప్పవాడు.

అర్జునా! నదులు ఆపూర్యమాణమయిన(పూర్తిగానిండియున్న) సముద్రంచేరి దానిలో కలిసిపోయి లీనమగుచున్నాయి— అలాగే అన్ని కోరికలు నిశ్చలమయిన బ్రహ్మయందు స్థిరపడిన ఏసన్యాసిని మిథ్యాత్వ బుద్ధితో బాధితవిషయములై ప్రవేశించునో అట్టి సన్యాసియే సర్వానర్థ శాంతిలక్షణమయిన మోక్షమును పొందును— "కామకామి" విష యములను కోరువాడు మోక్షము పొందనేరడు—

ఇట్లు ఆత్మజ్ఞానోపదేశమను ౫౨వ సర్గ సమాప్తము.

## ౫౫. జీవతత్త్వనిర్ణయము.

శ్రీభగవాన్ ॥ అర్జునా! దేహధారణకు హేతువులయిన అన్నపానాదులను పూర్తిగా వదలకూడదు- హితవు, మితము, మేధ్యము- అగునట్లు అశనాదులను స్వీకరించవలసినదే- కాని సుష్ఠుగా భోగములను సంపాదించాలనే వ్యసనమ్మాత్రం పనికిరాదు- వాటి లాభాలాభాలయందు సమభావంతో మెలగాలి- అలాగే జన్మాదివిక్రియలే స్వభావముగాగల దేహాదులందు ఆత్మభావనకూడా పనికిరాదు- జన్మాదివికారరహితుడై పరమార్థసత్యమయిన ఆత్మయందే ఆత్మభావన ఉంచాలి- అర్జునా! దేహనాశమువల్ల నశించేదేమీలేదు- ఆత్మనాశం వల్లమాత్రం అంతానశిస్తుంది- (అంతానష్టమే) అట్టి ఆత్మ నిత్యుడు- నశించేవాడు కాడు- దేహాది పరిగ్రహమునకు నిమిత్తం చిత్తము- చిత్తముకంటె వేరయినవాడు ఆత్మ- కనుక ఈతడు నశించడు- ఇలాంటివాడు యుద్ధాదికర్మలయందు ప్రవర్తించినను ఏమీచేసినవాడు కాడు-

ఫలాసక్తే కర్తృత్వమని అంటారు పెద్దలు- మనస్సు మూఢమయి ఉంటే అకర్తకుకూడా ఇది (ఆసక్తి) ఉంటుంది- కనుక ముందు మౌర్ఖ్యంవిడిచిపెట్టాలి- తత్త్వజ్ఞునకు ఫలాసక్తి ఉండదు- అదిలేనివాడు ఎన్నిపనులుచేసినా కర్తకానేరడు-(కర్తృత్వముండదు) ఆత్మ అవినాశుడనీ, ఆద్యంతములు లేనివాడనీ, జరామరణములులేనివాడనీ పెద్దలంటారు- ఆత్మనశిస్తాడనేది దుర్బోధ కాని సుబోధ కాదు- అది చాలా దుఃఖదం- అది నీకుండకూడదు- ఆత్మయందే అభిమానముగల విద్వాంసులు తమ దేహాదులను అనాత్మపదార్థముగనే చూచుకుంటారు-

అర్జునుడు॥ స్వామీ! అలాఅయితే మూఢులకు కూడా దేహనాశంవల్ల నశించేదేమీ లేదుకదా!

భగవానుడు॥ అర్జునా! అదినిజమే- వాళ్ళకుకూడా దేహనాశంవల్ల ఆత్మనాశంలేదు- ఆత్మ అవినాశస్వరూపుడు- వానికి నాశ

మొట్లు? ఇది నశించింది- ఇదిలభించింది- అనేది మోహభ్రమే కాని మరేమీ లేదు- ప్రపంచంఅంతా గొడ్డురాలి బిడ్డవంటిది- (లేక గొడ్డు రాలూ కొడుకును చూడలేదు- (కనలేదు) మనము ఆత్మకంటె వేరుగ ప్రపంచాన్ని చూడలేము- లేనిది ఉండుట, ఉన్నది లేకుండుట యెన్న టికీ జరుగదు- సదసత్తులయొక్క తత్త్వం తత్త్వవేత్తలు గ్రహించారు- ఆత్మతత్త్వము వినాశరహితము- సర్వవ్యాపకము- దానిని నాశ మొనర్చుటకు ఏరికీ సాధ్యం కాదు- అవినాశియయిన ఆత్మకు శరీరములు నాశముగావని నిరూపించారు- కనుక అర్జునా! యుద్ధంలో బంధువుల దేహాలు నశించినా ఆత్మకుకలిగే అనర్థంలేదు- కనుక యుద్ధము చేయుము-

ఆత్మ అద్వయము- అతనికి నాశకమయిన మరోపదార్థమే లేదు- కాబట్టి ఆత్మనాశానికి ప్రసక్తే లేదు- ఏకత్వము కారణము- ఇది సచ్ఛబ్దవాచ్యం- ద్విత్వం కార్యం- అసచ్ఛబ్దవాచ్యం- ఇది అనృ తం- ఈ రెంటికి మధ్యది (అంతరము) అధిష్ఠానసన్మాత్రము అదే పరమ పదము- అదే ఉన్నది- మిగిలినవి లేనివే- అని అంటారు శ్రీకృష్ణులు-

అర్జునుడు విన్నాడు శ్రీకృష్ణునిబోధ అర్జునుడు ఇలా అడి గాడు- స్వామీ! మీరన్నట్లు ఆత్మ అంతటి అపరిచ్ఛిన్నుడే అయితే అలాంటివాడికి మరణము మున్నగునది- కాని వానివలన పరిచ్ఛిన్న మయిన దుఃఖాదిభ్రమలు కాని సంభవించటానికి కారణమేమి? అని అడిగాడు-

శ్రీకృష్ణుడు సమాధానం చెబుతాడు-

అర్జునా! పంచభూతముల తన్మాత్రలచే మనోబుద్ధ్యాదులు నిర్మితములయినాయి- వాటిచే సమష్టివ్యష్టిస్థూలసూక్ష్మశరీరాలు తయారయినాయి- వాటితో తాదాత్మ్యం కలిగేసరికి పరమాత్మకు జీవభావమేర్పడింది- అలాంటి జీవభావమే జన్మమరణసుఖదుఃఖాది భ్రమనియతికి నిమిత్తమయింది- ఇంతకంటె వేరేమీ లేదు- లేగ

దూడను త్రాడుపట్టుకొని లాగినట్లుగా జన్మాంతర వాసన ఈజీవుణ్ణి సంసారంలోకి లాగేస్తోంది- పంజరంలో పక్షివలె జీవుడీశరీరంలో ఉండి పోయాడు- ఇలా కొంతకాలమునుండి దేశకాలవశంచేత దేహంజర్జరం కాగా వాసనావశంచేత (శరీరమునుండి) లేచిపోతాడు- కాలవశంచేత ఎండిన జువ్వి (రావి) ఆకునుండి రసము (తడి) లేచి(ఇగిరి) పోయినట్లు- పుష్పమునుంచి పరిమళం (సువాసన) లేచిపోయినట్లు, త్వక్చక్షుశ్శ్రోత్ర ఘ్రాణాదిఇంద్రియాలను లేవదీసికొని జీవుడు శరీరంనుండి లేచిపోతాడు- కనుకనే స్థూలదేహంకూడా చిరకాలానువృత్తమయిన వాసనామయమే కాని మరొకటికాదు- వాసనాత్మకమయిన లింగశరీరం క్షీణించేసరికి పరమపదము (ముక్తి) స్వయంగానే సంభవిస్తుంది- వాసనాత్మకమయిన ఈలింగశరీరం అన్నపానాదులచే పరిపుష్టం అవుతుంది- (అనగా అభి వ్యక్తమవుతుంది) లేక లింగదేహమునందు పరమాత్మ అవచ్ఛేదప్రతి బింబభావములచే ద్విగుణంగా ప్రవేశించి ఉన్నాడు- అంచేత లింగ దేహం పుష్టిచెంది ఉంటుంది- ఇలా పుష్టిచెంది (బలిసిపోయి) ఐంద్ర జాలిక పురుషుడు ఆకాశంలో తిరిగినట్లు జీవుడు ఈలింగదేహంతో ప్రతి యోనియందు తిరుగుతూ ఉంటాడు- గాలి పువ్వునుండి సుగంధాన్ని లేవదీసికొని పోయినట్లు జీవుడు శబ్దాదులను గ్రహించెడి శక్తిగల త్వగాదియింద్రియాలను లేవదీసికొని పోతాడు- అర్జునా! జీవుడు లేచి పోయేసరికి శరీరం నిశ్చలమయి పోతుంది- గాలి సంచిపోయేసరికి చెట్టు నిశ్చలంగా ఉన్నట్లు- చేష్టలేమీ ఉండవు శరీరానికి- ఛేదించినా భేదించినా ఏమీ తెలియదు దానికి- అప్పుడే లోకులు దాన్ని మృతశరీరం అంటారు- అదేజీవుడు చిదాకాశమందు లేక భూతాకాశమందు వాసనా వశంచేత ఏయే ఆకారాన్ని ధరించాలో ఆయా ఆకారాన్ని ధరించి ఆయాఫలాన్ని అనుభవిస్తూ ఉంటాడు- నిదపోయేవాడికి దేహం ఉన్నదీ తెలియదు- లేనిదీ తెలియదు- నశించినదీ తెలియదు- అలాగే అర్జునా! నీవుకూడా దేహవాసనను తుడిచిపెట్టుకో- ఆదిసృష్టిలో

హిరణ్యగర్భుడు వాసనావశంచేతనే ఈప్రపంచాన్ని సృష్టించాడు-ఇంతే కాని కుమ్మరి మృద్దండాదులచే కుండలను నిర్మించినట్లు నిర్మించలేదు-

స్వామీ ! ఈప్రపంచం ఉత్పత్తికాలంలో వాసనామయమై మిథ్యయగుగాక- స్థితికాలంలో అర్థక్రియాసమర్థమయి నందుననూ ఎల్లమానవులకు సత్యమను అనుభవం ఉన్నందువల్లనూ వాస్తవం ఎందువల్ల కాకూడదు-

అర్జునా ! నిజమే ఏవస్తువయినా పుట్టిన మొదటిక్షణంలో మిథ్యాభూతంగానో, సత్యంగానో, ఎలాకనుపడుతుందో అది ఎన్నాళ్ళకయినా అలాగే ఉంటుందికాని మారదు- అనగా సత్యమయితే సత్యమే మిథ్యఅయితే మిథ్యయే- కొంతకాలం సత్యమునీ, కొంతకాలం మిథ్యఅనీ ఉండదు- కాబట్టి దేహం వాసనామయం అయినందువల్ల అశుభవాసనలచే కల్పించబడిన దేహాదులు శుభవాసనాభ్యాసంచేత కలిగిన బ్రహ్మాకారవృత్తిచే సమూలం నశిస్తాయి- శ్రవణమననాది పురుషప్రయత్నజనితమయిన అఖండబ్రహ్మాకారజ్ఞానంచేత బాధింపబడతాయి శరీరాలు- ఇపుడనుష్ఠించిన ప్రాయశ్చిత్తంచేత నిన్న చేసిన పాపం పోతుంది- ఇపుడు చేసిన దాహానుకూలప్రయత్నంచేత నిన్న నిర్మించిన తృణగృహం (గడ్డికొంప) తగలపడుతుంది- అన్నారు శ్రీకృష్ణ భగవానులు-

స్వామీ ! మీరుచెప్పింది లోకంలో సరిపోవటంలేదు- జ్ఞానం కొరకు ప్రయత్నించేవాళ్లు చాలామంది ఉన్నారు- వాళ్ళ ప్రయత్నం అంతా ప్రబలములయిన జన్మాంతరీయకామక్రోధాదులచే నశిస్తోంది- కాబట్టి ఉత్తరవాసనలు ప్రబలములనీ, పూర్వవాసనలు దుర్బలాలనీ అనటానికి వీలులేదు- అన్నాడు అర్జునుడు-

భగవంతుడు॥ అర్జునా ! అలాకాదు- ధర్మార్థకామమోక్షములలో ఎవనికయితే నాకీపురుషార్థం ఆవశ్యకమని అభినివేశం ఉంటుందో

వాడికే ఉత్తరప్రయత్నం పూర్వప్రయత్నాన్ని అణగద్రొక్కుతుంది- అలాంటి అభినివేశం (పట్టుదల) లేనివాళ్ళకు అదిపని చేయదు- కాబట్టి మోక్షమునందు అభినివేశము మందమై భోగమునందు అభినివేశము దృఢమైనవాళ్ళకే అలాంటి పరాభవం కలుగుతుంది- కనుక శాస్త్రీయ ప్రయత్నమునందు గట్టి అభినివేశం ఉండాలి- వింధ్యపర్వతం బ్రద్దలగు గాక- ప్రళయానిలం వీచుగాక- ధీమంతుడయినవాడు శాస్త్రీయమయిన ప్రయత్నాన్ని విడువరాదు- అనాద్యజ్ఞానంచేత మూఢబుద్ధి గలవాడు నరకస్వర్గాది వాసనావశంచేత చిరాభ్యస్తమయిన దాన్ని చూస్తూ ఉంటాడు- అన్నాడు శ్రీకృష్ణుడు-

విన్నాడు అర్జునుడు- ఇలా అడిగాడు- స్వామీ! జీవుడు నరకంలో కాని స్వర్గంలోకాని ఉండటానికి సుఖదుఃఖాలు అనుభవించటానికి కారణం ఏమిటి? అనగా "అజ్ఞోజంతురనీశో౽యం ఆత్మనస్సుఖదుఃఖయోః। ఈశ్వరప్రేరితోగచ్ఛేత్ స్వర్గం వానరకంతువా॥" అనే వ్యాసవచనాన్ని పట్టిచూస్తే స్వర్గనరకాలు జీవుడికి ఈశ్వరప్రేరణ వల్లనే కలుగుతాయికాని మరోకారణం అందుకులేదని నాభావం- ఏమంటారుమీారు?

భగవా॥ అర్జునా! నీవు అనుకున్నది పొరపాటు- ఈశ్వరుడు కూడా జీవుల కర్మవాసనలను అనుసరించే సుఖదుఃఖాలను ప్రసాదిస్తాడు- కాబట్టి పరమపురుషార్థం కోరువాడు తత్త్వజ్ఞానం అభ్యాసపరచుకుంటూ దానిచే వాసనాక్షయం చేసికోవాలి- అప్పుడుకాని వీడికి పరమశ్రేయస్సు లభింపదు- ఈవాసనలే చిరాభ్యాసంవల్ల దృఢపడి సంసారభ్రమలను కలిగిస్తున్నాయి- అన్నాడు కృష్ణుడు-

అర్జు॥ కృష్ణా! అయితే ఈవాసనకు మూలం ఏమిటి? ఇది దేనిచే క్షీణిస్తుంది- అని అడిగాడు-

భగ॥ అర్జునా! అజ్ఞానమే దానికి మూలం- అనాత్మయందు ఆత్మభావనచే అది పెరుగుతుంది- ఆత్మజ్ఞానమనే మహాబోధవల్లనే అది

నశిస్తుంది— అర్జునా! నీవు ఆత్మభావనకలవాడవు— విజ్ఞానవంతుడవు— కనుక దేహసంబంధముగల బంధ్వాదులయందు అహంమమాభిమానమును విడిచిపెట్టు— అని అన్నారు శ్రీకృష్ణులు—

అర్జు॥ స్వామీ! మీరు సెలవిచ్చిన విషయంలో చాలాచిక్కు ఉందే— ఏమంటే! లింగశరీరం అంటే వాసనామయమే కదా! ఆలింగ శరీరంలో ప్రతిబింబించిన ప్రతిబింబమే కదా! జీవుడు— కాబట్టి జీవుడు వాసనామయమయిన లింగశరీరంవల్ల పుట్టిన (బయలుదేరిన) వాడే కదా! ఈస్థితిలో వాసనాక్షయం చేసికుంటే తత్త్వజ్ఞానంచేత జీవుడు పూర్తిగా నశిస్తాడుకదా! అప్పుడు అతడుపొందే పరమపురుషార్థంఏమి? ఆత్యంతికానర్థనాశంవల్ల కలిగిని ప్రయోజనమేమి? సర్వంవ్యర్థమేకదా! అన్నాడు అర్జునుడు—

భగ॥ అర్జునా! జీవుడు ప్రతిబింబమాత్రసంసారియే అయ్యేయడల అప్పుడు నీవన్నదోషం తటస్థించేదే— అప్పుడు జీవుడు పరమాత్మకంటె వేరనీ భూతమాత్రాధీన జన్మాదులు కలవాడనీ అంగీకరించినట్లవుతుంది— అదిసరికాదు— పరమార్థంలో శుద్ధమయిన బ్రహ్మమే అనృతమయిన అవిద్యచేత ఆచ్ఛాదించబడి తన నిజరూపం తనకు తెలియనివాడై తనయందే జీవభేదాన్ని జగద్భేదాన్ని కల్పించుకొని సంసరించుచున్న వానివలె కనిపించుచున్నది— అదే బ్రహ్మ శాస్త్రీయ శ్రవణాది ప్రయత్నంచేత తన నిజరూపాన్ని గుర్తించి వాసనా సహితంగా అవిద్యను పారద్రోలుకొని స్వస్వభావంలో ఉంటాడు— అదే యితనికి ముక్తి— ఇదీ శ్రౌతమగు సిద్ధాంతము— ఈసిద్ధాంతంలో నీవారోపించిన దోషమేమీ అంటదు— అర్జునా! ఈముక్తి జీవన్ముక్తి అనీ విదేహముక్తిఅని రెండువిధాలు— దేహధారణపర్యంతం ఉండే సమూలవాసనాక్షయం జీవన్ముక్తి అంటారు— అదియిక్కడే నీవనుభవించడానికి వీలవుతుంది— శరీరత్యాగానంతరం విదేహముక్తి లభిస్తుంది— ఈయది కర్మలవల్లరాదు— శాస్త్రాదిపాండిత్యంవల్లరాదు— ఎంతటి ధర్మ

పరుడయినా, ఎంతటి పండితుడయినా వాసనాక్షయం చేసికోకపోతే వాడు పంజరంలోని పక్షివలె బద్ధుడేకాని ముక్తుడుకాడు- కాబట్టి అర్జునా ? వాసనయే బంధము- వాసనాక్షయమే మోక్షము- అన్నారు శ్రీకృష్ణులు-

ఇట్లు జీవతత్త్వనిర్ణయము అను ౫౫ సర్గ సమాప్తము.

౫౬. చిత్తవర్ణనము.

భగ॥ అర్జునా ! ఇలా మనస్సును వాసనారహితంచేసికొని చల్లపరచుకొని (మనస్తాపం విడిచి) బంధువధదుఃఖాన్ని దిగమ్రింగు- జరామరణములందు సందేహించకు- చిత్తం ఆకాశంవలె నిర్మలపరచుకో- ఇష్టానిష్టసంకల్పాలు విడిచిపెట్టు- వీతరాగుడవై శిష్టాచారపరంపరాప్రాప్తమయిన నీస్వధర్మమగు యుద్ధం ఇంకా ఇతర ఆవశ్యక యాగదానాది కర్మలనుచేయుము- వానివల్ల నీతత్త్వబోధకు ఏమాత్రం చెరుపు లేదు- జీవన్ముక్తి అంటే శరీరేంద్రియాది చేష్టలను మానటం కాదు- ఫలేచ్ఛలేకుండా స్వధర్మం అనుష్ఠించడమే జీవన్ముక్తి- ఈపనిచేస్తాను ఈపనిమానుతాను- (చేయను) అనే భావం మూఢునకుకాని జ్ఞానికుండదు- జ్ఞానికంతా సమానమే- పరంపరాప్రాప్తమయిన స్వధర్మాన్ని ఆచరించే శాంతచిత్తులు సుషుప్తులవలె ఉంటారు- అనగా సుషుప్తాత్మలవలె నిర్విశేష స్వయంజ్యోతిరాత్మ మాత్రావశేషులుగా ఉంటారు- పైగా అలాంటివాళ్ళమనస్సు ప్రపంచ విషయాలనుంచి మరలి పరమాత్మయందు స్థిరంగా నిశ్చలంగా ఉంటుంది- తాబేటి అవయవాలు ఏమాత్రం విక్షేపం కలిగినా చప్పున లోపలికి పోతాయి- అలాగే జీవన్ముక్తుని యింద్రియాలుకూడా అత్యల్పమయిన విక్షేపాలను కూడ సహింపలేదు- వెంటనే అంతరాత్మయందు స్థిరపడుతుంది- (చేరిపోతుంది.) జీవన్ముక్తులు మనోరాజ్యంలో కల్పితమయిన నిర్భిత్తి చిత్రవైచిత్ర్యమువలె వ్యవహారకాలంలో వ్యవహరిస్తూ ఉంటారు- చిత్తమనే

చిత్రకారుడు (శిల్పి) ప్రపంచాధిష్ఠానమయిన ఆత్మయందు గోడలేని బొమ్మనువలె ప్రపంచాన్ని తయారుచేస్తాడు- అజ్ఞానాకాశంలో సాభాసాంతఃకరణవృత్తులనే వర్తికలతో (కుంచెలతో) అద్భుతమయిన బొమ్మను తయారు చేస్తాడు చిత్తశిల్పి- ఇందులో ఆశ్చర్యం ఏమంటె ఈచిత్తశిల్పి సమష్టి మనస్సుతో సంకల్పసమకాలంతోనే ప్రపంచమనే చిత్రపును తయారు చేస్తాడు- ఆపైన అమూర్తమయిన ఆకాశాన్ని దానికాధారంగా తయారు చేస్తాడు- ఆ ఆకాశం ఈచిత్రపును ధరించటానికి ఏమాత్రం తగిందికూడా కాదు- ఇదే ఇక్కడ ఆశ్చర్యం-(అద్భుతం) ఈరచన మాయకు అపూర్వం- తృణకుడ్యమువలె(గడ్డితో తయారుచేసిన గోడవలె) నిస్సారం- భ్రాంతులదృష్టిలో ఇది శుభమయినదిగా గోచరిస్తుంది- వివేకులదృష్టిలో అశుభమయినది- ఇదీగాక ఇక్కడ మరోఆశ్చర్యం ఉంది- అదేమంటే ప్రసిద్ధమయిన చిత్రపుల విషయంలో చిత్రపుకంటె భిన్నంగా గోడలుంటాయి- ఇక్కడ చిత్తమువల్ల తయారయ్యే వ్యోమాది చిత్తులకు (ఆకాశం మున్నగు గోడలు) ప్రపంచమనే చిత్రపునకు భేదమే ఏమాత్రం కనిపించదు- ఆధారాధేయములు రెండూ చిత్తమువల్ల తయారయినందున భేదం కనిపించదు- అర్జునా! చిత్తశిల్పివల్ల తయారయిన యీచిత్రపులు ఆకాశముకంటెకూడా శూన్యములు- చిత్తంలో ఒక్కక్షణకాలంలో లోకములయొక్క క్షయోదయాలు రెండూ జరిగిపోతాయి-

మనస్సు తత్కార్య (మనఃకార్య) మయిన జగత్తు ఈరెండూ శూన్యములు- అయినా చాలకాలమునుంచి అనువృత్తములయిన కారణంచేత మానవులకు సత్యత్వప్రతీతి కలుగుతోంది- భ్రాంతికల్పితమయిన పదార్థజాతమునందు సత్యసంకల్పత్వమనేది మూడుకాలములందూ లేదు- అయ్యది తత్త్వజ్ఞానముకంటె పూర్వంమాత్రం ఉన్నదా? లేదు- లేనిది ఎన్నడూ లేనిదే- లోకప్రసిద్ధమయిన వ్యావహారికసత్యత్వం తత్త్వదర్శనంచేత లయిస్తుంది- సౌరాలోకంచేత చూపబడే

శరత్కాలసంబంధమయిన మేఘమండలం ఆ సౌరాలోకంచేతనే శుష్కించి విలీనమవుతుంది- కనుక మానసికమయిన బంధువధాది క్లేశమాలిన్యం భ్రాంతిదశలో నీకు సముచితమే కావచ్చు- అర్జునా! పరమార్థదశలో ఆ బంధువులూ లేరు- నీవూ లేవు- నీవు వాళ్ళను చంపేదీ లేదు- వాళ్లు నీవల్ల చంపబడేదీ లేదు- ఇదంతా సంమోహ మాత్రం- దీన్ని విడచి నీవు నిర్మలంగా ఉండు- మనోరాజ్యమయిన ప్రపంచచిత్రవు అంతా నభస్సుమము- అసద్రూపం- నీకు ఎంతకాలం కనిపిస్తున్నా అది లేనిదే కాని ఉన్నది కాదు- భేదభావంతో ప్రపంచాను భవాన్ని పెంచుకుంటూ ఉన్న నీకు మనోరాజ్యంలో మోహంచేత కల్పించుకున్న వధ్యఘాతక భావాదికల్పన (వారు చంపదగినవారు నేను చంపువాడను అనుభావకల్పన) నా ఉపదేశంవల్ల నీకిప్పుడు నశించింది- లేనిదానిని పుట్టించే శక్తిగల మనసు ఒక్కక్షణాన్ని కల్పంగా తయారు చేయగలదు- ఒక్కక్షణాన్ని కల్పంగా తయారుచేసే మనస్సు లేని దానిని పుట్టించడంలో ఆశ్చర్యమేమి? కాబట్టి జగద్భ్రాంతియావత్తూ మనఃసామర్థ్యంవల్ల పుట్టినదనే గ్రహించు- నిత్యముక్తుడయిన ఆత్మ యందు అధ్యస్తమయిన ఈప్రపంచాన్ని వజ్రసారమయిన దానినిగా కల్పించుకుంటున్నారు అజ్ఞులు- ఇది తగదు- తత్త్వం తెలియక ప్రతి భాసవల్ల ఉన్నదనుకున్న దానికి స్థైర్యంఏమిటి? గట్టితనంఏమిటి? ఉన్న దానిని పోగొట్టుకోవటానికి ప్రయత్నించాలి కాని ఎప్పుడూ లేనిదానిని తొలగించుకోటానికి ప్రయత్నాపేక్ష ఎందుకు? ఈప్రపంచం నిజంలో లేకున్నా (స్వతఃఅసద్రూపమయినా) తనకు కారణసామగ్రీ లేకున్నా కళ్ళఎదుట స్ఫురిస్తూనే ఉంటుంది- కళః శిలాదులమూ నేత్రేంద్రియాదు లను ఆశపెడుతూ స్ఫురిస్తూ ఉంటుంది- ఈప్రపంచమనేది ఒక పెద్ద బొమ్మ- చిత్తమనేశిల్పి అధిష్ఠానచిదాకాశమునందు ముల్లోకముల రూపమయిన యీబొమ్మను తయారుచేశాడు- దీనికి సకలావయవా లను వాటివాటికి కావలసినరంగులను తయారుచేశాడు- కనుక ప్రపంచం అంతా మనోరాజ్యంకాని మరొకటి కాదు-

ఇట్లు చిత్తవర్ణనమను ౫౯వ సర్గ సమాప్తము.

## ౫౭. అర్జున విశ్రాంతి వర్ణనము.

భగ॥ అర్జునా! ఇది మహాశ్చర్యం- ముందు బొమ్మ తయారు కావటం- తరువాత గోడపుట్టటం- ఇది మాయయొక్క వైచిత్ర్యం- సారకాయబుర్ర నీటిలో మునిగిపోతోంది- రాయి తేలిపోతోంది-

ఇదిసరేకాని శూన్యమయిన జగత్రియంలో చిదాకాశరూపు డయిన నీకు ఇంతటి "అహంత" (నేనను భావం) పుట్టటం మరీ ఆశ్చ ర్యంగా ఉంది- ఈ ప్రపంచంకూడా చిదాకాశమే అనేదృష్టి నీకు ఉన్న ట్లయితే అప్పుడు చిదాకాశం చిదాకాశంలో లీనమయినట్లు ఆకాశంలో ఆకాశం అనుభవిస్తోంది- ఆకాశంలో ఆకాశం విస్తరిస్తోంది-

వాసనఅనే త్రాటిచే ఈదీర్ఘమయిన సంసారం మాలవలె చుట్ట బడింది- వాసన మనస్సులో చుట్టుకోనడంచేతనే సంసారం మనకు చుట్టుకుంటోంది- అద్దంలో ప్రతిబింబం పుట్టినట్లు బ్రహ్మయందు ఈ ప్రపంచం పుట్టింది- అద్దంలోని ప్రతిబింబం అద్దంతో అభిన్నం- బ్రహ్మ యందలి ప్రతిబింబమయిన ప్రపంచం బ్రహ్మాభిన్నం- బ్రహ్మ ఛేదించ టానికికాని భేదించటానికికాని సాధ్యంకాదు- బ్రహ్మాభిన్నమయిన ప్రపంచప్రతిబింబంకూడా ఛేదనభేదనాలకు సాధ్యంకాదు- బ్రహ్మ యందు ప్రతిభాసించిన ఛేదభేదాది వ్యవహారమూ బ్రహ్మాభిన్నమే- తద్విషయమగు ప్రపంచమూ బ్రహ్మాభిన్నమే- కనుక ఎవ్వనిచే దేనిచే ఏది ఎలా ఛేదింపబడుతుంది- ఎలా భేదింపబడుతుంది? కనుక బ్రహ్మా భేదజ్ఞానంవల్లనే ప్రపంచవాసన ఛేదింపబడుతుంది- ఎన్నిధర్మములు ఆచరించిన వాడయినా వాసనారహితుడు కాకపోతే ఏమీలాభంలేదు- ఎంతటి సర్వజ్ఞుడయినా వాసనారహితుడు అతిబద్ధాత్ముయే బోనులో పెట్టిన సింహంవలె- (లేక పంజరంలోని ఆకుపచ్చని చిలుకవలె) "పంజరస్థోయథాహరిః" అనిమూలం-

చితిభూమికి వెళ్ళుసరికి ఏమాత్రం అల్పంగా ఉన్నా వాసనాబీజం పెద్దదవుతుంది- సంసారమనే అడవిని మొలిపిస్తుంది- (అడవిని తయారు

చేస్తుంది.) చిరంతనాభ్యాసంవల్ల హృదయంలో రూఢమయిన ఈవాసనా బీజం అలాగే హృదయంలో రూఢమయిన జ్ఞానాగ్నిచే దగ్ధమగుచో తిరిగి మళ్ళీ పుట్టదు- దగ్ధమయిన వాసనాబీజము సుఖదుఃఖాది వస్తువులలో నిమగ్నంకాదు- తామరాకుమీది నీటిచుక్కవలె నిర్మలంగా ఉంటుంది- కాబట్టి అర్జునా! నీవు ఆశలన్నీ విడిచిపెట్టి పరమపావనమయిన భగవద్గీతారూపమగు నాఉపదేశాన్ని సరిగా అర్థంచేసికొని మనోమోహాన్ని రూపుమాపుకొని బంధువధాదిక్లేశాన్ని పోగొట్టుకొని బ్రహ్మరూపుడవై ఉండుము- అని అన్నారు శ్రీకృష్ణభగవానుడు-

అర్జున విశ్రాంతి వర్ణనము ౫౭వ సర్గ సమాప్తము.

## ౫౮. అర్జున కృతార్థత.

అర్జు॥ స్వామీ! నామనోమోహము తొలగింది- మీదయను గ్రహంవల్ల స్వతస్సిద్ధమయిన ఆత్మతత్త్వము స్మృతికి వచ్చింది- నాసందేహాలుతీరాయి- మీమాట తప్పక పాటిస్తాను- అన్నాడు- అర్జునుడు-

శ్రీభగ॥ అర్జునా! తత్త్వజ్ఞానంచేత హృదయంలోని రాగాది వృత్తులు శాంతించితే వాసనామయమయిన చిత్తము శాంతించినట్లే- అంతఃకరణము నిర్వాసనమయిందని గ్రహించు- వాసనారహితమయిన స్థితిలో ప్రత్యక్చైతన్యము చైత్యరహితమవుతుంది- అజ్ఞానులు యిట్టి బ్రహ్మను తెలియలేరు- భూతలమునుండి ఎగిరి పైకిపోయిన పక్షిని నేలమీదవారు తెలియనట్లు- ఇట్టి పరమాత్మతత్త్వాన్ని తెలిసికోటానికి శ్రవణమనన నిదిధ్యాసనాదులు ఆవశ్యకములు- సర్వాతీతమై అతి స్వచ్ఛమయిన బ్రహ్మపదార్థాన్ని ప్రపంచవాసనా వాసితులు కనిపెట్ట లేరు- మానవులదృష్టి అణువులను కనిపెట్టలేదు- బ్రహ్మప్రాప్తి కలిగితే ఘటపటాదులే నశిస్తే అతిసూక్ష్మమయిన వాసన ఎలాఉంటుంది? ఏమి చేస్తుంది? నిప్పు కొండను ఆశ్రయించి (దరిజేరి) మంచుబిందువు విలీన

మయినట్లు పరిశుద్ధమయిన చిత్తత్త్వమును పొంది అవిద్య అలాగే నశిస్తుంది- ఈ నీచాతినీచమయిన వాసన యెక్కడ? సర్వప్రపంచ పరిపూర్ణమయిన బ్రహ్మతత్త్వమెక్కడ? పరిశుద్ధమయిన ఆత్మతత్త్వము సాక్షాత్కారము కానంతవరకె అవిద్యయొక్క ఆటఅంతా- ఆత్మ సాక్షాత్కారం కలిగేసరికి దృశ్యములయొక్క చూపులన్నీ క్షీణిస్తాయి- ఆకాశమువలె స్వచ్ఛమయిన బ్రహ్మమే గోచరిస్తూ ఉంటుంది- అవాఙ్మనసగోచరమయిన ఆత్మతత్త్వమునకు సాటియేది లోకంలో-

కాబట్టి అర్జునా! నీవు కామనారాహిత్యమనే (కోరికలేకపోవుటమనే) మంత్రయోగంచేత అంతఃకరణలోఉన్న విషయవాసన అనే విషవిషూచికా వ్యాధిని పోగొట్టుకొని సంసారభీతులకు ఆనాశ్రయుడవై నేనే గీతార్థమయిన భగవత్తత్త్వమను నిశ్చయంతో ఉండుము అని అన్నారు శ్రీకృష్ణులు-

వసిష్ఠులు॥ రామచంద్రా! శ్రీకృష్ణభగవానులు ఇలా ఉపదేశించి క్షణకాలం మౌనంవహించి ఎదురుగుండా ఉండేసరికి పద్మఖండం మీద మకరందమును గ్రోలుచున్న తుమ్మెదవలె అర్జునుడు శ్రీకృష్ణోపదేశవచనమునందు అంతటి అభిలాషతో ఆనందించుచున్నాడు నిశ్చేష్టుడై-

అర్జు॥ స్వామీ! నాదుఃఖం తీరిపోయింది- మీమాటలతో నా మనోగత సందేహములన్నీ తీరిపోయినాయి- అని చెప్పి లేచి గాండీవం చేబూని కృష్ణుని సారథిగా నుంచుకొని నిస్సందేహుడై యుద్ధం చేయగలడు- అని శ్రీరామునకు వసిష్ఠులుపదేశించిరి-

ఇట్లు అర్జున కృతార్థత యను ౫౮వ సర్గ సమాప్తము.

అర్జునోపాఖ్యానము సమాప్తము.

౫౫. ప్రత్యగాత్మావబోధ.

వసి॥ రాఘవా! నీవుకూడా ఈదృష్టిని అలవర్చుకొని నిస్సంగుడవుగానుండి మహావాక్యార్థమయిన సచ్చిదానందైకరసరూపుడవుగనుండు- స్థితికాలంలో ఎవనియందు ప్రపంచం ఉంటుందో సృష్టికాలంలో ఎవరినుంచి వస్తుందో సంహారకాలంలో ఎవనిరూపంగా ఉంటుందో ఇలా కాలత్రయంలోను ప్రపంచం ఎవనిరూపమో ఎల్లపుడు అనిత్యమయిన ప్రపంచరూపుడయినా ఎవడు నిత్యుడో వానినే ఆత్మగా తెలిసికొనుము- అంతేకాని పరిచ్ఛిన్నస్వభావుడు ఆత్మకాడు- ఆత్మ సర్వప్రపంచాతీతుడు కాబట్టి దూరస్థుడు- సర్వాంతరుడు కాబట్టి అదూరస్థుడు- ఆకాశంవలె సర్వగుడయినా జాతివలె అన్నిటిలోనుండు వాడు- కనుక రామా! నీవుకూడా అలాంటి ఆత్మయొక్క సత్త (ఉనికి) తో ఉనికికలవాడవే స్వతంత్రంగా సత్త (ఉనికి) కలవాడవు కావు- కాబట్టి పరిచ్ఛేదభావాన్ని పూర్తిగా విడిచిపెట్టు-

రామా! చిదాత్మయొక్క రూపం రెండురకాలు- ఒకటి చిత్త తద్వృత్తి ప్రతిబింబితము- ఇది విషయప్రకాశరూపము- (చైత్యార్థ ప్రథారూపం) చిత్తనిర్మితము- రెండవది చిత్త- తద్వృత్తి తద్విషయములయొక్క ఆగమాపాయాదులు మున్నగు సర్వావస్థలకు సాక్షిస్వరూపము- ఇది సంవిద్రూపము- కనుకనే అనిర్మితము-(చేయబడినదికాదు) నిత్యసిద్ధము- ఈ రెండువిధములయిన రూపమున్ను చేత్యముచే సంవేద్యము త్రిపుటీరహితమయినచో పరబ్రహ్మమే అవుతుంది- ఈస్థితి "యతో వాచోనివర్తంతే" అను శ్రుతిచే చెప్పబడినది- ఇదియే ఆనందాతిశయమునకు పరాకాష్ఠ గురువులకు పరమగురువు- వాడేఆత్మ- అదియేవిజ్ఞానం - అదేశూన్యము- అదేపరబ్రహ్మము- అదేశ్రేయోరూపము- అతడే శివుడు- శాంతుడు- అదియేవిద్య- అదేపరాస్థితి- ఇతడే అంతర్యామి- సర్వానుభవరూపుడు- ఇంతకంటె వేరుతత్త్వము

మరొకటి లేదు. ఇదియే సర్వజగత్సారము- సకల పదార్థములయొక్క- అనాధారణస్వరూపంకూడా ఇదే.

ఈ ఆత్మతత్త్వమే ప్రపంచమనే తిలలలో తైలము- ప్రపంచమనే కొంపలో దీపం- ప్రపంచమనే చెట్టులో రసం- ప్రపంచమనే పశువునకు పాలకుడు- (కాపరి) భూతములనే ముత్యాలహారంలో దారం- భూతములనే మరీచికలయొక్క- తీక్ష్ణత- నిఖిలపదార్థములలోని పదార్థత్వము- సత్వస్తువుయొక్క- సత్త్వము- అసద్వస్తువుయొక్క- అసత్త్వము- తాత్త్వికాత్మబోధచే సర్వము ఆత్మగానే బోధపడుతుంది- బ్రహ్మవిచారంచేత ప్రాపంచికవికల్పములన్నీ విడిపోతాయి- అందు మొట్టమొదటి విచారం ఇది- "మిథ్యాభ్రాంతులతోకూడిన యీజగజ్జాలంలో అహమనే అంతఃకరణవృత్తి నాకు ఎలాపుట్టింది? అసంగ అద్వయమయిన నన్ను ఈబుద్ధిమాత్రం ఎలాపొందింది- దీనికీ నాకు కారణం కనిపించదే- పొందందేపో అయినా ఆదిమధ్య అంతము అనే పరిచ్ఛేదములన్నీ సంకల్పాత్మకములు- అవన్నీ నారూపములేకాని నాకంటే వేరుకావు- కాబట్టి నాకు ఇయత్తా ప్రసక్తియే లేదు-" అని ఇలాంటి విచారంచేసేవాడికి (ఇలాంటి మనోనిశ్చయంకలవాడికి) వ్యవహారకాలంలోకూడా ఆస్థితి తొలగిపోదు-

ఎవనిమనస్సు సర్వసమమయిన బ్రహ్మయందు నిరూఢమై ఉంటుందో వాడు ఉదయాస్తమయములు లేని స్థితిగలవాడు- (తనవలె ఎవడు శూన్యరూపుడో ఆమహానుభావుడు ఆశూన్యరూపుడు-) ఇలాంటి మహానుభావుడు భావనచే అద్వయపదమును అధిష్ఠించినవాడుకాని వ్యవహారమాత్రంచేత కాదు- అంచేత లోకశాస్త్రవిరుద్ధమయిన వ్యవహారం జరుపుతున్నా ఈమనోభావం మాత్రం దిగజారదు- కనుకనే పెద్దలు ఇలా అంటారు-

శ్లో॥ భావాద్వైతం సదాకుర్యాత్ క్రియాద్వైతం నకర్హిచిత్ ।
అద్వైతం త్రిషులోకేషు నాద్వైతం గురుణాసహ ॥ అని

3-33)

ఎల్లప్పుడు భావాద్వైతమును అలవరచుకోవలెనుకాని క్రియాద్వైతాన్ని అలవరచుకోరాదు. ముల్లోకములందూ అద్వైతభావం ఉండవచ్చును కాని గురువుగారియందు అద్వైతభావం ఉండకూడదు- భావాద్వైత పదాన్ని అధిష్ఠించిన మహానుభావుడు వ్యవహారకాండలోకి దిగినా అద్దంలో ప్రతిబింబించిన మానవునివలె సంక్షోభం చెందడు. బింబపురుషుడు వ్యవహారంలోఉంటే (అనగా ప్రవృత్తి నివృత్తి వ్యాపారములలో ఉంటే) అద్దంలోని ప్రతిబింబమానవుడుకూడా చేతులుకాళ్ళు ఆడిస్తూ వ్యవహారం (పని) జరిపిస్తున్న వాడుగానే కనిపిస్తాడు. కాని వానికి ఆవ్యవహారమునకు సంబంధించిన మనఃక్షోభం ఏమాత్రం ఉండదు- ఎవని హృదయానికి మానావమానముల సంబంధమయిన దుఃఖం ఉండదో వాడే ముక్తికి అర్హుడు- అద్దమునందు కనిపించే మానవుని వ్యవహారము ఆ అద్దానికి ఏవిధమయిన వైచిత్ర్యవిశేషాన్ని వికారవిశేషాన్ని కలిగించకుండానే ప్రతిబింబిస్తోంది- అలాగే చిన్మణియందు కూడా వికారం కలిగించకుండగనే వ్యవహారం కనిపించవచ్చు- పరమ నిర్మలమయిన చైతన్యానికి వ్యవహారం ఎలాఏర్పడిందో అలాగే చైతన్యముయొక్క చమత్కారంవల్లనే జగత్తుకూడా భాసిస్తోంది- కాబట్టి ఇచట (ఈచిత్తునందు) అద్వైతమనేదీలేదు. ద్వైతమనేదీలేదు- వాచ్యము, వాచకము, శిష్యుడు, శిష్యునికోరిక, గురువు వాని యుపదేశము మొదలయినదంతాకూడ చిన్మయమేకాని వేరుకాదు- శాంతమయిన చిత్తుయే తనయందు తాను చమత్కారం కలిగించుకుంటోంది- కాబట్టి చైతన్యముయొక్క ప్రస్పందమే సంసారం- తదస్పందమే పరమపదము- చిత్ స్పందము శాంతించినదంటే సంసారం శాంతిస్తుంది-

రామచంద్రా ! నీచిత్తం అపరిచ్ఛిన్నమయిన బ్రహ్మాకారంగా పరిణమించిందా అపుడు జీవుడూ, ప్రపంచమూ, అనే అంశభావమంతా తొలగిపోతుంది- అలా అది తొలగిపోవడమే పరమపురుషార్థం- అదే వాసనాక్షయం- చైతన్యానికి చలనం నిజంలో లేకపోయినా జడ

మయిన ప్రపంచ స్వభావాన్ని పొందించుచున్నది- (కలిగిస్తోంది.) అంచేత చలనం లేకపోవడమే చైతన్యముయొక్క తత్త్వం అని అనుభవ నిష్ఠులయిన పెద్దలంటున్నారు- అనాత్మదర్శన రూపమయిన యీ సంసారం అనాత్మభూతమయిన ప్రపంచాన్ని నిజమయిన దానినిగా భావనచేయుటంచేత అనుభవగోచరమవుతోంది- ఆభావన లయిస్తే లయిస్తుంది- అపుడు దగ్ధపటాకారంగా నిస్సారంగా ఉంటుంది- అప్పుడది చిద్రూపంగానే మిగిలిపోతుంది- కాబట్టి మాతృమాన మేయాది రూపమయిన సంసారమంతా చిత్ స్పందమే కాని మరొకటికాదని నిశ్చితమయింది- చిత్తమే చైతన్యముయొక్క స్పందము- ఈవిషయం తెలియకపోవడమే సంసారం- ఇలా (అబోధ) తెలియకపోవడం ఎంతసేపు ఉంటుందో అంతవరకు సువర్ణమునుంచి కటకము- (మురుగు) (కడియము) అను ఆభరణము పుట్టినట్లు పుటుతుంది- రామా! బోధ మాత్రంవలన యీసంసారం విలీనమయితే శుద్ధమయిన చైతన్యమే మిగులుతుంది- ఆత్మతత్త్వముయొక్క బోధమాత్రంచేత భోగవాసన క్షీణిస్తుంది- సహజసిద్ధములయిన భోగాలను మనసాకూడ చింతించకుండ నుండటమే జీవన్ముక్తియొక్క లక్షణము- జీవన్ముక్తునకు ఈ భోగాలన్నీ అభిమతాలుకావు సహజంగా- వాడు (జీవన్ముక్తుడు) స్వరూపానందంతో తృప్తిచెంది ఉంటాడు- దురన్నాన్ని ఎవడూ వాంచించడు- జీవన్ముక్తునకు భోగాలన్నీ దురన్నప్రాయాలు- కాబట్టి భోగాలను స్వభావతః చింతించకుండుటయే జీవన్ముక్తికి పరమలక్షణమని ముఖ్యంగా తెలిసికో- జీవన్ముక్తికి మరోలక్షణం కూడా ఉంది- అదేమంటే "నాఆత్మ చైతన్యమే భోక్తృ భోగ్య భోగాకారంగా చలిస్తోంది- అలా చలిస్తూ సర్వాత్మరూపంగా ఉన్నదనే లోపలి నిశ్చయమే నిరూఢమై జీవన్ముక్తి అనిపించుకుంటుంది- ఎవడు లోకాను గ్రహసిద్ధికొరకు అనుభవిస్తున్న భోగాలనుకూడా పరమార్థంగా అనుభవించకుండా ఉంటాడో వాడే బుద్ధిమంతుడు- (అనగా తత్త్వవేత్త- ఎవడయినా భ్రాంతివల్ల కత్తితో ఆకాశాన్ని కొటుతుంటే లోకాను

రోధంకొరకు తానుకూడా కత్తితో ఆకాశాన్ని కొట్టినట్లు- అదెంతటి వృథాచేష్టయో ఈవిషయభోగానుభవంకూడా అంతటి వృథాచేష్టయే- అయితే ఎల్లమానవులకు భోక్తృభోగ్యభోగాకారంగా పరిణమించిన ఆత్మచైతన్యమే సర్వాత్మరూపమని వెనుక జెప్పబడిన బుద్ధికూడ "అందరు కత్తితో ఆకసమును కొట్టుట నేను కొట్టినట్లే" అనుదానివలె భ్రాంతి బుద్ధే కనుక కృత్రిమమే ఇదిమాత్రం జీవన్ముక్తి లక్షణం ఎలా అవుతుంది? కృత్రిమబుద్ధిలేనిదే నిరతిశయానందరూపమగు ఆత్మతత్త్వము సాక్షాత్కారముకాదు- అనగా సర్వాత్మభావదర్శనము (అందరిలోను ఉన్న ఆత్మ ఒక్కడే అను దర్శనము) పరిచ్ఛిన్నాత్మదృష్టిని పోగొట్టుచూ తత్త్వసాక్షాత్కారానికి ఉపయోగిస్తుంది- కాబట్టి అది జీవన్ముక్తిలక్షణంగా చెప్పబడింది-

స్వామీ! ఇలాగయితే తనచేతులూ కాళ్లూ నరకుకొనడమనే సాహసప్రసక్తికూడా దేహాత్మబుద్ధి నిరాసద్వారా తత్త్వదర్శనానికి ఉపయోగపడుతుంది- కనుక ఆపనికూడా జీవన్ముక్తిలక్షణం ఏలకాకూడదు? కాదు ఎందువల్లనంటె ఎక్కడనయినా శాస్త్రంలోకాని విద్వదనుభవంలోకాని తనచేతులూ కాళ్లూ నరకుకోవడము సర్వాత్మతా దర్శనమువలె స్వాత్మావలోకమునకు ఉపయోగపడినట్లు ప్రసిద్ధిఉంటే అప్పుడు అదికూడా జీవన్ముక్తికిలక్షణం అవుతుంది- అలాంటి ప్రసిద్ధి ఎక్కడాలేదు- అని యిదొక సమాధానము-

అథవా మూలమునందలి-

శ్లో॥ వినాకృత్రిమయాబుద్ధ్యానసిద్ధిరవగమ్యతే ॥

అనే శ్లోకాన్ని వినా అకృత్రిమయా అని పదవిభాగంచెయ్యాలి- అప్పుడు ఆత్మసాక్షాత్కారము విషయమై అకృత్రిమయాబుద్ధ్యా అఖండబ్రహ్మాకారబుద్ధిలేకుండా చేతులూ కాళ్లూ తెగగొట్టుకొనుట అనే సాహసప్రసక్తిచే ఉపయోగములేదు- అనే అర్థము లభిస్తుంది- అప్పుడు ఏబాధ ఉండదు-

ఈచైతన్యం ఎంతవరకు అజ్ఞానంచేత కప్పబడి ఉంటుందో అంత వరకు స్వప్రకాశబుద్ధ్యాది కోటిప్రవిష్టముకాక తాను స్పందరూపాన్ని ధరించి బాహ్యవిషయాన్ని గురించి చలిస్తుంది- దానిచే మానవుడు భ్రాంతిపడతాడు- ఎపుడు లోపల సమ్యగ్బోధ కలుగుతుందో అపుడు స్పందాస్పందదశాక్రమం అంతా పేరులేకుండా నశిస్తుంది- చమురులేని దీపంవలె- చైతన్యానికి అజ్ఞానంకాని, స్పందముకాని ఉండకపోవడమే మోక్షం- ఎప్పుడు చిత్తం బ్రహ్మాకారాన్ని ధరిస్తుందో అపుడు ఆచిత్తం బంధంకోరకు సమర్థపడదు- మోక్షంకోరకు సమర్థపడదు- చైతన్యానికి చిత్తాకారదశా లేదు- తదుపరమదశా లేదు- కాబట్టి బంధమోక్షము లనే పేర్లే చైతన్యానికిలేవు- ఎంతవరకు నాకు మోక్షంకావాలని పరిపూర్ణమయిన భావం మనస్సులో ఉంటుందో అంతవరకు వాడికి నాశమేకాని సౌఖ్యంలేదు-

మోక్షం నాకొద్దు- నాచిత్తం నిర్విక్షేపంగా (చలనంలేకుండా) ఉండుగాక! అనే కోరికకూడా బంధమే- అయితే ఇంక మానవుడికి శ్రేయస్సు అంటే ఏమిటోవిను చెబుతాను-(అసంవేదనంపరం యదనాభాసమజడం) తెలియబడనిదీ, సర్వవ్యాపకముగునదీ, ఆభాసరూపము కాని చైతన్యమే పరమపదము-(మోక్షము) (నిరతిశయమైనశ్రేయస్సు) చైతన్యము యొక్క- నిజరూపము చైత్యవస్తువులకు అభిముఖం కాకుండ నుండుటయే- పరిపూర్ణమయిన చైతన్యానికి, స్పందము (చలనము) కలగడమే సంకల్పశబ్దార్థము- అదే బంధమోక్షాది శబ్దాలకు అర్హమయింది- సంకల్పనాశంవల్ల బంధమోక్షాది వ్యవహారమంతా నశిస్తుంది- స్వస్వరూపజ్ఞానంవల్ల అహంభావంనశిస్తే ఆపైన దేనిచే ఏది బంధింపబడుతుందో, దేనిచేత ఏది విడిపింపబడుతుందో, రామా! నాకు బోధపడటంలేదు- వివేకి తాను స్వయంగా నిర్మించుకొన్న సంకల్పమునందు "ఇది నాచేత సంకల్పించబడింది- ఇది సంకల్పింపబడలేదు" అని పూర్వాపర విమర్శతో విభాగాన్ని విడిచిపెట్టేయడల అపుడు కలిగిన

సంకల్పం కూడా బాహ్యచేష్టకలిగించడానికి అసమర్థమై వృథాగా నశించి ఊరకుంటుంది ఆసంకల్పం- అనగా అర్థాత్ అప్పుడు అద్వైత న్యము అనివార్యముగా సంకల్పములేనిదీ, చలనములేనిదీ అయినట్లే అని అర్థము- ఇలా ప్రబుద్ధచైతన్యముచేత (చిత్స్వరూపజ్ఞానంచేత) (స్పందము) చలనము క్షీణిస్తే చలనాత్మకమయిన వాయువు (గాలి) నశిస్తే తన్మూలకమయిన సంసారమంతా నశించినట్లే-

అథవా చిత్ప్రకాశకంటే వ్యతిరేకంగా స్పందమనేది లేనేలేదనే జ్ఞానంవల్లకూడా సంసార నివృత్తి కలుగుతుంది- చిత్తుకంటె వేరుగా స్పందమనేది ఏమీ మిగలదు- కనుక ఇంతకు లోగడ సంసారదశలో దృశ్యమయమయిన యీసంసారమనే దీర్ఘనిద్రలో అనేకకలలు కను చున్న జీవుడు ఇపుడు వివేకము కలవాడై ఇంక ఎన్నటికీ చలనాది భ్రాంతులను చెందడు- తన నిజరూపమయిన చైతన్యము సర్వవ్యాపక మయింది కావడమే దానికి కారణం-

కనుక రామా! ఏ చైతన్యమందు, నివారించుకోనుచున్నా బలాత్కారముగా ప్రపంచాకారమయిన చిత్తవృత్తులూ వానివల్ల కలిగెడి విషయానందములూ మనోహరంగా పుడుతున్నాయో దేనియం దుంటున్నాయో? తుదకీవృత్తులన్నీ దేనియందు లయిస్తున్నాయో ఆప్రత్యగాత్మను (చిదాత్మను) నేను నీకు బోధించిన విచారంతో తెలిసి కోను- అని అన్నారు వసిష్ఠులు-

ఇట్లు ప్రత్యగాత్మబోధ అనే ౫౯వ సర్గ సమాప్తము.

## ౬౦. విభూతియోగము.

వసి॥ రామా! బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులందరూ ఈపర మాత్మయొక్క విభూతులే- వీనికోటియే రాజాధిరాజులు ఆనందిస్తు న్నారు- పరమాత్మయొక్క విభూతి ఉత్కర్షనుబట్టే మనుష్యుడు

మొదలుకొని హారాదులయందు ఉత్కర్ష- భగవద్విభూతియొక్క- గొప్పతనమును పట్టియే మనుష్యులయందుగాని, దేవతలయందుగాని, గొప్పతనమని దీనియర్థము- తైత్తిరీయశ్రుతియందు చెప్పినట్లు మానుషానందంకంటె, మనుష్యగంధర్వానందము, దానికంటె దేవగంధర్వానందము, ఇలా ఒకదానికంటె ఒకటి గొప్పది అంటే ఆ గొప్పతనము వారిలోఉన్న చైతన్యముయొక్క- విభూతి (గొప్పతనాన్ని) బట్టియే కాని మరో దానివల్ల కాదు-

ఇలా సర్వానందాలయొక్క- ఉత్కర్షకు అవధిఅయిన బ్రహ్మపదార్థాన్ని తత్త్వబోధతో తెలిసికొన్న మానవుడు మరణించడు- దుఃఖించడు- ఆకలిదప్పికలతో బాధపడడు- ఎవరిచేతనూ, దేనిచేతనూ నిరోధించబడడు- సర్వవ్యాపకమయిన పరమాత్మయొక్క- సత్తాసామాన్యరూపం ఏకొంచెమయినా భావనచేస్తే ఆతత్త్వాన్ని ఒకనిముషం మననం చేస్తే ఆముని మళ్ళీ సంసారకృత్యాలలోపడడు- పరితాపపడడు- అన్నారు వసిష్ఠులు-

విన్నాడు శ్రీరాముడు- అతనికొక సంశయం కలిగింది- సత్తాసామాన్యరూపమయిన ఈతత్త్వం సవిశేషమా! నిర్విశేషమా! నిర్విశేషమయితే అతనివిభూతులు వర్ణించడం అసంగతం- అనగా నిర్విశేష చైతన్యానికి విభూతులుండవు- కాన వాటిని వర్ణించడం కుదరదు- ఇక సవిశేషమయితే సవిశేషాత్మను పొందినవాడికి సంసారతాపం (ఆత్యంతికం ఉచ్ఛిన్నమవుతుంది) పూర్తిగా నశిస్తుంది- అని వర్ణించడం తగదు- కనుక వసిష్ఠులు దీనికేమి జవాబుచెబుతారో తెలిసికొందాం అని అనుకొన్నాడు- ఇలా అడిగాడు-

శ్రీరా॥ స్వామీ! మనోబుద్ధిచిత్తాహంకారాది ద్వైతమంతా ఎవనియందు నాశం చెందినదో, ఆ నిర్విశేషపూర్ణ చిన్మాత్రమే "సత్తాసామాన్య"మని మీరంటున్నారా? లేక మనోబుద్ధ్యాది సర్వవిశేషములుగల ఈశ్వరుణ్ణి "సత్తాసామాన్య" మని అంటున్నారా? అని అడిగాడు- వసిష్ఠులు జవాబుచెబుతారు-

వసి॥ రామా! ఏ బ్రహ్మపదార్థము సర్వశరీరములందూ ఉండి జాగ్రత్ స్వప్న సృష్టికాలములందు శబ్దాదివిషయాలను అనుభవిస్తూ, స్వీకరిస్తూ, చలిస్తూ ఉందో, సుషుప్తిప్రళయములందు శబ్దస్పర్శాది నిఖిలపదార్థాలను విడిచిపెడుతూ ఉందో ఆద్యంతములులేని సర్వవ్యాపకమయిన చైతన్యమే యిచట సత్తాసామాన్యమని చెప్పాను నేను- ఇంతేకాని ప్రపంచబాధోత్తరకాలమందున్న నిర్విశేషమనికాని తత్పూర్వకాలమందున్న సవిశేషమనికాని నేను చెప్పలేదు- సర్వజీవభావమందూ, ఈశ్వరభావమందూ, ముక్తియందూ అనుస్యూతమయిన అఖండదండాయమాన సన్మాత్రమే జగత్తుకు తత్త్వమని చెప్పాను- ఈసద్రూపాత్మవస్తువే ఆకాశంలో ఆకాశరూపంగానూ, శబ్దంలో శబ్దరూపంగానూ ఉంది- స్పర్శయందు స్పర్శరూపంగానూఉంది- త్వక్కునందు త్వగ్రూపంగాఉంది- రసమునందు రసరూపంగాఉంది- రసనేంద్రియమునందు రసనేంద్రియరూపంగాఉంది- రూపమునందు రూపంగాఉంది- నేత్రమునందు నేత్రరూపంగాఉంది- నాసికయందు నాసికరూపంగాఉంది- గంధమునందు గంధరూపంగాఉంది- కాయమునందు కాయరూపంగా పుష్టిచెంది ఉన్నది- భూమియందు భూరూపంగా ఉంది- క్షీరమునందు క్షీరరూపంగా ఉంది- నీరమునందు నీరరూపంగా ఉంది- వాయువునందు వాయురూపంగా ఉంది- అగ్నియందు అగ్నిరూపంగా ఉంది- బుద్ధియందు బుద్ధిరూపంగా ఉంది- మనస్సునందు మనోరూపంగాఉంది- అహంకారమునందు అహంకారరూపంగాఉంది- సంవిత్తునందు సంవిద్రూపంగాఉంది- చిత్తమునందు చిత్తముగాఉంది- వృక్షమునందు వృక్షరూపంగాఉంది- పటమునందు పటముగాఉంది- ఘటమునందు ఘటముగాఉంది- వటమునందు వటముగాఉంది- స్థావరమునందు స్థావరముగాఉంది- జంగమమునందు జంగమముగాఉంది- పాషాణమునందు పాషాణముగాఉంది- చేతనమునందు చేతనరూపముగాఉంది- అసురులందు అసురరూపంగాఉంది- నరులందు నరరూపంగాఉంది- తిర్యక్పక్షులందు తిర్యగ్రూపంగాఉంది- క్రిములందు క్రిమిరూపంగాఉంది-

కాలక్రమమునందు కాలముగాఉంది— ఋతువునందు ఋతువుగాఉంది— త్రుటి, క్షణ, నిమేషాదులందు, త్రుటి, క్షణ, నిమేషాదిరూపంగాఉంది— తెలుపునందు తెలుపుగానూ, నలుపునందు నలుపుగానూఉంది— క్రియల యందు స్పందరూపంగాఉంది— నియతియందు నియమరూపంగాఉంది— సంస్థితియందు స్థితిరూపంగాఉంది— నాశమునందు నాశరూపంగాఉంది— ఉత్పత్తియందు ఉత్పత్తిరూపంగా ఉంది—

రామా! ఆ పరమేశ్వరుడు ఇంకా బాల్యంలో బాల్యరూపంతో ఉన్నాడు— యౌవనంలో యౌవనరూపంతో ఉన్నాడు— వార్థక్యంలో వార్థక్యరూపంతో ఉన్నాడు— మరణంలో మృతిరూపంతో ఉన్నాడు— ఇలాపరమేశ్వరుడు సర్వపదార్థాలతోను అభిన్నుడు— సముద్రంలో అలలూ (సీకరములూ) తుంపురులూ, పెద్దపెద్దతరంగాలూ, ఇవన్నీ జలసామాన్యమే— జలముకంటె వేరుకాదు— అలాగే ప్రపంచ పరమే శ్వర విషయంలోకూడా— అజ్ఞానంచేత కల్పించబడిన భ్రాంతివల్ల భేద బుద్ధి యేర్పడుతోంది— వస్తుతఃకాదు— కాబట్టి ఆభేదబుద్ధి వాస్తవం కాదు—

కనుక రామచంద్రా! సర్వత్ర నిండియున్న ఆత్మచైతన్యంచేతనే జగత్కలన కల్పింపబడినదనీ, ఈ ప్రపంచంఅంతా ఆత్మవిలాసచేష్టా ప్త మయినదనీ, ఆత్మచైతన్యంకంటె వేరుగా ఏమీ లేదనీ, తలచుచూ శాంతమనస్కుడవై, నీమహిమలో నీవుఉండు— ఇదీ నాబోధరహస్యం అన్నారు వసిష్ఠులు—

ఇలా వసిష్ఠులు ఉపదేశించుచుండ సాయంకాలమయింది— సభ చాలింపబడింది— అందు సాయంకృత్యానుష్ఠానానికి వెళ్ళారు— తిరిగి సూర్యోదయం కాగానే అందరు సభను అలంకరించారు—

ఇలా పదునారవరోజు ప్రసంగము పరిసమాప్తమయినది.

విభూతియోగమనే ౩౦వ సర్గ సమాప్తము.

## ౬౧. జగత్స్వాప్నకథనము.

విన్నాడు శ్రీరాముడు- ప్రశ్నకు అవకాశం చిక్కింది- ఇలా అడిగాడు-

శ్రీరా॥ స్వామీ! ప్రపంచంఅంతా పరమాత్మయొక్క విభూతి అనీ, భ్రాంతికల్పితమనీ, స్వప్నసదృశమనీ సెలవిచ్చారు మీరు- అది అలాగే అయితే బ్రహ్మాదులదృష్టిలో స్వప్నతుల్యమనీ, భ్రాంతిఅనీ భాసించటం మాబోటివారలదృష్టిలో స్వప్నతుల్యంకాదనీ, గట్టిగా నిజమయినదనీ, భాసించటం, ఎలా జరుగుతోంది? ఈవైషమ్యానికి కారణం ఏమిటి? చిరకాలానువృత్తివల్ల(చాలకాలం మనవెంటపడటంచేత) మనకు సత్యంగా తోస్తోంది అని మీరంటారేమో అలాగయితే రెండుపరార్ధముల ఆయుర్దాయంగల బ్రహ్మాదులకు మనకంటెకూడ చాలకాలం సంసారానువృత్తి ఉంటుంది- కనుక ఇంకా దృఢంగా సత్యమని భాసించాలి వాళ్ళకు (బ్రహ్మాదులకు) అలాఎందుకు భాసించడంలేదు- ఇక్కడ సమాధానం ఏమిటో నాకు బోధపడటంలేదు అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా! ఇక్కడ చక్కని సమాధానం ఉంది- విను- అబాధిత చిరానువృత్తి సత్యతాభ్రమ దార్ఢ్యానికి హేతువు- బాధిత చిరానువృత్తి సత్యతాభ్రమదార్ఢ్యానికి హేతువుకాదు- అనగా సంసారం చాలకాలం అనువృత్తమయినంతమాత్రంచేత సత్యమనే భ్రాంతి పుట్టదు- బాధకప్రత్యయ రహితమయితేనే సత్యత్వభ్రాంతిపుట్టుతుంది- బాధకప్రత్యయసహితమయితే మాత్రం ఎన్నటికీ సత్యమనే భ్రాంతిని పుట్టించజాలదు- అనగా మిథ్య అనుకుంటూ ఎంతకాలం సంసారంలో ఉన్నా ఆ మానవుడు సంసారం సత్యమనుకోడు- సంసారం మిథ్యఅనే బుద్ధిలేక అనుభవిస్తూ ఉంటేమాత్రం అనుభవించినకొలది సత్యతాభ్రాంతి (నిజమనేభ్రాంతి) ముదిరిపోతుంది-

బ్రహ్మదేవుడు వెనుకటిజన్మలో ఉపాసకుడుగా ఉన్నాడు- అప్పుడు అతనికి తత్త్వజ్ఞానంలేదు- ఆకాలంలో చతుర్విధ భూతగ్రామ లక్షణ జీవప్రతిభాసరూపమయిన (అనగా జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు, అను నాలుగు రకముల జీవులతో గూడిన) ప్రపంచం అంతా ఇప్పుడు మనం అనుభవించే ప్రపంచమువలె అతడికిగూడ సత్యంగానే తోచింది- అయినను ఇప్పుడు ఆబ్రహ్మదేవునికి తత్త్వజ్ఞానం ఉన్నందువల్ల దానిచేత సంసారం బాధితమయింది- అంచేత ఇప్పుడు అతనికి ప్రపంచం సత్యమనే భ్రాంతి పుట్టదు-

అజ్ఞానం ఎంతవరకు ఉంటుందో అంతవరకు చైతన్యం సర్వవ్యాపకమయినందున సర్వము జీవుడే అవుతుంది- అనగా సర్వమూ జీవరూపంగానే భాసిస్తుంది- అంతటా సంసారం అంతా నిజమనే తోస్తుంది- తత్త్వజ్ఞానం కలగగానే అజ్ఞానానికి తత్త్వజ్ఞానం విరుద్ధమయిన కారణంచేత అజ్ఞానం నశించి ఊరకుంటుంది- అప్పుడు ప్రపంచం సత్యమని తోచదు- అజ్ఞానం నశించినందున ప్రపంచం సత్యమనే బుద్ధిని పుట్టించే కారణసామగ్రియేలేదు- కనుకనే ప్రజాపతికి ప్రపంచ ప్రతిభాస (ప్రపంచబుద్ధి) తత్త్వజ్ఞానంచేత బాధితమై, స్వప్నతుల్యమై అజ్ఞానులమయిన మనబోటివాండ్లకు "అహం అహం" అనేబుద్ధి ఎలా దృఢపడిపోయిందో అలాదృఢపడిపోయింది-

అయితే ప్రజాపతి మున్నగువారికి తాము కల్పించిన ప్రపంచం తత్త్వజ్ఞానంచేత నశించినట్లు ఎలా అనుభవగోచరం కావటంలేదు ? అనేప్రశ్న పుట్టుతుంది ఇక్కడ- దానికి కారణం ఉంది చెబుతావిను- భోజకమయిన అదృష్టం ప్రతిబంధకంగా ఉండి అలాంటి అనుభవం వాళ్ళకు కలగటంలేదు- ఎలాగంటే స్వప్నప్రపంచం అతిశీఘ్రంగా నశించేదయినా స్వాప్నభోగమును యిచ్చెడి కర్మ ప్రతిబంధకంగా ఉండటంచేత స్వప్నపురుషునకు ఆస్వప్నప్రపంచంయొక్క వినాశము అతనికప్పుడు గోచరించడంలేదు-

అలాగే సమష్టిస్వప్నమయిన ప్రపంచంలోకూడా పద్మజులయిన బ్రహ్మలకు "ప్రపంచం క్షీణవినాశి" అనే బోధ కలుగకపోవుటకు ప్రతిబంధకము ఊహించబడుతోంది-

రామా! మనబోటి వాళ్లకుకలిగే స్వప్నప్రతీతి ఎలాంటిదో ప్రజాపతికిగూడ అలాంటి స్వప్నప్రతిభాసయే (ప్రతీతే) కలుగుతుంది- వీళ్ళకూ అనాద్యనంతప్రవాహరూపమే వాళ్ళకూ అలాంటిదే- అందులో తేడాలేదు- కాని వీళ్లుసత్యమనుకుంటారు- వారు మిథ్య అనుకుంటారు ఇంతె తేడా-

కాబట్టి రామా! పద్మజుడు (బ్రహ్మదేవుడు) స్వప్నపురుషుడు- సమష్టి సూక్ష్మశరీరాభిమాని కాబట్టి- ఆతనివల్ల బుట్టిన ప్రపంచం కూడా స్వప్నపురుషాత్మకమే అవుతుంది- బీజానికి అనుగుణంగా ఫలం తయారవుతుంది- మామిడిగింజయే మామిడిచెట్టుగానూ మామిడిపండు గానూ తయారవుతుంది- మరోవస్తువు దీనివల్ల పుట్టదు- కనుక అసత్య మయిన మనఃపురుషునిచేత (సూక్ష్మశరీరాభిమానియయిన) బ్రహ్మ దేవునిచే సాధించబడిన (పుట్టించబడిన) ఈప్రపంచం అసత్యమే అవు తుంది-జన్మాంతర స్వర్గనరకాద్యర్థక్రియా సమర్థమయినా ఈప్రపంచము నందు సత్యత్వభావన యుక్తముగాదు- కనుకనే ఎంతదృఢప్రత్యయ మున్నా దీనిని పరిత్యజించవలసిందే-

మనబోటివాళ్ళకుకూడా స్వప్నంలో (కలలో) కనిపించే స్వాప్న ప్రపంచము కలఉన్నంతసేపూ సత్యంగానే తోస్తూ ఉంటుంది- మిథ్యా త్వబుద్ధి అపుడు పుట్టదు- అంతమాత్రంచేత ఆస్వాప్నప్రపంచం సత్యం కాదు- ప్రజాపతియొక్క సృష్టి దీర్ఘకాలస్థాయి (చాలాకాలంఉండేది) అని అంగీకరించి ఇదంతా చెప్పాను- నిజస్థితిలో ఈదైర్ఘ్యము అంతా హరిచంద్రునియొక్క దీర్ఘకాలపు స్వప్నమువలె అత్యల్పకాలంలో కూడా సంభవించవచ్చు- ఈప్రాజాపత్యసర్గము ఒక్కనిముష కాలంలో పుట్టిపెరుగుతోంది- కాని ఆనిముష కాలాన్ని ఒక్క కల్పంగా మనం

కల్పించుకుంటున్నాం- (ఎంచుకుంటున్నాం) కాబట్టి ప్రజాపతికివలె మనఅందరికీ తమతమ స్వప్నములలో అప్పటికప్పుడు ఆ స్వప్నప్రపంచం సుదీర్ఘమయినదనే జ్ఞానం (చాలాకాలం ఉంటుందనే జ్ఞానం) కలుగుతూనే ఉంది. సృష్టిపరంపరయావత్తు చిదధీనమైఉంది. సముద్రంలోని ఆవర్తములూ (సుడిగుండాలూ) తరంగఫేనములూ మొదలయినవన్నీ జలాధీనములయినట్లు. కనుక చిదధీనప్రసిద్ధికత్వరూప దృశ్యత్వము మిథ్యాత్వమునందు ప్రయోజనము- కారణము- అనగా చైతన్యాధీనమై ప్రసిద్ధిజెంది దృశ్యమగునది అంతా మిథ్యయే యని భావము- తుదకు ఆప్రజాపతియొక్క స్థానముకూడా ఆయనచే సృజింపబడిన ప్రపంచంతోటి ప్రలయంచెందేదే- కనుకనే-

> ననిరోధో నచోత్పత్తిః నబద్ధో నచసాధకః ।
> నముముక్షు ర్నవైముక్తః ఇత్యేషా పరమార్థతా ॥

"ప్రలయంలేదు- ఉత్పత్తిలేదు- బద్ధుడులేడు- ముముక్షువులేడు- ముక్తుడులేడు- ఈమాట పరమార్థము" అను శ్రుతివచనం సంగతమవుతోంది-

అయితే ఈశ్రుతిప్రకారంగా ప్రపంచం అంతబొత్తుగా లేనిదే అయితే వ్యవహారంఅంతా ఎలాజరుగుతోంది? అనే ప్రశ్న పుటుతుంది- కాని అలాంటి ప్రశ్నకు తావు లేదు- వ్యవహారం ప్రపంచంలో జరుగుతూ ఉండటం మనకు ప్రత్యక్షమే కనుక అదిజరుగుతుందనే అనుకోవాలి. ఇంక ఆ అంశంలో ప్రశ్నవేయనే కూడదు- చూడండి ప్రమాణభూత శ్లోకమును-

> శ్లో॥ యద్యథా యాదృశం దృష్టం తత్తాదృగ్విద్యతే తథా ।
> నహి పర్యనుయోక్తవ్యాః స్వప్న విభ్రమ రీతయః ॥

ఏది ఎలా కనిపిస్తూ ఉంటుందో అది అలాఉన్నదనే అనుకోవాలి- ఇది ఎలాఉంది? అనే ప్రశ్నేకూడదు- స్వప్నభ్రాంతి అనుభవంలో ఉంటే

ఈస్వప్నం ఎలావచ్చింది? ఎలా వస్తుంది? అనే ప్రశ్నకూడదు- కలగటం లేదుకూడా లోకంలో ఎవరికీ-

మాయ (అజ్ఞానం) (అవిద్య) అఘటిత ఘటనా సామర్థ్యము కలది అది చేయజాలని పని లేదు- దానిసత్తావల్లనే మూడులోకాలలో చిత్రవిచిత్రములయిన వస్తువులు కనిపిస్తున్నాయి- చూడండి సృష్టి వైచిత్ర్యం- మనం ఊహించటానికి వీలుకానివాటిని అనేకింటిని ప్రపంచంలో చూస్తున్నాం- ఇది మాయయొక్క సామర్థ్యమే కాని మరొకటి కాదు- నీటిలో మధ్య నిప్పు ఉంటోంది- సముద్రంలో బడబాగ్ని ఉంది- ఆకాశంలో పట్టణాలు ఉన్నాయి- ఆకాశంలో విమానాలకు ఆశ్రయమయిన స్థలాలు ఉన్నాయి- రాతిలో పద్మాలు పుటుతున్నాయి- మంచుకొండమీద చెట్లు పుటుతున్నాయి- ఒక్క కల్పవృక్షంలో సమస్త పుణ్యాములకు ఫలములయిన అభిలషితవస్తువులన్నీ ఉన్నాయి- పండ్లు పండే చెట్లవలె రాళ్లు చింతామణిగుచ్ఛములను పుట్టిస్తున్నాయి- రాతిలో ప్రాణంగల జంతువులుంటున్నాయి కప్పలు ఉన్నట్లు. చంద్రకాంతమణిమంచివలె రాతినుంచి నీరు స్రవిస్తుంది- ఒక్క క్షణంలో స్వప్నంవచ్చేసరికి కుండగుడ్డ అయి కూర్చుంటుంది- కలలో తనమరణం తనకు తెలుస్తూ ఉంటుంది- నేలమీద నీరు ప్రవహించినట్లు ఆకాశంమీద మందాకినీ ప్రవహిస్తూ ఉంటుంది- రెక్కలుగల కొండల వలె పెద్దపెద్ద రాళ్లు ఎగిరిపడుతూ ఉంటాయి- సర్వము చింతామణి నుంచి ప్రాప్తించినట్లు రాతినుంచి సర్వం ప్రాప్తిస్తుంది- దేవతల ఉద్యానవనాలలోవలె మనం తలచినవన్నీ ఒక్కచింతామణి మంత్రం వల్ల లభిస్తాయి- కొన్ని ఎవ్వరు ఎంతగా తలచుకున్నా ఫలించవు- ఎలాగంటే "మోక్షంపుట్టుగాక, బ్రహ్మచచ్చుగాక, ప్రపంచం సత్యమగుగాక, భోగములు శాశ్వతముగుగాక, నియతి భగ్నమగుగాక, వేదాలు అప్రమాణమగుగాక" అని ఇలాంటివాటి విషయంలో ఎంతటి సత్యసంకల్పులు తలచుకున్నా ఏమీ ఫలించవు-

యంత్రపురుషునివలె అచేతనుడుకూడ క్రియ (పని) చేస్తాడు- ఇంకా ఇలాంటి విచిత్రపుపనులెన్నో మనం ఊహించటానికి వీలుకానివి శంబరగంధర్వమాయా విలాసాలచేత జరుగుతున్నాయి- మనకు ప్రత్యక్ష మగుచున్నాయికూడా- కొన్ని దైశిక వైచిత్ర్యాలు- దూరమునుంచి చూచి చంద్రుడు ప్రాదేశికుడు అనుకోటం మొదలయినవి- కాలంలో ఔత్పాతిక నభఃకబంధాదులు-

మంత్రప్రయోగాది క్రియచేతను, ఔషధాది ద్రవ్యములచేతను, మణులచేతను పిశాచాలు మొదలయినవి ఆవేశించటచేతనూ, చిత్రవిచిత్ర ములయిన క్రియావిలాసాలు లోకంలో మనకు కనిపిస్తున్నాయి- నిజ మయినవాటినుంచి అర్థక్రియ కలిగినట్లు అసత్యములైన వాటినుంచి కూడా అర్థక్రియ జరుగుతోంది- జరిగినట్లు కనిపిస్తోంది-

బ్రహ్మాండనాశమనేది ఇప్పుడు సంభవించకున్నా ఇకముందు కాలంలో సంభవించగలదు- అలాగే ఇప్పుడు సంభవించిన ప్రపంచ రూపమయిన స్వప్నవిలాసము ప్రలయంలోను తత్త్వజ్ఞానకాలంలోను అసంభవమగుచు (లేనిదియగుచూ) స్వరూపవిశ్రాంతికొరకు కాగలదు- కాబట్టి బ్రహ్మస్వరూపంతో చూస్తే అసత్యమయినదేదీ లేదు- జగ ద్రూపంతో చూస్తే నిజమయినదేదీ లేదని తేలింది-

స్వప్నసదృశమయిన ఈప్రపంచంలో మునిగియున్నవాళ్ళందరూ సర్వం స్థిరమనే అనుకొంటున్నారు- అతిస్థిరమయిన జ్ఞానంకలవాడై జీవుడు భ్రాంతిలోనుంచి మరోభ్రాంతిలోకి ఒకస్వప్నంలోనుంచి మరొక స్వప్నంలోకి పోతూ మోహపోతూనే ఉంటున్నాడు-

రామా! అతిమూఢమయిన మృగము తనను గోతిలోపడవేసే మోహమనే దోషంవల్ల ఒకగోతిలోనుంచి మరొకగోతిలోకి పడుతూ ఉంటుంది- అలాగే సంసారసముద్రంలో పడవేసే రాగాదిదోషాలవల్ల మధ్యలో మృగంవలె మళ్ళలేచిరావటానికి వీలుకాని దేహాది గర్త

ప్రవేశభ్రాంతిని (శరీరమనే గోతిలో పడటమనే భ్రాంతిని) పొందుతున్నాడు-

ఇట్లు జగన్మిథ్యాత్వకథనమనే ౬౧వ సర్గ సమాప్తము.

## ౬౨. భిక్షుసంసారోదాహరణము.

వసి॥ రామా! భ్రమనుంచి మరొక భ్రమలోకి మానవుడు పోతున్నాడనే అంశంలో ఉదాహరణగా నీకొక ఇతిహాసం చెబుతావిను-

పూర్వం ఒక్క గొప్పసన్యాసి (భిక్షువు) ఉండేవాడు- శమదమ వైరాగ్యాది సంపన్నుడు అతను- ఎప్పుడు సమాధిని అభ్యసిస్తూ ఉండేవాడు- తన ఆశ్రమధర్మంతో కాలం గడుపుకుంటూ ఉండేవాడు- సమాధిని నిరంతరం అభ్యసించటంచేత అతనిచిత్తం పరిశుద్ధమయింది- దేనిని తలచుకుంటే తద్భావాన్ని చెందేది ఆతనిచిత్తం ఒక్కక్షణంలో- ఇలా ఉండగా ఒకానొకప్పుడు సమాధినుండిలేచి ఏకాగ్రచిత్తుడై తన ఆసనం మీదనే కూర్చుండి ఇలా ఆలోచించాడు- "నేను శాస్త్రసంస్కారం లేని ఒకపామరజనుణ్ణి అయితే బాగుండును" అని విలాసంగా అనుకున్నాడు- వెంటనే అతనిచిత్తం ప్రాకృతనరాకారాన్ని చెందింది- (సామాన్యమనుష్యాకారాన్ని) నీరు ఆవర్తము (సుడి) యొక్క ఆకారాన్ని చెందేటప్పుడు తనపూర్వం ఉండే ప్రవాహరూపంగా చలన స్వభావాన్ని సమస్థితిని విడిచి నాభియొక్క ఆకారాన్ని చెందినట్లు తరువాత "జీవటుడు" అని అతనికి పేరు పెట్టుకున్నాడు. చాలాకాలం స్వప్నపురుషుడుగా విహరించాడు- అందులో ఒకపట్టణం నిర్మించుకున్నాడు- ఆపట్టణంలో పురవీధులను కల్పించుకున్నాడు- ఆపురవీధిలో బాగా త్రాగాడు- తుమ్మెద మకరందాన్ని త్రాగినట్లు- మత్తెక్కింది ఒంటికి- బాగా సంతోషించాడు- గాఢంగా నిద్రపోయాడు-

ఆ నిద్రలో ఒక స్వప్నం వచ్చింది- అందులో తాను వేదాధ్యయనములతోటి సత్కర్మానుష్ఠానములతోటి సంతోషిస్తూ ఉండే

బ్రాహ్మణుడుగా ఉన్నట్లు కలకన్నాడు- ఒకానొకవుడు ఆబ్రాహ్మణుడు పగటికాలంఅంతా అలసి నిద్రపోయేసరికి తానొక సామంతరాజుగా ఉన్నట్లు కలగన్నాడు- ఆ సామంతరాజు తిని పడుకున్నాడు- గాఢంగా నిద్రపట్టింది- ఆనిద్రలో పలుదిక్కులను పాలించే రాజుగా ఉన్నట్లు స్వప్నంవచ్చింది- తరువాత కొంతకాలానికి తానొక దేవతాస్త్రీగా ఉన్నట్లు స్వప్నంవచ్చింది- ఆసురస్త్రీ రతితో అలసి నిద్రపోయినట్లు ఆనిద్రలో తాను ఆడలేడి అయినట్లు మరొకకల- ఆలేడి గాఢంగా నిద్రపోయేసరికి తానొక తీగగా కలవచ్చింది-

రామా ! తిర్యగ్జంతువులకు కూడా కలలు వస్తాయా ? అని కొందరు సందేహిస్తాగా- అది సమంజసంకాదు- విన్నవాటిని కాని, చూచినవాటిని కాని తిర్యగ్జంతువులుకూడా చిత్తస్వభావాన్ని బట్టి కల కనగలవు- చిత్తంలో సంస్కారంఉంటే స్మృతివచ్చినట్లు స్వప్నంకూడా రావడం సహజం- (అవర్జనీయం)-

ఆవల్లీ (ఆతీగ) పుష్ప, ఫల, పల్లవములతో ఒప్పుతూ, ఉద్యానవనంలోని లతాగృహంలో విలాసగా తిరిగే వనదేవివలె ప్రకాశిస్తూ ఉంది తరువాత కొంతకాలానికి ఆతీగ తనను తెగకోసినట్లు కలకన్నది- ఆపైన కొంతకాలానికి సాక్షిచైతన్యంచేత ఘనమయిన నిద్రను అనుభవించి, ఆనిద్రలో తానొక భ్రమరంగా ఉన్నట్లు కలకన్నది- ఆతుమ్మెద వనంలో వనలయందు స్వేచ్ఛగా విహారించింది- వికసించిన పద్మములు గల పద్మినులయందు విహారించి వల్లభుడు ప్రియురాలి అధరామృతమును గ్రోలినట్లు మకరందమును త్రాగింది అతి ఆసక్తితో తామర కాడలమీద కూర్చొని- జడమతులకుకూడా ఒకేచోట రతి మెండుగా ఉంటుంది- అది సహజం-

ఇలా ఉండగా ఆకొలనును కలవరపరచేందుకు ఒకఏనుగు వచ్చింది- సాధారణంగా రమ్యమయిన వస్తువులను చెడగొట్టేందుకే మూఢులు అడుగుపెటుతూ ఉంటారు- ఆఏనుగుయొక్క కాలిచే

ఆనలిని (కొలను) మర్దింపబడింది- తుండముతో భక్షింపబడింది- ఆ తుమ్మెద (భ్రమరము) తామర కాడతో సహా ఏనుగుయొక్క (దంతాంతరం) దంతములమధ్య ప్రవేశించింది- ఏనుగు దంతాలతో నవిలేసరికి భ్రమరం చూర్ణమై పోయింది- ఆతుమ్మెద స్వప్నంలో ఏనుగుయొక్క ఆకారాన్ని చూచి భావించినందున తాను మదపుటేనుగు అయినది- ఎండిపోయిన చెరువువలె గంభీరమయిన (అతిలోతయిన) గోతిలో పడింది- జీవుడు అజ్ఞానాంధకారబంధురమయిన సంసారంలోపడినట్లు-

అటువయిన ఒకరాజుగారికి ప్రేమాస్పదమయింది ఆఏనుగు- మసించింది- పరబలాంతకమయింది- ఇలా ఉండగా ఒకప్పుడు ఆరాజుగారికి రాత్రికాలంలో యుద్ధం తటస్థించింది- ఆయుద్ధంలో కత్తులతోను పొడుగాటి ఖడ్గాలతోను, శూలములతోను ఛేదించారు సైనికులు- తుదకది మరణించింది- అంతకు లోగడ ఏనుగుల గండస్థలమునుంచి స్రవించే మదమును త్రాగుటకు తుమ్మెదలువచ్చి వాలుట చూచింది- ఆ సంస్కారం ఉంది దాని చిత్తంలో- అది ప్రస్తుతం ఉద్బుద్ధమయింది- దానిచేత ఆఏనుగు మళ్ళీ తుమ్మెద అయింది- వనలతలను కొలనును సేవించటం ప్రారంభించింది- అజ్ఞానికి వాసనలయొక్క దురభ్యాసం దుస్త్యజం- (విడువసాధ్యంకానిది) ఆతుమ్మెద ఏనుగుయొక్క కాలిక్రిందపడి నలిగి పొడిఅయిపోయింది- చెంతనున్న హంసలను చూచుటచేత కలహంసగా తయారయింది- చాలకాలం హంసజన్మలో నుండి అనేకహంసలతో విహరించింది- ఒకానొకప్పుడు హంస సభలో బ్రహ్మగారి వాహనమయిన హంసయొక్క గుణములను ఆకారమును వర్ణించుట విన్నది- ఆసంస్కారం చిత్తంలోపడింది-బలపడింది ఆ వాసన- తరువాత కొంతకాలానికి వ్యాధిఅనే పురుగుపట్టింది- దానితో మరణించింది ఆఏనుగు- తరువాత వెనుకటి సంస్కారంచేత బ్రహ్మగారి హంసగా తయారయింది-

ఆ బ్రహ్మలోకంలో వివేకవంతుడయిన బ్రహ్మదేవునియొక్క వైరాగ్యతత్త్వజ్ఞానాద్యుపదేశములచే బాగా తత్త్వం బోధింపబడింది- ఆబోధవల్ల భోగ్యవస్తువులందు నిస్సారతాబుద్ధి యేర్పడింది దానికి జీవన్ముక్తుడయింది- ఇలా జీవించిఉండగానే నిరతిశయానందమనే మోక్షసుఖాన్ని పొందితే బ్రహ్మగారితోటిపాటు ఆయనగారికల్పం పూర్తికాగానే విదేహకైవల్యం పొందటానికి సిద్ధంగాఉంటే ఇకముందు ఆహంస అధికంగా సాధింపతగింది ఏమున్నది-

ఇట్లు భిక్షు సంసారవర్ణనమనే ౬౨వ సర్గ సమాప్తము.

## ౬౩. స్వప్నశతరుద్రీయకథనము.

వసి॥ రామా! ఆహంస విలాసగా బ్రహ్మగారికి ఆసనమయిన పద్మముయొక్క కాడలయందు ఆటలాడుకొంటూ ఉండేది- అనగా బ్రహ్మగారి సామీప్యముక్తిపదం లభించిందన్నమాట ఆహంసకు-

ఒకానొకప్పుడు బ్రహ్మగారితోకూడా కైలాసానికి వెళ్ళింది- రుద్రుణ్ణిచూచింది అక్కడ- ఆతని జ్ఞానము యోగము ఐశ్వర్యము మొదలగు గుణములను చూచింది- తానుకూడా రుద్రుణ్ణి అయితే బాగుండునని అనిపించింది- ఆహంసను నిశ్చయించుకుంది అలాకావాలని- వెంటనే రుద్రుడు అయిపోయింది- అద్దంలో బింబంయొక్క ప్రతిబింబం వెంటనే పడినట్లు-

అయితే స్వామీ! ఈహంస జీవన్ముక్తిని పొందిందని అంటిరి కదా! మీరు- జీవన్ముక్తునకు వాసనలుండవే- వాసనలు లేకపోతే ఈహంసకు రుద్రుడుకావాలనే కోరిక ఎలాకలిగింది? రుద్రుని విషయమైన వాసన (సంస్కారం) ఉన్నప్పుడే కదా! ఆబుద్ధిపుట్టేది- కాబట్టి వాసనలేకుండా ఆబుద్ధి ఎలాపుట్టింది? భావన ఎలా కలిగింది? వాసన లేనిదానికి- భావనాభ్యాసంచేత దేహత్యాగం చేయడం తిరిగి రుద్ర

శరీరం ధరించడం ఇదంతా ఎలాజరిగింది? ఒకవేళ "భరతస్య త్రిజన్మభిః" అన్నట్లు ఈహంసకు నానాదేహాలతో అనుభవించతగిన ప్రారబ్ధశేషం ఉన్నందున రుద్రదేహం ధరించడం తటస్థించిందని మీారనే యెడల అపుడు ప్రారబ్ధకర్మవల్లనే రుద్రదేహప్రాప్తి కలుగుతుంటే ఇంక మీారు ఈహంసకు రుద్రుణ్ణి చూచేసరికి "రుద్రాహంభావన" నేను రుద్రుడను కావలెనని భావం కలిగిందనీ అంచేత రుద్రదేహాన్ని ధరించిందనీ మీారు వర్ణించడం వ్యర్థంకదా! పైగా రుద్రుడు ఈశ్వరుడుకాని, మానవుడు గాడు- మానవత్వం కర్మఫలం కావచ్చుకాని, ఈశ్వరత్వం ప్రారబ్ధకర్మ వల్ల వచ్చేదికాదు- కనుక మీారుచెప్పింది ఎలాకుదురుతుంది? అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా! ఇదా నీసందేహం-విను సమాధానం- ఈహంసకు కలిగింది నిజమయిన రుద్రభావం (రుద్రత్వం) (రుద్రజన్మ) కాదు- మరేమన ప్రతిబింబమువలె సారూప్యముక్తి- అది కర్మోపాసనలకు ఫలం కావచ్చు- తప్పేమీాలేదు- చూడు- "దేవో భూత్వా దేవాన ప్యేతి" అను శ్రుతిని- కాక ఇది జన్మాంతరంకాదు- ప్రారబ్ధశేషంచేత సంప్రాప్తమయిన కోరికచే యోగివలె మానసమయిన దేహాంతరమును కల్పించుకొని పూర్వశరీరం విడిచిపెట్టడం మాత్రమే- ఇలా ఆ హంస తన హంసశరీరాన్ని విడిచిపెట్టింది- రుద్రదేహాన్ని ధరించింది- రుద్ర భవనంలో స్వేచ్ఛగా విహరించింది గణపత్యపదవితో- సర్వోత్కృష్ట మయిన జ్ఞానము ఐశ్వర్యము మొదలయిన విలాసాలచే అసలురుద్రు నితో సమానమయింది- మనోబలంచేత తన ప్రాక్తన వృత్తాన్త మంతా తెలుసుకుంది-

సారూప్యముక్తిలో జగత్సంహారాది వ్యాపారాధికారం ఉండదు కాని జ్ఞానైశ్వర్యాదులతో ప్రసిద్ధరుద్రసామ్యం ఉంటుంది- అందుకు అడ్డులేదు-

నిరావరణమై తన్మయస్వరూపుడగు ఆ భగవంతుడు (రుద్రుడు) తనకు కలిగిన యీస్వప్నాలన్నిటికీ ఆశ్చర్యపడ్డాడు- తన మనస్సులో తాను తుదకు ఇలా అనుకున్నాడు- "అబ్బా! మాయ ఎంతచిత్రమయింది? ప్రపంచాన్ని అంతా మోసపుచ్చగలదుకదా! తాను అసత్యమై కూడా సత్యంగా నటిస్తుంది కదా! మరుభూమియందు నీటిని మరిపించినట్లు- నేను మొట్టమొదట పారమార్థికస్థితిలో చిద్రూపుడనే- తరువాత మాయచే చిత్తమయినాను- అనగా సకలసంకల్పవృత్తులు కలవాడ నయినాను- ఇది నాకిప్పుడు తెలిసి వచ్చింది- అలాంటి సంకల్పము నుంచియే నేను సర్వప్రపంచరూపుడనయినాను- చిదంశంలో సర్వజ్ఞుణ్ణి- జడాంశంలో ఆకాశాదిభూతరూపుణ్ణి- తరువాత స్వేచ్ఛగా వ్యష్టిసమష్టి లింగస్థూలదేహాలలో చిదాభాసరూపంతో ప్రవేశించాను- ఆశరీరాల లోని వాసనావైచిత్ర్యాలతో రంజితుడనయ్యాను- అందుచే జీవత్వాన్ని చెందాను- అనాదికాలంనుంచి జన్మపరంపరను అనుభవించాను- ఏదో ఒకానొక జన్మలో వైరాగ్యం కుదిరి సమాధిపాటవం అబ్బింది- విషయాలకు ఏమాత్రం లొంగలేదు తుదకు పరివ్రాట్టును అయ్యాను- అభిక్షుదశలో స్థిరంగా పద్మాసనంవేసికొని చేతులూ కాళ్ళనూ, ప్రాణేంద్రియాలనూ నిరోధించుకున్నాను- బాహ్యదేవతాది విషయంలో మానసిక పూజే రమ్యమయిందని చిత్తానికి తోచింది- రామా! అప్పటినుంచి ఆ అభ్యాసాన్ని మొదలుపెట్టాను- తద్విరుద్ధ భావాలన్నీ విడిచిపెట్టాను- అదే మానసపూజాలీలను ప్రారంభించాను- చిత్తానికి ఏది చమత్కారంగాతోచి నిరూఢమవుతుందో ఇంకదాన్ని చిత్తం విడిచిపెట్టదు- దాన్నే విజృంభింపచేస్తుంది- గ్రీష్మకాలంలో వేడిమొక్క చమత్కారంతో వ్యాప్తమయిన తీగ (వల్లి) వసంత ఋతువులో తాను త్రాగిన నీటివల్ల కలిగిన హరితభావమనే చమత్కారాన్ని (ఆకుపచ్చగా ఉండటమనే చమత్కారాన్ని) విడిచిపెటుతుంది- అనగా ఎండిపోతుంది- రామచంద్రా! జీవటుడనే ఆభిక్షువునకు అశాస్త్రీయమయిన మనోవాసనలు జీర్ణించి పోయాయి- అందుచేత అనేక

యోనులందు పుట్టుతూ చస్తూ ఉన్నాడు- బాగుతీర్చి సంచరించే చీమలు మధ్యలో కనిపించిన ప్రతి బొక్కలోను దూరుతూ ఉంటాయి- వాటికది సహజం- మళ్ళీ ఆబొక్కలోనుంచి లేచి బయటికివస్తూ ఉంటాయి- అలాగే ఈభిక్షువుకూడా కంటికి సోకిన శరీరాలన్నిటినీ క్రమక్రమంగా భావనచేస్తూ ఉండటం, భావనాబలంచేత ఆయాయోనులందు పుట్టుతూ ఉండటం చస్తూఉండటం సహజమయింది వాసనావశంచేత-

రామా! ఎంతటి సిద్ధునకయినా శాస్త్రీయవాసన తక్కువయితే (శిథిలమయితే) (లేకపోతే) అనాదిసిద్ధమయిన అనర్థవాసనలు ఉద్భవించి (ఉద్రిక్తమై) అనర్థపరంపరలు కలగటం అనివార్యం అవుతుంది- అతడికి కలిగిన జన్మలను క్రమంగా చెబుతావిను- మానవునికి సాధారణంగా శుభవాసనలు అశుభవాసనలు అని రెండురకాలు వాసనలు ఉంటాయి- అందులో దేనిమీద అభ్యాసపాటవం ఉంటుందో ఆవాసనే వృద్ధిపొందుతుంది- రెండవది (అభ్యాసపాటవంలేనిది) తిరోహితమై ఉంటుంది-

ఆ భిక్షువు మొదట బ్రాహ్మణభక్తుడు కాబట్టి బ్రాహ్మణుడయినాడు- తరువాత నిరంతర చింతనచేత సామంతరాజు అయినాడు- రాజ్యంకొరకు పుణ్యకార్యాలు చేయబట్టి రాజు అయినాడు- పుణ్యరాశితో కూడిన కోరిక ఉండటంచేత సురస్త్రీ (దేవతాస్త్రీ) అయినాడు- ఆపైన ఆడలేడి యొక్క నేత్రవిలాసాలమీద ఆశచేత ఆడలేడి అయినాడు- అబ్బా! వాసనామోహం జంతువులకు (ప్రాణులకు) ఎంతటి దుఃఖాన్ని అయినా యిస్తుందికదా? ఆమృగ అడవిలో తీగలలో విహరిస్తూ ఉంటుంది- కాబట్టి ఆవాంఛతో లత అయినాడు- లతలకు లవనం (ఛేదనం) అవశ్యంభావి కనుక ఛేదనాన్ని అనుభవించాడు- ఛేదనముతో లతాదేహం అపమృదితం అయేసరికి అంతఃస్థమయిన వాసనావశంచేత లతలమీద తిరిగే భ్రమరమయినాడు- అపయిన ఆభ్రమరాన్ని కాలితోతొక్కి చంపే ఏనుగయినాడు- ఏనుగు

కొలనును కలవరపరుస్తూ ఉంటే ఆకొలనుకు ఒకప్రక్కన దాపునఉన్న హంసలను చూచి ఆభావనచేత హంసఅయినాడు- ఆ హంసలకు సజాతీయమయిన బ్రహ్మగారి వాహనమయిన హంసభావనతో పద్మజవాహనహంస అయినాడు- ఇలా నూరుజన్మలు అనుభవించి తుదకు రుద్రుడయినాడు-

రామా ! ఆభిక్షువు భిక్షువుగా ఉంటూనే మనోవాసనలచే ఈసంసార సంభ్రమంలో అతిచిత్రములయిన యోనులందు తిరిగి తిరిగి (పుట్టి పుట్టి) తుదకు రుద్రుడయ్యానని చెప్పుకున్నాడు- ఇంకా ఇలా చెప్పుకున్నాడతడు-

నేను ఒకపుడు జీవటుడనే పేరుగల బ్రాహ్మణోత్తముణ్ణి- మరొకసృష్టిలో వసుధాధిపుణ్ణి- పద్మవనంలో హంసనయినాను- వింధ్యారణ్యంలో ఏనుగును లేడిని అయినాను- ఇలా నేను దేహయంత్రంలోనూ, మనోయంత్రంలోనూ, ఈయీ దశలను అనుభవించాను-

నాకు చిదేకరసమయిన పరపదమునుంచి ప్రచ్యుతిచెంది ఈసంసారంలో పడిందిలగాయతు నాలుగువేలనాలుగువందల యుగాలయి దినదినములు ఋతువులు మొదలయినవానిచరిత్ర అంతుయేలేదు- నేను భిక్షువుగా (సన్యాసిగా) ఉండగా తత్త్వజ్ఞాని కాదగినయోగ్యత నాకు నిండా ఉండేది- శ్రవణమననాద్యభ్యాసంకూడా నిరూఢంగా కద్దు- అయినా ప్రమాదవశాన దానినంతా వదలుకొన్నాను- అనేకజన్మ పరంపర మాటిమాటికి అనుభవించాను- తుదకు పద్మజుని (బ్రహ్మగారి) వాహనమయిన హంసను అయినాను- ఇప్పుడు రుద్రుడనయినాను- ఆ వెనుకటి శ్రవణమననాద్యభ్యాసక్రమమే ఇపుడు ఫలించి తత్త్వజ్ఞానాన్ని యిచ్చింది- అని అనుకున్నాడు ఆభిక్షువు-

కాబట్టి రామా ! శాస్త్రసిద్ధమయిన సాధనాలను అభ్యసించటం చాలామంచిది- (శ్రేష్ఠము) ఈభిక్షువు శాస్త్రీయమైన సాధనాన్ని అభ్యసించటంచేతనే మధ్యలో విరుద్ధమయిన జన్మలెన్నివచ్చినా

వాటన్నిటిని తట్టుకొని తుదకు పురుషార్థాన్ని (తత్త్వజ్ఞానాన్ని) సాధింప గలిగాడు- కనుక దృఢమయిన శాస్త్రీయసాధనాభ్యాసం కేవలం విరస మయిన జన్మసహస్రంతో వ్యవహితమయినా ఆజీవుని వెంటనంటి వస్తూనే ఉంటుంది అన్నారు వసిష్ఠులు-

స్వామీ! ఇలాగయితే అశుభమయిన వాసనకూడా ఇదే యుక్తిచేత శుభవాసనాభ్యాసంచేత వ్యవహితమయినా తిరిగి మళ్ళీ పుటుతూ (ఉద్భవిస్తూ) ఉంటుందికదా! అని అడిగాడు శ్రీరాముడు-

వసిష్ఠులు సమాధానం చెబుతారు- రామా! అలాకాదు ఆయుక్తి ఇక్కడ పట్టదు- కాకతాలీయంగా సజ్జనసాంగత్యం కలిగితే జీవునియొక్క అశుభవాసన నివర్తిస్తుంది- (నశిస్తుంది) అనగా శుభ వాసనలకు అశుభవాసనలు ప్రతిబంధకములు మాత్రమే- విరుద్ధములు కావు- అంచేత అవి శుభవాసనలఫలం నెరవేరకుండా కొంతకాలం ఆపుతాయి- ఇంతేకాని శుభవాసనలను (దృఢమయినవాటిని) రూపు మాపలేవు- శుభవాసనలు అలాకాదు- అవి అశుభవాసనలకు విరుద్ధ ములు- (శత్రువులు) అంచేత ఇవి అశుభవాసనలను రూపుమాప గలవు- ఇదీ యిచ్చటి రహస్యం-

స్వామీ! అలాగయితే అశుభవాసనలు ఎలాగయితే ప్రాక్తన సంస్కారంవల్ల కలిగాయో అలాగే శుభవాసనాభ్యాసంకూడా ప్రాక్తన సంస్కారంవల్లనే కలుగుతుందికదా! దానియొక్క బలంచేతనే పురు షుడు అశుభవాసనలను విడిచిపెడతాడుకదా! ఇంక వీడికి పురుష ప్రయత్నం ఎందుకు? దాన్నిశాస్త్రం విధించడం ఎందుకు?

వసి॥ రామా! అలాకాదు- వెనుకటి దుర్వాసనలను వదిలించు కొనగోరినపురుషునకు వెనుకటి జన్మలో సద్వాసనాభ్యాసం ఏమాత్ర మయినా ఉన్నప్పటికీ అది కాలాంతరంలో అభివృద్ధి చెందటానికి మంచి పురుషప్రయత్నాన్ని నిరీక్షిస్తూ ఉంటుంది- అలాంటి పురుష

ప్రయత్నంలేనిచే) అది ఉద్భవించదు– ఆయత్నంకూడా అనేకజన్మా భ్యస్తమయితేనే దృఢపడి దుర్వాసనలను రూపుమాపటానికి సమర్థ మవుతుంది– ఇంతేకాని వెంటనే (బలపడందే) రూపుమాపలేదు–

రామా! మిథ్యాభూతమయిన దేవతోపాసనాది ప్రయత్నం కూడా జాగ్రత్స్వప్నకాలములందు సత్యమని అనుభవించతగిన దేవతా భావమనేఫలం ఇవ్వటానికి సమర్థమవుతూఉంటే పరమార్థవస్తుగోచర మయిన శ్రవణాది ప్రయత్నం "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" ఇత్యాది ప్రమాణగమ్యమయిన పరమార్థసత్యస్వభావాన్ని పొందటానికి సమర్థ మవుతుందని వేరే చెప్పడం ఎందుకు? అది సూచితం అవుతుంది–

కనుకనే శాస్త్రీయమయినా అనాత్మవిషయక భావనాభ్యాసము దుఃఖమిశ్రితమయిన సుఖముకొరకేకాని ఆత్యంతిక సుఖప్రాప్తికొరకు కాదు– సర్వభావనాచ్ఛేదమే (అనగా వాసనాక్షయమే) అన్ని అనర్థా లను రూపుమాపి ఆత్యంతికసుఖాన్ని ఇస్తుంది– అంతరాళిక దేవత్వాది ప్రాప్తివల్ల లాభంలేదు– కాక సంసారబంధమనే అనర్థం అనాత్మ పదార్థాలను భావనచేయడంవల్లనే కలుగుతోంది– సంసారబంధానికి భయపడ్డవాడు ఇంకాదాన్ని (అనాత్మపదార్థాన్ని) సేవించడం ఎందుకు? దాన్ని త్రెంచుకోలేక సేవిస్తున్నాడని అనేయడల తత్త్వజ్ఞానంవల్ల సులభంగా తెంచుకోటానికి సాధ్యం అవుతుంది అది– అసలు అనాత్మ పదార్థమంటేనే (అసత్తు) లేనిది– ఆత్మకంటె భిన్నంగా ఏపదార్థంలేదు– కాబట్టి అసత్పదార్థం నిత్యోచ్ఛిన్నం కనుక దాని ఉచ్ఛేదాన్ని గురించి యెక్కువప్రయత్నం చేయనక్కరలేదు– ఆత్మయొక్క తత్త్వం తెలిసి కొంటే దానిఅంతట అదే లేకుండా పోతుంది– దాని ముచ్చట యెత్తుకో కుండా ఉంటేసరి– అదే విడిచిపోతుంది–

ఒకవేళ తత్త్వజ్ఞానం కలిగిం తరువాత ప్రపంచాకారమయిన భావనఉన్నా దానినుంచి భయపడవలసిన పనిలేదు– తత్త్వజ్ఞానంచేత బాధితమయిన ప్రపంచంయొక్క సంవేదనం (జ్ఞానం) ఉన్నా అది అధి

ష్ఠానసత్తాస్వరూపం కనుక సంతోషహేతువే అవుతుంది- ఇతరుడికి ఉన్నట్లు కనిపించినా ప్రాతిభాసికంగా ఉంటుంది కనుక అది వినోద హేతువే అవుడు- ఏమాత్రం అనర్థాన్ని అది కలిగింపలేదు-

కాబట్టి అత్యుత్సాహంగా లేచివెళ్ళాడు భిక్షువు- ఈఉపాధు లన్నీ సమ్యగ్జ్ఞానాన్ని యిచ్చినందుకు సంతోషించాడు- తన ఆత్మను బ్రహ్మాభిన్నం చేసికొంటానని ఆలోచించుకొన్నాడు- రుద్రత్వాన్ని పొందాడు- అతడిశరీరం శివాకారమయింది- చిత్తాన్ని మేలుకొలి పాడు- తత్త్వజ్ఞమయిన తన జీవచైతన్యంతో ఏకాగ్రపరచాడు చిత్తాన్ని- తానునుభవించిన భ్రమజాలాన్ని అంతా సంస్మరించాడు ఆభిక్షువు-

కాబట్టి ఆభిక్షువుయొక్క జాగ్రదవస్థ మనబోటివాళ్ళ జాగ్ర దవస్థవంటిది కాదు- మనకు జాగ్రదవస్థకలిగితే స్వప్నప్రపంచం పూర్తిగా నశిస్తుంది- అతనికి అలానశించలేదు- జీవటాది రుద్రాంతిశరీరములూ (జీవటశరీరము మొదలుకొని రుద్రశరీరంవరకునుండు శరీరములన్నీ) ఆశరీరాలతో అనుభవించిన ప్రపంచములూ అనువృత్తములగుచునే ఉన్నాయి- అన్ని ఉపాధులందూ రుద్రాంశమయిన జీవునియొక్క ప్రవేశాన్ని కల్పించుటచేతనూ, తదీయమగు సత్యసంకల్పబలము చేతనూ, విచిత్రమయిన భోజకాదృష్టశేషబలముచేతనూ, బాధిత ములుకూడా, (బాధింపబడినవికూడా) కల్పాంతపర్యంతమూ అనువ ర్తించడం సంభవిస్తుంది- కనుక ఆభిక్షువు లోగడ కలిగిన ఉపాధిభ్రమ లన్నిటినీ సంస్మరించాడు- చిరకాలంనుంచి జరిగిన జన్మలన్నీ అనుభవం లోకి వచ్చినందుకూ, స్వాప్నమయిన రుద్రశరీరాదులు అనువృత్తమయి నందుకూ ఆశ్చర్యపోయాడు-

తరువాత రుద్రుడు ఆభిక్షువు ఈయిద్దరులేచి ఆచిదాకాశ కోణంలోఉన్న జీవట సంసారాన్నిగూర్చి వెళ్ళారు- లీలోపాఖ్యానంలో వర్ణించినట్లు మరొక బ్రహ్మాండాన్ని ప్రవేశించారు- ఆజీవటునకు స్థాన

మయిన ద్వీపంచేరారు- అదే మండలం- అదేగృహం- అందులో చేతకత్తి పూనియున్న జీవటుని చూచారు వీళ్ళిద్దరూ- అంతర్ధానశక్తి చేత తన కాంతినీ, తన మహిమనూ దాచుకున్నాడు- జీవటుని సంసృతి ప్రదేశాలలో తెలివితప్పి శవాకారంగా పడియున్న జీవటుణ్ణిచూచారు- ఆజీవటుని చిత్తానికి చైతన్యాన్ని యెక్కించారు- (అనగా వాని చిత్తమును చైతన్యంతో సంయోజనచేశారు) అపుడు ఆజీవటుడుకూడా లేచికూచ్చున్నాడు- అంతటితో ఒక్కడు ముగ్గురయ్యారు రుద్రుడు, జీవటుడు, భిక్షుకుడు అని- ఒక్కక్షణకాలం ఆముగ్గురూ తెలివితో నుండికూడా తెలివిలేనివాళ్ళుగానూ ఆశ్చర్యపడుచున్నా ఆశ్చర్యరహితులుగానూ అయి పటంలోని బొమ్మలవలె ఉండిపోయారు-

తరువాత ఆముగ్గురూ కలిసి చిదాకాశంలో ఒకానొకచోట జీవటుని చిత్తపరిణామరూపమయిన బ్రాహ్మణసంసారం చేరారు- ఆబ్రాహ్మణునికిది వెనుకటి ద్వీపమే- అదే మండలం- అదే గ్రామం- అదే గృహం- వీనిలో ఏమీ మార్పులేదు- అచ్చట ఒక బ్రాహ్మణ్ణి చూచారు- ఆబ్రాహ్మడి కంఠాన్ని అతనిభార్య గట్టిగా కౌగలించుకొని ఉంది- నిద్రపోతున్నారు భార్యాభర్తలిద్దరు- ఆబ్రాహ్మణ్ణి మేలుకొలిపారు- చిత్తం చేతనావంతం చేశారు- (అనగా చిత్తాన్ని చైతన్యయుక్తంచేశారు-) అంతటవాళ్ళు నలుగురయ్యారు- విస్మితులయినా అవిస్మితులుగా ఉన్నారు-

తరువాత వాళ్ళు చిదాకాశంలో వ్యాప్తమయియున్న సామంతరాజుయొక్క సంసారాన్ని చూచారు- భోగసుందరంగా ఉంది ఆతని సంసారం. వాని ద్వీపం, వాని మండలం, వాని సామంతదేశం, వాని గ్రామం, వానిగేహం- ఆ యింటిలో పరుండి నిద్రించుతున్న సామంతరాజులను చూచారు- పద్మకోశంలో (పద్మపుమొగ్గలో) నిద్రించియున్న తుమ్మెదవలె ఆతడు మేలిమిబంగారు ఛాయగల ఆతని భార్యయొక్క కుచకోటరంలో పరుండి నిద్రిస్తున్నాడు-

ఆతణ్ణి నిద్రలేపారు- చిత్తానికి తెలివినిచ్చారు- ఆతనితో నలుగు రల్లా అయిదుగురయ్యారు- ఆశ్చర్యపోయారు- అయినా నిరాశ్చర్యులుగా నటించారు-

అక్కడనుంచిలేచి రాజసంసారం ప్రవేశించారు- అక్కడ అతణ్ణి లేపారు- ఆపయిన బ్రహ్మగారి హంసలోకానికి క్రమంగా రుద్రలోకానికి వెళ్ళారు వీళ్ళందరూ- వీళ్ళందరూ ఇలా నూర్గురు రుద్రులయ్యారు-

వసి॥ రామచంద్రా! ఒకే చైతన్యం- శరీరాలు వేరు- వారి చేష్టలు వేరు- ఏకరూపమయిన సంవిత్తు (చైతన్యం) అనేకరూపాలుగా ప్రకాశిస్తోంది- ఇది పరమేశ్వరవిలాసం- నిరావరణమయిన చైతన్యం నూర్గురు రుద్రులుగా తయారయింది- సర్వజగదంతర్యామి అయిన చైతన్యం ప్రాతిభాసిక నిఖిలప్రపంచాధిష్ఠానమయిన చైతన్యంయొక్క విలాసం ఇదంతా- రుద్రాధ్యాయంలో "సహస్రాణి సహస్రశో యే రుద్రాధిభూమ్యాం" అని వేయినంది రుద్రులు చెప్పబడుతున్నారు- వాళ్ళసృష్టికూడా ఇలాంటిదే- ఒకేచైతన్యం కల్పితోపాధులుఅనే కాటితో సంబంధించేసరికి అనేకత్వం వస్తుంది దీనికికూడా ఉపాధి సంబంధంచేత-

రామా! ఆ భిక్షువు కల్పించుకున్న శతరుద్ర సంసారాలలో భ్రమరసంబంధమయిన అవతారం పదకొండవది- దీనినే నీవూ నేనూ చూస్తున్నాం- ఆ భిక్షువుయొక్క స్వప్నసంసారాలను అన్నిటినీ అందరూ తెలిసికోనలేరు- తత్త్వవేత్తలయిన జీవులే గ్రహించగలరు- తత్త్వవేత్తలకు ఏకాత్మభావం ఉంటుంది- కాబట్టి వాళ్ళకు ఈ ఆత్మతో కలియక ఉంటుంది- అతత్త్వవేత్తలకు వాళ్ళతో సమావేశం ఉండదు- సముద్రంలోని తరంగాలకు నీటికి స్థూలరూపంలో భేదంఉన్నా ద్రవత్వమనే సూక్ష్మరూపంలో భేదంలేదు- అలాగే జీవులకు స్థూలోపాధిస్వరూపంలో భేదమున్నా, అతిసూక్ష్మమయిన చిద్రూపంలో భేదం లేదు- అంతా ఒకటే- అంచేత చిద్రూపంతో తత్త్వవేత్తలకు అంతా

ఒకటే కనుక వాళ్ళకు తెలియందేమీ ఉండదు- అతత్త్వవేత్తలకు స్థూలోపాధిభావనచేత అంతా వేరే కనుక వీళ్ళకు ఇతరాత్మలతత్త్వం తెలియదు- కాబట్టి సర్వజీవులకు తత్త్వభూతమయిన బ్రహ్మతత్త్వంతో ఐక్యం లభించినపుడే కల్పితరూపులయిన సర్వజీవులతోటి మేలనం లభిస్తుంది-

రామా ! ఆకాశం సర్వగం- (అనగా సర్వవ్యాపకం) అయినా ఎక్కడెక్కడ భూమితవ్వితే అక్కడక్కడల్లా ఆకాశం (రంధ్రం) ఏర్పడుతుంది- అదెలాగో అలాగే సర్వవ్యాపకమయిన చైతన్యానికి ఏయే ఉపాధితో సంబంధంకలిగితే ఆ యా ఉపాధులతో పరిచ్ఛిన్న (పరిమిత) మవుతుంది- ప్రపంచాలు పరస్పరం వేరయినప్పటికి వాటితో కూడిన పంచభూతాలనుమాత్రం మనం అంతటచూస్తూనే ఉంటు న్నాం- అలాగే జీవాదులు వేటికవి వేరయినా సర్వభూతాత్మభూత సత్తారూపమయిన చిత్త్వంకూడా అంతటా ఉంది- దానిననుభవించు-

రామా ! ఒక కొయ్యమీదగాని, రాతిస్తంభంమీదగాని శిల్పి ఒకడు ఉలితోటి మనిషిగానో, ఏనుగుగానో, గుర్రంగానో, బొమ్మను చెక్కితే మనం నిజంగా ఆబొమ్మను బొమ్మగానే చూస్తాం- రాయి అనుకోం- కొయ్య అనుగోం- ఆమనిషి బాగున్నాడు- ఆగుర్రం బాగుంది- ఆఏనుగు బాగుంది- అనేఅంటాం- అలాగే సద్రూపు డయిన పరమాత్మకూడా ఏఆకారంగల ఉపాధిలో ప్రవేశిస్తే ఆ ఆకారం కలవాణ్ణిగానే చూస్తున్నారు మానవులు- అయితే వృక్షాదులందు టంకంతో (ఉలితో) చెక్కినందువల్ల ఏర్పడినశ్వభ్రం (గుంట) పురుషా ద్యాకారంగా చూడటానికి కారణమవుతుంది- పరమాత్మ విషయంలో అవిషయమయిన శుద్ధాత్మతత్త్వాన్ని విషయమయినట్లు గ్రహించడ మనే అన్యథాజ్ఞానమే పరిచ్ఛేదమునకు నిమిత్తం- చిదేకరసమయిన బ్రహ్మయందు జగదాకారమయిన (ప్రపంచాకారమయిన) జడభాగం ఏదికలదో అదిశూన్యమే- (అనగా లేనిదే)-

అలాంటి జడప్రపంచం ఉన్నదని అనుకోనడమే మానవునకు బంధం- అజ్ఞానం లేకపోవడమే మోక్షం- పరమాత్మ మాత్రం బంధ మోక్షాలకు రెంటికీ సాక్షి- కాబట్టి రామా! నీ కిష్టమువచ్చినట్లు చేయుము- తత్త్వంగుర్తింపలేక నీవు బంధమే అనుభవిస్తావో! తత్త్వం గుర్తించి మోక్షమే పొందుతావో నీయిష్టం అని అర్థం- తెలిసికోన నంతమాత్రంచేత ఏదిలేకుండా పోతుందో అది నశించినందువల్ల నీకు ప్రయాసయేమి ? అంటే ఏసుఖమయితే నీకు తూష్ణీంభావంచేత లభించ తగిఉందో అదినీకు లభించనే లభించింది- కాబట్టి అందుకుకూడా నీకు ప్రయాసాపేక్ష అక్కరలేదు- ప్రాతిభాసికమయిన ప్రపంచం ఏదికలదో అది దాని స్వరూపంతో కనిపించకపోవడమే దానికి నాశం- ఆప్రాతి భాసిక ప్రపంచజ్ఞానానికి ఏది సాక్షిభూతమో అయ్యది నీకు ప్రాప్తించే ఉంది-

రామా! నీటివల్ల తరంగబుద్బుదాలు ఏలాంటివో చైతన్యము నందు జగత్తుకూడా అలాంటిదే- కాని యీమాత్రం కొద్దిభేదం ఉంది- దేశకాలస్వరూపాలు ఉంటూ ఉండగా నీటిలో తరంగబుద్బుదాలు భాసిస్తాయి- ప్రపంచ విపర్తోపాదానబ్రహ్మయందు దేశకాలాదులు ముందులేవు- తరువాత అతనియందు ఆరోపింపబడ్డాయి- కార్యభూత మయిన జగత్కోటిలోచేరి కనుబడుచున్నాయి-

రామా! స్వప్రకాశమయిన చైతన్యమే అవిద్యావరణవల్ల అభాస్వరమయి అనగా ఈషత్ ప్రకాశముకలదై ప్రపంచాకారంగా గోచరిస్తోంది- చిద్రూపుడయిన బ్రహ్మయొక్క నిజరూపం చైతన్యమే కాని జడంకాదు- కనుక దీనిని (ప్రపంచాన్ని) ఉపసంహారం చేసికో- అపుడు "వాచారంభణం వికారః" అని చెప్పినట్లు ప్రపంచం నామ మాత్రమవుతుంది- ఆనామంకూడా శాంతిస్తే అపుడు పరమాత్మయే మిగులుతాడు-

రామా! ఆత్మచైతన్యం సర్వజగత్తు అని చెప్పినందువల్ల ఇవి రెండని నీవు అనుకోనవద్దు- శ్రుత్యుక్తమయిన ఆత్మతత్త్వం తెలియు

నంతవరకు ఇలా (రెండని) అనుకోవలసిందే- కాని తెలిసిన తరువాత మాత్రం అక్కడ ద్వైత్వం లేదు- అని అన్నారు వసిష్ఠులు-

ఇట్లు స్వప్నశతరుద్రకథనమనే ౬౩వ సర్గ సమాప్తము.

## ౬౪. భిక్షువునకు గతాత్వప్రాప్తి

శ్రీరా॥ స్వామీ! జీవటునికి కలిగిన భిక్షువు మొదలు రుద్రుని వరకునుండు దేహాలతో ఏమయినా వ్యవహారం (సుఖదుఃఖాద్యనుభవం కలిగిందా? లేదా? అని అడిగాడు-

వసి॥ రామా! రుద్రాంతమయిన ఆజీవులందరూ పరస్పరం ఒకరి సంసారం ఒకరు గుర్తించుకొంటూ కృతకృత్యులై సుఖంగా ఉన్నారు- ఈవినోదంఅంతా చూడటానికి మొదట బయలుదేరిన రుద్రుడు తన అంశభూతులయిన ఆజీవులందరిని తమతమ సంసారానికి చేర్చాడు-

ఇలా అన్నాడు ఆ ప్రథమరుద్రుడు ఆ జీవులతో-

ఓ జీవులారా! మీరందరూ మీ మీస్థానానికి చేరండి- మీ మీ భార్యలతో మీరు సుఖంగా ఉండండి- కొంతకాలం సుఖం అనుభవించి ఆవల మీరంతా నాస్థానం చేరు- నా అంశరూపులయిన ప్రమథగణాలు అయి మహాప్రలయానంతరం నాస్థానాన్ని చేరగలరు అని-

వసి॥ రామచంద్రా! ఇలాచెప్పి ఆరుద్రుడు అంతర్ధానం అయ్యాడు- ఆ రుద్రులందరికీ ఈచిట్టచివరి రుద్రుణ్ణి చూడటమనేది అంతరాలికమయింది- (మధ్యమమయింది) అనగా జాగరమయినదని అర్థం- తరువాత జీవటాదులందరూ తమతమ భార్యలతో సుఖంగా కాలంగడిపి తుదకు రుద్రలోకం చేరెదరు- వాళ్ళే ఒకానొకప్పుడు ఆకాశాన నక్షత్రాకారంగా కనిపిస్తూ ఉంటారు- అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ స్వామీ ! సంకల్పరూపులయిన ఆ జీవటాదులు సత్య రూపులెలా అయ్యారు ? సంకల్పాత్మకమయిన వస్తువునందు సత్యత్వం ఎక్కడిది ? అని అడిగాడు శ్రీరాముడు.

వసి॥ రామా! అధిష్ఠానమయిన చిదంశమే సత్యముకాని అధ్యస్త మయిన వస్తువు సత్యముకాదు. కాన అధస్తాంశమునందు సంకల్పము సత్యమనే మాటమరచిపో. ఆ భావాన్నే విడిచిపెట్టు. సంకల్పాత్మక మగు వస్తువు సదసద్ సంవలితము. అధిష్ఠానాంశము సత్తు. ఆరో ప్యాంశము అసత్తు. ఈయది సంకల్పమునకు పూర్వము లేదు. అనంతరం ఉండబోదు. కాన "ఆదావంతేచ" అనున్యాయ ప్రకారము అది యెన్నడూ లేనిదే. దానిమీద సత్యత్వబుద్ధిని విడిచిపెట్టు. అధిష్ఠానం మాత్రం సర్వాత్మకమయినందున సత్యంగా ఉండియే యున్నది. ఆ అధి ష్ఠానపదార్థము యొక్క సత్తవల్లనే అనుభవించేవాడి అదృష్టంచేత ఉద్బుద్ధమయిన సాంకల్పికవస్తువు అర్థక్రియాకారి అవుతోంది. లేక పోతే దీనికి అర్థక్రియాకారిత్వమే లేదు.

సర్వకాలం ఉండే అధిష్ఠానస్వరూపంతో తద్దేశకాలస్వరూపంతో మాత్రం అధ్యస్తం (సంకల్పార్థం) కూడా ఎల్లప్పుడు ఉంటోంది. అనగా అధ్యస్తపదార్థంకూడా అధిష్ఠానస్వరూపంతో ఎల్లకాలం (సదా) ఉంటుంది.

మథురాది దేశంలో ఉన్నవాడికి పాటలీపుత్రదేశంలోని వస్తువు ఉన్నదయినా దానిని పొందాలంటే గమనమూ గంత (వెళ్లేవాడూ) వెళ్ళిపొందాలనే వృత్తికాధారమయిన స్వస్థమగు మనస్సూ, కంటి చూపూ, పగటికాలమూ, అక్కడ ఆవస్తువును చూపునట్టి పురుషుడూ ఈ మొదలయిన కారణకలాపం లేనిదే ఆవస్తువు లభ్యముకాదు. (పొందబడదు) అలాగే స్వప్నముకూడా (స్వప్నవస్తువుకూడా) జాగ్ర త్సుషుప్తులందుకాని స్వప్నాంతరంలోకాని కారణకలాపం ఏమీలే నందున పొందబడదు. అజ్ఞానము సర్వవాసనలకు నిలయం. ఆవాసనలు

భోజకాదృష్టంచేత ఉద్బుద్ధమవుతాయి- వెంటనే వాసనానుగుణంగా అన్నివస్తువులను మానవుడు పొందుతూఉంటాడు-

రామచంద్రా! సర్వస్వాప్నసంకల్పములూ ఒకేమారు దర్శన మయ్యే ఉపాయం ఒకదశలో ఉన్నది- ఆదశను గురించి చెబుతావిను- అభ్యాసయోగపరిపాకదశలో అన్నీ ఒకేమారు ప్రత్యక్షమవుతాయి- ఈశ్వరావతారులకు మాత్రం అభ్యాసంలేకుండగనే స్వతస్సిద్ధంగానే యోగసిద్ధి ఫలిస్తుంది- వాళ్ళు అప్పుడు అన్నిటినీ అంతటా చూస్తారు- శంకరాదులు అలాంటివారు-

అభ్యాసబలంవల్లనూ, యోగశక్తివల్లనూ, కోరినవస్తువులు లభిస్తాయి- ఈరెంటికి చిత్తైకాగ్ర్యం అవసరం- అదిద్వారము- చిత్తం మామూలుగా అనేకవస్తువులమీద వ్యాసక్త (అత్యంతాసక్త) మయి ఉంటుంది- దానికి (చిత్తానికి) ఏకాగ్రతలేనిచే కోరినవస్తువును దేనిని మానవుడు పొందలేడు- అంచేత వీడు అసత్యసంకల్పుడవుతాడు- రామా! తాను సంకల్పించిన వస్తువు (తన మనస్సులోని వస్తువు) ఎదుటనున్నా మనస్సు ఏకాగ్రం లేకపోతే పొందటానికి సాధ్యంకాదు- ఎంచేతనంటే చిత్తం (మనస్సు) సంకల్పించినవస్తువును తదన్య (అసంకల్పిత) వస్తువును రెంటిని ఆశ్రయించి ఉండటంచేత ఉభయభ్రంశమవుతుంది- ఏ ఒక్కచోట స్థిరపడదు-

రామచంద్రా!

శ్లో॥ సర్వం హ్యభిమతం కార్యం ఏకనిష్ఠస్య సిధ్యతి ।
దక్షిణాం కకుభం గచ్ఛన్ కః ప్రాప్నోత్యుత్తరాం దిశమ్ ॥

అనినట్లు సమస్తపనులూ తదేకనిష్ఠునకు సాధ్యమవుతాయి- దక్షిణ దిక్కుకు పోయేవాడు ఉత్తరదిక్కును ఎలా పొందుతాడు?

సంకల్పార్థపరైరేవ సంకల్పార్థోఽవగమ్యతే ॥

సంకల్పించిన వస్తువునందు శ్రద్ధకలవాళ్ళకే ఆ వస్తువు లభిస్తుంది-

ఎదుటనున్న వస్తువుమీద చిత్తంకలవానికే ఎదుటనున్నవస్తువు కనిపిస్తుంది- ఏకాగ్రతలేనివాడు ఎదుటనున్న వస్తువునూ చూడలేడు- మనస్సులోని వస్తువునూపొందలేడు- కనుక ఏకాగ్రనిష్ఠుడయిన కారణం చేత భిక్షుజీవుడు రుద్రత్వాన్ని పొందాడు- ప్రసిద్ధరుద్రునివలె ఇతడు కూడా సర్వజ్ఞత్వంచేత సర్వంపొందాడు-

మధ్యనున్న జీవటుడు మున్నగు రెనభై రెనిమిదిమంది భిక్షు సంకల్ప జీవులుమాత్రం ప్రత్యేకంగా ఉన్నారు- వీరికి సర్వజ్ఞత్వంలేదు- వారివారి సంసారంకూడా వేరువేరు- కాబట్టి వారు ఒకరినొకరు తెలియలేరు- రుద్రసన్నిధిలో మాత్రం రుద్రునియొక్క ఇచ్ఛచే ఒకరినొకరు తెలిసికొన్నారు- వాళ్ళు రుద్రరూపులుగా కాని తద్భిన్నరూపులుగా కాని ఈశ్వరేచ్ఛచేతనే పుటుతూ ఉంటారు- ప్రత్యేకం వారివారి సంసారం తెలిసికొనుటలో మాత్రం వారివారికోరికే కారణం- "నేను విద్యాధరుణ్ణి అవుతాను" "నేను పండితుణ్ణి అవుతాను" అని ప్రత్యేక కోరికలుంటాయి వాళ్ళకు- ధారణాధ్యానయత్నంచేత వాళ్ళు అనుకున్నదంతా వాళ్ళకు ఫలిస్తుంది- క్రమంగాకాని ఒకేదఫా (యుగపత్) కాని యథేచ్ఛగా ఏమయినా చేయడానికి సమర్థులువాళ్ళు-

జీవుడు పరమార్థముగా అనంతుడు (అపరిచ్ఛిన్నుడు)- అందుచేత వీనికి సర్వశక్తులూ కలవు- వీడికే ఒక్కొక దేహంమీద అభిమానం కలిగే టప్పటికి పరిచ్ఛేదం ఏర్పడుతోంది- కాబట్టి జీవుడికి ఏదో ఒక్క పనిమాత్రం నెరవేర్చేశక్తి ఏర్పడుతోంది- వారివారి శక్తిస్వభావాన్నిబట్టి కార్యస్వభావాలు మారుతో ఉంటాయి- లేక (వ్యవస్థితములై ఉంటాయి)-

కనుకనే ప్రాణులకర్మను అనుసరించి స్వర్గనరకాది అనర్థసహస్రములతో వికాసం చెందియున్నా సర్వప్రాణులను సంహారంచేస్తూ ప్రలయరూపంతో సంకోచం చెందుతున్నా, జగదీశ్వరుడు హింసాప్రయుక్తమయిన వైషమ్యనైర్ఘృణ్యాది దోషాలు లేనివాడే అవుతున్నాడు-

జీవసంఘం స్వయంగా దేనిని కోరుతుందో దానినే తన యిచ్ఛాను సారంగా ఈశ్వరసంకల్పంచేత సంప్రాప్తమవుతుంది- అంచేత ఈశ్వరుడు ఎవ్వరికీ ఏవిధమయిన అనిష్టము కలిగించినవాడు కాడు- కనుకనే "వైషమ్యనైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్" అనే బాదరాయణసూత్రం ఉపపన్నం అవుతోంది-

లోకంలో యోగులుకాని, యోగినులుకాని ధారణాధ్యాన ప్రయత్నాలచే ఆయాదేశకాలాల ననుసరించి ప్రాణులను అనుగ్రహించటం, నిగ్రహించటం, క్రీడించటం మొదలయిన ఆధికారిక క్రియలు ఎన్నో చేస్తారు- తమయింటిలోకాని అన్యత్రకాని తలచినచోటల్లా కావలసినన్ని శరీరాలు కల్పించుకుంటారు- ఇహలోకంలోకాని స్వర్గాది పరలోకాలలోకాని యోగులు (యుగపత్) ఒకేమారు ప్రారబ్ధ భోగంతో కాలంగడుపుతూ ఉంటారు- యోగులచరిత్ర ఇలాంటిది- కార్తవీర్యుడు తనయింటిలో తానుండియే అచ్చటచ్చటనున్న దొంగలు మొదలయినవారికి భయపరచునట్టి శిక్షకుడు (శాస్త్ర) అయినాడు- అతనికి దత్తాత్రేయులవారి అనుగ్రహంవల్ల ఇలాంటి యోగసామర్థ్యం లబ్ధమయిందని మార్కండేయ పురాణాదులలో ప్రసిద్ధికలదు-

శ్రీమహావిష్ణువు క్షీరోదధియందుండియే భూలోకంలో అవతార పురుషుడుగా పుటుతున్నాడు- అనగా పుట్టుక మొదలయినవి కలవాడుగా వ్యవహరిస్తున్నాడు- ఈయది యోగమహిమ-

యోగినీస్త్రీలు స్వర్గలోకంలో యోగినీగణముయొక్క వడుమన ఉండియే భూలోకంలో పశువులు భక్షింపదగిన ఉపహారాదులను గ్రహించుటకొరకు వెళ్లుచున్నారు-

దేవేంద్రుడు స్వర్గాసనంలో ఉండియే యజ్ఞంకొరకు భూలో కానికి వెళుతూ ఉంటాడు-

ఈ రామావతారంలో జనార్దనుడు జనస్థానంలో పదునాల్గువేల రాక్షసులను వధించటానికి వేయిరూపాలు గలవాడయి మరల తానొక్కడే అగుచున్నాడు.

భక్తుల మొరలువిని వారల ననుగ్రహించుటకు యదుకులంలో మనుష్యుడై పుడుతున్నాడు. కురుసభలో దుర్యోధనాదులను మోస పుచ్చటానికి తానొక్కడు వేయిమంది అగుచున్నాడు.

అంశావతారలీలచే జనార్దనుడు లోకమర్యాదను పాలించు చున్నాడు. ఏక కాలమందు పదునారువేలమంది స్త్రీలను అనుభవించు చున్నాడు. "రెప్పపాటువలె" అనగా నిమిఅనే రాజర్షి విదేహత్వాన్ని (శరీరంలేకపోవుటను పొందినవాడై) సర్వప్రాణుల నేత్రములందుండుచూ (యుగపత్) ఒకేమారు నిమేషములను (రెప్పపాటులను) చేయు చున్నాడు. అలాగే విష్ణుమూర్తి కృష్ణావతారంలో ఒకేదఫా పదునారు వేలమందిని అనుభవించుచున్నాడని భావము.

అలాగే ప్రకృతమునకూడ రుద్రుని అభ్యనుజ్ఞాబలంవల్ల భిక్షువు యొక్క సంకల్పపురుషులయిన జీవటబ్రాహ్మణాదులు సంకల్పపురమును చేరుకున్నారు. అచ్చట చాలకాలం భోగాలు అనుభవించి రుద్రుని పరివారమయిన ప్రమథగణములో చేరారు.

ఆగణాలు వికసించిన పుష్పములుగల కల్పలతాగృహములందు రుద్రునితో కూడా నానానగరములందు విహరించారు. గీత వాదిత్ర నాట్యాది కళలులయిన విద్యాధరీస్త్రీలలో అమరులచే నెత్తినధరింప దగినవారయినారు.

ఇట్లు స్వప్నశతరుద్రయమను ౬౮వ సర్గ సమాప్తము.

## ౬౯. విస్మయవర్ణనము.

వసి॥ రామా! ఆభిక్షువుయొక్క చిత్తంలో కలిగిన భ్రమ పురా కృతకర్మఫలమని తలచాడు. ఇలాగే జీవులందరకు మరణకాలంలో

ఉద్బుద్ధమయిన కర్మే స్వప్నంవలె ప్రపంచరూపంగా మోక్షపర్యంతం భాసిస్తూ ఉంటుంది-

ఇలా భిక్షువుయొక్క ఆత్మవలె సకలప్రాణులూ పరమార్థంలో అపరిచ్ఛిన్నరూపులే- అయినప్పటికీ దేహీ దేహపరిచ్ఛిన్నుడివలె మోక్షపర్యంతం ఆకులపడుతూ ఉంటాడు- ఈభిక్షువుయొక్క కథతో జీవసముదాయంయొక్క పరిస్థితి అంతా చెప్పానునీకు-

ప్రతిజీవుడు తన పరిపూర్ణ స్వరూపంనుండీ దిగజారి ఇలాగా ఉంటారు- కేవలం భిక్షువు ఒక్కడేకాదు- ప్రతిదినము స్వప్నంలో మనకిది అనుభవసిద్ధమే- ఒక స్వప్నంనుంచి మరొకస్వప్నానికి పోతూ ఉండటం మానవులకు సహజమయింది- స్వప్నంఅంతా మిథ్య(మృష) అనేమాట దృఢమేకదా !

ఏదో కర్మనిమిత్తంచేత మానవుడు ఈజన్మాది దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు- దేహమునందు అహమభిమానము బంధము- స్వాత్మలాభమేమోక్షము- ఇది బంధమోక్షములయొక్క నిష్కర్ష- అని అన్నారు వసిష్ఠులు-

విన్నాడు- ఆశ్చర్యపోయాడు- ఇలా వెల్లడించాడు- తన ఆశ్చర్యాన్ని-

స్వామీ ! ఈమోహం ఎంతటి విషయమయింది ? జీవులను అత్యల్పమయిన నిమిత్తంతో మహత్తరమయిన సంకటంలో పడవేస్తోందికదా ! అంతా అంతటా ఎల్లప్పుడు సంభవిస్తుంది సంకల్పబలం ఉంటే అని అన్నారు- అదికూడా నాకు అనుభవగోచరమయింది- కాని యింకొక్కటి అడుగుతా చెప్పండి దయచేసి ! మీరు సెలవిచ్చినటువంటి భిక్షువు ఇప్పుడు ఎక్కడనయినా ఉన్నాడా ? లేడా ? యోగశక్తితో ఆలోచించి చెప్పండి ? అని అడిగాడు రాముడు-

వసి॥ రామా ! ఈరాత్రి అంతా సమాధిలోఉండి మూడులో కాలలో భిక్షువు ఉన్నాడా? లేడా అనేదిచూచి తెల్లవారి ఉదయం చెపుతా నన్నారు వసిష్ఠులు–

వాల్మీకి॥ భరద్వాజా ! వసిష్ఠుడు ఇలా అనేసరికి మధ్యాహ్న కాలాన్ని సూచించే డిండిమము (వాద్యవిశేషము) ప్రలయకాల గర్జిత మేఘధ్వనివలె మ్రోగింది– పౌరులూ, రాజులూ వసిష్ఠుని కాళ్ళమీద పుష్పాంజలులు విడిచిరి– (చల్లిరి) ఋషిశ్రేష్ఠులను పూజించి పౌరులు నృపులు తమతమ ఆసనములనుంచి లేచిరి– నమస్కరించి సభ అంతా లేచింది– ఖేచరులు భూచరులు అందరూ క్రమంగా తొలిరోజువలె తమతమ తావులందు ఆహ్నికమును తీర్చుకొనిరి– అందరూ ముని ప్రోక్త మయిన ఆధ్యాత్మికతత్త్వాన్ని తలచుకొంటూ రాత్రి అంతా క్షణంగా గడిపారు–

మళ్ళీ శ్రీరాముడు అడిగే ప్రశ్నలను వినాలనే కుతూహలంతో నిద్రలేకపోవటంచేత అదేరాత్రిని ఒకకల్పంగా గడుపుకున్నారు–

భరద్వాజా ! ఖచర భూచర భూతసంఘము రాత్రిని గడపుకొని ప్రొద్దున నెమరిపనిని వారుతీర్చుకొని ప్రొద్దున దశరథమహారాజుసభను అలంకరించారు– మరల వెనుకటిరోజునవలె ఆఖ్యానలోకరచనతోటి వ్యాఖ్యాన శ్రవణోచిత సభాసన్నివేశ క్రమరచనలోను ఒకరినొకరు గౌరవించుకొనుచూ పరస్పరం సంభాషించుకొనుచూ కూర్చున్నారు–

ఇట్లు విద్యోత్తర విస్మయవర్ణనము ౬౫వ సర్గ సమాప్తము.

## ౬౬. భిక్షుసంస్మృతికథనము.

వాల్మీకి॥ భరద్వాజా ! ఖేచరభూచరాదులూ, రాజశ్రేష్ఠులూ, వసిష్ఠ విశ్వామిత్రాదులతో కూడి ప్రశాంతంగా కూర్చున్నారు– ఎవ్వరూ ఏమీ ప్రశ్నించలేదు– వసిష్ఠులు తామే చెప్పటం ప్రారంభించారు.

వసి॥ రామా! రఘుకులాకాశ శశాంక! నిన్నరాత్రి జ్ఞాననేత్రంతో ఆభిక్షువును కనిపెట్టాను- దానివిధం విపులంగా చెబుతా విను-

నేను ధ్యానంచేత అతణ్ణి చూడాలని సప్తద్వీపాలూ, కులశైలాలూ అన్నీ తిరిగాను- ఎక్కడా అలాంటి భిక్షువు కనిపించలా నాకు- అంచేత ఇదంతా భ్రాంతి అనుకున్నా- మనోరాజ్యం బాహ్యంలో కనిపించటం అసంభవంకదా! అపుడు నేను ఇక మూడవవంతు రాత్రి కాలం మిగిలి ఉండగా ఉత్తరదిక్కునకు వెళ్ళాను- అక్కడ "జిసి" అనే పేరుగల గ్రామమొకటి పెద్దది ఉన్నది- ఇది వల్మీకమనే పేరుగల దేశానికి పైనఉంది- ఈజిన అనే దేశంలో విహారమనే పేరుగల దేశ మొకటి బహుజనాశ్రయమైనదికద్దు- ఆ విహారమనే దేశంలో కపిల వర్ణమయిన నెంత్రుకలుగలిగి యీభిక్షువు సమాధికోరకు తయారై ఉన్నాడు-

ఇరువదియొక్క రాత్రులు గట్టిసమాధిలో ఉండదలచాడు- ఇంటి తలుపు గట్టిగా గడియపెట్టుకున్నాడు- అతని ధ్యానయోగానికి భంగం కలుగుతుందనే భీతితో భృత్యులుకాని, ప్రియురాండ్రుకాని ఆయింటిని ప్రవేశించడంలేదు- ఇప్పటికి ఆభిక్షువు చరమ సాక్షాత్కారం పొందటానికి ఆయుర్దాయాన్ని నియమించునట్టి బ్రహ్మదేవుని పరిస్థితికూడా ఇలాగేఉంది- ఇలాంటి ధ్యాననిష్ఠలో ఉండనారంభించి యిప్పటికి అతనికి యిరువదియొక్క రాత్రులయినవి- ఈతడు పూర్వకల్పంలో ఇలాధ్యాననిష్ఠలో వేయిసంవత్సరాలున్నాడు- ఈతడు ఈకల్పంలో రెండవవాడు- మూడవవాడు ఎక్కడా కనిపించడు ఎంతకాలం నేను ప్రపంచంలో తిరిగినా- ఈసర్గ (సృష్టి) కంటె ఇతర సృష్టులు కొన్ని విలాసగా కనిపెట్టాను- అందులో మూడవ భిక్షువును కనిపెట్టాను- ఇలాగే మరోబ్రహ్మాండంలో మరికొంతమంది భిక్షువులు ఉండిఉండవచ్చు- అనంత భిక్షువులు కూడ ఉండవచ్చు- రామా! ఈసభలో ఏమునులు బ్రాహ్మణులు ఉన్నారో వాళ్లుకూడా భిక్షుసదృశ సమా

చారములు కలవాళ్లుగాకాని తమకు అనుకూలమయిన (సదృశమయిన) ఆచారం కలవాళ్ళుగా కాని అనేకమంది యుండియుండవచ్చును- ఇక్కడ ఒక నారదున్నాడు- ఇతర బ్రహ్మాండంలో మరోనారదుడు ఇలాంటివాడు ఉండవచ్చును- లేక మరోలాటివాడు నారదుడుగా ఉండవచ్చును- ఇలాంటి జ్ఞాన, కర్మ, ఆచారములతో కూడిన వాళ్లుగా ఉండవచ్చు- మరోలాటి జ్ఞానకర్మలు గలవాళ్లుగా మారవచ్చు-

ఇలాగే వ్యాసుడు, శుకుడు, శౌనకుడు, క్రతువు, పులస్త్యుడు, అగస్త్యుడు, భృగువు, అంగిరసుడు మొదలగు వారంతా ఇలాంటి వాళ్లుగా కాని, కొంచెం మార్పుతో కాని ప్రతికల్పంలోనూ ఉండ గలరు- బ్రహ్మమాయ చాలా దొడ్డది- మామూలుగా సదృశాచార జన్మగలవారుగా కొందరు- తద్భిన్నంగా కొందరు- అత్యంతసదృశులు కొందరు- అర్థసదృశులు కొందరు- కొందరు కొంచెం సమానులు- మరికొందరు ఒకానొకప్పుడు సమానులు- ఇలా విష్ణుమాయ మహా వ్యామోహపరచేది- నిరవయవకాలరూపమయిన క్షణంలో మానస చేష్టకూడ ఉండదు- దేహాదిచేష్టారూపమయిన క్రియ ఉండదని వేరే చెప్పనేల? భ్రాంతియే కేవలం ఇలా విజృంభిస్తోంది- ఇది యీభిక్షువు యొక్క చరిత్రలోనే స్పష్టమవుతోంది-

ఇరువదియొక్క రాత్రులెక్కడ? అనంతములయిన ఆకారము లెక్కడ! వీటిని ప్రత్యక్షంగా చూడటం ఎక్కడ? ఇదంతా ప్రతిభా మాత్రం- నీటిలో తెల్లవారేసరికి పద్మంపుట్టినట్లు శుద్ధ చిన్మాత్రము నుండి అశుద్ధమయిన యీ సంసారజాలం ఉత్పన్నమయింది-

ఈ భిక్షువుయొక్క మనస్సునందువలె నిఖిలజీవుల మనస్సులందు కూడ ఈ ప్రపంచరూపమయిన ప్రతిభాస ఖండలు పుటుతూనే ఉం టాయి- వారివారికి లోపల అజీవఖండాంతరములలోకూడ విచిత్ర మయిన సర్గఖండము పుటుతుంది- ఇది ఇలా మాయాంధ్రృష్టిలో అనవ

ష్టగా జరిగిపోతూనే ఉంటుంది– ఇవన్నీ వ్యవహారదశలో సత్యము లే-
చిదేకరసమయిన పరమాత్మ తాదాత్మ్యన స్ఫురిస్తేమాత్రం ఇందులో
ఏది సత్యంకాదు– అంతా మిథ్యే–

ఇలా భిక్షు సంసారకథనమనే ౬౬వ సర్గ సమాప్తము.

## ౬౭. బ్రహ్మైక్య ప్రతిపాదనము.

దశరథుడు॥ ఓ వసిష్ఠమునీంద్రా! నేను మంత్రులను పంపుతాను– మీారు ఆజ్ఞయిస్తే వారు వెంటనే వెళ్ళి ఆ భిక్షువును సమాధినుంచి లేపుతారు– తీసికొస్తారు ఇక్కడకు– అన్నాడు దశరథుడు–

వసి॥ రాజా ! దశరథా ! అతని శరీరంలో ప్రాణంలేదు– అన్నరస భాగమంతా ఎండిపోయింది– శరీరం వివర్ణమయింది– ఇంక ఆతడు బ్రతకడు– ఇపుడు ఎవరేమిచేసినా అతణ్ణి బ్రతికించలేరు–

అతడు బ్రహ్మగారియొక్క హంసరూపుడై జీవన్ముక్తుడుగా ఉన్నాడు– ఇక సంసారంలోకిరాడు– ఒక్కమాసపర్యంతం తనయింటి తలుపు తీయవద్దని ఆభిక్షువు తన భృత్యులకు ఆజ్ఞయిచ్చాడు– ఆ భృత్యులు అతని యింటివద్దనే ఉన్నారు– గడియతీయరు– దాచి ఉంచారు అతణ్ణి– నీమంత్రులు వెళ్ళినా అతణ్ణి లేపలేరు– మాసం పూర్తిఅయింతర్వాత చివరరోజున బలాత్కారంగా గడియదీసి భిక్షువు యొక్క శరీరంచూడాలని కోరికతో బయటద్వారంవద్ద నిలబడిఉన్నారు– మాసం పూర్తిఅయింతరువాత ఆతడిశరీరం బయటికితీసి నీళ్ళలో కలుపుతారు– అతనియింటిలో రాతితో అతని శరీరాకారంగా ప్రతిమ తయారు చేయించి భక్తితో పూజా పునస్కారాలు చేస్తారు– ఆ శిలాప్రతిమనే దేవతారూపంగా కొలుస్తారు– ఇలా విహారమనే గ్రామంలో ప్రాణ చేష్టాదివ్యాపారంలేకుండా మృతుడై ఉన్న ఆభిక్షువును లేపటం ఎలా సాధ్యపడుతుంది ? కనుక ఈకథకు అంతా పర్యవసానం ఏమంటే గుణ

మయమయినమాయ ఇంత బలవత్తరమయింది- దీన్ని తప్పించుకోవడం దుర్ఘటం- అనేక భ్రాంతులను కలిగిస్తుంది- తత్త్వజ్ఞానం చేతకాని ఈమాయనశించదు-

లేనిదానిని తయారుచేస్తుంది- బంగారంనుంచి కటకాన్ని తయారుచేసినట్లు- అలాగే పరమాత్మయందు లేనిపోని ప్రపంచభ్రాంతిని కలిగించింది- చిద్రూపుడయిన పరమాత్మ అవివేకంచేత జీవుడయి నాడు- వివేకంవల్ల చిన్మాత్రుడై మిగిలిపోతాడు- అబోధవల్ల సంసారి- స్వబోధవల్ల పరమాత్మ ఇంతే రహస్యం-

సమష్టిరూపుడయిన హిరణ్యగర్భునియొక్క- మనోమాత్రంచేత నిర్మితంకాబట్టి యీ ప్రపంచం స్వప్నమే- వ్యష్టిలోకూడ అంతే. ఈ జీవుడు వ్యష్టిప్రపంచ రూపంతోకాని, సమష్టిప్రపంచరూపంతోకాని, సాధారణ ప్రపంచరూపంతోకాని, అసాధారణప్రపంచరూపంతోకాని, ఎలాగో ఓలాగు ప్రకాశిస్తూ ఉండు గాక-

అయినా హృదయంలో ప్రతిభావసమర్థమయిన దీర్ఘస్వప్నాన్ని అనుభవిస్తూనే ఉంటాడు- కాబట్టి ఈ ప్రపంచం స్వప్నంవలె మిథ్య- వ్యష్టిలో మలినమయిన చిత్తమువలన పుట్టింది- కాబట్టి స్థిరమయిన దానివలె భాసిస్తుంది- చిత్తము శుద్ధమైనట్లయితే బ్రహ్మదేవునికివలె వ్యష్టిజీవులకుగూడ అసత్యంగా భాసిస్తుంది-

అయితే వ్యష్టిజీవులకు ఇంత దీర్ఘస్వప్నంగా గోచరించటానికి నిమిత్తం చెబుతావిను- పరమార్థమయిన చిత్తత్వమునుండి అవ్రుత్త మయి (దిగజారి) (మరలి) చిత్సత్తామాత్రాన్ని ఆశ్రయించి దేవ నర తిర్యగాది దేహంలో ప్రవేశించి జరామరణ దుఃఖాలకు భాజన మవు తున్నాడు- (యోగ్యుడవుతున్నాడు) దీర్ఘస్వప్నరూపమయిన ఈ సంసారంలో విచిత్రమయిన సుకృతంతో కూడియున్న జీవచైతన్యం తన చిత్తాంశముయొక్క- స్పంద (చలన) మాత్రంచేత దిగువ పాతాల

లోకాన్నికాని పైన బ్రహ్మలోకాన్నికాని చేరుకున్నారు- అప్పటి సుఖదుఃఖాలు అనుభవిస్తున్నారు-

కాబట్టి పరమాత్మచైతన్యమే తనకు ప్రాణసంబంధాన్ని కల్పించుకొని దాని కనుకూలంగా తాను చలిస్తూ ఉండి తద్వారా జీవుడనే పేరుపొంది తనలో దేహాకార సంభ్రమంతోను, బయట విషయాకార సంభ్రమంతోనూ, దొర్లుతూ ఉంటుంది- కనుక ఇలా భ్రాంతిచే ఇతనికి జీవుడనే పేరూ, రూపమూ ఏర్పడ్డప్పటికీ ఇతడు పరమాత్మే- అధ్యాసలు వెయ్యికలిగినా అధిష్ఠానంమాత్రం మారదు- కాబట్టి జీవబ్రహ్మైక్యమనే పరమపురుషార్థఫలం ఖాయం (యథార్థం)-

చిత్తమనే ఉపాధ్యాకార భ్రాంతిమాత్రా పరాధంవల్ల ప్రత్యగాత్మ పరమాత్మ కాకపోతాడా? పరబ్రహ్మ ప్రత్యగాత్మ కాకపోతాడా? ముఖమునకు అద్దంలో ప్రతిబింబం ఏర్పడినట్లు బ్రహ్మకు ఔపాధికంగా జీవుడనేపేరు దేవదత్తుడు, యజ్ఞదత్తుడు అనే దేహనామము ప్రాణవాక్ చక్షురాదినామమున్ను కలిగినది- అంతమాత్రం చేత వీరిద్దరికీ భేదంలేదు- అభేదమయినా ఉపాధివశంచేత ఇదిఅంతా సంభవించవచ్చు- కనుకనే "సఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" "ప్రాణన్నేవ ప్రాణోనామ భవతి వదన్వాక్ పశ్యన్ చక్షుః శృణ్వన్ శ్రోత్రం మన్వానో మన ఇతి తాన్యేతస్య కర్మ నామాన్యేవ" అను శ్రుతి ఉపపన్నమవుతుంది-

ఇలాంటి ఐక్యదర్శనం (ఐక్యజ్ఞానం) కలిగితే వ్యవహారదృష్టిలోనే పరబ్రహ్మ బ్రహ్మయందే ఉన్నట్లు- ఇక సమూలం ఉపాధిబాధితమయినపుడు పరమార్థదశలో జీవుడు బ్రహ్మమె అని వేరే చెప్పనేల?

ఇచట మరొకచమత్కారం కూడాఉంది- దర్పణాదులు ముఖముకంటె అత్యంతభిన్నములు- అలాంటి దర్పణంలో ముఖం కనిపించేటప్పటికి అన్యథా భ్రాంతికి కొంతతావు (అవకాశం) ఏర్పడుతుంది-

ఈ జీవలోకమయితే స్వాత్మభూతమయిన అభయమయిన బ్రహ్మ యొక్కయే మూర్తామూర్తాత్మకమయిన ప్రపంచరూపములందు ఉం టోంది కనుక ఈజీవలోకం బ్రహ్మకంటె వేరని అన్యథా భ్రాంతిపడటా నికికూడా వీలులేదు- అయినా జీవలోకం తనయందు అన్యత్వాన్ని (భేదభావాన్ని) కల్పించుకొని తనకంటే వేరయిన భయకారణం తన కొకటి కలదని భయపడుతున్నది- ఇది మహా ఆశ్చర్యం-

ఇలాంటి భేదబుద్ధి కలగటానికి చిత్తస్పందమే కారణం- సమాధి అభ్యాసంచేత ఈబుద్ధిస్పందాన్ని నిరోధిస్తే భేదబుద్ధి లక్షణమయిన సంజ్ఞ తెలివి (జ్ఞానం) స్వయంగానే నశిస్తుంది- ఆబుద్ధికాస్తా పూర్ణ బ్రహ్మాకారా మారిపోతుంది- చరమ సాక్షాత్కారమనే అగ్నిలోపడి విలీనమవుతుంది ఆబుద్ధి అగ్నిలో ఘృతంవలె- వజ్రాయుధం యొక్క అగ్రభాగంచేతకూడా భేద్యంకాని యీప్రపంచం బోధమాత్రంవల్ల ఎలా నశిస్తుందని ? కొందరంటారు- వాళ్ళకు ప్రపంచం ఇంత గట్టిదనే భావమేకాని ఇది ఎలావచ్చిందా అనేభావమేలేదు- అవాస్తవమయిన చిత్స్పందంవల్ల ప్రపంచం పుట్టింది- కాబట్టి వాస్తవమయిన చిద్బోధ వల్ల నశిస్తుంది- ఇందులో ఆశ్చర్యపడవలసిన పనిలేదు- పరమార్థంలో స్పందంలేదు- అస్పందంలేదు- ఏకత్వంలేదు- ద్విత్వంలేదు- పరిశుద్ధ మయిన చిన్మాత్రం ఒక్కటే ఉన్నది- సారతరమయిన విచారంచేస్తే సర్వమూ పరమార్థసత్యమయిన చిన్మాత్రమేనని స్పష్టంగా బోధపడు తుంది- అపుడు భేదనేదికూడా లేదు- అదీపరమార్థ సత్యచిన్మాత్రమే-

అభేదబోధవల్ల ప్రపంచమంతా గళితమయితే పరతత్త్వమే మిగిలి ఉంటుంది- రామా ! నీవు అబోధచేతనే భిన్నుడవగుచున్నావు- అబోధరూపమయిన నానాత్వాన్ని చూడకపోతే పూర్ణచిద్రూపుడవే- ఈవిషయంలో ఎవరినయినా అడుగు- పరమార్థం ఇంతే కనుకనే నీకు నాకూ ఈవిషయంలో నిస్సందేహస్థితి నిరూఢమయింది- ఈనిరూఢ స్థితివల్లనే జాగ్రదాద్యవస్థలందు ద్వైతవస్తువులయొక్క అపలాపం

ఏర్పడింది- అబోధ (అజ్ఞానం) అసత్యం కనుకనే శుద్ధాత్మస్వరూపం జగత్తు తచ్ఛాంతిరూపము అయింది- అపుడు ద్రష్టృదృశ్యదర్శనాత్మక మయిన త్రిపుటి అత్యంతా అప్రసిద్ధమై పోతుంది- కనుక ఇంక జగత్తు అనే పేరేఉండదు-

చిద్భావన మనస్సులో లేనందున చిత్తప్రాణాది స్పందమేర్ప డింది- దానికి కారణం సంకల్పం- సంకల్పం నశిస్తే చిత్తప్రాణాది స్పందమేలేదు- చిద్బ్రహ్మమాత్రమే మిగిలి ఉంటుంది-

రామా! నీవు పరిపూర్ణభావంతో ఉండాలని అనుకుంటే ఇతర సంకల్పాలన్నీ నీతో ఐక్యంచెంది నీకంటే వేరుగా ఉండవు- అలాగే సకలవస్తువులూ ఆత్మైకరస్యమును సంపాదింపచేసి బోధసారాన్ని గ్రహిస్తే అపుడు ప్రపంచమనేది ఆత్మకంటె భిన్నంగా ఉండదు- కాబట్టి అలాంటి బోధనాలన్నీ గ్రహించాలి-

ఓ చిచ్చంద్రబింబ! భావాభావపదార్థముల నాశరూపమయిన నీతో సంస్పృష్టమై సమస్తపదార్థము అమృతవిగ్రహము అవుతోంది- అబ్బా! నీమహిమ యెంతటిది?

రామా! నీవు ఆనందసముద్రరూపంతో ఉండి స్పందాస్పందము లనూ, కల్పనాకల్పనలనూ, పూర్ణాపూర్ణదశలనూ అద్వితీయ పర మాత్మయొక్క స్వరూపంగా గ్రహించు అన్నారు వసిష్ఠులు-

ఇట్లు బ్రహ్మైక్యప్రతిపాదనమను ౬౭వ సర్గ సమాప్తము.

## ౬౮. మహాశవాన యతోపదేశము.

మరిన్నీ రామా! చిత్తముయొక్క స్వాభావిక ప్రవృత్తిని అనుస రించక సుషుప్తిదశలోవలె మౌనంవహించు- సంకల్పవికల్పాల కథను మరచిపో- శుద్ధచిద్రూపాత్మతత్త్వాన్ని ఆశ్రయించు-

శ్రీరా॥ స్వామీ! నేను వాఙ్మౌనం ఎరుగుదును- అక్షమౌనం (ఇంద్రియమౌనం) ఎరుగుదును- కాష్ఠమౌనం ఎరుగుదును- ఇప్పుడు మీరు "సుషుప్తమౌనవాన్భూత్వా" అని సెలవిచ్చారు- సుషుప్త మౌనం అంటే ఏమిటో నాకు తెలియదు- సెలవివ్వండి- అని అడిగాడు- శ్రీరాముడు-

వసి॥ రామా! మునులు రెండురకాలు- ఒకడు కాష్ఠ తపస్వీముని- రెండు జీవన్ముక్తముని- ఆత్మతత్త్వ పర్యాలోచన లేక కృచ్ఛ్రచాంద్రయణాది క్రియలందు నిరూఢమతియై బలాత్కారంగా ఇంద్రియాలను నిగ్రహించుకొన్నవాడు కాష్ఠ తాపసముని-

పరమార్థమయిన ఆత్మతత్త్వాన్ని గుర్తించి (తెలిసికొని) మనస్సులో నిరంతరం భావనచేస్తూ మామూలు తాపసులవలె పైకి కనుపడుతున్నా లోపల నిరతిశయానందాస్వాదంతో తృప్తిపడుతూ ఉండేవాడు జీవన్ముక్తముని- వీరిద్దరిలోను గల చిత్తనిశ్చయరూపమయిన భావమేదిగలదో అయ్యది మౌనమని పెద్దలంటారు- ఇలాంటి మౌనం నాలుగురకాలు- 1. వాఙ్మౌనం- 2. అక్షమౌనం- 3. కాష్ఠమౌనం- 4. సౌషుప్తమౌనం- అని వాక్కులను (మాటలను) నిరోధించుకోవడం వాఙ్మౌనం- ఇంద్రియనిగ్రహం అక్షమౌనం- కర్మలను పరిత్యజించడం కాష్ఠ మౌనం- ఈవిభాగాన్ని పట్టిచూస్తే మనోమౌనంకూడా ఒకటి అయిదవరకమయినమౌనం కావచ్చు- అయ్యది కాష్ఠతాపసుని యందు మృతిలోను మూర్ఛాసుషుప్తులలోను సంభవిస్తుంది- ఇతర సమయాలలో సంభవించదు- కాబట్టి దానిని అయిదవరకంగా పరిగణించలా విభాగజ్ఞులు- ఆత్మతత్త్వానుభవం కలిగినపుడు ఉండేది సౌషుప్త మౌనం- ఇది జీవన్ముక్తులయందు మాత్రమే ఉంటుంది- దీనినే తురీయ (చతుర్థ) మౌనం అంటారు- మొదటి మూడు మౌనములలోను కాష్ఠ తాపసుడు అధికారి అవుతాడు- తురీయమయిన సుషుప్తమౌనంలో మాత్రం జీవన్ముక్తుడే అధికారి- ఇది జీవన్ముక్తులయందు మాత్రమే

ఉంటుంది- దీనిపై మూడు మౌనములుకూడా మౌనములే మౌనత్వ మనేది వాటియందుకూడా ఉంది- కాని అవి మలినమనోనిశ్చయ రూపములు-

అందుచేత అవి జీవుడికి బంధప్రదములే కాని మోక్షప్రదాలు కావు- కనుకనే అవి మూడు కాష్ఠతాపసులయందుండవచ్చునని ఒక ప్రతీతిఉంది- అయితే ఇలాంటి కాష్ఠతాపసుడు సమాధిలో ఎలా ఉంటాడు- అనేది ఒక ప్రశ్న- విను జవాబు- కాష్ఠతాపసుడు బలాత్కారంగా మనో నిగ్రహం చేసుకొని లోపల అహంభావానుసంధాన లేకుండా బయట నామప్రపంచాన్ని, రూపప్రపంచాన్ని స్పృశించకుండా (అంటకుండా) అజ్ఞానావృతమయిన ఆత్మను తెలిసికొనకయే నిద్రలో నిత్యాత్మ జ్ఞానానికి లోపం లేనందువల్ల బూడిదచే కప్పబడిన అగ్నిహోత్రమువలె సాక్షిమాత్రజ్యోతిస్సుచే చూస్తూ ఉంటాడు- వ్యుత్థానకాలంలో ఈ మూడుమౌనాలు చిత్తచలనాత్మకములే- మొదటి ముగ్గురు మౌనము కలవారగుచున్నారు- నాల్గవరకపువారుమాత్రం చిత్తబాధవలన (అనగా చిత్తము బాధితముయినందువల్ల) వ్యుత్థానాది లీలతో వ్యవహరిస్తారు-

అథవా పూర్ణాత్మస్థితి విలాసతో వ్యవహరిస్తారు- ఆత్మజ్ఞానులు మొదట మూడు మౌనములు బంధరూపములేయని కోపించుగాక చిదానందరూప పరబ్రహ్మయొక్క విలాసమేయని కోపింపకపోవుగాక ఏమయినా ఆత్మజ్ఞానులకు ఈ త్రివిధమౌనంలో గ్రహింపదగినదేలేదు- కాబట్టి రామా! ఈసుషుప్తమౌనము జీవన్ముక్తిదశ- పునర్జన్మరాహి త్యమును కోరేవాడికిది చాలా యింపయినది- నీవుకూడా విను-

దీనిలో ప్రాణవాయువును రేచక పూరక కుంభకరూపంతో నిరోధింపవలసిన పనిలేదు- ఇంద్రియాలను ఎండగట్టి కృశింప చేయ వలసిన పనిలేదు- విషయాలను అందించి సంతోషపరచవలసిన పనిలేదు- జ్ఞానముచే బాధితముయిన ఈతనిచిత్తం నిక్షేపరహితంగా ఉంటుంది- చలించదు- శాంతించదు- చేతస్సూ కాదు- అచేతస్సూ కాదు- విషయ

జాతమును ఏమాత్రం తలంచదు- యథాభూతమయిన ఆత్మతత్వాన్ని తెలిసికొన్న ప్రాపంచికభేదభ్రాంతిని విడిచి శబ్దాదివిషయాలను తలచకుండా ఉండటమే సుషుప్తమౌనము అనేకదా భిన్నులయిన ఆత్మలకు (జీవాత్మలకు) ఏపరమేశ్వరుడు ఆత్మరూపుడో పరిపూర్ణమయిన ఆశివ స్వరూపంతో ఉండటమే సుషుప్తమౌనం- "శూన్యమూ కాదు- అశూన్యమూకాదు- ఉన్నదీకాదు- లేనిదీకాదు- అని ప్రశాంతంగా చిత్తం ఉండటమే సుషుప్తమౌనం- సర్వప్రపంచమూ శూన్యమయినది- తనకు మరొకటి ఆధారములేనిది- కేవల విజ్ఞానఘనమయినది- సదసద్విలక్షణమయినది-(అనగా సత్తుకానిది అసత్తుకానిది) ఏపరమాత్మ తత్త్వముకలదో అద్దానిని భావనచేస్తూ జీవన్ముక్తి స్వరూపంతో ఉండటమే సుషుప్తమౌనం-

భావాభావాది విశేషములతో వివర్తముకాని సంవిత్పదార్థాన్ని భావించుచుండటమే ఉత్తమ మౌనము-

అత్యంతాసద్రూపమయిన ప్రపంచాకారవృత్తిని విడిచి నిరంతరము శుద్ధచిదాకారవృత్తితో ఉండటమే అక్షయమయిన మౌనము-

(అహం) నేను లేను- మద్భిన్నమయినమరొకటిలేదు- మనస్సు లేదు- మానసముగుసంకల్పాదులులేవు- కేవలము సంవిత్తుఒక్కటే పరమార్థము- అని సదాసంవిదాకారవృత్తితో నుండటమే ఉత్తమ మౌనము-

ప్రపంచంలో నేననేవస్తువే చిద్వస్తువు- తద్భిన్నమంతా శబ్దార్థ మాత్రకము- అనగా సత్తాసామాన్యమే- అనే భావంతో ఉండటమే సుషుప్తమౌనము-

ప్రపంచం అంతా సంవిద్రూపమే- తద్భిన్నములేదు- కనుక సంవిత్తు అనంతం- (వ్యాపకం) అనే భావమే సౌషుప్తమౌనము-

ఈచిద్వస్తువే (సంవిద్వస్తువే) తుర్యము- తుర్యాతీతమున్ను-

వెనుక చెప్పిన సప్తవిధజ్ఞానభూమికలలో అయిదు ఆరు ఏడు, ఈమూడుభూమికలు సమాధి భేదరూపములు— ఇవి జాగ్రదవస్థయందు స్వప్నమునందును తత్త్వవేత్తయందు క్రమంగా కలుగుతూ ఉంటాయి—

బ్రహ్మభూతుడవగు ఓ రామచంద్రా! దేహాభిమానము వదలి జాగ్రదవస్థలో నిపుణంగా వ్యవహరిస్తున్నా లేక అన్నివ్యవహారాలు మానుకొనియున్నా సమాధిస్థుడవయినా, జీవన్ముక్తి సుఖానుభవ నిర్మలమయిన శాంతవృత్తికలవాడవయి తురీయస్థుడవై— పై చెప్పిన నీదేహమును యథార్థంలో ఈస్థితి స్థూలసూక్ష్మకారణములు మూడింటిని బాధనొందుటచే ఉపాధిసంబంధ శూన్యముగా ఎవడు ఉంటాడో వాడికే—

రామా! నీవు మూడింటియొక్క ప్రవృత్తినంతా చెప్పబడినట్లు నాదాదిపాదమాత్రలను ప్రవిలాపనముచేసికొని భవవాసనలు రూపుమాపుకొని తురీయరూపముతో నుండుము— ఉన్నట్టు కనిపించే ప్రపంచం అంతా స్వప్నతుల్యమని గ్రహించు— జీవన్ముక్తుడవై నీవు తీసికొన్న కోశంలో ఏకకళారూపుడవుగానుండు అన్నారు వసిష్ఠులు—

ఇట్లు మహోపశమనయోగోపదేశమనే ౭౮వ సర్గ సమాప్తము.

౭౯. ప్రాణమనస్సంయోగవిచారణము.

విన్నాడు శ్రీరాముడు— సందేహించాడు— ఇలా అడిగాడు—

శ్రీరా॥ స్వామీ! రుద్రులు నూరుగురు అని సెలవిచ్చారే మీరు— ఎవరా నూర్గురు? రుద్రునిపార్షదుల (పరిచారకుల) యిన గణములే రుద్రులా? లేక వారికంటె వేరుగ రుద్రులు నూర్గురున్నారా?

వసి॥ రామా! నేను వెనుక రుద్రులజన్మాదులను వర్ణించిచెప్పే ప్రస్తావనలోనే నీకీవిషయం తెలిసింది— అందువల్ల నేను పేరువరుసను లెక్కించి చెప్పలేదు—

భిక్షువుకు స్వప్నంలో జీవటాద్యాకారాలు కనిపించాయి- ఆ ఆకారాలే సామాన్యంగా గణశతం (నూర్గురుగణములు) అయినాయి- భోగసామ్యాన్ని ఐశ్వర్యసామ్యాన్ని బట్టి రుద్రాంశ ఉండబట్టీ ఆగణశత కమే రుద్రశతకంకూడా అయింది- అనగా ప్రమథగణాలకూ ప్రధాన రుద్రునకూ భోగంలో తేడాలేదు- ఐశ్వర్యంలో తేడాలేదు- పైగా వీళ్లుకూడా రుద్రాంశసంభూతులే- కాబట్టి ఈగణాలే రుద్రులు_ వేరుకారు-

శ్రీరా॥ మునీంద్రా! గణములంటే రుద్రునిసన్నిధిలో ఉండే సేవకులు- (పార్షదులు) వీళ్ళుముఖ్యరుద్రులు ఎలా అవుతారు? రుద్రుడు స్వామి- గణములు భృత్యులు- స్వామిభృత్యభావం పరస్పరవిరుద్ధం కదా! ఈ రెండూ ఒకచోటఉండవే- లేక శతతముడు (నూరవవాడు) ముఖ్యరుద్రుడు ఈతడు గణములలో చేరడు- కాబట్టి గణశతం అనే మాటకూడా అనుపపన్నమే కదా!

వసి॥ కాదు- ఆనూర్గురు స్వయంగా రుద్రులయినా ఈశ్వర కోటిలో చేరిన రుద్రునకు పరిచర్యచేయుడంలో గణములే అగుచు న్నారు- వీళ్ళకర్మఫలము, భోగము, ఐశ్వర్యము ఇదంతా ఆతని అధీ నము- అంచేత వీళ్ళు గణరూపులే-

శ్రీరా॥ వసిష్ఠా! భిక్షువుయొక్క ఏకచిత్తమునుండి నూరుచిత్త ములు ఎలా తయారయినాయి? భిక్షువుయొక్క స్వప్నంలో నూరవ రుద్రుడు ప్రత్యక్షమయినాడనీ ఆతడు మిగిలినవాళ్ళ చిత్తాలకు చైతన్యం యిచ్చాడనీ చెప్పేరికదా! అదిమాత్రం ఎలా పొసగుతుంది! ఎవరి చైతన్యంతో వారి చిత్తానికే చైతన్యం కలుగుతుందికాని, ఒకరి చైతన్యంవల్ల మరొకరి చిత్తానికి చైతన్యం కలగటం అసంభవంకదా! అలాంటిది యొక్కడా సంభవించదే- అన్నాడు శ్రీరాముడు-

వసి॥ రామా! అనీశ్వరులయిన అజ్ఞులందు ఇలాంటిది కనిపించక పోయినా! ముక్తులయినా ఈశ్వరులందు అది సంభవిస్తుంది- పొసగు

తుంది- పొసగదనే సందేహం నీకక్కరలేదు.

వీళ్ళు జ్ఞానైశ్వర్యసంపన్నులు- అజ్ఞానావరణరహితులు- యోగ శక్తిచే సత్యసంకల్పులు- సర్వజ్ఞులు- సర్వశక్తియుక్తులు. అందువల్ల వీళ్ళు తమ చైతన్యశక్తిచేత ఏ దేహంలో చిత్తమును అయినా మేలు కొలుపగలరు-

శ్రీరా॥ మునీంద్రా! హరిహరాదులు ఇంతటి ఐశ్వర్యవంతు లయితే మనుష్యయోనియందు బుట్టనేల? శ్మశానవాసమేల? దిగం బరత్వమేల? ఐశ్వర్యవంతులకు ఈదుస్థితిపట్టనేల?

రుద్రుడు కపాల మాలా భరణుడంటారే- భస్మ పూసుకొంటా డంటారు- దిగంబరుడట- శ్మశానవాసియట- పైగా విశేష కాముకు డట- భార్యను క్షణకాలమయినా విడిచి ఉండజాలక తన శరీరంలోనే యిముడ్చుకున్నాడట. ఏమిటది? ఐశ్వర్యవంతులు శుభాచారసంపదతో నుండక యీ నీచాచారములేమిటి? అని అడిగాడు రాముడు. ఇలా సమాధానం చెప్పారు- వసిష్ఠులు-

వసి॥ రామచంద్రా! మహేశ్వరులు, సిద్ధులు, జీవన్ముక్త శరీ రులు, విధికింకరులుకారు- శాస్త్రీయమయిన మంగలకృత్యములే చెయ్యాలని నియమం వాళ్ళకులేదు- సుఖభోగాన్ని యిచ్చే కర్మలే చెయ్యాలనే నియమంకూడా లేదు- అజ్ఞానులదృష్టిలో కనిపించే మంగలకార్యములు జ్ఞానులదృష్టిలో అమంగళతమములు. పైవీళ్ళకు అంతా సుఖరూపమే- వీళ్ళదృష్టిలో అశుభకర్మఅంటూలేదు- దుఃఖ సామగ్రిఉన్నా వీళ్ళకు దుఃఖభోగం ఉత్పన్నంకాదు-

అజ్ఞానులు రాగ ద్వేష లోభాది దోష సహస్రాలచే ఖండిత మయిన (చెడగొట్టబడిన) చిత్తంగలవాళ్ళు- వీళ్ళయందు కాబట్టే మాత్స్యన్యాయం అన్వయిస్తుంది- బలవంతుడు దుర్బలుణ్ణి పీడించుకొని తినటమనేది మాత్స్యన్యాయం- ఇది అజ్ఞానులయెడల సహజంగా ఉం

టుంది- కాబట్టి వాళ్ళకు క్రియానియమం అవసరం- అది లేకపోతే దుఃఖపరంపరను పొందుతారు అజ్ఞానులు-

విజ్ఞులు ఇంద్రియనిగ్రహం కలవాళ్ళు-వాసనారహితులు- కనుక వీళ్ళకు ఇష్టానిష్టములు లేవు- కనుకనే వాళ్లు ఆకస్మికంగా ఏదో పని చేస్తూ ఉంటారు- ఒకప్పుడు ఏమీ చెయ్యరు- బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఇలాంటివారే- జ్ఞానులకు నింద్యం లేదు-అనింద్యం లేదు- హేయోపాదేయాలు లేవు- స్వకీయ పరకీయాలు లేవు- సృష్ట్యాదిలో అగ్న్యాదులకు వేడి మొదలగు గుణములు వచ్చినట్లూ ద్విజాతులకు ఆయాజాతికి ఉచితమయిన కర్మనియమము ఏర్పడినట్లున్నూ హంసగాములకు చరిత్ర వేషక్రియ నియమాలు ఏర్పడ్డాయి- ఇది ఈశ్వరేచ్ఛారూపమయిన నియతివల్ల ఏర్పడిన వ్యవస్థేకాని మరొకటి కాదు-

అజ్ఞులకయితే క్రియానియమం అగ్న్యాదిక్రియవంటిది కాదు- అలా సృష్ట్యాదిలో అభివ్యక్తమయినవి కావు- సృష్టి స్థిరపడిన తరువాత ఆయావర్ణవిభాగసంకేతివల్ల శాస్త్రీయమయిన ఐహికఫలకర్మలు కాని, ఆముష్మికఫలకర్మలు కాని, స్వాభావికకర్మలు కాని ఏర్పడ్డాయి- కాబట్టి వీళ్ళకూ వాళ్ళకూ (అజ్ఞులకూ విజ్ఞులకూ) తేడా ఉంది-

కనుక రామచంద్రా! విదేహముక్తి విషయముగు పంచమ మానం సదేహుడవయిన నీకు నేను చెప్పలేను- అది చెబుతావిను- ప్రసిద్ధాకాశంకంటెకూడా అతి స్వచ్ఛమయినది చిదాకాశం- తద్భావప్రాప్తియే పరశ్రేయోరూపమగు మోక్షం- అందుకుపాయాలు సాంఖ్యయోగాలు- వివేకవిచారప్రయుక్త రాజయోగంతో ఆత్మతత్త్వం తెలిసికొనువారు సాంఖ్యయోగులు- ప్రాణాదివాయునిరోధంచేసి హఠయోగంతో ఆత్మతత్త్వాన్ని తెలిసికొన్నను వారు కర్మయోగులు- ఈయిద్దరకు తత్త్వసాక్షాత్కారంచేత పొందదగినది ప్రశాంతస్థితియే- కొందరు సాంఖ్యంతోటి, కొందరు యోగంతోటి ఈస్థితికొరకు ప్రయత్నిస్తారు- ఈరెంటివల్లా ప్రాప్తించే స్థితిఒక్కటే- ప్రాణమనోవృత్తులు రెండూ

అత్యంతం విలయించింది తే ఉభయవాసనారహితస్థితి యేర్పడితే అదే పరమపదము— అన్నం వండటానికి నిప్పూ నీరు కలిసి పనిచేస్తున్నాయి— అలాగే మోక్షవిషయంలో సాంఖ్యయోగములు రెండూ కలిసి (సముచ్చిత్య) ఎందుకు పనిచెయ్యకూడదు? అని అడుగుతారు కొందరు— కాని అదిపొసగదు— విను—

పాకవిషయంలో నీళ్లులేకున్నా, నిప్పులేకున్నా పాకం తయారు కాదు— ఇక్కడ అలాకాదు— యోగం లేకపోయినా యోగం చేసే పని సాంఖ్యం చేస్తుంది— సాంఖ్యం లేకున్నా సాంఖ్యం చేసేపని యోగం చేస్తుంది— ఎలాగంటె, సంసారమంటే, బాహ్యాంతఃకరణ ప్రాణాది చేష్టారూపం— తద్వాసనాపుంజాత్మకమయిన మనస్సే దానికి కారణము— అలాంటిమనస్సు సాంఖ్యంచేతకాని, యోగంచేతకాని, ఏదో ఒకదాని చేతనే లయించి (విలీనమై) తత్త్వజ్ఞానాత్మకంగా పరిణమించి ఇంద్రియ వ్యాపారాలను, ప్రాణవ్యాపారములనూ నిరోధిస్తుంది— (అనగా వాటికి అకారణమవుతుంది)—కాబట్టి ఒక్కొకదానిచేతనే రెంటిఫలం వస్తుంది— అందుచేత ఇక్కడ సముచ్చయం అనావశ్యకం అసంభవమున్నూ—

దేహమునందు అహంకారదర్శన పూర్వకము సంసారమంతా— దానికి మూలం మనస్సు— అది శాంతిస్తే మొత్తం సంసారమంతా శాంతించినట్లే— ఆత్మజ్ఞానం లేనందువల్ల మనస్సు ఏర్పడింది— ఆత్మజ్ఞానం కలిగేసరికి మనస్సు నశిస్తుంది— దానితోపాటు తత్కార్యములయిన అహంమమతాదిబంధమోక్షాంత కల్పనలన్నీ నశిస్తాయి— "సంసారం మనోభవం— అనగా మనస్సువల్ల పుట్టింది— నాకు అహం లేదు— అందుచేత సంసారంలేదు — ఉపదేశించతగినదీ లేదు— ఉపదేశమూ లేదు— ఇంక బంధమోక్షాలు ఎక్కడివి? అని ఇలా ఉంటుంది విజ్ఞుల అనుభవం—

కనుక సర్వశాస్త్రార్థ సంగ్రహమిది— ఏకతత్త్వఘనాభ్యాసమూ, ప్రాణవిలయమూ, మనోనిగ్రహమూ ఇదే మోక్షశబ్దార్థము సంగ్రహంగా— అని అన్నారు వసిష్ఠులు—

విన్నాడు శ్రీరాముడు. మంచి అవకాశం దొరకిందనుకున్నాడు-ఇలా ప్రశ్నించాడు-

శ్రీరా॥ స్వామీ ! ప్రాణవిలయమే మోక్షానికి కారణమయితే చనిపోయినవాళ్ళయందు ప్రాణవిలయం జరిగే ఉందికదా ! అప్పుడు సకల జంతువులూ మరణకాలంలో ముక్తిపొందవలసినదే అని అనుకుంటా- అలా ఎవరు అనటంలేదు. కాబట్టి మీారు చెప్పింది ఎలా పొసగుతుంది ? అని ప్రశ్నించాడు-

వసిష్ఠులు సమాధానం చెబుతారు-

వసి॥ రామా ! పై మూడు ఉపాయములూ (అనగా ఏకతత్త్వాభ్యాసమూ, ప్రాణవిలయమూ, మనోనాశమూ, ఈమూడు ఉపాయములూ) మనోనాశముద్వారాగానే మోక్షహేతువులు- మరణంలో మనోనాశమూ లేదు- ప్రాణనాశమూ లేదు- మరేమంటే మూర్ఛాకాలంలో మనఃప్రాణములు రెండూ నీటిలో లీనమయియున్న ఉప్పువలె అవిద్యయందు వాసనారూపంతో ఉంటాయి- ఉత్క్రమణకాలంలో (మరణకాలంలో) తిరిగి ఆవిర్భవిస్తాయి- ఇందుకు శ్రుతిప్రమాణం ఉన్నది- "సవిజ్ఞానోభవతి సవిజ్ఞానమే వాన్వవక్రామతి" అని లోకంలో తృణజలాయుకా దృష్టాంతమని (న్యాయమని) ప్రసిద్ధికూడా ఉంది-

కాక విలీనములయియున్న ప్రాణములు చక్షురాది ఇంద్రియముల ద్వారా లేచిపోజాలవు. ప్రాణములు స్థూలదేహాన్ని విడిచి బయటకు వెళ్ళినంతమాత్రాన అవి విలయం చెందినట్లుకాదు. స్థూలదేహమనే ఆధారం లేనంతమాత్రాన అవి విలయంచెందవు. ఈప్రాణాలు యీా శరీరంనుంచి లేచిపోయేటప్పుడు పంచభూతములయొక్క తన్మాత్రలతో కూడా లేచిపోతాయి. లేచిపోయి బాహ్యాకాశంలో ఈ భూతమాత్రలతోటి తాత్కాలిక వ్యవహారయోగ్యమయిన దేహాన్ని కల్పించుకుంటాయి- కాబట్టి మరణమాత్రంచేత ప్రాణవిలయం ఏప్రాణికీ కాలేదు- ఇది యింకా వివరించి చెబుతావిను-

ప్రాణాలు మరణకాలంలో ఈశరీరాన్ని విడిచి లేచిపోతాయి- భూతతన్మాత్రలతోకూడా- ఆ తన్మాత్రలచే బాహ్యాకాశంలో ఒక క్రొత్తశరీరం తయారవుతుంది- ఇది వాసనాకామకర్మలచే తయారు అవుతుంది- ఈప్రాణాలకాశరీరం ఆధారమవుతుంది- ఇలా భూతతన్మాత్రలకూ ప్రాణములకు బాహ్యాకాశంలో సమావేశం కలుగుతుంది- చూడండి శ్రుతి యిలా చెబుతోంది- "తద్యథా పేశస్కారీ పేశసో మాత్రాముపాదాయ అన్యన్నవతరం కల్యాణతరం రూపం తనుతే ఏవమేవాయమాత్మా ఇదంశరీరం నిహత్య అవిద్యాం గమయిత్వా అన్యన్నవతరం కల్యాణతరం రూపం కురుతే పిత్ర్యంవా గాంధర్వంవా దైవంవా ప్రాజాపత్యంవా బ్రాహ్మంవా అన్యేషాంవా భూతానాం" అని- స్వర్ణకారుడు సువర్ణముయొక్క శకలమును తీసికొని క్రొత్త క్రొత్త ఆకారంలో ఆభరణము తయారుచేస్తాడు- అలాగే ఈఆత్మ కూడ ఈశరీరాన్ని చెడగొట్టి దీని ఆకారం కనిపించకుండాచేసి క్రొత్త క్రొత్త శరీరాలను తయారు చేసికొంటాడు- అని యీశ్రుతికి అర్థము-

ఈ భూతమాత్రలు బయటనున్న యితరజీవుల ప్రాణాలతో సంశ్లేషించవు- (కలియవు.) ఈయవి వాసనాత్మకములు- అందుచే ఆయాజీవుల కర్మవాసనారూపములో వేరువేరుగా ఉంటాయి- అలాంటి వాసనలుగల మనోపశ్లిష్టములయిన ప్రాణాలతోటే అవి కలుసుకుంటాయి- ఇతర ప్రాణాలతో కలుసుకోవు- ఇట్టిది యిచటి వ్యవస్థ-

ప్రాణములు క్రొత్తశరీరంలో పూర్వదేహవాసనాసహితము లయియే పుటతాయి- భావి దేహవాసనాసహితములయియే (రాబోవు శరీరానికి సంబంధించిన వాసనాలతో కూడుకొనియే) పూర్వశరీరాన్ని విడిచి పెటతాయికూడా- దేహాంతరంలో తదీయహృదయాకాశంతోనూ, తదంతర్గతములయిన వాయువులతోడను సంశ్లేషం చెందుతాయి- ఎలాగంటే కుసుమగంధము ( ) నువ్వులలో ప్రవేశిస్తూ నువ్వులలోనున్న తైలంతో సంశ్లేష (కలియకను) చెందు

తుంది- కనుకనే యంత్రనిష్పీడనాది దుఃఖం దీనికికూడా కలుగుతుంది- సీటికుండ సముద్రంలో మునిగిపోయి బయటనున్న జనులకు కనిపించడం లేదనుకొండి- అంతమాత్రంచేత ఆకుండ అక్కడ నశించిందా? లేదు- అలాగే మరణంలో మనఃప్రాణములు లీనమై యున్నంత మాత్రంచేత నశించినట్లుకాదు- కనుక మరణంలో మనోనాశంలేదు- ప్రాణనాశమూ లేదు- ఇది సిద్ధాంతం-

మనస్సుతో కూడుకొనే ప్రాణములు పుటుతూ ఉంటవి- మనస్సుతో కూడానే ప్రాణాలు లేచిపోతాయి- జ్ఞానంలేనిదే మనస్సు ప్రాణాలను విడిచిపెట్టదు- తిత్తిరి అను పురుగు మరొక గడ్డిపోచను ఆధారముచేసికొనే లోగడతృణమును విడిచిపెటుతుంది- కాబట్టి జ్ఞానంచేత వాసనాక్షయం కలిగితే మనోనాశమూ కలుగుతుంది- ప్రాణనాశమూ కలుగుతుంది- అపుడు శాంతియే మిగులుతుంది-

రామా! జ్ఞానంవల్ల సర్వపదార్థములయొక్క అసత్వం (మిథ్యాత్వం) తెలియబడుతుంది- ఆపైన వాసనానాశం కలుగుతుంది- అటుపైన మనఃప్రాణములయొక్క నాశం- ఇదీ దీనిక్రమం.

ప్రశాంతమయిన మనస్సునకు దేహదృష్టి ఉండదు- వాసనలు నశిస్తే మనస్సు పరమపదమును (ముక్తిస్థానాన్ని) చెందినట్లు పెద్దలందురు- చిత్తమనగా వాసనామాత్రమే- వాసనలు లేకపోతే పరమపదమే జీవునికి- జ్ఞానము వాసనాసహితంగా సకలప్రపంచాన్ని బాధించి ఆత్మతత్త్వమే అవుతుంది- ఆత్మతత్త్వము చలనరహితమైన జ్ఞానముగానే మిగులుతుంది- రజ్జు సర్పభ్రమాకారమయిన ప్రపంచంయొక్క వినాశం ఇలా వివేకజ్ఞానమాత్రంచేత కలుగుతుందని అనుభవ నిష్ఠులు అంటున్నారు-

కాబట్టి రామా! 1. ఏకతత్త్వాభ్యాసమూ, 2. ప్రాణస్పంద నిరోధమూ, 3. మనోనాశమూ, ఈమూడూ మోక్షోపాయాలు-

ఏకార్థాభ్యాసనమనగా అద్వితీయమయిన ఆత్మతత్త్వమును గురించిన శ్రవణమననాదులను ఆవృత్తిచేయుట అని యర్థము- ఇందులో ఏదొకటి సిద్ధించినా మిగిలినవి రెండూ సిద్ధించినట్లే-

తాలవృంతస్య సంస్పందే శాంతే శాంతో యథానిలః ।
ప్రాణానిలపరిస్పందే శాంతే శాంతం తథా మనః ॥

చేతిలోని విసనకర్ర ఆడకపోతే గాలిఃట్టినట్లే అలాగే ప్రాణవాయువు ఆడకపోతే మనస్సు శాంతించినట్లే-

శరీరం నశించిన తరువాత ప్రాణవాయువు బాహ్యాకాశంలో బాహ్యావాయుస్వరూపాన్ని చెందుతుంది- ఆబాహ్యాకాశంలో లోగడి వాసనల కనుకూలంగానే సర్వము చూస్తుంది- విదేహములయిన (బాహ్యస్థూలశరీరము లేని) ప్రాణములు బాహ్యాకాశంలో కర్మవాసనల కనుకూలంగా సురనరపశ్వాది శరీరాన్ని ఎలాచూస్తున్నాయో, అలాగే మనస్సుకూడా తదనురూపంగానే వ్యవహారాన్ని అనుభవిస్తుంది- గాలి తగ్గితే పరిమళంతగ్గినట్లు మనస్పందం తగ్గితే ప్రాణవాయువులు శాంతిస్తాయి- కుసుమగంధంతో మిశ్రితమయిన తిలతైలములవలె మనఃప్రాణములయొక్క పరిస్థితికూడా అవినాభావమయింది సర్వజంతువులకూ మనఃప్రాణములు రెండూ రథ, సారథులవలె పరస్పరాధారంతో విహరిస్తూ ఉంటవి- అగ్న్యుష్ణములవలె ఈ రెండూ ఒకటినశిస్తే రెండవది నశిస్తుంది- ఇలా రెండూ నశించి మోక్షమనే ఉత్తమఫలాన్ని ప్రసాదిస్తాయి-

రామా ! ఏకతత్త్వఘనాభ్యాసంవల్ల మనస్సు పూర్తిగా నశిస్తుంది- ప్రాణస్వభావము మనస్సులో ఏకీభవించియున్నందున ప్రాణము కూడా శాంతిస్తుంది- కాబట్టి సర్వవ్యాపకమయిన అద్వితీయాత్మతత్త్వాన్ని విచారించుకొని నీమనస్సు తన్మయంచెయ్యి (చేయుము) ఆత్మతత్త్వంలో మనస్సు లయించినట్లే ఆత్మతత్త్వం స్థిరపడి పోతుంది-

అజ్ఞానమనగా అవిద్య, జ్ఞానమనగా బ్రహ్మాకారవృత్తి ఈ రెండూ నివృత్తమయితే మిగిలే ఏచిన్మాత్రంకలదో దానియందు (ఆచిన్మాత్రమునందు) ప్రాణధారణచేసి స్థిరపడు.

తత్త్వసాక్షాత్కారపర్యంతమూ, ఏకతత్త్వాభ్యాసం చెయ్యాలి. ఆహారం లేకపోతే శరీరం విలీనమయినట్లు ప్రత్యాహారయోగమునందు నిష్ణాతులయినవాళ్ళ చిత్తము ప్రాణాలతో సహా విలీనమవుతుంది. అపుడు ఏతత్త్వమే మిగులుతుంది. ప్రత్యాహారాంతములయిన అయిదు యోగాంగములచే మనస్సుకు బాహ్యాకారము నశిస్తే ధారణాది మూడు యోగాంగములతో మనస్సునకు బ్రహ్మైకతానత్వము (బ్రహ్మస్వరూపము) సంపన్నమవుతుంది. అపుడు నిర్వికల్ప సమాధిపరిపాకంచేత బ్రహ్మభావం సిద్ధిస్తుంది.

ఉపనిషద్వాక్యములను శ్రవణంచేయకున్నా తదర్థమును మననం చేయకపోయినా ధ్యానధారణాద్యభ్యాసము సంభవించదు. కనుక శ్రవణమననములచేత ద్వైతజాతము అవిద్యయే అనీ కనుక అది లేనిదనీ తత్త్వజ్ఞానంవల్లనే పరావాప్తి అనీ ప్రమాణప్రమేయ అసంభావనా దోషనిరాసపర్యంతమూ తెలిసికొని తదుపరి ధ్యానధారణాదులచే జ్ఞానాభ్యాసము చేయవలెనని భావము.

మేఘం క్షీణిస్తే దానివల్ల వచ్చినమంచు తగ్గుతుంది. చిత్తం మాత్రమే అవిద్యయని భావించి బ్రహ్మాకారంగా పరిణమించిన చిత్తం చేతనే చిత్తక్షయంచేసికో. రామా! చిత్తక్షయముయొక్క రూపం చిత్తాధిష్ఠానమయిన ఆత్మేకాని శూన్యతకాదు. అభావము పరమపురుషార్థము కానేరదు. చిత్తము ఒక్కముహూర్తకాలము పరమపదమునందు (ఆత్మతత్త్వమునందు) విశ్రాంతిచెందితే అచట రుచిపడి బ్రహ్మాకారంగా పరిణమించినదనియే భావించు. అధ్యస్తమునకు అధిష్ఠానముకంటె భిన్నంగా స్వరూపంలేదు కాబట్టి అధిష్ఠానమునందే నిరతిశయ స్వప్రకాశ ఆనందాస్వాదాన్ని పొందినదై యింక అక్కడనుంచి లేవదు.

(వ్యుత్థానం చెందదు) కనుకనె శివధర్మోత్తరమునందిట్లు చెప్పబడినది—

శ్లో॥ జ్ఞానామృతరసో యేన సకృదాస్వాదితో భవేత్ ।
విహాయ సర్వకార్యాణి మనస్తత్రైవ ధావతి ॥ అని

ఇదే ప్రస్తుతములయిన జ్ఞానయోగములకు ఫలము— సాంఖ్యంచేతకాని, యోగంచేతకాని క్షణకాలము చిత్తము బ్రహ్మాయత్తమయితె వాడు మరలపుట్టడు— సంసారబీజము దగ్ధమయి అవిద్యగళితమయి ప్రపంచ వాసనలు శాంతించిన వానికి బ్రహ్మభావానికి విచ్ఛేదం ఉండదు— ఇలాంటివాడు కోటికొకడుంటాడు— వీడు స్వయంప్రకాశచిదానంద మూర్తిని సాక్షాత్కరించుకొని శాంతించి ఉంటాడు—

ఓ సుందరుడా! నేను చెప్పిన మోక్షోపాయములు మూడును అభ్యసింపదగినవి— వాని అభ్యాసంచేతకాని జాగ్రత్స్వప్నసుషుప్తి లక్షణ మయిన అవిద్యాబీజములు నశించవు— అపుడు మనస్సు దగ్ధపటము (కాలినగుడ్డ) వలె ప్రతిభాసమాత్రముగ మిగిలి ఉంటుంది— ఇలాంటి మనస్సునే జీవన్ముక్తిదశలో సత్త్వమంటారు పెద్దలు— ఇలాంటి మనస్సు రాగద్వేషాభిమానాలు నశించినందున మరల సంసారంలోకిరాదు—

ఎలాగంటె రాగి స్పర్శమణియొక్క సంబంధంవల్ల బంగారమవు తుంది— అది ఎన్ని కలంకాలు అంటినా మళ్ళీ తామ్రం (రాగి) కాదు— ఇదే చందం— ఇక్కడకూడా— అన్నారు వసిష్ఠులు—

ఇట్లు ౧౯వ సర్గ సమాప్తము.

## ౨౦. వేతాలప్రశ్న

వసి॥ రామా! చిత్తం శాంతిస్తే జీవుడికి ముక్తి అని చెప్పాను నీకు— ఆత్మజ్ఞానం వల్లకాని ముక్తి సాధ్యంకాదన్నాను— జ్ఞానం కలగా లంటె ఆత్మవిచారం (అనగా వేదాంతవాక్యవిచారం) మిక్కిలి అవస రం— ఎండమావుల నీటిచందమయిన అహంతాదులు (అహంకారా

డులు) ఆత్మవిచారంవల్లకాని నశించవు- సంసారమనే స్వప్నం విష యంలో వేతాళుడు వేసిన ప్రశ్నలు కొన్ని ఉన్నాయి చెబుతా విను- మంచివి- వాలాబాగుంటాయి- నాకు ప్రసక్తానుప్రసక్తిచే జ్ఞప్తికి వచ్చాయి- వింధ్యమహాటవిలో భయంకరాకారముగల వేతాళు డొక డుండేవాడు- అతడొకపుడు అజ్ఞానుల చంపదలచాడు- ఒక దేశం వచ్చాడు-

అసలు ఇతడు పూర్వం ఒక దేశంలో ఉండేవాడు- ఆ దేశమంతా సజ్జనులకు నిలయం-అంతటి మంచివాళ్ళు అక్కడివాళ్ళు- వాళ్ళు ఇతనికి కావలసినంత బలి ఉపహారాలు అందించేవారు- దానితో తృప్తిపడి సుఖంగా ఉండేవాడు అతడు- ఆరోజులలో అతడు ఎంతటి ఆకలిగొన్నా ఎదుటనున్న మనిషినికూడ చంపేశాడు- సజ్జనులెప్పుడు న్యాయదృష్టి గలవారుగదా!

ఇచట "సజ్జనాస్పదే" పదానికి మరొకర్థముకూడ ఉన్నది- "సజ్జనుడనే రాజుగారి యొక్క దేశంలో ఉండేవాడు- కిరాతరాజ్యంలో కర్కటివలె రాజుచేయించిన బహువధ్యజనబల్యుపహారంతో తృప్తి చెంది నిర్విక్షేపసమాధిలో నుండేవాడు" అని-

ఇతడు కొంతకాలానికి వధింపదగిన జనులు లభింపకపోయేసరికి అడవిలో ఉండేవాడు కాస్తా ఒక నగరంలో ప్రవేశించాడు- ఒకానొక మానవుని భక్షించటానికి ఆకలి ఆపులేకపోయాడు- న్యాయయుక్తితోనే ప్రవేశించాడు- అక్కడ అపుడు రాత్రిపూట దుష్టులను కనిపెట్టటానికి నగరం తిరగదలచి బయలుదేరిన రాజు కనిపించాడు-

ఆరాజు దగ్గరకు వెళ్ళాడు- భయంకరమయిన ధ్వనితో ఆ రాజుతో ఇలా అన్నాడు-

వేతా॥ రాజా! భయంకరమయిన వేతాలుని కంటపడ్డావు- ఎక్కడికి వెళతావు? చచ్చావులే- నాకీపూట భోజనమయ్యావులే- అని అన్నాడు వేతాళుడు-

రాజు॥ ఓ వేతాళా ! నిశాచరుడా ! నన్ను అన్యాయంగా బలాత్కారంగా వధించేటట్లయితే నీతలకాయ వేయివక్కలుగా పగిలిపోతుంది— ఇందులో సందేహంలేదు— అన్నాడు—

వేతాళు॥ రాజా ! నేను నిన్ను అన్యాయంగా చంపటంలేదు— న్యాయంగానే చెబుతున్నా చూడు— నీవు రాజువు— అర్థిజనంయొక్క కోర్కెలు తీర్చవలసినబాధ్యత నీమీదఉన్నది— కాబట్టి నాకిపుడు ఆకలి కలిగింది— ఆహారంకావాలి— ఇయ్యవలసిన బాధ్యత నీమీదఉంది— నిన్ను కొన్నిప్రశ్నలడుగుతాను— వానికి జవాబు చెప్పవలసిన బాధ్యత కూడా నీకున్నది— ఈ బ్రహ్మాండములన్నీ ఏసూర్యుని కిరణరేణువులు ! మహాగగన రేణువులన్నీ ఏగాలియందు ప్రకాశిస్తున్నాయి ! స్వప్నం నుంచి మరోస్వప్నంలోకి పోతూ ఇలాకొన్నివేల స్వప్నాలు గడిచినా విడువకుండా ఉండే స్వచ్ఛమయిన పదార్థం ఏది? అరటిస్తంభంలో లోపలకుపోయినకొద్దీ మట్టలువస్తూ ఉన్నట్లు ప్రపంచంలో అంతర్యామిగా అన్నిటిలో ఇమిడియున్న వస్తువేది? మహాగొప్పవిగా ప్రసిద్ధమయిన బ్రహ్మాండాకాశాదులుకూడా ఏఅణువుద్వారా పరమాణువులో ఆ అణువు ఎవ్వరు? ఏపరమాణు రూపమయిన కొండకు లోకత్రయము ఘనతరమయిన శిలాసారరూపమౌ ! ఆ పరమాణువు ఏది ?

రాజా ! ఇలా నేను ఆరుప్రశ్నలువేశాను— ఈ ఆరింటికి నీవు జవాబు చెప్పకపోతే నీవు దుష్టుడవు— ఆత్మఘాతివి— అంచేత ఈ అపరాధం చాలు నిన్ను చంపటానికి— కాబట్టి యీప్రశ్నలకు జబాబు చెప్పని దోషంవల్ల నిన్ను మెత్తని పండును మ్రింగినట్లు మ్రింగివేస్తాను— నీ మండలంలోని జనులను కూడా భక్షిస్తానన్నాడు— వేతాలుడు—

ఇట్లు వేతాళప్రశ్న అనే 20వ సర్గ సమాప్తము.

## ౭౧. వేతాళ ప్రథమ ప్రశ్నోత్తర వర్ణనము.

వసి॥ రామా! వేతాళుడు ఇలా ప్రశ్నించేసరికి రాజు చిరునవ్వు నవ్వి జబాబు చెప్పటానికి ప్రారంభించాడు-

రాజు॥ "కస్య సూర్యరశ్మినాం బ్రహ్మాండా త్రసరేణవః" అను మొదటి ప్రశ్నకు సమాధానం ప్రారంభించాడు- (చమత్కారమయిన కల్పనను తయారుచేశాడు-) కల్పనా చమత్కారం చూపిస్తున్నాడు-

వేతాళుడా! నీవు నేను ఆశ్రయించియున్న ఈ బ్రహ్మాండఫలం అజ్ఞానుల దృష్టిలో అజరం- (నశించనిది) ఇది ఉత్తరోత్తరం పదిరెట్లు హెచ్చయిన భూతావరణలతో చుట్టుకోబడిఉంది- ఇలాంటి బ్రహ్మాండ ఫలాలు వేయికలది ఒక పెద్దకొమ్మ- ఇలాంటి కొమ్మలోక వేయికలది ఒక మహావృక్షము- ఇలాంటి వృక్షాలోక వేయికలది ఒకపెద్ద అడవి-

ఇట్టి అడవులు వేయికలదొక మహాశృంగము- (శిఖరము) లేక పర్వతము- ఇలాంటి పర్వతములు వేయికలది ఒక మహాదేశము-

ఇలాంటి దేశములు వేయికలది ఒక మహానదినదీయుతమయిన బృహద్ద్వీపము ఇలాంటి ద్వీపాలు వేయికలది ఒక విచిత్ర రచనా యుతమయిన ఒక మహాపీఠము-ఇలాంటి పృథివీపీఠములు వేయికలది ఒకమహా భువనము- ఇలాంటి లోకములు ఒక వేయికలది ఒక మహత్తరమయిన అండము- ఇలాంటి అండము లోకవేయి కలది నిశ్చలమయిన దొక సాగరము-ఇలాంటి సాగరములు లక్షకలది ఒకమహార్ణవము-

ఇలాంటి అర్ణవాలు ఒకవేయి ఒకానొక మహాపురుషునియొక్క కడుపులోని నీళ్లు- ఇట్టి మహాపురుషుడు విష్ణువు-

ఇలాంటి మహాపురుషులు (విష్ణువులు) ఒక లక్షమంది మాలగా మెవనియొక్క ఉరస్థలంమీద ఉన్నారో ఆతడొక పరమపురుషుడు-

(అనగా రుద్రుడు) ఇట్టి రుద్రులు వేయిమంది ఎవని శరీరమండలంలో కేశలోమాలవలె ఉండిరో ఆతడు ఒక మహాదిత్యుడు– ఈఆదిత్యుని యొక్క కిరణాలే అసంఖ్యాకములయిన బ్రహ్మాండములన్నీ– ఈ ఆదిత్యునియొక్క కిరణములనే బ్రహ్మాండత్రసరేణువులే నేను చిత్సూర్యుడు అంటున్నాను– ఈచిత్సూర్యుడే నిఖిలప్రపంచాన్ని ప్రకాశింపచేస్తున్నాడు– విజ్ఞానాత్మయే ప్రపంచమును ప్రకాశింపచేసే సూర్యుడు– ఆతడి త్రసరేణువులే ఈబ్రహ్మాండాలు– ప్రపంచమనే పగటికాలం విజ్ఞానమనే సూర్యుని కాంతిచే ప్రకాశిస్తున్నాయి– పుట్టుచున్నాయి–

కనుక ఓ వేతాళుడా! త్రైలోక్య మండపమణి అయిన సూర్యుడు నేను వర్ణించిచెప్పిన శబలబ్రహ్మ– అతనియొక్క పారమార్థిక తత్త్వం స్వయంప్రకాశచైతన్యం (ప్రత్యగాత్మ) కర్తృత్వ భోక్తృత్వాది వికారాలు ఈప్రత్యగాత్మయందు ప్రతిభాసిస్తున్నాయి– పరమార్థంలో ఈవికారాలు ఈషన్మాత్రంకూడా ఇతనియందు లేవు– కాబట్టి నీవు ఈప్రశ్నాడంబరాన్ని మాని ఊరకుండు అన్నాడు రాజు–

ఇట్లు ౭౧ ప్రథమప్రశ్నోత్తరవర్ణనమనే సర్గ సమాప్తము.

## ౭౨. వేతాళ ప్రశ్న భేదము.

రాజు రెండవ ప్రశ్నకు జబాబిస్తాడు–

వేతాళా! కాలసత్త, నభస్సత్త, స్పందసత్త, (సూత్రాత్మ) చిదాభాససత్త, ఇవిఅన్నీ పరమపావనములు– పరమాత్మఅనే మహావాయువులో కల్పింపబడి అనేక వికారాలు చెందుతూ ఉంటాయి– అయితే పరమాత్మ అంటేనే సర్వానుగతమయిన సత్తారూపంకదా! ఈస్థితిలో కాలాదిసత్తలు పరమాత్మయందు ఉంటాయి అని రెండు సత్తలకు ఆధారాధేయభావం ఎలాకుదురుతుందని అంటారు– కాని అది కుదరదు– కుసుమానికి ఆమోదానికి భేదంలేకున్నా భేదం కల్పించుకొని ఆధారాధేయభావాన్ని వ్యవహరించుచున్నట్లు పరమాత్మ సత్తా

కాలాదిసత్తలకు భేదాన్ని కల్పించుకొని ఆధారాధేయభావం వ్యవహరింపబడుతోంది.

ఈ ప్రపంచంలో భ్రమలు ఎంతటి తండోపతండాలుగా పుట్టిపుట్టి ఎప్పటికప్పుడు సమసిపోతున్నా తదధిష్ఠానమయిన బ్రహ్మపదార్థం మాత్రం అవిచ్ఛిన్నంగా అనుగతమయి ఉంటూనే ఉంది. అరటి స్తంభమనేది పత్రాత్మకమో (అనగా మట్టలరూపమో) అలాగే లోలోపల సర్వానుగతమయిన చైతన్యమే బ్రహ్మపదార్థము. నిఖిల ప్రపంచానికి వివర్తాధిష్ఠానపదార్థమే సత్తా అనీ, బ్రహ్మమనీ, ఆత్మఅనీ చెప్పబడుతోంది.

లోకంలో కార్యసత్తలన్నీ కారణసత్తా పరంపరలో పర్యవసానం చెందినట్లు ప్రాపంచిక పదార్థాలయొక్క సత్తాలన్నీ రంభా స్తంభముల వలె తత్తదనుభవరూపమయిన చిన్మాత్రమునందు పర్యవసించుచున్నది. ఆచిన్మాత్రమే నిర్మలమయినదగుచూ జగదాకారంగా విస్తరించిఉంది. ఇలాంటి పరమాత్మ సూక్ష్ముడు కాబట్టీ, అలభ్యుడు కాబట్టీ అణువని చెప్పబడుతున్నాడు. సర్వవ్యాపకుడు కాబట్టి ఈతడు మేర్వాది పర్వతాలకు మూలమని (ఆధారమనీ) చెప్పబడుచున్నాడు. పరమాత్మ అలభ్యుడు (ఏ యింద్రియానికి అందేవాడు కాడు) కనుక అణువు. ప్రపంచపూరకుడు (పూర్ణుడు) కనుక మహాగిరి. ఇతడు సర్వావయవరూపుడయిననూ, నిజస్థితిలో అవయవసంబంధరహితుడు. ఇలాంటి జ్ఞప్తిమాత్రుడయిన పరమాత్మయొక్క మజ్జామాత్రం. (సారమాత్రం) జగత్త్రయము. కనుక ఓసాధూ ఈజగత్త్రయము విజ్ఞానమాత్ర మధ్యమమని గ్రహించు.

ఓ పిల్లవేతాళుడా! ఈలోకాలు విజ్ఞానమాత్రమయిన పరమాత్మయొక్క కలనా కలితము. ఆవిజ్ఞానరూపము మీబోటివాళ్ళకు అలంఘనీయము. కాబట్టి నేచెప్పిన సమాధానాలన్నీ నీమనస్సులో నిలుపుకో. దర్పము చంపుకొని ఉండు. అన్నాడు రాజు.

ఇట్లు వేతాలప్రశ్న భేదమనే ౭౨వ సర్గ సమాప్తము.

## ౭౩. వేతాలాఖ్యానము.

వసి॥ రామా! ఇలా రాజునుంచి ప్రశ్నలన్నిటికి జవాబు విన్నాక వేతాళుడు శాంతపడ్డాడు— ఆకలి మరచి పోయాడు— అగిదల ధ్యానంలో ఉండిపోయాడు— (అనగా సమాధిస్థుడైనాడు)—

రామా! వేతాళుని ప్రశ్నలూ వాటిజవాబులూ నీకు చెప్పాను—

ఇలా క్రమంగా చివరకు ఈజగిత్తు అంతా ఇమిడిఉంది— ఇది ఆత్మవిచారంతో అంతులేకుండా పోతుంది— పిల్లవాడు కల్పించుకున్న వేతాళుని శరీరంవలె— కనుక నీచిత్తాన్ని అన్నిటనుంచి, ఉపసంహరించి, అంతరాత్మను స్థిమితపరచుకొని పరమాత్మయందు ప్రతిష్ఠితం చెయ్యి— శాంతుడవుగా ఉండు— కోరికలకు లొంగబోకు— మనస్సు ఆకాశంవలె నిర్మలపరచుకో— సర్వత్ర సమదృష్టితో మెలగు— స్థిరబుద్ధితోనుండు ఎందును వ్యామోహపడబోకు— యథాప్రాప్తానువర్తియయిన వానికి భగీరథునకు గంగావతరణము సాధ్యమయినట్లు అన్నీ సులభసాధ్య మవుతుంది—

రామా! మనస్సు శాంతపరచుకొని లభించినదానితో తృప్తిపడుతూ సర్వోత్తమము సుఖమయము అగు పరమాత్మయందు నిశ్చలముగా ఉంటున్నవానికి సగరపుత్రులకూ వాళ్ళు త్రవ్విన సముద్రమునకును సంజీవన మణిప్రాయమయిన గంగాపతనము సిద్ధించినట్లు— దుర్లభమయిన వాంఛితార్థములన్నీ అనాయాసంగా సిద్ధిస్తాయి— అన్నారు వసిష్ఠులు—

ఇతి వేతాళాఖ్యానం ౭౩వ సర్గ సమాప్తము.

## ౭౪. భగీరథోపదేశము.

శ్రీరా॥ విన్నాడు శ్రీరాముడు— చిత్తానికి చమత్కారం కలిగింది— స్వామీ! భగీరథరాజు గంగను ఎలా భూలోకానికి అవత

రింప చేసింది చెప్పండి అని అడిగాడు వసిష్ఠులను- వసిష్ఠుడు ఆతనికథ చెప్పనారంభించాడు-

వసి॥ రామచంద్రా! ఉన్నాడు భగీరథుడనే రాజొకడు- పరమ ధార్మికుడు సముద్రపరివేష్టితమయిన భూమండలానికి తిలకప్రాయుడు- (అనగా ముఖ్యుడు) యాచకుల కెవరికయినా సంకల్పం కలిగి ఇతడి దగ్గరకువచ్చి ఏదయినా అడిగారా! అడగటం వ్యవధానంగా అడిగిన దాన్ని ఇచ్చేటంతటి ధార్మికుడు- ఇచ్చింతర్వాత డబ్బుఖర్చు అయిందని కష్టపడేవాడా! అంటేలేదు- ముఖం మరింత ప్రసన్నంగా (సంతోషంగా) ఉండేది- అపాత్రులకు దానం ఎన్నడూ ఎరుగడు- సజ్జనుల పోషణకుమాత్రం నిరంతరం దానంచేస్తూ ఉండేవాడు- ధర్మమార్గంచేత ద్రవ్యం ఆర్జించటంలో మాత్రం గడ్డిపరకనయినా స్వీకరించేవాడు కామధేనువువలె-(కామధేనువు అడిగినదానిని యిచ్చినా తాను ఆహారంకొరకు గడ్డిపోచలను భక్షిస్తుంది-) ఎంతటి దుర్మార్గుడినయినా మద మణచి గుణవంతుణ్ణిగా తయారుచేసే ప్రతాపశాలి- రాత్రింబవళ్లు ప్రజాపాలనకొరకు దేశమంతా పరిభ్రమించి అలసిపోయేవాడు- మానవుల అజ్ఞానాంధకారాన్ని రూపుమాపటమే ఆతనిలక్ష్యం-వాళ్ళదైన్యాం తొలగించటమే అతడి ముఖ్యోద్దేశ్యం- పొగలేని నిప్పువలలు దేహకాంతి నిప్పులుకురిపించే ప్రతాపం- శత్రువులకు సూర్యకాంతమణి- సజ్జనులకు చంద్రకాంతమణి- స్వర్గపాతాళలోకంలో ప్రవహించే గంగా ప్రవాహమనే ప్రపంచ యజ్ఞోపవీతానికి మూడవగుణాన్ని (దారాన్ని) తయారుచేసినవాడు మర్త్యలోకానికి గంగనుతెచ్చి అగస్త్యుడుత్రాగి ఎండగట్టిన సముద్రాన్ని గంగతోనింపి పూర్తిచేశాడు- డబ్బుతో యాచకసంఘంయొక్క కోరిక పూర్తిచేసినట్లు- గంగను సోపానంగా తయారుచేసి పాతాళలోకంలోఉన్న సగరచక్రవర్తి కొడుకులను బ్రహ్మలోకంచేర్చిన మహానుభావుడు- యువకుడు- రాజు (భూపతి) అయినా నీవలెనే వైరాగ్యం కలిగింది- విచారంతో లోకయాత్ర ప్రారంభించాడు- నడియావనంలో ఆత్మవిచారం చెయ్యాలనే కోరిక కలిగింది-

ఏకాంతంలో కూర్చున్నాడు- ఇలా విచారించాడు- "రాత్రి తర్వాత పగలూ పగలు తర్వాత రాత్రీ అన్నట్లు" కర్మ చెయ్యడం దానిఫలం అనుభవించడం మళ్ళీ చెయ్యడం, మళ్ళీ అనుభవించడం ఇంతేకదా లోకంలో జరిగేది- ఎన్నిజన్మలకయినా ఇది మామూలే గదా! ఇందులో కొత్తేముంది? పరమపురుషార్థమనే ఫలం ఏమి ఉంది? కాబట్టి ఏదిచేస్తే ఇంక పొందతగినది మిగిలి ఉండదో అదే సుకృతం అని తలుస్తాను నేను- మిగిలిన కర్మలన్నీ అశుద్ధములే- దుఃఖ ఫలములే- మూఢబుద్ధిగల లోకులు చేసినదానినే మాటిమాటికీ జన్మ జన్మకీ చేసూ సిగ్గుపడరు- ఇదెంత వెర్రి! వీళ్ళు మూఢబుద్ధులందామా! బుద్ధిహీనులందామా అని ఆలోచించాడు- ఇలా విచారిస్తూ సంసారం నుంచి భయపడుతూ ఒకప్పుడు ఏకాంతంలో ఉండగా త్రితలుడనే గురువును అడిగాడు భగీరథుడు.

భగీ॥ స్వామీ! నిస్సారమయిన సంసారాటవిలో చాలకాలం తిరిగితిరిగి వేసారిపోయి ఉన్నాము- జరామరణమోహాదిరూపములయిన సంసారదుఃఖాలు నశించే విధానం చెప్పండి అని అడిగాడు-

త్రితలుడు॥ భగీరథా! సాధనచతుష్టయసంపత్తి ముందు సంపాదించుకోవాలి- శ్రవణమననాద్యుపాయాలు అలవరచుకోవాలి- చిత్తాన్ని సామ్య విక్షేప వైషమ్యశూన్యమయిన సమాధిలో ఉంచాలి- బ్రహ్మాకారమయిన ప్రత్యక్తత్త్వబోధను సంపాదించాలి- అప్పుడుసంసార దుఃఖాలు అన్నీ నశించాలి- హృదయగ్రంథులు తెగిపోవాలి- సర్వ సంశయాలు విచ్ఛిన్నంకావాలి- సర్వకర్మలు నశించాలి- రామా! సంసారబంధం విచ్ఛిన్నంకావాలంటే చిద్రూపమయిన పరమాత్మను తెలిసికోవాలి- అతడు సర్వగతుడు- నిత్యుడు- ఉదయాస్తమయములు లేనివాడు- అన్నాడు త్రితలుడు-

భగీరథుడు విన్నాడు- కొంత వివేకం కలిగింది- స్వయంగానే ఆత్మతత్త్వంగురించి ఆలోచించుకొని నిశ్చయించుకొని ఉన్నాడు- కాని

విక్షేపబాహుళ్యంచేత చిత్తం స్థిరపడలేదు ఆవిషయంలో- గనకు తెలిపి నంతవరకు గురువుగారికి నివేదించాలనుకున్నాడు- తెలిసినంతవరకు గట్టి చేసికోవాలి అని అనుకున్నాడు- ఆ తర్వాత విక్షేపాశం తొలగిపోవ టానికి ఉపాయం అడిగి తెలుసుకో తలచాడు- ఇలా అడిగాడు-

స్వామీ ! చిన్మాత్రమయిన నిర్గుణబ్రహ్మతత్త్వం ఒకటి నిఖిల ప్రపంచాధిష్ఠానంగా ఉన్నదనీ నాకు తెలుసు- దేహ, ఇంద్రియ, ప్రాణ మనోబుద్ధి, అవిద్యాంతమయిన భాగం ఏదీ బ్రహ్మ (ఆత్మ) కాదనీ నాకు తెలుసు కాబట్టి అభానాపాదకాజ్ఞానాంశభాగము నశించలేదు- ఇతరావభాసకు హేతువయిన విక్షేపాంశముకూడా నశించలేదు- కాబట్టి అసత్త్వాపాదకాజ్ఞానాంశం నాకు నశించింది- ఇది నాకు మీమాట మీాది నమ్మకంచేత కలిగింది- యుక్తికికూడా సరిపోయింది- కాని సదసద్వివేకబోధలలో సహాత్మబోధరూపమయిన ప్రతిపత్తి (జ్ఞానం) కరతలామలకంగా నాకు స్పష్టపడటంలేదు- కారణ మేమిటో తెలియదు- కనుక ఈచిత్తవిక్షేపాలన్నీ శాంతించి నేనీ జ్ఞానంలో స్థిరంగా ఉండే ఉపాయం ఏదో సెలవివ్వండి ! అన్నాడు భగీరథుడు-

త్రితలుడు విన్నాడు- భగీరథుని అభిప్రాయం తెలుసుకున్నాడు- భగీరథునికి రాజ్యాద్యభిమానం పోండని గ్రహించాడు- అందుచేత ఆయా విషయాలమీాదికి చిత్తం తూరికే పరుగెత్తుతూ ఉంటుందని గ్రహిం చాడు- విక్షేప ప్రాబల్యంచేతనే కలిగిన ఆత్మజ్ఞానంకూడా దృఢపడటం లేదని గుర్తించాడు- ఇంక రాజ్యాభిమానాన్ని తొలగిస్తేకాని భగీ రథుడు బాగుపడడని నిశ్చయించుకున్నాడు ఆప్రయత్నంలోకి దిగాడు- గీతలో చెప్పిన అమానిత్వాది గుణసంపదను ఉపదేశించ నారంభించాడు-

త్రిత॥ భగీరథా ! అమానిత్వాది గుణసంపదచేతకాని చిత్తం జ్ఞేయపదార్థం మీాద స్థిరపడదు- అలా చిత్తం స్థిరప్రతిష్ఠ చెందితేకాని జీవుడు సర్వగతుడు కాడు- అప్పుడు కాని జన్మరాహిత్యం చెందడు-

పుత్ర దార గృహాదులందు అనాసక్తి అవసరం– ఇష్టానిష్ట వస్తువులందు సమచిత్తత్వము ముఖ్యం– అనన్యయోగభక్తి వివిక్త దేశసేవ జనసంఘంలో అరతి- అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనము ఇదంతా జ్ఞానసాధనమయిన సామగ్రి– దీనికి భిన్నమంతా అజ్ఞానమే– రాగద్వేషరాహిత్యం సంసారవ్యాధికి భేషజం (మందు) ఈసాధనాలన్నిటికీ అహంకారాభావము ప్రధానం అహంకారంఉంటే అమానిత్వాది సామగ్రి సంపాదించడం చాలాకష్టం– అహంకారం శాంతించిందా జ్ఞానం అతిసులభంగా సిద్ధిస్తుంది– అన్నాడు త్రితలుడు–

విన్నాడు భగీరథుడు– "స్వామీ! కొండమీద చెట్టువలె శరీరంలో పుట్టి నిరూఢమైఉన్న అహంభావ (కార) ము నశించడం ఎలా? చెప్పండి అని అడిగాడు–

త్రిత॥ భగీరథా! పురుషప్రయత్నంచేత భోగవాంఛ తొలగించుకోవాలి– అకామోపహతమయిన చిత్తాన్ని శుద్ధాత్మాకారంగా మార్చాలి- అప్పుడుకాని అహంకారం నశించదు–

భగీరథా! జీవుడికి (మానవుడికి) "నేను రాజ్యం విడిచిపెట్టితే నన్నెవ్వరు లోకులు గౌరవించరు– పైగా శత్రువులు పరిహసిస్తారు– అన్నికోరికలు తీర్చుకొన సమర్థుడనయిన నేను ఎలాభిక్షాటన చేస్తాను? ముష్టెత్తుతున్న అన్నపానాదులతో ఎలా జీవించేది? అనే దిగులువల్ల ఒకవిధమయిన లజ్జ అభిమానమూ ఏర్పడుతుంది- వీటివల్ల ఇల్లు విడువకుండా ఇంటిలోనే ఉండాలనే భావంఒకటి దృఢంగా ఏర్పడుతుంది– తుదకీభావం ఒకపంజరం– (లేక బోను) అవుతుంది వీడికి– సర్వసంగపరిత్యాగంతో ఈపంజరం (బోను) భగ్నం అయిందా? అదృష్టవంతుడే వీడు- కాకపోయిందా వీడుచచ్చాడే– ఈపంజరం భగ్నం కానంతవరకూ (పగిలిపోనంతవరకూ) అహంకారమనేది కళకళలాడుతూ నాట్యమాడుతూనే ఉంటుంది-

కాబట్టి నీవు తెలివిగలిగి దుర్భావాలు తొలగించుకొని అహంకారం చంపుకొని నిశ్చలంగా ఉంటివా! నీవు ముక్తుడవే- అప్పటి నీపరిస్థితే ముక్తి అంటే- నీకు ముక్తికి ఏమీ భేదం ఉండదు- కాబట్టి సర్వసంగపరిత్యాగం అత్యంతావశ్యకం-

కనుక భగీరథా! రాజచిహ్నాలయిన ఛత్రచామరాలను దూరంగా ఉంచు- పూర్తిగా రాజ్యలక్ష్మిని విడిచివేయి- దానిని (రాజ్యలక్ష్మిని) శత్రువులకు వప్పగించు- దేహాభిమానాన్ని చంపుకో- ఆ శత్రువుల ఇండ్లకే వెళ్ళి భిక్షాటనచేయి- (ముష్టియెత్తుకో) నేను గురువునయినా నన్నడగవలసిన విషయాలు ఏమీలేవు- కనుక నన్ను కూడా విడిచిపెట్టు- "యావదాయుః త్రయోవంద్యాః వేదాంతో గురురీశ్వరః" ఆయుర్దాయమున్నంతవరకు, వేదాంతమూ, గురువు, ఈశ్వరుడూ, ఈముగ్గురూ సేవింపతగినవారే" అనే ధర్మశాస్త్రానికి అప్రామాణ్యంరాదు- నీవు శుశ్రూష చేయజాలక నన్ను విడువలేదు- నాతో నిమిత్తంలేక విడుస్తున్నావునన్ను-

కనుక ఇలాంటి వాడవయినట్లయితే ముముక్షుగుణాలన్నిటితోను పరిపూర్ణుడవయిన నీవు బ్రహ్మవే- నీకిక సంసారిసంబంధం ఏర్పడుతుందనే ఊహకూడా అక్కరలేదు- అన్నాడు త్రితలుడు-

ఇట్లు భగీరథోపదేశమనే ౭౪వ సర్గ సమాప్తము.

## ౭౫. భగీరథనిర్వాణం.

వసి॥ రామా! త్రితలుడనే గురువునుంచి భగీరథుడు ఉపదేశాన్ని పొందాడు- వినతగిన విషయమంతా విన్నాడు. తన కర్తవ్యాన్ని తాను నిర్ణయించుకున్నాడు- పని ప్రారంభించాడు- కొన్ని రోజులు గడిచింతర్వాత అగ్నిష్టోమాదిసోమసంస్థలన్నీ చేశాడు-తనకున్న గోవులనూ, భూమినీ, అశ్వాలనూ, (గుర్రాలనూ) బంగారన్నీ అంతా

బ్రాహ్మణులకూ, బంధువులకూ గుణదోష విచారణ లేకుండా అందరకూ పూర్తిగా దానంచేశాడు. భగీరథు తన ప్రాణాలు మాత్రం తాను మిగుల్చుకున్నాడు- మిగిలినవస్తుసామగ్రీ అంతా ఇచ్చివేశాడు- ఇదంతా మూడురోజుల్లోనే జరిగిపోయింది- సర్వార్థరిక్తుడయిన భగీరథుణ్ణి చూచి ప్రకృతివర్గమూ పౌరులూ ఖిన్నులయ్యారు- (బాధపడ్డారు) అంత తన పొలిమరమీదనున్న శత్రురాజుకు తన రాజ్యాన్ని అంతా గడ్డిపోచవలె ఇచ్చివేశాడు- రాజ్యం, రాజస్థానం, నివాసస్థానం అంతా శత్రురాజు ఆక్రమించాడు- తుదకు కట్టుగుడ్డమాత్రం మిగిలిపోయాడు భగీరథుడు- దేశం విడిచిపెట్టాడు. దూరంగా పోయాడు- తన ఊరూ, పేరూ తెలియని గ్రామాలకూ అరణ్యాలకూ వెళ్ళాడు- ఇలా అత్యల్పకాలంలోనే భగీరథుడు ఏషణాత్రయత్యాగం చేసికొని పరమశాంతితో ఆత్మతత్త్వంలో విశ్రాంతి చెందాడు-

ఇలా అవధూతగా తిరుగుతూ తిరుగుతూ భూమండలంలోని ద్వీపాలన్నీ ఒకానొకప్పుడు కాలయోగంచేత అనకుడై శత్రువుచే ఆక్రాంతమయిన తనపట్టణాన్నే మళ్ళీ చేరాడు- అచ్చట క్రమంగా అన్నియిళ్లూ భిక్షకు తిరిగాడు- మంత్రుల యిళ్ళకు పౌరులయిళ్ళకు కూడా ఇతడు భగీరథుడని మంత్రులూ, పౌరులూ గుర్తించారు- దుఃఖంతో సపర్యలుచేసి గౌరవించారు. తుదకు శత్రురాజుకూడా గుర్తించాడు- మీ రాజ్యం మీరు తీసికోండి అని అతనుకూడా ప్రార్థించాడు భగీరథుణ్ణి- భగీరథుడు అంగీకరించలేదు గడ్డిపరకకూడా- భిక్ష మాత్రం అంగీకరించాడు. కొన్నాళ్లు ఆరాజ్యంలో ఉండి తర్వాత మరోచోటికి వెళ్ళాడు. జనులందరూ దుఃఖించారు- అలాంటి భగీరథుడు ఇలాంటివాడయి పోయాడే అని- కాని భగీరథుడు మాత్రం పరమశాంతుడై నిశ్చితబుద్ధితో ఆత్మారాముడై ఉన్నాడు- కొంత కాలానికి క్రమంగా పూర్వగురువయిన త్రితలుణ్ణి చేరాడు- గురువుగారికి వందనాదులు అర్పించి అతనితో కూడా కొంతకాలం కొండల

మీఁద అడవులలోనూ, పట్టణాలలోనూ నివసించాడు- గురుశిష్యులు ఇద్దరూ ఆత్మబోధలోనూ, ప్రపంచబోధలోనూ సమానులై పోయారు- స్వస్థులై వినోదంతో దేహధారణ చేస్తున్నారు-

"ఈదేహం ఎందుకు ధరిస్తున్నాం? ఇదిఉంటేనేమి? పోతేనేమి? శాస్త్రోక్తక్రమప్రకారం వృద్ధాచారాన్ని అనుసరించి ఇదిఉంటే ఉండనీ, పోతేపోనీ, అని నిశ్చయించుకొని అరణ్యాలన్నీ తిరుగుతూ పరమానందాన్ని పొందాడు- మానుష దివ్యభోగాలనన్నిటినీ ఎండుగడ్డిపరక కంటెకూడా హీనంగా తలచారు- ప్రారబ్ధకర్మాధీనమయిన శరీరాన్ని ఆయుర్దాయం ఉన్నంతవరకు ధరించక తప్పదని నిశ్చయించుకున్నారు- ఉన్నారు-

రామా! ఆమహాలు యిద్దరూ పూర్వకర్మప్రాప్తమయిన సుఖ దుఃఖాలు రెంటినీ సమానంగా చూచి అభినందించారు- సర్వసముడయిన పరమాత్మతత్త్వంలో నిలచిపోయారు-

ఇట్లు భగీరథ నిర్వాణమనే ౭౪వ సర్గ సమాప్తము.

## ౭౫. గంగావతరణము.

వసి॥ ఒకపుడు ఒకానొక మండలంలో ఒక గొప్పపట్టణంలో సంతానంలేని రాజును మృత్యువు నోటపెట్టుకుంది- ఆరాజ్యంలో అమాత్యవర్గం అందరూ దేశం అరాజకమయిందనీ ప్రజాపాలన మర్యాద చెడిపోయిందనీ ఖిన్నులయ్యారు- ప్రజాపాలన సమర్థుడూ, గుణవంతుడూ అయిన రాజు ఎక్కడయినా దొరకుతాడా అని వెతకుతున్నారు- ఆసమయంలో భిక్షాచర్య చేసికుంటూ ఉన్న భగీరథుడు తటస్థించాడు వాళ్ళకు- గుర్తించారు ఇతడు భగీరథుడని- తీసికొని వెళ్ళి సైన్యంతో పట్టాభిషేకం చేశారు- మహీపతిని చేశారు- వెంటనే భగీరథుడు సేనాసమేతుడై గజాన్ని అధిష్ఠించాడు- "జగతీనాథుడయిన

భగీరథుడు జయించుగాక" అను జయధ్వానాలు కొండగుహాలలో దట్టంగా మారుమోగి పోతున్నాయి-

ఆసమయంలో దైవికంగా కోసలరాజ్యాన్ని అపహరించిన రాజు కూడా మరణించినందున అయోధ్యలోఉండే ప్రకృతులు (మంత్రులు) భగీరథుని వద్దకువచ్చి ప్రార్థించారు-"రాజా! నీచేతకూడా పురస్కృతు డయిన (రాజ్యమిచ్చి గౌరవింపబడిన) మహారాజు మృత్యుగ్రస్తు డయ్యాడు- కనుక ఆమీ ప్రాక్తన రాజ్యాన్నికూడా పరిపాలించి మమ్మల్ని అనుగ్రహించండి- అయాచితంగా వచ్చిన అర్థాన్ని పరిత్య జించడం ఉచితంకాదు-" అన్నారు ప్రకృతులు-

వసి॥ రామచంద్రా! ఆ మంత్రులమాట అంగీకరించాడు భగీ రథుడు- సప్తసాగరపర్యంతమయిన భూమండలానికి అధిపతిఅయ్యాడు- శాంతమనస్కుడు- హితమితసత్యవాక్కు- వీతరాగుడు- మాత్సర్య రహితుడు- వచ్చిన పనిని నెరవేర్చడంలో దక్షుడు- తత్త్వజ్ఞాని-అంచేత ఎంతటి కౌతుకకం సంప్రాప్తమయినా ఉప్పొంగడు- విస్మయ (ఆశ్చర్య) పడడు- కపిలుని క్రోధాగ్నిచే పాతాళలోకంలో భస్మీభూతులయిన తన తాతలను సగరచక్రవర్తి పుత్రులను గంగోదకంతో స్నానంచేయించి దానితో జలాంజలియిస్తే వాళ్లు తరిస్తారనే తార్క్ష్యవచనాన్ని జనపరం పరచే విన్నాడు- అప్పటికి గంగానది భూలోకంలో ప్రవహించడం లేదు- గంగాజలాంజలి అనేది భగీరథుని చేతనె ఇతర పితృదేవతలకు కూడా ప్రసిద్ధమయింది- అంతకు లోగడ పితృదేవతలకు ఇంతగా దీని మహిమ తెలియదు-

కనుక భగీరథుడు తార్క్ష్యవచనాన్ని విన్నదిలగాయతు స్వర్గ లోకంనుంచి గంగను భూలోకంలోకి తీసికొనిరావటానికి ప్రయత్నిం చాడు- వెంటనే రాజ్యం మంత్రులకు విడిచిపెట్టాడు- తపస్సు చెయ్య టానికి విజనమయిన అడవికి వెళ్ళాడు- అక్కడ వేయి సంవత్సరాలు

బ్రహ్మను, శంకరుని, జహ్నుమహర్షిని ఆరాధించి గంగను భూలోకం లోకి దించాడు. అప్పటినుంచే గంగానది భూలోకంలో ప్రవహించడం ప్రారంభం.

ఇట్లు గంగావతరణమను ౭౬వ సర్గ సమాప్తము.

## ౭౭. చూడాలోపాఖ్యానము.

### శిఖిధ్వజమాహాత్మ్యం.

వసి॥ రామచంద్రా! భగీరథుని దృష్టి మనస్సులో పెట్టుకొని స్వస్థచిత్తుడవై యథాప్రాప్తమయిన కార్యాన్ని ఆచరించు. ముందు విభవజాలాన్ని పరిత్యజించు. మనస్సు అనే పక్షిని హృదయంలో నిరోధించు. శిఖిధ్వజుడివలె స్థిరంగా ఉండు.

శ్రీరా॥ మునీంద్రా! ఎవడా శిఖిధ్వజుడు? అతడు రాజ్య స్థానానికి ఎలావచ్చాడు. సవిస్తరంగా చెప్పండి. చెపితేకాని నాకు బోధ అభివృద్ధి చెందేటట్లులేదు. అని అడిగాడు శ్రీరాముడు.

వసి॥ రామా! మీాకు పూర్వం పూర్వకల్పంలో ద్వాపరంలో దంపతులు అయినారు. ఇపుడు ఇరువది యెనిమిదవ చతుర్యుగం లోను, ముందురాబోవు ద్వాపరంలోను అదే సన్నివేశంతో దంపతులు కాగలరు.

శ్రీరా॥ స్వామీా! గడచినదానికి రాబోవుదానికి సాదృశ్యం (పోలిక) ఉండటంలో హేతువేమిటి? అని అడిగాడు.

వసి॥ రామచంద్రా! జగన్నిర్మాణంలో సత్యసంకల్పులయిన బ్రహ్మాదులయొక్క అనివార్యమయిన స్వభావమే అందుకు కారణం. ఒక మామిడిచెట్టుకు వేరువేరుగా పండ్లు అనేకంగా ఉంటాయి. అవన్నీ మళ్ళీ సదృశంగానే పుట్టుతూ ఉంటాయి. తేడా ఏమీాకనిపించవు. ఎన్ని కాపులు కాచినా ఈసాదృశ్యం తప్పదు వాటికి. స్కంధమునుమాత్రం

(అభూత్వైవభవతి) పుట్టకుండానే ఉంటుంది- నదికి తే మాత్రం మళ్ళీ అక్కడ మొలవదు- నదిలో తరంగాలుకొన్ని సదృశంగా ఉంటాయి- మరికొన్ని అసదృశంగా ఉంటాయి- అలాగే సంసారంలోకూడా కొన్ని పదార్థాలు అదేపోలికలో పుటుతూ ఉంటాయి- కొన్ని మరోరకంగా ఉంటూ ఉంటాయి- దీనికంతకు ఈశ్వరసంకల్పంకారణం-

కనుక ఈ సంసారంలో (ప్రపంచంలో) శిఖిధ్వజాదుల సంసారం కూడా అలాంటిదే- గడచిన శిఖిధ్వజాదువంటివాడే ముందు వర్ణింప బోయే కథానాయకుడు రాజుకూడా కాగలడు- అతడి వృత్తాంతం చెబుతా విను-

పూర్వం ద్వాపరయుగంలో గడచిన సప్తమమన్వంతరంలో నాల్గవసృష్టిలో, కురురాజుల వంశంలో, ఉజ్జయినీ పట్టణంలో శిఖిధ్వజు డనే రాజొకడుండేవాడు- ధైర్యశాలి అతడు- ఔదార్యశీలుడు- క్షమా వంతుడు- శమదమాన్వితుడు- శూరుడు- శుభసమాచారుడు- నిఖిల గుణాకరుడు- సర్వయజ్ఞానుష్ఠాత- వీరాగ్రేసరజేత- వాపీ కూప తటా కారామాది కార్యనిర్మాత- లోకశాస్త్రనిష్ణాత- సౌభాగ్యలక్షణ యుక్తుడు- సుందరుడు- ధర్మవత్సలుడు- వినయోక్తులకువక్త- సకల సంపదలకుదాత- సత్సంగసహితుడు- సకల శుతులకు శ్రోత- సర్వజ్ఞుడు- అభిమానశూన్యుడు- స్త్రీవ్యసన దూరుడు- ఇలా ఉండగా కొంత కాలానికి తండ్రి స్వర్గానికి చేరాడు- తన బాహుబలంచేత పదునారవ ఏటనే దిగ్విజయంచేసిన శూరుడయ్యాడు- బాహుబలంచేత నిఖిల భూమండలాధిపతి అయ్యాడు- ధర్మమార్గంచేత ప్రజాపాలన చేశాడు మంత్రులతో- దిగంత వ్యాప్తమయిన కీర్తిని గడించాడు-

ఇలా కొన్నిసంవత్సరాలు గడిచాయి- యావనం ప్రారంభ మయింది శిఖిధ్వజుడికి- సర్వలక్షణములతో వసంతము (ఋతువు) సంప్రాప్తమయింది- చిత్తం స్త్రీవ్యసనాసక్త మయింది- ఇతరం మర చింది- నాప్రణయురాలను ఎప్పుడు నాతొడమీద కూర్చొండ బెట్టు

కుంటాను ? ఎన్నడు పడకమీద పరుండ బెట్టుకుంటాను- ఎప్పుడు పెళ్ళాడతాను ? నావలె నాప్రియురాలికి నామీద అభిలాషచే సంతోషం ఎప్పుడు కలుగుతుంది ? అనే మనశ్చింత మరింత ఎక్కువయింది అతడికి- ఈచింతతతో ఉద్యానవనంలో విహరించడం ప్రారంభించాడు- సాంకల్పికములయిన భూషణాలతో ఆడపిల్లలను మదిలో బహుమానించాడు-

రామచంద్రా ! ఈస్థితిలో అతని మంత్రులు అతని అభిప్రాయాన్ని గుర్తించారనుకుంటాను- మనోభావాని కనుకూలమయిన ఆకారాన్ని గుర్తించడమేకదా మంత్రిత్వానికి లక్షణం- కనుక మంత్రి వర్గం అతని వివాహవిషయం విచారణచేశారు-యౌవనాన్విత యయిన సురాష్ట్రరాజుయొక్క కూతురు నియ్యమని యాచించారు- ఆరాజు సంమతించాడు-అంతట శిఖిధ్వజుడు విధివిధానముగా వివాహమాడాడు- ఆమెపేరు "చూడాల" ఆమెమీద అతిస్నేహం కలిగింది శిఖిధ్వజుడికి- వారిరువురికి ప్రేమ కొండలపెట్టున పెరిగింది- రాజ్యభారంఅంతా మంత్రులకొప్పగించాడు శిఖిధ్వజుడు- ఆమెతో సుఖించడం ప్రారంభించాడు- అంతఃపురాలలో ఊయెలలమీద, ఉద్యానవనాలలో, లతాపుష్పగుబురులలో, చందనాగురువృక్షపంక్తులలో, మందారవనములలో, అరటితోటలలో, ఇంకా ఇతర వనాంతములు, దిగంతములు, సరస్సులు, జంగలములు, జనాంతములు, జంబూజంబీరజాతులు ఇవన్నీ ఆమెతో విహరించాడు- ఆ యిరువురిచిత్తం అత్యంతాహ్లాదాయత్తం అయింది అన్యోన్యచేష్టలతో మున్ను సిద్ధంగావున్న పొలాలకు రమణీయమయిన వర్షం కురిసినట్లయింది ఈచూడాలయొక్క సమాగమం శిఖిధ్వజుడికి- స్వర్గమర్త్యలోకాలతీరయింది వారివురి తీరు- నిత్యమూ నియుక్తలయినా (అనగా విడివిడిగా ఉన్నా) ఒకరిచేష్ట మరొకరికి అంతప్రియమయింది- ఒకరియొద్ద మరొకరు అభ్యసించినందున ఆయిద్దరూ పరస్పరం సకలకలాకోవిదులయినారు- పరస్పరమైత్రిచేత ఏకస్వరూపు

లయ్యారు- ఆ చూడాల శిఖిధ్వజుని నుంచి నిఖిల శాస్త్రార్థాలను గ్రహించింది- శిల్పవిద్యాకోవిదాలనుంచి శిల్పవిద్యనుకూడా గ్రహించింది- సర్వజ్ఞురాలయింది- (సర్వార్థపండితురాలయింది) శిఖిధ్వజుడుకూడా చూడాలనుంచి నృత్యగీతవాద్యాదులను అభ్యసించాడు- నిఖిలకలాకోవిదుడయ్యాడు- అమావాస్యనాడు సూర్యచంద్రులు కలిసినట్లు కలుసుకుపోయారు వీరిరువురు- వీరికలియిక పుష్పము, దాని పరిమళము, వంటిదయింది- కలియబోసిన నీరుపాలవలె కలిసిపోయారు- భూలోకానికి అవతరించిన గౌరీశంకరులవలె ఉన్నారు- పరిపాలనా కార్యానికి అవతరించిన లక్ష్మీమాధవులవలె వెలిగారు- సందిగ్ధమయిన విషయం ఎంతటి జటిలమయినా ఇద్దరూ ఒకేదభా చెప్పటానికి ఉద్యుక్తులయ్యేవారు- పాండిత్యంలో ఒకరికొకరు తీసిపోరు- గురుద్విజాభిజ్ఞాదులను అనువర్తించడంలో అతి ఆసక్తి వారిరువురికి- లోకవృత్తాంత కోవిదులు- ధర్మరహస్యవేత్తలు- రామా! వారిరువురూ బ్రహ్మాండఖండమయిన సర్వలోక కుహరంలోని గంభీరసరస్సులలో విహరించే రాజహంసల మిథునమూ అన్నట్లు కలిసిమెలసి తిరిగారు-

ఇట్లు శిఖిధ్వజవిలాసకథనమను ౭౭వ సర్గ సమాప్తము.

## ౭౮. చూడాలప్రబోధ.

వసి॥ ఇలా దృఢప్రేమగల వాళ్ళ యువ్వనం యౌవనలీలలతో చాలాకాలం గడిచింది- కొంతకాలానికి చల్లగా వాళ్ళ యౌవనం దిగజారింది ఓటికుండనుంచి నీళ్లు కారినట్లు- అటుపైన అధ్యాత్మశాస్త్రం విచారించడం ప్రారంభించారు వాళ్ళిద్దరు ఇలా—

“తరంగాలవలె క్షణభంగురమయింది ఈదేహం- ఇందులో ఉన్న దేహికి (జీవుడికి) మరణం దుర్నివారం- పండినపండువలె ఎప్పుడో పడిపోతుంది శరీరం- కమలముమీద పిడుగుపడ్డట్లు దేహంమీద జర (వార్ధక్యం) విరుచుకు పడటానికి సిద్ధంగాఉంది- అరచేతిలోని నీటివలె

ఆయువు జారిపోతుంది తప్పక- వర్షకాలంలో సారతీగ ఏపుగా పాకినట్లు ఒక్క తృష్ణమాత్రం పెరిగిపోతుంది- శిలయేటిప్రవాహం పరుగెత్తినట్లు యౌవనం పరుగెత్తుకు పోతోంది- శరీరేంద్రియాదులు ఇంద్రజాలంవలె అసత్యమైనవి- సుఖాలు పరుగెత్తుకు పోతున్నాయి ధనుస్సునుంచి జారి పోయిన బాణాలవలె- గద్ద మాంసంమీద వాలినట్లు ఆశ, దుఃఖాలూ మనస్సుమీద వాలిపడుతున్నాయి- వర్షకాలపునీటిలో బుడగలవలె-

శరీరం క్షణభంగురం- అరటి స్తంభంలోని గర్భం (మూట) వలె నిస్సారమయింది వ్యవహారమంతా విచారిస్తే- తన సవతెను కోరిన భర్తను భార్య విడిచిపోయినటు స్త్రీసంఘం మనల్ని విడిచిపోతోంది- బలాత్కారంగా అరతి (కోరినవస్తువు లభించనందువల్ల కలిగెడి దౌర్మనస్యం) ఎదురువస్తోంది- కనుక ఈసంసారంలో మంచి (సుఖం) ఏమి ఉంది? ఏంచూచి మనస్సు జన్మమరణాది దురవస్థలలోకూడ బాధ పడదు!" అని ఇలా విచారించారు ఆదంపతులు- సంసారవ్యాధికి మందు అధ్యాత్మశాస్త్రమని నిర్ణయించుకున్నారు- చాలకాలం వేదాంత విచారంచేశారు- ఆత్మజ్ఞానంచేతనే సంసారమనే (విషూచిక) మసూచిక వ్యాధి శాంతిస్తుందని(తగ్గిపోతుందని) నిర్ణయించుకున్నారు- ఆత్మజ్ఞాన పరాయణులయినారు- అనవరతం అదే గోష్ఠిలో నిమగ్నులయ్యారు- "తచ్చింతనం తచ్ఛ్రవణం అన్యోన్యం తత్ప్రబోధనం" అన్నట్లు-

రామా! తర్వాత ఆచూడాల ఆధ్యాత్మవేత్తల నోటినుండా అనవరతం సంసార తారణ క్షములయిన వేదాంతార్థాలను విన్నది-

ఇలా తనలో తాను ఆత్మవిచారం చేసికొంది రాత్రింపగళ్లు- "శరీరేంద్రియవ్యాపారాలు కట్టిపెట్టి నాఆత్మను నేను ప్రత్యక్షం చేసికొంటాను- ఈకార్యకారణసంఘాతంలో చేతనధాతువయిన నేను ఎలా ఉంటానో నాకు అర్థంకావాలి- నాకు నిర్ణయంకావాలి- సంసారబంధమనే భ్రమ ఎవడికి? ఎలా వచ్చింది? ఎక్కడ పుట్టింది? దేహమూ!

జడం అది నేనుకానని మాట దృఢం- ఇది నిశ్చితం- ఈవిషయం ఆబాలగోపాలం "స్థూలోఽహం" "గౌరోఽహం" అనే మనోవృత్తివల్ల స్పష్టమవుతూనే ఉంది- ఈ మనోవృత్తివల్లనే శరీరం అనుభవించబడుతూంది- కాని స్వతః అనుభూయమానం కావటంలేదు- ఆత్మస్వయం ప్రకాశుడుకాని వృత్తివిషయుడుకాడు- ఇలాగే కర్మేంద్రియసముదాయమూ జ్ఞానేంద్రియ సముదాయమూకూడా శరీరావయవాత్మకమే- కాబట్టి అవీ జడములే-

గమనిక॥ "అణవశ్చ" అను సూత్రమున ఇంద్రియప్రాణాదులు సూక్ష్మములనీ, సూక్ష్మశరీరావయవములనీ, స్థూలదేహావయవములు కావనీ బాదరాయణులు సిద్ధాంతీకరించారు- అయినా అవి స్థూల దేహావయవములని పండితపామరులకు అనుభవంలో ఉంది- పైగా అవయవములుగల దేహంతో కూడుకునే ఉన్నాయి- కాబట్టి స్థూల దేహావయవములవలె ఇంద్రియప్రాణాదులుకూడా జడములే- అని గ్రహించవలెను-

అలాగే మనస్సుకూడా జడమే- ఇది జడమయిన దేహాదులకు ప్రేరకం యష్ట్యాదుల (కర్రమున్నగువాని) వలె- కాబట్టి యష్ట్యాదులు (కర్రరాయి మొదలగునవి) ఎలా జడమూలో అలాగే ఈమనస్సుకూడా జడమే అని అనుకుంటాను- త్రాళ్ళచే తయారుచేసిన ఒడిశాలచే రాళ్ళను విసిరివేస్తూ ఉంటారు పిల్లలు- కాబట్టి ఒడిశాల రాళ్ళను ప్రేరేపించటానికి సాధనమయింది- అలాగే నిశ్చయాత్మకమయినబుద్ధి మనస్సును ప్రేరేపిస్తోంది కనుక మనస్సు ప్రేరేపించడానికి బుద్ధి సాధనమన్నమాట- కాబట్టి ఇది (బుద్ధి) కూడా జడమే- ఆబుద్ధికి ప్రేరకం అహంకారం- అదీవట్టి నిస్సారమయింది- కేవలం శవాకారం- కనుక అదీ జడమే-పిల్లవాడు దేనినో చూచి దయ్యం అనుకున్నట్లు ప్రాణంతో కూడుకున్న జీవునిచే (చిదాభాసునిచే) పైవి అన్నీ అధ్యసించబడ్డాయి-

జీవుడు మాత్రం చేతనుడు- ప్రాణము వీడికి ఉపాధి- ఈతడి ఉనికి హృదయప్రదేశమందు- ఈజీవుడు కూడా తనకు అంతర్యామి అయిన బింబచైతన్యంచేత జీవిస్తున్నాడు- (బ్రతుకుతున్నాడు) తాను సాక్షిరూపుడుగా ఉండి విషయాలను ప్రకాశింపచేయటమనే దోషంచేత ఇతనికీ గతిపట్టింది- నిజస్థితిలో ఇతడు (జీవుడు) చిరంతనమయిన చిద్రూపుడు- అయినా అసత్యములయిన జడవస్తువులతో తాదాత్మ్య సంసర్గాధ్యాసచేత తాను చిద్రూపుడయినప్పటికీ జడరూపుడయినాడు- సముద్ర జలంలో ఉన్న అగ్నివలె తన ప్రకాశరూపాన్ని విడిచిపెట్టాడు- కనుక ఈతని సత్తకూడా "ఘటస్సన్ పటస్సన్" ఇత్యాది ప్రతీతులను బట్టి ఘటపటాద్యచిదాకారసమరసమై అనుభవింపబడుచున్నది- (అనగా ఘటపటాది జడవస్తువులతోపాటు కలిసియే అనుభవింపబడుచున్నది)- ఘటాద్యాకారము మృదాదులందు లీనమయ్యేసరికి "ఘటోనాస్తి" "పటోనాస్తి" (కుండలేదు, గుడ్డలేదు) అని సత్తాకారాన్ని కూడా విడిచిపెడుతూ తుదకు అభావాన్నికూడా పొందుతోంది- వాసనా విశేషంచేత సద్రూపంకాని అసద్రూపంకాని ఏవస్తువయితే స్వతః ప్రకాశిస్తోందో అదే చిత్సమాధిలో (చైత్యావస్తువుతో చైతన్యం అభేదం చెందినప్పుడు) తన పూర్ణస్వరూపాన్ని క్షణంలో విడిచి వస్త్వాకారాన్ని చెందుతోంది-

ఇలా పరమార్థతః చిద్రూపమయినా అవిద్యావరణంవల్ల అధ్యాసపరంపరలో మునిగి జడమూ, శూన్యమూ, అసత్కల్పమునూ అయింది బ్రహ్మపదార్థం- జగద్రూపమయిన ఈ బ్రహ్మపదార్థం బుద్ధియందు అనావృతస్వభావమయిన చైతన్యంచేతనే తత్తదాకారవృత్తి వ్యాప్తిచే మూలావిద్యావరణభంగద్వారా ప్రబోధింపబడుతోంది- అని ఇలా ఆలోచించి ఆ చూడాల "మూలావిద్యావరణాన్ని నాశంచేసికొని ఆ బ్రహ్మచైతన్యం ఏఉపాయంచేత దృశ్యస్వప్నాన్ని (దృశ్య భ్రాంతిని) విడిచిపెట్టి స్వస్వరూపాన్ని తెలిసికొంది- అని మళ్ళీ సుదీర్ఘంగా ఆలోచనచేసింది- చాలాకాలానికి ఇలా తెలిసికొన్నది-

"అబ్బా ఇంతకాలానికి తెలిసికొనదగిన ఆత్మతత్త్వాన్ని నేను తెలిసికొన్నాను— దీనిని తెలిసికొన్న పురుషుడెవ్వడూ పరమపురుషార్థమునుండి భ్రష్టుడుకాడు— లేక వాడికి కామ్యపదార్థమేదీ హాని చెందదు— (నశించదు) లేక ఏ వస్తువూ దుఃఖసాధనముచే బుద్ధిలో విడిచిపెట్టబడదు— సర్వమూ ఆనందైకరసముగానే గోచరిస్తుంది—

మహాచైతన్యముయొక్క విలాసకు పరిచ్ఛేదహేతువులయిన (అనగా పరిపూర్ణచైతన్యాన్ని ముక్కలు చేయడానికి కారణములయిన) మనోబుద్ధీంద్రియాలు అన్నీ ద్విచంద్రాదులవలె భ్రాంతికల్పితాలు— మహాచైతన్యమయిన బ్రహ్మపదార్థం ఒక్కటే సత్యం— ఇది నిష్కలంకం— సర్వగతం— పరిశుద్ధం— నిరహంకారరూపం— శుద్ధచిదాకారం— శివం— సనాతనం— ఆనందస్వభావమునుంచి ఎన్నడూ దిగజారదు కనుక అచ్యుతం— స్వయంప్రకాశస్వరూపం— ఇది వేదాంతశాస్త్రంలో బ్రహ్మ అనీ, పరమాత్మ అనీ, మొదలగు పేర్లతో లక్షణయా చెప్పబడుతోంది— త్రిపుటీజాలం అంతా దీనికంటె భిన్నమయిన వస్తువుకాదు— ప్రమాణసిద్ధమూ కాదు— కేవలము సాక్షిచైతన్యముచే అనుభవింపబడుతోంది— ఈ సాక్షిచైతన్యం త్రిపుటికంటె పూర్వమే సిద్ధమైఉంది— ఇదే మనోబుద్ధీంద్రియాదిరూపాలతో వివర్తమవుతోంది— చిదాత్మ అనే తల్లియందు ప్రపంచరూపములయిన భూతభౌతిక పదార్థములన్నీ పుట్టిపెరుగుతున్నాయి— ప్రసిద్ధంగా మీకు కనిపిస్తూ ఉండే ప్రపంచం అంతా మహాచైతన్యముయొక్క మారురూపం— ఆ చైతన్యం అసంగంగా ఉండే స్ఫటికమణివలె జగత్ప్రతిబింబాన్ని ధరిస్తోంది— ప్రపంచముయొక్క సత్త (ఉనికి) వ్యావహారిక ప్రాతిభాసికములయందు సమానము— తమ తమ అధిష్ఠానాన్ని అనుసరించే ఉంటుంది— అధిష్ఠానసత్తకంటే భిన్నమయిన సత్త ప్రపంచానికి లేదు— కాబట్టే ప్రపంచం మాయామాత్రమని చెప్పబడుతోంది— కనుకనే నామరూపవిశేషాలు నశించేసరికి జగత్సత్త మాయాశబలమయిన బ్రహ్మయొక్క సత్తతో అభిన్నంగానే మిగిలిపోతోంది—

మాయ బాధితంకాగానే అనందైకరసన్మాత్రరూపమయినఆత్మను అనుభవిస్తుంది- అలంకారములు తమ వైచిత్ర్యం నశించగానే సువర్ణ రూపంతో నిలిచిపోతాయి- అలాగే ప్రపంచపరిస్థితికూడా- స్వప్న ఇంద్రజాలాదులందు చిత్తం ద్రవించేసరికి సముద్రాదిజలములలో తరంగాదులు పుట్టకపోయినా పుట్టినట్లు భాసిస్తున్నాయి- అలాగే బ్రహ్మయందు కూడా జగత్తు నిజంగా పుట్టకపోయినా పుట్టినట్లు భాసిస్తోంది- కాబట్టి స్వప్నంలో చిద్రూపుడయిన ఆత్మ మనఃకల్పితమయిన జలరూపంతో రూపంగలవాడై తరంగాది ద్రవ్యభేదములను పొందాడు- అచ్చట ఆత్మవ్యతిరిక్తమయినది అణుమాత్రం కూడా ఏమీ లేదు- అలాగే జాగ్రదవస్థలో కూడా చిన్మాత్రమయిన బ్రహ్మయే ప్రాపంచిక పదార్థభేదములతో కూడియున్నట్లు భాసిస్తోంది- పరమార్థంగా ఇవిఏవీ లేవు- పూర్ణచిదాత్మఅయిన బ్రహ్మకంటె వేరుగా అణుమాత్రంకూడా ఏదీలేదు- అట్టి బ్రహ్మస్వరూపమే నాది, అనే జ్ఞానం కలిగితే అపుడు వానికి అహంభావంకూడా పూర్తిగా నశించినట్లే- కాబట్టి అపుడు అహంభావరహితమయిన చిన్మాత్రమే విస్తీర్ణమవుతుంది వాడికి- ఇలాంటి జ్ఞానంకలవాడికి జన్మమరణాలులేవు- స్వర్గనరకాలులేవు-చిదాకాశానికి నాశము (ధ్వంసము) అనేది ఎన్నడూ సంభవించదు- అతి నిర్మలమయిన చిదాదిత్యుడు అచ్ఛేద్యుడు-(తెగగొట్టతగినవాడుకాడు)- అదాహ్యుడు- (తగలబెట్టతగినవాడు కాడు-)

అబ్బా! నేను చాలకాలానికి అఖండానందం పొందాను- శాంతస్వరూపురాలనయ్యాను- భ్రాంతిరహితురాలను- అంచేత నిశ్చలమయిన సముద్రంవలె (నిర్మందరాబ్ధివత్) మందరపర్వతం తీసిన సముద్రంవలె శాంతంగా సుఖిస్తున్నాను- అతిస్వచ్ఛమూ, అనంతమూ, జన్మరహితమూ,నాశరహితమూ,అయిన ఈచైతన్యము అసత్పదార్థాకారంగా భాసిస్తోంది- ఈచిదాకాశము అనంతము- బాధ (నాశ) రహితము- బ్రహ్మాది స్తంబపర్యంతమయిన ప్రాణుల కర్మఫలములు, తత్సాధన వ్యాపారములూ, నిష్ఫలసాధనములూ, వృథాచేష్టలూ ఇవన్నీ ఈచిదా

కాళమే- పిల్లవాళ్లు కల్పించుకున్న వృద్ధ్యాకారమయిన సేన ఎలాంటిదో ద్రష్టృదృశ్యమయమయిన ఈప్రపంచంకూడా అలాంటిదే- ఇది అంతా (చిన్మాత్రైక్యమయి) చిదభిన్నమయినదే- ఇది ఐక్యమనీ, ఇది ద్విత్వమనీ, నేను అనీ, నేనుకాననీ, అనేభావం అంతా భ్రాంతి- ఇది ఎవనికి? ఎలా? ఎంచేత? ఎక్కడ? కలుగుతుంది? (ఇకస్య కథం కుతః క్వవా?) భోక్తృ, ప్రకార, నిమిత్త, అధికరణ, సంభావనా ప్రతిషేధార్థం ఇలా చెప్పబడింది-

నేను పారమార్థికమయిన బ్రహ్మస్వరూపాన్ని పొందాను- అఖండ పరిపూర్ణ ఆనందరూపురాల నయ్యాను- సంసారజ్వరం అంతరించింది- స్వస్వరూపం ప్రాప్తించింది- శరీరం జ్వరంతగ్గితే నార్మల్‌కు వచ్చినట్లు- నాచిత్తంలో లోగడభాసించిన చేతనాచేతనపదార్థాలన్నీ మహాచిదాకాశాభిన్నములే- ఇప్పుడు నేను "ఇదికాదు, నేనుకాదు, తద్భిన్నముకాదు, భావపదార్థంకాదు, అభావపదార్థమూ" కాదు- అనగా నాకు ఇదంతా, అహంతా, అన్యత్వాది ప్రపంచ స్వభావంఅంతా నశించిందని అర్థము- కేవలం నిరాలంబమయిన శాంతస్వరూపంలో ఉండిపోయాను-

రామచంద్రా ! ఆ చూడాల ఇలా విచారణచేసికొని ఆత్యంతికమయిన మోహనిద్రాపగమమువలన(అనగా అజ్ఞానమనే నిద్ర పూర్తిగా నశించినందువల్ల) పరమాత్మ తత్త్వాన్ని తెలిసికొని రాగాది దోషాలనూ, తమోవిలాసములయిన అవస్థాత్రయస్వప్నాలనూ రూపుమాపుకొని శరత్కాల మేఘంవలె నిర్మలచిత్తంతో పరమశాంతస్వరూపురాలయింది-

ఇలా చూడాల ప్రబోధమనే ౭౦వ సర్గ సమాప్తము.

౮౧. చూడాలాత్మలాభము.

వసి॥ రామా! ఆచూడాల అనుదినమూ తత్త్వజ్ఞానాన్ని అభ్యసిస్తూ అంతర్ముఖప్రజ్ఞతో స్వస్వరూపంలో నిలిచిపోయింది- రాగద్వేషాదిదోషాలు అంతరించాయి ఆమెకు- ఆసక్తి అణగంటింది- సుఖదుఃఖాదిద్వంద్వాలు రూపుమాసిపోయాయి- దేనిమీదనూ ఈహా అనేది అసలేసున్న- దేనిని పరిగ్రహించదు- విడిచిపెట్టదు- మనోగత సందేహాలు పటాపంచలయినాయి- సంసారసముద్రాన్ని దాటింది- పరమాత్మలాభం (ప్రాప్తి) చే అంతరాత్మ (ప్రత్యగాత్మ) పరిపూర్ణమయింది- ఇంతకులోగడ సంసారంలో అలసట చెందిన ఆచూడాల ఇపుడు నిరతిశయానందఘనమయిన పరమపదంలో విశ్రాంతితీసికొన్నది- నిరుపమానమయిన స్థితికి వచ్చింది- అత్యల్పకాలంలోనే వేద్యవస్తువు విదితమయింది ఆమెకు- అజ్ఞానికి చిత్తవిభ్రమం (భ్రాంతి) అకస్మాత్తుగా అత్యల్పకాలంలోనే ఎలావస్తుందో అలాగే తత్త్వజ్ఞానికి భ్రాంతి అంతా అకస్మాత్తుగానే విలీనమవుతుంది- (నశిస్తుంది) ద్వితీయ వస్తురహితమయిన పరమపదమునందు విశ్రాంతిచెంది ఆమె శరత్కాల మేఘమాలవలె నిర్మలంగా ప్రకాశించింది- ముసలిగోవు పచ్చగడ్డీ నీరూ సమానంగా ఉన్న శైలాగ్రమును(కొండశిఖరమును) దైవబలంచే అధిష్ఠించి ఎలా నిశ్చింతగా ఉంటుందో అలాగే ఈ చూడాలకూడా జాగ్రదాది సర్వావస్థలందునూ ఏకరూపమయిన ప్రకాశగల ప్రత్యగాత్మను అవస్థాత్రయాతీతమయిన స్వభావంతో పొంది ఆ ఆత్మస్వరూపమునందు నిశ్చింతగా ఉండిపోయింది- క్రొత్తగా పుష్పించిన పూలతీగవలె పూర్ణానందస్వరూపావిర్భావంచేత ఆమె కళకళలాడుతూ ప్రకాశిస్తోంది-

ఇలా ఉండగా నూతనమయిన శోభగల ఆ చూడాలనుచూచి ఆశ్చర్యపడి శిఖిధ్వజుడు ఒకపుడు ఇలా అన్నాడు ఆమెతో-

ఓ తన్వీ! క్రొత్త యౌవ్వనం వచ్చిపడినట్లుగానూ, నూతనాభరణాలతో అలంకరింపబడినట్లుగానూ, మిక్కిలి ప్రకాశిస్తున్నావు పట్టపురాణివలె- ఓ ప్రియురాలా అమృతసారాన్ని త్రాగినట్లుగానూ, పొందదగినతావును పొందినట్లుగానూ, ఆనందపూరంతో నిండియున్నట్లుగానూ, మిక్కిలి ప్రకాశిస్తున్నావు- నీశరీరం మహాశాంతంగానూ, శాంతంగానూ, సుందరంగానూ ఉంది- చంద్రకళను తిరస్కరిస్తోంది- నూతనశోభను ధరిస్తోంది- ప్రియురాలా! నీచిత్తం భోగలాలసమై లేదు- పరమశాంతంగా ఉంది- వివేకరసంతో ఊర్జితమైఉంది- సర్వసమంగా ఉంది- అతిగంభీరంగా ఉంది- ప్రియురాలా! నీమనస్సు ముల్లోకాలను తృణీకరించి ప్రపంచసారాన్ని పుక్కిటపట్టింది అతి సౌమ్యంగా ఉంది- నేను గుర్తించాను- నీచిత్తానికి యిప్పుడు ఎంతటి విభవవస్తువూ సమానంకాదు- ఎంతటి ఆనందవస్తువూ సమానంకాదు- మరుప్రదేశంవలె నిర్జలంగా క్షీరాబ్ధివలె పరిపూర్ణంగా, అతిసుందరంగా ఉంది నీచిత్తం- (మరుక్షీరాబ్ధి సుందరం) ఓ చిన్నదానా! నీ అవయవాలు లేత అరటిపిలకయొక్క స్తంభాలవలె అతికోమలంగా ఉన్నాయి- మృణాళంకారములవలె అతిమృదులంగా కనిపిస్తున్నాయి- అవయవాలు వెనుకటివేకాని, ఈశోభతో క్రొత్తగా కనిపిస్తున్నాయి- ఇలా క్రొత్తక్రొత్త సన్నివేశంతో శిశిరఋతువుమారితే తీగ క్రొత్తగా కనిపించినట్లుగా నీవుకూడా క్రొత్తగా కనిపిస్తున్నావు- ఏమి? నీవేమయినా అమృతం పుచ్చుకున్నావా? నీకు సామ్రాజ్యపదవి ఏదయినా అబ్బిందా రసాయనాదిప్రయోగం వల్లనో, మంత్రసిద్ధివల్లనో, రాజయోగ హఠయోగాది ఉపాయాలవల్లనో నీవు మృత్యువును దాటినావు- (తిరస్కరించినావు) ఓ ఇందీవరాక్షీ! నీవు రాజ్యంకంటె గొప్పదాన్ని పొందలేదు- చింతామణికంటె గొప్పదాన్ని పొందలేదు- త్రైలోక్యంకంటె గొప్పదాన్ని పొందలేదు- మరేమిటి? నీకు లభించింది? ఈపరిస్థితి నీకబ్బటానికి? అని అడిగాడు శిఖిధ్వజుడు తన సతీమణి అయిన చూడాలను-

ఇలా అడిగేసరికి శిఖిధ్వజమహారాజయిన తనభర్త ఆచూడాల తనకింతటి శోభాతిశయం లభించడానికి (ప్రాప్తించటానికి) పరిచ్ఛిన్నమయిన దేహామునందు ఆత్మబుద్ధిని వదలుటా పరిపూర్ణమయిన బ్రహ్మాత్మభావాన్ని పొందుట కారణమనీ గూఢోక్తితో మొదట జవాబు చెబుతోంది-

౧. చూడాల॥ నాథా ! నేను సర్వ మూఢజన ప్రసిద్ధమయిన శరీరాత్మభావాన్ని విడిచి, తత్త్వబోధచే బ్రహ్మాత్మభావాన్ని పొందాను- అంచేత ఈశోభ నాకు సంప్రాప్తమయింది- ఇంతేకాని మంత్రరసాయనాది సాధనాలచేత కాదు-

౨. అథవా॥ నేను జాగ్రత్స్వప్నములనెడి అవస్థాద్వయమును పొందలేను- "అకించిదాకారం" సుషుప్తియను మూడవ యవస్థనూ పొందలేదు- మరేమన ఈయవస్థాత్రయమును విడిచి తురీయదశను పొందాను- ఆకారణంచేత ఈశోభ సంప్రాప్తమయింది-

3 అథవా॥ నేను కర్మచేకాని ఉపాసనాదులచేకాని ఇంద్ర చంద్రాది హిరణ్యాగర్భాంతపదమును పొందలేదు- అలాగే అవ్యక్త రూపాన్ని పొందలేదు- మరేమనిన ఇది అంతా విడిచి స్వస్వరూపంగానే ఉండిపోయాను- ఆకారణంచేత ఈశోభ కలిగిందినాకు-

౪. అథవా॥ లింగదేహ పరిచ్ఛిన్నమయిన జీవాకారాన్ని విడిచి పరమార్థంలో ఏదీకానట్టియు, వ్యవహారంలో సర్వాకారంగా ఉన్నట్టియు బ్రహ్మను పొందాను-ఆకారణంచేత ఈశోభ సంప్రాప్తమయిందినాకు-

గమనిక॥ ఈ పై నాలుగు రకములయిన భావాలకును ఈక్రింది శ్లోకము ఆధారము-

శ్లో॥ నాకించి త్కించిదాకార మిదం త్యక్త్వా హామాగతా ।
నాకించిత్కించిదాకారం తేనాస్మి శ్రీమతీస్థితా ॥

ఇదే భావాన్ని భంగ్యంతరంతో చెబుతోంది చూడాల మళ్ళీ-

నాథా! పరిచ్ఛిన్నమయిన ఈ సర్వప్రపంచాన్ని విడిచిపెట్టి అపరిచ్ఛిన్నమయిన మరోదాన్ని నేనాశ్రయించాను- అది సత్యమయినది- అసత్యమయినదియు (అనగా, సత్ అంటె మూర్తము, త్యత్ అంటే అమూర్తము- ఈ రెండూ లేనిదని యర్థము)- ఇలాంటి వస్తువును ఆశ్రయించాను- అంచేత ఈశోభ సంప్రాప్తమయింది-

"నకించిత్కించిదాకారం" అను తనమాటకు అర్థాన్ని వేరు విధంగా వర్ణించి చెబుతోంది చూడాల-

యత్కించిత్ యన్నకించిచ్చ తజ్జానామి యథాస్థితమ్ ।
యథోదయం యథానాశం తేనాస్మి శ్రీమతీ స్థితా ॥

నాథా! ఏవస్తువు "యథోదయం, యత్కించిత్" సృష్టిని అతిక్రమించక అనగా సృష్టిదృష్టితో దృశ్యమానమగుచూ, "కించిత్" పరిచ్ఛిన్నమయిందో ఆ వస్తువే "యథానాశం" ప్రలయదృష్టితో చూస్తే "యత్కించిన్నభవతి" ఏదీకాదో అనగా అపరిచ్ఛిన్నమో ఏది కూటస్థభూమానందస్వభావంతో ఉన్నదో అట్టి వస్తువును నేను తెలుసుకున్నాను-

నాథా! నేను భోగాలు అనుభవించకుండగనే తుష్టిచెందుతున్నాను- సుదూరంగా ఉన్నవాటిని అనుభవించినట్లుగా అనుభవించలేదని కోపించను- అనుభవించానని సంతసించను- ఇందుచేతకూడా నాకీ శోభ కలిగింది-

నాథా! నా హృదయం తద్వర్తి అయిన చిదాకాశంలోనే రమిస్తున్నాను- రాజ్యలీలతో రమించను- అంచేత కూడా ఈశోభ నాకు కలిగింది- నేను ఆసనంమీదఉన్నా, యింటిలో ఉన్నా, ఉద్యానవనంలో ఉన్నా, పరిపూర్ణాత్మస్వరూపంలోనే ఉంటానుకాని, శారీరమానసభోగాలయందుకాని, అవిలభించనందువల్ల కలిగెడి లజ్జాదులయందుకాని, నామనస్సు ఏమాత్రం ప్రసరించదు- అంచేతకూడా నాకీ శోభ కలిగింది-

నాథా! నేను పరిచ్ఛిన్నరూపురాలను కాను- జగత్ప్రభువును- అనే భావంతో ఎల్లప్పుడూ ఆత్మయందే సంతసింతును- అంచేతకూడా ఈశోభ కలిగింది నాకు-

నాథా! అధిష్ఠానదృష్టిలో ఈ దేహాదికమంతా నేనే- అధ్యారోప దృష్టిలో ఇదేదీ నేను కాను- సర్వమూ నేనే- ఏదీ నేను కాదు- ఇదీ నాభావం- దీని చేత కూడా నాకీ శోభ కలిగింది-

నాథా! నేను సుఖాన్ని కోరను- అర్థాన్ని కోరను- అనర్థాన్ని కోరను- ఇతరమును దేనిని కోరను- యథాప్రాప్తమయిన దానితో సంతోషిస్తాను- అంచేత నాకీశోభ కలిగింది-

నాథా! నాకు రాగద్వేషాదులను సడలింపజేసే బుద్ధివృత్తులూ శాస్త్రదృష్టులునూ, నాకు చెలికత్తెలు వారితోనే నేను రమిస్తాను- ఇతరులతో క్రీడించను- ఇందు చేతకూడా నాకీశోభ కలిగింది-

ఓ నాథా! ఈ ప్రపంచంలో నేను నేత్రాలతో కాని, ఇతరేంద్రియాలతో కాని, మనస్సుతో కాని, దేనిని తెలిసికొంటున్నానో అది అంతా అనృతమయినదే- అంచేత ఇంద్రియాతీతమై నిష్ప్రపంచమయిన వస్తువును నేను లోలోపల చూచుకొనుచున్నాను- లోపలా వెలుపలా అబాధితరూపమగు వస్తువును నేను గుర్తించాను- అందు చేత నాకు పరమాభ్యుదయమయిన శోభ నాకు ప్రాప్తించింది- అన్నది చూడాల-

ఇట్లు చూడాలాత్మలాభమనెడి ౭౯వ సర్గ సమాప్తము.

## ౮౦. చూడాల భూతపంచక విలాసము.

వసి॥ రామా! ఇలా పరమాత్మస్వరూపంలో విశ్రాంతిచెంది తన శోభాతిశయానికి నిమిత్తాలను వర్ణించి చెబుతున్న చూడాల మాటలకు అర్థం తెలిసికోలేక శిఖిధ్వజుడు నవ్వి ఇలా అన్నాడు ఆమెతో-

శిఖి॥ సుందరీ! నీవు వట్టి అసంబద్ధ ప్రలాపురాల వగుచున్నావు— రాజలీలతో రమించుచున్నావు— రాజపుత్రీ నాతో రమించు—

ప్రత్యక్షసిద్ధమయిన ఆకారాన్ని విడిచిపెట్టి నిరాకారాన్ని పొందినవ్యక్తి శోభిల్లనేరడు— లోకంలో ఆకారానికే శోభ అనేది ప్రసిద్ధమైఉంది— ఆకారసామాన్యాన్ని విడిచి ఎవడు నిరాకారత్వాన్ని పొందాడో వాడు శూన్యప్రాయుడే (లేనివాడే) వాడు శోభించేది ఎలా? మరిన్నీ నీవు "భోగై రభుక్తై స్తుష్టోఽహం" విషయాలను అనుభవించపోయినా నేను సంతోషించుచున్నాను— అని అన్నావు— అదికూడా అసంబద్ధమే— భోగాలు అనుభవించకపోయినా నాకు సంతోషమే అని అనుకొని భోగాలను విడిచిపెట్టేవాడు— కోపంవచ్చి కుర్చీ మంచం వగయిరాలను విరగకొట్టుకొన్న వాడితో సమానుడు— వీడు శోభించేది ఎలా? భోగాభోగాలు అన్నీ విడిచి ఆకాశంలో రమిస్తున్నా నన్నావే నీవు— అంతా విడిచిపెట్టి నీవు ఒక్క తెవే ఉండి ఇంక దేనితో రమిస్తావు—

వసనాసన శయ్యాదులను (గుడ్డ కుర్చీ పడక మున్నగు వాటిని) అన్నీ విడిచి తాను ఒంటరిగా ఉండేవాడు ఇంకా శోభించేదేమిటి?

ఇంకానీవు "ఇదంబాహ మిదం నాహం" అని అన్నావు అదీ అసంబద్ధమే— "నేను దేహంకాదు— దేహంకంటె వేరు నేను— నేను ఏదీకాను— అంతా నేనే" ఈమాటలన్నీ అసంబద్ధప్రలాపాలు— ఇలాంటి వాడు శోభించటంకల్ల—

"పశ్యామి యన్నయన రశ్మిభి రింద్రియైర్వా" నేను నాకండ్లతో చూడటంలేదు— ఇతరేంద్రియాలతో చూడటంలేదు— మనసుతో తెలిసికొనటంలేదు— నాలో నేను దేనినో తెలిసికొంటున్నాను" అని చివరకొకమాట అన్నావు— ఇదిమరీ అసంగతం— కాబట్టి యివియేవీ శోభాహేతువులు కావు—

కనుక నీవు కేవల అజ్ఞానురాలవు- మూఢురాలవు- చపలురాలవు- నేను చిత్రవిచిత్రములయిన విలాసాలాపములతో క్రీడిస్తున్నాను- నీవుకూడా అలాగే క్రీడించు- అని శిఖిధ్వజుడు అట్టహాసంతో నవ్వి ఆమెను పరిహసించి మాధ్యాహ్నిక స్నానానికి ఆమె యింటినుంచి లేచి వెళ్ళాడు-

అబ్బా ఎంతకష్టం- "నచేదిహావేదీన్మహతీవినష్టిః" అన్నట్లు నాభర్తకు ఆత్మజ్ఞానం కలగలేదు- నామాటలకు అర్థం బోధపడలేదు- అతనికి- అని చాలా ఖేదపడింది చూడాల- తనపనులు తాను నెరవేర్చు (చూచు) కుంటూ ఉంది-

రామా! ఇలా వాళ్ళిద్దరూ చెరిమొక అభిప్రాయంలో పడ్డారు- రాజవిలాసాలతో చాలకాలం గడిచింది వాళ్ళిద్దరికి- ఇలా ఉండగా ఒకానొకపుడు నిత్యతృప్తురాలై దేనిమీద కోరికలేని (నిరిచ్ఛాయాః) ఆ చూడాలకు ఆకాశంమీద దేవతవలె విలాసగా తిరగాలని కోరిక కలిగింది ప్రారబ్ధ కర్మశేష బలంవల్ల- శిఖిధ్వజుడు (రాజు) శత్రుజయం కొరకు రెండుమూడు సంవత్సరాలు దేశాంతరానికి వెళ్ళిపోయాడు- ఆసమయంలో చూడాల (రాచకన్యక) తనకోరిక తీర్చుకోదలచింది- సమస్త భోగాలు తృణీకరించింది- విసర్జించింది- నిర్జనప్రదేశం చేరింది- ఆసనబంధంవేసి కూర్చుంది- ఖేచరసిద్ధికి అనుకూలపడునట్లు ప్రాణవాయువును, భ్రూమధ్యాదిదేశంలో నిరోధించటం అభ్యసించింది- అన్నారు వసిష్ఠులు-

విన్నాడు రాముడు వసిష్ఠుడు చేసిన ప్రసంగాన్ని అందులో ఖేచరసిద్ధికి ప్రయోజకమయిన ప్రాణవాయునిరోధమనే ప్రసంగం ఒకటి వచ్చింది- దానిమీద ఇతనికి సందేహం కలిగింది క్రియాసామాన్యానికి (అన్నిపనులకు) కారణమేమిటా! అని తెలిసికోదలచాడు- ఇలా అడిగాడు గురువుగారిని-

శ్రీరా॥ గురువర్యా! స్థావరజంగమాత్మకమయిన ప్రపంచం అంతా ఒకానొక క్రియవల్ల పుట్టుతున్నట్లు కనిపిస్తోంది- కర్త్రాదికారకములచలనం (స్పందం) లేనిదే ఏవస్తువూ పుట్టడంలేదు- ఇలాఉండగా క్రియఅనే పేరుగల స్పందానికి ఉత్పత్తి ఎలా? సక్రియంవల్ల క్రియ (స్పందం) పుట్టుచున్నదా! లేక కూటస్థునివల్ల పుట్టుచున్నదా? ఇందు మొదటిపక్షం అవలంబిస్తే ఆత్మాశ్రయముకాని, అనవస్థకాని, రెండు దోషాలు ప్రాప్తిస్తాయి- రెండవపక్షమవలంబిస్తే వ్యాఘాతమను దోషమేర్పడుతుంది- ఫలానవస్థయు తటస్థించును- (నిర్వికారకూటస్థునినుంచి క్రియపుట్టె యడల ఎప్పుడు పుట్టుచునే ఉండవలెను క్రియ) కాబట్టి క్రియ అనే వస్తువుయొక్క ఉత్పత్తి ఎలా? ఆత్మజ్ఞుడుకాని అనాత్మజ్ఞుడుకాని కోరికతోనో, విలాసగానో ఏదోఒకపని (క్రియ) చేస్తూనే ఉన్నాడు- అది ఎలా నెరవేరుతోందో వివరించిచెప్పుమని అడిగాడు శ్రీరాముడు-

వసిష్ఠుడు ఇలా జవాబు చెబుతాడు-

రామచంద్రా! క్రియాస్వరూపమాత్రము సిద్ధించడానికి కారకాపేక్ష అని అంగీకరించే యడల ఆత్మాశ్రయమో, అనవస్థయో, లేక ఈ రెండునో దోషాలు సంభవించవచ్చు- అలా అంగీకరించుటలేదు- మరేమనగ? క్రియాసాధ్యమయిన ఫలము నెరవేరుటకు కారకాపేక్ష అని అంగీకరించుచున్నారు- ఫలనిష్పత్తికొరకు ప్రవర్తించిన కారకములు నాంతరీయకముగ క్రియను అవలంబించుచున్నవి- ఆక్రియచే ఫలమునకు సాధ్యత కారకములకు సాధనతయు చెప్పుటకు వీలుపడుచున్నది- కాబట్టి సాధ్యసాధనోభయ విలక్షణమయిన క్రియ సాధ్యాపేక్షిత సాధనములకంటె సాధనాంతరమును అపేక్షించుటలేదు- కనుక ఆ క్రియయందు సక్రియము కారణమా? కూటస్థము కారణమా? అను వికల్పమే నిరవకాశమయినది- ఇట్టి వికల్పమునకే (ప్రశ్నకే) తావు లేదని భావము- అని జవాబు చెప్పదలచి వసిష్ఠుడు ముందు క్రియాసాధ్యమయిన ఫలము, గౌణము, ముఖ్యము, సాధారణము అని మూడువిధములుగ విభజించి చూపుచున్నాడు-

రామా! క్రియాసాధ్యమయిన ఫలము ఉపాదేయమూ, హేయమూ, ఉపేక్ష్యమూ, అని మూడువిధములు- తనకు అనుకూలమయిన ఫలము ఉపాదేయము-ఇది ప్రయత్నపూర్వకముగ సాధించబడుచున్నది- హేయమయిన ఫలము తనకు అననుకూలమయినది- అయ్యది తెలిసికొని విడిచిపెట్టబడుచున్నది- ఉపేక్షము ఈ రెంటికి మధ్యనుండునది- ఈయది ఉపేక్షాబుద్ధి గమ్యమయినది- ఔదాసీన్యమునందుగూడ ఔపచారికముగ క్రియ" అని వ్యవహరించుట కద్దు- "ఉపేక్షించుటచే నాకీయనర్థం సంభవించిందని" లోకంలో వ్యవహారం కూడకద్దు-

సాక్షాత్తుగాకాని, పరంపరగాకాని, సుఖానుకూలమయినది ఉపాదేయము- 2. తద్విరుద్ధమయినది అనాదేయము-(హేయము) ఆ రెంటికి మధ్యమము ఉపేక్షము-

రామా! జ్ఞానికి సర్వమూ ఆత్మమయమే కావున పైనమూడు పక్షములు అతనికి అన్వయించవు- అజ్ఞానులకే యివి అన్వయించును- ఒక్క- మూడవపక్షము (ఉపేక్షాపక్షము) ఆత్మజ్ఞానికి చెప్పినను దోషములేదు- ఒకేవస్తువు ఒకేపురుషునకు, బోధ, రాగ, వైరాగ్యములనే అవస్థాభేదముచే త్రివిధమగుచున్నది- (అనగా హేయము ఉపాదేయము, ఉపేక్ష్యము అగుచున్నది-)

చూడు ఒకేవస్తువు జ్ఞానికి ఉపేక్షాత్మకము మూఢునకు ఉపాదేయము- అదేదృఢమయిన విరాగం కలవానికి హేయము-

ఇక ఫలసిద్ధిక్రమం చెబుతావిను-

రామచంద్రా! సిద్ధులన్నీ దేశ, కాల, క్రియా, ద్రవ్యములు సాధనములుగాగలవి- ఇవి జీవుని ఆహ్లాదపరచుచున్నవి- ఈనాల్గింటిలో క్రియఅనే సాధనము ప్రధానము- ఎలాగంటే, దేశకాలాది నాలుగు సాధనములలో శ్రీశైలాద్యుత్తమదేశాది చతుష్టయంకలిసివస్తే (చేకూరితే) శీఘ్రంగా సిద్ధిలభిస్తుంది- అంచేత అలాంటిచోట అనుష్ఠింపబడిన

యోగ మంత్ర జపాది క్రియ ఇతర దేశాదులందు అనుష్ఠించిన క్రియ కంటె గొప్పది— దానినిబట్టి ఫలంలోకూడ ఉత్కర్ష ఏర్పడుతుంది— ఫలోత్కర్షలు క్రియయొక్క ఉత్కర్షనుబట్టే ఉంటవి—

పోతే ఇంక ఆకాశగమనాది సాధనములు, సిద్ధగుటిక, సిద్ధాంజన, సిద్ధఖడ్గ, సిద్ధపాదుకాదులుగూడ ఉడ్డామర తంత్ర యోగినీ కల్పము మున్నగు అతివిస్తృతములయిన బహుగ్రంథములందు ప్రసిద్ధములై ఉన్నాయి—

“కథం సంసాధయం త్యే తద్యథా వద్వదమే ప్రభో” అను నీ ప్రశ్నకు ఆక్రియాక్రమనిరూపము చేయవలె నన్నచో అప్పుడు అద్దానిని సంక్షేపముగా చెప్పేయడల నీ ప్రశ్నకు సమాధానం పూర్తిగారాదు— అందుచేత విస్తృతంగా చెప్పాలి—

కావున ఆసిద్ధులవిషయంలో త్వదతిరిక్త శ్రోతలయిన అతత్త్వవేత్తలకు దైవికంగా అభిలాషకలిగేయడల వాళ్ళకు అందులో ప్రవృత్తి కలుగుతుంది కాన మహాదోషము సంప్రాప్తమవుతుంది వాళ్ళకు— ఆత్మతత్త్వమును శ్రవణము చేయగోరిన నీకు ఆవిషయమంతా విస్తరించి చెప్పడం ప్రకృతార్థానికి విఘాతకమగును— కనుక దానిని యిచట నిరూపించుట ఉచితముకాదు— మణిమంత్రాది సాధ్యమయిన ఫలసిద్ధి క్రమాన్ని నిరూపించడంలో కూడా ఇదేదోషం సంభవిస్తుంది— శ్రీశైలాది సిద్ధదేశ నివాససాధ్యమయిన సిద్ధిక్రమాన్ని నిరూపించటంలో ఈదోషాన్ని యోజన చేసికోవలెను—

కాబట్టి ఆవిషయమంతా నీకు నేను చెప్పడం అంతసమంజసం కాదు— నీమనస్సు అది వినంగానే ఆసిద్ధులలో ప్రవేశిస్తుంది— మోక్షమార్గం అడుగంటుతుంది— కాబట్టి అది వదలి వేశివేయి— ఇంతమాత్రం చేత నీప్రశ్న వ్యర్థమైందే అని దుఃఖించకు— నీ ప్రస్తుతజ్ఞానానికి ఉపయోగించేది ఆశిఖధ్వజుని కథా ప్రసంగంలో పతితమయింది ఒకటి ఉన్నది—

అది యిప్పుడు నేనునీకు చెప్పుచున్న కథకు సంబంధించి ఉంటుంది- అది కూడా అంత విస్తరించి చెప్పను- టూకీగా చెబుతాను- అదేమిటంటే ప్రాణాదివాయు నిరోధక్రమం-ఇదికూడా సిద్ధికిహేతువే-ప్రాణాదివాయు నిరోధానికి యమ నియమ ఆసనములు ముఖ్యములు- వీటిక్రమం తెలుసుకోముందు- మనస్సులోఉన్న సాధ్యార్థవాసనలూ, సాధనార్థ వాసనలూ విడిచిపెట్టాలి- సిద్ధాసనము, కుక్కుటాసనము, పద్మాసనము, మున్నగువాటిని నేర్చుకోవలెను- కాయ శిరోగ్రీవములను సమంగా నిలపటం అలవరచుకోవలెను- శరీరం నిశ్చలంగా ఉంచి నాసాగ్రాన్ని నిశ్చలంగా చూస్తూ ఉండవలెను- ఇదంతా యోగశాస్త్రంలో చెప్పి ఉంది- ఆ క్రియాకలాపం అంతా పాటించాలి- లేకపోతే ప్రాణవాయువు నిరుద్ధం కానేరదు-

భోజనశుద్ధి ఉండాలి- అనగా సాత్వికాహారం భుజించాలి- ఆసనశుద్ధి అవసరం- యోగశాస్త్రంలో చెప్పిన విషయాన్ని చక్కగా పరిశీలించాలి- తన కులోచిత సదాచారంతో మెలగాలి- సజ్జనసాంగత్యాన్ని అభివృద్ధి పరచుకోవాలి- వైరాగ్యాన్ని క్రమంగా బలపరచుకోవాలి- సుఖకరమయిన ఆసనాన్ని అభ్యసించాలి- ప్రాణాయామమును గట్టిగా అభ్యసించవలెను- భోగవాసనలను పరిత్యజించవలెను- రామచంద్రా! ఇలా ఉండగా కొంతకాలానికి కోపలోభాదులు సడలిపోతాయి- భోగవాంఛ నశిస్తుంది- అపుడు రేచక పూరక కుంభకములు బాగావిధేయములు (స్వాధీనములు) అవుతాయి- ఎప్పుడు ప్రాణములు ఇలా స్వాధీనములయినాయో రాజుకు భృత్యులు స్వాధీనమయినట్లు- అప్పుడు తత్సంబంధములయిన సిద్ధులుకూడా తప్పక స్వాధీనములగును- రామచంద్రా రాజ్యము మొదలు మోక్షపర్యంతము ఉండు సిద్ధులన్నీ (సంపదలన్నీ) కరతలామలకములవుతాయి శరీరంలోని ప్రాణవాయువు స్వాధీనం అయ్యేసరికి-

గమనిక॥ సర్వసిద్ధులూ ప్రాణవాయువునకు స్వాధీనములని తాను చెప్పినదానిని ఉపపాధించుటకుగాను దేహమంతట ప్రసరించియున్న

డెబ్బదిరెండువేల శాఖలుగల ప్రధాననాడీశతమును (నూరు ప్రధాన నాడులను) ఆశ్రయించి యున్నట్టియు మూలాధారము మొదలుకొని బ్రహ్మరంధ్రపర్యంతమునందు ఏడుచక్రములను చొచ్చి బయలుదేరి నట్టియు, మూలాధారమునందు మూడున్నరచుట్లు చుట్టుకొని లోపల నిద్రించియున్న కుండలినీ శక్తిగర్భితమయియున్న సుషుమ్నానాడిని వర్ణించి చెప్పుచున్నారు వసిష్ఠులు-

రామచంద్రా! దేహమంతటా ప్రసరించియున్న అనేకవేల చిల్లర నాడులచే చుట్టుకొనబడినట్టియు మర్మస్థానమగు మూలాధారమును ఆశ్రయించియున్నట్టియు "ఆంత్రవేష్టనిక" (నరములు కూడ నాడులచే చుట్టుటవలన) అనుపేరు వహించి యున్నట్టియూ, ప్రధానమయిన నూరు నాడులను ఆశ్రయించియున్నట్టియు, నీటిసుడితో సమానాకారము గలిగినట్టియూ, వ్రాతలో ఓంకారముయొక్క ఉత్తరార్థముతో సమానాకారమయినట్టియూ, గుండ్రముగాచుట్టుకొనియున్న సుషుమ్న అనే ఒకానొకనాడికద్దు- ఇది ఒక్కమనుష్యులయందు మాత్రమే ఉండదు- నిఖిలప్రాణిశరీరములందునూ ఉండును- చలిబాధను తప్పించుకొనుటకు గుండ్రముగా చుట్టచుట్టుకొని పరుండి నిద్రించుచున్న సర్పముయొక్క శరీరమువలె నుండును- తెల్లగనుండును- ప్రళయకాలాగ్నికి పగిలిన చంద్రమండలమువలె నుండును- గుదస్థానము(మూలాధారము) మొదలుకొని భ్రూమధ్యపర్యంతమునందు రంధ్రములనన్నిటిని స్పృశించుచూ, వాటియందు అనుస్యూతమయి యుండును- లోపల మనోవృత్తులచే చంచలమయి బయట ప్రాణాదివాయువుచే చంచలమయి యుండును అది- దానిలోపల వీణయొక్క తీగ (నరము) వలె పరమ సూక్ష్మమయి సర్వశబ్దములకు మూలభూతమై ఉన్నది పరాశక్తి- అయ్యది ప్రాణవాయువుయొక్క సంబంధంవల్ల నాభి, హృదయ, కంఠ దేశములయందు ఉత్తరోత్తరముగ వ్యక్తమగుచూ పశ్యంతి, మధ్యమ, వైఖరీ, అను భేదములను పొందును- చూడు ప్రమాణభూత శ్లోకమును మంత్రశాస్త్రమునందు-

శ్లో॥ చైతన్యం సర్వభూతానాం శబ్దబ్రహ్మేతి యద్విదుః ।
తత్ప్రాప్య కుండలీరూపం ప్రాణినాం దేహమధ్యగమ్ ॥
వర్ణాత్మనావిర్భవతి గద్యపద్యాది భేదతం ॥ అని

సాంబునిచేగూడ నిట్లు చెప్పబడినది-

శ్లో॥ యా సావిత్రావరుణసదనా దుచ్చరంతీ త్రిషష్టిం
వర్ణానత్ర ప్రకటకరణైః ప్రాణసంగా త్ప్రసూతే ।
తాం పశ్యంతీం ప్రథమముదితాం మధ్యమాం బుద్ధిసంస్థాం
వాచం వక్త్రే కరణవిశదాం వైఖరీంచ ప్రపద్యే ॥ అని

1. కుండలాకారంగా ఉన్న ఈకుండలినీ శక్తి ప్రాణేంద్రియ బుద్ధ్యాది శక్తులకు కూడ సత్తా స్ఫూర్తి ప్రవృత్తుల నిర్వహింపజేసేది- వాటికి బలమునిచ్చేడిది- ఆకుండలినీ శక్తి తన ముఖమునుంచి ప్రాణమును పైకి ప్రేరేపణ చేస్తుంది- అపానమును క్రిందికి లాగుతుంది- ఇలా ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు సహాయపడుతుంది-

2. హృదయమందున్న ప్రాణవాయువు కుండలినిచే ఆకర్షింపబడిన దగుచూ ఎప్పుడు అపానవృత్తితో కుండలినీ పదాన్ని (స్థానాన్ని) పొందుచున్నదో అప్పుడు అంతఃకరణావచ్ఛిన్నమయిన జీవచైతన్యము స్మృతి, సంకల్ప, అధ్యవసాయ, అభిమాన, రాగాది వృత్తి భేదములతో లోపల ఉత్పన్న మవుతుంది-

3. ఇలా ప్రాణబుద్ధులకు జ్ఞానక్రియాశక్తులను యిచ్చిన ఆకుండలినీశక్తి శరీరమునందు విషయసన్నికర్ష గల చక్షురాదీంద్రియములకు స్వాధీన మయినదగుచూ (సహాయపడినదగుచూ) ఎట్లెట్లు ఎలాంటి భోజకాదృష్టసామగ్రీ వైచిత్ర్యముచే ప్రకాశిస్తూ ఉంటుందో అలా అలా ఆయా యింద్రియములచేత అర్థవిశేషస్ఫూర్తి తత్తత్ఫలోపభోగలక్షణమయిన సంవిత్తు (జ్ఞానము) ఉదయించును- (పుట్టును)

రామా ! దీనిని కొంచెం వివరించి చెబుతా విను–

కుండలిని వేగంగా అలా స్ఫురిస్తుంది– ఎలా స్ఫురిస్తే వ్యాపకమయిన చక్షురాదులకు విషయస్పర్శ మొదట కలుగుతుందో అలా– అప్పుడు ఆ యింద్రియవృత్తి ద్వారా బహిర్నిర్గతుడయిన ప్రమాతకు బాహ్యవిషయములతో కూడా అన్యోన్యాలింగన రూపమయిన వృత్తి వ్యాప్తి ప్రయుక్తమయిన వ్యాప్తి కలుగుతుంది– దానిచే విషయావరణము భంగము కాగా స్పష్టముగా ఘటాదిప్రథ (జ్ఞానము) కలుగుతుంది– ఇదే ప్రకారం ఇతరేంద్రియములకుకూడా– ఇలా ఇంద్రియములకు కుండలిని సహాయపడును–

హృదయాకోశము నందున్న నాడులన్నీ ఈ కుండలినియందు సంబద్ధములయి యున్నవి– మహార్ణవమునందు నదులవలె దీనినుంచి ఇతరేంద్రియవృత్తులన్నీ పుట్టుతూ ఉండును– కాబట్టి మూలాధారమందున్న కుండలినీ శక్తి చక్షురాదీంద్రియములను ప్రవర్తింప చేయుటంలో నాడులు ద్వారభూతములు–

ప్రాణవాయురూపంతో పైకి పోవుటకునూ, అపానవాయు రూపంతో క్రిందికి పోవుటకునూ, ఉత్సుకమయిన ఆకుండలినీ శక్తి సకలేంద్రియక జ్ఞానములకు బీజమై (మూలమై) "సామాన్య" అదొక్కటియే సర్వసాధారణమగుచున్నది–

గమనిక॥ ఇచట ప్రయోగవైచిత్ర్యము గమనింపతగినది–
మూలమున– "సామాన్యదాహృతా" అని కలదు–

సమానశబ్దముకంటె భావార్థమునందుగాని, స్వార్థమునందుగాని ష్యఞ్ ప్రత్యయమును జేసికొని ఆపైన జీన్ చేసి "హలస్తద్ధితస్య" అను సూత్రమువలన యలోపముచేయగా "సామానీ" అని యగునని ఉపపాదించిరి– కాని లోకసాధారణమగు ప్రయోగముకాదు– సాధించినందున అసాధువును కానేరదు– ఇక ప్రయోగవిశేషమని యంగీకరింపనగును– అని అన్నారు వసిష్ఠులు–

శ్రీరామచంద్రుడు విని సందేహించి ఇలా అడిగాడు-

శ్రీరా॥ మునీంద్రా! దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితమయిన చైతన్యము నాభిమూలమయిన మూలాధారమునందు కుండలినీ అనే పేరుగల శక్తి యందెట్లో పుట్టుటకు కారణమేమి? అని అడిగాడు- వసిష్ఠులు సమాధానం చెబుతారు-

వసి॥ రామచంద్రా! చైతన్యము నిరాకారము- నిర్విషయము- ఈమాట నేనంగీకరిస్తాను- అయినా అట్టి చైతన్యము జీవాకారముతోనూ, ఘటాదిగోచరముగునట్లుగానూ, స్థూలసూక్ష్మ దేహద్వయాకారముగ పరిణమించిన భూతములను అపేక్షించియే విశేషాకారముగ అభివ్యక్తమగుచున్నది- అని చెప్పుచున్నారు-

రామా! చైతన్యము సర్వాత్మ, సర్వదా, సర్వాత్మకంగా ఉన్నమాట సత్యం- అట్టి సంవిత్తుకూడ భూతతన్మాత్రలవశమున ఒకానొకచోట పుట్టుచున్నది-

అంతటా చైతన్యము సమానంగా ఉన్నా మనుష్యాది శరీరములందే బాగా అభివ్యక్తమవుతోంది- సూర్యాతపం అంతటా ఉన్నా భిత్త్యాదులందే విజృంభించుచున్నది- మిగిలినతావుల అలా విజృంభించడంలేదు-

ఆ ఉపాధులందు కూడా ఉపాధియొక్క మాలిన్య తారతమ్యమును బట్టియే చైతన్యమునకు అభివ్యక్తి తారతమ్యము కనిపిస్తోంది- చూడు-

మృచ్ఛిలాగులందు ఆచిద్వస్తువు అవిద్యాజాడ్యంచేత అభిభూతమయింది- అందుచేత బాగా కాగినవేడినీళ్ళలో శైత్యము (చల్లదనము) వలె కనిపించడంలేదు- (నష్టమయింది-) దేవమనుష్యాది లింగదేహమునందు స్పష్టముగా అభివ్యక్తమయింది- వృక్షాది లింగదేహములందు (చెట్లు మొదలగు వాటియొక్క లింగశరీరములందు) (ఉచ్ఛన్నతను)

అనగా బయటికి స్పష్టముగా తెలిసికొనుటకు వీలు కాకుండా ఉంది- చిదంశంలోనే ఈ తారతమ్యంకాని, సత్తాంశంలో ఈ తారతమ్యం లేదు- సత్తాంశమాత్రం సర్వత్ర సమానమే- మృచ్ఛిలాది వస్తువులందు, దేవ మనుష్యాది లింగదేహములందు వృక్షాదిలింగ దేహములందునూ యీ మూడు ఉపాధులందునూ చైతన్యాభివ్యక్తికి తారతమ్యం ఉన్నా, సత్తాంశలో మాత్రం తారతమ్యం లేదు- ఈ విషయం ఇంకా వివరించి చెబుతా మరో మాట విను-

మనుష్యాది ఉత్తమ దేహములందునూ, పశుస్థావరాది నీచశరీరములందునూ, సంవిత్తు (చైతన్యము) సమానము- చేతనాచేతనాత్మకమయిన భూతజాతం అంతా చిన్మాత్రం- సన్మాత్రమున్నూ- ఆచిత్తు ఆకాశము వలె అసంగము సూక్ష్మము- విభువును- ఆ చైతన్యము దాని రూపంతో అది ఉండియుండగా దానియందు మాయచే నిరవయవమయిన దానికి అవయవ రూపమయిన ఏకదేశమును కల్పించి అందు ఆకాశాది భూతసూక్ష్మములన్నీ క్రమంగా అధ్యారోపింపబడ్డాయి- అందు వలన ఆ చైతన్యము భూతమాత్రాత్మక మయింది-

ఆ పైన ఆ తన్మాత్రపంచకము ప్రాణమనీ, మనోబుద్ధులనీ, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ పంచకమనీ, తయారయి లింగశరీరమే అందులో చైతన్యం ప్రతిబింబరూపంగా ప్రవేశించి, జన్మాదివికారాలతోటి, జాగ్రదాద్యవస్థా భేదంతోటి, జీవభావాన్ని చెంది, అనేక విధముల గుర్తింపబడుతోంది- వ్యవహరింపబడుతోంది-

లింగశరీరము తయారు చేయగా మిగిలిన భూతపంచకములు కొన్ని జీవుని యొక్క- దేవమనుష్యాద్యాకార వాసనలను అనుసరించిన సంకల్పలేశంచేత స్వసత్తామాత్రంచేతనే పంచీకరణద్వారా స్థూలదేహత్వాన్ని పొందుచున్నవి- ఇలాగే మరికొన్ని భూతపంచకములు తిర్యగాది దేహరూపమునూ, మరికొన్ని సువర్ణ రజతరూపమునూ, నిఖిల బ్రహ్మాండరూపమునూ, బ్రహ్మాండాంతర్గతమయిన భువనరూపమును

ధరించుచున్నవి- ఇలా ప్రపంచం అంతా భూతపంచకాత్మకమని నిర్ణీత మగుచున్నది- రామా! ఇందు అంతటా చిత్సంవిత్ నిండి నిబిడీకృతమై ఉంది-

అధిష్ఠాన చైతన్యం అంతటా ఉన్నట్లయితే ఘటపటాదులుకూడా చేతనములని ఏల వ్యవహరింపబడవు? అని నీవు అడుగవచ్చు- అది ఒక ప్రశ్న కాదు-

భూతపంచకవశమునుండియే (అనగా చైతన్యాభివ్యంజకమయిన ప్రాణాదిపంచకంతో కూడిన లింగదేహము యొక్క ప్రాధాన్యమును బట్టియే మనుష్యదేహములందు చేతనమనే పేరు ఆఖ్యమయింది- తిర్యగాదులందు లింగస్థూలదేహములకు సమప్రాధాన్యముండుటను బట్టి జడచేతనమను పేరు- ఇక స్థావరాదులందు లింగదేహము అంతఃసంవేదనమాత్రమగుటచే బయటిజనులచే వాటి యందలి చేతనత్వము తెలియబడనందున అవి (స్థావరాదులు) జడములని ప్రసిద్ధములయినవి-

ఈ మూడు ఉపాధులందూ చైతన్యము ఎట్టి తారతమ్యముతో నున్నదీ దృష్టాంతపూర్వకముగ చెబుతాను విను- పగట విలీనమయియున్న ఘృతసముద్రము సాయంకాలమున చల్లగాలియొక్క సంపర్కమువలన ఒడ్డున క్రమంగా ఘనీభావం చెందుటవలన నిశ్చలంగా ఉంటూ ద్రవ ప్రదేశంలో తరంగమువలె చలిస్తుంది- కొద్దిగా ఘనీభావం చెందిన చోట కొద్దిగ చలిస్తుంది- మిక్కిలి ఘనీభావం చెందినచోట మెరక భూమివలె (స్థలమువలె) నిశ్చలంగా ఉంటుంది- అలాగే ఈ చైతన్యం కూడా నరతిర్యక్స్థావర దేహరూపములయిన భూతపంచకములందు చలనరూపంగానూ, ఈషచ్చలనరూపంగానూ, కేవలజడరూపంగానూ యథాక్రమంగా ఉంటుంది-

ఒకానొకచోట ఘనీభావం ఎక్కువగా ఉండటంచేత చలనం లేకపోయినా అంతమాత్రంచే అబ్ధిత్వమునకు భంగంలేదు- అలాగే స్థావరాద్యుపాధులందుకూడా అభివ్యక్తి లేకపోయినా చిద్రూపత్వానికి క్షతిలేదు- భూతపంచకమునందు స్వభావతః ఇలాంటివికల్పాలు అనేకం

కనుపడుచున్నవి- ద్వ్యదేహాద్యాకారముగ పరిణమించిన భూతతన్మాత్ర పంచకము ప్రాణధారణాధీనమయిన స్పందమూ (చలనమూ) (క్రియా శక్తి) చైతన్యమూ, అను రెంటిచే చేతనుడయిన జీవుడయినది- ఒకానొక భూతపంచకము జడరూపముగు శైలాదికమయినది- స్థావరాది శరీరమయితే బాహ్యానిలాధీనమయిన స్పందము కలదియై (అంతశ్చేతనం) లోపల చైతన్యముకలది, (అనభివ్యక్త చైతన్యముకలది) అయినది- ఇలా వ్యవస్థితమయిన వికల్పములు బహుళముగ కనిపించు చున్నవి.

శ్రీరాముడు॥ స్వామీ! ఈ వికల్పములన్నీ స్వభావవశంచేత ఏర్పడినవని తమరు తెలవిస్తురే- స్వభావమువల్ల ఇన్ని వికల్పాలు ఎలా బయలుదేరుతాయి? స్వభావమనగా "స్వః స్వాత్మకో భావః స్వభావః" అని వ్యుత్పత్తి- స్వరూపమనేది ఒకేవిధంగా ఉంటుందికాని భిన్నభిన్నవిధంగా ఉండదు- ఇలాంటి స్వభావంవల్ల విరుద్ధములయిన వికల్పాలు అనేకం బయలుదేరడం అసంభవం- విరోధమనునది పరసాపేక్షము- స్వభావము అనన్యాపేక్షము- ఇక "స్వీయోభావః స్వభావః" అని చెప్పేయడల అప్పుడుకూడ అలాంటి స్వభావముకూడ స్వమాత్రసాపేక్షముగును కాని పరసాపేక్షము కానేరదు- కాబట్టి పరసాపేక్షమయిన వికల్పమునకు స్వరూపం నిమిత్తమయినా ఎలా అవుతుంది-

వసి॥ రామా! నీకు ఇలాంటి అభిప్రాయమే ఉంటే స్వభావ వాదాన్ని విడిచిపెట్టి వాక్కులను (మాటలను) అడుగు- అనగా వాక్కులే శీతోష్ణాది శబ్దరూపములయినవి- అయ్యావిపునరుక్తతకొరకు స్వార్థమును (తమయర్థమును) మార్పుచూ చైతన్యము, జాడ్యము అను విరుద్ధధర్మములను పొందించుచున్నవి పదార్థములకు- సర్వము చైతన్యాత్మకమయినపుడు శీతోష్ణాదిధర్మపరములయిన మాటలూ (వాక్కులూ) హిమ, అగ్న్యాది ధర్మిపరములయిన మాటలు ఎక్కడివి? అని-

అథవా వాక్కు దూషింపరాదు- వాక్కుకూడ వాసనాకల్పితములయిన వికల్పములుగల భూతపంచకార్థమును అనువదించుచున్నది- కాన వాక్కు వాసనాధీనమయియున్నది- కాబట్టి వాసనాంశములను ఆధారపరచుకొని ఆయా విరుద్ధవికల్పభావంతో వికారమును చెందియున్న లింగశరీరాత్మకములయిన భూతపంచక తన్మాత్రల స్థితులే దూషింపదగినవి- (పర్యనుయోజ్యములు)-

లేక వాటికైనను (ఆ పంచక తన్మాత్రలయొక్క) అపరాధం ఏమీలేదు- అవికూడా పూర్వాపూర్వ విరుద్ధ వికల్ప సహస్ర వాసనానుసారులు- కనుక తెలివిగలవాడెవడయినా విరుద్ధవికల్పములకు మూలమును అన్వేషింపవలచే యెడల అటువంటి విరుద్ధవికల్పసహస్రములందు చిత్తమును త్రిప్పుటకు విస్తృతములై విక్షిప్తములయియున్న వాసనలే దూషింపతగినవి కాని స్వభావాదులు కావు-

పురుషుని తిర్యక్స్థావరాది భావంలో కాని, శుభమయిన దేవాది భావంలో కాని పెట్టటానికి భూతపంచకము ప్రబుద్ధవాసనాత్మకముగాను, సంసుప్తవాసనాత్మకముగను నిరీక్షిస్తూ ఉంటుంది- కాబట్టి వాసనయే ఈవిరుద్ధవికల్పాలకు హేతువు- కనుక అదియే పర్యనుయోజ్యము-

వాసనా పర్యనుయోగము (వాసననుగురించిన ప్రశ్న) వాసనాక్షయోపాయమునందు ప్రవర్తింపజేయును గాన సఫలమగును- స్వభావాది పర్యనుయోగమువల్ల ఏమీఫలంలేదు- ఆకాశాన్ని పిడికెళ్ళతో పీకిపారవేయవలె నంటె పొసగదు- ఆ ప్రయత్నం వ్యర్థమవుతుంది-

కనుకనే వాసనాక్షయంకలిగితే పూర్ణాత్మలాభం కలుగుతుంది కనుక స్వర్ణరాసులుకూడ గడ్డిపోచలవలె తుచ్ఛములుగా భాసించును- దేవాదిభోగశాలి దేహములుకూడ కీటాదులవలె తుచ్ఛతరములగును-

కనుక రామా! స్థావరజాతులన్నీ ప్రసుప్త వాసనా విశిష్టములు- నరసురాదులు ప్రబుద్ధ వాసనా విశిష్టములు- తిర్యగాదులు "సవాసనా

"విలములు" మలినవాసనలుగల చిత్తంతోకూడినవి- మోక్షగాములు వాసనా త్యాగంచేసినవారు-

దేవనరాదిరూపమయిన భూతపంచకరాశి వాసనావైచిత్ర్యమును బట్టియే ఆకాశగమనము, భూమిగమనము మున్నగు విచిత్రవ్యవహారము నకు తగిన హస్తపాదాదులుగల దగుచున్నది-

వాసనావిశేషంచేత కల్పించబడిన కర్మేంద్రియములతో గూడిన దేవనరాదిపంచకరాశులతో తమతమ సంవిత్తుల (చైతన్యముల) యందే మనుష్య వ్యవహారమునకు తగిన మనస్సూ, బుద్ధీ, అహంకారమూ, చిత్తమూ, చక్షుస్సూ, శ్రోత్రమూ, ఘ్రాణమూ, రసనమూ, త్వక్కూ, అంతరింద్రియ బాహ్యేంద్రియ రూపములయిన సంకేతములు (నామధేయములు) చేయబడినది- ఇందుకనే అయ్యవి ప్రతిప్రాణియందునూ విచిత్ర స్వభావముగలవిగ చూడబడుచున్నవి-

అలాగే పశ్వాదులకు నాలుగుకాళ్లూ రెండుకొమ్ములూ, తోకయూ, పక్షులకు చంచువు (ముక్కు) (మూతి) రెండు రెక్కలు, పుచ్ఛము, రెండుపాదములూ, సర్పములకు పడగ, తోకయు, కృమికీటాదులకూ, దంశమశకాదులకూ, వాటి అవయవ విశేషములున్నూ, తమతమ వాసనలకు అనుకూలమయిన వ్యవహారమునకు తగిన అవయవాదులు వాసనావైచిత్ర్యము వలననే కల్పించబడినవి- ఇలా స్థావరాదులకు వాటివాటి అవయవసామగ్రి జన్మాంతర వాసనా వైచిత్ర్యమునుబట్టియే ఏర్పడినది-

రామచంద్రా! ఇలా ఆద్యంతమధ్యములందు చలములూ, జడములుగానూ, అధిష్ఠానస్వరూపంతో, అచలములూ, అజడములుగానూ, భూతపంచకరాశులే చిత్రవిచిత్రములుగ స్ఫురించుచున్నవి-

గమనిక॥ భూతతన్మాత్ర పంచకమను పేరుగల అనంతములయిన లింగశరీరభేదములను వర్ణించి అందులో ఒకానొకటయినట్టియు కర్మో

వాసనా సముచ్చయానుష్ఠానఫలసమష్టి అహంభావమును పొందిన లింగ శరీరము (సమష్టిలింగశరీరమయిన హిరణ్యగర్భుని యొక్క) సంకల్ప ప్రమాణువు ఈసంసార వృక్షవృత్తిమునకు బీజమని చెప్పబోవుచున్నారు వసిష్ఠులు—

వసి॥ రామచంద్రా! ఈలింగశరీరములలో ఒకానొక సమష్టి లింగశరీరముయొక్క సంకల్పము సంసారవృక్షములకు బీజము— ఇంద్రియములు పుష్పములు— విషయాలు పరిమళం— కోరికలు తుమ్మెదలు— క్రియలు పూలగుత్తులు— స్వర్గాది లోకాంతరములు కొమ్మలు— మేర్వాది పర్వతములు మూలము— అసంఖ్యాకములయిన భూత భవిష్యద్వర్తమానభూతములన్నీ ఫలములు—

రామా! తన్మాత్రపంచకమనే పాదపములకు పంచ (అయిదు) బీజములు— ఇవి వివేకశూన్యమయిన ఆత్మనుంచి పుట్టినవి— కాలవశం చేత నశించుచున్నవి— స్వయముగా నానాత్వమును చెందుచున్నవి— వివేకదృష్టితో చూడబడినవగుచూ శాంతించుచున్నవి— పరాగ్దృష్టివల్ల అభివృద్ధి చెందుతాయి— ప్రత్యగ్దృష్టిచేత శాంతించును— అని అన్నారు వసిష్ఠులు—

ఇట్లు భూతపంచక విలాసమను ౮౦వ సర్గ సమాప్తము.

౮౧. చూ........అగ్నిసోమ విచారణము.

వసి॥ రామచంద్రా! స్థూలదేహముయొక్క మధ్యపృష్ఠ భాగం దగ్గర మూలాధారచక్రం అక్కడ కుండలినీశక్తి— అందులో లింగ శరీరానికి కారణమయిన భూతసూక్ష్మం మొట్టమొదట ప్రాణపంచక రూపంతో ఉంటుంది— అక్కడ ప్రాణవాయురూపంతో స్ఫురిస్తుంది— అదే కుండలిని స్పంద, స్పర్శ, సంవిద్రూపములతో కలనాది రూపముల ధరించింది—

కలనముచే (నిర్మితిచే) కలయయినది- చేతనముచే చిత్తు అయినది- జీవనమునుంచి జీవత్వమును చెందినది- మననమువలన మానస్సు అయినది- సంకల్పమువల్ల (సంకల్పమయినది) బోధనలన బుద్ధిఅయినది- ఆపయిన అహంకారమనీ, పుర్యష్టకమనీ, లింగదేహమనీ ఈ మొదలయిన పేరులను ధరించినది-

దేహమునందున్న కుండలిని యనెడి జీవశక్తి అపానరూపముతో క్రిందికి ప్రవహిస్తుంది- నాభిమధ్యనుండి సమానముగుచున్నది- ఊపరిభాగమునందుండి ఉదానమను పేరును పొందుచున్నది- ఈవృత్తి త్రయ భేదమువల్ల ప్రయోజనంకూడా కద్దు- అపానవృతివల్ల మలాదులకు అధోగమనమూ, సమానవృత్తివల్ల నాభియందు సమానముగ (నిశ్చలముగ) నుండుటా, ఉదానవృత్తివల్ల లింగశరీరమును పైకిలేచిపోకుండ నిశ్చలంగా నిలబెట్టడము- అను మూడురకముల ప్రయోజనములు జరుగుచున్నవి. సమానవాయువు సామాన్యవృత్తిచే జీవసంవిత్తును ధరించియుండకపోతే అపానవృత్తిచే అపానవాయువు ఆకర్షించ (లాగివేయు) జీవసంవిత్తు అధోమార్గమున బయటికి పోవుడిది- అలా జీవచైతన్యం క్రిందికుండగా వెళ్ళిపోతే మానవుడు బలాత్కారంగా మృతి చెందుతాడు-

కనుకనే ప్రాణాపానగతినిరోధాన్ని అభ్యసించి సర్వశరీరమునందునూ సమానవృత్తిచే ఇతరవృత్తులను జయించే యడల సకల వ్యాధులు నశించును- మృత్యుజయము సిద్ధించును- శరీరమునందు ప్రధాననాడులు 101 నూటఒకటి- దాని శాఖలన్నీ సామాన్యనాడులు- ఆసామాన్యనాడులందు అన్నరసమును ఎక్కించెడి సమానవృత్తికి ఎచ్చట కఫపిత్తాదులయొక్క ఉపచయము (అభివృద్ధి) వలన వ్యాపారముండదో అచ్చట ఇతరవాయువులవల్ల విషమంగా అన్నరసమును ఆకర్షించుటచే కొద్దిరోగములున్నూ, గొప్పరోగములున్నూ సంభవించును- అలాగే ప్రధాననాడులందు అన్నరసాకర్షణ వ్యాపారము లేకున్నను ప్రధాన వ్యాధులు సంభవించును-

3-46)

శ్రీరా॥ మునీంద్రా ! ఈ శరీరమునందు ఆధులు కాని, వ్యాధులు కాని ఎలాగ పుడతాయి? ఎలా నశిస్తాయి? ఇదికొంచెం వివరించి చెప్పండి- అని అడిగాడు-

వసి॥ రామచంద్రా? ఆధులూ వ్యాధులూ ఈ రెండూ దుఃఖానికి కారణాలే- ఔషధ, దాన, జప హోమాదులచేత వాటికి ఉపశాంతిమాత్రమే- అవి శాంతిస్తే సుఖరూపుడయిన ఆత్మయే మిగిలి ఉంటాడు కనుక సుఖమే అవును- ఆధివ్యాధులు జ్ఞానంవల్ల మొదలంట నశిస్తే మోక్షమంటారు పెద్దలు-

ఇవి ఒకానొకప్పుడు ఒకదానికొకటి కారణముగుచు క్రమంగా తటస్థించును- మరొకప్పుడు ఒకేమారు రెండు సంభవిస్తాయి- ఇంకొకప్పుడు ఒకదాని తర్వాత మరొకటి తటస్థించును- వ్యాధి అనేది దేహదుఃఖము- ఆధి యనునది వాసనామయము- ఈ రెంటికీ అజ్ఞానమే కారణము- తత్త్వజ్ఞానం కలిగితే వాటికి క్షయం (నాశం) కలుగుతుంది-

తత్త్వజ్ఞానం లేనందువల్లనూ, ఇంద్రియనిగ్రహం ఉండదు- అందువల్ల చిత్తం స్థిమితంగా ఉండదు- అందుచేత రాగద్వేషాదులందు ప్రవృత్తి కలుగుతుంది- అప్పుడు జడత్వంచేత "ఇది నేను పొందాను" "ఇది నేను పొందలేదు" అనే మనశ్చింత అనవరతం బయలుదేరుతుంది- అపుడు ఘనమయిన (గట్టి) మోహాన్ని కలిగించే ఆధులు ప్రవర్తిస్తాయి- వర్షకాలంలో మంచువలె- ఇదీ మానసికమయిన ఆధులు పుట్టటానికి కారణం- ఇక శరీరవ్యాధులు పుట్టుటకు కారణం చెబుతాను-

చిత్తం అతిమూర్ఖమై కోరికలు మెండయితే దురన్నభక్షణము చేతనూ, దుర్దేశములయిన స్మశానాదులను సేవించుటచేతనూ (లేక ఆక్రమించుటచేతనూ) నిశీధ ప్రదోషాది కాలములందు భోజనము, స్త్రీసాంగత్యము మున్నగు పనులు జరుపుట చేతను, అసత్యవచన, పరదార, ద్రవ్యాద్యపహరణాది క్రియలు ఆచరించుటచేతనూ, విష,

సర్ప, వ్యాఘ్ర, తస్కరాది శంకలు మనస్సునందు ఉద్భవించుట చేతనూ నాడులు అన్నరసము ప్రవేశించకపోవుటచే క్షీణించుటవలననూ, నాడీ రంధ్రములందు వాత, పిత్త, కఫాదులు ప్రవేశించి పూర్ణములయినందు వలననూ, ప్రాణవాయువు వ్యాకులమయి శరీరం వికలమవుతుంది- అస్వాస్థ్యము ప్రబలుతుంది- వ్యాధులు శరీరమునందు అంకురిస్తాయి- శరీరాకారము విపర్యయం చెందుతుంది-

ప్రాక్తన, ఐహిక కర్మలననుసరించి ఆధివ్యాధి సామగ్రి మిళిత మవుతుంది- ఈసామగ్రి శుభమయితే శుభఫలం- అశుభమయితే అశుభఫలం- ఆధివ్యాధులు క్రమంగా భూతపంచకాత్మకమయిన శరీరం మీద కలుగుతూ ఉంటాయి- ఇక ఇవి ఎలానశిస్తాయో చెప్పెదను విను-

వ్యాధి లోకంలో సామాన్య (పేలవ) మయిన వ్యాధి దృఢతర (ప్రబల) మయిన వ్యాధి అని రెండు రకములు. క్షుత్తృష్ణా స్త్రీ పుత్ర లాలసాదికమును (ఆకలి, దప్పిక, స్త్రీవాంఛ, సంతానవాంఛ మొ॥) వాటివలన కలిగెడి వ్యవహారములున్ను సామాన్య వ్యాధి-

జన్మమరణాది వికారము మూలమయిన వ్యాధి దృఢమయిన వ్యాధి- అభిమతమయిన (ఇష్టమయిన) అన్నపాన స్త్రీపుత్రాదులు లభించినందువల్ల సామాన్యవ్యాధి నశిస్తుంది- అనగా ఆధులు (మన శ్చింతలు) నశిస్తే వాటివల్ల కలిగిన వ్యాధులు నశిస్తాయి-

ఆత్మజ్ఞానంలేనిదే ప్రబలవ్యాధి (సారమయినవ్యాధి) నశించదు- రజ్జుతత్త్వజ్ఞానం లేనిదే రజ్జుసర్పం నశించదు-

రామా ! నదియొడ్డున మొలచిన చెట్లన్నిటికీ మూలభేదం (వేళ్లు తెంచివేసేది) వర్షకాలపు నది ఎలాగో అలాగే ఆధివ్యాధి విలాసా లన్నిటికీ మూలవ్యాధి నశించడమే కారణం-

ఇంక సామాన్యవ్యాధులలోకూడ కొన్ని ఆధివల్లకలిగేవి (మన శ్చింతవల్ల కలిగేవీ) మరికొన్ని మనశ్చింతలు లేకుండా కేవలం వంట

పృచ్ఛేః ! కేవలం మంటపుట్టే వ్యాధులు మాత్రం మందువల్లనో, మంత్రం వల్లనో, పుణ్యకర్మలవల్లనో, లేక వైద్యశాస్త్రంలో చెప్పిన ప్రక్రియలో దేనివల్లనయినా నశించవచ్చు- వృద్ధిపరంపరావచ్చిన ఓషధులు మొదలయిన (చిటకా) చికిత్సలవల్ల కూడా నశించవచ్చు- ఈ ఉపాయాలన్నీ నీవు వింటూఉండేదే- నీ ఎరిగినదే కూడా- వాటిని గురించి నేను చెప్పనక్కరలేదు కదా- అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ స్వామీ ! ఆధులువల్ల వ్యాధులు ఎలా పుడతాయి? అవి ఎలానశిస్తాయి- ఆధులు లేకుండా పుట్టే వ్యాధులు ఏవి? అవి మందులూ, మంత్రములూ, పుణ్యకర్మలూ వీటివల్ల నశించడం ఎలా? ఈవిషయం విస్తరించి చెప్పండి అని అడిగారు శ్రీరాముడు-

వసి॥ మొదట వ్యాధులు పుట్టుకట్టే రీతిని చెబుతారు వసిష్ఠులు-

రామా ! చిత్తము ఆధులతో (మనశ్చింతలతో) విక్షుబ్ధము కాగా (కలవరపడగా) శరీరము సంక్షోభము చెందును- దాన రోగము పెరుగును- ఎదుటనున్న మంచిమార్గమే (కర్తవ్యమే) గోచరించకుండును- అంతట ఆ మార్గమున పరుగు మానవుడు, బాణము వచ్చి మీదపడునని భీతిలిన లేడి (హరిణము) అసలు దారి విడిచి పెడదారిన పడినట్లు- ఈ మనఃక్షోభంవలన ప్రాణవాయువులు తమతమ పదవులుతప్పి నడచును శరీరమునందు ఏనుగు ప్రవేశించుటచే నదిలోని నీరు ప్రవహించెడి దారి తప్పినది నొడ్డును కొట్టుకున్నట్లు- ప్రాణవాయువు విషమంగా ప్రవహించేసరికి నాడులు, కఫ, వాత పిత్తాది దోషములతో నిండిపోవును- అపుడు ప్రాణవాయువుయొక్క దుస్సంచారక్రమంచేత తిన్న అన్నము, జీర్ణముకాకపోవుటయో, అతిగా జీర్ణమగుటయో, విషమంగా జీర్ణమగుటయో ఏదియోయొక దోషము తటస్థించును- తూర్పుగా ప్రవహించే నదియొక్క నీటివేగము నదిలోపడ్డ కట్టెలనుగూడ తూర్పుదిశకు గొనిపోవును- అలాగే సమానమనే ప్రాణవాయువు తిన్న అన్నమును రసరూపమున తయారుచేసి శరీరమంతా నడపును- ఈపరిస్థితిలో అన్న

రసము శరీరంలో అన్నినాడులకు సమానముగా ప్రవహించక నిరుద్ధమయ్యేవరికి (నిరోధింపబడేవరికి) ధాతువైషమ్యంచేత వ్యాధులు సంభవించును- ఇదీ ఆధులవలన వ్యాధులు పుట్టెడిక్రమము-

ఇక మంత్రములవలన వ్యాధులు నశించెడి క్రమంచెబుతావిను-

కరక్కాయలు స్వభావతః విరేచనకారులు- వాటిని సేవించిన యెడల తిన్న ఆహారము జఠరాగ్నివలన రసరూపమును జెంది కడుపులో నిల్వయుండక విరేచనరూపముతో బయలువెడలును- అలాగే పృథివీ బీజము, అగ్నిబీజము, వాయుబీజము, జలబీజము, అనదగు యరలవాది మంత్రవర్ణములుగూడ భావనచేయుటచేత నాడులయందు వ్యాధ్యాకారంగా పరిణమించిన అన్నరసములను పచనము చేయుటయు బయటికి వెడలగొట్టుటయు మున్నగు కార్యమును జేయును-

నిష్కల్మషమయిన పుణ్యమును ఆచరించుటచేతను, సత్సాంగత్యముచేతను, మనస్సు నిర్మలమవును- ఒరపిడిరాతిమీద వరిపిడి పెట్టినందున బంగారము నిర్మలమయినట్లు- మనస్సు నిర్మలమయినచో శరీరమునందు ఆనందము అభివృద్ధినొందును- చిత్తము పరిశుద్ధమయినచో ప్రాణవాయువులు ఆహారమును చక్కగా జీర్ణింపజేయును- అంతట వ్యాధులు నశించును- ఇంతవరకు ఆధివ్యాధులయొక్క ఉత్పత్తి నాశక్రమములు చెప్పబడినవి- కుండలినీ శక్తియొక్క కథాప్రసంగం వలన ప్రకృతవిషయం చెబుతా విను-

కుండలినీశక్తియనగా పుర్యష్టకమనే పేరుగల లింగశరీరాత్మకమయిన జీవునకు ఆధారభూతమయిన ఒకానొకనాడి- దానిని పూరకమను ప్రాణాయామాభ్యాసంచేత కూర్మనాడిని పూరించి సంయమం చేస్తే శరీరం గట్టిపడుతుంది- బలిసి లావు అవుతుంది-

ఇక నభోగతిసిద్ధి(ఆకాశగమనము సిద్ధించెడిక్రమం) చెబుతావిను-

మూలాధారము మొదలుకొని బ్రహ్మరంధ్రపర్యంతమునుండు శరీరముయొక్క మధ్యభాగమును పూరకముచే ప్రాణవాయువును

పూరించి ప్రాణవాయువును పొడవుగా పైకిలేపినచో అపుడు కుండలినీ శక్తికూడ ప్రాణనిరోధమువలన కలిగిన వేడిమిని తత్ప్రయుక్తమయిన శారీర మానసిక శ్రమను అభ్యాసపాటవంచేత సహించుచు పైకి గొనిపోబడును- అట్లు పైకి తీసికొని పోబడుచు అతిదీర్ఘమై ఆడ సర్పము వలె అతిత్వరితముగా పైకి లేచిపోవును- సన్నసన్నని తీగలవలె శరీరమునందున్న నాడులనన్నిటిని తీసికొనిపోవును- గాలితో నిండియున్న శరీరమునంతయు తోలుతిత్తివలె చులకనచేసి పైకి లేవదీయును- ఇదియే ఆకాశగమనము- ఇలాంటి అభ్యాసవిలాసంచేత యోగులు పైకి లేచిపోవుచున్నారు- దీనినే కాయాకాశ సంబద్ధమయిన సంయమ యోగమని చెప్పెదరు- దీనికి పతంజలి యోగసూత్రమును చూడుడు-

"కాయాకాశయో స్సంబంధసంయమా ల్లఘుతూలసమాపత్తేశ్చ ఆకాశగమనమ్" అని

ఎచ్చట శరీరముండునో అచ్చట ఆకాశముకూడ నుండును- కనుక ఆ రెంటికిని అచల సంబంధమేర్పడును- ఆసంబంధమునందు సంయమమును జేసినయోగి కాయాకాశములకుగల యాసంబంధమును జయించి చులకనయిన దూది మొదలగువానితో సమానముగ జేయునో అపుడు "లఘుః" అతి చులకనయిన వాడయినందున నీటిమీద కాళ్ళతో నడవగలడు- "ఊర్ణనాభి" సాలెపురుగు నోటినుండి వెడలెడు దారముమాత్రమువలె అతిసూక్ష్మమయిన ప్రదేశమునందు సంచరించగలడు- సూర్యకిరణములందు విహరించగలడు- అందువలన యథేష్టముగ ఆకాశగమనము వానికి సిద్ధించును-

ఇక రేచకప్రయోగముచే ఊర్ధ్వభాగమునకు ఆకర్షింపబడిన కుండలినీశక్తి (సుషుమ్నయనెడి బ్రహ్మనాడి) దానిలోపలనుండెడి ప్రాణవాయు ప్రవాహంచేత శిరఃకపాలముల రెంటికొక్క సంధియనెడి వెలుపల పన్నెండు అంగులముల పరిమితమయిన మూర్ధభాగమునందు

ముహూర్తమాత్రము ఎప్పుడు ఉండునో అప్పుడు ఆకాశగమన మొనర్చెడి సిద్ధుల దర్శనము కలుగును- చూడుడు- పతంజలిసూత్రమును-

సూ॥ "మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్" అని-

శిరఃకపాలమునందు లోపల కొద్దిఛిద్రము (రంధ్రము) దును- అది ప్రకాశవంతముగ నుండును- కావున నది జ్యోతి యని యనిపించు కొనును- అచ్చట సంయమము జేసినవారికి (సిద్ధులకు) భూమ్యాకాశముల మధ్య సంచరించెడి వారల దర్శనమబ్బును- అని పై సూత్ర భాష్యమున కర్థము-

విన్నాడు శ్రీరాముడు ఆకాశగమన సిద్ధిక్రమమంతా వసిష్ఠుని ద్వారా- అందు సందేహం కలిగింది రాముడికి- ఇలా అడిగాడు-

శ్రీరా॥ స్వామీ! మానవుల ఇంద్రియములు దివ్యములు కావు కదా! దివ్యములుకాని చక్షురాదీంద్రియములకు దివ్యపురుషులు గోచర మగుట దుర్లభముకదా! కనుక చాక్షుషప్రభా సన్నికర్ష లేనిదే షోడశాంతస్థానమునందు ప్రాణవాయువును ధరించినంతమాత్రమున సిద్ధుల దర్శనము ఎటులగును? విస్తరించి చెప్పండి అని అడిగాడు-

వసి॥ రామచంద్రా! నీవనిన మాటసత్యము- వాయురూపులయిన సిద్ధులు మలినములయిన పురుషేంద్రియములకు దివ్యమగు ఉపాయాంతరములేనిదే కంటపడరు- (తెలియబడరు) అది నిజము- కాని యోగాభ్యాసముచే సంస్కారము నొందిన (సంస్కృతమయిన) బుద్ధి నేత్రముచే (మనస్సు అనెడి జ్ఞానేంద్రియముచే) ఆకసమున విహరించెడి సిద్ధులుకూడ తెలియబడుదురు-

స్వప్నమును గాంచుట యెట్టిదో సిద్ధావలోకనము (సిద్ధులను గాంచుట) కూడ అట్టిదే- ఇక స్వప్నావలోకనమునకు సిద్ధావలోకనమునకు భేదమేమన? సంవాదమూ, వరదానమూ, ఫలావాప్తి మొదలగు వ్యవహారము సిద్ధదర్శనమువలన స్థిరముగ జరుగును- స్వాప్నిక వ్యవ

హారములో అట్టి స్థైర్యములేదు- అనగా సిద్ధులు చెప్పినది మనకనుభవములో జరిగితీరును- వారు వరముల నిత్తురు- దానమునకు ఫలము సంప్రాప్తమగును- ఈకథయంతయు స్వప్నంలో నుండదు- అచట అంతా మిథ్యగా-

ఇక పరకాయ ప్రవేశమునకు ఉపాయం చెప్పెద వినుము-

ముఖమునుంచి పన్నెండు అంగుళముల పరిమితమయిన ప్రదేశమువరకు రేచకమును ప్రాణాయామాభ్యాసమువలన ప్రాణవాయువును చిరకాలము స్థిరపరచినచో అప్పుడు పరకాయమునందు ప్రవేశించెడిశక్తి యేర్పడును-

శ్రీరా॥ అయితే స్వామీ ! సిద్ధుల వ్యవహారము స్థిరార్థమగుటకునూ, స్వప్నవ్యవహారము అస్థిరమగుటకును స్వభావమే (నియతియే) కదా కారణము- ఒక్క స్వభావమునకు ఇంతటి నియతస్థితి యెట్లు సంభవించినది ?

వసి॥ రామచంద్రా ! సృష్టి ప్రారంభకాలంలో సత్యసంకల్పుడయిన ఈశ్వరునియొక్క సంకల్పబలంచేత వస్తుస్వభావమనెడి నియతి బయలుదేరును- అయ్యది ప్రళయమువరకు నుండును-

అవిద్యయనునది పారమార్థికమయినది (నిజమయినది) కాదు కనుక వస్తుశక్తి (వస్తుస్వభావము) ఒకానొకపుడు మారవచ్చును- వసంతఋతువులోగూడ శరత్కాలమున ఫలించెడి సస్యములు ఫలించవచ్చును- బ్రహ్మపదార్థ మొక్కటియె అనియతస్వభావముగనూ, నియతస్వభావముగను లోకవ్యవహారముకొరకు ప్రపంచమంతటా నిండియున్నది-

శ్రీరా॥ స్వామీ ! మానవుడు సూక్ష్మచ్ఛిద్రములో (చిన్న తొఱ్ఱలో) దూరటానికీ, ఎక్కువసందును భర్తీచేయుటకునూ, శరీరము అతిసూక్ష్మమూ, అతిస్థూలమూ, కావలెకదా ! అలా కావటానికి

ఉపాయమును సెలవిందు- అనగా, అణిమా, మహిమా, అనేక సిద్ధులు లభించెడు ఉపాయము సెలవిందు అని భావము- అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ కాష్ఠము, రంపము, ఈ రెంటియొక్క సంబంధమువల్లకాని కాష్ఠమునకు భేదము (ద్వైకీభావము) కలుగదు- అనగా రంపము కట్టెతో సంశ్లేష చెందినప్పుడు కాని కట్టెను కోయుట తటస్థించదు-అలాగే ప్రాణాపానవాయువుల సంశ్లేషమువలనగాని (అనగా వరిసిడివలనగాని) మధ్య జఠరాగ్ని పుట్టదు- దాని ఉత్పత్తి క్రమము ఇది-

శరీరముయొక్క ఉదరంలో నాభికి పైన క్రిందను కలిగియున్న స్థూలమయిన మాంసపుఖండ మొకటియుండును- అది నాభికి క్రింద నున్న జలభాగములచేతనూ, పైననున్న జలభాగములచేతనూ ఆకర్షింపబడుచు కదలుచుండును, పైన గాలిచేతనూ, క్రింద నీటిచేతనూ ఆకర్షించబడే వేతసచెట్టువలె-

ఆ మాంసమునకు దిగువనయుండు తిత్తియొక్క మూలభాగమునందు మూలాధారముండును- అందు వెనుక జెప్పిన కుండలినీశక్తి కలదు- ఈయది శరీరేంద్రియ సంఘాతమునకు ప్రాణమనిచెప్పెడిది- ఈ కుండలినీశక్తి జపకాలమునందు త్రిప్పుచుండెడి రుద్రాక్షమాలవలె ఎల్లపుడు ప్రాణాపానవాయువులయొక్క ఉద్గిరణ నిగిరణములచే కదలుచూ, అవ్యక్తమయిన ధ్వనిని ఒకదానిని పుట్టించుచూ, తోకతొక్కిన త్రాచుపామువలె ఊర్ధ్వముఖముతో పైకి లేచును-

ద్యావాపృథివుల మధ్యభాగమున ప్రాణుల ఊర్ధ్వాధోగతులకు కారణమయిన విహితనిషిద్ధక్రియవలె ప్రాణాపానముల ఊర్ధ్వాధోగతులకు కారణమగుచు చలించుచుండును- చాక్షుషాద్యింద్రియక జ్ఞానములకు కారణమగుచుండును- హృదయ పుండరీకమున తుమ్మెదవలె మెలగుచుండును- బాహ్యవాయువుచే చెట్టుఆకులు కదలినట్లు జ్ఞాన

కర్మేంద్రియాది శక్తులుగల హృత్పద్మము నాడీజాలమున్ను లోపలి ప్రాణాపానాదివాయువులచే కదలుచుండును—

విశాలమయిన బాహ్యాకాశమునందు స్వభావతః ప్రసరించెడి వాయువులు కాష్ఠపాషాణాదులను మృదు పర్ణ తృణాదులనూ కబలించి నట్లు హృదయాకాశమునందు కూడ ప్రాణవాయువులు భుజించిన అన్నాదులను జీర్ణింప జేయును—

హృత్పద్మము నాడీపుంజము ప్రాణవాయువులచే కొట్టుకొన బడుచు తోలుతిత్తివలె చలించు చుండును— అపుడు లోపల అన్నము మొట్టమొదట రసరూపమును జెందును— పిదప రక్తముగ మారును— రక్తమునుంచి మాంసమగును— మాంసమునుంచి చర్మమగును— చర్మము నుంచి మేదస్సు అగును— మేదస్సునుంచి మజ్జ యగును— మజ్జనుంచి ఎముకలగును— ఎముకలనుంచి శుక్రము (వీర్యము) అగును— ఇట్లు విచిత్రమయిన కార్యరూపముతో ఒకదానినుంచి మరియొక పరిణామము ఏర్పడును— వసంతఋతువులో చెట్టులోపల చేరిన (ప్రవేశించిన) భూమ రసము (నేలయొక్క రసము) క్రమక్రమముగ చిగురు, పూత, పిందె, కాయ, పండు మున్నగు పరిణామములను జెందినట్లు— ఇట్లు పరిణమించుటకు సప్తధాతువులందునూ, ఉత్తరోత్తరాపరిణామము సిద్ధించుట కొరకు పరస్పరసంఘర్షణవలన జాఠరాగ్నికి అభివ్యక్తి కలదు—

దేహము సర్వాంగములందునూ పుట్టిన ప్రదీప్తమయిన జాఠ రాగ్నిచే ఔష్ణ్యమును జెందును— దేహమంతటా వ్యాపించిన జాఠ రాగ్నిని హృత్పద్మమునందు తారకాకారముతో యోగులు ఉపా సింతురు— ఆ దేజఠరాగ్నిని చిద్రూపముతో ఉపాసనచేయుచో, వ్యవ హిత విప్రకృష్ట సర్వపదార్థ దర్శనము సిద్ధించును—

సముద్రములో బడబాగ్నికి సముద్రములోని జలమే ఇంధన మయినట్లు జాఠరాగ్నికి శరీరములోని అన్నరసరూపమయిన జలమే ఇంధనము— శరీరమునందలి చల్లని జలభాగము చంద్రాంశమనీ, ఆజలము

వలన బుట్టిన అగ్ని తేజోంశమనీ, కాన శరీరము అగ్నిషోమాత్మకమనీ చెప్పబడుచున్నది— లేక చిజ్జడోభయాత్మక మయినందువలన గూడ అగ్నిషోమాత్మకమని యనదగును— సంవిత్ప్రకాశే అగ్నియనీ, జడ భాగము సోముడనీ కూడ మనీషులు అనుచున్నారు—

శ్రీరా॥ స్వామీ! మీరు వెనుక,

శ్లో॥ దేహేష్వాజరణం సర్వరసానాం పవనో న్వహమ్ ।
జనయత్యగ్ని మన్యోన్య సంఘర్షాద్వన వేణువత్ ॥

అని చెప్పియున్నారు— శరీరమునందమనూ, శరీరమునకు వెలుపలనూ అగ్ని, ఆదిత్యాదులు వాయువువల్ల పుట్టుచున్నట్లు ప్రత్యక్షానుభవము కద్దు— మీరు చెప్పిన మాటనుబట్టియు లోకానుభవమును బట్టియు అగ్ని వాయు స్వరూపుడయిన సోమునినుంచి పుట్టినట్లు నేను అర్థము చేసికొన్నాను— ఇపుడు ఇందుని (చంద్రుని) వలన అగ్నిపుట్టెగాకని చెప్పుచున్నారు— ఇందులో ఏదినిజము చెప్పండి? అని అడిగాడు శ్రీరాముడు—

వసి॥ రామచంద్రా! అగ్నిషోములిద్దరు పరస్పరోపాదనకులు— అనగా ఒకరివలన యింకొకరు పుట్టుదురు— వీరి జన్మ బీజాంకురముల జన్మవలె పరస్పరోపాదానకము— అనగా ఒకదానిజన్మకు మరొకటి ఉపాదానకారణము— దినరాత్రులవలె పరస్పరనిమిత్తకము— వాని ఉనికి మాత్రము ఛాయాతపములవలె పరస్పరోపఘాతిని (ఒకదానిని మరొకటి చెడగొట్టునది) ఇద్దరూ (అగ్నిషోములిద్దరూ) ఒకేమారు కనిపించుచో అపుడు ఛాయాతపస్థితి ఉదాహరణము— పర్యాయముగ కనిపించుచో దినరాత్రిస్థితి దృష్టాంతము— ఇట్లు ఈ రెండుదాహరణములును గ్రహింప వలెను—

ఈరెంటికీ కార్యకారణభావము రెండువిధముల కలదు— సద్రూప పరిణామమువలన పుట్టుట యనునది ఒకవిధమయిన కార్యకారణ

భావము- వినాశ పరిణామమువలన పుట్టుట యనునది రెండవరక మయిన కార్యకారణభావము- ఇందు మొదటి దానికి ఉదాహరణము బీజాంకురన్యాయము- రెండవ కార్యకారణభావమున కుదాహరణము దినరాత్రిన్యాయము-

అనగా బీజాంకురన్యాయమునందు బీజము ఉండిననే అంకురము పుట్టును కాన ఈయది స్వరూప పరిణామోత్థమయిన కార్యకారణ భావము- దినరాత్రిన్యాయమునందు, దినము (పగలు) నశించిననే (గడచిననే) కాని రాత్రి పుట్టదు- రాత్రి నశించిననేకాని పగలు పుట్టదు- కనుక ఈయది వినాశపరిణామజమగు కార్యకారణభావము- మొదటి ఉదాహరణమునందు కార్యదశలో కారణ మున్నదనుటకు "మృదాత్మకో౽యం ఘటః" ఈకుండమట్టిది- అనెడు ప్రత్యక్షము మాత్రమే ప్రమాణముకాని ఇతరము ప్రమాణముకానేరదు- ఇట్లే రెండవ ఉదాహరణమునందుగూడ కార్యదశలో కారణములేదనుటకు "దివా రాత్రిం నోపలభామహే" పగట రాత్రికాలమును మనము చూచుటలేదు- అనెడు అనుపలబ్ధి మాత్రమే ముఖ్యప్రమాణము- ఈయది ఏకవస్తుస్థము" అనగా ఒకేవస్తుమాత్రమును గ్రహించెడి ప్రత్యక్షప్రమాణమునకు అవిరుద్ధము-

గమనిక॥ ఇచట ఒకవిధమయిన శాస్త్రచర్చ-

శ్లో॥ అనాస్థా నాస్తి కర్తృత్వ మిత్యాద్యా౽ యుక్తివాదినః ।
అవజ్ఞయా బహిష్కార్యాః స్వానుభూత్యపలాపినః ॥

అనునది మూలశ్లోకము-

శాస్త్రార్థము॥ ఓయి కార్యమును నెరవేర్చెడిది (చేసెడిది) కారణమన బడుచున్నది- కార్యమును గురించిన కర్తృత్వము ఆకారణ పదార్థమునకు కార్యము నెరవేర్చుటయందు అభినివేశ (పట్టుదల) రూప మయిన ఆస్థ ఉన్నపుడే కనిపించుచున్నది- ఈస్థితిలో ప్రకాశనమాత్ర

ముతో ఉపక్షీణమయిన దినమునకు (పగటికాలమునకు) రాత్రిని నిర్మించుటలో ఆస్థ (అభినివేశము) లేదు- కాన పగటికాలమునకు రాత్రిని గురించిన కర్తృత్వము లేదు- ఇట్లే రాత్రికికూడ దినమును గురించి కర్తృత్వము లేదు- కావున అభావపరిణామముచే (అది నశిస్తే ఇది కలగటం- ఇది నశిస్తే అది కలగటం అనే క్రమం చేత) కార్యకారణ భావము నిర్మూలము-

ఇట్లే అచేతనమయిన మృదాదులకు ఘటాదులను పుట్టించుటలో ఆస్థ (అభినివేశము) సంభవించదు- ఆస్థ (అభినివేశము) అనెడిది చేతన ధర్మము కాని అచేతన ధర్మము కాదు-

మరియు అనుపమర్దితమయిన మృత్పిండమునుండి ఘటము తయారగుటలేదు- మృత్పిండము ఉపమర్దము కాగా మృత్పిండమే నశించుచున్నది- ఇంక స్వరూపముతో పరిణమించునదేది? మృత్పిండము, ఘటము, ఈ రెంటికంటె అతిరిక్తమై ఈ రెంటియందు అనుగతమయిన మృత్తు అనునది మూడవది యొకటి లేదు కదా !

మరియు ("బీజాది, స్థితం, వినంక్ష్య నశ్యత్ నష్టంవా అంకురం జనయేత్") బీజాదికము ఉన్నదా! నశింపబోయెడిదా! నశించుచున్నదా! నశించినదా! అంకురమును (మొలకను) పుట్టించెడిది! అని నాలుగు విధముల వికల్పము-

ఇందు మొదటి పక్షము కుదరదు- కుసూలాది స్థితమయిన బీజముకూడ అంకురమును పుట్టించవలసివచ్చును-

రెండుమూడు పక్షములుకూడ కుదరవు- తనను నశించకుండ కాపాడుకొనలేని బీజము ఇతరమును పుట్టించుటకు సమర్థమయిన దనునది మాటమాత్రము కాని వేరేమియు కాదు-

నాల్గవ కల్పము సర్వానుభవ బాధితము కాన దేనినుండి దేనికీ ఉత్పత్తి కాని, వినాశము కాని జరగదు- స్వభావమువలననే సర్వమూ

పుట్టుచూ చచ్చుచున్నది- ఇందు జన్మనాశములకు పౌర్వాపర్యము కనిపించుచున్నందున అవివేకులకు కార్యకారణభావవికల్పము కలిగినది” అని యిట్లు వాదించెడి దుర్వ్యక్తివాదులు స్వానుభవ విరుద్ధముగ వాదించువారు కావున వారు దూరముగ త్రోసిపుచ్చ తగినవారేకాని, అంగీకరించతగిన వారుకారు- కాన రామా! అనుపలబ్ధి ప్రమాణ మగునా? కాదా యని సందేహింపతగదు- ప్రత్యక్షాదులెట్లు ప్రమాణములో అట్లే అను అనుపలబ్ధికూడ ప్రమాణమే యగుచున్నది- అభావమునందు ప్రమాకరణత్వము ఎచ్చటా కనిపించుటలేదని భ్రాంతిపడవలదు- తేజోఽభావము శీతముయొక్క- అనుమితికి హేతువిధముగ కరణమగుచున్నది- అనగా వేడిలేకపోవుట చల్లదనమున్నదనుటకు హేతువగుచున్నదని భావము-

ఆ అగ్ని సద్రూప పరిణామముతో చంద్రునికి కారణమగుచున్నది-

అదే అగ్ని తాను నశించి శైత్యమునొంది (శీతమయి) వాయు భావమును పొందుచున్నది-ఇందు “యదావా అగ్నిరుద్వాయతి వాయు మేవాప్యేతి” అనుశ్రుతి ప్రమాణమగుచున్నది- ఇట అగ్ని వినాశ పరిణామముచే వాయుభావమును జెందుచున్నదనవలెను-

ఇట్లే అగ్నీషోములిద్దరూ సద్రూపపరిణామముతో పరస్పరము కారణమగుచున్నారు- అదెట్లన ?

బడబాగ్ని సప్తసముద్రములయందలి నీటిని త్రాగి ఆనీటిని ధూమరూపముతో వదలి తాను మేఘరూపమును జెంది మరల ఆనీటినే పుట్టించుచున్నది-

గమనిక॥ క్షీరదధిఘృతాది సముద్రములు కూడ రసాత్మకుడగు సోముని రూపములే కాన సర్వత్ర (అంతట) పయః (నీరు)అని చెప్పుట లక్షించినది మూలమందు “సప్తాంబుధి పయః” అని-

సూర్యుడు కృష్ణపక్షమందు అమావాస్యా పర్యంతము చంద్రుని భక్షించి మరల శుక్లపక్షమునందు ఆ చంద్రకళలను దినక్రమముగ వదలుచున్నాడు- వసంత గ్రీష్మఋతువులు వచ్చినపుడు గ్రీష్మమారుతము భూమియందలి నీటిని అమృతంలాగ త్రాగి వర్షఋతువు వచ్చేసరికి మేఘమనే వేషం వేసికొని వర్షరూపంతో అదేనీటిని వదిలి జగచ్ఛరీరాన్ని నిండింపచేస్తోంది-

లేక ప్రాణవాయువు నోటినుంచి కడుపులో ప్రవేశించిన అన్నపానాదులను అమృతంలాగ వానిరసమును త్రాగి బాగాబలిసి మేఘమువలె శరీరంలో ఉన్న నాడీజాలాన్ని అంతా ప్రవేశించి శరీరమును తృప్తిపరుస్తోంది- ఇదియే ఈ ప్రాణవాయువునకు సోమాత్మకముగ పరిణామము-

ఇచట మూలశ్లోక మిట్లున్నది-

శ్లో॥ పీత్వామృతోపమం శీతం ప్రాణస్సోమముఖాగమే ।
అభ్రభాగమాత్పూరయతి శరీరం పీనతాంగతః ॥ అని

ఈ శ్లోకమునకు పైనవ్రాసిన అనువాదము సరిపోవుచున్నది-

ఇదేశ్లోకము పాఠాంతరముగ గూడ కలదు- ఆ పాఠాంతరమును దాని యనువాదమున్ను యీాదిగువ వ్రాయబడుచున్నది-

పా॥ శ్లో॥ పీత్వామృతోపమం శీతం ప్రాణస్సోమం సుఖాగమే ।
అభ్రభాగమా త్పూరయతి శరీరం పీనతాం గతః ॥

అని పాఠాంతరము-

ప్రాణః=అగ్నిరూపమయిన యజమానుని ప్రాణము, అధ్వరే=యజ్ఞమునందు, అమృతోపమం = అమృతతుల్యమగు శీతం, సోమం= చల్లనిసోమరసమును, పీత్వా=త్రాగి, అంతే=మరణకాలమున, ధూమాది మార్గముచే సుఖాగమే=సుఖరూపమగు స్వర్గము సంప్రాప్తముకాగా, అభ్రభాగమాత్ = చంద్రునకు సన్నిహితమయిన ఆకాశమార్గమున

వచ్చుటవలన చంద్రునిపొంది, (అనగా చంద్రత్వమును పొందిన వాడగును) చంద్రకళలతో తన శరీరమును పూర్ణింప జేసికొనుచున్నాడు- అనే పూర్ణిమ నాటి చంద్రుని బలియగు- ఇదియే సోముని పరిణామము-

అనగా యజ్ఞముల ననుష్ఠించెడి యజమానుడు యజ్ఞములందు సోమరసమును చల్లగ త్రాగి మరణకాలమున చంద్రమండలమును జేరి చంద్రకళలతో తన శరీరమును భర్తీ చేసికొనుచున్నాడు- (పూరింప చేసికొనుచున్నాడు- ఇదియే పూర్ణిమనాటి సోమపరిణామము- ఇలా చంద్రభావమున్ను, ధూమాదిమార్గమున్ను శ్రుతిచే జెప్పబడినది-చూడుడు-

శ్రు॥ "అథ యఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే తే ధూమ మభిసంభవంతి ధూమాద్రాత్రిం రాత్రేరపరపక్షం అపరపక్షా ద్యాన్ షట్ దక్షిణైతి మాసాన్ తానేతే సంవత్సర మభిప్రాప్నువంతి మాసేభ్యః పితృలోకం పితృలోకాదాకాశం ఆకాశాచ్చంద్రమసం ఏష సోమో రాజా తద్దేవానా మన్నం" అని- "తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి తస్యాహుతేః సోమో రాజా తద్దేవానామన్నమ్" అనియు పంచాగ్నివిద్యయందుకలదు-

భూమియందలి రసమును (తడిని) అనగా నీటిని గాలి పీల్చివేయునా? లేక సూర్యకిరణములు పీల్చివేయునా? అను వికల్పములో మొదటిపక్షము నవలంబించి గాలియే జలమును పీల్చివేయునని చెప్పబడినది-

ఇపుడు సూర్యకిరణములు నీటిని పీల్చునని చెప్పబడుచున్నది- సూర్యకిరణములే నేలమీది నీటిని పైకి లాగుకొని పీల్చివేయుచున్నవనినచో అపుడు ఆనీరే స్వరూపపరిణామముతో సూర్యకిరణములగుచున్నవనవలెను- కనుకనే సూర్యకిరణములందు శౌక్ల్యము (తెలుపుతనము) అగపడుచున్నది- అయ్యది నీటియొక్క రూపమని శ్రుతి చెప్పుచున్నది- "యదాదిత్యస్య లోహితంరూపం తదగ్నేః యచ్ఛుక్లం తదపాం" అని-

ఆ సూర్యకిరణములందు జలమునకు సంబంధించిన శైత్య దహనత్వ ములు రెండును నశించి సౌమ్యత్వము రౌక్ష్యము అను రెండు గుణములు పుట్టినవి కాన ఆ యంశమునందు జలము వినాశపరిణామముతో సైతే సూర్యకిరణములకు కారణమనవలయును- అప్పుడేయది సంకీర్ణముగు ఉదాహరణముగును-

ఇట్లే 'అగ్నీషోమాత్మకమగు జగము' అనుటయందు ఉభయరూప సంకీర్ణత కలదు- దర్శించిన సూక్ష్మదృష్టితో గ్రహింపవలయును- చంద్రుడు అగ్నికి వినాశపరిణామము, స్వరూపపరిణామము ఉభయమునగు చున్నాడు- అట్లే అగ్నికూడ చంద్రునకు వినాశపరిణామము స్వరూప పరిణామము నగుచున్నాడు- కనుక అగ్నిహోత్రుడు నాశమును చెందినయో సోముడగుచున్నాడు- పగలు నశించియే రాత్రియగుచున్నది- చీకటి వెలుతురులకున్నూ, ఎండనీడలకున్నూ, పగలురాత్రులకున్నూ, యుక్త విలక్షణమగు రూపమును ఎంతటి ప్రాజ్ఞులుకూడ కనిపెట్టలేరు- తమః ప్రకాశములయొక్క సంధిస్వరూపముకూడ శూన్యముకాదు- శూన్య ములకు సంధియనునది కలుగదు- ఉన్నవాటికి నిర్నిమిత్తముగ శూన్యత యనునది ఘటిల్లదు- పూర్వోత్తర కాలములందువలె సంధికాలము నందుగూడ పరస్పరము భావాభావరూపములతోడనే అవి యుండును- లోకంలో తమస్సు అనగా ప్రకాశాభావరూపమగు వస్తువనియు ప్రకాశ మనగా తమోభావరూపమగు వస్తువనియు సార్వజనీనమగు ప్రతీతి గలదు-

తమః ప్రకాశములచే అహోరాత్రములెట్లు జరుగుచున్నవో భూత ములలో చైతన్యజాడ్యములను రెంటితోనూ భూతములు ప్రకాశించు చున్నవి- ప్రపంచపరిస్థితి చిద్రూప జడరూపములతోడనే ఆరబ్ధ మయినది-

అనగా అహోరాత్రములు ఎట్లు తమఃప్రకాశములతో ఘటితము లయినవో అట్లే ప్రాపంచికవ్యవహారములన్నియూ చిజ్జడఉభయము లతో నిండియున్నది-

జలామృతముల రెంటితోనూ చంద్రునిశరీరము మిశ్రితమై యున్నది- ప్రకాశౌష్ణ్యములరెంటితో సూర్యునిశరీరము మిశ్రితమయి ఉన్నది- చిజ్జడాంశలనగా ప్రకాశాప్రకాశలు- ప్రకాశరూపుడు అగ్ని అప్రకాశాత్మకుడు సోముడు-

బయట సూర్యోదయమయితే బాహ్యతమస్సు నశించినట్లు లోపల మనస్సులో చిదాదిత్యుడుదయించుచో జగన్మూలమయిన తమస్సు నివృత్తిమగును-

ప్రత్యగాత్మ జడమయిన దేహమునందు దేహతాదాత్మ్యముతో ప్రకాశించుచున్ననూ, జడమయిన దేహముయొక్క గుణమును పొంది నదై దానిసత్తతో తనకు సత్తకలదై తనకువేరే సత్తలేనిదవలె గోచరించును- అర్థరాత్రి చంద్రుడు ప్రకాశించుచుండ అతనిలో ప్రవేశించి ప్రకాశించుచున్న సూర్యకాంతి చంద్రునియొక్క చంద్రికారూపమును పొందినదై చంద్రునియొక్క సత్తతో తాను సత్తకలదై స్వసత్తతో (తనసత్తతో) తాను లేనిదివలెయగుచున్నది- సూర్యకాంతి (సూర్యుని వెలుగు) రాత్రికాలంలో ఉండదని సర్వజనానుభవముండుటనుబట్టి- చంద్రమండలంలో ప్రవేశించిన సూర్యప్రభారూపమగు (సూర్యకాంతి రూపముగు) అగ్ని జలమయమగు చంద్రబింబమును ప్రకటింప జేయు చున్నది- అనగా (స్ఫురద్రూపం) ప్రకాశించెడి రూపముకలదిగా జేయుచున్నది-

అట్లే శరీరమునందు జీవభావముతో ప్రవేశించి ఆయుర్దాయ ముండునంతవరకు "నేను" "నాది"అను ప్రతీతిని(ప్రథను) దేహమునకు కలిగించుచున్నది-

శ్లో॥ యథాప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ అను

భగవద్గీతావచనము ఇందుకు ప్రమాణము-

"ఏవ మన్యోన్యమేలనే తాదాత్మ్యాధ్యాసా దర్కజం రూపం ప్రభామండలం ఇందుర్భవతి చిచ్చస్వసంవిన్మయం మనుష్యోఽహం చేతన ఇత్యాది స్వానుభవానుసారి దేహస్థం రూపం భవతి" అని సంస్కృతము—

వసి॥ కనుక రామచంద్రా! సూర్యచంద్రులిరువురు కలియుసరికి తాదాత్మ్యాధ్యాసవలన సూర్యునివలన కలిగిన(పుట్టిన) ప్రభామండలము (కాంతిపుంజము) చంద్రుడగుచున్నది— అట్లే దేహమునందు ప్రవేశించిన చైతన్యము "నేను మనుష్యుడను, చేతనుడను" అని మొదలగు అనుభవమునను సరించి దేహరూపమును పొందుచున్నది—

చైతన్యము నిష్క్రియము "అనామ" నిరుపాధికము— అయ్యది కేవలము ఒంటిగా ఉపలభ్యమానముగాదు— (కనిపింపదు) వెలుగురు (ఆలోకము) దీపముచే తెలియబడునట్లు చైతన్యము దేహేంద్రియాది కృత్యములవలననే తెలియబడును—

చైతన్యము అజ్ఞానావృతమై చైత్యములగు ఉపాధులకు ఉన్ముఖమై చెలగుటయే సంసారము— అదియే అనర్థము— అయ్యది చైత్యాభిముఖ్యమును చెందకుండుటయే నిర్వాణమను పురుషార్థము—

కనుకనే ఇట్లు గోడమీది సూర్యప్రకాశమువలె తాదాత్మ్యాధ్యాసను జెందియున్న దేహి దేహముకూడ అగ్నిషోములే యని గ్రహించుము—

చైతన్యము ఉపాధినుంచి నివృత్తమై నిరతిశయానందరూపముతో నుండుచో చైతన్యమునకు (చిదగ్నికి) ప్రత్యేకస్థితి— జలము అతిశీతమయి మంచుగడ్డ కట్టియున్నపుడు సోమునకు (చంద్రునకు) ప్రత్యేకస్థితి—

రామచంద్రా! వెచ్చని ప్రాణవాయువు అగ్ని— చల్లని అపానవాయువు చంద్రుడు ఈ రెండూ ఛాయాతపములవలె ఊర్ధ్వాధోమార్గ

ములయందున్నది. వెన్నెల ప్రాణవాయువను అగ్ని చల్లని అపాన వాయువువలన ద్రావాత్మత్వాభ్యాసము జెందియున్నది. అద్దంలో ప్రతిబింబ మున్నట్లు.

మూలాధారమునే కుండలినీ రూపమయిన చిదగ్ని మూలాధారాది షట్చక్రాంతమున గల వసుస్థలపద్మసమూహమునందున్న పరా పశ్యంతీ వాచామ్నాయమయిన నాలుగు అర్థప్రకాశ శక్తిరూపమయిన స్ఫూర్తితో ప్రజ్వలించుచున్నాడు. (ప్రకాశింప జేయుచున్నాడు.) బయట సూర్యుడు గోడను ప్రకాశింపజేసినట్లు.

స్థూలాది దేహమందు మహామహాశబ్దమగు బ్రహ్మ (శీతోష్ణరూపిణి యగు సంవిత్తు) అగ్నిషోమాలను పేరును పొందినట్టుల మానవుల వ్యష్టి దేహములయొక్క సృష్టిలో కూడ నట్లే.

రామచంద్రా! ఆకాశమునందు కృష్ణపక్షమున అగ్నిరూపుడగు సూర్యుడు సోముని యొక్క చల్లని పదియైదు కళలను పాడ్యమి మున్నగు తిథులందు క్రమముగా భక్షించుచున్నాడు. ఒక్క "ధ్రువ" యనెడు చిరాయువను కళను మాత్రం మిగుల్చుచున్నాడు. పిదప శుక్లపక్షమందు క్రమముగా ఉష్ణములగు ఆ కళలను వెడలగ్రక్కు చున్నాడు. వాటితో క్రమముగా పూర్తియగుచూ ధ్రువాఖ్యయగు కళ పూర్ణమై సోముడగుచున్నది. అట్లే హృదయమందున్న ప్రాణ సూర్యుడుగూడ అపానరూపుడగు సోముని ముఖనాసికలద్వారా ప్రవేశించిన చల్లని పదునైదు కళలను క్రమముగ మ్రింగి నోటినుంచి బయటికి ధ్రువ యనెడు ఒక్క కళను మిగిల్చి మరల నావేడి కళలను గ్రక్కుచున్నది.

ఆ కళలతో పూర్తిచెందుచూ బయట అపానమను పేరుగల సోముడు తయారగుచున్నాడు. బయట ప్రాణాపానసంధికాలము పూర్ణమాసి హృదయమందు అమావాస్య.

అంతరాల దేశమునందు ఇడాపింగళనాడుల యొక్క ఊర్ధ్వాధో భాగములయందున్న ప్రతిశాఖానాడీషట్కమునందు ప్రాణము సూర్యుడు ప్రవహించుటవలన రెండు అయనములు- మేషాది పన్నెండు మాసములు- అనుషక్త సంక్రాంతులు-

అపానమను సోముని యొక్క ప్రవాహమువలన చైత్రాది పన్నెండు మాసములు, విష్కంభాది యోగములు, ఇతర పర్వములును తయారగుచున్నవి- ఇదియంతయు యోగులకు ప్రత్యక్షము- మిగిలినవారు శాస్త్రప్రమాణమువలన గ్రహించవలెను-

ఇట్లుండ దేహము యొక్క అణుత్వమునకు స్థౌల్యమునకు నుపయోగించెడి ధారణాభేదములు మొదట మూడు శ్లోకములచే జెప్పబడుచున్నవి-

రామచంద్రా! ముఖమునకు బహిఃప్రదేశమున సూర్యగ్రస్తమయిన సోముని యొక్క పదియారవకళ ప్రాణవాయువుచే ఉద్గీర్ణములయిన కళలతో నిండి క్షణకాలము పూర్ణిమనాటి చంద్రునివలె పీతస్నిగ్ధాత్మకముగ (పన్నెండంగుళముల పరిమాణముకలదిగ) నుండును- ఆకళయందు నేను భుశుండోపాఖ్యానమునందు జెప్పిన బాహ్యకుంభక యోగముచే మనోధారణచేసి స్థిరపడుము.

అట్లే ఏహృదయాకాశమునందు కళలను గ్రహించుట (భక్షించుటతో) క్రమముగ భక్షింపబడుచున్న అపాన సంజ్ఞగల సోముడు అమావాస్యయందువలె కేవలము శుద్ధచిద్రూపముగు ధ్రువాఖ్యకళారూపముతో నుండునో ఆ హృదంబరమునందు అంతఃకుంభకముతో స్థిరముగ నుండుము-

రామా! వసంత, గ్రీష్మ, వర్ష, శరదృతువులందు క్రమముగా శైత్యము జౌష్ణ్యము (వేడి)చే గ్రసింపబడుట (భక్షింపబడుట) వలన ఈనాలుగు ఋతువులందును సోముడు (చంద్రుడు) అగ్నిలో చేరిపోవును- శరద్ధేమంత శిశిర ఋతువులందు క్రమముగా జౌష్ణ్యము శైత్య

ముచే గ్రసింపబడుటచే అగ్ని చంద్రునిలో జేరును- వీరియిరువురయొక్క సంధులే విషువత్తులనిపించుకొనును- సూర్యునకు ఆయాఋతువులందు మేషాదులందు సంక్రాంతికలుగును- అలాగే శరీరమునందుగూడ అపాన వాయుసంబంధమయిన శైత్యమును (చల్లదనమును) జఠరాగ్ని భక్షించుటవలన సోమునకు అగ్నిసంక్రాంతి కలుగును- సూర్యుని సంక్రాంతులు వెనుక జెప్పితిని- వానిని గుర్తుంచుకొనుము- నేను చెప్పిన ధారణాక్రమమును ఆచరించుము- అపుడు నీకు బాహ్యములయిన సంవత్సర కాలములు తృణసమములగును-

రామచంద్రా ! ఒక్క సంవత్సరకాలము ఉచ్ఛ్వాసనిశ్వాసలతో గడపుచూ ప్రపంచమును ప్రత్యక్షముగ ఎట్లు చూచుచుంటివో అట్లే లోపల యోగాభ్యాసంవల్లకూడ అంతరమగు వస్తువును బాహ్యఘటాదులవలె స్పష్టముగా తెలిసికొనుచో అపుడు యోగుల ముచ్చటలలో మిన్నయగుదువు- అట్లుకాక నేను చెప్పిన దానిని వదలి యితరమును పట్టుకొని యితర వ్యాసంగంలో పడునెడల నీవు యేమాత్రము శోభిల్లవు అని అన్నారు వసిష్ఠులు-

ఇట్లు అగ్నీషోమవిచారణమను ౮౧వ సర్గ ముగిసినది.

## ౮౨. అణిమాదిలాభ యోగము నుపదేశించుట.

వసి॥ రామచంద్రా ! యోగుల శరీరము అత్యల్పమూ అతి స్థూలమూ అయ్యేడిమార్గమును నీకు విపులముగా జెప్పెద వినుము-

నాభికి పైభాగమున నుండుచున్న జాఠరాగ్ని హృత్పద్మము యొక్క నాళము (కాడ) యొక్క సన్నని రంధ్రముద్వారా (హృత్పద్మనాలసూక్ష్మచ్ఛిద్రద్వారా) హృదయాకాశమును ప్రవేశించి ఆ హృదయ కమలముయొక్క బొడ్డుమీద బంగారుతుమ్మెదవలెనూ, మేఘమండలములోని సంధ్యాకాలపు మెరుపుకణమువలెనూ ప్రకాశించు

చుండును- ఇట్లు ప్రకాశించెడి అగ్నిజ్వాలయే పరమాత్మకు ఆసనము- (ఆధారము) చూడము ఇందుకు ప్రమాణము తైత్తిరీయులయొక్క ఉపనిషత్తునందు "తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః" అని- మరియు జఠరాగ్నిని గురించి యిట్లు వినబడుచున్నది- "తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితా । నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా । నీవార శూకవత్తన్వీ పీతాభా స్వాత్యణూపమా । తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మావ్యవస్థితః' అని-

ఆజఠరాగ్నికణం సంవిద్రూపంతో (చిద్రూపంతో) వృద్ధిపొందుతుంది- శరీరమంతా వ్యాపిస్తుంది- కాని అది అగ్నిమాదిరిగా శరీరాన్ని తగలపెట్టదు- సూర్యునిమాదిరిగా వెలుగుతూ ఉంటుంది- ప్రాతఃకాలపు సూర్యునివలె ఉంటుంది- అగ్ని బంగారాన్ని కరిగించినట్లు శరీరమంతా ఆపాదమస్తకం కరిగిస్తుంది- పార్థివమయిన గంధభాగాన్ని కాఠిన్యాన్ని కూడా చెమటపట్టించి నీరుచేసి పారేస్తుంది- నీటిస్పర్శకూడా దానికి గిట్టదుకనుక అది తన జ్యోత్స్నాశక్తిచే నీటినికూడా ఎండింపజేస్తుంది- ఇలా శరీరానికి బయట ఉంటూకూడా మనస్సులో ఆతివాహిక దేహమాత్రంలో ఉంటుంది-

ఇలా పార్థివ జలీయ శరీరద్వయాన్ని విడిచిపెట్టి ఉన్న ఆ అగ్ని విక్షోభంచెందిన ప్రాణవాయువుతో ఉపసంహారంచెంది ఎక్కడ లీనమవుతుందో అవుతుంది-

అపుడు కుండలినీశక్తికూడా దానిసంస్కారమంటి నిప్పునుంచి బయలుదేరిన పొగవలె ఆతివాహికదేహాకాశంలో ఉంటుంది- అక్కడ ఉండి క్రోడీకృతమై మనోబుద్ధ్యాత్మకమయిన లింగశరీరంలో అహంకృతిరూపాన్ని చెందుతుంది- లోపల చిత్ప్రకాశచమత్కారమున్నూ స్వేచ్ఛావిహారచమత్కారమున్నూ ఉంటుంది దానికి- ఈ రెండు శక్తుల వల్లా అది తామరతూడుయొక్క సన్ననిరంధ్రంలోనూ దూరగలదు- విశాలమయిన కొండలలోనూ దూరగలదు- అక్కడనుంచి తిరిగి రాగలదు-

ఇలా దేహముయొక్క సూక్ష్మభావాన్ని చెప్పినాను- ఇక ముందు దానియొక్క స్థూలీభావాన్ని చెబుతాను విను-

ఈ కుండలినీశక్తి (యోగియొక్క) వహ్నిలో ఉపసంహారం చెంది జలభాగాన్ని ఎప్పుడు విడిచిపెట్టిందో అప్పుడు వెంటనే రసపూరితమవుతుంది- నోటితో లాగి వాని లోలుతిత్తి నీరు విడిచిపెట్టగానే వెంటనే బావిలోని నీరు నింపుకున్నట్లు- ఇలా రసపూర్ణమై వెనుక విడిచిపెట్టిన పార్థివభాగాన్ని మళ్ళీ ధరిస్తుంది- చిత్రకారునియొక్క బుద్ధిలోని ఆకారాన్ని కుంచతో గీసిన రేఖ ధరించినట్లు-

మాతృగర్భంలో ఉన్న కలలములలోని బీజశక్తి అస్థిహస్తపాదాదులయొక్క అంకురస్థితిలో ఉండి స్వేచ్ఛానుసారముగ అతిస్థూలమయిన మేర్వాదిపర్వతములయొక్క ఆకారాన్ని అత్యల్పమయిన తృణాదులయొక్క ఆకారాన్ని చెందుతుంది- ఇలా యోగసిద్ధి ననుసరించి శరీరం స్థూల సూక్ష్మదశను చెందటం చెప్పాను నీకు- ఇక మీాదట జ్ఞానసాధ్యమయిన మార్గం చెబుతాను విను-అది వెనకటిదానికి విలక్షణం- చాలా బాగుంటుంది-

శుద్ధమూ సౌమ్యమూ, అలక్షితమూ, అగు అద్వితీయ చైతన్యమొకటి కలదు- అది సూక్ష్మముకంటె సూక్ష్మము- శాంతము- అది ప్రపంచమూ కాదు- ప్రపంచనిర్మాణ కియారూపమూ కాదు- అయ్యది తనకుతానే సంకల్పోన్ముఖమై అధ్యాస చెందుతుంది- అప్పుడాయద్వస్తుస్వరూపానికి జీవుడని పేరు- ఈశరీరం సంకల్పభ్రాంతిచే ఏర్పడింది- కాబట్టి భ్రమ- అట్టి శరీరాన్ని మూఢుడయిన జీవుడు ఆత్మభావంలో (నేను అనే భావంలో) చూస్తాడు- ఎప్పుడు జీవుడికి సంకల్పమనే మోహం నశిస్తుందో అప్పుడీ దేహం సర్వసంకల్పాలూ నశించినందువల్ల శాంతి చెందుతుంది- (అనగా బాధితమవుతుంది)-

రామచంద్రా! అప్పుడు చమురుతీసిపోతే గిపమారిపోయినట్లూ, నిద్రమేలకువవస్తే కల అంతరించినట్లూ, జీవుడు సత్యమయిన తన

రూపాన్ని భావించేసరికి ఇక దేహాన్ని తలవడు- తత్త్వభావనచేత నిర్దేహుడై జీవుడు సుఖంచెందుతాడు- ఓ రామా ! అనాత్మభూతము లయిన శరీరాదులందు ఆత్మభావన యనేది అతిదారుణమయిన తమస్సు- (అంధకారం) ఇది సూర్యచంద్రాగ్నుల ప్రకాశంచేతగూడ భేదింపశక్యం కాదు- జ్ఞానమనే ఆదిత్యునిచేత సర్వవ్యాపకమయిన చిన్మాత్రమును తానేయని భావిస్తాడు- అపుడు అజ్ఞానాదిత్యునిచేత అనాత్మయందాత్మ భావనయనే గాఢాంధకారం నశిస్తుంది-

ఇలాంటి జ్ఞానసిద్ధి దృఢంగా కలిగిన జీవన్ముక్తులకు స్థూలసూక్ష్మ ప్రాతిభాసికాది దేహకల్పనము సిద్ధిస్తుంది-

రామా ! దృఢమయిన భావన ఎలాఉంటే అలా అవస్తువు భాసిస్తూ ఉంటుంది- దృఢమయిన భావానుసంధానంచేత లోకంలో మానవులకు విషం అమృతం అవుతోంది-అమృతం విషం అవుతోంది- ఈయుదాహరణ లోకసిద్ధం- అలాగే దేహమునందు "ఇదిసత్యము" అనే భావన ఉంటే అది సత్యంగానే భాసిస్తుంది- అసత్యమనే భావన ఉంటే శూన్యమై పోతుంది- (ఉండకుంటుంది) ఇదిగో అణిమాద్యష్టసిద్ధు లను కలిగించెడి జ్ఞానయోగము- ఇది విన్నావునీవు-ఇక పరకాయప్రవేశ మనే యోగాన్ని చెబుతా విను-

రేచకమనే అభ్యాసయోగంచేత జీవుడు కుండలిని గృహము నుంచి బయలువెడలి పరకాయమునందు ప్రవేశిస్తాడు- అంతవరకు ఈదేహము కాష్ఠలోష్టాదులవలె ఉంటుంది- పనిపాటలేమీ జరగవు ఈశరీరంతో- పరకాయప్రవేశముచేసిన జీవుడు ఆశరీరంలో ఆజీవుని యందు వానిమతియందున్న భోగసంపదనంతా పీడనుభవిస్తాడు- మరల వెనకటి శరీరం ఉండిఉంటే దానిలో ప్రవేశిస్తాడు- లేకుంటె మరోదానిని గ్రహిస్తాడు- తన యిచ్ఛవచ్చినట్లు చేస్తాడు-

లేకపోతే యోగి పరకాయభోగానంతరం తన అంతఃకరణాన్ని విపులపరచి ప్రపంచమంతా నిండిన స్థావరజంగమ సకలదేహాది ప్రతి

బింబోపాధులనూ, అందు ప్రతిబింబించెడి జీవులనూ, బింబోపాధులగు సత్త్వాదిగుణములనూ, తదవచ్ఛిన్నమయిన చిద్బింబములనూ, వీనినన్నిటినీ, వ్యాపించియుండే చైతన్యసంపదతో ఉంటాడు-

రాఘవా! యోగైశ్వర్యసంపన్నుడయిన జీవుడు నిత్యస్వప్రకాశమును, నిరస్తసమస్తదోషమును, నగు నిజతత్త్వమును తెలిసికొని, ఏ నోదాసిని కోరునో ఆయానందానిని అత్యల్పకాలంలో పొందుతాడు- తత్త్వవేత్తకు అవిద్యావరణములేకుండుటె నిరతిశయానందమని భావిస్తాడు కాని ఈఅల్పసిద్ధులను బహూమానించడు-

ఇట్లు అణిమాది లాభ యోగోపదేశమను ౮౨వ సర్గ ముగిసినది-

## ౮౩. కిరాటోపాఖ్యానము.

వసి॥ రామచంద్రా! చూడాలయను రాజపత్ని ఇలా ప్రాణధారణాది యోగమును గట్టిగా అభ్యసించి అణిమాద్యష్టైశ్వర్యముల నొందినది- ఆమెను సిద్ధించిన కాయవ్యూహైశ్వర్యమును చూడుడు-

ఆకాశమార్గాన నడచి సముద్రకుహరం చొచ్చింది- వసుధాపీఠమంతా సంచరించింది- మళ్ళీ భర్తయొక్క వక్షస్థలాన్ని క్షణకాలం కూడా విడిచి ఉండేది కాదు- అన్నిరాష్ట్రాలలోనూ ఆమే- అన్ని లోకాలలోనూ ఆమే- నడియౌవనంలో ఉన్న ఆచూడాల మెరుపువలె మెరిసే ఆభరణాలుధరించి మేఘమాలవలె ఆకాశాన తిరిగింది- గిరిమాల (కొండలవరుస) వలె భూమిమీద తిరిగింది- ఆకాశాది పంచభూతాలలోనూ ఆమె చేరిపోయింది ముత్యాలహారంలో దారం చేరినట్లు-

మేరుపర్వతశిఖరాలలో విహరించింది- లోకపాలుర పురములలో సంచరించింది- నలుదిక్కులా నడచింది- అంతరిక్షం ఆవరించింది- సుఖంగా- పక్షులతో మాట్లాడింది- పిశాచాలతో సంభాషించింది- అమరులతో ఆలాపములు సలిపింది- విద్యాధర అప్సరస్సిద్ధులతో

వ్యవహరించింది– మహాశక్తిపడి భర్తకు ఆత్మజ్ఞానామృతాన్ని బోధించింది చూడాల– అయినా ఆయనకు ఏమీ బోధపడలేదు– తెలియలేదు– తనభార్య అయిన చూడాల నిఖిలకలాకోవిదురాలనీ విశేషవంతురాలనీ మాత్రమే గ్రహించాడు– అంతలో మళ్ళీ ఆ రాజు ఆ విషయమంతా మరచేవాడు– విద్యార్థి వేదం చదువుకునే రోజులలో పనస మరచినట్లు– ఆ మోహంతో ఆత్మజ్ఞానములేని తనభర్తకు తనకు సిద్ధించిన అణిమాద్యైశ్వర్యమహిమను ఆమె తనభర్తకు చూపలేదు– వేదము యజ్ఞానుష్ఠానమును శూద్రునకు తెలుపనట్లు– అన్నారు వసిష్ఠులు–

విన్నాడు శ్రీరాముడు ఇలా అడిగాడు–

శ్రీరా॥ మునీంద్రా! సర్వసిద్ధులను సంపాదించుకున్న చూడాలయే తన భర్తకు ఆత్మజ్ఞానాన్ని బోధించలేకపోతే సిద్ధిపొందనివారగు ఇతర గురువులు తమ శిష్యులకు ఆత్మతత్త్వాన్ని బోధింపలేక పోవటంలో ఆశ్చర్యమేమున్నది! ఎంతో ప్రయాసపడ్డా చూడాలకు సాధ్యపడలేదంటే యింక మిగిలిన వాళ్ళకు ఏం సాధ్యమవుతుంది! అని అడిగాడు రాముడు– వసిష్ఠుడు ఇలా సమాధానం చెప్పాడు–

వసి॥ రామా! శాస్త్రవ్యవస్థను ఎంతగా పాటించినా గురువు ఎంతటి శ్రద్ధతో ఉపదేశించినా లాభంలేదు– శిష్యునియొక్క ప్రజ్ఞే జ్ఞానం కలగటానికి కారణమవుతుంది– ఎన్నివిన్నా ఎంతటి పుణ్యం చేసినా ఆత్మతత్త్వం తెలియదు– ఆత్మశుద్ధి (మనశ్శుద్ధి) వల్లనే ఆత్మతత్త్వం తెలుస్తుంది– పాముకాళ్ళను పామే తెలుసుకోవలెనుకాని యితరులు తెలిసికొనలేరు– అన్నారు వసిష్ఠులు–

విన్నాడు రాముడు– మళ్ళీ ఇలా అడిగాడు–

శ్రీరా॥ స్వామీ! అలా అయితే లోకంలో గురూపదేశంవల్లకాని ఆత్మజ్ఞానం కలగదనే ప్రతీతి ఎలా ఏర్పడింది? అన్నాడు–

వసి॥ రామా! ఇందుకు నీకొక కథ చెపుతా విను–

వింధ్యపర్వతప్రాంతంలో కిరాతుడనే వర్తకుడొకడుండేవాడు- అతినీచుడు- కాని మహాధనవంతుడు- ఒకానొకప్పుడు అతడు మైదానంలో వెళుతుండగా గడ్డిగుబురులో ఒకవరాటిక సంప్రాప్తమయింది- అతని నీచబుద్ధిచేత మహాకష్టపడి ప్రయత్నపూర్వకంగా మూడురోజులు ఆగడ్డిచెత్తలతో దులిపాడు కపర్దకల కొరకు- కపర్దకలు (గవ్వలు) నాలుగో, ఎనిమిదో, నూరో, వెయ్యో, రెండువేలో, దొరకుతాయని ఆతని ఆశ- అనగా ఒక కపర్దిక దొరికితే దానినమ్మి నాలుగు సంపాదించెదను- ఆనాలుగు అమ్మి ఎనిమిది, వాటినమ్మి నూరు, వానినమ్మి వెయ్యి వానినమ్మి రెండువేలు కొంటానని వానిఆశ- రాత్రింబవళ్లు ఆమైదానంలో శ్రమయూఫ అనుకోకుండా వెదకినాడు- లోకులు పరిహాసిస్తారనికూడా ఆతను అనుకోలేదు-

ఇలా మూడురోజులు వెదకినాడు- మూడోరోజు పూర్తిఅయ్యే సరికి ఆ జాంగలంలో (మొరక నేలలో) చంద్రబింబంవంటి చింతామణి లభించింది- సంతోషించాడు- ఇల్లుచేరాడు- సాంసారిక భోగాలన్నీ తనకు లభించాయని అనుకున్నాడు- తనకిక దారిద్ర్యం లేదనుకున్నాడు-

రామా! కపర్దములను (గవ్వలను) శ్రమఅనుకోకుండా వెదకుచున్న కిరాతునకు ప్రపంచమే మూల్యముగాగల రత్నం దొరకినట్లు గురూపదేశక్రమంవల్ల శాబ్దం (పరోక్షప్రాయమయిన) ఆత్మజ్ఞానాన్ని వెదకుకొనుచున్నారు- నిత్యాపరోక్షమయిన ఆత్మతత్త్వం లభిస్తోంది- వెతకేదొకటి దొరకేదొకటి-

ఆత్మతత్త్వము ఇన్ద్రియాతీతము- శ్రవణమువల్ల కలిగేది ఐంద్రియకజ్ఞానము- అంచేత గురూపదేశంవల్ల ఆత్మతత్త్వం లభించదు- గురూపదేశంలేనిదే ఆత్మతత్త్వసాక్షాత్కారం కలగదు- కపర్దాన్వేషణం ( ) లేనిదే కిరాతునకు చింతామణి దొరకిందా! అలాగే మహోర్థమయిన ఆత్మతత్త్వానికి గురూపదేశం కారణమవుతుంది- కపర్దకము ( ) మణికి కారణమయినట్లు కారణము

కాని గురూపదేశము ఆత్మతత్త్వానికి కారణమవుతుంది- రామా! చూడు ఈమాయ- లోకంలో వెదికేవో ఒకటీ- దొరకేది మరొకటీ-

లోకంలో మానవుడు చేసేది ఒకటి- పొందేఫలం మరొకటీ- కాబట్టి ఆత్మలాభం కలిగింతరువాత ప్రారబ్ధశేషంవల్ల నిల్వాయున్న ప్రపంచభ్రాంతి పూర్తిగా తొలగిపోతుంది- ఇది అనుకోకుండా వచ్చిన ఫలం- అపయిన నిరతిశయానందం (స్వరూపానందం) లభిస్తుంది-

ఇట్లు కిరాటోపాఖ్యానమను ౮౭వ సర్గ సమాప్తము.

## ౮౮. శిఖిధ్వజుని వైరాగ్యము.

వసి॥ రామచంద్రా! తత్త్వజ్ఞానము లేమింజేసి శిఖిధ్వజుడు (చూడాలభర్త) మోహాంధకారమున మునిగినాడు- దుఃఖము నెల్లు పెరిగినది- రాజ్యభోగములందు ఇష్టము తప్పినది- ఏకాంతములయిన దిగంతములందును, కొండగుహలందును తిరుగ నారంభించెను- ఇంటి నుంటి వెకటాయెను- రామా! నీవలెనే శిఖిధ్వజుడుకూడ భృత్యులు పలుమారు ప్రతిమాలుకొనగా తన నిత్యకృత్యములను నెరవేర్చుకొను చుండెను- నిత్యము వైరాగ్య మభివృద్ధమగుచుండెను- రాజ్యభోగము లందు ఖేదము అభివృద్ధమాయెను- దేవతలకు, బ్రాహ్మణులకును తన బంధు పరివారమునకును గోవులను, భూమిని, సువర్ణమును, విరివిగ దానమిచ్చుచుండెను- కృచ్ఛాంద్రాయణాది తపమొనర్చుటకు పుణ్య తీర్థములు, ఆశ్రమప్రదేశములు తిరిగెను- నిధిని కోరువాడు నిధిలేని నేలను త్రవ్వి వ్యర్థపోయినట్లు శిఖిధ్వజుడుకూడ ఎన్ని ప్రయత్నములు చేసినను తనపరితాపముతో విఫలమనోరథుడాయెను. ఈదిగులుతో దినదినము కృశించుచూ సంసారవ్యాధికి మందుఏదియా? అను మన శ్చింతతో బాధపడుచుండెను-

ఇలా ఉండగా ఒకనాడు ఏకాంతమున చూడాల తన తొడ యందు గూర్చొనియుండ నామెతో శిఖిధ్వజుడిట్లనెను-

శిఖి॥ ప్రియురాలా! నేను రాజ్యం చాలకాల మనుభవించితిని- రాజ్యభోగములు అరగించితిని- నాకు వైరాగ్యము ముదిరినది- నేనడవికి పోవుదను- వనవాసులకు ఆపదలుండవు- సంపదలుండవు- సుఖదుఃఖము లుండవు- ఇవియేవీ అంటుకొనవు- వనవాసులకు దేశము చెడిపోవునం దను భీతిలేదు- రణమున సైన్యము చత్తురను వ్యథలేదు- చీకు చింత లేని వనవాసము రాజ్యముకంటె ఎక్కువగు సుఖము- చూడు చూడ సొంపగు వనవీధులు నిన్నలే నన్నానందింప చేయుచున్నవి- ఏకాంత వాసమున కలిగెడి ఆనందమునకు బ్రహ్మేంద్రాదుల ఆనందము కూడ తులతూగదు- (సాటికాదు) కనుక ఓ తన్వీ! ఈనా ఆలోచనను నీవు అడ్డుపడకుము- కులాంగనలు భర్తగారి కోరికను చెడగొట్టరు- అని అన్నాడు శిఖిధ్వజుడు భార్యతో-

చూ॥ చూడాలవిని భర్తతో నిట్లనుచున్నది- నాథా! ఏసమయంలో ఏది చేయవలెనో అది అప్పుడు చేసిననే శోభిల్లును- పుష్పాలు వసంతఋతువునందే శోభాయమానముగ నుండును- శరత్కాలమున సస్యము శోభిల్లును- కనుక వృద్ధులకు వనవాసము యుచితమగును కాని, మీవంటి యువకులకు అదిరాణించదు- తగదుకూడా- కనుక నాథా! యౌవనము సడలునంతవరకు మనమిరువురము ఇంటనే కాలము గడుపుదము- లేత చెట్లు పూలుపూచి ఉన్ననే శోభిల్లును- ముసుగు చెట్లకు పూత యుండుట యుచితముగా కావున్నను- కనుక మనమిద్దరము ఒక్కేమారు కలిసిపోవుదము వనమునకు, హంసలు సరోవరమునుంచి లేచి పోయినట్లు- అసమయమునందు రాజ్యపాలనమును విడిచిపోవుట మహా దోషమగును- అసమయమునం దొకపనిని చేయు రాజును ప్రజలు నిరోధింతురు- తప్పుపనిని చేసెడి రాజును భృత్యులు నివారింతురు- అని అనినది- చూడాల భర్తతో-

శిఖి॥ భర్త భార్యకు సమాధానమిచ్చుచున్నాడు-

ఓ ఉత్పలపత్రాక్షి! నాకోరికకు విఘ్నము చేయకుము- నేనడవికి వెళ్ళినట్లుగనే భావించుము- నీవు చిన్నదానవు- అడవికి రానక్కా

రాలవుకావు- పురుషులకే వనవాసము కష్టసాధ్యము- స్త్రీలు ఎంత కఠినులయినా వనమున నివసించలేరు- అడవిలో బుట్టిన పూలుగుత్తులయినా ప్రాణశక్తిని సహింపలేవు- రాజ్యపాలన జేయుచూ నీతింబునుండుము భర్త పరదేశస్థుడగుచుండ కుటుంబపోషణమనునది స్త్రీలకు అవశ్యకర్తవ్యము- అని అనినాడు శిఖిధ్వజుడు-

వసి॥ రామా! శిఖిధ్వజుడు భార్యతో ఇలా చెప్పి స్నానానికి బయలుదేరాడు- కాలకృత్యాలు తీర్చుకున్నాడు- సూర్యుడు పగటి కాలకృత్యంతీరగా అస్తాద్రికేగె శిఖిధ్వజు డడవికి వెళ్ళాడు- సూర్యుని వెంట సూర్యునికాంతి వెళ్ళినట్లు శిఖిధ్వజుని వెంట భార్య (చూడాల) కూడా నిండు అనురాగంతో వెళ్ళింది- రాత్రి అయింది- ఆకాశంమీద నక్షత్రాలు వెదజల్లినట్లు విస్తరిల్లినవి- నడిరాత్రి అయింది- శిఖిధ్వజుడు భార్యతో కూడా పరున్నాడు- అర్ధరాత్రిసమయంలో చూడాల గాఢ నిద్రలో ఉంది- మెల్లగా ఆమెతో చెప్పకుండా లేచిపోయినాడు ఘోరారణ్యాన్ని ప్రవేశించాడు- ఒకానొకచోట వనభూమిలో విశ్రమించాడు- అచ్చటి పండ్లు భుజించి ఆరాత్రి గడుపుకున్నాడు- తెల్లవారిలేచి (ప్రాతఃకాలమునలేచి) కొండలూ, నదులూ, తిరుగుచూ ఇలా పన్నెండు రాత్రులు తిరిగాడు- క్రమంగా మందరపర్వతం చేరాడు- అక్కడ పరిశుద్ధమయిన చదరపునేలమీద చల్లనిప్రదేశంలో పండ్లుపండిన చెట్ల నీడను పూగుత్తులుగల తీగలతో పర్ణశాల యేర్పరచుకున్నాడు- ఆ మందిరంలో శిఖిధ్వజుడు తాపసులకు కావలసిన పాత్రలను అనగా భోజనపాత్ర, పూలసజ్జ, అర్ఘ్యపాత్ర, అక్షమాల, కృష్ణాజినము, కప్పుకొనుటకు, కంథ (గంత) కంబళి, మున్నగు వస్తువులను సమకూర్చుకున్నాడు- ఇంకేమయినా కావలసిఉంటే వానినికూడా సేకరించుకున్నాడు- మొదటియామంలో స్నాన సంధ్యా జపములూ, రెండో యామంలో మళ్ళీస్నానమూ, పూలు తెచ్చుకొనుటా దేవతార్చన చేయుటా, పిదప కందమూలఫలాలు భుజించుటా తరువాత జపంచేసికొనుటా ఇలా ఒంటరిగా రాత్రిగడిపాడు-

ఇట్లు శిఖిధ్వజుని ప్రవ్రజ్య యనెడి ౮౬వ సర్గము సమాప్తము.

౮౫. శిఖిధ్వజుని చూడాల యన్వేషించుట.

వసి॥ రామా! శిఖిధ్వజుడు అడవిలో ఆశ్రమం ఏర్పరచుకొని యున్నాడు- చూడాల యింటిలో ఏమిచేసిందో విను చెబుతాను-

శిఖిధ్వజుడు అర్ధరాత్రివేళ భార్యను విడిచి వెళ్ళేసరికి కొంత సేపటికి చూడాల నిద్రనుంచి మేల్కొన్నది- పక్కమీద భర్తలేక పోవటం చూచింది- భయపడింది- సూర్యచంద్రులులేని ఆకాశమువలె కాంతివిహీనమయిన పడకను చూచి పరితపించింది- క్షణకాలం పక్క మీదనే కూర్చుని ఇలా ఆలోచన చేసింది- ఆలోచించింది-

"ఇకముందు రాజ్యం జరగటం కష్టం- నాభర్త యిల్లువిడిచి పోయాడు- ఇప్పుడు నేనేమి చెయ్యాలి? నేనుకూడ ఆయనగారివద్దకే వెళతాను- ఆడదానికి భర్తయేగతి అని శాస్త్రం చెబుతోంది-" అని ఆలోచించింది- ఇలా ఆలోచనచేసి భర్త ఉన్నతావుకు వెళ్ళదలచి లేచింది పక్కనుంచి- యోగశక్తివలన గవాక్షంనుండా బయలుదేరింది- అంబరమార్గంలో సంచరించింది- తుదకొకానొకరాత్రి ఖడ్గంచేతబూని ఒంటరిగా నిశీథసమయంలో తిరుగుతున్న భర్తను చూచింది- తన భావి పరిస్థితినిగూర్చి ఆలోచించుకుంది- అతడికో ఇకముందు సుఖించటానికి మార్గంఎలా? కారణం ఏమి? సమయమేది? ప్రదేశమెక్కడ? అని క్షుణ్ణంగా విచారణచేసికుంది- యోగబలంచేత తనభర్తను తనయెదుట సాక్షాత్కరించుకొని అతనితో మాటాటదలచి, తనప్రయాణం(గమనం) కట్టిపెట్టింది- మరల అంతఃపురంచేరింది- పడకమీదపరుంది- "కారణాంతరంచేత నాభర్త గ్రామాంతరం వెళ్ళాడని" పురజనులను ఓదార్చింది భర్తగారిరాజ్యం కాపాడింది- ఇలా ఒకరివల్ల మరొకరికి సుఖంలేకుండా వారిరువురకు కొంతకాలంగడచినది-శిఖిధ్వజుడు అడవిలోనూ, చూడాల యింటిలోనూ ఏమిచెప్పేది? ఇలా పదునెనిమిది సంవత్సరాలుగడిచింది- కొన్ని సంవత్సరాలు గడిచేసరికి శిఖిధ్వజుడికి వార్ధక్యం వాటిల్లినది- తలనెఱిసినది అతడికి- ఎలాగయిన భర్తకు ఆత్మతత్త్వోపదేశం చేయా

లనే తనపని నెరవేరాలి కనుక తానే అతని యొద్దకు వెళ్ళాలని నిశ్చయించుకున్నది. ఇదే మంచిసమయమనుకున్నది- మందరపర్వతసమీపానికి వెళ్ళదలచి, అంతఃపురంనుంచి రాత్రివేళ బయలుదేరి వాయుమార్గాన నభోవీథిదాటినది- మేఘమండలంలో మేఘములతో కలిసియున్న మెరపులను చూచింది- అలా తనభర్తతో కూడా తానెపుడు కలిసియుండునా ! అని ఉత్సాహపడింది- చెట్లను చుట్టుకున్న తీగలనూ, కాంతునికి ఎదురేగెడి సిద్ధాభిసారికనూ చూచి తానుకూడ అలాఉండాలనుకుంది- అక్కడి మందమారుతములూ, చంద్రకిరణములూ చూచి మురుసుకుంది-

కొంతసేపు తనచిత్తాన్ని మనస్సునూ గురించి నిందించుకున్నది- తుదకు పర్వతములనూ, నదులనూ దాటి మందరపర్వతగుహానుచేరి అచట దివ్యాభరణములతో అలంకృతుడై నూతనదేహంతో కృశాంగుడైయున్న తనభర్తను యోగబలంచేత చూచింది- చిక్కియున్నాడతడు- నల్లపడ్డాడు- నారచీరధరించాడు- ఏకాకి- విరాగి- నేలమీద కూర్చొని పూలమాల కూర్చుతున్నాడు- జటాధారిగా నున్నాడు- చూచింది,చూచింది, ఇలాఉన్న తనభర్తను- దుఃఖం కలిగిందిఆమెకు-

అబ్బా ! ఆత్మవివేకంలేనందువల్ల కలిగే మౌర్ఖ్యం యెంతటిది ? ఇలాంటి అవస్థలు మౌర్ఖ్యంవల్లనే కదా మానవులకు కలుగుతూ ఉంటాయి- అతిధనికుడయిన ఈనా ప్రియభర్త ఇట్టి మోహావస్థను చెందాడుకదా ! కాబట్టి ఇతనికిప్పుడే చెప్పవలసినదానిని చెప్పి మోక్షసామ్రాజ్యం చేకూరుస్తాను- ఈరూపం విడిచిపెట్టి మరోరూపంధరించి యితనికి తత్త్వోపదేశం చేస్తాను- నేను ఇలా ఉండేటట్లయితే నేను చిన్నదాననని నామాట పాటించడితడు- కావున తాపసరూపంతో బోధిస్తాను-

ఇపుడు నాభర్త పరిపక్వమయిన మతికలిగి యున్నాడు- ఏది చెప్పినా అదిఅంతా మనసుకు పట్టుతుంది యితనికి-

అని ఆలోచించి చూడాల ఒక బ్రాహ్మణ పిల్లవాని వేషం ధరించి నది- అతని యెదుట అడవిలో తిరుగనారంభించింది- శిఖిధ్వజుడు చూచాడా పిల్లవానిని తాపసవేషంతో ఉన్నవానిని- తపస్సు మూర్తీభవించి నట్లున్నాడు- మేలిమిబంగారంవంటి శరీరకాంతి- మెడనిండా ముత్యాల హారాలు- తెల్లని యజ్ఞోపవీతం- తెల్లని ధోవతి ఉత్తరీయమూ, ఒక చేతిలో కమండలం- మరొక చేతిలో జపమాల- చెవులకు కుండలాలు- శిఖకు మందారపూలమాలలు-మంచుబిందువువంటి తెల్లనిబొట్టునుదుట- ఇలా ఉన్నాడాపిల్లవాడు- చూచాడు అతనిని- లేచాడు శిఖిధ్వజుడు- పాదుకలూడదీశాడు- (విడిచాడు) నమస్కరించాడు- కూర్చోటానికి ఆసనమిచ్చాడు-చేతులో పూలగుత్తి ఉంచాడు- ఆపిల్లవాడు ఓ రాజర్షీ! మీకు నమస్కారమన్నాడు- పూలగుత్తి అందుకున్నాడు- చాప (ఆసనము) మీద కూర్చున్నాడు-

శిఖి॥ దేవపుత్రా! ఎక్కడనుంచి వస్తున్నావు? మీరాకచే నాకీ రోజు సఫలమయినదని తలుస్తున్నాను- మీదర్శనంచేత నాజన్మ సార్థకమయింది- ఈఅర్ఘ్యపాద్యాలు స్వీకరించండి- నేనుకూర్చిన యీపూల మాలను స్వీకరించండి! అని అన్నాడు- శిఖిధ్వజుడు-

వసి॥ రామా! ఇలా చెప్పి శిఖిధ్వజుడు అర్ఘ్యపాద్య పుష్ప మాలలను అతని ప్రియపత్నికొరకిచ్చాడు-

చూడాల ఇలా అన్నది- ఋషివర్యా! నేను భూలోకంలో అనేకాశ్రమాలు తిరిగిచూచాను-నీవు చేసినట్లు పూజాసత్కారాలు ఎక్కడా జరగలేదు- అతిమృదువు అత్యనురూపమయిన వినయం చూపించావు- నీవు చిరంజీవివి కాగలవు-శాన్తమనస్కుడవై నిర్వాణము(మోక్షము) కొరకు తపమాచరించుచుంటివి- తపోవ్రతమనునది అసిధారాసమము- (పదునయిన కత్తియొక్కవరతో సమము) రాజ్యసుఖం విడిచి ఘోరారణ్యమున నివసించటం చాలాకష్టకరము అని అన్నది చూడాల-

శిఖధ్వజుడు॥ భగవంతుడా! నీవు సర్వజ్ఞుడవయిన దేవుడవు- చిహ్నముమాత్రంచేత అన్నీ గుర్తింపగలవు నీవు- నీ అవయవములన్నీ చంద్రమండలంనుంచి తెచ్చి కూర్చబడినట్లున్నవి నాకు- దర్శనమాత్రం చేత అమృతాన్ని స్రవిస్తున్నాయి-పూర్వాశ్రమంలో నాకొక అత్యంత ప్రియమయిన భార్య ఉండేది- ఆమె శరీరంకూడా ఇంతసుందరంగా ఉండేది- ఆపాదమస్తకం అచ్చగా అలాగే ఉంది నీశరీరంకూడా- నేను దేవతార్చనకొరకు సేకరించిన ఈ పుష్పములు నీయంగసంగముచే (నీవంటనంటుటచే) కృతార్థమగుగాక- అభ్యాగతి పూజచేత నాజీవితం సఫలమగుగాక- స్వయ మభ్యాగతుడయిన అతిథి దేవునికంటెకూడ గొప్పవాడని శాస్త్రం- కనుక మీరెవరు? ఎవరి కుమారులు? ఏమి అనుగ్రహించదలచి వచ్చారు ఇచటికి? ఈనా సంశయమును బాపుడు- (నివారించుడు) అని అన్నాడు శిఖధ్వజుడు-

బ్రా॥కు॥డు॥ రాజా! నీవడిగిన విషయానికి సరిగా జవాబు చెబుతా విను- నమ్రతతో అడిగిన వానిని మోసపుచ్చే మానవుడుండడు- ఈ ప్రపంచంలో సదంతఃకరణగల నారదుడను నొకమహర్షి కలడు- అతడు పుణ్యమనే లక్ష్మియొక్క- నుదుటకర్పూరపు తిలకమువంటివాడు- అత డొకానొకపుడు మేరుపర్వతముయొక్క- గుహలో గంగానదియొడ్డున ధ్యానానికి కూర్చున్నాడు- ధ్యానావసానమునందు ఒకపుడు జలక్రీడకు సంబంధించిన కోలాహల ధ్వనిని విన్నాడు- విలాసగా చూచేసరికి ఆనదిలో స్త్రీసమూహం కనిపించింది- అతనికి ఇదేమిటని తెలిసికొన కుతూహలపడి పురుషులులేని యచ్చోట వివస్త్రలై జలక్రీడలాడుచున్న రంభాతిలోత్తమలతో సమానమయిన స్త్రీసమూహాన్ని చూచాడతడు వారి అవయవ సౌందర్యానికి హావభావాలకు పరవశుడై అమృతకళలను సంగ్రహించదలచిన దేవతలను, అమృతమును, రాహువూ, గరుడుడూ, అపహరించునేమోయని అట్టిఆపద తటస్థించకుండా చేయుటకు రహస్యముగా మేరుపర్వతగుహాలోపల దాచియుంచిన చంద్రబింబముయొక్క-

కలాపూరమువలె ఉన్నారు ఆస్త్రీలు. మదనమోహితుడయినాడు నారదుడు సకలావయవసారమయిన రేతస్సు స్ఖలించినది అతనికి. అని అన్నాడు బ్రాహ్మణకుమార్డు శిఖధ్వజునితో.

శిఖి॥ బ్రాహ్మణకుమారా! నారదుడు సర్వజ్ఞుడుకదా! జీవన్ముక్తుడుకదా! నిష్కాముడు నీరాగుడునుకదా! భక్తులలో అతనికి సాటియెవరును లేరుకదా! అట్టి మహానుభావుడు మన్మథానిష్టుడెట్లు అయినాడు? అని ప్రశ్నించాడు శిఖధ్వజుడు.

చూడాల ఇట్లన్నది. రాజర్షీ! ముల్లోకములందునూ భూతజాతి కంతటికీ శరీరస్వభావాలు సమానములు. అందువీళ్లు మానవులనీ, వీళ్లు దేవతలనీ భేదములేదు. అజ్ఞముకాని, తజ్ఞముకాని, అనగా వివేకయుక్తముకానీ అవివేకయుక్తముకానీ సూక్ష్మశరీరము అందరకూ సుఖదుఃఖమయముగానే ఉంటుంది. ఒకానొక తృప్తికర పదార్థంచేత సుఖం పెరుగుతుంది. దీపమువలన వెలుతురు పెరిగినట్లు. చంద్రునివలన సముద్రము పెరిగినట్లునూ, ఆకలి మొదలగు పదార్థములచే దుఃఖం పెరుగుతుంది. మేఘపుంజముచే చీకటి పెరిగినట్లు. దీనికంతటికి స్వభావమే కారణము.

కనుకనే దృశ్యజాతం స్ఫురించకుండా ఉండటానికి నిత్యమూ సమాధిలో నుండి స్వరూపానుసంధానమును చేసికోవలెను.

తమఃప్రకాశములతో (చీకటివెలుతురులతో) అహోరాత్రము లెట్లు నిలిచియున్నవో అట్లే శరీరంకూడ సుఖదుఃఖాలమీద నిలబడి ఉంది. అజ్ఞానికి దేహాదులందు ఆత్మభావన మెండు కనుక, అతని మనస్సుకు సుఖదుఃఖాలు గాఢంగా అంటుకుంటాయి.

మలినమయిన గుడ్డకు నీలిమందు అంటినట్లు. వివేకవంతుని చిత్తానికి మాత్రం సుఖదుఃఖాలు ఏమాత్రం అంటవు తత్త్వజ్ఞానంవల్ల స్ఫటికమణి యెదుటనున్న వస్తువుయొక్క భావాన్ని తాత్కాలికంగా పొందుతుంది. వివేకవంతుడు అమాత్రంగాకూడా మారడు. అజ్ఞాని చిత్తం

మాత్రం ఎదుటనున్న వస్తువుతో ఒక్కసారి సంబంధించినదా ఇంక మళ్ళీ విడువలేదు- కుంకుమకట్టిన గుడ్డలో కుంకుమతీసినా దానిరంగు మాత్రంపోదు-

అలాగే మూఢుని చిత్తంలో ఒక్కసారి దృశ్యం కాలుపెడితే దాన్ని తీసివేసినా, దానివాసనమాత్రం మనస్సులో నిలిచియే ఉంటుంది- బంధమోక్షాలుకూడా ఇలాంటివే- విషయరంజన వాసనోపచయం బంధం- వాసనాక్షయంమోక్షం- అని అన్నది చూడాల బ్రాహ్మణ కుమారుని వేషంలో ఉండి-

శిఖిధ్వజుడు ఆమెతో ఇలా అంటున్నాడు-

దూరస్థమయిన పుత్రరాజ్యాదులు కాని, సన్నిహితములయిన పదార్థాలు కాని, లభించినపుడు సుఖమూ, అవి నశించినపుడు దుఃఖమూ మానవునకు కలుగుతుందని అంటారులోకులు- దానిక్రమం ఎలాగో కొంచెం తెలవివ్వండి- నాకు వినాలని నిండా కోరికగా ఉంది అన్నాడు శిఖిధ్వజుడు-

చూడాల సుఖోత్పత్తికి కారణమయిన వస్తువును శరీరేంద్రియాలద్వారా మనస్సు ముందు గ్రహిస్తుంది- ఇది మనోహరమయిన వస్తువు- దీనివల్ల నాకుసుఖం కలదని అనుకుంటుంది- ఉల్లాసపడుతుంది- దానితో వ్యాకులపడుతుంది- మనస్సు వ్యాకులపడేసరికి కుండలినీశక్తియందలి జీవుడుకూడా వ్యాకులపడతాడు- ఉపాధిభూతమయిన మనస్సు వ్యాకులతను జెందితే ఉపహితచైతన్యంకూడా వ్యాకులతను చెందటం సహజం- జీవచైతన్యం నాడీసముదాయముద్వారా శరీరమంతటా వ్యాపించిఉంటాడు- అంచేత శరీరంలో ఎక్కడ సుఖస్పర్శ కలిగినా వెంటనే జీవుని కంటుతుంది- కుదుట్లో ఎక్కడపోసినా నీరు వ్రేళ్ళద్వారా చెట్టుకంటినట్లు-

సుఖమనుభవించే జీవునియొక్క నాడీసంచయంవేరు- దుఃఖమనుభవించే జీవునియొక్క నాడీసంచయంవేరు- ఈభేదం తప్పకుండా

అంగీకరించితీరాలి- ఎంచేతనంటే సుఖం అనుభవించేటప్పుడు జీవునకు మనస్స్వాస్థ్యం ఉంటుంది- దుఃఖమనుభవించేటప్పుడు మనస్సు అస్వాస్థంగా ఉంటుంది- దందహ్యమానంగా ఉంటుంది- పిత్తోష్మాది సంతాపకమయిన రసపూర్ణ నాడీమార్గముకుండా దుఃఖానుభవము జరుగుతుందని ఊహించవలెను- లోకంలో సువేషధారికి శోభస్కరమయిన మార్గాలు కువేషధారియగు నీచునకు శోభస్కరములుకావు- కనుక ఎంతవరకు జీవుడు అతిచంచలమయిన నాడిమార్గంలో ప్రవేశించి స్ఫురించకుండా ఉంటాడో అంతవరకు అతడికి దుఃఖప్రసక్తి లేదు- అంతవరకు ఆజీవుడికి స్వస్థావస్థమయిన ముక్తి సుఖమనే చెప్పాలి- మనస్సు స్వస్థంగా ఉన్నందున కాని యిది శాశ్వతముక్తిస్థితి కాదు- వైషయిక సుఖదుఃఖానుభవదశ అంతా బంధదశయే జీవుడికి- ఈ రెండూ లేని అవస్థయే ముక్త్యవస్థ- సుఖదుఃఖములు పూర్తిగా మనస్సునకంటని దశయే శుద్ధమయిన ముక్తిదశయని చెప్పాలి- ఈపరిస్థితి చిదాకాశమంతా బ్రహ్మయే యను నిశ్చయముకలిగి నప్పుడే కలుగుతుంది- అంతవరకు కలుగుట దుర్లభము-

అయితే బ్రాహ్మణకుమారా! జీవుడు సుఖసంచారయోగ్యములయిన నాడులయందు ప్రసరిస్తూఉంటె వీర్యచ్యవనము (రేతస్ఖలనము) ఎలా జరుగుతుంది? అని అడిగాడు శిఖిధ్వజుడు-

చూడాల॥ రాజర్షీ! స్త్రీపిండమును చూచేసరికి లోపల రాగవాసన ఉద్బుద్ధమై జీవుడు క్షుబ్ధుడు(క్షోభము చెందినవాడు)అవుతాడు- అట్టి జీవచైతన్యముయొక్క ఆజ్ఞావశంచేత వాతస్పందము కలుగుతుంది- అందు వ్యానవాయువు మెదడు యెముకలు మున్నగువానిలో సంచరిస్తూఉంటుంది- దానికికూడా సంచలనం కలిగేసరికి ఆ మేదస్సులో అంతర్గతమయియున్న సారమూ, మజ్జాసారమున్నూ పత్రపుష్పాదుల పరాగముచాలిపడినట్లు ప్రవిస్తూంది- తొడిమనుంచి ఊడిన పండు జారిపడినట్లు సర్వాంగసారమయిన వీర్యము వ్యానవాయుచలనంచేత స్ఖలనాన్ని

చెందుతుంది- దేవపుత్రా! మీరు చాలావిజ్ఞులు- మీరు మొట్టమొదట శరీరానికిది స్వభావమని అన్నారు- స్వభావమంటే యేమిటి? కొంచెం వివరించండి- అని అడిగాడు శిఖిధ్వజుడు-

చూ॥ సృష్ట్యారంభసమయంలో సృష్టికభిముఖమయిన బ్రహ్మ ఏయేపదార్థమును ఎట్టిధర్మముకలదానినిగా తానుభావించి మనసుకు స్ఫురింపజేసికొని నిర్మించినాడో ఆయాపదార్థములు ప్రళయపర్యంతమూ అదే ధర్మంలో ఉండటం స్వభావమని అంటారు-అన్నాడు శిఖిధ్వజుడు-

ఇట్లు ౮౩వ సర్గ సమాప్తము.

౮౪. కుంభజనన కథనము.

చూడాల॥ రాజర్షీ! ఈ ప్రపంచమంతా మాయాశబల బ్రహ్మ యొక్క స్వభావవశమున బుట్టి ధర్మాధర్మములకు పరతంత్రమై వాసనా రూపంలో ఉన్నది- వాసనాక్షయమయిన పిదప ధర్మాధర్మముల కందదు- అనగా జ్ఞానాభ్యాసముచే వాసనాక్షయమయిన ఇంక నామూ నవునకు ప్రపంచానుభవముండదు- ఇది మా అనుభవము- అని అన్నది చూడాల-

శిఖి॥ దేవపుత్రా! మీావచనము అమూల్యము- మీరు వక్తల లోనిపుణులు- మీామాట అనుభవానికి సూటిగా సరిపోవుచున్నది- అతి గూఢము- పరమార్థమును అయియున్నది- మీామాటలు వినునపుడు అమృతమును త్రాగినట్లు గర్భకోశము చల్లపడుచున్నది- కాని యిక ముందు మీాజన్మకారణమును తెలవివ్వండి సంక్షేపంగా వింటాను- బ్రహ్మపుత్రుడయిన నారదుని వీర్యము స్ఖలితమయినదని యంటిరే యీా కథాసందర్భంలో మొట్టమొదట- ఆయనగారు ఆవీర్యమును ఎక్కడ ఉంచాడు చెప్పండి? అని అన్నాడు శిఖిధ్వజుడు-

చూడాల॥ రాజర్షీ! ఆమేరుగుహాలో ఆయనగారు తపస్సుచేసెడి తావున కొండరాళ్ళకు తగిలినా పగలినంతటి గట్టిది స్ఫటికమణి విశార

మయిన కుండ యొకటి ఉన్నది- దానిలో నారదుడు స్ఖలితమయిన తన వీర్యమును ఉంచాడు- సంకల్పవశంచేత పాలనుకల్పించి ఆకుండ నింపారు నారదులు- కొంతకాలానికి సముద్రమునుంచి చంద్రుడు పుట్టినట్లు ఆకుండనుంచి సర్వావయవపరిపూర్ణమయిన గర్భము బయట పడింది- కొన్నిదినాలలో శుక్లపక్షచంద్రునివలె సర్వాంగసుందరమై అభివృద్ధికొందినది ఆగర్భము- (ఆశిశువు) నారదమహాముని ఆశిశువునకు సకలసంస్కారములుచేసి సకలవిద్యలూ నేర్పి తనంతటివానినిగా జేసినాడు- అతండ్రీ కుమారులిద్దరూ రత్నమునందు ప్రతిబింబించిన చంద్రునివలె ప్రకాశించిరి- నారదుడు ఆకుమారుని తోడ్కొని బ్రహ్మలోకముచేరి బ్రహ్మగారికి అభివాదనమొనర్చి పుత్రుని చేతికర్పించెను- బ్రహ్మగారాపిల్లవానిని తొడమీద గూర్చుండ బెట్టుకొని ఆశీర్వదించి అతడు సర్వజ్ఞుడూ, జ్ఞానపారగుడూ అనిగ్రహించి అతనికి కుంభమునందు బుట్టుటచే కుంభుడను నామమిడెను-

రాజర్షిసత్తమా! ఆకుంభుడను పిల్లవాడనే నేను- నాతండ్రితో కూడ నేను బ్రహ్మపురంలో నివసించుదును- నాకు నాలుగు వేదములూ సుహృదులు- (స్నేహితులు) సరస్వతి నాకుతల్లి- గాయత్రి నాకు పినతల్లి- బ్రహ్మలోకమునందు నాయిల్లు- నేను బ్రహ్మగారి మనుమడను- నాయిచ్ఛవచ్చినట్లు నేను ముల్లోకములూ తిరుగుచుందును- నాకేకోరికయులేదు- నాకిది విలాస- నేను భూలోకమునతిరిగినా నాకాళ్లు నేలను అంటవు- పరాగమునంటవు- అవయవములు డస్సిపోవు- శరీరము కృశించదు- నేను ఆకాశమార్గమునుండి వచ్చుచుండుట మీరు చూచుచునే యున్నారుకదా! అక్కడనుంచియే నేనిపుడు ఇచటికి వచ్చితిని- మీరడిగినదంతయు చెప్పితిని అని అన్నది చూడాల-

ఇట్లు మహాముని(వసిష్ఠమహాముని) చెప్పుచుండగా సాయంకాలమయినది- సాయంకృత్యమునకు సభ లేచినది- సంధ్యాదికార్యములను

సెనవేర్చుకున్నది- మరల తెల్లవారగానే స్నానసంధ్యాదికార్యముల తీర్చుకుని సభసమావేశమయినది-

ఇట్లు పదియేడవరోజు ప్రసంగము ముగిసినది-

గమనిక—

శిష్యుడు॥ గురూ ! స్త్రీలకు పరదేవతయగు భర్తగారి యెడట ధర్మజ్ఞురాలగు చూడాల ఇట్లు అనృతమెట్లు చెప్పినది ?

శ్లో॥ శతమశ్వానృతే హంతి సహస్రంతు గవానృతే ।
ఆత్మానం స్వజనంహంతి పురుషః పురుషానృతే ॥

అనికదా పూర్వరామాయణమున శ్రీరామువచనము వినిపించుచున్నది-

పురుషులయెడ అనృతమాడినచో స్వజనక్షయము, ఆత్మ నాశము అగుననికదా దీని తాత్పర్యము-

మరియు,

శ్లో॥ యోఽన్యథా సంతమాత్మానం అన్యథా ప్రతిపాదయేత్
కిం తేన నకృతం పాపం చోరేణాత్మాపహారిణా ॥

అని మహాభారతమందు భరతునిగూర్చి శకుంతలావచన మొకటి వినిపించుచున్నది- తన స్వరూపమును తానుమార్చి చెప్పుట మహాపాపమని నొక్కి వక్కాణించుచున్నది యది-

కనుక ధర్మశాస్త్ర మిట్లుండ చూడాల నిజభర్తతో తెలిసి యుండికూడ అనృతమాడుట దోషముకాదా! దీనినెట్లు సమర్థించెదరు!

గురువు॥ శిష్యా ! వినుము- చూడాల తనభర్తకు బ్రహ్మవిద్యను బోధింపదలచినది- తాను నిజస్థితిని చెప్పినచో శిఖిధ్వజుడు ఆమెమాటలను పాటింపడు- కనుక ఆతనికి ప్రామాణ్యబుద్ధి కలిగించుటకొరకు తన రూపమును మార్చిచెప్పినది- కనుక ఆమెయొక్క వాక్యమునకు తాత్పర్యవిషయమగు అర్థము బాధింపబడుట లేదుకాన ఇయ్యది అనృ

తము కానేరదు—అనగా మాటయొక్క వాచ్యార్థము బాధితమయిననూ, తాత్పర్యార్థము అబాధితమయినందున అనృతత్వదోషము వాటిల్లదు—

ఇట్టివాక్యములు వేదమునందుగూడకలవు— "బబరః ప్రావాహాణి రకామయత । స్తేనం మనోఽనృతవాదినీవాక్ । గ్రావాణః ప్లవంతే॥" ఇత్యాదివైదికార్థవాదవాక్యములు వాచ్యార్థమునందు బాధితములయినను తాత్పర్య విషయమగు అర్థమునందు అభాధితములు కావున ప్రమాణములని యంగీకరించబడినవి—

మరియు, తత్త్వజ్ఞానబలంచేత జీవునకు సర్వాత్మత్వము ప్రాప్తించును. కనుకనే వామదేవుడు గర్భమునుండి బయటపడునపుడే "అహం మనురభవం సూర్యశ్చ" "నేను మనువును నేను సూర్యుడను" అని చెప్పెను తత్త్వజ్ఞానబలంచేత— ఈవామదేవవాక్యము అనృతమని పెద్దలు నిర్ణయించలేదు— పైగా శాస్త్రకర్తలు ప్రమాణముగ గైకొనినారు— కనుక నట్లే చూడాలకూడ "సోఽహమయం కుంభః" నేనే ఆకుంభుడను అని చెప్పుట అనృతము కానేరదు—

మరియు నిచట భర్తను భార్య మోసపుచ్చినదను నేరము (దోషము) కూడ లేదు—

శ్లో॥ కర్మణా మనసా వాచా సదాభర్తుర్హితం చరేత్ ॥

అను వచనమునను సరించి భర్తకు బ్రహ్మవిద్యయందు విశ్వాసమును పుట్టించుటచే పరహితమయిన నీవాక్యము మోసగింపుమాటవంటిది కానేరదు—

ఇట్లు ౮౭వ సర్గ సమాప్తము.

## ౮౭. శిఖధ్వజావబోధ.

శిఖి॥ దేవపుత్రా ! నాపూర్వపుణ్యములచే మీరీపర్వతమునకు వచ్చితిరని భావింతును— ఇపుడు నేనుధన్యుడను— అమృతము బలికెడి మాటలచే మన్నింపబడినాను. (బోధింపబడితిని) మీవలె చిత్తప్రశాం

తిని కలిగించెడివారు వేరేలేరు- సజ్జనసాంగత్యమనునది రాజ్యప్రాప్తి కంటెకూడ గొప్పది- సజ్జనసాంగత్యమునందు అపరిచ్ఛిన్నమయిన బ్రహ్మానందముగలదు- ముక్తపురుషులచరిత్ర మననమగుచుండును- రాజ్యలాభాదులు తుచ్ఛసుఖములనిచ్చునుగాని నిరర్గలసుఖములనీయవు- అన్నాడు శిఖధ్వజుడు-

వసి॥ రామచంద్రా ! ఇలా శిఖధ్వజుడు చెప్పుచుండగనే నిరోధించి చూడాల ఇట్లన్నది అతనితో-

చూడా॥ రాజర్షీ ! నేను చెప్పినకథ అట్లుండనిండు- మీరెవరు ? మీరీపర్వమున ఏమిచుంటిరి ? ఈవనవాసము ఎంతకాలము జరిపెదరు ? వనవాసమువలన మీరు సాధింపదగిన ప్రయోజనమేమి ? మీబోటి తాపసులు అబద్ధమాడరు- కనుక మీపరిస్థితి అంతా దాచక చెప్పండి- అని అన్నది చూడాల-

శిఖ॥ దేవపుత్రా ! మీకంతయూ తెలుసును- మీరు లోకవృత్తాంతమును క్షుణ్ణముగా తెలిసినవారలు- నేను మీకేమిచెప్పేది- సంసారభయమునకు భీతిలి నేను వనవాసము జేయుచున్నాను- మీకు తెలిసియున్నా నేను సంక్షేపంగా చెపుతాను-

నేను శిఖధ్వజుడను రాజును- రాజ్యమును వదిలితిని- ఈప్రపంచంలో పునర్జన్మకు (మరలపుట్టుటకు) మిక్కిలి భయపడుచున్నాను- సంసారంలో సుఖంతర్వాత దుఃఖం, దుఃఖంతర్వాతసుఖం- చావుతర్వాత పుట్టుక- పుట్టుకతరువాతచావుకదా ! అని ఈయడవిచేరి ఏమీతోచక పరితాపపడుచున్నాను- ఎన్నిదిక్కులు తిరిగినా ! ఎన్ని ఆశ్రమాలు సంచరించినా నాకు విశ్రాంతిచిక్కుటలేదు- ప్రయత్నంలేక పోయినా ప్రయోజనంలేకపోయినా ఒంటరిగానుండి శుష్కించి పోవుచున్నాను- అన్నాడు శిఖధ్వజుడు- చూడాల ఋషిసత్తమా ! నేనొకతూరి బ్రహ్మగారినడిగినాను "జ్ఞానకర్మల రెంటిలో ఏదిగొప్పదో" చెప్పమంటిని- అపుడు బ్రహ్మగారు నాతో ఇట్లనిరి-

బ్రహ్మ॥ జ్ఞానమేగొప్పది- జ్ఞానమువలననే పరమ శ్రేయమగు కైవల్యమును పొందగలుగుతాడు మానవుడు- కర్మమార్గము కాలక్షేపము కొరకుమాత్రమే- అదియొక వినోదము- అనగా స్వర్గాదిభోగవినోదమే అందుకలదు- లబ్ధజ్ఞానదృష్టులకు (జ్ఞానమార్గము అలవడనివాళ్ళకు) కర్మమార్గమే పరాయణము (పరమగతి) వాసనాబద్ధుడయిన అజ్ఞానికి కర్మలు ఫలవంతములుగా తోచుచుండును- వాసనాక్షయమునొందిన జ్ఞానికి కర్మలు నిష్ఫలములని తోచును- వాసనారహితమయిన కర్మ ఫలించదు- భూతవాసనగల పిల్లవాడు భూతమునే చూచుచుండును- కర్మ ఎంతభాసురంగా (అందంగా) ఉన్నా జ్ఞానికి ఫలమునీయజాలదు- సర్వాత్మ భావనగల వానికి ప్రపంచవాసన ఉదయించదు- వాసన నశించినవానికి (వాసనలేనివానికి) జన్మజరామరణవర్జితమయిన పదవి యబ్బును- వాసనా సహితమయిన మనస్సు జ్ఞేయమగును- వాసనా రహితమయిన మనస్సు జ్ఞానరూపమగును- జ్ఞానముచే జ్ఞేయము నశించిన జీవుడు పునర్జన్మనొందడు-అని అన్నారు బ్రహ్మగారు అని చూడాల శిఖిధ్వజునితో అనినది-

చూడాల॥ రాజర్షీ! బ్రహ్మాదిదేవతలుకూడా జ్ఞానము కైవల్యప్రదమని చెప్పియున్నారు- ఇంకా మీకెందుకీ యజ్ఞానము- కమండలమూ, దండమూ, దర్భాసనమూ, ఎందుకీ అనర్థవిలాసాలన్నీ-వీటితో రమింపదలచితిరేమి! "నేను ఎవరు? ఈప్రపంచం ఏమిటి? ఇది శాంతించెడి ఉపాయమేది? అని ఆలోచించరేం? అజ్ఞానివలె ఉంటారేం? బంధమెలావచ్చింది- మోక్షంఎలాగు? అని ప్రశ్నించుకొని సమాధానమును చెప్పెడి తత్త్వవేత్తల పాదసేవచేయరేమి? వ్రత, ఉపవాస, శీత, ఉష్ణాది దుఃఖములనిచ్చెడి ఈకర్మమార్గమునందలి ప్రవృత్తి మీకేల? ఆయుర్దాయము వ్యర్థపుచ్చుకొనుచున్నారు- సమదృష్టిగల సాధువులను ప్రశ్నించండి- సేవించండి- వారిసాంగత్యంవల్ల ముక్తినిపొందే యుక్తి మీకు లభిస్తుంది- కనుక తపశ్చర్యాది బాహ్యచేష్టలను వదిలి, తత్త్వ

వేత్తలను సేవించుచూ, వారియుపదేశముల గ్రహించుచూ, ధరావివర కీటమువలె (కన్నములోని పురుగువలె) నిశ్చలముగ నుండుము” అని అన్నది చూడాల-

వసి॥ దేవరూపిణియగు భార్యచే ఇట్లు బోధింపబడి శిఖిధ్వజుడు కన్నీరుకార్చుచూ ఇట్లనెను-

శిఖి॥ దేవపుత్రా ! ఇంతకాలానికి మీవలన నేను తత్త్వబోధను పొందితినికదా ! మీసాంగత్యంచే నాకు మౌఢ్యము వదిలినది- నాపాప మంతా నిశ్శేషంగా రూపుమాసినది- మీయంతట మీరుదయచేసి తత్త్వబోధచేసితిరికదా ! మీరే నాగురువు- తండ్రి- స్నేహితులు- నేను మీశిష్యుడను- మీపాదాలకు మ్రొక్కుచున్నాను- దేనిని తెలిసి కుంటే ఈసంసారశోకముండదో, దేనివల్ల నేను అఖండానందము నొందెదనో, అట్టి బ్రహ్మను నాకుపదేశింపుము- ఘటపటాది చిల్లరజ్ఞానములు అనేకములుగలవు- జ్ఞానములలోకెల్ల పరమమగుజ్ఞానము ఆత్మజ్ఞానము- అదియే సంసారతారకము- అనినాడు శిఖిధ్వజుడు-

చూ॥ రాజర్షి ! నామాటమీద మీకు విశ్వాసముంటె మీకు తత్త్వమును చెప్పెదను- ఇంతేకాని మీకు విశ్వాసములేకపోతేమాత్రం “కొయ్యమీద కాకిరొదవలె” (చెట్టుమీదకాకిగోలవలె) నేను మీ కుపదేశముచేయను- విశ్వాసములేనిదానికి చెప్పటమూ దండుగే- అట్టి వాడు అడుగుటయు దండుగయే- ఈరెండూ చీకటిలో కండ్లువలె వ్యర్థ ములే యగును- అనినది చూడాల

శిఖి॥ దేవపుత్రా ! మీమాటను వేదవాక్యమువలె ప్రమాణ ముగ గైకొందును- సందేహింపక వెంటనే సెలవిండు- అన్నాడు శిఖి-

చూడాల॥ రాజర్షి ! కుమారుడు తండ్రిమాటను గ్రహించినట్లు నామాటను మీరు గ్రహింపుడు- వినుడు- విన్నతరువాత మీకు హిత మయిన దానినిగ భావింపుడు- మీచరిత్రకు సరిపోయెడి మణికాచో

పాఖ్యానమును, హాస్తికాఖ్యానమునూ జెప్పెదను వినుడు- విషయము విస్పష్టముగా మీకుబోధపడగలదు- అజ్ఞానము నశించగలదు- అనినది చూడాల-

ఇట్లు ౮౭వ సర్గ సమాప్తము.

## ౮౮. మణికాచోపాఖ్యానము.

చూడా॥ ఋషిసత్తమా! పూర్వకాలంలో కలడొక రాజు- అతడు ఔదార్యవైరాగ్యములకూ, సర్వస్వత్యాగ సంపదలకూ ఆటపట్టు- సముద్రము బడబానలమునకూ, నీటికి స్థానమయినట్లు- అనగా అతి విరుద్ధములయిన గుణములు అతనిని ఆశ్రయించి యున్నవనిభావము- అతడు చాలావ్యవహారదక్షుడు- విద్యాశాలి- అస్త్రవిద్యాధురంధరుడు- కాని ఆత్మజ్ఞాన శూన్యుడు- ఆరాజు కొంతకాలానికి బడబాగ్ని సముద్రాన్ని ఎండగట్టుటకు యత్నించినట్లు చింతామణిని సాధించుటకు ప్రయత్నించాడు- అతడు చేసిన ప్రయత్నమహిమవలన చింతామణి సిద్ధించినది- గట్టిప్రయత్నం చేయువారలకు ఏది సిద్ధించదు! కాని ప్రజ్ఞావిశేషాన్ని ఆశ్రయించి విసుగులేకుండా ప్రయత్నించాలి- అలా ప్రయత్నిస్తే ఎంతటి దరిద్రుడయినా కోరినదానిని నెరవేర్చుకొనగలుగుతాడు-

ఆరాజునకు ఎదుట బారెడు దూరంలో చేతికందేటట్లు చింతామణి కనిపించినది- కాని అతనికి నిశ్చయం కలుగలేదు- ఆశ్చర్యం కలిగింది- భ్రాంతిపడినాడు- ఇలా ఆలోచించసాగినాడు- "ఇది నేనను కొనిన చింతామణియేనా? (ఇది అపాతజ్ఞానము) ఇది మణికాదు- (ఇదిభ్రమ)చింతామణియే అయినచో నాకంటికి గోచరించదు-అయినా పరీక్షించుటకు తాకిచూచెదను- (కోరికను వెళ్ళడించుట) ఒకవేళ చింతామణియే అయినచో దౌర్భాగ్యుడనయిన నేను తాకినందున అది అంతర్ధానమును పొందును- కనుక స్పృశించను- అని యిలా సుదీర్ఘంగా ఆలోచించాడు-

నిజంలో ఇది చింతామణే అయితే జీవితాంతమువరకు ప్రయత్నించినా లభించనిమణి ఇంతకొద్దికాలంలో నాకులభించెడిదికాదు. నేనతికృపణుడను- కనుక నాకిది భ్రమ. సకలకోరికలు తీర్చగల చింతామణి యింతకొద్దికాలంలో లభింపగల భాగ్యం నాకెక్కడిది ? అలాంటి భాగ్యవంతులు వేరు- వారికి అట్టిసంపదలు సులువుగా లభింపవచ్చు- నేనట్టివాడనుకాను- నేను కొద్దిపాటి పుణ్యశాలినగు మానవుడను- సాధువులలో చాలా తక్కువవాడను- నాకింతటి కార్యసిద్ధి యింత త్వరగా జరగనేరదు- అని ఇలాంటి వికల్పాలతో ఆలోచిస్తూ తుదకు ఆమణిని ముట్టుకొనుటకు సాహసించ లేకపోయినాడు. చూడండి ! కానివేళ వచ్చేసరికి అరచేతికి చిక్కిన దానినికూడా అనుభవించలేక పోతాడు జీవుడు.

గమనిక॥ ఈకథాప్రారంభంలో చూడాల ఈరాజు వ్యవహార విచక్షణు(దక్షు)డని చెప్పినది- ఇపుడీమణి సిద్ధించినపుడు ఆవిచక్షణత ఏమయినది? అనే ప్రశ్న యిచట ఉదయించుట సహజము-

సమాధానము॥ ఫలసిద్ధులు సంప్రాప్తమయి మానవునకు ప్రాజ్ఞతను (వివేకసంపదను) ప్రసాదించును-మానవుడు ఆఫలసిద్ధులను అనుభవించలేక ఉపేక్షించుచో, లోగడఉన్న వివేకమును కూడా నశింపజేసి అవిలేచిపోవును- చూడుడు ఇందుకు ప్రమాణమును-

శ్లో॥ న దేవా దండమాదాయ దండయంత్యపరాధినమ్ ।
బుద్ధిం తస్యాపకర్షంతి తేనాసౌ దండ్యతే స్వతః ।

దేవతలు ఎవనిని కర్రతోకొట్టి శిక్షించరు- వానిబుద్ధిని నశింపజేతురు- అదియే వాడికి దండన- అని దీనియర్థము-

ప్రకృత రాజుపరిస్థితికూడా అంతే అయినది. అతనికి వివేకము నశించినది- లభించిన చింతామణిని వదిలేశాడు- మళ్ళీ మణిని సాధించటానికి ప్రయత్నించాడు- కొంతకాలానికి ఒకానొకచోట ఒకగాజు

ముక్కను చూచాడు- ఇది చింతామణిఅని అనుకొనినాడు- మూఢులు బంగారంమట్టి అనుకుంటారు- మట్టిని బంగార మనుకొనుదురు భ్రాంతి పడినవారు ఎనిమిది సంఖ్యను ఆరుసంఖ్యగా లెక్కించును- శత్రువును మిత్రునిగా తలంచును- తాటిని పాముగా భ్రమించును- నేల నీరను కొనును- నీరు నేలయనుకొనును- ఈయవి భ్రాంతికి లక్షణములు- అతను పాపిష్ఠి గాజుముక్కను మణిగా గ్రహించి ఉన్న ధనధాన్యాది సంపదలనుకూడా పోగొట్టుకున్నాడు- చింతామణివల్లనే మనకంతా లభిస్తుందనితలచి లోగడి ఐశ్వర్యమును కూలగొట్టుకున్నాడు- ఈయిల్లు ఎందుకు? ఈబంధువులెందుకు? ఈధనధాన్యాదులెందుకు? దూరముగా పోయి చింతామణి సంపాదించుకొని సుఖంగా ఉంటాను- అని ఆసించాడు- కాని తుదకు దొరకినమణిని విడనాడుకొని ఈకష్టస్థితిని పొందాడు- కనుక ఇదిఅంతా ఆరాజుయొక్క మౌర్ఖ్యమువలన తటస్థించినది- కనుక రాజన్! మౌర్ఖ్యమువల్ల సకల ఆపదలూ సంభవించును- అదిలేనున్నచో అఖండానందమే కాన ఆపదలకు నెత్తిమీద మౌర్ఖ్యముంకును- మానవునికి నెత్తిన నల్లని కేశజాలమున్నటుల అన్నది- చూడాల-

ఇట్లు ౮౮వ సర్గ సమాప్తము.

౮౯. హస్తికోపాఖ్యానము.

చూడా॥ రాజసత్తమా! నీకు ఇంకొకకథ చెబుతావిను- చాలా రమ్యంగా ఉంటుంది- దానివలన మంచివివేకం కూడా కలుగుతుంది-

పూర్వము వింధ్యాటవిలో గొప్పయేనుగ ఒకటి ఉండేది- దానికి వజ్రాయుధమువలె తీక్ష్ణమయిన దంతములు రెండుగలవు- దానిని మావటివాడు ఇనుపగొలుసులతో గట్టిగా కట్టివేయు చుండెను- అంకుశముతో నిరంతరము పొడుచుచుండెను- ఆబాధ ఆఏనుగునకు అతి దుర్భరమయినది- ఆమావటి దానిపాలిట పరమశత్రువయినాడు- అలా

మూడు సంవత్సరములు బాధపడినది ఆఏనుగు- ఇక భరించలేక ఇనుప గొలుసులు తెంచుటకు యత్నించినది- దంతములతో కొరికి పట్టుబల వంతముమీద రెండు గడియలలో త్రెంచి వైచినది- త్రెంచునపుడు మావటి దగ్గరలేడు- దూరముగనున్నాడు- కాని అక్కడనుంచి ఇది కొరికి త్రెంచుటను జూచుచున్నాడు- ఆకోపమును పట్టజాలక మావటి వాడొక పెద్దతాటిచెట్టునెక్కి- అక్కడనుంచి దానికుంభస్థలముమీదికి ఉరికినాడు- ఆతాకుడుచే ఏనుగుయొక్క కుంభస్థలము బ్రద్దలగునని వానితలంపు- కాని దురదృష్టవశమున ఆమావటివాడు ఏనుగుతలమీద పడక తప్పిపోయి గాలికి పండినపండువలె నేలమీద పడినాడు- పడి యున్న మావటివానిని జూచి తనకు శత్రువయినను వానిని దయతలచి నది- నేలపడినవానిని చీల్చి వైచినందున నాకు వచ్చెడి ఖ్యాతియేమి? ఇదియొక పౌరుషమా! అని ఆలోచించి బలము కలదయినను ఆఏనుగ ఆమావటిని చంపలేదు- తన సంకెళ్లుమాత్రం తాను త్రెంచుకొని ఆ యడవిని పడిపోయినది- ఏనుగ వెళ్ళినతరువాత మావటివాడు కొంత సేపటికి స్వస్థదేహుడైనాడు- అంతటి యెత్తునుంచి పడినను అతని శరీ రమునకు ఏమాత్రమూ దెబ్బతగులలేదు- దుర్మార్గుల దేహము దుర్భే దము- అత్యుత్సాహముతో పరుగిడ మొదలిడినాడు- ఏనుగు కనిపింప కుండా తప్పించుకు పోయినందుకు ఖేదపడినాడు- వెదక నారంభించగా ఆయడవిలో నొకానొకచోట తీగలగుబురు చాటున చాలకాలానికి అతనికి కనిపించినది- దానిని మరలపట్టుకొని కట్టివేయదలచి ఆమావటి ఆతీగల గుబురునకుచుట్టూ సముద్రవలయముతే అగాధమయిన గొయ్యి తీయించి దానిపయినమాత్రం ఆకులు తీగలు కప్పియుంచినాడు-ఆగుబురు నుంచి యేనుగు ఏదిశగా వచ్చినా ఆగోతిలో పడవలసినదియే- కొన్ని దినములకు వనములో తిరుగదలచి ఆఏనుగు తీగలగుబురునుంచి బయటికి వచ్చి ఆగోతిలో పడినది- అంతట దానిని పట్టుకొని వాడు శృంఖలము లతో బంధించినాడు- మరల నాయేనుగునకు బాధతప్పలేదు- అంతకు ఆఏనుగు ముందట మావటివాడు నేలమీదపడియున్నపుడే వానిని చీల్చి

వైచినచో ఇప్పుడు ఏనుగునకీబాధ యుండెడిది కాదుకదా! కనుక ఇట్లే మానవుడుకూడ ముందు జరుగబోయే పనిని తెలియలేక మూర్ఖత వహించినవాడు ఈయేనుగువలె అనర్థమును బొందును- ఏనుగు నేను శృంఖలాబంధమునుంచి విముక్తుడనయినానని ముందు సంతోషించినది- ముందెన్నడు అట్టి అనర్థము జరుగకుండునట్లు చేసికొనవలెనను వివేకము దానికి కలుగలేదు- కనుక మౌర్ఖ్యము సర్వథా అనర్థకము'' అని అన్నది చూడాల-

ఇట్లు ౮౯వ సర్గ సమాప్తము.

## ౯౦. చింతామణి సాధక వృత్తాంతవివరణము.

చూడాల॥ రాజేంద్రా! నేను చెప్పిన రెండుకథలకు తాత్పర్యమును జెప్పెదవినుము- నీహృదయమనే గృహములో చిత్తమనే గోడమీద వ్యాఖ్యానమనే రంగుతో కథఅనే బొమ్మను చిత్రించెదను- శాస్త్రార్థకుశలుడూ తత్త్వజ్ఞానశూన్యుడూ, చింతామణిసాధకుడూ అయిన ఒకరాజు ఉన్నాడని నీకు నేను మొట్టమొదట చెప్పితిని కదా! ఆరాజు నీవే- నీకు శాస్త్రార్థమంతా తెలుసు- కాని నీకు తత్త్వజ్ఞానం లేదు- చింతామణిని సంపాదించ దలచుకున్నావు- చింతామణి అనగా సర్వసంగపరిత్యాగము (లేక సర్వస్వత్యాగము) సహజమయిన సర్వస్వత్యాగమే చింతామణి- సర్వస్వత్యాగంచేత సర్వాత్మకమయిన బ్రహ్మపదార్థము లబ్ధమగును- అది అఖండానందరూపము- చింతామణివలన కూడా సర్వమూ లబ్ధమగును- ఎందునూ కొఱతయుండదు- సర్వసంపూర్ణునకు ఏదుఃఖమూ యుండదు- నిత్యమూ ఆనందమే అతనికుండును-

నీవు సర్వపరిత్యాగతుల్యమయిన చింతామణిని సాధించుకున్నావు- రాజ్యమును వదిలేశావు- భార్యనూ, ధనమునూ, బంధువులనూ, పరిత్యజించావు- నీదేశానికి దూరముగా ఉన్న నీయాశ్రమమును చేరినావు- అన్నీ వదిలేశావుకాని అహంమతిని అనగా నేనను అభిమానమును మాత్రము వదలలేక పోయినావు- అదివదిలితే పరమానందమును

పొందెడివాడనే- కాబట్టి నీకింకా అజ్ఞానమనేది ఉన్నదన్నమాట- అంచేత ఈసర్వత్యాగము నీకు పరమానందమును ప్రసాదించలేదు- అందువలననే ఇంకేదో వున్నదిగొప్పది దానిని సాధించాలి అనే ఆలోచన కలిగినదినీకు- ఆ ఆలోచన దానికి సంబంధించిన మనోవికల్పాల చేత నీవు సాధించుకున్న సర్వపరిత్యాగముయొక్క స్వరూపము (లేక ఫలము) కాస్తా ఎగిరి చక్కాపోయింది- మనశ్చింతఅనేది మిగిలి ఉంటే నిరంజనమయిన సర్వత్యాగమెట్లు లభించును? సంకల్పమును నీవు గట్టిగా పట్టుకొని యుండేసరికి త్యాగమనేది నీమదినుండి లేచిపోయింది- ఏమాత్రం చప్పుడయినా చెట్టుమీాది పిట్టఉండదు- లేచిపోతుంది- అలా అయింది నీత్యాగముకూడా-

సర్వత్యాగమనే మణి జారిపోయేసరికి నీవు తపస్సు అనే కాచమణిని(గాజుముక్కను)సంకల్పమనే కంటితో కనిపెట్టావు- ఆదుఃఖంలో మునిగిపోయావు- మొట్టమొదట నీవు రాజ్యభోగములందు అనాసక్తితో సర్వత్యాగమును ఉపక్రమించి తుదకు అంతులేని వాసనాజాలంతో కూడిన తపశ్చర్యను ప్రారంభించావు- తపశ్చర్య అనునది ఆదిమధ్యావసానములందుకూడ దుఃఖప్రదము- అపరిమితానందమును విడిచి మితమయిన వస్తువునందు ప్రవర్తించువాడు ఆత్మహంతకుడు- అని అంటారు పెద్దలు-

కనుక రాజా ! సర్వత్యాగమును ప్రారంభించినావు- కాని దానిని నిలుపుకొనలేక పోయినావు- తుదకు వనవాసమూ, తపోనుష్ఠానమూ, కాయక్లేశమూ, మున్నగు బంధములలో పడ్డావు- ఇట శీతవాతాతపాదులవల్ల మనశ్చింతలు ఇంటికంట యిబ్బడి యగును- సంసారబంధముకంటె వనవాసబంధము అధికమయినదని నాయభిప్రాయము- "చింతామణిని నేను సంపాదించుకున్నాను- (నేను పొందాను)" అని అనుకొన్నావు- కాని నీకు పగిలిపోయిన స్ఫటికపు ముక్కగూడ దొరకలేదు- కాబట్టి రాజా ! నీచరిత్ర మణికాచోపాఖ్యానముతో సమానముగా ఉంది- అన్నది చూడాల-

ఇట్లు ౯౦వ సర్గ ముగిసినది-

## ౯౧. ఇభ వృత్తాంతము. (హస్తికోపాఖ్యానము)

చూడా॥ రాజశార్దూలా ! నీకు లోగడ వింధ్యపర్వతమునందలి ఇభవృత్తాంతమును చెప్పినాను- (ఇభమనగా ఏనుగు) (వృత్తాంత మనగా దానికథ) ఆకథకు తాత్పర్యం చెపుతాను విను- అదివింటేకాని నీకు తత్త్వజ్ఞానము కలుగదు-

వింధ్యాటవిలో ఒకఏనుగు ఉన్నదని అన్నాను- అది నీవే- దానికి రెండుదంతములున్నవని అన్నాను- అవి నీవైరాగ్యవివేకములు- ఆఏనుగును శిక్షించెడి హస్తిపుడు(అనగా మావటివాడు) ఒకడు కలడని చెప్పితిని- అనగా నీయజ్ఞానము- మావటివాడు ఏనుగునెత్తిమీద ఎక్కి అంకుశంతో పొడిచి బాధపెట్టుచున్నాడు- అజ్ఞానము నిన్నాక్రమించి దుఃఖపెట్టుచున్నది- ఏనుగు అతిబలశాలి యగు జంతువు- మావటీడు దానిద్వారా చాలాదుర్బలుడు- అయిననూ దుర్బలుని చేతిలో బలశాలియగు జంతువు బాధపడుతోంది- అలాగే అతిబలశాలివగు నీవు దుర్బలమయిన అజ్ఞానమువలన భయపడుతున్నావు- దుఃఖమనుభవిస్తున్నావు-

రాజా! మావటివానిచే ఏనుగు తీసికొనిపోబడుచున్నది- మహార్ఖ్యముచే నీవుతీసికొని పోబడుచున్నావు-

ఏనుగు వజ్రసారమయిన ఇనుపగొలుసుచే కట్టివేయబడుచున్నది- నీవు ఆశాపాశజాలమనే యినుపగొలుసులచే కట్టివేయబడుచున్నావు- ఆశఅనేది ఇనుపగొలుసుకంటె గట్టిది- కొంతకాలానికి ఇనుము (లోహము) తుప్పుపట్టి చెడిపోవును- తృష్ణ (ఆశ) మాత్రం ఎంతకాలమయినా చెడదు- ఇంకా గట్టిపడుతుంది- పెరుగుతుందికూడా-

మావటివాడనే శత్రువు దూరమునుంచి ఏనుగును చూచాడనగా అజ్ఞానము నిన్ను చూచినదని తాత్పర్యము- ఏనుగు తనగొలుసులను తెంచివేసినదనగా నీవు భోగభూమియయిన రాజ్యమును విడిచి పెట్టావని యర్థము-

ఒకప్పుడు ఇనుప గొలుసులనయినా తెంచవచ్చునుకాని భోగాశలను మాత్రము నివారించుకొనటము సాధ్యముకాదు- ఏనుగు తన శృంఖలా బంధనమును తెంచివేయుచుండగా మావటివాడు ఏనుగు తలమీాద ఎత్తయిన తాటిచెట్టునుంచి పడినాడన్నాను- అనగా నీవు రాజ్యమును విడిచిపెట్టుచుండగా నీనెత్తిమీాదికి అజ్ఞానము దూకినదని తాత్పర్యము.

మానవుడు విరక్తుడై భోగాశను విడువదలచేసరికి అజ్ఞానము గడగడ వణికిపోతుంది- వివేకవంతుడై భోగములను విడిచేసరికి అజ్ఞానం పలాయనం చెపుతుంది- భోగపుంజమును నిజముగా విడిచేసరికి అజ్ఞానికి ఉనికి సడలిపోతుంది- నీవు అడవికి వచ్చినావంటే నీచేత అజ్ఞానం దెబ్బ తిన్నదన్నమాట- అజ్ఞానమును పడగొట్టినావుకాని పూర్తిగా రూపు మాపలేదు- అందువలన మరల లేచి (తలయెత్తి) నిన్ను అవమానింప సాగినది- తపఃప్రపంచమనే గోతిలో పడవేసినది నిన్ను- లోగడ నీవు చిక్కినపుడే నీవు ప్రబలశత్రువగు అజ్ఞానమును రూపుమాపినచో రాజ్యమును నీవు వదలినపుడు నిన్ను ఇపుడది చెడగొట్టెడిదికాదు- మావటివాడు ఏనుగును పట్టుకొని బంధించుటకు తీగల గుబురు చుట్టూ గోయి తీసినాడనగా అజ్ఞానమనే నీశత్రువు నీకు తపస్సుఅనే దుఃఖావలయాన్ని అర్పించినదన్నమాట- మావటివానికి అగడ్త (చుట్టుగోయి) తీయుటకు వానివద్దనున్న సామగ్రి యనగా అవజ్ఞానమనే రాజునకు చెంత (లోపల) నున్న చింతయే యని తాత్పర్యము- అవజ్ఞానమనగా తత్త్వవిచారము నందు అనాదరము-

రాజా! నీవు అడవిలో పుట్టని గజేంద్రుడవు- అజ్ఞానమనే శత్రువు దుఃఖమనే గోతిలో పడవేసినది- చుట్టుగొయ్యి (అగడ్త) లేత తీగలచే కప్పబడినదనగా దుఃఖవలయమనే గోయి సాధుజన సమాగమములచే కొద్దిగా ఆవరింపబడినదని యర్థము-

ఇలా ఇప్పటికిని నీవు తపోగర్తమనే దారుణదుఃఖంలో ఉన్నావు- పాతాళలోకంలో బలిచక్రవర్తి బద్ధుడయి యున్నట్లు-

రాజా! నీవు ఏనుగు- ఆశలు నిగడములు(సంకెళ్లు) మోహము నీశత్రువు- ఉగ్రతపమనునది నిఖాతము (గోయి)- మహీతలము వింధ్య పర్వతము- ఇలా ఇదంతా నీవృత్తాంతమునే నేను వ్యంగ్యమర్యాదలో చెప్పితిని. అని యనినది చూడాల-

ఇట్లు ౯౧వ సర్గ సమాప్తము.

౯౨. శిఖిధ్వజుడు సర్వమును త్యజించుట.

కుంభుడు- (చూడాల)॥ రాజా! నీతికోవిదురాలు తత్త్వవేత్త యగు నీకు జ్ఞానోపదేశము చేసినది కదా! మీరేల అంగీకరించలేదు? తత్త్వవేత్తలలో ముఖ్యురాలగు చూడాల ఏదిచెప్పునో, ఏదిచేయునో అది యంతయు సత్యముసుమా! అద్దానిని ఆదరముతో అనుష్ఠించి తీరాలి- ఆమెబోధను మీరు అనుష్ఠింపదలచనిచో అనగా,

శ్లో॥ ఆత్మబుద్ధ్యా చిరంజీవేద్గురుబుద్ధ్యా విశేషతః ।
పరబుద్ధిర్వినాశాయ స్త్రీబుద్ధిః ప్రలయంకరీ ॥

అను ప్రమాణమునుబట్టి స్త్రీబుద్ధిని ఉపేక్షించి మీస్వబుద్ధికి తోచిన సర్వసంగపరిత్యాగమునే గొప్పదిగా భావించినచో దానినే మీరేల స్థిర పరచుకొనలేదు? అని అన్నది మారువేషముతో వచ్చిన చూడాల-

శిఖి॥ నేను రాజ్యమును విడిచితిని- గృహమును విడిచితిని- బంగారముపండెడి నాదేశమును విడిచితిని- భార్యలను విడిచితిని- బ్రాహ్మణకుమారా! సర్వత్యాగములో నేనుచేసిన కొరతయేమి?

చూడా॥ రాజా! ధనము, దార, గృహము, రాజ్యము, భూమి, ఛత్రము, బంధువులు, ఇంతేకాదు సర్వమంటే- కాబట్టి నీవు చేసిన సర్వ త్యాగం ఏపాటిది? అన్నది చూడాల-

శిఖి॥ రాజ్యమే సర్వము కానిచో నాకు సర్వమూ వనమే- శైల వృక్షగుల్మాదులతో కూడిన ఆవనమును గూడ విడచుచున్నాను- అన్నాడు-

వసి॥ రామచంద్రా ! శిఖిధ్వజుడు ఇలాచెపుతూనే ఒక్కనిము షంలో వనమునందలి నివాసమునుగూడ మనసా పరిత్యజించాడు-

శిఖి॥ శైలవృక్షవనగుల్మాదులయందు కూడా వాసనను విడచి తిని- కనుక నాకిపుడు సర్వపరిత్యాగము సిద్ధించినది అన్నాడు-

కుంభుడు(చూడాల)॥ రాజా! పర్వతాచటియూ,అడవీ,శ్వభ్రమూ, సలిలమూ, చెట్లూ ఇవేకాదు సర్వమూ అంటే వీనిని విడిచినంత మాత్రాన నీకు సర్వత్యాగ మెట్లు సిద్ధించును ?

శిఖి॥ ఇవి సర్వముకానిచో నాఆశ్రమమును, నాపర్ణశాలనూ, ఈచోటునూ కూడా వెంటనె విడచుచున్నాను అన్నాడు-

వసి॥ రామా ! ఇలా అంటూనే శిఖిధ్వజుడు ఒక్క నిముషంలో ధ్యానమాత్రంచేత ఆశ్రమముమీద ఆస్థను (మమతను) తుడిచి వేసి కున్నాడు-

శిఖి॥ కుంభకా ! నాఆశ్రమముమీదనూ, అందుండెడి పర్ణశాల, వృక్షాదులమీదనూ వాసనాత్యాగం చేసినాను- కనుక నాకు సర్వ త్యాగము సిద్ధించినది అన్నాడు-

కుంభుడు॥ శిఖిధ్వజా! ఈవృక్షాదులూ,పర్ణశాలలూ, ఆశ్రమాలు మాత్రమే కాదు సర్వమంటే- కనుక వీటిని విడిచినంతమాత్రాన నీకు సర్వత్యాగము సిద్ధించలేదు- ఇంతకంటె నీవు విమనటువంటి ఉత్తమ భాగ మొకటియున్నది-దానినికూడా విడచిననేకాని నీవు దుఃఖరాహిత్య మును పొందనేరవు- అపుడుకాని సర్వత్యాగము సిద్ధించినట్లు కాదునీకు అని అన్నాడు కుంభుడు-

శిఖి॥ దేవపుత్రా ! ఇది అంతయు సర్వముకానిచో నాకు సంబం ధించిన చర్మకుడ్యము కుటీరము మొదలగు దానిని విడచుచున్నాను-

వసి॥ రామా ! ఇలాచెప్పి శిఖిధ్వజుడు తానుకూర్చున్న ఆసనము నుండి లేచినాడు- కుంభుడు చూచుచుండగనే తనపనులన్నిటిని కట్టిపెట్టి

తూష్ణీంభావంగా ఊరకున్నాడు- మీరేమయినా చేసికొనుడు నాకిదియే పరమపావనమయినస్థితి- అని అన్నాడు శిఖి- కుంభుడు ఆశిఖినిచూస్తూ ఊరకున్నాడు-

శిఖిధ్వజుడు మాత్రము ఆశ్రమంలో పరికరములనన్నిటిని ఒక చోటికి ప్రోగుచేసి ఎండుపుల్లలు వెలిగించి నిప్పుచేసి దానిలోతగలపెట్టి దర్భాసనంమీద కూర్చున్నాడు

ఇకముందు అక్షమాల (జపమాలను) విడువదలచి యింతకు పూర్వము జపమాలవల్ల తానుపొందిన ఉపకారమును మరచినాడను దోషము వాటిల్లునేమో యని తత్పరిహారము కొరకు జపమాలనుగూర్చి ఇలాఅన్నాడు- "స్వామి భక్తురాలవగు ఓ జపమాలా! ఇతరవస్తువుని శ్రమపెట్టి నాస్వార్థమును సాధించుకొనెడి బుద్ధిలోపమున నేను యింత కాలమువరకు నిన్ను మాటిమాటికి త్రిప్పుటయను శ్రమకు పాల్పరచి నాను- దానివలననే నీకు మత్సేవాఫలము సంపూర్ణమగుగాక- ఇక ముందు తపోజపాదులు చేయవలెనను భ్రాంతి నాకు తొలగినది- కాన నీవు నాకిక నుపకరించవు- నేనును ఇకమీదట నిన్ను శ్రమపెట్టను- కనుక నీవు విశ్రాంతి తీసికొనుము- నేను యింతవరకు కర్మసాధ్యమయిన క్షుద్రసిద్ధులనిచ్చెడి మార్గములలో విహరించినాను- నేనుకూడా నీతో పాటు జపభ్రమచే నానావిధములయిన మంత్రాటవులయందు భ్రాంతు డనై తిరిగినాను- తపోవనములనూ సిద్ధక్షేత్రములనూ విహరించినాను- ఇపుడు నాకాభ్రాంతి తొలగినది- కావున నిన్ను శ్రమపెట్టను- నేను శ్రమపడను- నేను కూడా విశ్రమించుచున్నాను-" అని చెప్పి జపమా లను అగ్నిహోత్రంలో ఉంచినాడు-

పిదప కృష్ణాజినమునుగూర్చి యిట్లనినాడు-

ఓ కృష్ణాజినమా! నేను నరమృగమును- నీవు వనమృగము నుంచి వచ్చితివి- అజ్ఞానముచే నిన్ను నేను కుశాసనముమీద ధరించి తిని- ఇదియే నేను నీకు చేసెడి యుపకారము-

ఇపుడు నీవు వెళ్లుము– నీమార్గములు శివంకరములగుగాక– ఈ అగ్నిహోత్రములో నీవు ఆకాశమును జేరుము– నక్షత్రములతో కూడిన ఆకసము నీకు సమానమయినది– (దీనివలన ఈకృష్ణాజినమునందు అక్కడక్కడ తెల్లటి మచ్చలున్నవని తోచుచున్నది) అని చెప్పి కుశాసనము మీదనుంచి కృష్ణాజినమును చేతులతో తీసికొని అగ్నిహోత్రమున విడచెను–

పిదప కమండలును గురించి యిట్లనెను–

ఓ కమండలమా! "నీవు మంచిచరిత్రతో (సదాచారముతో) నీరు ధరించితివి–నీకు నేను తగినంతటి యుపకారమును చేయలేకపోయితిని– సౌహార్ధమునకూ, మనోజ్ఞత్వమునకూ, స్థిరమయిన సౌజన్యమునకూ, సాధుత్వమునకూ నీవే ముఖ్యమయిన స్థానము– నిన్ను నేను మొట్టమొదట స్వీకరించునపుడు ఒకానొక శ్రోత్రియునినుంచి వహ్నిదాహముచే (నిప్పులో కాచి) శుద్ధిచేసి గ్రహించితిని– ఇపుడు మళ్ళీ నిన్ను ఆవహ్నితోనే శుద్ధిచే నిన్ను సాగనంపుచున్నాను– నీకు మార్గములు శివంకరములగుగాక– అని చెప్పి ఆ కమండలమును చేతబూని అగ్నిలో శుద్ధిచేసి మరొక శ్రోత్రియునకిచ్చెను–

ఇక కుశాసనమును తగలపెట్టదలచి దానికుచితమగు దోషమును జెప్పుచున్నాడు–

ఓ కుశాసనమా! "మూర్ఖుని మనస్సు అధోగతికి కారణమగు ప్రచ్ఛన్నపాపమునందే పడును– (ప్రవర్తించును)–

అలాగే నీవుకూడ ఎల్లపుడు ప్రచ్ఛన్నమయిన అధోదేశమునందే పడుచున్నావు– కావున ఓ కుశాసనమా! మూర్ఖుని బుద్ధికివలె నీకుకూడా దాహమూ, దానివలన సంతాపమూ, ఈగతియుచితము కాన భస్మమగుము–" అని చెప్పి అతిమృదువయిన ఆ కుశాసనమును మండెడి అగ్నిహోత్రములో విడిచెను–

వీనినన్నిటిని ఇలా విడచుటకు కారణమేమన ? చిత్తశుద్ధి కొరకునూ, బ్రహ్మచైతన్యమునందు తాను విశ్రాంతి చెందుటకొరకును ఈ పరికరములు నన్నిటిని విడిచెను-

మిగులవలసిన దానిని శీఘ్రముగానే విడువవలెను- ఆలసింపకూడదు- ఒక ఉపకరణమున్నదే పరికి దానితో బాటు మరికొన్ని వెంటపడును-కనుక ఉన్న వాసనలన్నిటిని ఒకేసారిగా దహింపజేసినచో నాకు సర్వత్యాగము చేసిన సంతోషము లభించును-

ఓ కుంభకా ! నేనొనర్చిన సర్వత్యాగవిషయములో నీవు ఖేదపడవలసినపని లేదు- లోకమందు అయోగ్యమయిన వానిని యెవడు ధరింపగలడు- కర్మలతో పనిలేని నాకుకూడా క్రియోపకరణములు అయోగ్యములు అందువలన త్యజించితిని- అన్నాడు శిఖిధ్వజుడు-

ఇట్లు ౯౨వ సర్గ సమాప్తము.

## ౯౩. శిఖిధ్వజావబోధనము.

వసి॥ రామచంద్రా ! కుశాశన దహనానంతరము శిఖిధ్వజుడు వనవాసమునకు యోగ్యములయిన భోజన భాజనాదుల నన్నిటిని హోమము చేసెను-

పిదప ఎండిన తృణమందిరమును (గడ్డికొంపను) తగులపెట్టెను- ఆయనగారి ఆశ్రమపరికరములన్నియు దృష్టనష్టములయినవి- వీరభద్రుడు తగలబెట్టిన దక్షయజ్ఞాశ్రమతుల్యమయినది ఆయనగారి ఆశ్రమము- ఈమంటలకు అచటి మృగములన్ని భయపడి పలాయనము చెప్పినవి- రాజుమాత్ర మానందించెను-

శిఖి॥ దేవపుత్రా ! నేను వాసనాత్యాగం చేసినాను- సర్వత్యాగి నయినాను- నిదయవల్ల నాకు జ్ఞానం కలిగినది- కేవలుడను శుద్ధుడను అయినాను- బంధహేతువులు తొలగినకొలది మనస్సునకు పరమా

నందను సన్నిహితునుగను— వివిధములయిన బంధములూ తొలగినవి— నాకు విశ్రాంతి చిక్కినది— సుఖింతును ఇక— ప్రస్తుతము నేను దిగంబరుడను— నిక్కతే నాగ గృహము— దేవపుత్రా! ఇంతకంటె సర్వత్యాగమేమున్నది? అన్నాడు—

కుంభుడు॥ రాజా! నీవు సర్వత్యాగము లభింపలేదు— లభించినదని సంతోషించడము వ్యర్థాభినయము— నీవు త్యజించనిది (విడవనిది) మరొకటి కలదు—

వసి॥ రామా! ఈమాటవిని శిఖిధ్వజుడు కొంచెమాలోచించి ఇలా అనినాడు—

శిఖి॥ కుంభజా! రక్తమాంసమయమయిన దేహమొకటి మిగిలియున్నదినాకు— ఇదిగో నేనులేచి పెద్దగోతిలో దూకి దీనినిశాశ్వతా నాశము చేతును— అనినాడు—

వసి॥ రామా! ఇలా అని శిఖి ధటాలున లేచి యొక పెద్దగోతిలో దూకబోవుసరికి కుంభుడీమాట యనెను—

కుంభ॥ రాజా! ఏమి ఈపని నిరపరాధమయిన దేహమును దహింపబూనితివే— ఎంతటివిమూఢుడవు? "ఎద్దును కోపమువస్తే దూడను పొడుస్తుందట" అలా ఉంది నీచందం (విధానము) కూడా— శరీరము మూఢమయినా, నీచమయినదయినా, మూకమయినా ఈదేహమే నీకు తపస్సాధనము— లోకంలో పండ్లచెట్టునుంచి గాలికి పండ్లురాలిపడితే చెట్టుగలవాడు చెట్టుది దోషముగా భావించడు— గాలిదే దోషమని భావించును— అలాగే నీకు కలిగెడి సుఖదుఃఖములలో శరీరముయొక్క అపరాధమేమీలేదు—

ఒకవేళ నీవు శరీరమును విడిచిపెట్టినా పరిస్థితి విషమిస్తుంది— మళ్ళీ అధికారంగల దేహం లభించడం అసంభవం— ఇంతమాత్రంచేత నీకు సర్వమూ సిద్ధించదు— కావున దేనిచే(ఏ అహంకారముచే) శరీరము క్షోభపెట్టబడుచున్నదో దానిని (ఆ అహంకారమును) త్యజించినచో

మహాత్యాగివగుదువు- అహంకారమును త్యజించినచో దేహాదికము నంతయు త్యజించిన వాడవగుదువు- లేనిచో నీవు ఏగోతిలో దిగినా మాటిమాటికీ ఈశరీరము తలమెత్తి మొలకరించుచునే యుండును- అన్నాడు శి॥-

కుంభ॥ నీవుచేసిన రాజ్యత్యాగంచేతకాని, దేహత్యాగం చేత కాని, సర్వత్యాగము లభించదు- సర్వవాసనలకు ఆస్పదమయిన మనస్సును త్యజించినచో సర్వత్యాగము నీకుసిద్ధించును- అన్నాడు కుంభుడు-

సర్వ॥ త హేయమూ, సర్వదా త్యాజ్యమూ అయినదేది? అని అడిగినాడు శిఖిధ్వజుడు-

కుంభుడు సమాధానమును చెబుతాడు- శిఖిధ్వజా! శాఖోపశాఖలతో విస్తృతమయ్యే వృక్షమునకు బీజము కారణమయినట్లు రాజ్యాదికమునకూ, దేహాదికమునకూ, ఆశ్రమాదికమునకూ, అంతకు మనస్సే కారణము- కనుక సర్వబీజమయినదానిని త్యజించుచో సర్వమును త్యజించినట్లేయగును- కనుక మనస్సును విడచుటయే ముఖ్యము- సమనస్కుడను దుఃఖమునొందు- అమనస్కుడను సుఖమునొందు- ప్రపంచంఅంతా మనఃకల్పితము- విషయవాసలన్నీ దానియందే ఇమిడి యుండును-

చిత్తత్యాగమే సర్వత్యాగమని త్యాగవేత్తలనుచున్నారు- చిత్తమే (లింగశరీరమే) చైతన్యమును ప్రధానముగ జేసికొని జీవుడను పేరునూ, క్రియాశక్తిని ప్రధానముగ జేసికొని ప్రాణమనుపేరునూ పొందుచున్నది- చిత్తమే భ్రాంతి- చిత్తమేనరుడు- చిత్తమే జగజ్జాలము- సర్వమూచిత్తమే అని అంటారు- సంభవాసంభవరూపములచే చిత్తమే సర్వత్యాగరూపము-

విత్తు చెట్టు ఆకారముగా పరిణమించినట్లు చిత్తము జగదాకారముగను, దేహాద్యాకారముగను పరిణమించుచున్నది- చెట్టుగాలికి కదలును- పర్వతములు భూకంపమునకు కదలును- కొలిమిలోని తోలు

తిత్తి కమ్మరిచే కదలును- దేహము చిత్తముచే కదలును- సమస్త భోగముల ఉపభోగములకు చిత్తము పెట్టి- జరామరణాది దేహధర్మాలకు చిత్తము పెట్టి- మునిధర్మములయిన శమదమాదులకు చిత్తము పెట్టి- అనగా వీటిఅన్నిటికి నిరూఢమయిన వాసనగల చిత్తమే ఆశ్రయమని భావము- ఆచిత్తము లోపలశాంతియనీ, మహత్తుఅనీ, అహంకారమనీ, ప్రాణమనీ, ప్రజ్ఞాత్మఅనీ క్రియానుకూలమయిన వ్యాపారములచే చెప్పబడుచున్నది- సకలాధులకూ, సర్వవ్యాధులకూ పొలిమేరఅయిన చిత్తమును త్యజించుటయే సర్వత్యాగము- ఈయది సిద్ధించినచో పరమార్థమయిన భూమా (అఖండా) నందము అనుభవ గోచరమగును- చిత్తమును త్యజించినచో ద్వైతమంతయు లయించును- (నశించును) అద్వితీయమగు పరమార్థతత్త్వము మిగులును- సంసారమనే సస్యసంతతికి (పైరుకు) చిత్తమనేది క్షేత్రము- కనుక క్షేత్రమే అక్షేత్రత్వాన్ని చెందితే ఇంక అందులో సస్యము ఎలా పుట్టును? ఎలా పెరుగును? చిత్తమే విచిత్రమయిన కోరికలచే పదార్థాకారముగ పరిణమించును. నీరు తరంగరూపముగ పరిణమించినట్లు-

కనుక శిఖిధ్వజా! సర్వత్యాగము పరిచ్ఛిన్నాత్మను గ్రహించినచో నీకు లభించదు- అపరిచ్ఛిన్నాత్మజ్ఞానము సిద్ధించినపుడే సర్వత్యాగము సిద్ధించును- ఎంచేతనంటే పరిచ్ఛిన్నుడవయిన నీకు మరొకటి త్యజింపదగినది ఎట్లుకలదో అట్లే నిన్ను విడువకోరిన మరొకనికి గూడ నీవు త్యజింప తగినవాడవగుదువు- కాబట్టి త్యాజ్యమయినదానినే నీవు ఆత్మనుగా గ్రహించావు- కనుక నీకు సర్వత్యాగము సిద్ధింపలేదు-

ముత్యాలహారము దారముమీద ఆధారపడియున్నట్లు ప్రపంచమంతా చిత్తముమీద ఆధారపడియున్నది- సర్వత్యాగము చల్లారిన దీపమువంటిది. ఇందు వ్యవహరింప తగినదేదియు నుండదు- చమురుగల దీపముచే సర్వమూ ప్రకాశింపచేయబడును- ఆత్మస్వరూపజ్యోతిస్సుచే సర్వవ్యవహారము జరుగుచుండును- ఉన్నదానినంతా విడిచి

చమురులేని దీపమువలెనుండువాడు ప్రకాశరూపుడై చమురుగల దీపము వలె సర్వమును ప్రకాశింపజేయుచుండును-

రాజా! జ్ఞానమూ అజ్ఞానము, ఆశయమూ మున్నగు పాత్రలన్నిటిని విడిచిపెట్టితే స్వరూపమాత్రం ఎలామిగిలినదో అలాగే సర్వమూగా విడిచినచో విజ్ఞానమాత్రమే మిగులును- సర్వవస్తువులను దహింపజేసిన నిప్పు ఎలా మిగిలినదో అలాగే సర్వత్యాగంచేసితే నిర్వాణ స్వరూపముతో మిగిలేఉంటుంది కాని శూన్యవాదము వాటిల్లదు- సర్వత్యాగమునందు శూన్యస్వరూపంగా ఉన్నా సర్వజ్ఞానములకూ ఆశ్రయము ఆకాశము శూన్యరూపమైనా సూర్యచంద్ర నక్షత్రాదులకాధారమగుచున్నది- సర్వత్యాగరసమును కొంచెము రుచిచూచినచో జరామరణశోకములేవీ బాధించవు- సర్వత్యాగమనేది స్వరూపస్ఫూర్తి అనే గొప్పతనానికి కారణము-

శిఖిధ్వజా! నీవు సర్వమును త్యజించినచో మహత్తరమయిన బుద్ధిస్థైర్యము ఏర్పడును-

సర్వత్యాగమే పరానందము- మిగిలినదంతా దారుణదుఃఖము- దీనినంగీకరించి నీకిచ్చవచ్చిన దానిని ఆచరించుము- సముద్రంలోని బడబాగ్నిలో నీరు చేరియున్నటుల సర్వత్యాగంలోనే జ్ఞానంఅంతా ఇమిడి ఉన్నది- సర్వత్యాగమనగా అజ్ఞానమునూ తత్కార్యములను త్యజించడము- దానిలోనే ఆత్మతత్త్వము ప్రసాదించబడి జ్ఞానము అవశ్యం ఇమిడి ఉన్నది-

“యచ్ఛూన్యం కిలభాండస్య తత్రరత్నాది తిష్ఠతి” అనికదా లోకప్రసిద్ధి- అతిపాపిష్ఠమయిన కలికాలంలోకూడా వేదబాహ్యుడై అతినీచుడయిన బుద్ధుడుకూడా సర్వత్యాగమువలననే మేరుపర్వతంవలె నిశ్చలంగా ఉన్నాడు- ద్వాపరకాలంలో వేదమార్గావలంబివై పుణ్యాత్ముడవయిన నీవు నిశ్శంకముగా సర్వత్యాగమువల్ల స్థిరంగా ఉండమని

మేము చెప్పనేల ! మహారాజా ! సర్వత్యాగమే సర్వసంపదలకూ నిలయము— "నగృహ్ణాతిహి యః కించిత్ సర్వం తస్మై ప్రదీయతే"

"ఎవరివల్లా నేనేమియు ప్రతిగ్రహించను" అనే వానికే అందరూ అన్నీ ఇస్తానంటారు—

కనుక ఓ భూమిపాలా ! నీవు మొట్టమొదట మనస్సుతో అన్నిటినీ విడు— తర్వాత ఆ మనస్సునుకూడా విడువుము— పిదప "నేను సర్వమును త్యాజించితిని" అను అభిమానలక్షణము అయిన మలమునుకూడా విడిచి జీవన్ముక్తుడవగుము—

ఇట్లు ౯౦వ సర్గ సమాప్తము.

## ౯౧. శిఖిధ్వజునకు జ్ఞానోపదేశము.

వసి॥ రామచంద్రా ! కుంభుడు అమనస్కయోగమును ఉపదేశించాడు ఇలా— శిఖిధ్వజుడు దానిని గురించి మాటిమాటికి లోలోపల విచారించుకున్నాడు— ఇలా అడిగాడు—

శిఖి॥ స్వామీ ! మనస్సు అనేది హార్దాకాశంలోని పక్షి— హృదయమనే చెట్టుమీదకోతి— ఎన్నిమార్లు తొలగించుకున్నా తిరిగివస్తూనే ఉంటోంది— కోతి కొట్టితేమాత్రం మళ్ళీ రాకుండా పోతుందా— మత్స్యగ్రాహి (చేపలుపట్టువాని) కి నీటిలోని చేపను పట్టుకొనుట తెలుసు— నాకు మనస్సును గ్రహించటం తెలుసు— కాని దానిని త్యజించడం తెలియలేకున్నాను— కాబట్టి మొదట మీరు చిత్తముయొక్క స్వరూపం చెప్పండి—తరువాత దానిపరిత్యాగమును సెలవివ్వండి— అనిఅన్నాడు శిఖి—

కుంభ॥ మహారాజా ! రాగవాసనయే చిత్తముయొక్క స్వరూపము— చిత్తమన్నా వాసనఅన్నా పర్యాయపదాలు— అర్థం అంతా ఒకటే— దీనిని విడచుటకూడా అతిసుకరము— చిత్తత్యాగము రాజ్యముకంటెకూడా అతి ఆనందదాయకము—కుసుమముకంటె హృద్యము—మన స్త్యాగము మూర్ఖునకు దుస్సాధ్యం కావచ్చును—

శిఖి॥ స్వామీ! వాసనామయమయిన చిత్తముయొక్క స్వరూపము నాకు తెలుసు- దానిపరిత్యాగము మాత్రము దుస్సాధ్యమనుకుంటాను- చిత్తము సంసారమనే పరిమళానికి పుష్పం- దుఃఖమనే మంటకు నిప్పు. ప్రపంచమనే పద్మానికి కాడ- మోహమనే గాలికి ఆకాశము- శరీరమనే యంత్రానికి ప్రేరకము- (డ్రైవరు) హృత్పద్మమునకు భ్రమరము- ఇలాంటి చిత్తాన్ని అప్రయత్నంగా త్యజించటం చాలాకష్టం- అన్నాడు శిఖి-

కుంభ॥ సంసారనాశమే చిత్తత్యాగము- ఇది పెద్దల యభిప్రాయము-

శిఖి॥ చిత్తత్యాగముకంటె చిత్తనాశమే మేలు- దాని కుపాయమును బోధింపుడు-

కుం॥ చిత్తమనే వృక్షమునకు అహంకారము బీజము- ఈవృక్షమును మొదలంట పెళ్ళగించివేయుము-

శిఖి॥ మునీంద్రా! చిత్తమునకు మూలమెద్ది? అంకురమెద్ది? కుదురేది? కొమ్మలేవి? స్కంధములేవి? దీనిని పెళ్ళగించటం ఎలా? అని అడిగినాడు శిఖి-

కుంభు॥ అహమర్థమే చిత్తద్రుమమునకు మూలము- మాయ దీనికి క్షేత్రము- (కుదురు) దీనినుంచి మొట్టమొదట బయలుదేరిన "అహమ్" నేను అను నిశ్చయాత్మకమగు బుద్ధియనెడి అంకురము పుట్టుచున్నది-దీనికే దేహాధ్యాకారమును స్మరించుటవలన చిత్తమనే పేరును, మననము చేయుటవలన మనస్సుఅనే పేరున్ను ప్రసిద్ధమయినది-

సాక్షిచైతన్యము ఈచిత్తమనే వృక్షమునకు జీవము- సప్తధాతువులతో గూడిన ఈశరీరమే మూలమునుండి కొమ్మలవరకు నుండు మధ్యప్రదేశము- స్కంధమునుంచి బయలుదేరెడి శాఖలు, ఉపశాఖలు రాగద్వేషప్రవృత్తులు- వాటికి కారణము వాసన- ఈచిత్తద్రుమమునకు నలుమూలల బయలుదేరిన శాఖలూ, అవాంతరశాఖలూ అనేకము

లున్నవి- అవి జన్మమరణములకూ, అనేకానర్థములకూ కారణము లయిన భోగములు-

ఈ చెట్టును మొదలంట ఛేదించాలంటే మొట్టమొదట భోగము లందు అనాసక్తిని చూపవలెను- దానివలన కొమ్మలు నశించినట్లగును- ఆవల అసంగాద్వితీయాత్మ జ్ఞానంచేత అజ్ఞానమనే వేరును ఛేదించుటకు ప్రయత్నించవలెను-

శిఖి॥ స్వామీ! చిత్తవృక్షముయొక్క శాఖోపశాఖలను ఛేదించుటకు ప్రయత్నించుట ఎలా? మొదలంట చెట్టును నశింపజేయుట ఎలా?

కుంభ॥ రాజా! ఆసక్తిని విడిచినచో శాఖలు పెరగవు- అంతర్విచారమను జ్ఞానబలంచేత కొమ్మలు అన్నీ ఛేదింపబడినవగును- పురుషప్రయత్నంచేత శాఖాచ్ఛేదనాభ్యాసమందు గట్టిపట్టు ఏర్పడితే మూలచ్ఛేదనమందుకూడా అతడు యోగ్యుడగును-

శాఖాచ్ఛేదనము అప్రధానము- మూలచ్ఛేదనము ప్రధానము- అందుచేత రాజా! నీవు చిత్తమనే కంటక గ్రామమును మొదలంట రూపుమాపుము- అపుడు నీకు అచిత్తత యేర్పడును-

శిఖి॥ మునికుమారా! అహంభావనా రూపమయిన మనోవృక్ష బీజమును దహింపచేయుటకు తగిన అగ్నిని నాకుపదేశింపుము-

కుంభ॥ రాజా! ఆత్మవిచారమనే అగ్నిహోత్రము చిత్తద్రుమ బీజమును దహింపజేయుటకు తగిన అగ్ని-

శిఖి॥ మునిసత్తమా! నేను నాబుద్ధిబలంతో ప్రపంచమును గురించి పలుమారు విచారించినాను- శరీరము మొదలుకొని అహంకారమువరకు నుండు బాహ్యపదార్థములనూ ఆధ్యాత్మికపదార్థములనూ గురించి క్షుణ్ణంగా ఆలోచించాను- వనమండలమండితమయిన భూమితోకూడిన ప్రపంచము నేనుకాదు- ఈపర్వతాదులూ నేనుకాదు- మాంస అస్థి అస్నల్(నెత్తురు)మొదలగు వానితోకూడిన శరీరముకూడా నేనుకాదు- కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు మనస్సు అహంకారము ఇవేమి

నేనుకాదు- నేను చిన్మాత్రుణ్ణి- ఇవి అన్నీ జడరూపములు- సువర్ణము నందు కటకత్వము కల్పింపబడినట్లు చిదాత్మయందు అహంత్వము కల్పింపబడినది- జడమయిన ఈప్రపంచమంతా అసద్రూపము- కనుక ఇది లేనిదే. అనగా మిథ్యయని అర్థము- స్వతః చైతన్యముకంటె భిన్నము- కనుకనే చైతన్యమునందు ఇది లేదు- చైతన్యము (అనగా చిదాత్మ) పదునాలుగు లోకములకు ఆధారము శబ్దాది విషయముల కాధారము- అసంగస్వరూపుడు- ఈరీతుగ అహంత్వ (అహంకార) లక్షణమయిన మలమునకు మార్జనమును తెలిసికొన్నాను- కాని లోపల నున్న ప్రత్యగేకరసముగు (అఖండచిద్రూపముగు) సాక్షిచైతన్యమును మాత్రము తెలియకున్నాను-

కుంభ॥ రాజా ! అహంకారపర్యంతమయిన దృశ్యజాతము జడ మయినందువలన నీవుకాకపోతే నీవెవరివో చెప్పు ? పరిశేషన్యాయ ముచే నీవు సాక్షిచైతన్యమేకదా !

శిఖి॥ మునీంద్రా ! నేను నిర్మలమయిన చిన్మాత్రుడను- ఆనం దైకరసుడయిన చిన్మాత్రుడున్నప్పుడే జడరూపములూ, ఆనందరూప ములుకాని శబ్దస్పర్శాదివిషయములు రుచించుచున్నవి- ఇవి యిష్ట ములూ, ఇవి అయిష్టములూ అని నిర్ణయించబడుచున్నవి- కాని వివేక దృష్టితో పర్యాలోచనచేస్తే దేహాదిపంచకోశగణమునందు "అహమ్" "నేను" అనే తాదాత్మ్యాభిమానలక్షణమయిన మలినబుద్ధి నాకు లగ్న మయినది- ఇది సకారణమో నిష్కారణమో నాకు తెలియదు- బహ్మ తత్త్వమును అసలే తెలియకున్నాను- అనాత్మపదార్థమునందు ఆత్మాభి మానమనే మలమును నేను పోగొట్టుకొనలేకున్నాను- అందువలన ఇంత ఘోరంగా బాధపడుచున్నాను-

కుంభ॥ రాజా! నీబుద్ధి మహత్తరమయిన మలము (మాలిన్యము) అంటుకున్నది- అదిసత్యమో, మిథ్యాభూతమో కాని దానిచేతనే నీవు సంసారివగుచున్నావు- ఇది నిజమేకదా !

శిఖి॥ మునీంద్రా! అదిసత్యమో, మిథ్యాభూతమో నాకు తెలియదు- చిత్తద్రుమమునకు (మనస్సు అనే వృక్షమునకు) అహంభావమనేది మూలము- ఇది అహంభావమనీ మమభావమనీ రెండు రూపాలతో ఉంటుందనికూడా తెలుసును- కాని దానిని తొలగించుకొనుటమాత్రం నాకు సాధ్యంకాకుండా ఉంది- ఒకానొకప్పుడు తొలగించుకున్నా మళ్ళీ నావెంటపడుచునే యున్నది- కనుక తిరిగి మొలకయెత్తకుండా ఛేదించే ఉపాయమునే మీరు తెలవివ్వండి-

కుంభు॥ రాజా! కారణమువలన కార్యము పుట్టునునది సార్వత్రికము(సర్వతంత్రసిద్ధము) కారణము లేకుండా పుట్టినకార్యం ద్విచంద్రాభము (రెండవ చంద్రునితో సమానము- అనగా లేనిదానితో సమానము- అహంభావమనే కారణమునల్ల భవాంకురము (సంసారమనే మొలక) పుట్టింది- ఇపుడు ఆ అహంభావానికి కారణమేదో విచారించి నాకు చెప్పు-

ఇలా అడిగేసరికి రాజు(శిఖిధ్వజుడు) చాలాసేపు ఆలోచించాడు- దేహాద్యాకారములయొక్క జ్ఞానము లేనిదే వాటిమీద "అహంత" అనే అభిమానము పుట్టదని నిర్ణయించుకున్నాడు- దేహాద్యాకార వేదనమే (శరీరేంద్రియాదులజ్ఞానమే) అహంభావానికి కారణమని చెప్పినాడు-

శిఖి॥ స్వామీ! దేహాద్యాకారవేదనమే అహంభావానికి కారణము- ఇదినాకు తెలుసును- కాని దానినిర్మూలనోపాయము మాత్రము తెలియజాలకున్నాను- చిత్తు (చైతన్యము) చైత్యవస్తువులకు అభిముఖమయిన కారణంచేత ఈదేహాదులు అహమభిమానానికి గురియై దుఃఖకారణములగుచున్నవి- కాబట్టి అహంభావం అంతరించాలంటే ముందు చైత్యవస్తువులు అంతరించాలి- కనుక ముందు చైత్యవస్తువులు ఉపశమించే మార్గమును ఉపదేశింపుడు-

కుంభు॥ రాజా! వేదనము వేద్యానికభిముఖమగుటలో వేద్యమే కారణమని గుర్తించితివి- ఇపుడు నీయభిప్రాయమేమిటో చెప్పుము-

నీవు చెప్పిన తరువాత కారణాకారణముల క్రమమును నీకు తెలిపెదను– అనగా వేద్యవేదన మనునది మిథ్యకనుక అది దేనికీ కారణము కానేరదు– కనుక కారణత్వాభావమయిన వేద్యము అహంభావానికి కారణ మెట్లయినది? చెప్పుము? అని కుంభకుని ప్రశ్నకు తాత్పర్యము–

శిఖి॥ మునీంద్రా! జ్ఞానమెల్లప్పుడు జ్ఞేయాకారముగనే భాసించు చుండును– కావున జ్ఞానరూపమయిన వేదనమునకు జ్ఞేయరూపమయిన వేద్యమే కారణము– కనుక వేదనము శరీరాద్యాకారముగ ఉదయించు చున్నందున శరీరాదులే వేదన (జ్ఞాన) మునకు కారణము– అయితే అమూర్తమయిన వేదనమునకు(జ్ఞానమునకు) మూర్తములయిన దేహాదులయొక్క ఆకారము వాస్తవముగాదు–కావున నా వేదనము అసత్యాభాసమని స్పష్టమగుచున్నది–

చిత్తవృక్షమునకు బీజమయిన అహంత్వజ్ఞానము ఉపశమింప జేసికొనెడి ఉపాయము తెలియనటుల శరీరాదివస్తువులయొక్క సత్తకు అసత్వము (సత్తారాహిత్యము) కూడ నాకు తెలియకున్నది–

కుంభ॥ రాజా! దేహాదివస్తువులకు సత్త (ఉనికి) ఉండుచో వేదనమునకు (జ్ఞానమునకు) తదాకారత్వము నీవభిప్రాయ పడినట్లుండెడిది– అదియే దుర్లభమయినపుడు వేదనము కింవిషయకమగును– అనగా వేదనము నిర్విషయకమని భావము–

శిఖి॥ రాజా! ప్రత్యక్షముగా చూడబడుచున్న శరీరాదులను లేవని అపలాపము జేయుట (తుడిచిపెట్టుట) యెట్లు? చేతులు, కాళ్లు మొదలగు అవయవములతో వేర్వేరుగ పనులను జరుపుతూ ఎల్లప్పుడు అనుభవింపబడుచున్న దేహము లేదనుటయెట్లు?

కుంభ॥ రాజా! కనిపించినంతమాత్రమున దృశ్యజాతమున్నటుల నిర్ణయింపదగదు– భ్రాంతపదార్థములుకూడ అనుభవింపబడుచునే యున్నవి– అంతమాత్రమున వానికి సత్త(ఉనికి) అంగీకరించుచుంటిమా!

లేదు కనుక కారణములుండి వాటియందు కార్యములు ఉపలభ్యమానము లగునపుడు కార్యములున్నవని నిర్ణయించవలెను- ప్రకృతము అహంత్వ జ్ఞానమునకు కారణములేదు- కావున కార్యమగు అహంత్వజ్ఞానము కూడ లేదనియే యనవలెను-కనుక అహంత్వవేదనము భ్రమమాత్రము-

శరీరాదులకే కారణములేదు- కనుక బీజములేని చెట్టు నాటు లుండును? శరీరాదులే నిష్కారణములై లేనివయితే ఈయవి అహంత్వ జ్ఞానమునకు కారణములెట్లగును? కారణములేకుండ కనుపించెడి కార్యము మృగతృష్ణోదకమువలె ద్రష్టకు భ్రాంతిసిద్ధమే యగును- కనుక అది లేనిదియే- మీరెంత ప్రయత్నించినా ఎండమావులనీరు లభించదు-

శిఖి॥ మునీంద్రా! అయితే దేహాదులు వంధ్యాపుత్రుని దేహా దులవలె శూన్యములేనా?

కుంభ॥ రాజా! "అశరీరం శరీరేష్వ నవస్థేష్వవస్థితం" అను శ్రుతి ప్రమాణమును బట్టియు ఇటులనే విద్వదనుభవముండుటనుబట్టియు, శరీ రాదులకు కారణము నిరూపింపనలవికాకుండుటవలనను వంధ్యాతనయ తుల్యములే శరీరాదులు- ఇందు సందేహము లేదు-

శిఖి॥ మునీంద్రా! హస్తపాదాదియుక్తమై నిత్యమూ కనిపించు చున్న దేహేంద్రియాదులకు తండ్రియేల కారణము కాకూడదు?

కుంభ॥ రాజా! పిత్రాదుల శరీరాదులకుకూడ కారణములేదు- కనుక అవీ లేనివియే- లేనివానివలన పుట్టినవికూడ లేనివియే- రాజా! కార్యములయిన పదార్థములకు కారణము బీజమనబడుచున్నది- బీజము లేనిదే అంకురము పుట్టదు- కనుక అహంత్వవేదనమునకు బీజము (కారణము) లేదు- కాన అయ్యది భ్రమమాత్రమే- కనుక అహంత్వ జ్ఞానము ద్విచంద్రమరుభూమ్యుదక వంధ్యాపుత్ర తుల్యము-

శిఖి॥ మునీంద్రా! లోకంలో తాతగారు తండ్రులకు కొడుకులకు కారణమగుచున్నాడు- అటులనే ఆద్యపితామహుడగు హిరణ్యగర్భుడు,

పుత్ర, పితృ, పితామహాదుల, సకలవ్యష్టి సమష్టి స్థూలదేహముల యొక్క ఉత్పత్తికి కారణమేల గాకూడదు?

కుంభు॥ రాజా! ఆద్యపితామహుడగు హిరణ్యగర్భుడుకూడా కారణము లేనివాడే-కనుక అతడును లేడు- కారణము లేని కార్యమేదియు లేనిదే- పితామహుడగు హిరణ్యగర్భునకుకూడ కారణము నిత్యముగ లేనందున ఆతడును లేనివాడే- అతనివల్ల జరుగుచున్నట్లు ప్రసిద్ధమయిన సృష్ట్యాదిక్రియకూడ మిథ్యయే- రాజా! నేనిపుడు నీకు జెప్పిన యుక్తి వలని నీయొక్కయు, హిరణ్యగర్భాదులయొక్కయు, శరీరాంతమయిన కార్యపరంపరాప్రబంధమంతా మిథ్యయని "యింతవరకు సత్యమని" నీవనుకొనిన స్థితి తొలగినది- ఇకనుండు ప్రపంచమంతా ప్రతిభాస మాత్ర (అభాసమాత్ర) మనే అవశిష్టాంశమునుగూడ తత్త్వసాక్షాత్కారపర్యంతమగు ఉపదేశముచే పోగొట్టుదును చూడుము-

రాజా! చిద్వ్యతిరిక్తమంతా నేను నిరూపించినయుక్తి ప్రకారము లేనిదేకనుక హిరణ్యగర్భాది స్తంబపర్యంతమయిన సర్గపరంపరయంతయు చిదాత్మకమయిరే ప్రకాశించుచున్నది- చిద్వ్యతిరిక్తముగ అణుమాత్రముగూడ లేదు- కనుక నీసమస్త ప్రపంచమూ శాంతమయిన బ్రహ్మమే-

ఇట్లు ౯౮వ సర్గ సమాప్తము.

## ౯౯. శిఖిధ్వజవిశ్రాంతి.

శిఖి॥ మునీంద్రా! బ్రహ్మాది స్తంబపర్యంత ప్రపంచము, భ్రమాత్మకమంటిరికదా! అయితే స్నానపానాది అర్థక్రియాసమర్థ మెట్లయినది? మరణాదిదుఃఖప్రద మెట్లయినది? అని శిఖిధ్వజుడడిగెను-

కుంభుని సమాధానము॥ రాజా! సత్యసంకల్పము చేతనూ, భావనా పాటవము చేతనూ, మిథ్యాపదార్థముకూడా అర్థక్రియాసమర్థమగును- దుఃఖకారణమును అగును-

దైవాసురమాయానిర్మితములయిన శస్త్రములు, అస్త్రములు, ఏనుగులు, గుర్రములు, సేనలు, ఇట్లగుచుండుట లోకప్రసిద్ధము, ఇట్టి స్థితిలో ఈశ్వరమాయానిర్మితమయిన ప్రపంచము భ్రాంతమయి తే మాత్రము అర్థక్రియాసమర్థమగుటలో ఆశ్చర్యమేమి? సత్యసంకల్పుడయిన ఈశ్వరునియొక్క భావనయే ఆయా అర్థక్రియారూపముగ విస్తృతమగుచుండెను— చల్లతనముచే శిలీభూతమయిన (రాయిఅయిన) ఉదకము చాలకాలమునకు స్ఫటికాదిరూపముతో పరిణమించి, అతికఠిన మగుట ఫలకాకారము నొందుట పాత్రాకారము నొందుట, ఆయా పదార్థములవలనకలిగెడి పనులను నెరవేర్చుట మున్నగువానిని పొందు చున్నది—

కనుకనే మూలాజ్ఞానము తత్త్వజ్ఞానముయొక్క అభ్యాసపరిపాక క్రమముచేత శిథిలమగుచున్నది— క్రమంగా ప్రపంచము సూక్ష్మాతి సూక్ష్మమగుచూ, అజ్ఞానముతోసహా నశించుచున్నది— అజ్ఞానము నశించనిదే ప్రపంచాకారమునకు బాధలేదు— అజ్ఞానము శిథిలమగుటకు నిరోధాభ్యాసముచే బాహ్యాదివృత్తులను తగ్గించుకొనుటయే కారణము— వృత్తినాశమయినచో తత్త్వజ్ఞానము ఉదయించును— అవల ప్రపంచోప శమము సంభవించును—

లోకంలోకూడా అపక్షయవికారము వలననే స్థూలమయిన పదార్థములకు వినాశము ప్రసిద్ధమయియున్నది— కనుక రాజా! అజ్ఞానముశిథిలమై ప్రపంచనాశము అయినపుడే నిత్యసిద్ధమయిన పరిపూర్ణత మానవునకు కలుగును—

కనుక రాజా! ఈప్రపంచమంతా ఎండమావుల నీటివంటిది— పితామహుడు (బ్రహ్మ) కూడా అంతటివాడే— ఇంక అతడు నిర్మించిన ప్రపంచమువూట చెప్పనేల?

శిఖి॥ మునీంద్రా! ఆదిసృష్టికర్తఅయిన హిరణ్యగర్భునకు పర బ్రహ్మయేలకారణము కాకూడదు? హిరణ్యగర్భుడు కారణరహితు డనుటలో యుక్తియేమి?

కుంభు॥ రాజా! వినుము— "తదేతద్బ్రహ్మాపూర్వమనపరమ్" అను శ్రుతి బ్రహ్మకు పూర్వత్వలక్షణమయిన కారణత్వము అపరత్వ లక్షణమయిన కార్యత్వము లేదని నిషేధించినది— "నేహనానాస్తికించన" అను శ్రుతి ద్వైతమాత్రమును నిషేధించినది— "అసంగోహ్యయం పురుషః" అను శ్రుతి ప్రపంచసంబంధమే బ్రహ్మకు లేదని చెప్పుచున్నది— కనుక నీపై కారణములవలననూ, ప్రపంచానువృత్తి కుదరనందువల ననూ, కూటస్థచైతన్యమునకు పరిణామము సంభవించనందువలననూ, సర్వప్రపంచాతీతమయిన శుద్ధబ్రహ్మ కార్యమూ కాదు కారణమునూ కాదు— ఇతరకారకములు ప్రసిద్ధములు కానందున తత్ప్రయుక్త స్వాతం త్ర్యలక్షణముగు కర్తృత్వముకూడా బ్రహ్మకులేదు— కావున రాజా! ప్రయోజ్యకర్తయే లేనందున బ్రహ్మకు ప్రయోజకకర్తృత్వము అసం భవము— బ్రహ్మ నిమిత్తకారణము కాదు— ఉపాదానకారణము కాదు— కనుక చిదేకరసమయిన బ్రహ్మయే భ్రాంతిచే ప్రపంచరూపముతో భాసించుచున్నది— అంతకంటే వేరుగ ప్రపంచమనునది లేదు— ఇంక బంధమోక్షములమాటకు తావుయేది?

శిఖి॥ మునీంద్రా! నాకు విషయము అవగతమయినది— (విస్పష్ట ముగ దెలిసినది) మీరు చాలయుక్తియుక్తముగ జెప్పితిరి— కారణము లేనందున (కానందున) బ్రహ్మ కర్తకాడని తెలిసికొంటిని— కర్త లేనందున జగత్తులేదు— జగత్తులేనందున పదార్థజ్ఞానములేదు— అందుచేత చిత్తాదికము లేదు— కనుకనే అహంతాదులులేవు— ఇందువలన నేను పరిశుద్ధుడను— విబుద్ధుడను— ఆనందరూపుడను— నాకునమస్కారము— నాకంటే వేరుగ చైత్యమేమి లేదని బోధింపబడితిని— ప్రపంచంఅంతా ఆభాసమాత్రము— కనుక నేను ప్రశాంతముగ నుందును—

మునీంద్రా! ప్రపంచపదార్థదృష్టి నాకు శాంతించినది— నిర్వికార మయిన పరబ్రహ్మయే పరిశిష్టము— నీవుకూడా ప్రత్యగేకరసరూపు డవుగ నుండుము— నేను పరమపావనమూ, అవాఙ్మనసగోచరమూ నిరతిశయానందరూపము నయినపరబ్రహ్మను—అని అనినాడు శిఖిధ్వజుడు—

ఇట్లు ౯౩వ సర్గ ముగిసినది—

## ౫౩. శిఖిధ్వజావబోధనము.

వసి॥ రామచంద్రా! ఇలా శిఖిధ్వజుడు పరబ్రహ్మయందు విశ్రాంతి జెంది ప్రశాంతమనస్కుడై గాలిలేనిచోట దీపమువలె ఒక్క ముహూర్త కాలము నిర్వికల్పసమాధిలో నున్నాడు— ఇంతలో కుంభకుడు దృశ్యమార్జనమును మరింతగాఢముగా ఉపదేశింపదలచి మేలుకొలిపెను— ఇట్లనెను— రాజా! నీవు అజ్ఞాన నిద్రనుంచి మేలుకొంటివి— ఇపుడు జీవన్ముక్తుడవయితివి—

వసి॥ రామచంద్రా! కుంభునిచే తత్త్వోపదేశమును పొంది శిఖిధ్వజుడు మహామోహమునుంచి బయటపడ్డాడు— దృశ్యజాలమసత్తని తలచాడు— ఇలా అన్నాడు—

శిఖి॥ మునీంద్రా! నాకు విషయం తెలిసినా! యింకా నిపుణంగా తెలిసికొందామని మళ్ళీ అడుగుచున్నాను— శాంతమయిన పరమాత్మ అవిద్యావృతడయి యుండగా త్రిపుటీప్రత్యయము ఎక్కడనుంచి వచ్చినది? అనగా సత్పదార్థమునుంచి పుట్టినదా? లేక అసత్పదార్థమునుంచి పుట్టినదా! మొదటిపక్షమున వికారబాధలు సంభవించవు— రెండవపక్షమున సత్వేనప్రతిభాస (ఉన్నట్లు ప్రతీతి) ఉపపన్నము కాదు— అని నాతాత్పర్యము—

కుంభు॥ మహారాజా! బాగుగ అడిగితివి— నీబుద్ధికి మంచిప్రకాశయేర్పడినది! ఇదే నీవు తెలిసికొనుటకు మిగిలియున్నది— చెప్పుతా వినుము—

ఈ కనిపించే ప్రపంచం (దృశ్యజాతం) అంతా కల్పాంతంలో నశిస్తుంది— అపుడు చిన్మాత్రము నిర్వికల్పము నిరతిశయానందరూపమునయిన పరమాత్మ తత్త్వమొక్కటియే మిగిలియుండును— ఈయది ఆకాశముకంటె అతిసూక్ష్మము— మహామేరువుకంటె స్థూలము పరమాణువువలె నీ ప్రపంచము ఆపరమాత్మ తత్త్వము ముందు ఒకపుడు ప్రకాశించును— ఒకపుడు ప్రకాశరహితముగను నుండును—

ఇట్టి పరమాత్మతత్త్వమను అధిష్ఠానమునందు ప్రాక్తన జగత్సంస్కారోద్బోధవలన ప్రాణికర్మలు ఉద్బుద్ధముకాగా వానిననుసరించి అధ్యాసరూపమున ప్రపంచరూపమంతా ప్రకాశించును. అదే హిరణ్యగర్భునకు అహంభావలక్షణమగు జ్ఞానాధ్యాసము. అజ్ఞానాధ్యాసయందు విషయభూతమయిన ప్రపంచమే విషయాధ్యాస.

గాలికీ, దాని చలనమునకు, ఆకాశమునకూ, దాని శూన్యత్వము నకూ భేదములేనట్లు ప్రపంచాధిష్ఠానమయిన పరమాత్మకూ అధ్యస్తమయిన ప్రపంచమునకు భేదములేదు.

దేశకాలపరిచ్ఛిన్నమయిన జలమునందు ఊర్మ్యాదులున్నట్లు సువర్ణమునందు కటకాదులున్నట్లును, అపరిచ్ఛిన్నమై మూలకారణమయిన పరమాత్మయందు ప్రపంచము ఉండియే యున్నది. కావున అసత్కార్యవాదులమతము చెల్లదు.

అధ్యాసాధిష్ఠానమయిన పరమాత్మ శ్రేష్ఠుడు. సత్యస్వరూపుడు. అధ్యస్తమయిన ప్రపంచము గడ్డిపోచవలె తుచ్ఛము. అసత్యము. అధిష్ఠాన సత్తావలననే అధ్యస్తమయిన ప్రపంచమునకు సత్తాలాభము. చిన్మాత్రరూపుడగు పరమాత్మ నిరతిశయ ప్రేమాస్పదుడు. అద్వితీయుడు. ఏకత్వసంఖ్యకూడ అతనియందు లేదు. అదియున్ననూ అతని అద్వయత్వమునకు భంగమువాటిల్లును. పరిపూర్ణుడు. కార్యకారణ విలక్షణుడు. సర్వాత్మకుడు. స్వానుభవైకగమ్యుడు. నిరతిశయానంద రూపుడు.

వ్యవహారదృష్టిలో శబ్దతదర్థ సర్వవస్తు స్వరూపుడుకాని, వ్యక్తావ్యక్తస్వరూపుడుకాని అయిన పరమాత్మ తనకుతాను కారణము కానేరడు. పరమార్థదృష్టిలో దృఙ్మాత్రస్వభావమయిన అద్వయాత్మతత్త్వము కారణమెట్లగును? కాన పరమాత్మకు రెండుదశలయందునూ కారణత్వము పొసగదు.

మరియు వ్యవహారంలో అద్వైతము అసత్తు- ద్వైతముసత్తు- పరమార్థమునందు అద్వైతముసత్తు- ద్వైతము అసత్తు- సదసత్తులకు ఎన్నటికినీ కార్యకారణభావము పొసగదు-

పరమాత్మయే ప్రపంచము- కావున తనవల్ల తానుపుట్టడు- కనుక ఆత్మకు కారణత్వము అసంభవము- కావున కారణముకలవిగా నాచే జెప్పబడిన తరంగాదులుకూడ విమర్శిస్తే జలముకంటే వేరుకాదు- కావున వాటికికూడ జలాదులు కారణముకాదు-

శిఖి॥ మునీంద్రా! వెనుక మీరు జలాదులయందలి తరంగాదులు సకారణములని చెప్పిరి- ఆ న్యాయమునుబట్టి విచారించగా పరమాత్మయందలి అహంతాదులకుకూడ పరమాత్మ కారణమే కావలయును- అది కాదంటున్నారు మీరిప్పుడు- ఇది నేనెట్లంగీకరింతును ?

కుంభ॥ రాజా! సముద్రము పంచీకృతజలకార్యము-తరంగాదులు జలకారణములయిన వాయ్వాదిబాహ్యనిమిత్తములచే పయః (జల) పరిణామములు- కావున ఇవి సకారణములు- బ్రహ్మకు కారణము లేదని ప్రసిద్ధము- అతడు అద్వయుడుకనుక సహకారికారణములు లేవు-కావున తద్వివర్తమయిన ప్రపంచము అకారణము- కనుక నీరెంటికినీ వైషమ్యము మెండు-

తత్త్వజ్ఞానమునకుముందు అద్వయాత్మవస్తువు ఉన్నదను తెలంపుయే లేనందున అజ్ఞానులకీవిషయము తెలియుశక్యము కాదు- మీరు తత్త్వజ్ఞానముకలిగి అద్వైతవస్తువు పరిచితమయినందున సులభముగ తెలిసినది-

ప్రపంచమునకు పూర్వము ప్రతీతమయిన బ్రహ్మసత్తయే ప్రపంచసత్తయయినది-

వ్యోమమున గంధర్వనగరమున్నటులను శూన్యమగు ఆకాశమునందు తద్విరుద్ధమగు శూన్యత్వమున్నటులను మాయాంశబలమగు బ్రహ్మయందు ప్రపంచమున్నది-

చైతన్యైకరసరూపముతో తెలిసికొన్నను చిద్రూపమగు ఆత్మ తత్త్వమే తెలియబడును- లేక జడరూపముతో "లేదని" తెలిసికొన్నను శూన్యప్రపంచాధిష్ఠానమయిన బ్రహ్మమే తెలియబడును-తత్త్వజ్ఞానము యొక్క ప్రభావముచేత విషముకూడ అమృతమువలెనగును- సమ్యగ్ జ్ఞానము లేనందున అమంగళమయిన జగత్తు దుఃఖప్రదమగుచున్నది- అమృతమునుకూడ విషమనుబుద్ధితో అనుభవిస్తే విషముగానే రుచిస్తుంది- విద్యావిద్యలయొక్క సహాయాసహాయములుకూడ నిట్లే యుండును- (ఇలాగే ఉంటాయి)-

అగ్నిజ్వాల తిమిరాదినేత్రదోషములచే కేశోండ్రాకాది రూపముతో (కొప్పుమున్నరూపముతో) విచిత్రముగా గోచరించును- అయిననూ పరమాత్మాభిన్నముగనే యుండును-

చిత్స్వరూపముతో ఉన్న పరబ్రహ్మమే అతత్త్వజ్ఞానముచే దేహదేహ్యాకారమయిన ప్రపంచముగా చూడబడుచున్నది- కావున కేవల పరమాత్మయే ఇలా ప్రపంచాకారముగ భాసించుచున్నది-

కనుక నీవడిగిన త్రిపుటికి సంబంధించిన ప్రశ్నయే కుదరదు- ప్రపంచమే లేనపుడు ప్రపంచమెట్లు అనుభవింపబడుచున్నదను ప్రశ్న పుట్టుటకే వీలు లేదు-

మునీంద్రా! అయితే! పృథివ్యాదిపదార్థములే లేకపోతే "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరః" ఇత్యాద అంతర్యామి బ్రాహ్మణముచే "అంతర్యామి యయిన ఈశ్వరునిచే ప్రేరేపింపబడుచూ సకల వస్తువులూ తమతమ పనులయందు చమత్కారమును చేయుచున్నవని" చెప్పబడెడి వైదికసిద్ధాంతమెట్లు పొసగును?

వినుము- ప్రాపంచిక వస్తువులన్నీ మాయాశబలుడయిన ఈశ్వర మయములే- మాయాశబలేశ్వరునిచే మాయచేతనే పరస్పరము సామగ్రీ రూపమునొందునట్లు కలియుటకు ప్రేరేపింపబడినవి- పంచభూతాత్మక

మయిన పిండమునందు మాయికముగనే ఆయాకార్యచమత్కారమును చేయుచున్నవి-

ఇందుకుదాహరణము- లోకములో స్త్రీపురుషాత్మకమయిన దంపతులు యౌవనదశలో కామమయులు- (కామరూపులు) కామ ప్రేరితులై పరస్పర సంభోగముచే పుత్రాదులను పుట్టించుచు చమత్కారమును కలిగించుచున్నారు-

ఇట్లే నేలలో చల్లిన బీజములు (విత్తనములు) వర్షోదకముచే ప్రేరితములై అంకురములను బుట్టించి చమత్కారమును కలిగించుచున్నవి అట్లే ప్రాపంచికపదార్థములుకూడ పరమాత్మ చైతన్యమువలన బుట్టుచున్నవని గ్రహింపవలెను-

కావున ఆవృతచైతన్యమే మాయికమయిన చిన్మాత్రముచే ఆయాకార్యరూపములతో పరిచ్ఛిన్నమగుచున్నది-ఇందు "పూర్ణమదః పూర్ణమిదం" ఇత్యాది ఉపనిషచ్ఛ్రుతిని సమన్వయపరచుకొనవచ్చును.

ప్రలయకాలమునందు సర్వోపాధులు లయించగా మాయాశబల బ్రహ్మయందు అప్యయము నొందిన జీవులు వాసనామాత్రశేషులై యుందురు- మరల కల్పప్రారంభమునందు భోజకాదృష్టము (అనుభవించెడివారల యదృష్టము) పరిపాకముచెందగా మరల తమతమ వ్యష్టి సమష్టి ఉపాధులను సృష్టించుకొని ఉద్ధరింతురు-

కనుక పూర్ణాత్=అపరిచ్ఛిన్నమయిన బ్రహ్మకారణమునుండి, పూర్ణాని=అపరిచ్ఛిన్న బ్రహ్మరూపములయిన కార్యములు, ఉద్ధరంతి= మాయచే, బయలుదేరుచున్నవి-

అలాగే స్థితికాలమందుకూడ, పూర్ణాని=ఐహికాముష్మికభోగ, మోక్షసాధనములు, పూర్ణాత్ = చక్రిరే = మాయచే అపరిచ్ఛిన్న బ్రహ్మమునుంచియే నిర్మింపబడుచున్నవి-

పూర్ణాత్, పూర్ణాని, భవంతి = తత్త్వజ్ఞానమువల్ల ముక్తులగు వారుకూడ పరిపూర్ణమగు బ్రహ్మనుండి, మాయ తొలగిపోయినందు

వలననే పూర్ణులగుచున్నారు– అనగా భేదభ్రమతోపాటు మాయ నశింపగా పూర్ణమగు బ్రహ్మతత్త్వమే మిగులుచున్నది– "పూర్ణమేవావశిష్యతే" అని యిట్లు శ్రుత్యర్థమును సమన్వయపరచుకొనవలెను.

రాజా! ప్రత్యగాత్మరూపము గు చైతన్యమే సర్గాదియందు తన రూపమును విశ్వకర్తయై స్వయముగ అనంతమును మహారూపము అగుచున్నదివలె నుండును– పిదప స్థౌల్యకల్పనతో ప్రకాశించుచున్నదగుచు (ఆభాసజెందుచున్నదగుచు) స్వయంభువుని యొక్క సంసారము విరాడ్భావముతో సంసరించినట్లు భాసించును– పిదప వ్యష్టి జీవభావముచే దీనిని ప్రపంచభ్రాంతితో స్వరూపముగనే చూచుచుండును–లేక పరమార్థముగ అధిష్ఠానస్వరూపమునే ప్రకాశముగ చూచుచుండును ఈయంశలో మాత్రం భ్రాంతిలేదు– ఇదే చైతన్యము భావనవల్ల చతుర్విధభూతగ్రామత్వమును, క్షణకాలపరిచ్ఛేదమువలన దృశ్యత్వమును చెందుచున్నది–

కావున రాజా! నామరూపనిర్ముక్తమును అవ్యపదేశ్యమును, స్వప్రకాశచిద్రూపమును అగు అద్వితీయాత్మతత్త్వమే మాయా ప్రసారముచే ప్రపంచాకారముగ నున్నది–

ఇట్లు ౯౫వ సర్గ సమాప్తము.

## ౯౬. శిఖిధ్వజావబోధనము.

కుంభ॥ రాజా! దేశకాలపరిచ్ఛిన్నమయిన సువర్ణమునందు కటకాదుల గురించిన జన్యజనకభావసంబంధముండవచ్చును– ప్రశాంతమయిన బ్రహ్మనుండి పుట్టునదిలేదు– చచ్చేదిలేదు–స్వస్వరూపప్రతిష్ఠితమయిన బ్రహ్మ బీజమూ కాదు– కారణమూ కాదు– అయ్యది శుద్ధ చిన్మాత్రము– దానికంటె వేరులేదు– అచిత్పదార్థమే అనంతమయిన అహంకారాదిప్రపంచాకారముగ భాసించుచున్నది–

శిఖి॥ మునీంద్రా! దృశ్యప్రపంచము లేదని నమ్ముచున్నాను— కాని శుద్ధచైతన్యమునకు దృశ్యమును గురించిన ప్రతీతి యెట్లుకలుగు చున్నది!

కుంభ॥ రాజా! దృశ్యప్రపంచము చిదాత్మయందు అధ్యస్త మయినది— "అధ్యస్తము అధిష్ఠానముకంటే వేరుకాదు" అను న్యాయ మొకటికలదు— కనుక అధిష్ఠానసన్మాత్రమే ప్రపంచాకారముగ వ్యవహ రించబడుచున్నది—

ఈస్థితిలో ప్రపంచమును గురించి కొన్నివాదములుకలవు— లోక ములో— విజ్ఞానవాదులు లోపలి విజ్ఞానమే వెలుపల ప్రపంచముగ గోచరించుచున్నదందురు— గౌతమ, కణాద, కపిల, పతంజలి, మున్నగు వారు బాహ్యప్రపంచము పృథివ్యాది పంచభూతమయమనీ, పరమార్థ మనీ అందురు— మాధ్యమికుడయితే ప్రపంచము శూన్యమనియు, లోపల వెలుపల గ్రాహ్యగ్రాహకాకారముగ సంవృత్తిచే (భ్రాంతిచే) (మాయచే) (అజ్ఞానముచే) భాసించుచున్నది— అచట వస్తుభూత మయినది యేమిలేదని యనుచున్నాడు—

ఈమతములేవీ చెల్లవు— ఈ వాదులయొక్క కల్పనలన్నియు, చైతన్యమనేది యొకటి యున్నపుడే చెల్లునుగాని లేనపుడు, శూన్య త్వముకాని క్షణికత్వముకాని, జన్యత్వముకాని, వినాశిత్వముకాని, పరిణామముకాని, ఏవీచెల్లవు— కనుక ప్రపంచము చిత్సారము— అనగా ప్రపంచమునందు చైతన్యమే సారము— నీటికి ద్రవత్వముసారము— ప్రాపంచిక వస్తువులన్నిటికి చైతన్యముసారము—

అయితే యిట్టి చైతన్యము జగద్రూపముగ ఎట్లు ప్రతీతమగు చున్నది! అను ప్రశ్నయొకటి కలుగును! వినుము సమాధానము—

అచిద్రూపపదార్థము ప్రపంచాకారముగ ప్రకాశించుటలోకాని, పరమార్థ చిన్మాత్రరూపముగ ప్రకాశించుటలోకాని మాయచేతనే

సమర్థమయి యున్నది- కనుక చైతన్యము, సావిద్యము, నిరవిద్యము (అవిద్యతో గూడినది అవిద్యతో కూడనిది) యెట్లయినదో అట్లే ప్రపంచాకారముగ ప్రతీతమగునది పరమార్థచిన్మాత్రముగ నుండునదీ అయినది-

అయితే బ్రహ్మపదార్థము స్వచ్ఛాస్వచ్ఛోభయభావము కలదగుచో ఉపనిషత్తులన్నియు బ్రహ్మపదార్థము నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావమని యెట్లనుచున్నవను ప్రశ్న యుదయించును- వినుము దీనికి సమాధానమును చెప్పెదను-

సత్వమాత్రముయొక్క (సద్రూపముయొక్క)స్వభావము స్వచ్ఛభావము (స్వచ్ఛముగానుండుట) దానికి విరుద్ధస్వభావము అస్వచ్ఛభావము- అయ్యది తనకు విరోధియయిన సత్త్వమును చెడగొట్టనీ, చెడగొట్టకపోనీ, (వ్యవచ్ఛేదం కుర్యాన్నవాకుర్యాత్) ఏమయినా తాను సిద్ధించదు-

ఎందువలననగా ! అస్వచ్ఛభావము సత్త్వమును చెడగొట్టుచూ ప్రతియోగియయిన సత్త్వమే యుండదు- చెడగొట్టనిచో తనకు విరుద్ధమయినదే లేదు- కనుక అపుడును ప్రతియోగి యుండదు- ఉభయథా తాను సిద్ధించదు- కనుక సత్త్వమునకు తద్విరుద్ధస్వభావమయిన అస్వచ్ఛస్వభావమునకును ప్రతియోగివ్యవచ్ఛేదమే లేనందున (ప్రతియోగిని చెడగొట్టెడి స్వభావమే లేనందున) అస్వచ్ఛతయే లేదు- కనుక పరమాత్మయందు స్వచ్ఛభావైకవ్యవస్థ సిద్ధించినది-

అయితే స్వచ్ఛమయిన చిద్రూపపదార్థమే అస్వచ్ఛమయిన జగద్భావముగ పరిణమించుటకు కారణమగుచున్నదని యేలయనరాదు? పూర్తిగా అస్వచ్ఛభావములేదని నిషేధింపనేల ? అని యందురేమో ! అట్లుకాదు- అస్వచ్ఛభావమయిన ప్రపంచము పూర్తిగా లేదని నిషేధించుటకు కారణమున్నది- చైతన్యము కూటస్థమనీ, అద్వితీయమనీ, శ్రుతి చెప్పుచున్నది- విద్వాంసుల యనుభవముకూడ అట్లున్నది- అందువలన ప్రపంచము పొత్తుగా లేదని కల్పించవలసి వచ్చినది-కావున

ప్రపంచము చిత్పదార్థమునందు అధ్యస్తమయినదని చెప్పుటకంటె వేరుమార్గమేలేదు- అందుచే అధ్యాసపక్షమే ఖాయము-

అయితే కారణంలేకుండానే ప్రపంచంపుట్టిందనే యదృచ్ఛావాదుల (నాచురాల్టీవాదుల) స్వభావవాదుల మతమేల నంగీకరింపకూడదు? అట్లంగీకరించుటకు వీలులేదు- కార్యమయిన వస్తువు కారణములేనిదే పదార్థ(వస్తు)రూపముగ ప్రతీతముకాదు- (గోచరించదు) కావున ప్రపంచవస్తువులన్ని ప్రతీతమగుటకు చైతన్యమునది వివర్తకారణముగ నున్నందున "యదృచ్ఛావాది" పక్షము చెల్లదు- కనుకనే ప్రపంచము సద్రూపంతో పరమార్థమున్నూ, జడరూపముతో వికల్పమాత్రమున్నూ అగుచున్నది-

అటులనయితే ప్రపంచము చిద్రూపమే- దానిని చిద్రూపమగు బ్రహ్మమే కారణము- అయితే ఇదికార్యము, ఇదికారణము అను విభాజకము (భేదకము) లేకపోవునుగదా! అని యనరాదు- జన్మనాశములు విభాజకములు కావచ్చును- అనగా జన్మనాశములుగల చైతన్యము కార్యము- అవిలేని చైతన్యము కారణము- అని భేదమును గ్రహింపవచ్చును- అనినచో అదియును కుదురదు-

ఘటపటాది ప్రాపంచికవస్తుజాతము చిద్రూపము కానేరదు- నాశనియతమయిన ప్రపంచము అవినాశి చిద్రూపమగుట అసంభవము- పైగా చిత్తుయొక్క నాశము చిత్తుచే సిద్ధింపదు- ఏలయన? నాశకాలమందు చిత్తుయున్నచో నాశమును చెప్పుట నిర్విషయమగును- అట్లె జడమువలనగూడ చిత్తుకు (చైతన్యమునకు) నాశము సిద్ధింపదు ఏలయన జడము అదియే స్వయముగ సిద్ధించుటకు అసమర్థమయినది చైతన్యమునకు నాశమును తెప్పించుటకు సమర్థమెట్లగును?

చిత్తుయొక్క నాశము చిద్రూపమే- ఇది తాను ప్రకాశించుటయందుకాని యితరమును ప్రకాశింపజేయుటయందు గాని ఇతరమునపేక్షింపదు- అనినచో అదియును చెల్లదు- చిద్రూపమగు సంవిన్నా

శము స్వజన్మమునకుగాని స్వప్రతియోగికిగాని ప్రకాశకమని యనవలెను- అదికుదురదు- ఏలయన తన పుట్టుకకాని తత్పూర్వకాలిక ప్రతియోగి యగు చిత్తుకాని నాశముచే తెలియబడనేరదు- ఇవి రెండును ఉపలభ్య మానములు కానపుడు దానియొక్క- నాశము స్వయముగా పుట్టినదని చెప్పుట కుదురదు- ఇక సాక్షి చైతన్యముచే తదుభయానుభవ మనెద మనినచో అదియు కుదురదు-

చిత్తు చిద్విషయము కానేరదు- కావున చిద్వేద్యమగు ఉత్పత్తి నాశములకును, ప్రపంచమునకును జాడ్యమే ప్రసక్తించును- ఇట్లు ప్రపంచమునకు జాడ్యము (జడత్వము) సిద్ధింపగా కారణనిరూపణము సాధ్యపడనందున కారణములేకుండగనే ప్రపంచము పుట్టినదనినచో సదాపుట్టుకయే యగును- సదానాశమే యగును- ఆ రెంటిని నివారించెడి వస్తువు మరొకటి ఏదియు లేదు-

ఓ స్వభావవాదీ! నీవు ప్రమాణరహితముగా అనుభవవిరుద్ధ మయిననూ ఇలా నిత్యోత్పత్తి నాశస్వభావముగకలది యీ ప్రపంచ మని యంగీకరించుచుంటివి-

ఇట్టిస్థితిలో శ్రుతి విద్వదనుభవసిద్ధమగు అఖండచిదేకరూపమగు ఆత్మతత్త్వము అంగీకరించుచో నీకేమి బాధ ?

అయితే అంతా చిదేకరసమే అయితే లోకములో చిత్తు,అచిత్తు అని రెండువిధముల అనుభవమెట్లు కలుగుచున్నది ! వినుము అది చిత్తముయొక్క- చమత్కారమువలన కలుగుచున్నది-

అయితే చిత్తమనేది రెండవది ఉన్నట్లే కదా ! కాదు- అది చిత్త్వమాత్రసత్తాకము- అనగా చిత్తమునకు చైతన్యముయొక్క- సత్త (ఉనికి) కంటె వేరుసత్త(ఉనికి)లేదు-కావున ద్విత్వము, ఐక్యము అనేదేదియు లేదు- కనుక జీవబ్రహ్మభేదముకాని, చిదచిద్భేదముకాని, దృగ్దృశ్యభేదముకాని ఏమాత్రము లేదు-

శుద్ధచైతన్యము అసంగమగుటనుబట్టి జడపదార్థములే సిద్ధించనందున వానిని భావించుటవలన ఏర్పడెడి "అహమ్" అనెడి జీవరూపముకూడ లేదు. కావున ఆత్మమాత్రము మిగులుచున్నది.

అట్టి ఆత్మయే "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "విజ్ఞానమానందం బ్రహ్మ" "బ్రహ్మైవేదం విశ్వమిదంవరిష్ఠం" ఇత్యాది సర్వవేదార్థము. తదఖండాకారవృత్తి సర్వమును బాధించి స్వయముగ మిగిలి యుండును.

కావున రాజా! సర్వద్వైతబాధచే నీవు బ్రహ్మయే అగుచున్నావు. ఆ బ్రహ్మము అద్వితీయము. జగత్తు అంతా శూన్యము. తత్ప్రతిభాసరూపమగు చిత్తుకూడా నిర్వికారమగు బ్రహ్మమే. కావున నీవు అట్టి బ్రహ్మమే అగుచున్నావు.

ఇట్లు ౯౦వ సర్గ ముగిసినది.

## ౯౧. శిఖధ్వజావబోధనము.

శిఖి॥ మునీంద్రా! వెలుతురుంటేకదా! రూపం కనిపించేది. అలాగే చిత్తముంటేనేకదా! చైతన్యమునకుగాని, తదన్యమునకుగాని ప్రకాశము. అట్టి చిత్తమును బ్రహ్మాకారవృత్తి కలదానినిగ జేసి బాధింపజేసినచో, దీపములేనపుడు చీకటికమ్మినటుల ప్రపంచమున కంతకును అంధ్యమేర్పడునుకదా!

మరియు సచిత్తులు సచేతనులనీ, అచిత్తులు అచేతనులనీ లోకంలో ప్రసిద్ధము. ఇలాంటిఅపుడు జీవన్ముక్తులు నష్టచిత్తులైనచో మృదాదులవలె అచేతనులగుదురు. అట్లయినటుల లోకంలో కనిపించుట లేదు.

మరియు చిత్తమున్నపుడే నిరతిశయానందలక్షణమయిన పరమపురుషార్థము అనుభవింప శక్యమగును. అనుభవగోచరము కానిదేదియు పురుషార్థము కానేరదు.

కాక బ్రహ్మాకారమగు చిత్తమే చిత్తమును బాధించునా? లేక మరియొకటి బాధించునా? ఇందు మొదటిపక్షము కుదురదు- తనను తాను బాధించుకొనుట అసంభవము- తనయందు తనకు క్రియవిరుద్ధము బాహ్యమగు కట్టెను దహింపచేసెడి అగ్ని తనను దహింపచేసికొనదు-

మరియొకటి చిత్తమును బాధించునని రెండవపక్ష మవలంబింత మన్నచో అదియును పొసగదు- చిత్తముచే బాధింపతగిన ప్రాపంచిక పదార్థమేదియు చిత్తమును బాధింపనేరదు- చిత్తివృత్తికంటె నితర మేదియు చిత్తమును బాధించెడిది లోకములో ప్రసిద్ధమయి లేదు- కాక చిత్తము ప్రపంచమును బాధించి ప్రపంచము చిత్తమును బాధించుచో సుందోపసుందన్యాయము ప్రసక్తించును-

అనాదిసిద్ధమయిన బ్రహ్మ సర్వసాధకమే కాని బాధకము కాదు- కావున చిత్తమునకు బాధదుష్కరము- సర్వానుభవవిరుద్ధమున్ను అగుచున్నది-

కనుక మునీంద్రా! చిత్తము లేదనే బోధ నాకు ఏయుక్తి చేస్పష్ట పడునో ఆయుక్తిని నాకు విపులపరచి చెప్పండి- లేక తదుపయుక్తమయిన యుక్తిని మరొకదానిని నాసందేహములను దీర్చునటుల చెప్పను- అని శిఖిధ్వజుడడిగెను-

కుంభకుడు సమాధానమును చెప్పుచున్నాడు- రాజా! చిత్త మనేది లేనేలేదు- నీకు చిత్తమువలె గోచరించేది అవ్యయమయిన బ్రహ్మమే (యె) కనుక చిత్తము మొదలగు జగత్తుఅంతా అజ్ఞానాత్మకము- జ్ఞానముచే అదియంతయు బాధింపబడును- కావున ప్రపంచము బాధ్యమగుటచే లేనిదే-

రాజా! ఇచట నాబోధకు తాత్పర్యమును గ్రహించాలి- చిత్తమును చిత్తము ఎలా బాధించుకుంటుంది? తనయందు తనకు క్రియ పుట్టదుకదా! (స్వాత్మని క్రియావిరోధముకదా!) అని నీవడిగితివి-

అజ్ఞాననాశముకంటె చిత్తనాశమనేది వేరయితే నీవడిగినది రైటే- అజ్ఞానవాశమే సకలాజ్ఞానకార్య, తత్సంబంధ, ఆవరణ, విక్షేపాది సర్వనివృత్తిరూపము- అనగా అజ్ఞానవాశమంటే సకలప్రపంచ నాశమన్నమాటే- అంచేత అది కలిగిన తరువాత యింకచిత్తమనేది లేదు- కనుక చిత్తనాశమనేది అజ్ఞానవాశముచేత అర్థాత్సిద్ధము-

కనుక అంధ్యాది దోషప్రసక్తికూడ లేదు- సర్వాంధ్యమునకు ప్రయోజకమయిన అజ్ఞానమే పోయింది- కనుకను స్వప్రకాశ పరిపూర్ణానందము పరిశేషించింది కనుకను నిరతిశయపురుషార్థము సిద్ధించికనుకనూ-

చేతనత్వమునది చిత్తాధీనముకాదు- అభివ్యక్తచిదధీనము- అభివ్యక్తచైతన్య (చిత్తు) మ(అ)నేది చిత్తమునశించినా జీవన్ముక్తుల యందుకూడా ఉన్నది- కనుక అచేతనత్వ ప్రసక్తిలేదు- చిత్తము నశించినంతమాత్రముచేత చిత్తికృతమయిన చిదభివ్యక్తి తొలగిపోదు- అజ్ఞానావరణంచేతకాని చైతన్యమునకు అనభివ్యక్తి యేర్పడదు- అట్టి అజ్ఞానముపోగానే చిదభివ్యక్తి స్వాభావికముగ నుండునుకాని నశించదు- గాలిచే మేఘము తొలగిపోతే ఏర్పడిన సూర్యాభివ్యక్తి శరత్కాలంలో గాలియే లేకపోతే సూర్యునికభివ్యక్తి పోవుటలేదు-కావున నీవు చూపిన దోషములన్నియు పరిహృతములయినవి- కనుక ప్రపంచమనేది పుట్టిందీ లేదు- చచ్చిందీలేదు- బ్రహ్మమే ప్రపంచాకారంగా గోచరిస్తూఉంది- "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్, తత్కేన కంపశ్యేత్" అన్నట్లు సర్వమూ బ్రహ్మమే అయితే యింక ప్రపంచమనేదాన్ని దేనిచే ఎలా తెలిసికొంటున్నావు ?

"ననిరోధో నచోత్పత్తిః" అను ప్రమాణమునుబట్టి యీప్రపంచం మహాప్రలయోత్తరకాలమందలి సృష్టియందే పుట్టలేదు- "ఇది" "ఇది"అని నీబోధకొరకు నేనుచెప్పితినేకాని అది నిజంకాబట్టికాదు- ఉపాదానాదికారణాలు లేవుకనుకకూడా ప్రపంచం లేదనటం సమంజసం.

అయితే ప్రపంచము పుట్టనే పుట్టకపోతే "తదాత్మానగ్ం స్వయ మకురుత" "ఏకో వశీ సర్వభూతాంతరాత్మా" "ఏకం బీజం బహుధా యః కరోతి" "కర్తా భోక్తా మహేశ్వరః" ఇత్యాది ప్రపంచోత్పత్తి బోధక శ్రుతులగతియేమిటి ? అని నీవడుగ వచ్చును- విను సమాధా నము- అవన్నీ "నేహనానాస్తి కించన" అని శ్రుతి నిషేధించెడి నిషేధ్య వస్తువును సమర్పించుచూ అద్వైతమును ప్రతిపాదించెడి అర్థవాదలే కాని తత్వార్థములు (సత్యవాదులు) కావు- నామరూపరహితమయి నిష్కలము, నిష్క్రియము అయిన బ్రహ్మము, ప్రపంచమును సృష్టించా డనుట పరిహాసాస్పదమయినమాట- క్రియారహితుడు సృష్టిక్రియను చేయుటఎలా ? కాబట్టి బ్రహ్మమే ఇలా ప్రపంచాకారముగా అజ్ఞానం వల్ల భాసిస్తోంది- లోకంలో శీతవాతాది ఉపద్రవములు కలవాళ్లు ఉపద్రవవారణముకొరకు గృహాదులను నిర్మించుకొంటున్నారు- ఈశ్వ రుడు అలాగంటి ఉపద్రవములేమీ లేనివాడు- అట్టి యీశ్వరుడు ప్రపంచమును నిర్మించుకొంటున్నాడనుట హాస్యాస్పదముకాకమరేమిటి?

ఇలా ప్రపంచమే లేకపోతే అందులో చేరిన చిత్తమెక్కడిది ? చిత్తమంటె వాసనాత్మకముకదా ! వాస్యమయిన వస్తువుండిననేకదా ! వాసనాత్మకమయిన చిత్తముండునది-

అయితే "చిత్తము, చిత్తము" (మనస్సు) అనే లోకవ్యవహారం ఎలా పుట్టింది? విను- మాయోపహితమయిన బ్రహ్మమే చిత్తాదివ్యవ హారమునకు విషయము- కాబట్టి ప్రపంచమూలేదు- ప్రపంచాంతర్గత మయిన చిత్తమూలేదు- నీవు, నేను, నాది, నీది, అనేది లేదు- సర్వం మిథ్య- ప్రపంచం పుట్టలేదంటే నేను అది అనాదిగావున్నదని నీవు అను కుంటావేమో అదీపొరపాటే- లోకమువలనకాని, శాస్త్రమువలనగాని, స్వానుభవమువలనగాని, ప్రపంచం జన్మాదివికారాలు లేకుండా కూట స్థంగా అనాదిసిద్ధమై ఉండటమనేది అసంభవము- సాకారము, స్థూలము, ప్రతీఘాతయోగ్యము అయిన ప్రపంచమునకు లోకశాస్త్రానుభవసిద్ధము

లయిన మహాప్రలయాదులు లేవనటంకాని ప్రలయంవరకు అనుభవ గోచరములయ్యే వికారాలు లేవనటంకాని కుదరదు- లోకవేదమర్యాదలను ఉల్లంఘించతగదు- లోక, వేద, శాస్త్రములను ప్రమాణముగ గైకొననివాడిసి అతిమూఢుడంటారు పెద్దలు- అట్టివానిని సజ్జనులు దరిజేరరు- (ఆశ్రయించరు) కనుక ప్రపంచం అనాదికాదు- ఆదిగా పుట్టనూలేదు- కాబట్టి మిథ్య- కనుక అధిష్ఠానమయిన బ్రహ్మయే ప్రపంచాకారంగా గోచరిస్తోంది- "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః" ఇత్యాది సూత్రకర్తయగు బాదరాయణులవారికి ప్రపంచము బ్రహ్మతాత్త్విక స్వభావముకలదని నిరూపించుటయందే తాత్పర్యము-

ఇలా బ్రహ్మమాత్రమయినా ప్రపంచం వ్యవహారదశలో దాని యాకారమునకు భంగంలేదు కనుక అర్థక్రియాసమర్థము కావచ్చును- కనుక లోకవిరోధము లేదు- పరమార్థమున బ్రహ్మభూతమే కనుక మూర్ఖదృష్టిప్రసిద్ధమయిన రూపము దానికి లేనందున వేదవిరోధమూ లేదు- కనుక రామా! పరిపూర్ణుడు, నిరంశుడు, అవ్యయుడు, నిరాకారుడు, సర్వవ్యాపకుడు, శాంతస్వరూపుడు అగు పరమాత్మయే సృష్టి స్థితి లయరూపములను ధరించిన ప్రపంచరూపముగ ప్రకాశిస్తోంది అజ్ఞానదశలో- అదే తత్త్వమస్యాది మహావాక్యార్థానుసంధానము కలిగితే శుద్ధబుద్ధస్వభావమయిన బ్రహ్మగా గోచరిస్తుంది- ఈవిషయాన్ని మనసార గ్రహించి నీవు వాగాదివ్యాపారములను కట్టిపెట్టి ఉండుము-

ఇట్లు ౯౮వ సర్గ సమాప్తము.

౯౯. శిఖిధ్వజావబోధనము.

శిఖి॥ మునీంద్రా! నామోహము, పటాపంచలయినది- ఆత్మ సాక్షాత్కారమనెడి స్మృతి కలిగినది- సందేహములు తీరినవి- నేను శాంతరూపుడను, నిరహంకారుడను, నిరామయుడను- ఇంతవరకు

భ్రాంతుడనై సంసారాంబుధిలో మునిగిపోయాను- నిశ్చలమయిన స్థితిని యిప్పుడు పొందితిని- కాబట్టి మునీంద్రా! అహంతాది జగత్త్రయము ఏమాత్రములేదు- ఇది అంతా మూర్ఖ భ్రాంతి ఉన్నదల్లా బ్రహ్మమే- అని అన్నాడు శిఖి-

ఇదిఅంతా విన్నాడు కుంభకుడు- స్థూణానిఖనన న్యాయమున శిఖిధ్వజుని బోధను (జ్ఞానమును) దృఢపరుపదలచి మరలమరల అదే విషయాన్ని బోధించినాడు:- ముహుర్ముహుః దృష్టాంతపురస్సరముగ ప్రపంచములేదనీ, అది వట్టిభ్రాంతిఅనీ, తదంతర్గతమయిన చిత్తము కూడ లేనిదేయనీ పలుమారు బోధించినారు కుంభకులు-

కుంభ॥ రాజా ! ప్రపంచమే లేనపుడు ప్రపంచంలో నేననే వ్యవహారమేమిటి ? ఇది గంధర్వనగర వ్యవహారమువంటిది- దీనికి ఆధారము లేదు- కారణములేదు- దృష్టాంతములేదు- కనుక నీవు ప్రశాంతంగా ఉండు- ప్రపంచమనేది నభోమయము- (శూన్యము) చైతన్యముయొక్క చాకచక్యమే ప్రపంచముగా గోచరిస్తోంది-

ఆభరణములయొక్క- సన్నివేశదృష్టి నశిస్తే అంతాకనకమే- సన్నివేశదృష్టి ఉన్నపుడే కటకం కటకంగానూ, రుచకం రుచకంగానూ గోచరించేది- సమష్ట్యహంకారాత్మయగు స్వాయంభువు (బ్రహ్మ) ఎలా సంకల్పమాత్రుడో అలాగే వ్యష్టహంకారరూపుడుకూడ సంకల్ప మాత్రుడే- ఈసంకల్పమే సమష్టివ్యష్టిబంధము- ఈయది అభిమాన మాత్రమున కలుగును- అభిమానపరిత్యాగమున మోక్షమేర్పడును-

"అహం" (నేను) అనే సంకల్పమే బంధము- "నాహమ్"అనే సంకల్పమే మోక్షము- బంధము దుఃఖాత్మకము- మోక్షము ఆనందాత్మకము- బంధమోక్షసంకల్పములకు సాక్షియయిన చైతన్యమే బ్రహ్మపదార్థము- అదే కైవల్యమని చెప్పబడుతోంది- నాహమను జ్ఞానము మోక్షము-"అహమ్" అను జ్ఞానము బంధము- నీవు అనహంవేదనముతో కైవల్యస్థితిని పొందుము- ఇలాంటి శుద్ధబోధ సంకల్ప

క్షయమువలనగాని కలుగదు- శుద్ధమయిన బ్రహ్మము కారణము కానందున దృశ్యపదార్థము లేదు- దృశ్యపదార్థము లేదనే నిశ్చయము వలన సంకల్పక్షయము- సంకల్పనాశమువల్ల అహంభావనాశము- అహంభావనాశమువలన సంసారనాశము- తరువాత బ్రహ్మమాత్రావశేషము- ఇదీ దీనిక్రమము-

కాబట్టి భాసించెడి ప్రపంచంఅంతా పరబ్రహ్మమే- (పరబ్రహ్మాత్మకమే) వజ్రపురాతిముక్క-యొక్క- మధ్యభాగమువలె దృఢమయినది- ముక్తిదశలోమాత్రం కనిపించనందున అసన్మయము లేనిది- (అసద్రూపము) సంకల్పమునశిస్తే సంకల్పనగరముయొక్క- గతియేదో అదేగతి యీ ప్రపంచానికికూడా సంకల్పనాశానంతరం- వజ్రపుశిలలో ప్రతిబింబించిన పురుషుడు చలనములేకున్ననూ చలనము కలవానివలె కనిపించును- అలాగే ప్రపంచానికి స్వతః చలనములేకున్ననూ చైతన్యస్ఫురణమువలన చలనముకలదివలె గోచరించును- కాబట్టి సమ్యగ్జ్ఞానము కలిగితే బాహ్యవృత్తులూ, మానసికవృత్తులూ అన్నీ నశించి ఆగమ ప్రమాణమువలన కలిగెడి స్థిరభావన ఒక్కటిమాత్రమే నిలిచియుండును- దానినే నిర్వాణమని యందురు-

ప్రపంచమును శబ్దార్థరహితమయిన దానినిగ గ్రహించినవాడే వివేకి- స్పందము (చలనము) లేకున్నను వాయువున్నది- దీపాద్యాకార సన్నివేశము లేకున్ననూ అగ్నికి స్వగతప్రకాశమున్నది- కటకాద్యాకార సన్నివేశము లేకున్ననూ సువర్ణమున్నది- అలాగే ప్రపంచముకూడ సన్నివేశ(ఆకార)రహితమయిన బ్రహ్మరూపములో నుండునని యూహించవలెను- బ్రహ్మజ్ఞానమువలన, బ్రహ్మభూతమయిన ప్రపంచముయొక్క- ప్రపంచాకారమయిన బాహ్యాభ్యంతరవృత్తులు నీరసములగును- అనగా లేనివగును- సముద్రములోని తరంగ, ఫేన, బుద్బుదాదులన్నీ తరంగాది శబ్దార్థరహితమయిన ఉదకమాత్రమెట్లగుచున్నవో! అట్లే ప్రాపంచిక వస్తువులుకూడా తత్త్వజ్ఞానం కలిగేసరికి స్వతస్సిద్ధమయిన బ్రహ్మ

మాత్రమే యగుచున్నవి- ఇదియే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతి వాక్యమున కర్థము- "బృంహణాత్ బ్రహ్మ" అని బ్రహ్మశబ్దార్థము- "నామరూపయోర్విసర్గః (త్యాగః) సర్గః" అని సర్గశబ్దార్థము- ఈరీతుగ బ్రహ్మశబ్దార్థసంపత్తి సర్గశబ్దమునందును సర్గశబ్దార్థ సంపత్తి బ్రహ్మ శబ్దమునందును కలదు- కనుక ఈ రెంటికినీ ఒకటే అర్థము-

సమ్యగ్ దర్శనము సిద్ధించిన తరువాత లక్షణచే బ్రహ్మజగచ్ఛబ్దములయొక్క అఖండార్థబోధ కలుగగా మిగిలిన వస్తువునందు బ్రహ్మ శబ్దమనే మాటకూడ నివర్తించును- కనుక రాజా! పరిదృశ్యమాన ప్రపంచమంతా బ్రహ్మస్వరూపమే- తత్త్వజ్ఞానముచే ప్రపంచము అజ్ఞానముతో సహా నశించినా బ్రహ్మస్వరూపముతో ఉండియే యున్నది- కనుక బ్రహ్మజగత్తులకొకటియే ఉనికి(సత్త) దేనికీ అసత్త్వమనునది లేదు.

ఇట్లు ౯౯వ సర్గ సమాప్తము.

## ౧౦౦. శిఖిధ్వజావబోధనము.

శిఖి॥ మునీంద్రా! బ్రహ్మజగత్తులకు సత్త (ఉనికి) ఒక్కటే అయితే అసత్తతో బ్రహ్మపరమార్థము సత్యమయినట్లు ప్రపంచమేల పరమార్థసత్యము కాలేదు- మిథ్యావస్తువునకు కారణమును నిరూపింప వలవి కాదు- కాని సత్యమయినదానికి సత్యమయిన బ్రహ్మయే కారణము కాగలదు- అని శంకించాడు రాజు-

కుంభ॥ మునీంద్రుడు సమాధానము చెప్పుచున్నాడు- రాజా! నిర్గుణమయిన బ్రహ్మపదార్థము అద్వయము- దీనికి పూర్వకాలమనునది లేదు- పూర్వవృత్తిత్వ శూన్యమయినదియది- పైగా నిర్వికారము- కనుక ఇది దేనికీ కారణము కానేరదు- దీనివల్ల పుట్టిన కార్యమూ లేదు- కార్యమనేది ఒకటి పుట్టితే కదా అది కారణముతో సమసత్తాకమా? విషమసత్తాకమా? అనే తగాదా- అదే లేనప్పుడు యీతగాదా ఎందుకు? అయితే మాయాశబల బ్రహ్మ జగత్కారణమేల కాకూడదని? అడిగెద

వేమో! అదీకుదరదు. ఏలనన? మాయాశబలమయిన కారణమూ తత్కార్యమయిన ప్రపంచమున్నూ లేదు— మాయాదృష్టిలోనే యీ రెండూ ఉన్నట్లు అంగీకరించబడుచున్నవి. పరమార్థదృష్టిలో ఇవేవీ లేవు— ఇదిఅంతా (ఈప్రపంచమంతా) శాంతమయిన బ్రహ్మమే— కనుకనే వార్తికకారులిట్లనుచున్నారు—

శ్లో॥ అవిద్యాస్తీత్యవిద్యాయామేవాసిత్వా ప్రకల్ప్యతే। బ్రహ్మదృష్ట్యాత్వవిద్యేయం నకథంచనయుజ్యతే॥ అని ఎక్కడనయినను పుట్టియున్నదానితో సాదృశ్యము (పోలిక) కాని పుట్టనిదానితో పోలికయెలా? కారణమే లేనిది ఎలాపుటుతుంది? ప్రమాణసిద్ధమయిన దేశకాలాదులులేని వస్తువు కారణమెట్లగును? అకర్తృబ్రహ్మ విషయకమగు ప్రమమాత్రము జగత్కారణ మెట్లగును? బ్రహ్మకర్త్రాదికారకమాత్రమునకు విరోధి యెప్పుడయినాడో అప్పుడు తద్విషయకమగు ప్రమమాత్రము హేతూపాదానకారణములయొక్క ప్రమకు కారణమెట్లగును? అనగా ఏ ప్రమాణమునకు కర్త్రాదికారకమాత్రమునకు విరోధియయిన బ్రహ్మ విషయమయినాడో ఆప్రమాణమువలన హేతూపాదానకారణములయొక్క ప్రమ పుట్టుననుటమాత్ర మెట్లు చెప్పగలము? కనుక శుద్ధాకాశకల్పమయిన నిర్విశేషవస్తువే నేనను భావనతో నుండుము— ఇతరభావనలను విడువుము— అజ్ఞదృష్టిలో బ్రహ్మమే జగద్రూపములో వ్యాప్తమయినది— చిన్మాత్రప్రమతో జగత్తు బ్రహ్మభావమున నుండును— అతత్త్వాకారమయిన మనోభ్రాంతిచే బ్రహ్మ జగదాకారముగ తయారయినాడు— చిత్తముయొక్క అన్యథాభావమే నాశమని చెప్పబడినది పండితులచే— నాశమనగా బ్రహ్మస్వరూపహాని యని అర్థము— ఇట్టిచిత్తము సంకల్పనాశముచే నశించును— మిథ్య కనుక ప్రపంచము వెంటనే అధిష్ఠానమయిన పరమాత్మయందు లీనమగును— వస్త్వంతరముగ మిగిలియుండదు. బాధానంతరము ఏది స్వాధిష్ఠానమునందు ప్రవేశించదో అది ఉన్నదెట్లగును?

లోకంలో రెండుచేతులు పైకియెత్తి యెవ్వడయినా పెద్దగా నేనుశూద్రుడనో అని కేకలుపెట్టుచుంటే వాడిక బ్రాహ్మణుడెట్లగును? వానికి విప్రత్వమెక్కడిది ? "చస్తినో దేవుడా" అని మొత్తుకునేవాడికి మృతియే ఖాయముకాని జీవనము (బ్రతుకు) ఎట్లు సంభవించును ? అలాగే భ్రమసిద్ధములయి మృగతృష్ణాంబు, ద్విచంద్ర, అలాతచక్రాదులు సత్యములెట్లగును !

కాబట్టి రాజా ! చిత్తమనేది అజ్ఞానమాత్రము అది సత్యము కాదు- సత్యముగ గోచరించును- అజ్ఞానమున్నంతవరకు ఉన్నట్లు భాసించును- అజ్ఞానవాశానంతరము నశించును-

మరుమరీచులయందు జలజ్ఞానము భ్రాంతి- "ఇదిజలముకాదు" అను నిషేధజ్ఞానము కలుగగనే ఆజలజ్ఞానము జలము వెంటనే నశించును! కాబట్టి రాజా ! "ఇదిచిత్తము"అనే అజ్ఞానమలము ప్రౌఢముగా హృదయములో ఉన్నపుడు "చిత్తములేదు" ("నాస్తిచిత్తం" అనే జ్ఞానము కలిగితే ఆచిత్తము సమూలము నశిస్తుంది- త్రాటిమీదకలిగిన సర్పబుద్ధి అజ్ఞానమువలన కలిగినభ్రాంతి- అయ్యది "నాయం సర్పః" అను నిషేధజ్ఞానమువలన నశించును- అలాగే ఆత్మయందు మనోబుద్ధికూడా భ్రాంతియే- అయ్యది "చిత్తంనాస్తి"అను విజ్ఞానమువలన నశించును- కనుక రాజా! చిత్తములేదు- అహంతలేదు- ఏకాంతనిర్మలమయిన సంవిత్తుమాత్రమే పరమార్థంలోఉన్నది- సంకల్పాత్మకమగుచిత్తము సంకల్పనాశముచే తప్పక నశించును-

రాజా ! కనుకనే జీవన్ముక్తులు ఘటాద్యాకారములో బ్రహ్మమునే తిలకించుచున్నారు- చిత్తాహంతాదులు వారికుండవు- భూతేంద్రియాదులు వారికి తదాకారముగ గోచరించవు- లోకంలో పుట్టేదీ చచ్చేదీ ఏదీలేదు- సర్వమూ కేవలచిద్విలాసమే-

రాజా ! నీకు జన్మాదివికారములులేవు- నిర్వికారమయిన బ్రహ్మస్వరూపమేనీవు-

ఇట్లు ౧౦౦వ సర్గ ముగిసినది.

## ౧౦౧. శిఖిధ్వజబోధనము.

వసి॥ రామచంద్రా! శిఖిధ్వజమహారాజు కుంభుని మాటను మనసా భావించుచూ క్షణకాలము ఆత్మపదమునందు విశ్రాంతిని చెంది మౌనంగా ఉన్నాడు రాతిమీద చెక్కిన బొమ్మవలె- మళ్ళీ క్షణకాలంలో మేలుకొనినాడు- అప్పుడు కుంభరూపిణియగు చూడాల ఇలా అన్నది అతనితో-

చూడాల॥ రాజా! నిర్వికల్పయోగులకు స్థానమగు నిరతిశయానంద పదవిలో సుఖంగా విశ్రాంతిని చెందితివా! నీకు మదిలో ఆత్మబోధకలిగినదా! భ్రాంతితొలగినదా! తెలియతగినదానిని తెలిసికొంటివా! చూడతగినదానిని చూచితివా! అని

శిఖి॥ మహానుభావా! మీయనుగ్రహ విశేషమువలన నేను మహోన్నతపదవిని జేరితిని- తత్త్వసాక్షాత్కారము చేసికొన్న జ్ఞానులలో నేను ఉత్తముడనైతిని- అమృతమయులయిన మీబోటివారల సంగము సారఫలప్రదము- నాజీవితములో నేనెరుగని దివ్యజ్ఞానామృతము మీయనుగ్రహవిశేషమున నాకు లభించినది- ఇట్టి ఆత్మపదము స్వామీ! నాకింతకుముందు ఏల సంప్రాప్తముకాలేదు!

కుంభు॥ రాజా! నీకిదివరకు చిత్తకషాయము పరిపాకము చెందలేదు- ఇపుడు తపస్సుచేత ఇంద్రియగణము పరిపాకము చెందినది- అందువలన ఆత్మపదము లభించినది- లింగదేహమునుంచి రాగద్వేషాది కషాయములు పాపములును కాలక్రమంచేత పరిపాకమును చెంది చెట్టునుండి పండ్లురాలిపడినట్లు రాలిపోవును- మలినవాసనలన్నీ రూపుమాసి పోయేసరికి గురూపదేశము మనస్సున నాటుకొనును ఇసుకలో బాణము నాటుకొనినట్లు- కషాయపక్వము అయినది కనుకనే నేను బోధించుట జరిగినది- నీయజ్ఞానము క్షీణించినది-

రాజా! ఇప్పుడే నీకు చిత్తమున కషాయపక్తి జరిగినది- ఇపుడే నాయుపదేశమబ్బినది- జ్ఞానోదయముయినది- శుభాశుభకర్మలన్నీ

క్షయించినవి- ఇదిఅంతా సత్సాంగత్యముయొక్క- మహిమయే- రాజా! ఈరోజు ఉదయమున నీచిత్తమునందు "అహంమమ" అనే అజ్ఞాన మున్నది- ఇపుడు నాఉపదేశమువలన నీకు మనోనాశము కలిగి తత్త్వ జ్ఞానము అబ్బినది- హృదయంలో సంకల్పాలు ఉన్నంతవరకు అజ్ఞాన ముండును- సంకల్పక్షయమయితే జ్ఞానముదయించును- ద్విత్వము ఏకత్వము అనే దృష్టులే అజ్ఞానము- ఈరెండుదృష్టులు నశించడమే జ్ఞానము- ప్రబుద్ధుడవయితివి- విముక్తినొందితివి- చిత్తమును విడచి తివి- ఈచిత్తము సదసద్రూపము- ఇదియే ప్రపంచకల్పనకు మూలము- ఇద్దానిని విడచితివి- శోకరహితుడవు- నిరాయాసుడవు- నిస్సంగుడవు- పరమాత్మాభిన్నుడవు- ముని- ఇక నిర్మలమయిన స్వరూపములో ఉండుము-

శిఖి॥ మునీంద్రా! మీరాగ చెప్పినట్లు చిత్తము మూర్ఖులదృష్టి లోనేకలదు- ప్రబుద్ధులదృష్టిలో అదిలేదు- అయితే చిత్తమును పరిత్య జించిన మీబోటి జీవన్ముక్తులు ఏయంతఃకరణముచే తమ వ్యవహార మును నెరవేర్చుకొనుచున్నారు- సెలవివ్వండి- మీ దివ్యవాగమృతము లచే నాహృదయమునందలి అజ్ఞానాంధకారమును పోగొట్టుడు-

కుంభ॥ రాజా! నీవు చెప్పినది నిజము- జీవన్ములకు చిత్తము (మనస్సు) లేదు తాతికి మొలక లేనట్లు- పునర్జన్మమునకు తగిన దృఢ మయిన వాసనయే చిత్తమనే శబ్దముచే చెప్పబడుచున్నది- ఇట్టిచిత్తము జ్ఞానికి లేదు- వేచి(గించి)న పేలాలుకాని, పొట్టుఒలిచిన గింజలుకాని వ్రీహ్యాదిశబ్దవాచ్యములుగావు- మరల మొలకరించుటకు యోగ్యము లునుగావు- అలాగే తత్త్వజ్ఞానముచే వేచబడిన నిరావరణసత్త్వము మనశ్శబ్దవాచ్యముగాదు- పునర్జన్మమునకు సమర్థముగాదు- విజ్ఞులు ఏవాసనచే కర్మలయందు వ్యవహరించుచున్నారో దానిని పునర్జనన వర్జితమయిన సాత్త్వికవాసన యందురు- ఇది నీవు గ్రహించు- జీవన్ము క్తులు మహానుభావులు- సత్త్వగుణప్రధానులు- జితేంద్రియులు- వీరు

నిస్సంగులై వ్యవహరింతురు- చిత్తస్థులై ఎన్నటికిని వ్యవహరించరు- మూఢమయిన చిత్తమునే చిత్తమని అంటారు- ప్రబుద్ధమయిన చిత్తమును చిత్తమని యనరు- సత్త్వమని అందురు- చిత్తస్థులందరూ అప్రబుద్ధులు (అజ్ఞానులు) వివేకులు చిత్తస్థులు కారు- సత్త్వస్థులు- మాటిమాటికి మొలకరించునది చిత్తము- సత్త్వము తిరిగిపుట్టునది (మొలకరించునది) కాదు- అప్రబుద్ధునకు (అజ్ఞానికి) బంధమున్నది- ప్రబుద్ధునకదిలేదు- రాజా! సత్త్వవంతుడవయితివి- మహాత్యాగివి- ఇపుడు నీవు పూర్తిగా చిత్తమును విడిచితివని గ్రహించితిని-

రాజా! సమస్త వాసనలను విడిచి నీవు చక్కగా ప్రకాశించుచున్నావు- నీమనస్సు ఆకాశమువలె అతినిర్మల మయినది- పరమశాంతుడవయితివి- సర్వసముడవయితివి-చిత్తమును పరిత్యజించ డమనునది మహాత్యాగము- స్వర్గాపవర్గాదులకంటెను గోదానఫలాదులకంటెను గొప్పది- పరమబోధచే నీవు దీనిని విడచితివి- తపస్సు అనునది కొద్దిపాటి దుఃఖమును బోగొట్టునది- క్షయాతిశయ నిర్ముక్తము కాదు- ఆత్మానందమే క్షయాతిశయరహితము-(హెచ్చుతగ్గులు లేనిది) జ్ఞానఫలము సత్యము- శాశ్వతము- స్వర్గాదులు సత్యములుకావు-పైగా భంగురములు- ఆవిర్భావ తిరోభావములతో కూడినవి- స్వప్నమువలె వర్తమాన కాలమందు మాత్రమే గోచరించెడివి- తుచ్ఛమై బహు ప్రయాసలభ్యమయిన స్వర్గాదితుచ్ఛసుఖము అజ్ఞులకే అభిమానపాత్రము కాని తత్త్వవేత్తలకు బహుమతము కాదు- స్వర్గసుఖమెంతటిది? అది యొకసుఖమా! తత్త్వజ్ఞానము లభించని మూఢులకు అది సుఖముగ తోచుట యుచితముకావచ్చును- బంగారము దొరకనివాడు ఇత్తడిని కూడా పోగొట్టుకుంటాడా! చూడాలాదులయొక్క సాంగత్యముచే నీవు సుఖముగా జ్ఞానమును పొందగలవు- ప్రయాసకరమయిన ఈతపస్సులో మునిగిపోయావేమి? అశ్రమాది వికల్పసహస్రములతో సాధింపతగిన ఈతపస్సు ఆద్యంతములలో దుఃఖప్రదమే- మధ్యలోమాత్రము

కొంచెము సుఖముగ నుండును- తపస్సుచేయాలంటే వానప్రస్థాది ఆశ్రమములందభిమానముండవలెను- సాధనములవిషయమయిన మన శ్చింతలు అవసరము- మధ్యమధ్య వేలకొలది విక్షేపములు కలుగుచుం డును- ఇంతటి విక్షేపసామగ్రితో సాధ్యమయిన తపస్సు బంధకమే- ఒకవేళ ఫలము కలిగినా అది కుత్సితముకాని శుద్ధఫలము కానేరదు- కనుక నీవు కృఛ్రచాంద్రాయణాది తపఃక్లేశప్రచురమయిన అనర్థములో ఇంతవరకు ఎందుకు మునిగిపోయినావు ! తపస్సుయొక్క ఆదిభాగము ఆచరణావస్థ- అది దుఃఖరూపము- అంతభాగము ఫలక్షయావస్థ- ఇదియు దుఃఖరూపమే- మధ్యలో స్వర్గాదిభోగదశలోనే కొంచెం సుఖము- అయినా ఇంతమాత్రంతో నీవు చేసిన తపస్సు పూర్తిగా వ్యర్థంకాదు- ఆతపస్సుచేతనే చిత్తకషాయము పరిపక్వమయినది- అందువలననే తత్త్వబోధకు సమయము ఆసన్నమగునది- కనుక తపో రూపములయిన వికల్పాంశములన్నీ ఏనిర్వికల్ప తత్త్వజ్ఞానమందు పరిణ మించుచున్నవో దానిఫలమే వీటన్నిటికిఫలము- ఆఫలము సిద్ధించినప్పుడే యివిఅన్నీ ఫలవంతములగును- ఈవిషయమును "వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా" అనుశ్రుతి చాటుచున్నది- కనుక నీవు జ్ఞానమునందు స్థిరపడుము- అతినిర్మలమయిన చిదాకాశము నుంచియే సమస్తపదార్థ ములు పుట్టుచున్నవి-పెరుగుచున్నవి- లయించుచున్నవి-"ఇదికార్యము ఇది అకార్యము" అనే వికల్పములన్నీ బ్రహ్మసముద్రంలోని బిందు వులే కనుక సముద్రస్థానీయమయిన నిర్విశేషబ్రహ్మమునే ఆశ్రయిం చుము- వంధ్యములయిన ప్రాపంచికపదార్థములను ఆశ్రయించి లాభము లేదు- ఆత్మ పరమప్రేమాస్పదము- నిరతిశయానందరూపుడయినవాను ఇతరఫలమును యాచించుట (ప్రార్థించుట) కంటె నిరతిశయమయిన స్వలాభమును ప్రార్థించుటయే మెరుగు-

శ్లో॥ ఇష్టం మే ప్రార్థయస్వేతి యత్రైవ ప్రార్థ్యతే సఖే ।
ప్రియాత్రైవ సకథం దయితః ప్రార్థ్యతే స్వయమ్ ॥

అత్రవ్యాఖ్యా=యథా అలబ్ధదయితయా స్త్రియా లబ్ధవ్య దయితంప్రతి మేఇష్టం ప్రార్థయస్వ ఇత్యన్యత్ ప్రార్థ్యతే తథైవ స్వయందయితఏవ కథం నప్రార్థ్యతే। తస్మిన్ స్వాధీనతయా లబ్ధే తదధీనలబ్ధవ్యాంతరాణాం స్వతఏవ లాభాత్ ఇతిభావః ॥ అని–

అ=భర్తలభింపనిస్త్రీ ముందులభింపతగిన భర్తనుగురించి, ఓ నాథా! నాకిష్టముయినదానిని కోరుము (ప్రార్థించుము) అని ఇతర వస్తువునుగురించి యెట్లు ప్రార్థించునో అట్లే స్వయముగా తాను భర్తనే ఎట్లు ప్రార్థించదు? భర్తలభించి తనకు స్వాధీనమయినచో వానిస్వాధీనములోనున్నవన్నియు స్వయముగానే లభించునుకదా! అని భావము– ఆత్మారిక్తవస్తువులన్నీ సంకల్పనిర్మితములు– అపాతభాసురములు– వీటిని మూఢులు పురుషార్థములుగా భావింతురు– (గ్రహింతురు)కాని ప్రాజ్ఞులు గ్రహించరు–జలప్రతిబింబితములయిన సూర్యప్రతిబింబములను జూచి మూఢులు మురుసుకొందురు కాని వివేకులు మురుసుకొనరు– జ్ఞానము లభించిన తరువాత స్వర్గాది సాధనములవలె మోక్షసాధనములుకూడ హేయములగును–

సర్వపదార్థములందును సదంశము సత్యముగనే గ్రహించవలెను– అసదంశమును నాశ్యముగనే గ్రహింపవలెను– ఇందు పొరపడకూడదు– ఇట్లు పదార్థములను గ్రహించువాడు స్థిరచిత్తుడనబడును– ఇట్టి వానికి పునః సంసారబంధముండదు వివేకజ్ఞానము కలిగిన పిదప పురుషాపరాధమువలన కలిగెడు విపత్తి యుండనేరదు– లోకములో కలిగే దుఃఖములన్నీ చిత్తచాపల్యమువల్ల కలిగెడివే–

రాజా! ఎవ్వనిచిత్తము స్థిరమైనదీ, శాంతమయినదీ, యగునో అట్టివాడు మహానందమునొందును– అఖండసామ్రాజ్యము నొందును–

తత్త్వజ్ఞుడవగు శిఖిధ్వజా! నీచిత్తమునందలి స్పందాస్పందములను ఓకేమాదిరిగా జూచి నీవుమాత్రము వాటికి సాక్షిమాత్రుడవుగనుండుము–

శిఖి॥ మునీంద్రా! స్పందాస్పందములు రెండును ఎట్లు ఐక్యము నొందును? ఈనాసందియమునుగూడ దీర్పుడు-

కుంభ॥ సముద్రములో శుద్ధమయిన జలము తరంగములుగా చలించినట్లు జగద్వ్యాపకమయిన పరమాత్మ యొక్కడే స్పందాస్పంద రూపములతో బుద్ధివృత్తులచే స్పందించుచున్నాడు- సచ్చిదానందాత్మకమయిన బ్రహ్మమునే మూఢులు జగత్తుగా గ్రహించుచున్నారు- చిత్స్పందమే సృష్టిలో సంసారమని పిలువబడుచున్నది-వింధ్యహిమాద్రి మున్నగు పరిస్పందములు శబ్దమాత్రములు- కాబట్టి ప్రపంచసాక్షి యయిన పరమాత్మయే స్పందాస్పందరూపుడని భావించుచో స్పందాస్పందములు రెండును ఐక్యమును జెందును- కావున చిత్ స్పందమాత్రమే స్వరూపముగాగల సృష్టి సమ్యగ్ జ్ఞానముకలిగినతోడనే నశించును- సమ్యగ్దృష్టి లేనివారలకు త్రాటిమీద సర్పభ్రాంతి పుట్టినట్లు చైతన్యమునందు ప్రపంచ (సంసార) భ్రాంతి కలుగును- కావున స్పంద సహితమయిన చిత్తు సృష్టి- స్పందరహితమయిన చిత్తు బ్రహ్మపదార్థము- ఇది తుర్యాతీతము- అవాఙ్మానసగోచరము- శాస్త్రమువలనగాని సజ్జనసంపర్కమువలనగాని,సంతతాభ్యాసయోగమువలనగాని, క్రమంగా చిత్తము నిర్మలమగుచో అపుడు బ్రహ్మతత్త్వము మనస్సులో సాక్షాత్కారము నొందును- ఇది కేవలము అనుభవైకవేద్యము-

రాజా! నీవు అట్టి అనుభవములోకి వచ్చితివి- నాయుపదేశము వల్ల స్థైర్యమును మాత్రమే సంపాదించుకొనుము- భేదకములయిన దేహాద్యుపాధులు మిథ్యాభూతములు కనుక నీవు అభేదదృష్టితోనుండి వీతశోకుడవగుము-

ఇట్లు ౧౦౧వ సర్గ సమాప్తము.

## ౧౦౨. శిఖిధ్వజసమాధానము.

కుంభుడు॥ శిఖిధ్వజా! నీకు నేను అధ్యారోపాపవాదములచే పరిపూర్ణబ్రహ్మతత్త్వమును చెప్పితిని- ఇదివిని గ్రహించి ఆలోచించు

కొని అజ్ఞానావరణభంగమువల్ల పరమపదము సాక్షాత్కృతమగుచుండు ఒకానొకపుడు సమాధియందును, ఒకానొకపుడు వ్యవహారమునందును నీయిష్టానుసారముండుము— నేనీపర్వకాలమున దేవేంద్రసభకు వెళ్లు చున్నాను— అచటికి బ్రహ్మలోకమునుంచి నారదుడేతెంచును— నేనత నికి కనిపింపనిచో అతడు కోపించును— గురువులకు కోపమువచ్చునటుల ప్రవర్తించుట శిష్యులకు క్షేమంకరముకాదు— నేనుపదేశించిన దృష్టి లోనే నీవుండుము— ఇదే పరమపావనమయిన దృష్టి—

వసిష్ఠులు॥ రామా! కుంభుడిట్లు చెప్పి శిఖధ్వజుడు నమస్కరించి బదులు చెప్పులోపుగనే అంతర్ధానము చెందెను—

(గమనిక— వీరివురు భార్యాభర్తలుకనుక పతివ్రతలు భర్తయొనర్చెడి నమస్కారమును గ్రహించకూడనందున కుంభుడట్లు అంతర్ధానము నొందెను.)

శిఖధ్వజుని యెదుట కుంభుడు కనిపించలేదు— శిఖధ్వజమహా రాజు ఆశ్చర్యపడినాడు— ఈవిచిత్రసంఘటననుగూర్చి ఆలోచించుచూ గోడమీద బొమ్మవలె ఉండిపోయెను— "ఇదంతా దైవవిలాసము— దైవమే కుంభుడనువిధముతో వచ్చి బోధించిపోయినాడు— నారదుని కుమారుడయిన కుంభుడెక్కడ? నేనెక్కడ? కేవలము నాకు అదృష్ట కాలము సంప్రాప్తమగుటవలననే ఇట్టిబోధ నాకుకలిగెను—

ఆహా! నారదపుత్రుడగు కుంభుడు చక్కగా బోధించినాడు— చాలకాలమునుంచి అజ్ఞాననిద్రలోనున్న నన్ను మేలుకొలిపినాడు—నేను కర్మజాలమనే బురదలో మునిగియున్నాను" "ఇదిచేయవలెనా!" "అది చేయవలెనా" అనే వ్యామోహంలోపడి తిరుగుచున్నాను— "ఇపుడు నాకు అతిచల్లని బోధ అబ్బినది— అతిశాంతమయిన పదవి లభించినది— శాంతించుచున్నాను— సుఖించుచున్నాను— కేవలము ఆనందస్వరూపు నిగనున్నాను— నేనిపుడు గడ్డిపోచనుకూడ కోరను— యథాస్థితుడనై యుందును—"

అని యిట్లు శిఖిధ్వజుడు ఆలోచించుచూ రాతిబొమ్మవలె వాగాదిచేష్టలుడిగి సమాధిలో నుండిపోయెను-

ఇట్లు శిఖిధ్వజమహారాజు సమాధియందు నిర్మలాంతఃకరణుడై సర్వసముడై విశ్రాంతి చెంది సంసారభయమునువీడి యోగశక్తిచే నిదురించెను-

ఇట్లు ౧౦౨వ సర్గ సమాప్తము.

## ౧౦౩. కుంభుడుమరలవచ్చుట.

వసి॥ రామా! శిఖిధ్వజమహారాజు ఇలా నిర్వికల్పసమాధిలో ఉన్నాడు- అతనిపరిస్థితి కాష్ఠమువలెను కుడ్యములాగను ఉంది- ఇక చూడాల (అతనిభార్య) వృత్తాంతం చెబుతావిను-

కుంభుడనే వేషంతో భర్తకు ఆత్మతత్త్వమును ఉపదేశించింది- అంతర్ధానమయింది- వెంటనే ఆకాశందాటింది- మాయచే నిర్మితమయిన దేవపుత్రాకృతిని (కుంభునివేషమును) విడిచిపెట్టింది- సుందరులు మోసపోయే స్త్రీఆకారాన్ని ధరించింది-ఆకాశమార్గాన క్షణంలో తనపురము చేరింది- అంతఃపురం ప్రవేశించింది- లోకులకు కనిపిస్తూ రాజకార్యములను నెరవేర్చుకొంటున్నది- మరల కుంభవేషమును ధరించి మూడురోజులలో ఆకాశమార్గాన శిఖిధ్వజుని వనమును చేరినది- అచ్చటివారందరు (అనగా వనభూమిలోనుండువారు) ఆరాజునుమాత్రం నిర్వికల్ప సమాధిలోనున్నవానినిగానే చూచుచున్నారు-

అబ్బా! ఈరాజు అదృష్టవశంచేత ఆత్మయందు విశ్రాంతి చెందినాడు- స్వస్థుడు- శాంతుడు- సర్వసముడు- అని పలుమారు చెప్పుకొనుచున్నారు- ఇలాంటిస్థితిలో చూడాల (అతనిభార్య) (కుంభవేషధారిణి) ఇలా ఆలోచించింది-

"ఇతనిని పరమాత్మపదమునుంచి మేలుకొలిపెదను- ప్రారబ్ధకర్మ మిగిలియుండగా ఈతడు దేహత్యాగం చేయటం ఎందుకు? కొంత

కాలము ఇతడు రాజ్యముతో కాని, విపినముతో గాని, విహరించుగాక- అనగా అడవిలోని భోగ్యములను అనుభవించెడి కర్మ ఉన్నంతవరకు అడవిలోను, రాజ్యభోగముల ననుభవించెడి కర్మ యున్నంతవరకు రాజ్యమునందును ఉండుగాక- మేమిద్దరము ఒకేవభా దేహత్యాగ మొనర్చెదము- ఇతడిప్పుడే దేహత్యాగముచేయుచో నేనితనికి చేసిన యుపదేశము సప్తమభూమికా వస్థితిపర్యంతము (ఏడవభూమికయందుండేంతవరకు) పరిపాకమును జెందదు- కనుక జీవన్ముక్తి సుఖానుభవము కొరకుకూడ ఇతనిని సమాధినుంచి లేపెదను" అని ఆలోచించి పెద్దపెట్టున సింహగర్జనము చేసినది పలుమారు వనేచరులకు భయంకరమగునట్లు ఆ నాదానికాతడు కదలలేదు- కొండరాయివలె అలాగే ఉన్నాడు- అలా మాటిమాటికి ఆమె సింహనాదముచేసి ఎట్టకేలకు చలింపజేసినది- చలింపజేసినా, పడవేసినా, ఆరాజుకు మెలకువరాలేదు- అప్పుడు చూడాల ఇలా అనుకొన్నది-

"అహో ! ఇతడు పరమాత్మయందు గట్టిగా లీనమయినాడు- ఈతని నేనేవిధముగ మేలుకొలిపెదను? అథవా ఇట్టి మహానుభావుని నేను మేలుకొలుపుట యెందుకు- తత్త్వజ్ఞానమునుపొంది విదేహుడై (దేహత్యాగముచేసి)సుఖముగా నుండుగాక నేనుకూడ ఈస్త్రీదేహాన్ని విడిచిపెట్టి పునర్జన్మరాహిత్యము కొరకు ఇతనితోకూడ పరమపదమును చేరెదను." అని ఆలోచించి తనశరీరాన్ని విడిచిపెట్టుట కుద్యమించింది- కాని మరల ఇలా ఆలోచించినది- "అయినా ఈతని అంతఃకరణలో ప్రారబ్ధకర్మశేషము ఉన్నదా ! లేదా ! చూస్తాను- ఉన్నట్లయితే ఆసమయమునందే ఇతడు సంప్రబోధమును పొందగలడు- అపుడు నాచే ప్రబోధితుడయినను జీవన్ముక్తుడగుచూ నావలె విహరించును- వాసనా శేషములేక అదికూడనశించి ముక్తుడగుచో అపుడు నేనుకూడ ఇతనితో కూడనే ముక్తినొందుదును" అని యిట్లు ఆలోచించి చూడాల భర్తను కంటితో చూచింది- తాకింది- వంటివేడిమిని బట్టి ఇతడు జీవించి యున్నాడని సందేహించింది- వాసనాశేషమున్నట్లు గ్రహించింది-

ఈతని యంతఃకరణములో సమాధినుంచి వ్యుత్థానమునకు కారణమయిన వాసనా శేషమున్నదని బయటికి వాచా చెప్పినది-

శ్రీరా॥ మునీంద్రా! మిక్కిలి శాంతచిత్తుడై కాష్ఠలోష్ఠస మానాకారంగా ఉండి ధ్యానమార్గంలోనున్న ఆరాజుయొక్క సత్వ శేషము (వాసనా శేషము) ఎట్లు తెలియబడినది- అని అడిగాడు శ్రీరామచంద్రుడు-

వసి॥ వసిష్ఠుడు జబాబు చెబుతాడు.

రామా! ఎవని శరీరంలో బుద్ధివిపరిణామము (తెలివికిమార్పు) అపక్షయము మొదలగు వికారములు ఉద్భవించకుండా ఉండునో అంత వరకు అతని హృదయంలో వాసనా శేషమున్నట్లు భావించవచ్చును- బీజంలో పత్రపుష్పఫలాదులున్నట్లు, చిత్తచలనములేక, సచ్చిదానంద పదార్థమునుంచి కదలక నిర్వికల్పకమై అచలమువలె నిశ్చలముగా నున్న వానికాయము (శరీరము) గ్లానిని (బాధ) చెందదు- సంతోషమునూ చెందదు- ఉదయాస్తమయములను జెందదు- సమానముగ నుండును- ఇట్లుగాక సవికల్పుడయినవాని చిత్తము చలనము చెందును- బుద్ధి పరిణామాపక్షయాది వికారములనుగూడ జెందును- సర్వవ్యవహారము నకు చిత్తస్పందమే కారణము- భావవికారములన్నిటికీ ఇదేకారణము- పుష్పములన్నిటికీ వసంతఋతువే కారణము-

కనుకనే వాసనా శేషమును పురస్కరించుకొని ఈదేహమునుంచి మరొకదేహమునకు వెళ్ళబోవువానికి మాటిమాటికి ప్రయత్నపూర్వ కముగ చిత్తము నిగ్రహించుకొనబడుచున్నను, హర్ష, కోప, సంమో హాది వికారములు పుట్టుచుండును- వాటిని నిగ్రహించుకొనుశక్తి వీని కుండదు- ఈ వికారోద్భవమను లింగమే అవశ్యము పునర్జన్మ మున్న దనుటకు కారణము- చిత్తమునందు హర్షాదివికారములు శాంతించుచో శరీరములందలి అపక్షయాది వికారములుకూడ శాంతించును- కాబట్టి చిత్తమునందు "అహం" అనే భావనయే దేహమునందు వృద్ధ్యాది వికారములకు కారణము-

కాబట్టి చిత్తమును అహమని పరిగ్రహించుటయే దేహము నందలి వృద్ధ్యాదివికారములకు హేతువని భావము- సమానమయిన జలప్రవాహమునుంచి తరంగాదులుదయించవు- సమానమయిన అంతఃకరణమునుంచి జరాపలితాదిదోషము లుదయించవు- ప్రారబ్ధశేషము నశించనిదే వాసనాక్షయము కలుగదు- సర్వసమమయిన ఆత్మతత్త్వము భాసించినకాని ఇవియేవియు నశించవు- ఎవని దేహమునందు చిత్తముండదో (అజ్ఞానికి) ఎవని చిత్తమునందు సత్త్వము (వాసనా శేషము) ఉండునో వాని దేహము పంచత్వము (మరణము) నొంది లయించును-

శిఖిధ్వజుని దేహము నిశ్చిత్తము (అనగా విక్షేపరహితము-నిర్వికారము) కాని ఊష్మ (వేడిమి) తో కూడియున్నది- వాసనా శేషముతో కూడియున్నది- అందుచేత నశించదు- భర్తయొక్క శరీరము ఇలాంటిదని నిశ్చయించుకొని చూడాల తన శరీరమును విడిచిపెట్టక వెంటనే ఇలా ఆలోచించినది- "నేను నాథ ర్తయొక్క జీవాత్మ తత్త్వంలో ప్రవేశించి ఆయనకు ఇకముందు చాలకాలమునకు కలిగెడి తత్త్వబోధను ఇప్పుడే చేసెదను- అట్లు చేయనిచో రాజ్యపాలనమందు నియుక్తురాలనగు నేను నాథ ర్తవలె సమాధియందుండజాలను- వ్యర్థితురాలనై ఎట్లకేలకు ఏకాకిగా నుండగల్గుదును" అని యిట్లు ఆలోచించి తన శరీరమునువిడిచి భర్తృశరీరములోని చిత్తత్వములో లీనమయినది- అచట నిర్వికల్పసమాధిచే క్షీరోదకమువలె ఏకరసభూతమయిన చైతన్యమునకు భర్తృసంబంధమయిన చిదాభాస సంవలితబుద్ధినుంచి వేరుపడెడి చలనమును సంపాదించి పక్షిగూటిలో చేరినట్లు మరల తనశరీరమును ప్రవేశించినది-వెంటనే నారదపుత్రుడగు కుంభునియొక్క ఆకారమును ధరించి లేచివెళ్ళి పూలతోటలో కూర్చొని తుమ్మెదస్వరముతో సామగానమును అరంభించినది- ఆసామగాన స్వరమును విని చిదాభాస వ్యాప్తమయిన శిఖిధ్వజుని బుద్ధికి, శిఖిధ్వజుడనే అహంభావ సంస్కారము ఉద్బుద్ధమై శిఖిధ్వజుని కాయమునుంచి లేచినది- కంటికి దర్శన

శక్తినిచ్చినది- దానితో శిఖిధ్వజుడు ఎదుట సామగాన తత్పరుడయిన కుంభుని చూచినాడు- (చూచాడు) దివ్యరూపమును ధరించిన సామ వేదమాయేమి? అనినట్లు భాసించినాడు కుంభుడు శిఖిధ్వజునకు- ఇలా అనుకొనినాడు శిఖిధ్వజుడు-

"అహో నేనెంతటి ధన్యుడను? మరల మునీంద్రుడు ప్రత్యక్ష మయినాడు" అని చెప్పుతూ కుంభునకు పుష్పమునిచ్చినాడు-

స్వామీ! మాభాగ్యవశంచేత మరల మాకు దర్శనమీయవలె నను తలంపు మీకు కలిగినది- అథవా! ఇది నాభాగ్యమనుకొననేల? మహానుభావులు స్వయముగానే పరుల ననుగ్రహించుటకు పాటుబడు చుందురు- మహానుభావులెవరు పరానుగ్రహ తత్పరులుగ నుండలేదు? మమ్ము పవిత్రపరచుటయే మీరాకకు కారణము- కాక మరొక కారణ మేమున్నది? చెప్పండి మీరాకకు- అన్నాడు శిఖిధ్వజుడు-

కుంభు॥ కుంభుడు జవాబు చెబుతాడు- రాజా! ఎపుడు మిమ్ము విడచి నేను యిటనుంచి వెడలిపోతినో అప్పటినుంచి నాచిత్తము మీతో కూడనే ఉన్నది- అనగా మిమ్ములనే స్మరించుచున్నది- కనుకనే యిపుడు స్వర్గంలో కూడ నేనుండను- మీవొద్దనే యుందును- రాజా! రమ్యమయిన వస్తువులలో ఏది అత్యంతాభీష్టమో అయ్యది ప్రయత్నిం చియే పొందదగును- కాన మిమ్ముసందర్శించవలెనన్న ప్రయత్నము తోడనే యిచటకు నారాక కారణమేమన? మీవంటి బంధువుకాని, ఆప్తుడుకాని, సుహృదుడుకాని, మిత్రుడుకాని, విశ్వసింపదగినవాడు కాని, శిష్యుడుకాని, లోకంలో మరొకడు ఉంటాడని నేను తలంచను-

శిఖి॥ అబ్బా! నాపూర్వపుణ్యము ఫలించినది- మీరు అసంగు లయినను నా సమాగమును కోరుచున్నారు- "ఇదిగో వనము- ఇవిగో వృక్షములు- ఇదుగో భృత్యుడనయిన నేను- మీకు స్వర్గము రుచించ నిచో ఇట(నాసన్నిధిన)నుండుడు-మీరిచ్చినయోగశక్తిచే నేనువిశ్రాంతిని పొందినాను- మీకువలె నాకుగూడ స్వర్గంమీద వాంఛ లేదు- నాకువ

దేశించిన భూమానందస్థితిని అవలంబించినచో స్వర్గమునందువలె ఈ భూతలమందు యథేచ్ఛగ నుండుము-

కుంభుడు॥ రాజా! పరమానందపదవిలో విశ్రాంతిని చెందితిరా! భేదమయమయిన సంసారదుఃఖమును పూర్తిగా విడిచారా! అపాత రమ్యములయిన సంకల్పములనుంచి ఆశ (రతి) పూర్తిగ తొలగినదా! హేయోపాదేయ దశాతీతమయి, శాంతమయి, సర్వసమమయి, యథా ప్రాప్తములందు ఉద్వేగరహితమై మీ మనస్సు ఉన్నదా!

శిఖి॥ మహానుభావా! మీ అనుగ్రహమువలన దృశ్యాతీత మయిన గతిని కనిపెట్టినాను- సంసారముయొక్క అవధిఒడ్డును చేరినాను- చాలకాలమునకు దినత్రయపర్యంతము సమాధియందు విశ్రాంతిని చెందినాను- పొందదగిన దానిని పొందితిని- నాకుపదేశించ తగిన దేదియులేదు- అంతట నేను మిగులతృప్తి చెందితిని- అజ్ఞాతము జ్ఞాతమయినది- అప్రాప్తము ప్రాప్తమయినది- త్యక్తవ్యము త్యక్తమయినది- నాయొక్క వాసనారహితమయిన మనస్సు పరమాత్మ తత్త్వమును ఆశ్రయించినది- కాబట్టి నేను సంసారరహితుడను- భయమోహములు లేనివాడను- విరాగుడను- సర్వసౌమ్యుడను- ఆకాశము వలె నిర్మలుడను- సర్వసముడను- అగుచున్నాను-

ఇట్లు ౧౦౩వ సర్గ ముగిసినది.

## ౧౦౪. జీవన్ముక్తులవ్యవహారప్రతిపాదనము.

వసి॥ రామచంద్రా! ఇలా విచిత్రములయిన ఆధ్యాత్మిక కథలతో పరస్పరం ముచ్చటించుకొంటూ వనంలో మూడుముహూర్తముల కాలం ఉన్నారు- అంతట అచటినుంచి లేచి ఒకానొక కొండచరియయందు సరోవరప్రాంతమున ఆనందదాయకమగు తోటలలో ఈముచ్చటలతో విహరించినారు- ఇలా కాననవీథులందు విహారముతో ఎనిమిది రోజులు గడచినది-

పిదప కుంభుడు (చూడాల) యీకొండమీద మరోవనమునకు వెళ్లుదామని అన్నాడు శిఖిధ్వజునితో- శిఖిధ్వజుడంపు కంగీకరించాడు- ఇద్దరు విహరించారు- అనేకవనములు, మైదానములు, కొండచరియలు సరస్సులు, కొండశిఖరములు, నదులు, గ్రామాలు, నగరాలు, రమ్య మయిన ధ్వనిగల గిరులు, పుణ్యతీర్థములు, దేవతాయతనములు, తిరిగి చూచారు- ఇద్దరిదీ ఒకేమనస్సు ఎడ తెరిపిలేని స్నేహం- ఒకరి అనుభ వాన్ని మరొకరు చెప్పుకొంటూ దేవతలనూ,పితృదేవతలనూ పూజించు కొంటూ ఉన్నారు- "ఇదియిల్లు" "ఇదికాదు"అనే భేదబుద్ధి వాళ్ళకు లేదు- ఇది యిష్టము ఇది అయిష్టము అనేబుద్ధికూడ వీళ్ళకులేదు- ఒకచోట బూడిదకొట్టుకొనీ, మరొకచోట మంచిగంధము పూసికొనీ, యింకొకచోట దివ్యాంబరములధరించీ, ఒకచోట చిగురాకులు కప్పు కొనీ, ఒకచోట పూలమాలలచే అలంకరించుకొనీ విహరించారు- కొద్ది రోజులలోనే ఇద్దరూ సమచిత్తులగుటచేతనూ వాసనారహితమయిన చిత్తము కలవారగుటచేతనూ శిఖిధ్వజుడు కుంభునివలె అయిపోయాడు- ప్రకాశించాడు-

పిదప నారదపుత్రుడగు కుంభునివలె ప్రకాశించుచూ కలకల లాడుచుండే శిఖిధ్వజునిచూచి చూడాల ఆలోచించుకున్నది- ఇలా "ఇతడు ఉదారచిత్తుడు- వనభూములు అతిరమ్యములు- మన్మథునకూ, అనురాగమునకూ మోసపోని యీపరిస్థితి అనాయాసమయినది- అతి సులభమయినది- యదృచ్ఛాప్రాప్తములయిన జీవన్ముక్తుల భోగము లను అభిలషించని వారల చిత్తవృత్తి అతిమూఢము- కేవలము భోగ నివృత్తియందు నిర్బంధము పనికిరాదు- అనగా "నేనేమియు అనుభ వించను" అనెడిది యెవ్వరికి పనికిరాదు- నాభర్త అత్యుదార చిత్తుడు- నిశ్చింతుడు- (చింతారహితుడు) వయస్సు నూతనము- పూలగుబురులు గృహములు- ఈస్థితిలో కామిని కాని స్త్రీ పనికిమాలినది- (దురదృష్ట వంతురాలు) అడవిలోని పూలతీగలు గృహాలై భర్త స్వాధీనమయి యుంటే ఏప్రియురాలు ఆభర్తతో రమించదో ఆమె దుష్టాంగన అన్న

మాకే- ఛీ ఆమె బ్రతుకు- రమ్యమయిన భర్తను పెండ్లాడి అతడు నిర్జనప్రదేశంలో దొరకితే ఆడదయి యుండి ఏ స్త్రీ రమించదో అతనితో ఆ స్త్రీ బ్రతికి యేమిలాభము? నింద్యముకాని భోగము దానియంతటి అదిలభించినపుడు దానిని విడిచి పెట్టిన వాడెంతటి జ్ఞానియయిన యేమి లాభము? వాడు యేమి అనుభవించినట్లు! జన్మించి యేమిచేసినట్లు? కావున ఈవనంలో నాప్రజ్ఞావిశేషంచేత నూతనప్రపంచాన్ని నిర్మిస్తాను- అందుకు మెచ్చుకొని నాభర్త నాతో రతిసుఖం అనుభవిస్తాడు- అని యిలా ఆలోచించి కుంభవేషమును ధరించిన చూడాల పూలగుబురు చాటుననుండి భర్తతో ఇట్లన్నది- ఆడకోకిల మగకోకిలతో అన్నట్లు-

కుంభుడు॥ రాజా! ఈరోజు చైత్రశుక్లపాడ్యమి ఈనాడు దేవేంద్రుడిగారి యాస్థానమున దేవఋషులందరు సమావేశమగుదురు- నా తండ్రియగు నారదులుకూడ నచటికేగుదురు- నేనుకూడ ఆయన వెంట వెళ్ళవలెను- ఇదిమాకు అనాదినుంచి మామూలుగా జరుగుచున్నది- దానిని విడువరాదు- కావున సాయంకాలమువరకు నారాకను మీరు నిరీక్షిస్తూ ఉండండి- ఏమీ కంగారు పడమాకండి- సాయంకాలానికల్లా ఆకాశమార్గాన స్వర్గమునుంచి తిరిగివస్తాను నేను- స్వర్గముకంటె మీ నాగత్యమే నాకు మిక్కిలి సంతోషదాయకము" అనిచెప్పి భర్తగారి ప్రీతికొరకు నందన వృక్షమునుంచి పుట్టిన పూగుత్తిని భర్త చేతిలో ఉంచినది- (భర్తకిచ్చినది)-

భర్త (శిఖధ్వజుడు) త్వరగా మరలి రమ్మన్నాడు- అంటూ ఉండగానే శరత్కాలమేఘంవలె ఆకాశానికి యెగిరిపోయింది చూడాల- వెళ్ళుచూ ఉండగా వనవాతముచే (అడవిగాలిచే) ప్రసరించెడి స్వభావముగల పుష్పాంజలిని విడచినది ఆమె హేమంతఋతుకాల మేఘము మంచుబిందువును విడిచినట్లు తనను విడిచి వెళ్లుచున్న కుంభుని వర్షకాలపు మేఘమును నెమలిచూచినట్లు కంటపడునంతవరకు చూచినాడు శిఖధ్వజుడు-

శిఖిధ్వజుని కనిచూపు దాటిన తరువాత కుంభుకరూపం విడిచింది- చూడాలరూపం ధరించింది- తన నగరమును చేరినది- అంతఃపురమును ప్రవేశించినది- అన్నివిధములయిన కార్యములను సంపాదించుకున్నది వెంటనే- శిఖిధ్వజుని యెదుటపడినది చెట్టునుండి ఆకు, పువ్వు పడినట్లు- చూడాల యొక్క- ఆకారములో నున్న కుంభుని చూచాడు శిఖిధ్వజుడు- లేచినాడు- ఖేదపడినాడు- (బాధపడ్డాడు) అత్యాదరంతో ఇలా అన్నాడు-

ఓ దేవపుత్రా! నీకునమస్కారము- మనోవ్యాకులంగా ఉన్నట్లు కనిపిస్తున్నారే- మనస్తాపాన్ని విడిచిపెట్టండి- ఇదిగో ఆసనము- కూర్చోండి- తత్త్వజ్ఞానంగల సత్పురుషులు హర్షవిషాదములవల్ల కలిగెడి వికారములను ఆశ్రయించరు- (పొందరు) అన్నాడు శిఖిధ్వజుడు-

వసి॥ రాజా! శిఖిధ్వజుడు ఇలా అనేసరికి కుంభుడు ఆసనము మీదకూర్చుండి సుఖార్తనాదముతో ఇలా అన్నాడు-

కుంభు॥ రాజా! దేహమున్నంతవరకు సమచిత్తులై కర్మేంద్రియములతో ఎవరు వ్యవహరించరో వారు తత్త్వవేత్తలుకానేరరు- లోకవంచకులు-తత్త్వవేత్తలుకాని మూఢులు సమచిత్తులుకాని కారణం చేత హఠాత్తుగా గ్రహింపబడిన ఆయాకర్మేంద్రియ నిగ్రహావస్థలనుంచి జారిపోవుదురు- (యావత్తిలం యథాత్తైలం) తిలలుండు నంతవరకు అందు తైలముండును "అన్నట్లు దేహమున్నంతవరకు దేహదశలను అనుభవించవలయును"- అట్లనుభవించనివాడు కత్తితో ఆకాశమును కోయుచున్నాడు- కావున దేహావస్థలను పరిత్యజించుట ఉత్తమమయిన పనికాదు- (మంచిదికాదు) సమాధివశంచేత దేహదశలను మరచిపోవునట్లు చేసికొనవలెనుకాని, హఠాత్తుగా కర్మేంద్రియములను నిగ్రహించుకొనుట మంచిదికాదు- కాబట్టి జ్ఞానికూడ దేహదశలను ఉల్లంఘించకూడదు- నేనుకూడ అద్దాని ననువర్తించుట దోషముకాదు- పరమేష్ఠి మున్నగువారు (బ్రహ్మ)కూడ అనిషిద్ధములయిన దేహావస్థలను అనువ

ర్తించియే యున్నారు- ఈయది ప్రారబ్ధకర్మనియతియొక్క- స్వభావము- నీరు అంతా సముద్రములోనికే చేరును- అజ్ఞానులుకాని, జ్ఞానులుకాని, దృశ్యజాతముకాని ఇదిఅంతా నియతిని అనుసరించియే ప్రవర్తించును- కాని తత్త్వజ్ఞులు బుద్ధీంద్రియములతోనూ, కర్మేంద్రియములతోనూ, ప్రారబ్ధకర్మాయత్తమయిన ప్రస్తుత దేహమునుండునంతవరకు నియతిని గడుపుకుంటారు- అజ్ఞానులు మాత్రము సర్వక్షోభముతో సుఖదుఃఖ దశలకులోనై లక్ష దేహములతో నియతిని అనుసరింతురు- (గడుపు కొందురు.)

కనుక రాజా! ఏప్రాణికి "ఈజన్మలో ఇలా సుఖములందుండ వలెను- దుఃఖదశలందు ఇలా ఉండవలెను" అని తమతమ కర్మల ననుసరించి యెట్లెట్లు లలాటమునందు వ్రాయబడియున్నదో ఆప్రాణి ఆయావిషయములందు అట్లే తప్పక నడచుకోవలెను- ఈయది ప్రారబ్ధ కర్మయొక్క- విలాసము- ఇది దుర్లంఘ్యము-

ఇట్లు ౧౦౮వ సర్గ ముగిసినది-

### ౧౦౯. కుంభునకు స్త్రీత్వలాభము.

శిఖి॥ కుంభకా! జీవకదంబము(సమూహము) నియతిప్రకారము ప్రవర్తించుట ఖాయమగుచుండ నీవు దేవపుత్రుడవయియుండికూడ ఇంతగా భయపడుచుంటివేల?

కుంభుడు॥ రాజా! విను నాచరిత్ర నా మనోగతమయిన భావం అంతా చెబుతాను- వెనుక జరిగినదంతయు నీకు విన్నవింతును- స్నేహితులతో చెప్పుకుంటె దుఃఖం కొంత తగ్గుతుంది- ఎంత నల్లకారు మేఘమయినా వర్షం కురిస్తే తేలికపడుతుంది- స్నేహితులు అడిగితే చిత్తము ప్రసన్నమవుతుంది- ఇండుపగింజయొక్క- గంధం కలిపితే నీరు తేట పడినట్లు- నేను మీయొద్దనుంచి వెళ్లుచూ మీకు పూలగుత్తియిచ్చి నాను- ఆకసమున కెగిరి స్వర్గంచేరినాను- అచట నాతండ్రితో సభాస్థాన

మలంకరించినాను- అటనుంచి లేచి ఇచటికే తెంచదలచి నాతండ్రిగారి సెలవుపుచ్చుకొని స్వర్గాన్ని విడిచినాను- ఆకాశమును చేరినాను- సూర్యాశ్వములతో వాయువేగంతో వచ్చుచున్నాను- పిదప సూర్యు డొకమార్గాన వెళ్లుచున్నాడు- నేను మరొకమార్గాన వచ్చుచున్నాను- వచ్చేదారిలో నిండుజలముతో నుండిన మేఘములమధ్య వచ్చుచుండెడి దుర్వాసమహాముని చూచాను- పయోధరములచే ఆచ్ఛాదితుడై విద్యుద్వలయముచే అలంకృతుడై అభిసారికా స్త్రీతో సమానంగా ఉన్నాడు అతడు- చూచాను అతనిని- ఇలా అన్నాను అతనితో నమస్కరించి- మునీ! నల్లనివస్త్రము ధరించిన మీరు తమిస్రా (చీకటి) అనే అభిసారికతో సమానంగా కనిపించుచున్నారని అన్నాను- ఈ మాటవిని ఆముని నన్ను శపించాడు ఇలా- "ఓయీ! నీవు స్తనములు కేశములూ కలిగి హావభావములతో ఒప్పుచూ రాత్రియందు ఆడదానవు కాగలవు నన్నీమాట అన్నందుకు అని-

ఈదుర్వార్త విని ఆముసలి బ్రాహ్మణునినుంచి మదిలో కొంచెం విచారించుకునే లోపుగనే అతడంతర్థానమయ్యాడు- ఈనిమిత్తముచే నేను దుఃఖిస్తూ ఇచటికి వచ్చాను- ఇదీ నాదుఃఖానికి కారణము-జరిగిన విషయం చెప్పాను- అందుచేత రాత్రిపూట ఆడదానినయినాను- రాత్రి వేళ ఆడుదానితనము నాకు తప్పదు- దీనిని ఎలాగడపుకొనేది- రాత్రి వేళ స్తనాద్యవయవములుగల ఆడుదానినై నేను నాతండ్రియెదుట ఏమని చెప్పుకునేది? సంసారచక్రంలో మానవులకు విషమపరిణామములు అనివార్యములు కావచ్చును- నేనుకూడ యువకులకు కలహ విషయ మయినాను- అబ్బా! కష్టము- దేవలోకంలో కామాతురులయిన దేవకుమారులు నన్ను అపహరించుకొని పోవలయునని కలహించుదురు కదా! దేవద్విజగురువులయెదుట నేను లజ్జాపరవశురాలనై ఈస్త్రీ వేషంతో ఎలాఉండేది? అని అన్నాడు కుంభుడు-

వసి॥ రామా! ఇలా అని క్షణకాలం చిత్తసమాధానంలో ఉండి మళ్ళీ ధైర్యం తెచ్చుకొని కుంభుడు ఇలా అన్నాడు- రాజా! నేను

అజ్ఞానునివలె దుఃఖిస్తావెందుకు? నాకిపుడు చెడిపోయిందేమి! ప్రారబ్ధాయత్తమై నాకీస్త్రీత్వము సంప్రాప్తమయింది- నాకంటె వేరయిన మరో దేహమే దీనిని అనుభవించగలదు- అంతమాత్రంచేత అసంగ చిన్మాత్రుడనయిన నాకు కలిగిన హానియేమి! అని అన్నాడు కుంభుడు-

శిఖి॥ దేవపుత్రా! దుఃఖించి ఏమి ప్రయోజనము? దేహమున రానున్నది రానిమ్ము- ఆత్మకు అంటునదేమి! సుఖదుఃఖములన్ని దేహమునకు కాని దేహికి కావు- ప్రారబ్ధాధీనమయిన ఫలములనుగూర్చి దుఃఖింపతగని నీవుకూడ దుఃఖించుచున్నావంటే అవివేకులు తమ అవివేకప్రయుక్తమయిన దుఃఖమును పోగొట్టుకొనుటకు సంపాదించుకొనదలచిన శాస్త్రజన్యజ్ఞానమనే ఉపాయము వాళ్ళకేమి పని చేయును? అదిఉన్న మీరే యిట్లు దుఃఖించుచుంటిరి కదా! కనుక నిజంగా నీకు ఖేదం లేదు- లోకాచారమునకనుసరించి అలా అన్నావు నీవు- సమత నవలంబించి అభిన్నుడవై ఉండుము అన్నాడు శిఖి-

వసి॥ రామచంద్రా! చూడాలశిఖిధ్వజులిరువురు ఇలా ఒకరినొకరు ఓదార్చుకొనుచూ అతిమైత్రిగలిగి పరస్పరం బాధపడుతూ ఉన్నారు. అంతట సూర్యుడు అతనికి స్త్రీత్వం ప్రసాదించదలచినవాడువలె అస్తమించాడు- జగద్దీపము (ప్రపంచమనేదీపము) చముురు అయిపోయినందునవలె కునికింది- (ఆరిపోయింది- వ్యవహారములతోసహా పద్మాలు ముడుచుకుపోయాయి చీకటివల్ల మార్గములు అస్ఫుటములయినాయి. పాంధస్త్రీల హృదయాలు సంకోచమును చెందాయి- సముద్రద్వీపంలోని పల్లెవాండ్లు వలలతో పక్షులను కట్టివేస్తారు. చేపలు పడతారు- రత్నాలను సంపాదిస్తారు. అలాగే సూర్యుడుకూడ ఊర్ధ్వాదో భువనద్వయాన్ని నక్షత్రములనూ సమానంచేశాడు- అనగా క్రిందు మీదు తెలియడంలేదు. నక్షత్రాలుకూడా తెలియుటంలేదు చీకటివల్ల- భార్యాభర్తలగు ఆ స్నేహితులిద్దరు సంధ్యావందనంచేసి పొదలగుబురు చాటున జపంచేసుకుంటున్నారు- పిదప కుంభకుడు మెల్లమెల్లగా స్త్రీ

త్వాన్ని ప్రకటించుచూ యెదుటనున్న శిఖిధ్వజునిగురించి గద్గద స్వరంతో ఇలా అన్నాడు– రాజా! నేను పడిపోవుచున్నట్లున్నాను– ప్రకాశించుచున్నట్లున్నాను– అంగయష్టులతో ద్రవించుదానివలె నున్నాను– సిగ్గుపడుచునే స్త్రీత్వమును పొందాను– (ఆడుదాననయి నాను) రాజా! చూడునా వెంట్రుకలు పెరుగుచున్నాయి– చూడు నా స్తనములు వృద్ధిచెందుతున్నాయి– నాగుడ్డలు శిలముండలందాకా వ్రేలాడుతున్నాయి– చెట్టుకు పుష్పాలు పుట్టినట్లు నావంటి వివిధాభర ణాలూ, రత్నాలహారములూ పుట్టుచున్నాయి– శిరస్సున పట్టవస్త్రము ఉదయించుచున్నది– ఆడుదాని చిహ్నములన్నీ సంభవించినవి– ఛీ కష్టం– ఏమిచేసేది? ఆడుదానినయితిని కదా! ఈకష్టం ఎలాభరించేది? ఈనితంబములూ, జఘనములూ అడవికుండలవలె ఉన్నవికదా! అని చెప్పి ఖిన్నురాలయి ఊరకున్నది– రాజుకూడ ఆమెనుచూచి అలాగే ఖేదపడ్డాడు– ఒక్కముహూర్తమాత్రంలో ఈమాట అన్నాడు–

కష్టం– మహానుభావుడయిన ఈమునీంద్రుడు అందకత్తెయగు అడుది అయినాడుకదా! మునీంద్రా! మీరుతత్త్వజ్ఞులు– నియతియొక్క క్రమాన్ని మీరెరుంగుదురు– అవశ్యంభావియగు యీవిషయంలో మీరు ఖేదపడకుడు– విజ్ఞానవంతులకు ఆయాదశలు దేహమాత్రము నందే నిలిచిపోతాయి– అజ్ఞానులకయితే చిత్తంలో చొచ్చి వాసనా రూపాన్ని చెంది జన్మాంతరమునకుకూడ వెంటపడతాయి– దేహమాత్రం తో నిలిచిపోవు– అన్నాడు శిఖిధ్వజులు చూడాలతో అని యిట్లు అన్నారు– వసిష్ఠులు శ్రీరామునితో–

కుంభకుడు॥ రాజా! అలాగే యీరాత్రి ఆడతనమును అవలం బిస్తాను– ఖేదపడను– నియతిని యెవరు ఉల్లంఘింపగలరు? అని నిర్ణ యించుకొని వారిరువురు ఆరాత్రి ఏకశయ్యమీద ఊరకనే గడిపినారు– మరునాడుదయం ఆ ఆడ దేహాన్ని విడిచిపెట్టి మామూలు కుంభకుడయి నాడు– ఇలా ఆరాజమహిషి యగు చూడాల కుంభకుడయి మరల

మరునాడురాత్రి ఆడుదయినది- ఇలా వనాంతములయందు కుమారీ ధర్మమునొంది రాత్రివిహారించింది- కుంభకరూపమును ధరించి పగటి పూట భర్తతో మైత్రిచెంది విహారించింది- కాని వీరిరువురకు రాత్రిళ్ళు నిదుర లేదు- కుంభకునికి విపత్తు వాటిల్లినదని దిగులుతో రాజుకు శిఖి ధ్వజరాజుతో సంగమించాలను ఆశతో చూడాలకునూ నిద్ర లేదు- ఇలా అనేకపర్వతచరియలందు యథేచ్ఛగ విహారించినారు-

ఇట్లు ౧౦౫వ సర్గ ముగిసినది.

## ౧౦౬. లీలావివాహము.

శ్రీవసి॥ రామా! ఇలా కొన్నిరోజులు గడచాయి-ఆ చూడాల యిలాఅన్నది భర్తతో- రాజా ! రాజీవపత్రాక్షా ! నామాటకొంచెం వినండి- నేను ప్రతిరోజూ రాత్రి ఆడుదానినగుచున్నాము కదా ! కనుక అంగనాధర్మము సార్థకపరచుకొన దలచినాను- ఎవరినో ఒకరిని వివాహమాడదలచాను త్వరలో వారికి ఆత్మార్పణమును చేసికొనదల చాను- ఈముల్లోకములలో నాకు మీరే భర్తగా నచ్చుచున్నారు- కనుక నన్ను పెండ్లాడి రాత్రినన్ను భార్యగా స్వీకరింపుడు- అయత్నంగా లభించిన సుఖాన్ని విడనాడకూడదు- కాన ప్రత్యాఖ్యానము చేయక వెంటనే అంగీకరింపుడు-సృష్టికాలము మొదలుకొని దేవఋష్యాదులందు గూడ అనాయాససాధ్యముగా వివాహకార్యము ఇచ్ఛానిచ్ఛలు తత్ఫల మును పరిత్యజించి జరుగుచునే యున్నది- అద్దానిని మీరంగీకరించి నందున మీకుమాత్రము దోషమేమి ! మనమిద్దరము నిష్కాముముగా ఈపనిని నెరవేర్చుకొందము- అని యన్నది చూడాల భర్తతో-

శిఖి॥ మిత్రమా ! ఈపనివల్ల మనకు కీడూ లేదు- మేలూ లేదు- నీయిష్టప్రకారం అట్లనే కానిమ్ము- సర్వసమమయిన నాచిత్తమునకు జగత్రయము నాస్వరూపముగనే భాసించుచున్నది- కానిమ్ముఅన్నాడు భర్త-

కుంభకుడు॥ రాజా! అలాగయితే ఇప్పుడే మంచిముహూర్తము- నిన్ననే నేను వివాహలగ్నము నంతయు గణితముచేసి నిర్ణయించి యున్నాను- ఈప్రొద్దు శ్రావణపూర్ణిమ- ఈరాత్రి పూర్ణచంద్రు డుద యించగా మనయిద్దరకు వివాహముకాగలదు-

మహేంద్రపర్వతము యొక్క మనోహరమగు చరియయందు రత్న మాలనే దీపములతో ప్రకాశించెడి మణిగుహామందిరమున పూలగుత్తుల బరువుచే వంగిన ఎత్తయిన చెట్లపంక్తిచే ప్రకాశించెడి అడవిపూతీగల లాస్యమనే నాట్యకత్తియల నాట్యముచే మనోహరమయిన రాత్రికాల మందు వివాహము జరుగుగాక- ఆకాశమునందలి తారలు (నక్షత్ర ములు) తమభర్తయగు పూర్ణచంద్రునితో గూడ మన వివాహమహో త్సవమును చూచుగాక- లెండు వివాహమాడుటకొరకు- రాజా! ఇదిగో చందనపుష్పాది సంభారములు- అనిచెప్పి కుంభకుడు శిఖిధ్వజునితో కూడ లేచి పూవులుకోసెను రత్నాదులను సంపాదించెను- ఒక్క ముహూర్తమాత్రంలో రత్నసానువునందు పూలరాసులు నిండినవి- అలాగే హారములు, అంబరములు, మణిశ్రేష్ఠములు, మరొక అజిరమున (అంగణమున) ప్రోగుపడినవి-

ఇలా వివాహ సంభారములను సేకరించుకొని బంగారుగుహయం దుంచి స్నానమాడుటకు మందాకినీ నదికేగిరి- అచట ముందు శిఖిధ్వజుని మంగళస్నానమాడించెను కుంభుడు- పిదప కుంభకుడు (చూడాల) మంగళస్నానమాడెను- ఆవల దేవపితృమునీంద్రులను పూజించిరి- అన్యోన్యము యథేచ్ఛముగభుజించిరి- కల్పవృక్ష మొసగిన శ్వేతదుకూ లముల ధరియించిరి- ఇట్లుండ నింతలో వీరి వివాహమహోత్సవమును నెరవేర్చుటకువలె సూర్యుడు అస్తాద్రికేగెను-

వారిరువురు సంధ్యావందనవిధిని నెరవేర్చుకున్నారు-అఘమర్షణ జపమాచరించారు- వివాహదర్శనార్థమై ఆకసమున తారాగణ మాసన్న మయినది- కుంభకుడు ఇంతలో రాజుకు వివాహవేషం వేసినాడు-

చందనాగరుకర్పూరాది సుగంధద్రవ్యాలతోనూ, పూలమాలలతోనూ, మందారపారిజాతాది కల్పలతాగుచ్ఛములతోనూ, రత్నాద్యాభరణములతోనూ, అలంకరించాడు- వెంటనే ఆడుదయినాను- ఇలా ఆలోచించుకున్నాడు-

"నేను ఆడుదాననయినాను- నాఆత్మను కామునికొరకు అర్పింప తగిన కాలము ఆసన్నమయినది- ఇదిగో నేను రమ్యమయినకాంతను- భర్తవునీవు! యెదుటనున్నావు- ఓ కాముడా! ఇటురమ్ము- నీహృదయంలో కాముకున్నాడు" అన్నది భర్తతో- ఇలా అనుకొని భర్త యొద్దకు వెళ్ళినది- ఆయనకాళ్ళమీద పడినది- నాథా! నేను మదనిక యనెడు భార్యను- మీపాదాలకు వందనము చేయుచున్నాను- అని చెప్పి నమస్కరించినది- క్రమంగా అగ్నిని ప్రజ్వరిల్లచేసి నన్నుపాణిగ్రహణ మొనర్చుకొనుము- మీరు రతివివాహమున మదనునివలె ప్రకాశించుచున్నారు" అన్నది యిలా మాటాడుకొనుచూ పాతదాంపత్యాన్ని మరగుపరచుకొని నూతనదంపతులవలె సంతోషించినారు-

శిఖిధ్వజుడు చూడాలను సువర్ణశిలాపర్యంకముమీద కూర్చుండబెట్టి, దివ్యాభరణములతోనూ, మణిహారములతోనూ, సుగంధద్రవ్యములతోనూ, దుకూలవస్త్రములతోనూ, అలంకరింపచేశాడు- ఆమె మిక్కిలి శోభాయమానంగా ఉంది రతీదేవివలె-

శిఖిధ్వజుడు ఇలా అలంకరించి ఆమెను ఇలా అన్నాడు ఆమెతో ఓ మృగశాబాక్షీ! నీవు నూతనముగాపుట్టిన లక్ష్మీదేవివలె నున్నావు- శచీదేవి ఇంద్రునితోను, లక్ష్మీదేవి దేవేంద్రునితోను, గౌరిదేవి ఈశ్వరునితోను పొందిన మంగళమును నీవు పొందుదువు- కల్పలతవలె ఆహ్లాదకరముగనున్న నీవు వివాహవేదిక యొద్దకు లేచిరమ్ము- అని అన్నాడు- శిఖిధ్వజుడు చూడాలతో-

వసి॥ రామచంద్రా! వివాహవేదిక రత్నపురాళ్ళతో చిహ్నితం చేశారు- పుష్పలతలతో అలంకరించారు- పూలగుత్తుల సమానా

కారంగాఉండే ముత్యాలగుత్తులతో అలంకరించారు- నాలుగుదిక్కులా కొబ్బరిచెట్లతో అలంకరించారు- గంగోదకపూర్ణమయిన పూర్ణకుంభ ములను నలుమైపుల ఉంచినారు- అలంకరించిన వేదికమీద అగ్నిని ప్రతిష్ఠించి మంచిగంధపు చెక్కలతో హోమంచేశారు- (లేక జ్వాల చేశారు) అగ్నికి ప్రదక్షిణంచేసి దంపతులిరువురు వేదికనలంకరించారు- (కూర్చున్నారు) అందు శిఖిధ్వజుడు తిలలూ, లాజలు, హోమం చేశాడు- శిఖిధ్వజుడు లేచి కాంతను ప్రాణిగ్రహణము చేశాడు- ఆ దంపతులిద్దరూ పార్వతీపరమేశ్వరులవలె అగ్నికి ప్రదక్షిణంచేశారు- జ్ఞానసర్వస్వమయిన ఒకరిహృదయము నొకరు దానముచేసికొన్నారు- ఇద్దరు చిరునగవు ముఖముతో ప్రకాశించుచూ, ముమ్మారు ప్రదక్షిణం చేసి అగ్నికి లాజలను విడచి యిద్దరు చేతులు విడచారు-

అంతకుమున్నే అమర్చుకొనియున్న పూలపాన్పుపై కూర్చు న్నారు- ఇంతలో ఆకాశమున చంద్రుడు నాలవభాగమును ఆక్రమిం చాడు- చంద్రోదయమయిన ఆనందసమయంలో ఇష్టాగోష్ఠులతో ఒక ముహూర్తకాలం గడపుకున్నారు- పిదప లేచి రత్నదీపములతో ప్రకా శించెడి పూర్వం తయారుచేసికొనియున్న బంగారుగుహను ప్రవేశిం చారు- అచట నూతనముగ తయారుచేసికొనియున్న పూలపాన్పు చూచారు- వాడని మందారపుష్పములతో నిండియున్నది అది- వెన్నెల పిండమువలె సుందరముగానున్నది- పాలసముద్రపు నీటిధారలవలె రమ ణీయముగనున్నది- మన్మథుని ప్రతిబింబమా ! అన్నట్లున్నది దానిమీద ఆదంపతులిరువురూ కూర్చున్నారు-

ప్రణయపేశలమయిన వాగ్విలాసములతోను, తత్కాలోచిత మయిన ఆలింగనాదికార్యములతోను, గంధమాల్యతాంబూలార్పణాది ప్రణయోపచారములతోను, క్రొత్తక్రొత్త సంభోగసుఖముతోను, సుదీ ర్ఘమయిన ఆరాత్రిని ముహూర్తమాత్రముగ గడపుకున్నారు-

ఇట్లు ౧౦౫వ సర్గ ముగిసినది.

## ౧౦౭. ఇంద్రగమనము.

వసి॥ రామచంద్రా! తెల్లవారింది– సూర్యుడుదయించాడు– చూడాల కుంభత్వమును చెందినది– ఇలా మాహేంద్రపర్వతగుహాలో కుంభ శిఖిధ్వజులిద్దరూ స్వయం వివాహితులై విలాసంగా కాలంగడపు కున్నారు– పగటమిత్రులూ రాత్రిపూట భార్యాభర్తలూ అయినారు– సహ్య దర్దుర, కైలాస, మహేంద్ర, మలయగంధమాదన, వింధ్యాద్రు లందు విహరించాడు. మూడేసిరోజుల కొకపర్యాయం తమపట్టణానికి వెళ్ళి రాజకార్యాలను చూచుకొని తిరిగివచ్చేడిది చూడాల– మాహేంద్రపర్వతమునందు ఒక్కమాసమున్ను శుక్తిమత్పర్వతమునందు పదిహైదురోజులున్ను, జాంబూనదమయమునందు ఒక్కమాసమున్ను, ఉత్తరకురుదేశములందు పదిరోజులున్ను, కోసలదేశములందు యిరువది యేడురోజులున్ను, ఇతరదేశములందు ఇలాగే కొన్నిరోజులున్ను కాలముగడపినారు–

కొంతకాలానికి చూడల ఇలా ఆలోచించింది. భోగభారముతో శిఖిధ్వజుని పరీక్షించగలను– ఇతనియొక్క చిత్తము ఎన్నడూ భోగ ములనపేక్షించదు" అని ఆలోచించి ఆయడవిలో మాయచే దేవతల తోడను, అప్సరసలతోను, కూడియున్న దేవేంద్రుని చూపించెను– పరివారసమేతుడై వచ్చిన యింద్రుని యథాశాస్త్రీయముగ పూజించి నాడు శిఖిధ్వజుడు. సైగా ఇలాఅన్నాడు–

స్వామీ! మీరు దూరమునుంచి మాయొద్దకు రావడమను శ్రమను ఎందుకు చేసినారు? అనగా ఏమిప్రయోజనాన్ని అపేక్షించి వచ్చినారు. అనుగ్రహించి చెప్పండి" అని–

ఇంద్రుడు: ఇలా అన్నాడు. రాజా! మేము మీగుణాతిశయము లను విన్నాము–అవి మామనస్సున నాటినవి– అందుకు విస్మయం చెంది చూచి ఆనందించటానికి వచ్చాము– వెంటనే లేచి స్వర్గానికిరండు. అచ్చట అందరు మీకొరకు ఎదురుచూచుచున్నారు– దేవాంగన

లందరు మీగుణగణములనువిని ఆశ్చర్యపడుచున్నారు- పాదుకమున్నగు పరికరములను, విమాన దివ్యాశ్వములను గ్రహించి సిద్ధమార్గమున స్వర్గమండలానికి రండు- వచ్చి అచట దేవతామందిరమున జీవన్ముక్తులనుభవింపదగిన వివిధభోగములను అనుభవించండి- అందు కాహ్వానింప దలచి నేను వచ్చితిని- మీబోటిసాధువులు యదృచ్ఛాప్రాప్తమయిన సిరిని తిరస్కరించి పోగొట్టుకొనరు- ప్రాప్తముకాని వాటిని వాంఛించరు- నిర్విఘ్నంగా దయచేసి సుఖంగా విహరించి స్వర్గాన్ని పవిత్రం చేయండి- అన్నాడు ఇంద్రుడు-

శిఖి॥ దేవాధినాయకా! నేను దేహమంతా స్వర్గసమానమయిన సుఖంకలదానినిగా గ్రహిస్తున్నాను- నాకుఅంతా స్వర్గమే- ఎచ్చటనో ఒకేచోటకాదు- అంతటా సంతోషింతును- అంతటా రమింతును- నామనస్సు నిష్కామమయినందున అంతటా నాకానందమే- మీరు చెప్పినట్లు ఎక్కడో ఒక్కచోటనున్నస్వర్గము తుచ్ఛస్వర్గము- అచటికి నేను రానొల్లను- కాన మీయాజ్ఞ నేను పాటించను- నన్నురమ్మనుట మీదితప్పుకాని రాకపోవుట నాది తప్పుకాదు-

ఇంద్రుడు॥ సాధూత్తమా! అవాప్తకాములకు భోగానుభవమూ భోగాననుభవమూ రెండూ సమానములు- అయిననూ సజ్జనులు ప్రారబ్ధకర్మక్షయముకొరకు భోగోపసేవనమునే ఆచరించినారు- కనుక అదియే యుక్తమని నేతలచెదను- ఇలా దేవేంద్రుడనుచుండ శిఖిధ్వజుడు మౌనంగా ఊరకున్నాడు- అయితే నేను పోదునని సూచించినాడింద్రుడు- అది విని శిఖిధ్వజుడు ఇలా అన్నాడు-

దేవేంద్రా! నేనిప్పుడే స్వర్గమునకు రాను- మరల రాజ్యమునందు ప్రతిష్ఠితుడనై సమయముకొలది మీశత్రువుల జంపుటకొరకు స్వర్గమునకు వత్తును అని అన్నాడు- ఆమాటవిని దేవేంద్రుడు ఓ కుంభకా ఇదిఇట్లు అగుగాక! మీకు కల్యాణమగుగాక! అని దీవించి దేవేంద్రుడు అంతర్ధానమయినాడు- ఇంద్రుడు అంతర్ధానమయ్యేసరికి ఆయన వెంట వచ్చిన దేవతాబృందముకూడ అంతర్ధానమయినారు-

ఇట్లు ౧౦౭వ సర్గ సమాప్తము.

## ౧౦౮. చూడాల స్వరూపదర్శనము.

వసి॥ రామా! చూడాల కుంభకవేషమును ధరించిన మాయను ఇంద్రాగమనరూపమాయను, ఉపసంహరించుకొన్నది- ఇలా అనుకున్నది- "ఈరోజు భోగేచ్ఛకు లొంగుటలేదు- దేవేంద్రుడు వచ్చినను భోగాభోగములు సమానముగ జూచుచున్నాడు- అర్ఘ్యపాద్యాది పూజావిధులను నిరాడంబరముగ చేసినాడు-కనుక ఈతని బుద్ధిని కలవరపరచెడి రాగద్వేషప్రధానమయిన వ్యవహారంతో మరల పరీక్షిస్తాను." అని యిలా ఆలోచించి ఆరాత్రి చంద్రోదయంకాగానే, అంగనారూపాన్ని వదిలినది- శిఖిధ్వజుడు నదీతీరంలో సంధ్యాజపంచేస్తున్నాడు- తాను పూగుత్తులతో ఆచ్ఛాదితమైయున్న వనదేవతలయొక్క అంతఃపురమును ప్రవేశించింది కామోద్రిక్తురాలయి అచట తనమెడ(కంఠం) కౌగిలించుకొనియున్న ఒకవిటుని మాయచే కల్పించుకొని పూలపాన్పుపై పరుండియున్నది-

శిఖిధ్వజుడు లేచివచ్చి లతాగృహంలో పరుండియున్న మదనికను (చూడాలను) ఆమె కంఠంకౌగలించుకొనియున్న విటుణ్ణిచూచాడు- అతడి ఒడలంతా మంచిగంధం పూసుకున్నాడు- ముంగురులు ప్రేలాడుచున్నాయి- పక్కమీద పొరలుటచే తలవెండ్రుకలు చికాకుపడియున్నవి- బంగారముకంటె యిబ్బడిఛాయగల చూడాలయొక్క బాహువులను తలగడలు (దిండ్లు)గా అమర్చుకొని యున్నాడు- నవ్వుముఖముతో నున్నాడు- ఆదంపతులిద్దరు పరస్పరం నవ్వుముఖముతో నున్నారు- గట్టిగా కౌగిలించుకొని పరుండియున్నారు- శిఖిధ్వజుడు ఆదంపతులను జూచి సంతోషించాడు- సుఖంగా ఉండండనిదీవించాడు- వీళ్ళకు విఘ్నము చేయకూడదని భావించి తొలగిపోయాడు- తరువాత ముహూర్తమాత్రంలో ఆమె ఆప్రపంచాన్ని చాలించి బయటికివచ్చి సువర్ణఫలకముమీద కూర్చొనియున్న శిఖిధ్వజునకు విటునితో సంభోగించుటచే వికసించి వ్యాకులమయియున్న తనశరీరాన్ని చూపుకున్నది-

శిఖిధ్వజుడు ఆరాతిమీద ఏకాంతంలో సమాధిమగ్నుడై యున్నాడు- అచటికిపోయి క్షణకాలంనిలుచున్నది మదనిక- ఆక్షణంలో శిఖిధ్వజుడు సమాధినుంచిలేచి ఇలా అన్నాడు చూడాలతో-

ఓ చిన్నదానా! నిండు ఆనందంలో ఉన్ననీవు క్షణంలో విఘ్న మొనర్పబడితివికదా! సకల భూతములు ఆనందముకొరకు పాటుపడు చుందురు- వెర్రి ప్రణయచేష్టలచే మరల భర్తను ఆనందపరచుము ప్రపంచంలో పరస్పరస్నేహము దుర్లభము- ఇలాంటి విషయానికి నేను భయపడను- వివేకిఅయినవాళ్ళందరూ "అత్యతము ఇష్టమయిన వస్తువు నీవలె పరోపభోగ్యమే" అని గ్రహించవలెను- నీవు కుంభకుడవుకావు- నేను కుంభకుడు మేమిద్దరము వీతరాగులము- దూర్వాస శాపమువల్ల పుట్టిన నీవు మరొకతెవు- నీ ఇచ్ఛవచ్చినట్లు నీవు ప్రవర్తించుము- అని అన్నాడు శిఖిధ్వజుడు-

మదనిక (చూడాల) మహాత్మా! మీరు చెప్పినది నిజము- స్త్రీ స్వభావము అతిచంచలము పురుషులకంటె స్త్రీలకు ఎనిమిదిరెట్లు కామముహెచ్చు- మీరు కోపింపకుడు నేను అబలను- నన్నితడు కోరి నాడు- గహనకాననంలో ఉన్నాను- మీరు దూరంగా సంధ్యాజపం చేసికొంటున్నారు- ఒంటరి దానను ఏమిచేయగలను? అబలకాని, కుమారికాని, సౌందర్యవతియయి, ఎదుట జారుడు తటస్థించినచో సంగ మమును ఆపుకొనలేరు- ప్రబలతర రతిరాగబాధితలగు స్త్రీలు జార సంగమమును నిరోధించుకొనజాలరు- పురుషుని స్వాధీనపరచుకొన కలిగిన సౌందర్యం లేకపోతే యేమోతప్ప అది ఉన్నంతలో పురుషుడు కామించి యెదుట నున్నపుడు వీరి పాతివ్రత్యము యేమీ పనికిరాదు-

కనుక రాజా! నేను అబలను, ఆడుదానిని, చిన్నదానను మూఢు రాలను- తప్పుచేసినదానను- మీరు సాధువులు- ఓర్పుగలవారలు- క్షమింతుంచండి నన్ను అని అన్నది చూడాల-

శిఖి॥ బాలా! నామదిలో కోపమనేది లేదు- ఆకాశంలో చెట్టు ఉండదు- కేవలము సాధువులు నిందింతురు కాన నిన్ను నేనుభార్య

నుగా అంగీకరించను- వెనుకటివలె వీతరాగులమై సుహృదులముగా నిత్యమూ మెలగుదము- అన్నాడు శిఖిధ్వజుడు-

వసి॥ రామచంద్రా! శిఖిధ్వజుడిట్లు రాగ ద్వేష వాసనాశూన్యుడుగ నుండుటను ఇలా ఆలోచించుకొన్నది-

"అబ్బా! ఇతడు భగవంతుడు- సర్వోత్కృష్టమయిన నాష్యమును పొందినాడు- వీతరాగుడు- క్రోధరహితుడు- జీవన్ముక్తుడు- ఇతనిని భోగములు వశపరచుకొనజాలవు- దేవేంద్రప్రార్థితము లయిన సిద్ధులుగూడ చలింపజేయజాలవు- సుఖములు, దుఃఖములు, సంపదలు, ఆపదలు, ఇవియేవీ ఇతనిని చలింపజేయజాలవు- జీవన్ముక్తుల గుణము లయిన శాంతి, క్షమా, ధైర్యత్ప్రాప్త్యాదిరూపములయిన మహార్థులు ఈతనిని పొందనున్నవి- (ఆశ్రయింపనున్నవి) నా నిజవృత్తాంతమంతా ఇతనికి తెలియపరతును- ఈశుంభరూపమును వదిలి నేను చూడాల నయ్యెదను" అని ఆలోచించి చూడాల మదనికా రూపమును పరిత్యజించి చూడాల శరీరమును స్వీకరించినది- ఆశిఖిధ్వజుని యెదుట మదనికా దేహమునుంచి చూడాల బయలుదేరినట్లు ప్రకాశించినది- పెట్టెలోనుంచి వచ్చినట్లు- శిఖిధ్వజుడామెను మదనికయే చూడాలయను భార్యగా తయారయినట్లు చూచాడు-

ఇట్లు ౧౦౮వ సర్గ ముగిసినది-

## ౧౦౯. చూడాల ప్రకటీకరణము.

వసి॥ రామచంద్రా! శిఖిధ్వజుడు ఆభార్యనుజూచి ఆశ్చర్యపడి మనోవ్యాకులంతో ఇలా అన్నాడు-

ఓ చిన్నదానా! ఎవరునీవు? ఎక్కడనుంచి వచ్చినావు? ఇక్కడ ఎంతకాలంనుంచి ఉంటున్నావు? ఎందుకొరకు ఉంటున్నావు? నీఆకారముతోను, చేష్టలతోను, చిరునగవుచేతను, ప్రేమపూర్వక సంభాషణ

తోను, నాభార్యయొక్క విలాసతోను, ఆమె అంశేమున్నటుల కనిపించుచున్నావు? అన్నాడు-

చూడాల ప్రభూ! అదినిజము- నేను చూడాలను- మీరు సందేహింపవలదు- ఇపుడు నానిజరూపం బయట పెట్టినాను- మీకు తత్త్వబోధ చేయటానికిగాను కుంభకాది దేహాలను నిర్మించుకున్నది నేనే- మీరు రాజ్యంవదలి తపస్సుకొరకు అడవికి వచ్చినది మొదలు మీబోధకొరకు నేను ప్రయత్నించుచునే యున్నాను- నేను మాయగా కుంభవేషాన్ని ధరించానుకాని అదిసత్యంకాదు- నీవు ధ్యానమార్గంతో వెనుక నేనుచెప్పిన యోగశక్తితో ఆలోచించు- సర్వమూ నీకే తెలియును- అని చూడాల చెప్పేసరికి శిఖిధ్వజుడు యోగమునకు అనుకూలమయిన (ధారణానుకూలమయిన) ఆసనాది పరికరమును కట్టుకొని (ఏర్పరచుకొని)ముహూర్తమాత్రంలో సర్వమూ తెలిసికున్నాడు- తాను రాజ్యమును వదలినది మొదలు నేటివరకునుండు పరిస్థితియంతయు తెలిసికొని సమాధి చాలించాడు- సమాధి విరమించి హర్షోత్ఫుల్లలోచనుడై చేతులుచాచి కన్నీరుకార్చుచూ ఘనమయిన స్నేహముతో కౌగలించుకున్నాడు భార్యను- ఆకౌగలింతలో వారిరువురకు కలిగిన అనురాగరూపమయిన స్థాయిభావమును వాసుకి జిహ్వాలతోకూడ వర్ణింపనలవికాదు- చంద్రసూర్యులు అమావాస్యనాడు కలిసినట్లునూ, మట్టితో తయారుచేసిన బొమ్మలు కలిసినట్లునూ, రాతిమీద చెక్కిన బొమ్మలవలెనూ, వారిరువురూ కలిసిపోయారు-బలవంతముమీద చేతులు సడలింపజేసికున్నారు యిరువురు-పిదప శిఖిధ్వజుడు భార్య చెక్కిళ్ళను చేతపట్టుకొని ఇలా అన్నాడు-కులాంగనలకు భర్తయనువాడు అత్యంత మధురస్నిగ్ధుడు- వారి అనురాగరసము అతిమధురము- అతివిస్తీర్ణము- అమృతముకంటె రుచ్యము- భర్తృనిమిత్తము నీవు అతిదారుణ క్లేశము ననుభవించితివి- దాటనలవికాని సంసార కుహారమునుంచి నీబుద్ధిబలముచే నేను ఉద్ధరించబడితిని- అట్టి నీబుద్ధికియేది! గుణసంపదలో అరుంధతీ, శచీ, గౌరీ, గాయత్రీ, లక్ష్మీ సరస్వతులుకూడ నీకంటె పేలవమయినారు-

ఓ సుందరీ! ధీ, శ్రీ, కాంతి, యనెడు దక్షకన్యలందరిలోను, నీవు ఆకారములోనూ, సౌందర్యములోనూ, శ్రేష్ఠురాలవుగా గోచరించు చున్నావు- నీవు నాయందలి దృఢనిశ్చయంతో నాకు బోధచేసితివి- నీకు నేనేమి యుపకారమొనర్తును? కులాంగనలయిన స్త్రీలు అనాది గహన సంసారకూపమునందు పడియున్న భర్తలనుకూడ ఉద్ధరించెదరు- ఆసామర్థ్యము శాస్త్రార్థి, గురు, మంత్రాదులకు, కూడ లేదు- భర్తలకు అనురాగవతులయిన కులాంగనలకంటె మించినవారు లేరు- వారే స్నేహితులు, వారే అన్నలుతమ్ములును, భృత్యులు, గురువులు, మిత్రులు, ధనము, సుఖము, శాస్త్రము ఇట్లు దాసులు సర్వమూ ఇహలోక పరలోకసుఖముఅంతా కులాంగనలయందు ఆధారపడియున్నది- కనుక వారు సర్వదా అన్నివిధములా పూజనీయులు- నిరీహురాలయి సంసార వార్థి దాటిన యామెకు నేనేమి ప్రత్యుపకారము చేయగలుగుదును? ఈలోకంలో నిన్నే నేను కులాంగనయని తలంతును- లోకంలోని కులాంగనలందరు నీచే జయింపబడినారు- స్త్రీలయొక్క సౌజన్యాది గుణోత్కర్ష చర్చకువచ్చినపుడు నీవే మొదటిదానవగుదువు- అరుంధతి మున్నగువారు తమకంటె గుణజాలములో ఒప్పెడి నిన్ను సృజించిన బ్రహ్మదేవుని కోపించుచున్నారని తలచెదను- నీవే పతివ్రతవు- రూపానికీ, మంచితనానికీ, గుణసంపదలకూ గనివి- రమ్ము నీగుణగణమునకు ఉత్సాహపడిన నన్ను మరల నొకసారి కౌగలించుకొనుము- అన్నాడు శిఖిధ్వజుడు-

వసి॥ రామా! ఇలా అని ఆశిఖిధ్వజుడు ఆచూడాలయను మృగాక్షిని గాఢంగా కౌగలించుకున్నాడు-

చూడాల॥ దేవా! నీవు కుపక్రియలతో వ్యాకులపడుచుంటే మాటిమాటికి మీకొరకు నేను దుఃఖించుచున్నాను- మీబోధ మీకు మాత్రమే ఉపయోగపడుచున్నది- అదినేను నాస్వార్థమునకునే బోధ చేసినాను- అన్నది చూడాల-

శిఖి॥ చిన్నదానా! నీవు సంపాదించుకొనిన స్వార్థమును కులాంగన లందరూ సాధించుకొనుగాక! లేక సాధించుకొందురా! సాధించుకొన లేరని భావము—

చూడాల॥ నాథా! మీరు జగజ్జాలముయొక్క ఆవలియొడ్డును చేరినారు— తత్త్వమును గ్రహించినారు ఇప్పుడు ఆప్రాప్తమైన మోహమును కొంచెం గుర్తింపచేసి కొనుచున్నారు— ఇది చేయుదును. ఇది పొందె దను— అనేస్థితిలోకి వచ్చితిరి— ఈదశను గురించి లోపల పరిహాసించు కొనుచున్నారు కూడా వెనుకటి తుచ్ఛతృష్ణలు కాని, తుచ్ఛసంకల్ప ములు కాని యిప్పుడు మీయొద్ద కనిపించుటలేదు— ఆర్యా! మీరిప్పుడు యెవరు? ఎందున్నారు? ఏమికోరుచున్నారు— స్వామీ! వెనుకటి దేహచేష్టాక్రమమును యెట్లుచూచుచున్నారు— అన్నది చూడాల—

శిఖి॥ చూడాలా! నాకు ప్రత్యగాత్మవునీవే— నీవే నామోహము నకుగాని, వివేకమునకుగాని, ప్రకాశకురాలవుగనున్నావు— నీవు యేయే దానికి ప్రకాశకముగనున్నావో దానికంతకును నేను ప్రత్యగాత్మగానే యున్నాను— నేను నిరీహుడను— నిరంశుడను— నిర్మలుడను— శాంతు డను— చిదాత్మను— నేను ప్రత్యక్స్వరూపచిత్తైకవర్తిన్మయుండను అధిష్ఠితు డనై నిరతిశయానందదశను పొందితిని— హరిహరాదులుగూడ ఈదశను నిషేధించుటకు శక్తులుగారు— ప్రపంచభ్రాంతి నాకు తొలగినది— సుఖ దుఃఖములు స్థూలసూక్ష్మములు ఇవి నారూపములుకావు— సత్యస్వరూ పుడను— చిత్ప్రకాశరూపుడను—సర్వసముడను— శాంతుడను— నేనెవడనో వాడినే— వాచా నిర్వచించి చెప్పజాలను—

ఓ చంచలాక్షీ! నీవే నాగురువు— నీకు నమస్కారము— నీయను గ్రహమున భవసాగరమును దాటినాను— నూరుపుటములు పెట్టిన సువర్ణమువలె మరల మలినముకాదు— అట్లే నేనును మాలినుడనుగాను— అన్నాడు శిఖి—

చూడాల॥ ప్రాణేశా! హృదయప్రియా! అయితే యిపుడు మీకేమి కావలయును? చెప్పండి—

శిఖి॥ తన్వీ! నాకు నిషేధమూ తెలియదు- వాంఛితము తెలియదు- నీవాచరించిన దానిని నేనుపరమార్థమని గ్రహింతును-నీమతమే నాకభిమతము- ఇదమిత్థమని నేనేమియు అనుసంధానము చేయజాలను- నీకు తెలిసినదానిని చేయుము- నేను దానినే గ్రహింతును- నేను స్తుతించను- నిందించను- నీయిష్టానుసారమాచరింపుము- అన్నాడు శిఖి-

చూడాల॥ మహానుభావా! అలాగయితే నామతమునువినుడు- విని అదే మీరాచరించండి- మేము అద్వైతాత్మజ్ఞానముతో, మూర్ఖత్వము వదలి నిరీహులమై నిర్మలముగా నుంటిమి- మాకు రాజ్యభోగాద్యపేక్షణమెంతటిదో తదపేక్షణముకూడ అంతటిదే- చక్షురాదీంద్రియములకూ, ముఖ్యప్రాణమునకును తమతమవిషయములగురించి కోరికలేకపోతే యింక పరమాత్మయందతిశయమేమి? అజ్ఞానులకువలె తత్త్వవేత్తలకు అంతఃకరణ దేహేంద్రియాది తాదాత్మ్యాధ్యాస యుండదు- అట్లుండుచో ఇంద్రియాలకు విషయభోగాభ్యాసంచేత మాలిన్యమున్నందున ఆత్మకుకూడ మాలిన్యము ప్రసక్తించెడిది- తత్త్వవేత్త యెల్లప్పుడు నిష్క్రియాసంగచిన్మాత్రభూతుడు- ఇట్టివాడెవడు భోగముల నభిలషించును? ప్రారబ్ధభోగమాత్రంచేత తదభ్యాసవ్యసనముకాని, దానమాలిన్యముకాని ప్రసక్తించదు- కావున ప్రారబ్ధభోగాదులందుకాని, తద్భోగాంతమునందుగాని, తదంతరాలమునందుకాని మేము నియతస్వభావులము- మారము- ప్రారబ్ధశేషము నొక్కదానిని భోగముతో నశింపజేసికొని ఉండెదము-అన్యథాభూతులము కాము-అన్యులమూ కాబోము- కొంతకాలం రాజ్యముతో కాలముగడపి తర్వాత క్రమంగా విదేహులము అగుదాము- అన్నది చూడాల-

శిఖి॥ ఓ తరలాక్షీ! మనము ఆద్యంతమధ్యములయందు మన మెట్టివారము? ప్రారబ్ధశేషమును పరిత్యజించి మన మెట్లుందుము? అని అడిగినాడు రాజు-

చూడాల॥ రాజసత్తమా! మనము అజ్ఞాన మొక్కదానిని విడిచిపెట్టి ఆద్యంతమధ్యలయందు మరల రాజులమే యగుదుము- మన

నగరమందు నీవు వెనుకటి రాజుగానేయుండి సింహాసనమలంకరించుము- కాంతాలలామయయిన నేను నీకు భార్యగానుందును- మన నగరము సామంతరాజులతో క్రిక్కిరిసియుండుగాక- సంతోషించెడు పురవాసులతో నిండియుండుగాక- నాట్యమాడెడి క్రొత్తక్రొత్త అంగనలతో తులతూగుగాక- పతాకములతోనూ తూర్యవాద్యములతోనూ, పూల మాలికలతోనూ శోభిల్లుచునుండుగాక- అన్నది చూడాల-

వసి॥ రామచంద్రా! చూడాల ఇలా అనేసరికి శిఖిధ్వజుడు నవ్వి మధురమయిన మాట అన్నాడు- ఆమెతో, ఓ విశాలాక్షీ! నీకు భోగేచ్ఛయే ఉన్నట్లయితే స్వర్గలోకంలో దేవేంద్రుడు యిచ్చెదనని ప్రార్థించిన దివ్యభోగములే ఉన్నవికదా! అందుండి అవియే అనుభవించెడి వారముకదా? అని-

చూడాల॥ రాజా! నాకుభోగములమీాద కోరికలేదు- విభూతుల మీాద వాంఛలేదు- స్వభావవశాత్ యథాప్రాప్తము నంగీకరింతును- నాకుస్వర్గము సుఖమునీయదు- రాజ్యము సుఖమునీయదు- మింగతకర్మలును సుఖమునీయవు- యథాస్థితమయినదానితో నిర్వికారముగ నుందును- సుఖదుఃఖములను మిథునము (ద్వంద్వము) నశిస్తే సమానమయిన పదమునందుందును-

శిఖి॥ ఓ విశాలాక్షీ! మంచిమాట అన్నావు- నీబుద్ధిద్వంద్వాతీతమై సమభావంలో నున్నది- రాజ్యమువలన ప్రయోజనమేమి? గ్రహించటానికీ, విడిచిపెట్టటానికీ సుఖదుఃఖచింతను విడిచి యథాప్రాప్తమయిన స్థితిలో నుందము- అని యిలాంటి కథాలాపములో మునిగి యుండగా ఆదంపతులు సాయంకాలమయినది- సాయంసంధ్యానుష్ఠానం కొరకు లేచి వెళ్ళారు- పరస్పరేప్సిత సంభోగము కొరకు ఉత్కంఠకలవారయినను వాసనారహితులగుటచే ఉత్కంఠారహితులై స్వర్గావాసమును తృణీకరించి పూర్ణకాములై యున్నారు- ఒకే పడక మీాద ప్రణయచేష్టలచే కాలమును గడపారు- జీవన్ముక్తులయిన ఆదంపతులకు రాత్రికాలము గడచినది-

పరస్పరానుభవసిద్ధమయిన భోగమోక్షసుఖమును గురించి ప్రణయవాక్యవిలాసగర్భముగునట్లు చెప్పుకొనుచున్న ఆదంపతుల చిత్తమును ఉత్సాహపరచుచూ రాత్రి నాల్గుయామముల దీర్ఘమయినదూ ముహూర్తమాత్రమయినది వారికి-

ఇట్లు ౧౦౯వ సర్గ సమాప్తము.

౧౧౦. శిఖిధ్వజనిర్వాణము.

వసి॥ మరునాడు తెల్లవారినది- అరుణోదయమైనది- సూర్యబింబము పెట్టెనుంచివలె బయటికి వచ్చినది- ఆదంపతులిద్దరూ లేచి స్నానసంధ్యాది కార్యములను నెరవేర్చుకొని బంగారుగుహలో పత్రాసనంమీద కూర్చున్నారు-

పిదప కొంతసేపటికి చూడాలలేచి సప్తసముద్రముల నీటితో నిండిన రత్నకుంభము నొకదానిని తయారుచేసికొని ప్రాఙ్ముఖంగా కూర్చొనియున్న భర్తగారికిని భార్యస్వారాజ్యమునం దభిషేకము జేసెను- తన సంకల్పబలంచే నిర్మించబడిన సింహాసనమునందుండిన అభిషిక్తుడయిన ఆరోజును గురించి చూడాల యిట్లనెను- రాజా! మునిబృందమునకు తగిన శాంతమును విడిచి శాసించుటకు తగిన యింద్రాద్యష్టదిక్పాలకుల తేజస్సును ధరించుము అనిఅన్నది చూడాల- రాజు అలాగే అని అంటూనే మహారాజు అయినాడు- పిదప ద్వారపాలకురాలుగా అతివినయముతో నిలుచున్న చూడాలను జూచి శిఖిధ్వజుడు- "నీవు పట్టాభిషేకమునొంది పట్టపురాణిపదవిని అలంకరించమన్నాడు- సరస్సులో స్నానంచేయించాడు- భార్యతో ఇలా అన్నాడు- "ఓ ప్రియురాలా! క్షణకాలంలో నీసంకల్పబలంవల్ల అత్యుత్కటమయిన సైన్యమును నిర్మించమన్నాడు- భర్తమాటవిని చూడాల మహత్తరమయిన సైన్యమును సంకల్పించింది- వారిరువురు చతురంగబలసైన్యమును జూచినారు- పార్థివబృందము వెంటనంట సామంతరాజులు కాపాడు

చుండ నృపదంపతులిరువురు మదపుటేనుగును అధిష్ఠించారు- శిఖిధ్వజుడు పదాతిబలముయొక్క- సంకులతను తొలగించుకుంటూ బయలుదేరాడు మహేంద్రపర్వతంనుంచి-మధ్యగిరులనూ, వనాలనూ, గ్రామములను, జాంగలప్రదేశములను (మన్నైపు ప్రదేశములను) భార్యకు చూపించుచూ కొద్దిసేపులో (కొలదికాలములోనే) స్వర్గమువలె ప్రకాశించెడి తన పట్టణమును చేరాడు- సామంతరాజులు జయశబ్దములను మ్రోగించినారు- పురస్త్రీలు లాజ, పుష్పాంజలులు చల్లినారు- వర్తకపు బాజారును చూచుకుంటూ పతాకాలతోనూ, ధ్వజములతోనూ, సంకులమైముత్యాలహారము (సరము) లతో మనోరమమై నృత్యగేయములనాచరించెడు స్త్రీలతో క్రిక్కిరిసియున్న తనగృహమును ప్రవేశించాడు-

అచట ప్రణతులైయున్న ప్రకృతిబృందమును చక్క-గా గౌరవించాడు- ఏడురోజులు పట్టణంలో ఉత్సవములు జరిపించాడు- అంతఃపురనివాసియై పదివేలసంవత్సరాలు రాజ్యమేలి చూడాలయను భార్యతో కూడ దేహత్యాగము చేసినాడు- పదివేలసంవత్సరములు సమదృష్టితో రాజ్యమేలి చూడలతో క్రీడించికూడ నిర్వాణమును (మోక్షమును) పొందినాడు- రామచంద్రా! శిఖిధ్వజుడు భయశోకములువీడి మదమాత్సర్యములనువదలి భోగములందు నీరాగుడై సర్వమునందు సమదృష్టిగలవాడై మృత్యువును జయించి పదివేలసంవత్సరములు రాజ్యమేలినాడు-

కనుక రామా! అలాగే నీవుకూడా ప్రకృతకార్యజాతమును అనుసరించుచూ విశోకుడవై ఉండుము- లేక బలాత్కా-రముగనయినను భోగమోక్షజ్ఞానలక్ష్మిలను అనుసరించుచూ వ్యవస్థితుడవుగ నుండుము- అన్నాడు వసిష్ఠుడు-

౧౧౦. ఇష్ట చూడాలోపాఖ్యానము సమాప్తము.

## ౧౧౧. కచప్రబోధము.

వసి॥ రామచంద్రా! శిఖిధ్వజునికథ అంతా నీకు చెప్పితిని- ఈ త్రోవన నడచుచున్నవానికి ఖేదముండదు- రాగద్వేషములను రూపుమాపెడి యీదృష్టిని అవలంబించి నీవు నిత్యమూ విరాగుడవై నిరతిశయానంద పదమును అవలంబించి యుండుము- రామా! శిఖిధ్వజునివలె రాజ్యమేలుము- రాజ్యకార్యములను నెరవేర్చుకొనుచూ భోగమోక్షములను సాధించుము- శిఖిధ్వజునివలెనే బృహస్పతికుమారుడగు కచుడుకూడ తత్త్వబోధ నొందెను- అలాగే నీవుకూడ తత్త్వబోధను పొందుము-

శ్రీరా॥ స్వామీ! బృహస్పతికుమారుడు తత్త్వజ్ఞానమును పొందిన విధమును సంగ్రహంగా చెప్పండి అన్నాడు-

వసి॥ రామా! విను- ఆకథ- కచుడొకానొకనాడు తనతండ్రియగు బృహస్పతిని "సంసారసాగరమును తరించుటెట్లని" అడిగాడు- పరవైరాగ్యముచే జీవుడు సంసారసాగరమును తరింపగలడని తండ్రి చెప్పాడు- కుమారుడు తండ్రిమాటవిని సర్వసంగపరిత్యాగముచేసి ఏకాంతముగ అడవికి వెళ్ళినాడు_ బృహస్పతికి పుత్రవియోగము భయంకరము (దుఃఖకరము) కాలేదు- మహాత్ములకు సంయోగవియోగములు రెండూ సమానములు- ఎనిమిది సంవత్సరములు గడచిన తరువాత కుమారుని పరిస్థితి తెలిసికొనుటకు వెళ్ళిన తండ్రిని (బృహస్పతిని) కలిసికున్నాడు- తండ్రిని పూజించి కౌగలింతనందుకొని తండ్రిని మరల ఇలా అడిగాడు_

తండ్రీ! నేను సర్వత్యాగముచేసి యెనిమిది సంవత్సరములయినది- అయినను నేను విశ్రాంతినొందలేదు" అని తండ్రితో అన్నాడు కచుడు- ఇలా కుమారుడు దీనంగా అడుగుచుండగనే బృహస్పతి "సర్వమేవత్యజ" అంతా విడువుము- అని చెప్పి అంతర్ధానమునొందెను- తండ్రి అంతర్ధానముకాగానే కచుడు శరీరమునుంచి నారచీరనుకూడ

విడచెను- మరల మూడు సంవత్సరములయిన తరువాత తండ్రిని కలిసి కొనెను- ఆతనిపూజించి గద్గదస్వరంతో ఇలా అడిగాడు- "నాయనా! దండకమండములుకూడ విడచితిని- అయినా నాకు స్వస్వరూపమునందు విశ్రాంతి చిక్కలేదు- ఏమి చెయ్యాలి ?

బృహా॥ నాయనా ! చిత్తమును సర్వమని అంటారు పెద్దలు- దానిని విడిచితే నీవు విశ్రాంతిని పొందగలవు- చిత్తత్యాగమే సర్వత్యాగమని పెద్దల అభిప్రాయము- అన్నాడు తండ్రి-

వసి॥ రామా ! ఈమాటలుచెప్పి కొడుకునకు వెంటనే గగనమండలాని కెగిరినాడు- తండ్రిని విడువజాలక కుమారుడుకూడ వెంటనంటెను- తండ్రి కనిపింపలేదు- తానే ఆ అడవిలో చిత్తమునుగురించి ఆలోచించుకొనెను- ఎంత ఆలోచించినా అతనికి తెలియలేదు- పిదప తండ్రిని గురించి చింతించెను- దేహేంద్రియాది పదార్థములు యేవీ చిత్తముకాదు- చిత్తమననేది! అదెక్కడనుండును? వ్యర్థముగా దేహాదులను విడిచిన లాభమేమి? కనుక చిత్తమనే మహాశత్రువును కనిపెట్టుటకు తండ్రియొద్దకు వెళ్లెదును- ఆయనవల్ల తెలిసికొని వెంటనే చిత్తమును విడచెదను" అని ఆలోచించుకొని ఆకచుడు స్వర్గమునకు వెళ్ళినాడు- అట తండ్రిసికలిసి అనురాగముతో నమస్కరించి ఆయనగారు ఏకాంతమునందుండగా "నాయనా చిత్తమనేది ఏది ? చిత్తమనగా ఫలానిది"అని మీరు తెలపివ్వండి- నేను దానిస్వరూపం తెలుసుకొని విడిచిపెడతాను- అన్నాడు కచుడు-

బృహా॥ కుమారా ! చిత్తమనగా అహంకారము ప్రాణికి లోపల ఉండే "అహం" నేననే భావమే చిత్తమని అంటారు చిత్తజ్ఞులు- (అనగా జీవన్ముక్తులు) అని తండ్రి జవాబు చెప్పాడు-

నాన్నా ! ముక్కోటిదేవతలకు గురువగు మహానుభావా! అహంకారమనగా ఆత్మయని లోకంలో ప్రసిద్ధికలదు- దానిని విడిచి

వచో ఆత్మత్యాగమే యగును— అపుడు నైరాత్మ్యము (స్వరూపహాని) సిద్ధించును— ఇంక విశ్రాంతి యెవరికి? ముక్తి యెవరికి? అన్నాడు కచుడు—

బృహ॥ కుమారా! పూలు తుంచడము, కన్నుమూయుటము కంటెకూడా అహంకారత్యాగము సుకరము— అవిషయమై క్లేశము లేశమాత్రములేదు— అది ఎలాగో చెబుతావిను— అజ్ఞానజన్యమయిన వస్తువు జ్ఞానమువల్ల నశిస్తుంది— వస్తుతః అహంకారమనేదిలేదు— అది వట్టి మాయ— భ్రమ— పిల్లవాడనుకున్న దయ్యమువలె లేని అహంకారమే ఉన్నట్లు భాసిస్తుంది— త్రాటియందు సర్పము గోచరించినట్లును మరుభూమియందు ఉదకము గోచరించినట్లును చంద్రునియందు ద్విత్వమువలె అహంకారమనేది మిథ్యావభాసము— కనుక ఇది సత్యమూ కాదు— అసత్యా కాదు— అద్యంతములు లేనిదీ లోపలా వెలుపలా నిర్మలమయినదీ ఆకాశముకంటెకూడ అతిస్వచ్ఛమయినదీ చిన్మాత్రమయిన తత్త్వమొక్కటికలదు— కనుక సర్వము మిథ్యయయిననూ దీని వేదనము (జ్ఞానము) మాత్రముకలదు— అయ్యాది నిఖిలజంతువులందును స్వయం ప్రకాశము— అద్వితీయము— ఇట్టిస్థితిలో అహంభావ మెక్కడిది? ఇది ఎక్కడనుంచి పుట్టింది? ఎలాపుట్టింది? ఎండుమట్టి నీటినుంచి పుటుతుందా? నిప్పునుంచి నీరు పుటుతుందా? విలక్షణస్వభావముగల వాటిలో ఒకదానివల్ల మరొకటి పుట్టటం అసంభవం—

కాబట్టి కుమారా! "నీవు నేను" అనే భావాన్ని విడిచిపెట్టు— పరిమితాకారమయిన ఆభావం అతితుచ్ఛము— నీస్వరూపము దేశకాలా పరిచ్ఛిన్నము— స్వచ్ఛము— చిన్మాత్రము— కచుడా! అఖండాద్వయ సన్మాత్రస్వరూపుడవయిన నీకు ఈపరిచ్ఛిన్నమయిన అహంభావమేమిటి? అన్నాడు తండ్రి—

ఇట్లు ౧౧౧వ కచప్రబోధముగిసెను.

## ౧౧౨. ఆకాశరక్షణము (మిథ్యాపురుషాఖ్యానము)

వసి॥ ఇలా కచుడు తండ్రివల్ల అత్యుత్తమమయిన యోగమును ఉపదేశముపొంది జీవన్ముక్తుడయినాడు బృహస్పతి పుత్రుడు- రామా! నీవుకూడా అలాగే అహంకారమనేది లేసిదని గ్రహించి మానంగా ఉండుము- దానిని విడువ నవసరములేదు- ఉన్నదానిని విడిచిపెట్టాలి అసలే లేకపోతే దాన్ని విడిచిపెట్టడం ఎలా? లేని కుందేటి కొమ్మును పట్టుకొనుట ఎలా! విడిచిపెట్టటం ఎలా? అహంకారమనేదే లేకపోతే నీకు మరణజన్మములుఎలా! ఆకాశంలో విత్తనాలుచల్లి పైరుకోసి నూర్చుకునేవాడు యెవ్వడయినఉండునా? కనుక నీవుచిన్మాత్రుడవు-నీటి నుంచి తరంగాలూ సువర్ణమునుంచి కేయూరాదులూ భాసించినట్లు చిదాత్మయే అహంకారముగా భాసిస్తోంది అజ్ఞానంచేత- కనుక ఇది అంతా మాయామయము- జ్ఞానంచేత నీవు బ్రహ్మస్వరూపుడవు కాగలవు- దుఃఖింపకుము- శరత్కాలపు మంచువలె ఈసంసారమాయ అతి గాఢమయినది- ఇత్యాది బోధవల్ల క్షయించును- అన్నారు వసిష్ఠులు-

రాము॥ మునీంద్రా! జ్ఞానామృతంచేత లోపల పరమతృప్తుడనయినా అనావృష్టిచే భయపడిన చాతకపక్షి ధారావర్షమున తృప్తి చెందినట్లు అమృతంతో తడిసినాను- స్నానమాడితిని- నిరుపమాన సంపదలకు పైననుంటిని- అయినా చంద్రకిరణములకు చకోరపక్షి తృప్తి పడినట్లు మీమాటలకు నేను తృప్తి చెందను- తృప్తిచెందినను మరల ప్రశ్నించుచున్నాను- ఎవడు ఎంతెగ తృప్తిచెందిన యెదుటనున్న అమృతమనే పాయసమును వదలడుకదా! కనుక మహర్షీ! మిథ్యాపురుషుని కథ చెప్పండి- వీడు లేనిదానిని ఉన్నట్లు చేస్తాడట- ఉన్నదానిని లేనట్లు చేస్తాడట- వీని చరిత్ర వినాలనిఉంది- ఆలసించక శెలవివ్వండి-

వసి॥ రాఘవేంద్రా! విను ఆకథ- మహారమణీయంగా ఉంటుంది- నవ్వొలుకుతూ ఉంటుంది-

రామా! ఒకానొకపురుషుడు మాయాయంత్రంలో తయారయినాడు- పట్టిమూఢుడు- విజనప్రదేశంలో పుట్టాడు- శూన్యరూపుడై ఉన్నాడు- ఆకాశంలో వెంట్రుకలకొప్పువలెనూ, మరుభూమిలో నీటి ప్రవాహమువలెనూ, అక్కడ వానికంటె వేరేమిలేదు- ఉన్నదేనో వాడే- ఉన్నట్లు గోచరించే వస్తువును వాడు అభాసగానే చూస్తున్నాడు- అలాంటివానికి వృద్ధిపొందాలని కోరిక కలిగింది- "నేను ఆకాశమునకు ఉపజీవకుడను- (అనగా ఆకాశమువల్ల బ్రతుకువాడను) ఆకాశము నాకు ఉపజీవ్యము- అనగా ఆకాశమునన్ను బ్రతికించునది- కనుక ఆకాశరూపుడనయిన నేను ఆకాశాన్ని ఆవరించి రక్షించుకుంటాను-" అని ఆలోచన కలిగింది-

ఇలా ఆలోచన కలిగి ఆకాశంరక్షణకు ఇల్లుకట్టుకున్నాడు- అయింటిలో నేను ఆకాశాన్ని ఇక్కడ దాచుకొని కాపాడుకున్నాననే మమకారాన్ని ముడివేసుకున్నాడు- అంచేత గృహాకాశంతో సంతోషించాడు- పిదప కొంతకాలానికి ఆయిల్లు నాశనమయినది- "హా! గృహాకాశమా! నీవు నాశమయితివికదా! ఎక్కడికి వెళ్ళావు? ఎక్కడ ఉన్నావు? అని పలుమారు ఏడ్చినాడు! తర్వాత తనరక్షణకొరకు కూపమును (బావిని) త్రవ్వించుకున్నాడు- దానియందు మమకారపడినాడు- కాలవశంచేత ఆబావి (కూపం) కూడ చెడిపోయింది- నాశమయింది- దానికొరకు కొన్నాళ్లు ఏడ్చాడు- ఆయేడ్పు తగ్గినతర్వాత కుంభమును (కుండను)తయారుచేసికున్నాడు- అఘటాకాశంమీద మమకార మేర్పరచుకున్నాడు- దానితో కొంతకాలం తృప్తిచెందాడు- కాలవశంచేత అదికూడా నశించింది- దరిద్రుడు ఏదిక్కుకుపోతే ఆదిక్కే నాశమవుతుంది- (లేక ఆదిక్కునే వాడికి దారిద్ర్యం తయారవుతుంది) అన్నట్లు అయింది అతనిపని- కుంభాకాశంకొరకు ఏడ్చిఏడ్చి స్వరక్షణకొరకు కుండమును (అనగా గోతిని) తయారుచేసికొన్నాడు- దానిమీద మమకారంతో కొంతకాలం తృప్తిపడ్డాడు- అదికూడా కొంతకాలానికి నశించింది- దానికొరకు కొన్నాళ్లు ఏడ్చాడు-

తరువాత నలువైపుల శాలలుగల మహాశాలను (సభాకారమయిన గృహమును) నిర్మించుకొన్నాడు- అదికూడా కొంత కాలానికి నశించింది- దానికోరకు దుఃఖించాడు- ఏడ్చియేడ్చి కుసూలమును (రోటిని) తయారుచేసికొన్నాడు- కాలమనేది దానినికూడా నాశనం చేసింది- దానికోరకు అంతములేకుండా పరితాపపడ్డాడు- ఇలా గృహ, చతుశ్శాల, కుంభ కుండ, కుసూల, ముసలములచే, ఆ మిథ్యాపురుషునకు పర్యవసానం ఏమీ కలుగలేదు- ఫలితమూలేదు- కాలమతిక్రమించి పోతూనే ఉన్నది- కనుక శ్రీరామచంద్రా ఆ మిథ్యాపురుషుడు గృహాద్యాకాశములు తనకు రక్షకములని గ్రహించి వాటిమీద అభిమానమును పెంచుకొని వాటి రాకపోకలతో అతిమూఢుడై వాటి నిర్మాణ రక్షణ వినాశములందు దుఃఖాతిదుఃఖములనొందెనుగాని పొందిన ఫలితము లేదు-

ఇట్లు ౧౧౨వ సర్గ ముగిసినది-

## ౧౧౩. మిథ్యాపురుషోపాఖ్యానము.

శ్రీరా॥ మునీంద్రా ! మిథ్యాపురుష శబ్దమున కర్థమేమి? ఆకాశరక్షణ శబ్దమున కర్థమేమి? ఈకథకు పరమతాత్పర్యమేమి? అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ రామా ! విను- ఈకథకు తాత్పర్యం చెబుతాను- మిథ్యాపురుషుడనగా అహంకారము- ఈయది బ్రహ్మాధిష్ఠితమయిన మాయాకాశమునందు బుట్టినది- దీనికి నిజంలో స్వరూపం లేదు-ఇదీ మాయయే- ఇది యిష్టము, ఇది అనిష్టము, అనే వికల్పాలను అనేకము పుట్టిస్తుంది- అది తనను కాపాడుకొనుటకు అనేకశరీరాలను కామ, కర్మ, వాసనల ననుసరించి సృజిస్తుంది- ఎన్ని శరీరాలు నశించినా మాటిమాటికి పుట్టిస్తూనే ఉంటుంది- కాబట్టి ఈఅహంకారమే మిథ్యాపురుషుడనీ మాయాపురుషుడనీ చెప్పినాను- ఈఅహంకారానికి లోకంలో జీవుడు, బుద్ధి,

మనస్సు, చిత్తము, మాయ, ప్రకృతి, సంకల్పము, కలన, కాలము, కల, అను పేరులనేకములుకలవు— ఈపేర్లు దీనికి సార్థకములు చూడు—

౧. ప్రాణధారణమువలన జీవుడని పేరు—
౨. బాహ్యార్థము అధ్యవసాయము(నిశ్చయము)వల్ల బుద్ధిఅని పేరు.
౩. బాహ్యార్థ మననమువల్ల మనస్సు అనిపేరు.
౪. బాహ్యార్థ చింతనమువలన చిత్తము అనిపేరు.
౫. అసత్కల్పనమువలన (లేనివాటిని పుట్టించుటవలన) మాయ.
౬. పరిణామ స్వభావము కలదగుటవలన ప్రకృతి.
౭. సంకల్పనమువలన సంకల్పము.
౮. సంకల్పితార్థమును తయారుచేయుటవలన కలన;
౯. విపరిణామాదులకు నిమిత్తమగుటచే కాలము.
౧౦. అందు ఏకదేశభేదమును కల్పించుటచే కలా— అనిపేర్లు ప్రసిద్ధములు.

ఇవికాక ఇంకను కొన్నిపేర్లు కలవు— అహంకారము— సహస్ర రూపములతో విజృంభించినది— పరిపూర్ణమగు బ్రహ్మయందు మొట్ట మొదట శూన్యరూపమయిన భూతాకాశము విస్తరించేసరికి, అందు వాయ్వాదులను కల్పించుచూ క్రమంగా జగత్తు కల్పింపబడినది— గంధర్వ నగరమువలె నిర్భిత్తి కుడ్యాద్యావరణ శూన్యమే యుక్తితో విమర్శిస్తే నిశ్చితమగుచున్నది— అచ్ఛిద్రమయిన పరబ్రహ్మమునందు ఛిద్రరూపమయిన ఆకాశముపుట్టదు— అయ్యది శూన్యమై అతివిస్తృతమై అచలమయితే అందు చలనస్వరూపమయిన వాయువు పుట్టటం ఎట్లు? నీరూపమూ, (రూపరహితమూ) అనుష్ణమూ అయిన వాయువు నుంచి తద్విరుద్ధస్వభావమయిన అగ్ని ఎలాపుట్టును? ఉష్ణము దాహ స్వభావముకలదయిన అగ్నివలన తద్విరుద్ధమయిన శైత్య, ఆప్యాయన స్వభావముగల నీరు ఎలాపుట్టును? ద్రవత్వ, శోవత్వ, కాఠిన్య, స్వభావ ములుగల నీరు తద్విరుద్ధ స్వభావముగల పృథివిని యెలాపుట్టించును?

కావున ప్రపంచకల్పనము నిరాధారము- ఇలాగంటి ప్రపంచంలో పురుషుడు మిథ్యగానే సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు- కనుక రామా! మిథ్యాపురుషుడు ఘటాకాశాదులవలన దుఃఖమనుభవించినటుల నీవు దుఃఖపడకుము- ఆకాశముకంటె శుద్ధమూ, సూక్ష్మమూ అయిన ఆత్మ ఎవరివలన ఎలా రక్షింపబడతాడు- కనుక ప్రాణులందరూ "వాడుపోయాడు, వీడుపోయాడు" అని వ్యర్థంగా దుఃఖిస్తున్నారు- ఘటాదులు నశించినా తద్గతమయిన ఆకాశము నశించదు- అలాగే దేహములు నశించినా దేహి నశించడు- అతడు శుద్ధచిన్మాత్రరూపుడు- అతనికి జన్మమరణములు లేవు- బ్రహ్మయే జగద్రూపముగ వివర్తమగుచున్నాడు- అతడు శాంతుడు ఆదిమధ్యాంతరహితుడు- సత్యస్వరూపుడు అని తలచి సుఖముగ నుండుము-

రామా! అహంకారము నిఖిలాపదలకు నిలయము- అధ్రువము- అస్వతంత్రము- అజ్ఞము- వినాశము- అవివేకము- కనుక దీనిని విడిచిపెట్టి నిష్కృష్టచిన్మాత్రమునందుండి సర్వోత్తముడ వగుము-

ఇట్లు ౧౧౩వ సర్గ సమాప్తము.

## ౧౧౪. పరమార్థోపదేశము.

వసి॥ రామా! సృష్టిప్రారంభకాలంలో సర్వప్రపంచవికల్పనలకు పూర్వము మనస్సు అనేది పరబ్రహ్మమునందు అపృథక్సత్తకలదై యుంటూ ఇతరకల్పనలకు కారణమగుచున్నది- పూమొగ్గయందు పరిమళమువలె సాగరమున తరంగమువలె సూర్యునియందు కిరణజాలము వలె బ్రహ్మయందు మనస్సు అపృథక్సత్తగా నున్నది- ఆత్మతత్త్వమును విస్మరించి అజ్ఞానముచే సర్వకల్పనలకు మూలమయినది- రామా! ప్రపంచము బ్రహ్మవివర్తమే వేరుకాదు- రజ్జువే భుజంగము- సూర్యుని కంటె రశ్మిజాలము వేరనుకొనెడి వానికి అది రశ్మిజాలముగనే తోచును- కనకముకంటె కేయూరము వేరనుకొనువానికి కేయూరమే అది-

కనకముకాదు- కిరణములు ఆదిత్యాభిన్నములనుకొనువానికి అయ్యవి ఆదిత్యుడే వానికి అప్రహాదిత్యుడు నిర్వికల్పుడు- సలిలముకంటె తరంగము వేరనుకొనువానికి తరంగబుద్ధిగానే యుండును- నీరనుబుద్ధి యుండదు- తరంగము సలిలాభిన్నమని భావించినపుడు నిర్వికల్పమగు సలిల సామాన్యబుద్ధియే మిగిలియుండును- అలాగే కేయూరము కనకాభిన్నమని భావించితే నిర్వికల్పమగు కనకసామాన్యబుద్ధే మిగిలేది- జ్వాలమాల అగ్నికంటె వేరనిభావిస్తే అగ్నిబుద్ధిపోతుంది- జ్వాలఅనే బుద్ధే ఉంటుంది- "జ్వాలాజాలము మేఘపంక్తి" యను బుద్ధి ఉదయించినపుడు తదాకారమునుచెంది తద్గతమయిన చలన ఊర్ధ్వగమన ఋజువక్రత్వాదులను కల్పిస్తుంది- ఇలా కల్పితాకారానువిద్ధమయిన బుద్ధి దానియందే ఆదరమునుచెంది తన్మూలములయిన ఇతరకల్పనలను కలుగజేయును- "జ్వాలామాల పావకాభిన్నము" అనేబుద్ధి పుట్టినపుడు (అని భావించినపుడు) నిర్వికల్పమగు అగ్నిబుద్ధియే మిగిలియుండును- నిర్వికల్పబుద్ధి సత్యము- దానికి చావులేదు- అదియె సవికల్పవస్తువులందు సత్యబుద్ధితో ఆసజ్జితమవును-

కనుక నీవు నానాత్వబుద్ధిని వదలి నిర్వికల్పమగు శుద్ధచిన్మాత్రబుద్ధితో నుండుము- సంవేద్యమును వదలి సంవిత్త్వమును గ్రహించుము-అదేసంవిత్త్వము స్వప్రకాశస్వరూపంతో సంకల్పనరూపశక్తిని ఎప్పుడు అవలంభిస్తుందో అప్పుడే మనస్సు అగును అది- అప్పుడు అది సంవిత్తుకంటె వేరుగ భాసించును- కనుక సంవిత్త్వమే మనస్సు అగునుకాని మనస్సు అనేది సంవిత్తుకంటె వేరుకాదు- ఈమనస్సు దేనిని సంకల్పించునో అది అల్లా అయిపోతుంది- కనుక మనస్సే జీవ, అహంకార, బుద్ధి చిత్తాది నామములను ధరించును- కనుక ప్రపంచంఅంతా సంకల్పమయము- ఇది సత్యముకాదు- అలీకమూ(తుచ్ఛమూ) కాదు- స్వప్నజాలమువలె మిథ్య-

ఈ ప్రపంచంఅంతా హిరణ్యగర్భునియొక్క మనోరాజ్యము- కనుకనే తత్త్వజ్ఞానముచే ఇది ప్రవిలయము చెందును- దృశ్యజాతము

అపరమార్థదృష్టిలో నున్నపుడు శతశాఖలుగా పెరిగిపోవును- పరమార్థముగ జూచినపుడు ఇది యేమాత్రమూ ఉండదు- జల, ఊర్మి, తరంగ, ఫేన, కల్పనల రూపమును సముద్రము ధరించినట్లు చైతన్యమే ప్రపంచ రూపాన్ని ధరిస్తుంది- వేయిపనులు చేయు జీవుడుకూడ చిదాభాసయుక్తమయిన మనస్సుయొక్క స్పందమును విడచి కూటస్థచైతన్యమునకు క్రొత్తగా చేయు వికారమేమీలేదు- కనుక రామా! నీవుకూడా తుచ్ఛతరమయిన భేదభావమును విడచి గమనాది వ్యవహారములను చేయుచున్నను "జగద్రూపమయిన ద్వైతము క్రొత్తదికాదు- ఇది సత్యము కాదు- పూర్వసిద్ధమయిన బ్రహ్మయె పరమార్థసత్యముగ కలదు" అని భావించుచుండుము-

బ్రహ్మ ప్రబృంహితాకారము-అనగా సర్వవ్యాపకము- తద్భిన్నమేమియు లేదు- పదార్థజాతమంతా సంవిత్తుయొక్క సారమయము- కాన ఇదియంతయు సంవిత్తు రయే- సంవిత్స్ఫురణమాత్రమయిన జగజ్జాలంలో "ఇది వేరు అది వేరు" అనే బుద్ధి మిథ్యాగ్రహము- నిఖిలాకారములందును ఒక్కసంవిన్మాత్రమే యుండుటవలన సంవేద్యమూలేదు- తన్నిమిత్తమూ లేదు- ఇక బంధమోక్షము లెట్లుండును?

కనుక రామా! "ఇది మోక్షము, ఇది బంధము" అని చింతను విడువుము- ఇంద్రియనిగ్రహము కలిగి మానమదాభిమానములను వీడి, స్వోచితమయిన రాజ్యాదికార్యములను చేయుచూ నిరహంకారుడవై యుండుము-

ఇట్లు ౧౧౮వ సర్గ ముగిసెను.

## ౧౧౯. వ్రతత్రయనిరూపణము.

వసి॥ రామా! పుణ్యపాపాదిశంకలు విడిచిపెట్టు- ధైర్యమవలంబించు- మహాకర్తవు, మహాభోక్తవు, మహాత్యాగివి యగుము-

శ్రీరా॥ మునీంద్రా! మహాకర్త యొక్క లక్షణమేమి! మహాభోక్త యొక్క లక్షణమేమి! మహాత్యాగియొక్క లక్షణమేమి! యీ ముగ్గురి లక్షణములను చెప్పండి దయచేసి అని అడిగాడు శ్రీరాముడు—

వసి॥ రామా! ఈమూడును మూడువ్రతములు పూర్వం ఈశ్వరుడు భృంగీశ్వరున కుపదేశించాడు— చెపుతా వినుసీకు— పూర్వము మేరుశిఖరంమీాద సమగ్రపరివారంతోనుండు కొద్దిగ ఆత్మజ్ఞానంగల భృంగీశుడు ప్రణతుడై దోశెలియొగ్గి తండ్రినడిగాడు—

భృంగి॥ నాన్నా! నీవు సర్వజ్ఞుడవు— నేనడిగిన దానిని కృపతో వెంటనే చెప్పండి— తరంగజాలమువలె చంచలమయిన సంసారరచనను చూచి మోహపోవుచున్నాను— సంసారమనే జీర్ణగృహంలో ఏమి సుఖమున్నదని ఉందుము!

ఈశ్వ॥ శ్లో॥ సర్వాఃశంకాః పరిత్యజ్యధైర్యమాలంబ్య శాశ్వతమ్।
మహాభోక్తా మహాకర్తా మహాత్యాగీ భవానఘ ॥

అని జబాబు చెప్పాడు— నీవడిగినట్లే ఆముగ్గురి లక్షణము చెప్పుమని అడిగాడు భృంగి—

ఈశ్వ॥ భృంగీశా! విను వీరిలక్షణాలు చెబుతాను—

౧. కర్తృత్వ భోక్తృత్వాది శంకలులేక ధర్మాధర్మములాచరించువాడు మహాకర్త—
౨. రాగద్వేషములను, సుఖదుఃఖములను, ధర్మాధర్మములను ఫలాఫలములను అపేక్షించక నిష్కామముగ లోకసంగ్రహముకొరకు చేయువాడు మహాకర్త—
౩. మానముకలవాడై అహంభావములేక మాత్సర్యమును విడచి ఫలము సిద్ధింపలేదని ఉద్వేగమును చెందక చేయువాడు మహాకర్త—
౪. శుభాశుభకార్యములందు నిర్లిప్తమతితో చేయువాడు మహాకర్త—
౫. అంతట విగతస్నేహితుడై సాక్షివలె నుండుచు నిరీహతో చేయువాడు మహాకర్త—

౬. భయసంతోషములు లేకుండ సర్వసమమగు బుద్ధితో చెడినదానికి దుఃఖించక బాగుపడినదాని కానందించక చేయువాడు మహాకర్త-

౭. ప్రారబ్ధోపనీతమయిన ప్రయోజనము సంభవించినప్పుడు అసంసక్తుడై ప్రయోజనానుకూలంగా ఆచరించువాడు మహాకర్త-

౮. కర్తృత్వమునువహించక ప్రారబ్ధాధీనుడై విహితసిద్ధకర్మల నాచరించుచూ సమభావముతో నుండువాడు మహాకర్త-

౯. స్వభావతః శాంతుడై సర్వసమత్వమువిడువక శుభాశుభములను ఆచరించువాడు మహాకర్త-

౧౦. జన్మాదిషడ్భావ వికారములుగల శరీరములందు నిర్వికార సన్మాత్రాత్మదర్శనమువలన సమమతితో నుండువాడు మహాకర్త-

గమనిక॥ ఇందు పరస్పరసాంకర్యముకలదు- వసిష్ఠోపదిష్ట శ్లోకముల ననుసరించి వ్రాసితినే కాని లక్షణవైలక్షణ్యమును ప్రతిపాదింప దలచికాదు-

రామా ! ఇక మహాభోక్తను చెప్పెదను-

౧. దేనిని ద్వేషించక, దేనిని కాంక్షించక, ప్రారబ్ధోపనీతమును అనుభవించువాడు మహాభోక్త-

౨. ఇంద్రియములతో విషయములను గ్రహించుచున్ననూ, అద్వయాసంగాత్మయందు ప్రతిష్ఠితుడయినందున స్వీకరించని (గ్రహించని) వాడును హస్తపాదాదులతో గమనాదులను ఆచరించుచున్నను, నిష్క్రియాత్మబుద్ధితో ఆచరించనివాడును మహాభోక్త-

౩. సుఖదుఃఖములచేతను, జయాపజయములచేతను, లాభాలాభములచేతను, మనస్సు విక్షేపము చెందనివాడు మహాభోక్త-

౪. జరామరణములు, ఆపదలు, రాజ్యము, దారిద్ర్యము ఇవిఅన్నీ బ్రహ్మదృష్టితో రమ్యమను కొనువాడు మహాభోక్త-

౫. గొప్పసుఖమును, గొప్పదుఃఖమును కాని, రెంటిని సమానముగా అనుభవించదలచినవాడు మహాభోక్త-

౬. అహింసా, సమతా, తుష్టులు, చంద్రబింబమునుంచి కిరణములవలె రాకపోకలు కలిగియుండువాడు మహాభోక్త-

౭. కట్వామ్లలవణములనుకాని తిక్తమునుకాని మృష్టామృష్టపదార్థములనుకాని, అథవా పదార్థములనుకాని, సమానముగ భుజించువాడు మహాభోక్త-

౮. సరసవస్తువునుకాని, నీరసవస్తువునుకాని, సురతమునుకాని, విరతమునుకాని, సమానముగ జూచువాడు మహాభోక్త-

౯. ఉష్ణమును, శీతమును, శుభమును, అశుభమును, సమానముగ జూచువాడు మహాభోక్త-

౧౦. "ఇది భోజ్యము, ఇది "అభోజ్యము" అనే భావమును విడిచి నిరభిలాషగా అనుభవించువాడు మహాభోక్త-

౧౧. సంపదాపదలను, ఉత్కృష్టాపకృష్టాన్నాచ్ఛాదనాదులను సమబుద్ధితో అనుభవించువాడు మహాభోక్త-

ఇక మహాత్యాగ లక్షణమును చెప్పెదనువినుము-

౧. ధర్మాధర్మములను, సుఖదుఃఖములను, జన్మమరణములను, మిథ్యాత్వబుద్ధితో విడిచినవాడు మహాత్యాగి-

౨. సర్వేచ్ఛలను, సర్వచేష్టలను, సర్వనిశ్చయములను, మిథ్యాత్వబుద్ధితో విడిచిపెట్టినవాడు మహాత్యాగి-

౩. దేహదుఃఖములను, మనోదుఃఖములను, ఇంద్రియదుఃఖములను, మిథ్యాత్వబుద్ధితో విడిచినవాడు మహాత్యాగి-

౪. "నాకు దేహములేదు, నాకుజన్మలేదు, విహితనిషిద్ధకర్మలు నావికావు" అని లోపలనిశ్చయము గలవాడు మహాత్యాగి-

౫. శారీరమగు ధర్మాధర్మములు, మనోమననము, వాగాదీంద్రియచేష్టలు, వీటిని లోపల పరిత్యజించినవాడు మహాత్యాగి-

౬. దృశ్యజాలమంతయును సమ్యగ్జ్ఞానముచే బాధింపచేసికొని విడిచిపెట్టినవాడు మహాత్యాగి-

రామా! దేవదేవుడగు పరమేశ్వరుడు భృంగీశ్వరునికొరకు ఇలా చెప్పాడు- ఈదృష్టిలోనుండి నీవుకూడ వీతరాగుడవు, వీతశోకుడవు అగుము-

రామచంద్రా! నీవు నిరంజనుడవై విమలాత్మరూపుడగు బ్రహ్మయే నేను తదితర ప్రపంచములేదు అనియే భావించుము- అలా భావించి ఆభావనా మహిమచే ఇతరవృత్తులను శాంతింపజేసికొని, నిర్వాణమును పొందుము-

ఓయి! ఈప్రపంచంలో నేదిభాసిస్తుందో అయ్యాది ద్విపరార్థావధి కాలావయవములయిన సమస్తకల్పములందును ప్రసిద్ధములయిన సర్వ కార్యములకు మూలకారణమై జన్మాదివికారశూన్యమైన పరమాత్మ రూపమయిన బ్రహ్మమే- ఇయ్యది సర్గభేదముచే వృద్ధినొందించబడిన సర్వభావ వికల్పములుకలది అయినప్పటికి వికల్పశూన్యమయినదియే-

స్థూలసూక్ష్మమగు పదార్థజాతమేదియు సదా ఏకరసమయిన బ్రహ్మకంటె వేరుకాదు- కాబట్టి నాయనా! నేనేబ్రహ్మను" అనే దృఢనిశ్చయం కలవాడవయి మొదటసమాధ్యభ్యాసబలముతోనుండి క్రమంగా సప్తమభూమికను అధిష్ఠించి గతాశంకుడవై (నిశంకతో) ఉండుము-

ఓ రామా! నీవు అంతర్ముఖుడవై అహంకారమును నిరాకరించు కొన్నవాడవయినచో బాహ్యపనులను చేయుచున్నను ఎన్నటికి భేదమును పొందవు.

ఇట్లు ౧౧౯వ సర్గ ముగిసినది.

## ౧౨౦. గలితచిత్తలక్షణము.

శ్రీరా॥ మునీంద్రా! వాసనాక్షయముగల మనస్సునకు లక్షణమేమి? సెలవివ్వండి-

వసి॥ రామచంద్రా! లోభమోహాది దోషములు నశించుటయే వాసనాక్షయముగల మనస్సునకు ముఖ్యలక్షణము- పరులు పరీక్షకొరకు

కలుగచేసినను, లోభమోహాదులు చిత్తమును కలవరపరచకూడదు— ఇదియే వాసనాక్షయమునకు ముఖ్యలక్షణము— ముఖముప్రసన్నముగ నుండుటకూడ దానిలక్షణమే— వాసనాగ్రంధులు మెల్లమెల్లగ విడిపోవును. కోపము కృశించును— మోహము మందగించును. కామము సన్నగిలును— లోభము పలాయితమగును— ఇంద్రియములు పెద్దగా ఉల్లాసచెందవు— ఎక్కువగా ఖేదమును జెందవు— దుఃఖములుదయించవు— సుఖములు చలించవు— చల్లని సమత అంకురించును— ఒకవేళ సుఖదుఃఖాదులుకూడ ముఖధమునందు కనిపించినా మిథ్యాత్వబుద్ధిచే బాధితములయినందున చిత్తమునకు లేపకములు కావు. ఇట్టివాడు దేవతలకుకూడ స్పృహణీయుడగును— చక్కని సమతాదృష్టి అతని కుదయించును— శరీరము, శాంతము, కాంతమునగును— అతివినీతముగ నుండును. పరేచ్ఛా విఘాతకముగాదు— భాగ్యములతోను, దారిద్ర్యములతోను విషమము యినను మతి ఆనందము కోరకుగాదు— సుఖము కోరకుగాదు— బుద్ధిప్రకాశిచే సాధింపతగిన పరమాత్మవస్తువునందు ప్రవర్తింపని నరాధముని జన్మ నిరర్థకము.

రామా! దుఃఖమనే రత్నములకు ఆకరమయిన సంసారసాగరమును తరింపగోరిన పురుషునకు ప్రపంచాతీతమయిన నిరతిశయానందాత్మయందు విశ్రాంతినొందుటకు "నేనెవరు! ఈజగత్తు ఏది?" (మి) "పరమాత్మతత్త్వ" మెట్టిది? "తుచ్ఛములగు భోగములతో ప్రయోజనమేమి?" అని నిరంతరము అభ్యసించెడి విచార వైరాగ్యాత్మకమయిన బుద్ధియే మొదటి ఉపాయము— కనుక దానినే నీవాశ్రయించుము—

ఇట్లు ౧౧౬వ సర్గ ముగిసినది—

## ౧౧౭. ఇక్ష్వాకు మనుసంవాదము.

వసి॥ రామచంద్రా! మీవంశంలో ఆదిపూరుషుడగు ఇక్ష్వాకువు ముక్తుడయిన విధానము చెపుతా వినుము—

ఇక్ష్వాకువను రాజు రాజ్యపరిపాలన చేయుచూ, ఒకానొకపుడు ఏకాంతమునందుండి "జరామరణముల సంక్షోభముచే సుఖదుఃఖాత్మక మయిన ఈదృశ్యప్రపంచమునకు కారణమేమని" స్వయముగ ఆలోచించుకొనెను- అతనికేమీ తోచలేదు-ఒకపుడు బ్రహ్మలోకమునుంచి వచ్చి తన సభాస్థలిని అలంకరించియున్న మనుప్రజాపతిని పూజించి అడిగెను-

ఇక్ష్వా॥ మహాత్మా! దయానిధీ! మిమ్ముల చూచేసరికి ఏదో అడగాలని నామతికి తోచుచున్నది- ధార్ష్ట్యమవలంబించి అడుగు చున్నాను- "ఈసృష్టి ఎవరినుంచి వచ్చినది? దీని స్వరూపమేమి? ఎలాంటిది? సంఖ్యచేకాని, పరిమాణమువలనగాని యెంతటిది? దీని ననుభవించు వాడెవడు? ఎప్పుడు యెవనిచే నిర్మించబడినట్లు శ్రుత్యాదులు చెప్పుచున్నవి? నేనీఘోర సంసారసాగరమునుంచి విముక్తుడ నయ్యే ఉపాయమెద్ది? చెప్పండి అని అడిగాడు-

మను॥ రాజా! మంచి సారవంతమయిన ప్రశ్న వేశారు- చిర కాలానికి మీకు కలిగిన వివేకానికి అనుగుణంగా ఉంది మీప్రశ్న-

రాజా! దృశ్యప్రపంచం లేదు- గంధర్వనగరం వంటిది- మరు మరీకాజలము వంటిది- కాబట్టి మిధ్యమిధ్యాభూతవస్తువునకు ప్రత్యేక మొక స్వరూపము లేదు- ఈయది సాక్షిగోచరమూకాదు- మనష్షష్ఠేం ద్రియములకును గోచరముకాదు- కాబట్టి లేదంటున్నాను- అవినాశి యగు సదాత్మ ఒక్కడే ఉన్నాడు- కనుక అతడు సదాత్మ అని చెప్ప బడుచున్నాడు- సంసర్గాధ్యాసవల్ల బ్రహ్మసత్తానువిద్ధము జగత్తు అగు గాక- అంతమాత్రమున దానికి స్వతః సత్తలేదు- నేను లేదనుటకూడ యుక్తమే- చిదాభాసలే బ్రహ్మాండత్వమును చెందుచున్నవికొన్ని- మరికొన్ని చతుర్విధ భూతగ్రామము లగుచున్నవి- కాబట్టి బంధము లేదు- మోక్షము లేదు- బ్రహ్మ యొక్కటేకలదు- ఏకత్వమూలేదు- ద్విత్వమూలేదు- ఒక్కనీరు, తరంగ, ఫేన బుద్బుదరూపములతో

స్ఫురించినట్లు-ఒక్క చైతన్యము ప్రపంచరూపముగా స్ఫురించుచున్నది- నీవు బంధమోక్షములనే బుద్ధులను విడచి నిర్భయముగ స్వస్థముగ నుండుము-

ఇట్లు ౧౧౭వ సర్గ ముగిసినది.

## ౧౧౮. ఇక్ష్వాకు మనుసంవాదము.

మను:॥ అయాసంస్కారముతో విచిత్రమయి యున్న అవిద్య యందు ప్రతిబింబ రూపముగానున్న శుద్ధచైతన్యముయొక్క సంవిత్తులు (ఆభాసలు) అవిద్యాసంస్కారములు అంతఃకరణముగా పరిణమించేసరికి తదవచ్ఛిన్నములై జీవత్వము నొందుచున్నవి- ఆజీవులు సమష్టివ్యష్టి మనస్సుయొక్క కార్యమయిన సంసారమునందు సంసరించుచున్నారు- సుఖదుఃఖదశ, మోహము, ఈ రెండును మనస్సుయందే కాని. ఆత్మ యందు లేవు- రాహువు అదృశ్యుడయినను పట్టుకున్న చంద్రుడు దృశ్యుడయినందున తద్వారాదృశ్యుడగు చున్నాడు- అలాగే ఆత్మ అదృశ్యుడయినను దృశ్యమగు అంతఃకరణముద్వారా దృశ్యుడగు చున్నాడు- పరమాత్మ శాస్త్రములచేకాని, గురువుచే దృశ్యుడు కాడు- (తెలియబడడు) చరమసాక్షాత్కార రూపమయిన అంతఃకరణ పరిణామంచేత దృశ్యుడగుచున్నాడు- మార్గస్థులు త్రోవలో రాగద్వేష వియుక్తమయిన బుద్ధితో చూడబడుదురు- అట్లే ఇంద్రియములు విషయములను చూడవలెను- వాటియందు ఆదరముకూడదు- తిరస్కారముకూడదు-ఉదాసీనమయిన పదార్థమాత్రమునుగా చూడవలెను- నేను దేహమను (దేహమే నేనను) బుద్ధి సంసారబంధమునకు కారణము- ముముక్షువుల కట్టిబుద్ధి యెన్నటికిని పనికిరాదు- నేను చిన్మాత్రరూపుడ నను బుద్ధి సంసారబంధకముగాదు- నిర్మలమయిన నీటిలో లోపల వెలుపల అగ్నికలదు- అలాగే సర్వవస్తువులందును లోపల వెలుపల ఆత్మకలదు- బంగారమునకు కేయూరాది రూపసన్నివేశ మెట్టిదో, ఆత్మకు జగద్రూప సన్నివేశముకూడ అట్టిదే- కామమనేది మహార్ణ

వము— వినాశమనేది అందులోని బడబాగ్ని- జగజ్జాలము నదులు- భూతాలు తరంగాలు— అయినా ఆకాలవారిధి పరిపూర్ణముకాకుండా ప్రాగునట్టి మహాగస్త్యుడు ఆత్మ అని నిత్యము భావించు రామా! దేహాది దృశ్యజాలమునందు ఆత్మతాబుద్ధిని విడిచిపెట్టి శుద్ధసత్త్వముతో సుఖముగనుండుము- తల్లి రెండుకుంచములమధ్యపరున్న పిల్లవానిని మరచి పిల్లవానికొరకు ఏడ్చినట్లు జనులు అంతఃకరణగుహాయందున్న ఆత్మకొరకు పరితపించుచున్నారు— ఆత్మ జరామరణరహితుడని గుర్తింపక ఏడ్చుచున్నారు— హా! నేను హతుడను— హా! నేను అనాథను- నశించినాను- అని ఏడ్చెదరు—

రామా! నీవు సంకల్పరహితమయిన చిత్తమును ఆత్మయందుంచి సంకల్పములను శాంతింపజేసికొని వ్యవహారముకొరకు దేహేంద్రియాదులు కదలినా నీవుమాత్రం స్పందరహితమయిన బ్రహ్మవుగ స్వస్థముగ నుండుము— సుఖించుము— రాజ్యమును ఏలుకొనుము—

ఇట్లు ౧౧౮వ సర్గ ముగిసినది—

## ౧౧౯. ఇక్ష్వా.........ము.

మను॥ పరబ్రహ్మ మాయచే స్పందించుట స్పందరహితుడగుటయు ఎట్లు? అను ఇక్ష్వాకువుయొక్క జిజ్ఞాసనుమనువు గుర్తించాడు- సమాధానం చెప్ప నారంభించాడు- రాజా! సర్వవ్యాపకమయిన పరమాత్మకు అవిద్యాశక్తి, విద్యాశక్తి అని రెండుశక్తులుగలవు— అందు అవిద్యాశక్తి ప్రసవధర్మముగలది— అనగా సృష్టిస్వభావముకలది- విద్యాశక్తి, తత్సంహార స్వరూపమయినది- పరమాత్మ అవిద్యాశక్తితో సృష్ట్యాత్మకమయిన స్పందమును చేయును— విద్యాశక్తిచే దానిని సమూలము సంహారమొనర్చి కూటస్థాద్వయ స్వరూపమునందుండును- అనురాగముచే ప్రవర్తించినవానికి సర్గశక్తి ఉదయించినట్లు వైరాగ్యముచే నివర్తించినవానికి సంహారశక్తికూడ సహజముగనే కలుగును-

చంద్ర, అర్క, వహ్ని, తప్తాయః పిండ, రత్నాదులకు, ప్రభా(కాంతి) జ్వాలా ప్రభేదములెట్లు కల్పితములో, చెట్లకు పత్రాదులు, ప్రవాహములకు నీటితుంపురులు, ఎట్లు కల్పితములో అట్లే వ్యాపకబ్రహ్మయందు జగద్వైచిత్ర్యము, తద్గ్రాహక, బుద్ధ్యాది వైచిత్ర్యముకూడ కల్పితము— ఇయ్యది అజ్ఞానులకు దుఃఖప్రదము— జ్ఞానులకు దుఃఖప్రదముకానేరదు—

సర్వవ్యాపక స్వప్రకాశ స్వరూపుడయిన ఆత్మ కనిపించకుండుట లేని (అసద్రూపమయిన) ప్రపంచము స్ఫుటముగా కనిపించుట ఈ రెండునూ అఘటనఘటనా సమర్థమయిన మాయయొక్క బలమువల్లనే కాని మరొకటికాదు. "అద్దమునందు గోచరించెడి నగరాదికమువలె బ్రహ్మయందు జగత్తు ప్రాతిభాసికముగాని, వాస్తవముకాదు" అని భావించు మానవుడు సుఖము నొందగలడు— ఇట్టివాడు అభేద్యమయిన బ్రహ్మకవచుడు కాగలడు. అహమర్థమగు అహంకారమును విడిచి సర్వము శూన్యము, నిరాలంబము, చిద్రూపము, అని భావించువాడు సుఖించును— రమ్యారమ్యబుద్ధియే దుఃఖసంతతికి బీజము. అయ్యది సమతాబుద్ధి అనే అగ్నిచే దగ్ధమగుచో దుఃఖమునకు ప్రసక్తియే లేదు—

రాజా! సమాధ్యభ్యాసబలంచేత దృశ్యమును మరచిపోవలెను— దృశ్యవిస్మృతి అనునది ఒక మహాస్త్రము— దీనిని చేతపుచ్చుకొని రమ్యారమ్యములందు కలిగెడి విషమబుద్ధిని (ఇది ప్రియము ఇది అప్రియము అనుదానిని) దృఢమయిన సమతాదృష్టి రూపమయిన పురుష ప్రయత్నాతిశయముచే నెగగొట్టవలెను— సమాధిలక్షణమయిన అభావనముచేత భావనమును అనగా బాహ్యార్థభావనమును తత్ప్రయోజకమయిన ధర్మాధర్మలక్షణమయిన కర్మకాననమును ఛేదించి పరమాకాశముకంటెకూడ సౌక్ష్మ్యమునుపొంది శోకరహితుడవగుము—

కుమారా! నీవు మొట్టమొదట వివేకవిలాసము గలవాడవగుము. సమాధ్యభ్యాసముచే బాహ్యప్రపంచదృష్టిని రూపుమాపుకొనుము. తదుపరి పూర్ణస్వరూపముతో సర్వప్రపంచ వ్యాపకుడవగుము— పరమా

త్మానందస్పందమును సంపాదించుకొనుము- సంసారవ్యాధిని పారద్రోలుకొని పంచమ షష్ఠ భూమికలందు చాలకాలముండి ఆవల సప్తమ భూమికయందు ఆత్యంతికముగ విక్షేపవైషమ్యమును చంపుకొని సర్వసముడవై పూర్తిగ వాసనారహితుడవయినందున స్వభుడవై నిర్భయుడవై చిద్రూపుడవుగ నుండుము-

ఇట్లు ౧౧౯వ సర్గ ముగిసెను.

౧౨౦. ఇక్ష్వాకుమనుసంవాదమందు సప్తమభూమికావిభాగము.

1. సాధన చతుష్టయసంపన్నుడై గురువునియొద్ద శ్రవణముచేసి జ్ఞానమును సంపాదించుట ప్రథమభూమిక (శ్రవణము)-
2. విచారణ=ద్వితీయభూమిక (మననము)
3. అసంసక్తి=తృతీయభూమిక (నిదిధ్యాసనము)
4. విలాపనీ=చతుర్థభూమిక (వాసనాక్షయము)
5. శుద్ధసంవిన్మయీ=పంచమభూమిక-
6. స్వసంవేదనరూపా=షష్ఠభూమికా-
7. ఆనందైకఘనాకారా=సప్తమీభూమికా-

ఈ యేడవభూమిక కేవలము ముక్తియే-

ఈయవి గ్రంథాంతరమున మరొకవిధముగ జెప్పబడినవి-

శ్లో॥ జ్ఞానభూమిః శుభేచ్ఛాఖ్యా ప్రథమా పరికీర్తితా
విచారణా ద్వితీయాస్యాత్ తృతీయా తనుమానసా ।
సత్త్వాపత్తి శ్చతుర్థీస్యాత్ తతోఽసంసక్తినామికా
పదార్థాభావనీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా ॥

1. శుభేచ్ఛా- 2. విచారణా- 3. తనుమానసా- 4. సత్త్వాపత్తిః- 5. అసంసక్తిః- 6. పదార్థాభావనీ- 7. తుర్యగా- అని ఏడవ భూమికకు పైనకూడ నొకటి యెనిమిదవ అవస్థభూమికకలదు- కాని

మూడవభూమికకును, మొనిమిదవభూమికకును మొక్కవ భేదములేదు—ఏడవభూమిక జీవన్ముక్తిరూపము— 8వ భూమిక విదేహముక్తిరూపము— ఇంతియే భేదము— ఇందు మొదటి మూడు భూమికలును జాగ్రదవస్థ యనబడును— చతుర్థభూమిక స్వప్నము— పంచమభూమిక సుషుప్తి—అసంవేదన రూపమయిన షష్ఠీభూమిక తుర్యము—సప్తమభూమిక తుర్యాతీతము— ఈయది మనోవాక్కులకు అతీతము— దీనియందే సర్వదృశ్యములు ప్రత్యగాత్మయందు పూర్తిగ విలయము చెందుటవలన ఆత్యంతిక జీవన్ముక్తి యనబడును— ఈదశయందు జన్మమరణములగూర్చిన భీతి యుండదు— సదసత్తుల గురించిన భీతి యుండదు— ఎల్లపుడు ఆత్మారాముడై యుండును— వ్యవహర్తకాని, అవ్యవహర్త కాని, గృహస్థుడు కాని, యతికాని నేనుచిన్మాత్రుడనని తలంచుచు దుఃఖించడు—

మరియు నీతడు అలేపకుడు, అజరుడు, నీరాగుడు, శాంతవాసనుడు, నిర్మలుడు, చిదాకాశుడు, ఆదిమధ్యాంతరహితుడు, శుద్ధబుద్ధస్వభావుడు, సర్వవ్యాపకుడు, దేశకాలవస్తు పరిచ్ఛేదరహితుడు, ఈయది గుర్తించినందున ఇతనికి సంసారశోకముండదు— వాసనాబద్ధుడయినవాడు పదార్థములవల్ల సుఖదుఃఖముల నొందునుగాని, వాసనాబద్ధుడు కాని వాడు పదార్థానుభవమున దుఃఖము నొందడు— సుఖమును పొందడు—చతుర్థాదిభూమికలయందు వాసనతగ్గి (క్షీణించి) యుండును— సప్తమ భూమికయందు వివాసనము (వాసన పూర్తిగ నశించును) అపుడు సుఖదుఃఖములుండవు— క్షీణవాసను డేపనిచేసినను దగ్ధబీజమువలె ఆకర్మ ఫలించదు— దేహేంద్రియాదులచే కర్మ చేయబడుచున్నది— ఫలము కూడ దేహేంద్రియాదులే అనుభవించవలెకాని ఆత్మకు పనిలేదు— కర్తయొకడు— భోక్తమరొకడు కానేరడు— దేహేంద్రియాదులనుండి అహంతామమతాధ్యాసలను విడిచినవాడు శశాంకశీతలుడు— పరిపూర్ణుడు—భాస్కరునివలె ప్రకాశరూపుడు— దేహమనే బూరుగచెట్టుయొక్క కర్మఅనేదూది జ్ఞానమనే వాయువుకు లేచి యెక్కడికి పోతుందో అంతు

చిక్కదు- మిగిలిన కర్మకళలన్నీ జ్ఞానముచే నశించునుగాని జ్ఞానకళ మాత్రం ప్రతిదినమూ వృద్ధిపొందుచుండును మంచినేలన నాటిన వరిపైరువలె-

రాజా! సరస్సులందు, సముద్రములందును, నిర్మలమయిన ఉదక మొక్కటియేకలదు-అట్లే అఖిలవస్తువులందును సన్మాత్రస్వభావుడయిన ఆత్మఒక్కడేకలదు- కనుక రామా! జగత్తు నంతయును తత్త్వబోధచే బాధింపజేసికొని పరిశిష్టమయిన సత్తాంశమాత్రమే నేనని తెలిసికొనుము.

ఇట్లు ౧౭౦వ సర్గ ముగిసెను.

౧౭౧. ఇక్ష్వా...... సం....ము.

మను॥ విషయభోగమునందు ఆశయుండు నంతవరకు ఆత్మకు జీవుడను పేరుండును- అయ్యది అవివేకమువలన వచ్చినదికాని వస్తుతః ఉన్నదికాదు- వివేకమువల్ల విషయభోగవాంఛ యెప్పుడు నశించునో అప్పుడు ఆత్మ జీవత్వమునువదలి బ్రహ్మత్వమును పొందును- భోగ వాంఛయే జీవుని పైకి క్రిందకు (అనగా స్వర్గానికి నరకానికి) త్రిప్పు చుండును-

రాజా! భోగచింతఅనే త్రాటిని నీమెడకు వేసికొనకుము- "ఇదినాది నేనువీనివాడను" అనే వ్యవహారభ్రమను మోహవలన యెవడు సేవించుచుండునో వాడు మాటిమాటికి అధోగతి చెందుచుం డును ఆమోహమును విడిచినవారుమాత్రము ఊర్ధ్వలోకమును జేరు దురు- రాజా! స్వప్రకాశ స్వరూపుడయిన ఆత్మను అవలంబించి యుండుము- జగత్తుఅంతయు చిదాకాశముతో పూర్ణమయియున్నట్లు గుర్తించుము- ఇట్లు గుర్తించినవాడే సంసారమును తరించగలడు- పర మేశ్వరత్వమును పొందగలడు- బ్రహ్మ ఇంద్ర విష్ణు వరుణులు దేనిని చేయుటకు సిద్ధపడిరో దానినంతయును చిద్రూపువగు నేనే చేయుచున్నా నని భావించవలెను- యేయే శాస్త్రములందు ఏదేది చెప్పబడినదో

అదియంతయు నిజంగా చిద్విలాసముకాని మరొకటికాదు- మృత్యువును తరించి చిన్మాత్రమును చెందిన వానియొక్క- పరమానందమునకు ఉపమానములేదు-

రాజా ! ప్రపంచము అశూన్యముకాదు-శూన్యమునుకాదు-అచిద్రూపముగాదు- చిద్రూపమునుకాదు- ఆత్మరూపముకాదు- అన్యరూపముకాదు- అనియిట్లు భావించుము- అనగా అనిర్వచనీయమని భావించుమని తాత్పర్యము-

1. బ్రహ్మసత్తతో ద్వైతము అశూన్యమనే యడల ద్వైతాపత్తి.
2. నేతీతి వాక్యములు ప్రపంచమును నిషేధించుటచే ప్రపంచముశూన్యమనేయడల సర్వకర్తృత్వలక్షణమయిన యీశ్వరత్వమునకు వ్యాఘాతము (దెబ్బ)-
3. అలాగే ప్రపంచము అచిద్రూపమే అనేయడల అపుడు చైతన్యమునకుకూడ భాసముండదు-త్రివృత్కరణముచే తైజసరూపానువిద్ధమే భాసకమయిన తేజస్సుచే భాసింపబడునుకాని నీరూపమయిన చైతన్యము భాసింపబడదు- ఇంక చైతన్యానువేధకొరకు తేజస్సునకు చిద్వికారత్వము నంగీకరించే యడల అపుడు చైతన్యమునకు సవికారత్వాపత్తి.
4. ప్రపంచము అనాత్మరూపమంటే ప్రపంచమునకు అసంగుడయిన ఆత్మతో సంబంధము లేనందువలన జగత్తునకు సత్తాస్ఫూర్తులు లేకపోవును-
5. ఇక ప్రపంచము ఆత్మరూపమే యన్నచో దానికి జ్ఞానముచే బాధయుండదు- ఇత్యాది దోషములుండుటచే ప్రపంచము అనిర్వచనీయమనవలెను-

ఆత్మస్వస్వరూపమును పొందినపుడే ప్రకృతి శాంతించగలదు- మోక్షమనగా ఒకానొక దేశముకాదు- ఒకానొక కాలమూకాదు- వస్తువూకాదు- ఇతరమూకాదు- స్వాభావికమయిన ఆత్మరూపమును

చరమసాక్షాత్కారవృత్తితో అనుసంధానము చేసికొనునప్పుడే శాస్త్ర సిద్ధమయిన మోక్షము తటస్థించును- ఇట్టి జీవన్ముక్తునకు ప్రాపంచిక వ్యవహారము లన్నియు నివర్తించును-

ఇట్లు ౧౨౧వ సర్గ ముగిసినది.

## ౧౨౨. ఇక్ష్వాకు ప్రబోధనము.

మను॥ రాజా ! ఏదో ఒకగుడ్డకట్టుకొని ఏదో యొకపదార్థమును భుజించి యెచ్చటనో యొకచోట పరుండుయోగి సమ్రాట్టు అనబడును- అతడు మానుషానందమునకు పరమావధిని పొందియుండును- ఇట్టివానికి వర్ణాశ్రమధర్మ నియంత్రణలేదు- శాస్త్రనియంత్రణయు ఉండదు- బోనులోనుండి సింహము బయటపడినట్లు జగజ్జాలమునుంచి బయట పడును- నిరతిశయానందమునకు విషయుడగును- విషయవాంఛా దశను విడచును- అనిర్వాచ్యమయిన శోభ నొందును- కొండమీది నదివలె గంభీరుడు, ప్రసన్నుడు నగును- పరమానందరసాస్వాదమునుంచి అప్రచ్యుతుడగును- సర్వకర్మత్యాగి, నిత్యతృప్తుడు- నిరాశ్రయుడు- పుణ్యపాపములతో లేపముండదు- స్ఫటికము ప్రతిబింబముయొక్క రూపముతో అంటదు- అట్లే యీయోగి కర్మఫలంతో అంటదు- జనసమూహంలో విహరించుచున్ననూ దేహమును ఛేదించినా పూజించినా ఖేదాహ్లాదములను పొందదు- ఎవ్వనిని స్తుతించదు- నిర్వికారుడు- పూజించకున్ననూ చలించదు-లోకమును గురించి భయపడడు-లోకము ఇతనినిగురించి భయపడదు-రాగద్వేషభయానందములు ప్రారబ్ధవశంచేత ఒకప్పుడుండును- ఒకప్పుడుండవు- ఎంతటి నిపుణులుకూడ ఇతనిని నిర్వచింపజాలరు- వ్యవహారమువలన మాత్రము అతిబాలుడుకూడ వశపరచుకొనగలడు-

రాజా ! ఇలాంటియోగి పుణ్యతీర్థంలో శరీరమును విడిచినా మాలవానియింట దేహత్యాగముచేసినా ఎప్పటికీ శరీరమును త్యజింప

కున్నా వర్తమానక్షణంలో శరీరమును విడచినా! జ్ఞానసంప్రాప్తి సమయంలో ముక్తుడేయగును- అహంభ్రాంతి (నేనను భ్రాంతి) బాధప్రదము- జ్ఞానముచే అది నశించును- అట్టివాడు పూజనీయుడు స్తుత్యుడు- నమస్కార్యుడు- అభివాద్యుడు- ఐశ్వర్యమును కోరువారికి- ఇట్టి పరమ పవిత్రమయిన జ్ఞానము యజ్ఞతీర్థములచేకాని, తపోదానములచేకాని లభ్యముగాదు- జీవన్ముక్తులను సేవించుటచే జ్ఞానముకలిగి తద్వారా పరమపదము లభించును-

రామా! ఇలా చెప్పి మనుబ్రహ్మ గృహమునకేగెను- ఇక్ష్వాకువుకూడ యీదృష్టిలోనుండి స్వస్వరూపమునందు స్థిరపడెను-

ఇతి ౧౨౨వ సర్గ సమాప్తము

౧౨౩–౧౨౮ లు విశేషకథనము, మృగవ్యాధియును.

శ్రీరా॥ మునీంద్రా! మీరు చెప్పిన లక్షణాలుఅన్నీ ఉన్నచో ఇంక జీవన్ముక్తునియందున్న క్రొత్తవిశేష మేమి? (అతిశయ మేమి)-

వసి॥ జీవన్ముక్తుడయినజ్ఞానికి ఒక్క-అంశమునందె అతిశయము- నిరతిశయానందాత్మలో చరముగు అనుభవమొక్కటే అతిశయము-అంతే కాని సాంసారిక ఫలసిద్ధ్యంశములలో ఎందులోనూ అతిశయములేదు- మంత్రసిద్ధివల్లను, తపస్సిద్ధివల్లను తంత్రసిద్ధివల్లను కలిగిన ఆకాశగమనాదులు జీవన్ముక్తునకు అపూర్వములుకావు- అణిమాదిసిద్ధుల స్వప్రయత్నమువల్ల సాధింపవచ్చును- తత్త్వజ్ఞానమువల్లనే సాధింపవలెనను నియమములేదు- కనుక, మూఢులతో సమానముగ నుండకపోవుటయే జీవన్ముక్తుని విశేషము- జీవన్ముక్తుడు అన్నిటియందును ఆదరమును పరిత్యజించుటచే అతని మనస్సు నీరాగముగను, నిర్మలముగను ఉండును- కాబట్టి రామా! జ్ఞానికి కామాది వికారములు పూర్తిగ నశించుటయే ముఖ్యలక్షణము-

రామా! నిత్యనిరతిశయానందరూపుఁడు పరమాత్మ (పరబ్రహ్మ) అతఁడే జీవుఁడు- కనుకనే జీవాత్మకు స్వస్వరూపజ్ఞానంచేత నిరతిశయానందరూపత్వము సంప్రాప్తమయినది- దీనికొకయుక్తి చెబుతావిను-

ఒకానొక బ్రాహ్మణుడు శూద్రస్త్రీని కామించాడు- దానితో సంభోగ సహవాసాది దురీహాలు ఆతనికి అలవాటుపడ్డాయి- అంచేత తన కులోచితమయిన బ్రాహ్మణధర్మమును మెల్లమెల్లగా ఉపేక్షించుకొని శూద్రత్వమును అంగీకరించాడు- అలాగే ఈశ్వరుడుకూడా బుద్ధ్యాదులతో సాంగత్యాన్ని మరిగాడు- వానితో భోగాశ యేర్పడింది- అంచేత తన నిత్యశుద్ధపూర్ణానందస్వభావాన్ని ఉపేక్షించాడు- జీవత్వాన్ని అంగీకరించాడు- ప్రతిసృష్టిలోను భూతములు రెండురకాలు పుట్టుతూఉంటాయి- ఉపాధిప్రాధాన్యంతో భోగ్యములనీ ఉపహితప్రాధాన్యంతో భోక్తలనీ-మాయయందలి రెండువిధములయిన సంస్కారములను అనుసరించుచున్న హిరణ్యగర్భునినుండి మాయాగంధర్వనగరమువలె ఆవిర్భవించినవి- అంచేత మిథ్యాభూతములు- వీటికి వాస్తవసామగ్రి అవసరములేదు- స్వాప్నికమయిన ఘటాదులకు దండచక్రాది సామగ్రి అవసరములేదు-

ఈశ్వరుడు జీవభావమునొందుటలో ఈశ్వరునకు కర్మాపేక్ష లేదు- జీవభావమును చెందినతరువాత దేహేంద్రియాదులు పుట్టుటలో పూర్వాపూర్వ దేహములచే జేయబడిన కర్మతో అపేక్షయుండును- అదెట్లన? సూర్యుడు నీటిలో ప్రతిబింబించుటలో చలనాదిక్రియలతో అపేక్షలేదు- ప్రతిబింబము భిన్నభిన్నతరంగములందు ప్రవేశించి తద్గతక్రియలను అనుభవించుటలోమాత్రం ఉపాధియొక్క క్రియాపేక్ష యుండును- అట్లే ఈశ్వరుడు జీవప్రతిబింబరూపుడగుటలో కర్మాపేక్ష లేదు- కనుక ఈశ్వరుడు జీవుడయిన తరువాత జీవుడు జన్మాంతరములకు తాను చేసినకర్మలవలన పొందును- జన్మకర్మలయొక్క కార్యకారణభావము ఇట్టిది- చూడుడు ప్రమాణమును-

శ్లో॥ అకారణముపాయాంతి సర్వేజీవాః పరాత్పదాత్ ।
పశ్చాత్తేషాం స్వకర్మాణి కారణం సుఖదుఃఖయోః ॥

అని తాను ఎట్టివాడనని తెలిసికొంటాడో తదనుకూలముగ సంకల్పిస్తాడు— సంకల్పానురూపముగ చేస్తాడు— మనుష్యాది దేహములందు ఆత్మబుద్ధి లేనిదే పుణ్యపాపములను చేయసంకల్పించడు— చేయడుకూడా— భాష్యకారులగు భగవత్పాదులుకూడ ఇట్లు చెప్పిరి— చూడుడు— "నహ్యనధ్యస్తాత్మభావేన దేహేన కశ్చిద్వ్యాప్రియతే" అని అనగా దేహాదులందు ఆత్మభావమును అధ్యాసచేసికొననిదే ఎవడును వ్యాపృతుడు కాడు— అని దీనియర్థము—

కనుక దేహాధ్యాసకూడ సంకల్పద్వారానే పుణ్యపాపములు చేయుటకు కారణమగును— కాన సంకల్పమే బంధమునకు కారణము— ముక్తి కోరువాడు ముఖ్యముగ సంకల్పమును విడువవలెను— మోక్షమనగా సంకల్పరాహిత్యమే— రామా! దానినే అభ్యసింపవలెను— గ్రాహ్యగ్రాహకభ్రమను విడిచిపెట్టుము— అది ఉన్నదా తప్పక సంకల్పము పుట్టితీరును— త్రిపుటీభావనలను అన్నిటినీ విడచి మిగిలిన సాక్షీస్వరూపమును అవలంబించుము— ఇంద్రియగణము యెల్లపుడు యెక్కడ ప్రవేశించునో అక్కడక్కడల్లా రాగమేర్పడును— రాగముచే జీవుడు బద్ధుడగును— వైరాగ్యము ముక్తుడగును— కావున వైరాగ్యాభ్యాసము ఆవశ్యకము—

లోకంలో ఏదేని యొకదానిమీద ఇచ్ఛకలిగినచో దానితో బద్ధుడై మానవుడు సంసారమునందుండును— చిత్తమునందు దేనిమీదను కోరికలేనిచో సంసారవిముక్తుడగును— కావున రామా! స్థావర జంగమ పదార్థములలో గడ్డిపరక మొదలు దేవేంద్రపదవివరకు దేనిమీదను దేనిని కోరకుము— దైనందిన క్రియలందుకూడ "నైవ కించిత్కరోమీతి" అనినట్లు అకర్తృత్వాభిమానముతో నుండుము— సత్పురుషులు గడచినదానికి దుఃఖంచరు— రాబోవుదానిని చింతించరు— వర్తమాన

మును మాత్రము గ్రహింతురు- మనస్సునందు పుట్టిన తృష్ణాదిదోషము లను మనస్సుచేతనే జయించవలెను వివేకముచే- ఇనుమును ఇనుము తోనే ఛేదింతురు- మలమును మలముతోనే తొలగించేయవలెను- అస్త్ర మును అస్త్రముతోడనే వారింతురు- విషమును విషముతోనే వారిం తురు- జీవులకు స్థూలము, సూక్ష్మము, పరము అని మూడురూపములు- ఇందు మొదటి రెంటినివిడిచి పరరూపమును సేవింపవలెను-పాదపాణిపా దాదిరూపమయిన స్థూలదేహము జీవునియొక్క భోగముకొరకేర్పడినది. సంకల్పమయమయిన సూక్ష్మరూపము- (దేహము) సంసారముండు నంతవరకునుండును- దీనినే చిత్తమందురు- ఈయది జీవునకు ఆతివా హికరూపము- ఆద్యంతరహితము, సత్యము, నిర్వికల్పకము, చిన్మా త్రము అయినది పరరూపము- ఇదిమూడవది- ఈయది శుద్ధము- మొదటి రెండురూపములను విడువుము- వాటియందు ఆత్మబుద్ధిని ఉంచ కుము- మూడవరూపమును మాత్రము వదలకుము-

శ్రీరా॥ మునీంద్రా! జాగ్రత్స్వప్నసుషుప్తములందున్నట్టియు, ఈమూడుదశలందును చూడబడనట్టియు, తురీయరూపమును గురించి వివరించి చెప్పండి అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ రామా! అహంభావానహం భావములు లేనిది- సదసత్తులు కానిది, అసంసక్తము, సమము, స్వచ్ఛము అయినది, తురీయరూపము- స్వచ్ఛమయిన సాక్ష్యవస్థయే తురీయదశ- ఇది జాగ్రతికాదు- స్వప్న మూకాదు- సుషుప్తమూకాదు- అహంకారకల(ళ)ను విడచి సమతా బుద్ధి ఉదయించి చిత్తము నీటిలో విలీనమయిన ఉప్పుముద్దవలె విలీ నముకాగా తుర్యావస్థ స్థిరపడును- దీనికొక దృష్టాంతం చెబుతావిను- నీకు తెలిసినా మరింత విస్పష్టంగా తెలుస్తుంది దీనివల్ల-

ఒకానొక విశాలమయిన అడవిలో మహత్తరమయిన మౌనము గల ముని ఉన్నాడు- అతనిని ఒకానొక వ్యాధుడు- (వేటకాడు) ఇలా అడిగాడు బాణముచే కొట్టబడిన మృగము వెంట పరుగెత్తుచువచ్చెడి

వాడు- మునీ! నాబాణముచే కొట్టబడిన మృగము ఇలావచ్చింది- ఎటుపోయినదో తెలుసునా నీకు? అని అడిగాడు- ఆముని బదులు చెప్పాడు-

నాయనా! మేము "సమశీలులమయిన మునులము- వనవాసులము- వ్యవహారములందు సమర్థమయిన అహంకారము మాకులేదు- ఇంద్రియవ్యాపారములన్నీ చేయించెడిది మనస్సు- అయ్యది అహంకారమయము- అది మాకు జారిపోయి చాలకాలమయినది- నేను జాగ్రత్స్వప్నసుషుప్తులనే దశలనుకూడ నేనెరుగను- నేను తుర్యదశయందే ఉన్నాను- అచట దృశ్యమేమియులేదు" అని చెప్పినాడు ముని- ఆవేటకాడు దీనియర్థము తెలియక వాడికిచ్చవచ్చినదిశకు వెళ్ళినాడు-

కాబట్టి రామా! నేను చెబుతున్నాను నీకు- తుర్యాతీతమయిన దశలేదు- నిర్వికల్పకచిత్తమే తుర్యము- జాగ్రత్స్వప్నసుషుప్తములనే మూడురూపములు చిత్తమునకు మనస్సునకు సంబంధించినవి- జాగ్రదవస్థలోని చిత్తము ఘోరము-స్వప్నమయమయిన చిత్తము శాంతము- సుషుప్తదశయందలి చిత్తము మూఢము-అని యిట్లు చిత్తము, ఘోర, శాంత, మూఢములను భేదము మూడువిధములు ఈమూడు దశలులేని చిత్తము మృతము- ఈమృతమయిన చిత్తమునందు యోగులకు ప్రారబ్ధశేషభోగముకొరకు భస్మలో తెలుపువలె సత్త్వాంశము మాత్రమే అనువర్తించును- రజస్తమోంశములు లేశమయిననుఉండవు- ఇలాంటి చిత్తమునే యోగులు ప్రయత్నపూర్వకముగ సంపాదించుకొనుచున్నారు-నీవుకూడ అలాంటి చిత్తమును సంపాదించుము- అన్నారువసిష్ఠులు-

ఇట్లు ౧౨౩-౧౨౪వ సర్గలు సమాప్తము.

౧౨౫-౧౨౬. పరమార్థోపదేశము.

వసి॥ రామచంద్రా! శ్రుతి, స్మృతీ, తిహాస, పురాణాది శాస్త్రములకు పరమతాత్పర్యము ద్వైతజాలమును నిషేధించుటయందు కాని,

వస్తువును ప్రకాశింపజేయుటయందుగాదు- కాన, అవిద్య లేదు- మాయ లేదు- ఇదంతా అవగాహము కాని(తెలియబడజాలని) బ్రహ్మమే-చూడు ప్రమాణమును- "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అథాత ఆదేశో నేతి నేతీతి "అస్థూల మనణ్వహ్రస్వం" అని ద్రవిడా చార్యులుకూడ ఇట్లన్నారు-"యద్యప్రమేయం బ్రహ్మ కిమర్థం శాస్త్ర మితి చేన్నిర్ధంసునివర్తకత్వాత్"అని బ్రహ్మము తెలియదగినది-కానిచో శాస్త్రమెందుకు ? ఉన్నదానిని నివర్తింప జేయుటకు అని దీనియర్థము-

శ్రుత్యాదుల సిద్ధాంతము తెలియక తమ బుద్ధివైభవంచేత జగన్మూలమును వెదకునట్టి వాదులకు, బ్రహ్మశబ్దవాచ్యమయిన సర్వ శక్త్యాత్మక మాయాశబల బ్రహ్మయందు వారి వారి బుద్ధిదోష వైచిత్ర్యమువల్ల అనేకవిధములయిన కల్పనలను బయలుదేరతీశారు-కొందరు శూన్యంబ్రహ్మ అన్నారు- కొందరు విజ్ఞానమాత్రం బ్రహ్మఅన్నారు- మరికొందరు యీశ్వరుడు బ్రహ్మ అన్నారు- ఇలా ఒకరికొకరు తగాదా పడుచున్నారు- ఈతగాదాలో నీకు నిమిత్తంలేదు- నీవుమాత్రం మహా మౌనంగాఉండు- అమనస్కుడవై క్షీణచిత్తతతో మూకాంధబధిరా దులవలె ఆత్మయందుండుము- జాగ్రతలో సుషుప్తుడవై కర్మల నాచ రించుము- చిత్తసత్త మిక్కిలి దుఃఖము- చిత్తాసత్త మిక్కిలి సుఖం- కావున "ఇదిప్రియము" "ఇది ద్వేష్యము" అని అనుసంధానముచేయక చిత్తమును చిదాత్మకమును చేయుము- రమ్యారమ్యమును పాషాణము వలె చూడుము- అట్టి సమతాబుద్ధితో కాని సంసారమును జయింపలేవు- చింతింపతగినది సుఖముకాదు- అసుఖమూ(దుఃఖమూ) కాదు- సుఖ దుఃఖసాధనములూ కావు- చిద్రూపమే చింతింపతగినది- ఇంతమాత్రం ప్రయత్నమును చేసినచో ఆత్యంతిక దుఃఖనివృత్తి సంభవించును-

రామా ! ముల్లోకవస్తువులలో సారమయిన వస్తువును తెలిసి కొని స్వతః ప్రకాశమానమగు నిరతిశయసుఖస్వరూపుడవగుచు జ్ఞాని అయినవాడు పరిపూర్ణ చంద్రునితో సమానుడై పరమాత్మను పొందిన

వాడగును- జీవన్ముక్తిసుఖమును పొందును- ప్రారబ్ధమువలన వచ్చి పడిన పనిని చేయుచున్నను చేసినవాడుగాడు-

శ్రీరా॥ మునీంద్రా! సప్తభూమికలను అభ్యసించేక్రమంఎలా? ఏయేభూమికయందున్నవాని లక్షణము యెట్లెట్లుండును? సెలవివ్వండి అని అడిగాడు శ్రీరాముడు-

వసి॥ రామా! వేదమార్గమునందు పురుషుడు ప్రవృత్తిమార్గము నందున్నవాడు, నివృత్తిమార్గమునందున్నవాడు అని రెండురకములు అౌదు-

శ్లో॥ అపిబృందావనే శూన్యే శృగాలత్వం సవాంఛతి ।
నతు నిర్విషయంమోక్షం కదాచిదపి గౌతమ ॥

శూన్యమయిన బృందావనమునందు శృగాలము (నక్క) గానయినా పుట్టదలచునుకాని నిర్విషయమయిన మోక్షమును ఎన్నటికీకోరడు- అన్నట్లు మోక్షమును పాటించక తృణీకరించి నిత్యచిమిత్తిక కామ్య కర్మలను చేయువాడు ప్రవృత్తిమార్గస్థుడు- వివేకవంతుడుకాని నివృత్తి మార్గస్థుడుకాడు- అట్టివివేకము మహాదుర్లభము- అనేకజన్మముల అంతమునకాని కలుగదు- అది అందుకు దృష్టాంతము-

శ్లో॥ చలార్ణవ యుగచ్ఛిద్ర కూర్మగ్రీవా ప్రవేశవత్ ।
అనేకజన్మనామంతే వివేకీ జాయతే పుమాన్ ॥

ఈదృష్టాంతమును మూడురకముల సమన్వయించవచ్చును- అద్దానిని యీక్రింద గమనికలో జూపుదును-

గమనిక—

౧. అసంఖ్యాకములయిన జలచరజంతువులతోను, ప్రచండ వాయువులచేతను, బడబాగ్నిజ్వాలలచేతను, సముద్రములు అతిచంచలముగా నుండును- అట్లు చంచలముగానుండు పూర్వాపరసముద్రముల రెంటిమధ్య విహరించెడి కూర్మముల (తాబేళ్లు) యొక్క మెడలు అతిభయముచే అతిశీఘ్రముగ లోపలప్రవేశించుట వెంటనే బయటికి

మరలవచ్చుట అసంఖ్యాకముగ జరుగుచుండును- అట్లే మృత్యువు నోటిలో ప్రవేశించుట మరల బయటికివచ్చుట రూపమయిన జన్మలు అసంఖ్యేయములుగ జరుగుచుండును- అట్టి జన్మలకు చివరకెన్నడో యెవ్వడో యొకడు మాత్రమే వివేకిగా పుట్టును-

2. లేక క్షారార్ణవమందున్న మహాకూర్మముయొక్క మెడ అనేకమారులు కంఠచ్ఛిద్రంలో ప్రవేశించి బయటికివచ్చినను క్షారార్ణవరసమునే ఆస్వాదించుచూ ఆరసమునే మెచ్చుకొనుచూ ప్రళయపర్యంతము క్షీరార్ణవరసమును గుర్తెరుగదు- తుదకు కల్పాంతమునందయి తేచలించుచున్న క్షారక్షీరసముద్రములయొక్క కలియికసమయంలో ఆ రెండుసముద్రములయొక్క ఉదరచ్ఛిద్రమునందు కంఠమును ప్రవేశపెట్టగా అపుడు క్షీరరసమును ఆస్వాదించి క్షారరసముకంటె క్షీరరసముయొక్క భేదమును గుర్తించి దానియందు (క్షీరరసమునందు) ఆసక్తిగాలగును-

అలాగే జీవుడుకూడా మొట్టమొదట విషయరసములనే గొప్పగా అనుభవించుచూ అనేకజన్మములచివర అదృష్టవశంచేత అధ్యాత్మశాస్త్రరసమును ఆస్వాదించి వివేకియై తదాసక్తుడయిపుట్టును-

3. లేక అమృతమును బుట్టించుటకు దేవాసురులు సముద్రమథనమును చేయుచుండగా మంధరపర్వతమునకాధారమగు కూర్మావతారమును ధరించిన భగవంతుడు సమస్తభువనములకు ఆధారమగు ఉదరముగలవాడగుటవలన లోపల వెలుపల మథింపబడుచున్న సముద్రద్వంద్వముయొక్క ఛిద్రమునందు మొదట యెక్కడ అమృతము పుట్టునని ఆస్వాదించి పరీక్షించుటకు ప్రవర్తించిన ఆకూర్మముయొక్క కంఠము (మెడ) అనేకమారులు లోపలప్రవేశించి బయటికివచ్చుట తటస్థించగా తుదకు లోపలనో, వెలుపలనో, ఎచ్చట మొదట అమృతము పుట్టినదో అచ్చటనే దానినాస్వాదించి క్షీరామృతముయొక్క రుచివివేకము కలదగుచున్నది- అలాగే ఈముముక్షువుకూడ శ్రవణమను ఉపాయముచే

వెలుపల మననినిదిధ్యాసనములచే లోపల బ్రహ్మాత్మతత్త్వ వివేకము కొరకు ప్రవర్తించినవాడగును అనేకజన్మాభ్యాసవశంచేత తుదకు లోపలకాని, వెలుపలకాని, సాక్షాద్వివేకముచే నిరతిశయానందమును ఆస్వాదించుచున్నాడు—

౪. లేక చలించుచున్న సముద్రద్వంద్వముయొక్క ఛిద్రము మధ్యనున్న తీరముయొక్క వివరములో కూర్మమునకు మెడఅను సాధనముతో ప్రవేశము కలుగుచుండగా ముందువెళ్లుటలోకాని తరువాత బయటకు వచ్చుటలోకాని, అట్లే ఛిద్రమునందుండుటలోకాని యెచ్చటను విశ్రాంతియుండదు— అట్లే ప్రాక్తనమయిన భవసాగరమును విడిచిపెట్టి భవాంతరమును ప్రవేశింపగోరిన జీవునకు ఎచ్చటను విశ్రాంతియుండదు— ప్రాక్తనజన్మయందు జరామరణాది దుఃఖపరంపర భావిజన్మయందు బాల్యాది దుఃఖసంతతి మధ్యవర్తియగు యాతనాదేహమందుకాని, గర్భవాసమందుగాని మహాదుఃఖము— ఇట్లు దుఃఖమయములయిన అనేకజన్మల చివర మానవుడు ఏదో పుణ్యపరిపాకమువలన వివేకిగాపుట్టును— అని నాలుగు విధముల సమన్వయము—

కనుక రామా! సంసారవ్యవస్థ యనునది నిస్సారమయినది, విశ్రాంతిసుఖములేనిది— అనుచితంగా పరిణమించెడి కర్మలతో ఎందుకు ప్రొద్దుపుచ్చుకొనెదవు! నిర్వికారమయిన కూటస్థచైతన్యము విశ్రాంతిస్థానమని లోపలనిశ్చయము గలవాడు నివృత్తిమార్గస్థుడు—

నేను వైరాగ్యమునుపొంది సంసారసముద్రమును ఎట్లు తరింతును? అనువిచారము నెప్పుడుచేయునో మానవుడు వాడు అనుదినము భోగతత్సాధనచింతనలయందు వైరస్యమును చెందుచుండును— చిత్తశుద్ధ్యనుకూలమయిన శౌచ, సత్సంగ, ఈశ్వరోపాసన, జపాదిరూపములగు ఉత్తమకర్మలందు ఆసక్తుడగును— దానిచే చిత్తశుద్ధి అభివృద్ధియై తృష్ణక్షీణించి సంతసించును— గ్రామ్యములగు మూఢచేష్టలందు విసుకు (జుగుప్స) చెందును— పరులయొక్క రహస్యదోషములను వెల్లడించదు—

పుణ్యకర్మల నాచరించును- తనకు పరులకును భయంకరములు కాని అల్పాయాసము మహాఫలముకల యమనియమాదికర్మలను సేవించును- భోగమునందు పాపముండుటచే దానినపేక్షించదు- పాపమునుంచి నిత్యము భయపడుచుండును- స్నేహము, పరిచయము కలిగిన మాటలు మాటాడును- కఠినోక్తులు పలకకుండును- సత్యము, ప్రియము, హితవును అగు పలుకులు పలుకును- ఇట్టివాడు సప్తభూమికలలో ప్రథమభూమికను పొందును- మనోవాక్కాయ కర్మలచే పెద్దల సేవించును- ఎట్లనో డబ్బు సంపాదించుకొని పెద్దలనోటినుంచి జ్ఞానశాస్త్రములను పురాణ మోక్షధర్మ అధ్యాత్మ సంహితాదులను శ్రవణముచేయును- ఇలాంటి విచారమును సంసారోత్తారణమునుగూర్చి చేయువాడు ప్రథమభూమికను చేరినవాడని చెప్పబడును- ఇట్టి సాధనసంపత్తి లేనివారు అధ్యాత్మ గ్రంథములందు ఆసక్తులయినను రాగాదులచే అనధికారులనుండి డబ్బు సంపాదించుకొనుచు పొట్టనింపుకొను స్వభావముకలవాడగుటచే వంచకులు అని చెప్పబడుదురు- ఈయది "శుభేచ్ఛ" యనెడి ప్రథమ భూమిక-౧

౨. పిదప రెండవదియగు విచారమను పేరుగల భూమికను పొందినవాడు, శ్రుతులను, స్మృతులను, సదాచారములను, ధారణాధ్యాన కర్మలను, చక్కగా తామనుష్ఠింపుచు వ్యాఖ్యానించి చెప్పెడి శ్రేష్ఠమయిన గురువులను శ్రవణమననాదివిచారముకొరకు ఆశ్రయించును- తాను స్వయముగ వ్యాకరణాది వేదాంగములను తెలిసినవాడగుటచే పదపదార్థములయొక్క వాచ్య, లక్ష్యాది ప్రవిభాగములను తెలిసినవాడై వినదగినదానిని గురుముఖమునుంచి విని తెలిసికొని కర్మకాండ బ్రహ్మకాండలయొక్క నిర్ణయమును పొందును- పాము కుబుసమును విడిచినట్లు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది, దోషాలను విడిచిపెట్టును- ఇలాంటివాడు శాస్త్ర, గురు, సజ్జనులను, సేవించుటవలన శాస్త్రముయొక్క పరమతాత్పర్యమును యథాతథముగ గ్రహించును-

3. అటుతరువాత "అసంసక్తి" యనెడి తృతీయభూమికను చేరును- శాస్త్రార్థనిర్ణయమందు నిశ్చలమయిన మతి నిలుపును- తాపసాశ్రమములందు నివసించుచుండును- ఆధ్యాత్మికప్రసంగములను చేయుచుండును- సంసారమును నిందించుచుండును- వైరాగ్యమును పెంచుకొనుచుండును-శిలలందు శయనించును-శరీరమును జీర్ణింపచేసికొనును-(కృశింపచేసికొనును) వనవాసముతో విహరించును- చిత్తమును ప్రశాంతపరచుకొనును- అసంసక్తిసుఖముతో కాలమును గడపుకొనుచుండును- సచ్ఛాస్త్రములను అభ్యసించుటవలనను, పుణ్యకర్మలనాచరించుటవలనను, యథార్థమయిన వస్తుదృష్టి యేర్పడును అతనికి- తృతీయభూమికను పొందిన విద్వాంసుడు స్వరూపానందమును అనుభవించుచుండును-

3-(౧) ఈఅసంగము సాధారణమని శ్రేష్ఠమని రెండువిధములు- నేను కర్తనుకాను, నేనుభోక్తనుకాను, నేను బాధ్యుడనుకాను, నేను బాధకుడనుకాను అనిదృశ్యములందుఅసంసంగముసాధారణము-ఈయది పూర్వభూమికలయందుగూడ సాధారణముగ నుండును- సుఖముకాని, దుఃఖముకాని, ప్రాక్కర్మనిర్మితము- సర్వము ఈశ్వరాయత్తము-అందు మనకేమాత్రము కర్తృత్వము లేదు-భోగాభోగములు మహారోగములు, ఆధులు మనోవ్యాధులు- సంపదలు పరమాపదలు- సంయోగములు వియోగాంతములు- కాలము ఎల్లపుడు సమస్తవస్తువులను కబలించుటకు తయారుగ నుండును-కనుక ప్రాపంచికవస్తువులందు ఆస్థ(ఆదరము) కూడదు- వాటిని లోపల భావించకుండుటయే మంచిది- వాక్యార్థజ్ఞానాసక్తుడయిన వానికి ఈయది సామాన్యమగు అసంసంగము- ఇద్దానిని సజ్జనసాంగత్యమువలనను, దుర్జనవియోగమువలనను, శ్రవణమననాదులను ఆవృత్తిపరచుకొనుటవలనను చక్కగా అభ్యాసములో నుంచుకొనవలెను-

౨ శ్రేష్ఠాసంగము- ఇట్లు పురుషప్రయత్నముచే నిరంతరమభ్యసింపగా సంసారసముద్రమున కావలియొడ్డును, ప్రపంచసారమును, పరమ

కారణమును అగు ఆత్మవస్తువు ప్రమాణప్రమేయ అసంభావనలు రెండును లేకుండగా కరతలామలకమువలె (ఇత్థమేవ) స్పష్టముగ విశ్వాసగోచరముకాగా "నేను కర్తనుకాను, ఈశ్వరుడేకర్త" "నాకు వెనుక చేసిన కర్మకాని ఇపుడు చేయబడుచున్న కర్మకానిలేదు" అని కర్మజాతమును నిరసించుకొనుచు వాటిమాటకూడ తలవకుండ మౌనముగా నుండుట శ్రేష్ఠాసంగము- ఇచట మౌనముగా నుండుటయన వాఙ్మనశ్చక్షురాది చేష్టలు లేకుండ నిదిధ్యాసనయొక్క పరిపాకమునకు ఫలమగు నిర్వికల్పసమాధితో నుండుట- చిత్తము అంతర్బాహ్యాది సర్వ వస్త్వాలంబనశూన్యముగ నుండుట శ్రేష్ఠాసంగము- స్వప్రకాశచిద్రూప ముగనుండుట శ్రేష్ఠాసంగము- ప్రకాశాంతరశూన్యముగ నుండుట శ్రేష్ఠాసంగము- పరమశాంతముగను ఆకాశమువలె అతిస్వచ్ఛముగను నుండుట శ్రేష్ఠాసంగము- అనాద్యంతము, అజము అగు పరబ్రహ్మా కారమును జెందుట శ్రేష్ఠాసంగము- వివేకమువలన అసంసక్తియనెడి తృతీయభూమిక సిద్ధించును-

అనేకజన్మసంచితమయిన సుకృతపరిపాకములచేతను, ఐహికపుణ్య సంచయములచేతను, ప్రథమభూమిక దైవయోగమున అంకురించును- అద్దానిని విశేషప్రయత్నముచే రక్షించుకొనవలెను- ఈశుభేచ్ఛయను భూమిక సాధనచతుష్టయములో వైరాగ్యమను అంశముచేకాని, శాం త్యాదిలక్షణయంశచేకాని, యేఅంశతో మొదట అంకురించునో ఆ యంశమునె విచారముతో అభివృద్ధి పరచుకొనవలెను- ఒక్క అంశ మును అభివృద్ధి పరచుకొనుచో ఉత్తరభూమికను అదియే సాధింప గలదు- ప్రథమభూమిక బాగా పరిపుష్టమగుచో ద్వితీయ తృతీయ భూమికలను పుట్టించును- ఇందు తృతీయభూమిక అతిశ్రేష్ఠమయినది- ఇందున్నవానికి సంకల్పములన్నియు పూర్తిగ అంతరించును- అన్నారు వసిష్ఠులు-

శ్రీరా॥ మునీంద్రా! నీచకులమందుబుట్టి ఆధ్యాత్మిక కథా విముఖుడై సజ్జనసహవాసములేని (యోగిజన సాంగత్యములేని) మూఢు

నకు ఉపాయాంతరముచే మోక్షమున్నదా ? లేదా ? ఒకటి రెండు మూడు భూమికనుకాని, నాల్గవభూమికనుకాని, అధిష్ఠించి మరణించినవాని గతియేమి ? అని అడిగాడు శ్రీరాముడు—

వసి॥ రామా ! అధికారివిశేషణములులేని మూఢునకు సంసారమేఖాయము— కాకతాలీయముగా జన్మాంతరశతములందు ఆర్జించిన పూర్వపుణ్యమువలనకాని, తన విచారమువలనకాని, సజ్జనసాంగత్యముచేకాని వైరాగ్యము పుట్టునంతవరకు వైరాగ్యము పుట్టినదా తప్పక ఆతడు భూమికను పొందును— అప్పుడు సంసారము నశించును. ఇది శాస్త్రసిద్ధాంతము—

యోగభూమికతో ప్రాణోత్క్రాంతి కలిగిన జీవునకు దుష్కృతము నశించును— భూమికయొక్క అంశనుబట్టి అటుపైన దేవతా విమానములందును లోకపాలుర పట్టణములయందును మేరుపర్వతపు ఉపవనములందును రమణీయమయిన కాంతలతో రమించును— పిదప భోగజాలమనుభవించినందున పురాకృతపుణ్యాభారము పురాకృతదుష్కృతమును నశించగా యోగులు భూలోకమున పుట్టుచుందురు— పరిశుద్ధమయిన శ్రీమంతుల యిండ్లకాని, గుణవంతులయిన సజ్జనుల గృహాములందుగానిపుట్టి జన్మాంతరవాసనచే మరల యోగమునే అభ్యసింతురు— అభ్యాసవశముచే యోగభూమికాక్రమమును స్మరించుకొని పైపై భూమికలను క్రమముగా చేరుదురు—

రామా ! మొదటి మూడుభూమికలందును ప్రపంచము భేదబుద్ధితో గోచరించుచుండుటచే ఈభూమికాత్రయము జాగ్రత్ అని చెప్పబడినది— ఇందు యోగయుక్తులయినవారికి లోకంలో మంచి పూజ్యత (గౌరవము) ఏర్పడును— వారిగౌరవమునుజూచి మూఢులకు గూడ ముముక్షుత్వము (మోక్షేచ్ఛ) యేర్పడును. కర్తవ్యమును ఆచరించుచు, అకర్తవ్యమును పరిత్యజించుచు ప్రాకృతాచారుడుగ నుండువాడు ఆర్యుడు (పూజ్యుడు) అనబడును— పెద్దల ఆచారము

ననుసరించి శాస్త్రపద్ధతిని పాటించి తనచిత్తమునకు అనుకూలతను గ్రహించి లౌకికవ్యవహారమును ఆచరించువాడు ఆర్యుడనబడును- మొదటిభూమికలో ఆర్యత్వము అంకురించును- రెండవభూమికలో వికసించును- మూడవభూమికలో ఫలించును యోగికి- ఇట్టి ఆర్యత సిద్ధించి అంతరాళమున (మధ్య) మరణించిన యోగి శుభసంకల్పము వల్ల సంపాదించుకొనబడిన భోగములననుభవించి మరల చిరకాలము యోగ మార్గమునందుండును-

౪. ఇట్లు మూడుభూమికలను అభ్యసించుటచే అజ్ఞానము నశించును- సమ్యగ్జ్ఞానము ఉదయించును చిత్తమునందు ఆనందైకరసమయిన నిర్గుణచైతన్యమును సాక్షాత్కరించుకొనును చతుర్థభూమికను పొందును- అనగా చతుర్థభూమికను పొందినవారికి బ్రహ్మసాక్షాత్కారమగునని భావము- అద్వైతభావము స్థిరపడగా ద్వైతము శమింప నాల్గవభూమికను పొందినవారు లోకములను స్వప్నతుల్యముగ జూతురు-

౫. ఇక పంచమభూమిక సుషుప్తి యనబడును- దీనిని చేరిన వానికి ద్వైతావభాస యేమాత్రము ఉండదు- కేవలాద్వైతభావములో నుండును- విశేషాంశములన్నియు నశించును- స్వస్వరూపావిర్భావము జరుగును- సుషుప్తఘనుడై పంచమాభూమికను జెంది, అంతర్ముఖప్రజ్ఞతో నుండుచు బాహ్యవ్యాపారముల నాచరించుచున్నను పరిశ్రాంతుడుకనుక నిద్రాళువువలె కనుపడును-

౬. పంచమభూమికయందుండి యోగమాచరించుచు వ్యుత్థానవాసనారహితుడై "తుర్య" అను పేరుగల షష్ఠ (6వ) భూమికను క్రమముగ పొందును- ఇందుండువాడు సద్రూపుడు కాడు- అసద్రూపుడు కాడు- అహంకారరూపుడు కాడు- అనహంకారరూపుడును కాడు- కేవలము సంకల్పరహితుడై ఏకత్వద్విత్వములు లేనివాడుగ నుండును- హృదయగ్రంథులు పటాపంచలగును- శాంతసందేహుడు- జీవన్ముక్తుడు- ప్రారబ్ధముచే శరీరధారియైయునను ముక్తుడు చిత్రదీపమువలె

"అర్ణవమునందలి కుంభమువలె అనావృతానంద స్వభావుడగుటచే పరిపూర్ణుడు లోపల వెలుపలను—ఇట్లు ఆరవభూమికయాందుండి క్రమముగ,

౭. "విదేహముక్త" యను పేరుగల ఏడవభూమికను జెందును—ఈదశ వాచామగోచరము— ఇద్దానిని శైవులు శివమనియందురు—వేదాంతులు బ్రహ్మమందురు—సాంఖ్యులు ప్రకృతిపురుషవివేకమందురు. జైమినీయులు స్వర్గమందురు— సాత్వతులు వాసుదేవుడందురు— మాహేశ్వరులు మహేశ్వరుడందురు— బౌద్ధులు అనుపప్లవ విజ్ఞానమందురు—ఆర్హతులు అనుపప్లవ సుఖమందురు— ఇట్లు వారివారి బుద్ధికితోచిన నానావిధములతో అవ్యపదేశ్యమయిన తత్త్వమునుగూడ వ్యపదేశింతురు— రామా! ఇట్లు నీకు ఏడుభూమికలను క్రమముగా జెప్పితిని—వీనిని అభ్యసించినవాడు దుఃఖమునొందడు—

మత్తకరిణ్యాఖ్యాయిక—

రామా! పూర్వం అత్యంతమదోన్మత్తయయిన కరిణి (ఆడయేనుగ) ఒకటి ఉండేది— మహామెల్లగా నడచునట్టిది— మహాత్తరమయిన దంతములుకలది— నిత్యము సమరమునందు (యుద్ధమునందు) ఆసక్తికలది— అంతులేని అనర్థాలను తెచ్చిపెట్టేది— దానిని చంపినట్లయితే ఈయేడుభూమికలందును నరుడు జయమునొందును— ఆయేనుగచే ఈభూమికలన్నీ నిరుద్ధములయియున్నవి— కనుక దానిని చంపనిదే ఏయొక్క భూమికకూడ జయింప సాధ్యముగాదు— కావున ఇట్టి మత్తకరిణిని (ఆడమదపుటేనుగును) వధింపనివాడు క్షుద్రసాంసారిక సంప్రదాయములయిన సమరభూములందు ప్రవేశించుటకూడ ఎవడుసమర్థుడగును?

శ్రీరా॥ మునీంద్రా! ఎవరు యీమదించిన యేనుగు? ఏది రణభూములు? ఇదియెట్లు చంపబడును? ఇదియెచట చిరకాలము రమించును? అని అడిగాడు—

వసి॥ రామచంద్రా! "ఇదినాకుకావలెను" "ఇదినాకుకావలెను" అనెడికోరిక (ఇచ్ఛ) యే మత్తకరిణి (మదపుటేనుగ) శరీరము ఇది

సంచరించెడివనము- ఇంకను వివిధఉల్లాసములతో మదించివిహరించును- మదించిన ఇంద్రియములు దీనిపిల్లలు- శుభాశుభకర్మలు నాలుక దానిబృంహితము రెండును దీనిదంతములు- వాసనాజాలము దీని మదము- సంసారదృష్టులు సమరభూములు- ఈభూములందే మానవుడు మాటిమాటికి జయపరాజయములనొందు చుండును- ఈ ఇచ్ఛయనెడి ఏనుగు నీచమానవులను హింసించును- దీనికి చిత్తమనే కోశంలో "వాసన, ఈహ, మనస్సు, చిత్తము, సంకల్పము, భావన, స్పృహ, ఇత్యాదినామము లెన్నియోకలవు- ధైర్యమను పేరుగల గట్టి అస్త్రముచే దీనిని జయింపనగును- "ఇదివస్తువు" "ఇదివస్తువు" అని మనస్సులో ఎంతవరకు ఆత్మభిన్నవస్తువునందు జ్ఞానముండునో అంతవరకు సంసారమనే మహావిషవిషూచికా రూపమయిన తృష్ణ విజృంభించును- "ఇదినాకగుగాక" అనెడి సంకల్పమే సంసారము- దీనికుపశమము మోక్షము- ఇదియే జ్ఞానసంగ్రహము-

రాగద్వేషాదులచే మలినమయిన చిత్తంలో శ్రుత్యాచార్యాదుల యుపదేశవాక్కు తామరాకుమీద నీటిచుక్కవలె అంటదు- వైరాగ్యాది గుణసంపదతో కూడిన చిత్తమందయితే అద్దమునందు నూనెచుక్కవలె అంటును- విషయపరిత్యాగమాత్రముచే ఇచ్ఛ అనే సంసారవృక్షపు మొలకపుట్టదు- కొద్దిగాపుట్టినా అనర్థకారి కనుక అసంవేదనమను శస్త్రముచే ఛేదించవలెను- ఇచ్ఛచే వ్యాపించిన జీవుడు భోగకార్పణ్యమును విడువనేరడు- చిత్తమును నిర్వ్యాపారముగ నుంచుటయే అసంవేదనము- ప్రత్యాహారమనే బడిశము (మత్స్యబంధనము) చే ఆకర్షించి దీనిని కట్టివేయవలెను- ఇది నాకు కావలెనని యనుకొనుట ("ఇదంమేఅస్తు" యనునది) కల్పనము- పదార్థములను భావించకుండుటయే కల్పనాత్యాగము- పదార్థస్మరణము సంకల్పము- అస్మరణము- శివము- అనుభూతా ననుభూతములనన్నిటిని విస్మరించి కట్టెవలె నుండవలెను- రామా! నేను చేతులెత్తి మొత్తుకుంటున్నాను- ఒక్కడూ

వినేవాడులేడు- అసంకల్పమే పరమశ్రేయస్సు- దానిని లోపల భావించువాడెవ్వడును లేడు- అన్నిపనులూ కట్టిపెట్టి కూర్చుంటే ఆపరమపదము లభించునుకదా ! ఈపదవియందు హిరణ్యగర్భానందముకూడ గడ్డిపోచ మాత్రము కాదుకదా ! ఇప్పటి సంకల్పము లేకున్ననూ, పూర్వాభ్యాసమూ, జీవనాదృష్టమూ వీటివల్ల అనిషిద్ధకర్మలందు స్పందము కలుగును- కనుక వ్యవహారలోపము కలుగుననియు జీవనము జరుగనేరదనియు భయపడవలసిన పనిలేదు-

రామా! ఎక్కువగా చెప్పి యేమిలాభము? సంక్షేపంగా చెబుతా విను- సంకల్పమే బంధము- సంకల్పాభావమే మోక్షము- నిత్యసిద్ధ పరమార్థ చిద్రూపమును సాక్షాత్కరించుకొనుచు శాంతముగ నుండుము- భేదప్రపంచమును విస్మరించుటయే జీవబ్రహ్మైక్యలక్షణమయిన యోగము- రామా ! లాభాలాభములందు సమతాదృష్టికలిగి కర్మలనాచరించుము- వాసనారహితుడవై సమాధిపరుడవగుచో చేయుట మానుకొనుము- ఎల్లపుడు పరమార్థచిన్మయుడవుగ నుండుము-

శివము సర్వగతము, శాంతము, చిదాత్మకము, అజము అగు ఆత్మతత్త్వమును భావించుటయే సర్వత్యాగము- ఇట్టి తత్త్వమును నిరంతరము భావించుచు నీవిహితకర్మను నీవాచరింపుము-అహంమమాభిమానముతో నుంటివా నిన్ను దుఃఖము విడువదు- ఆరెంటినీ విడిచితివా నీకు దుఃఖముండదు- ఇందు నీకిచ్ఛవచ్చినట్లు చేయుము-

ఇట్లు ౧౨౭వ సర్గ ముగిసెను.

## ౧౨౮. భరద్వాజానుశాసనము.

భర॥ గురూ ! నిర్మలాంతఃకరణుడయిన శ్రీరామచంద్రుడు వసిష్ఠమహర్షి ఉపదేశించిన జ్ఞానసారమును విని మరేమయినను తెలియగోరి అడిగెనా ? లేక అంతటితో తృప్తి చెంది సకలసందేహములు తొలగి ఆత్మసుఖముతో పరిపూర్ణుడై బోధాత్మరూపుడుగ నున్నాడా ?

శ్రీరాముడు నిత్యసిద్ధమయిన జ్ఞానయోగైశ్వర్యములుకలవాడు- అనావృతచిత్స్వభావుడు- శ్రుతిప్రసిద్ధమయిన యీశ్వరస్వరూపుడు- జగత్పాలనముకొరకు అవతరించినవాడు జగద్గురువు- అయినను లోకానుగ్రహముకొరకు జ్ఞానశాస్త్రమును లోకమున ప్రవర్తింపజేయ దలచి స్వేచ్ఛలో తనకు అజ్ఞానమున్నట్లు కల్పించుకొని ఇందు ప్రవర్తించాడు- నేనయితే అనాదినుంచి అజ్ఞానుడను- ముముక్షువును అత్యల్పమయిన సాధనములుకలవాడను- కావున మాయిరువురకు చాల అంతరము (భేదము)న్నది- అందుచే నేనడుగుచున్నాను- అన్నాడు వాల్మీకితో భరద్వాజుడు-

వాల్మీ॥ భరద్వాజా! వసిష్ఠుడు చేసిన యీ ఉపదేశమును విని శ్రీరాముడు తెలియతగినదానిని తెలిసికొనినవాడై చైతన్యానంద సాగరుడై, స్వస్వరూపమునందు ఉద్బుద్ధుడై, ప్రశ్నోత్తరవిభాగాది పరిపాటిని మానుకొని, అష్టైశ్వర్యములనుగూడ తృణప్రాయముగ తలంచుచు పరశివస్వరూపుడై ఏమియు మాటాడకుండ నూరకొనెను కొంతసేపు-

భర॥ అబ్బా! చాలఆశ్చర్యము- రాముడు మహాపదమును చేరినాడు- అదినాకెక్కడిది! మూర్ఖులూ, స్తబ్ధులూ, కించిజ్జ్ఞులు అయిన మాబోటివారెక్కడ బ్రహ్మాదులచే ప్రార్థింపతగిన రాముని పదవి యెక్కడ!

గురూ! నేనెపుడు విశ్రాంతి చెందుదును- దుష్పారమయిన సంసారసాగరమును ఎప్పుడు తరింతును? చెప్పండి- అని యడిగెను-

వాల్మీ॥ ఓ భరద్వాజా! శ్రీరాముని చరిత్రనంతయు మొదటి నుంచి వసిష్ఠవాక్యముల కనుగుణముగ నీకు నిరూపించియున్నాను- నీవు నీబుద్ధితోకూడ విచారించుకొని నిశ్చయించుకొనుము- నేను ఇకముందు నీయనుభవమున కనుకూలముగ అవస్థాత్రయమును వివేచనచేయు విధానమునుగూర్చి చెప్పవలెను- చెప్పెదను వినుము-

ఈ ప్రపంచమంతా అవిద్యాకార్యము— దీనిలో సత్యము అణుమాత్రముకూడ లేదు— విద్వాంసులు వివేచనచేసి తెలిసికొనుచున్నారు— అవివేకులు తగాదాపడుచున్నారు— మిత్రమా! చైతన్యముకంటె భిన్నమయిన వస్తువులేదు ఏమాత్రము— ఎందుకు ప్రపంచమును అడ్డుపరచుకొనెదవు? మహావాక్యములయర్థములను, నేను చెప్పబోయెడి ఉపాసనలను అనుష్ఠించి విశుద్ధచిత్తుడవగుము—

భరద్వాజా! ప్రపంచవిషయమయిన మనోవృత్తి జాగ్రన్నిద్ర అనియందురు— ఎవనిచిత్తమునందు చిత్ప్రదీపము వెలుగునో వాడే యీనిద్రలో మెలకువగలవాడు— ఈప్రపంచమునకు అజ్ఞానముమూలము— అజ్ఞానమే శిఖరము— (అగ్రము) అజ్ఞానమే మధ్యసారము— కనుకనే దీనిని విద్వాంసులు మెచ్చరు— అనాదినుంచివచ్చెడి వాసనాదోషము వలన ఇదిలేకున్నను కనుబడుచుండును గంధర్వనగరమువలె— నీవు ప్రపంచవాసనలనెడి విషతీగలను ఆశ్రయించి మోసపోవుట యెందుకు! శ్రేయోదాయకమయిన చైతన్యామృతకందళిని అలవరచుకొనరాదా! తత్త్వదర్శనంతో చిత్తస్థైర్యమును జెందకపూర్వము అజ్ఞానదశలోనే ఈజాగ్రత్ అనేఅవస్థ యేర్పడినది— మధ్యదశలో ఈమూడు అవస్థలును లేవు— కాబట్టి అజ్ఞానముండునంతవరకే ప్రపంచము— మొదట ఈ ప్రపంచములేదు— చివరలేదు— కాబట్టి మధ్యదశలో కనిపిస్తున్నను లేనట్లు తెలిసికొనుము— జ్ఞానమనే సముద్రములో అవిద్యానిమిత్తములయిన ఈప్రపంచపదార్థములు బుడగలవలె క్షణంలో పుట్టుచుండును— క్షణంలో లయించుచుండును— అజ్ఞానమనేది ఒక మహాసముద్రము— ఇది ప్రపంచంఅంతా వ్యాపించియున్నది— అహంభావమనేది ఇందులో ఒకపెద్దతరంగము— ఇది అవిద్యఅనే గాలికి పుటుతుంది— మమత అనేది యిందులోని ఆవర్తము— (సుడి) రాగద్వేషములు రెండును పట్టుకొనెడి మొసళ్లు— ఈరెండును ప్రతిమానవుని పట్టుకొని ఈడ్చుకొనిపోవుచుండ ఏమానవునికు మృత్యుముఖప్రవేశము తప్పదు—

కనుక భరద్వాజా! ద్వైతప్రపంచమనే ఉప్పుసముద్రమును విడిచిపెట్టి అద్వైతమనే అమృతవార్ధిలో మునుగుము- లోకంలో ఉండేదియేది? పోయేదియేది? ఎవడికి దేనిచే ఏమికలుగును? ఎందుకు మాయలోపడి మునిగిపోతావు- అద్వితీయమయిన ఆత్మతత్త్వముకంటె వేరువస్తువు శాస్త్రము చెప్పుచున్నది- ఈపరిస్థితిలో నీకు దుఃఖవిషయమగు వస్తువేమియున్నది? మూఢులనుగూర్చి బ్రహ్మకు జగదాకారముగ వివర్తమును చెప్పుచున్నారు- జ్ఞానులగూర్చి వారు అవివర్తితమగు ఆనందము ననుభవించుచునే యున్నారు- దీనినిచూచి అవివేకి దుఃఖిస్తాడు- హఠాత్తుగ ఆనందిస్తాడు- తత్త్వవేత్తమాత్రం నవ్వుతూ ఉంటాడు- అతిసూక్ష్మాతిసూక్ష్మమయిన ఆత్మతత్త్వము అవిద్యచే తిరోహితమయినది- అందుచే వార్లకు ప్రపంచభ్రాంతి పుట్టుచున్నది- అజ్ఞానులకు- జలమందు స్థలబుద్ధి ఉదయించినట్లు- ప్రపంచమంతా పరమాణుమయమను వాదమందుకూడ శోకమునకు ప్రసక్తిలేదు- ఇట్టి స్థితిలో మాయామయము జగత్తు" అనుపక్షములో శోకప్రసక్తి ఎక్కడిది? పరమాణువాదపక్షంలో దేహాదులు అనాత్మలగుటచే ఆత్మనాశములేదు కావున దుఃఖప్రసక్తిలేదనిభావము-

మిత్రమా! లేనిదానికి ఉత్పత్తిలేదు- ఉన్నదానికి అభావము లేదు- ఆవిర్భావతిరోభావములనడివి మాయికమగు సన్నివేశవిశేషములకేకాని తాత్త్వికములకుకాదు-

భర॥ మునీంద్రా! దేహాద్యాకారవిశేషములు మాయికములే యయినచో ఇంద్రజాలకుడు చూపించెడి మాయికవస్తువులవలె ఉదాసీనముగ జూచుచున్నపుడు శోకమోహాద్యనర్థములను ప్రసాదించుటలో కారణమేమి?

వసి॥ విను సమాధానము- ప్రస్తుత కారణమేమీలేదు- పూర్వజన్మార్జితమయిన పుణ్యాపాపప్రవృత్తి లక్షణమయిన ఉత్సాహమే ఇందుకు కారణము- అందువలననే మాయికమయిన దేహాదులు మరణ

మూర్ఖా ద్యనర్థసహస్రములనిచ్చుచున్నవి- అధ్యాత్మశాస్త్రము నూరు మారులు ఉపదేశించినను పాపవశంచేత మనస్సునకు ఎక్కుటలేదు- కనుక ఆపాపమును పోగొట్టుకొనుటకుగాను సగుణేశ్వరోపాసనము చేయుము- పాపమంతయు పటాపంచలగును-నీదురితములన్నియు ఇంకను క్షీణించలేదు నిజము- ప్రాణికృతమయిన పుణ్యాపాపకర్మయే పశుపతికి ప్రాణులనే పశువులను కట్టివేయుటకు పాశములని వివిధశ్రుత్యాదులందును ప్రసిద్ధమయినది- కనుక నీచిత్తము ప్రసన్నమగువరకును అర్ధనారీశ్వర వేషధారియగు పరమేశ్వరుని భజింపుము- పరమేశ్వరభజనము వల్ల నీచిత్తము నిరాకారతత్త్వమునందు సహజముగా నిలిచిపోగలదు- చూడుము ప్రమాణమును-

శ్లో॥ ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం
త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం ।
ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం
సమస్తసాక్షిం తమసః పరస్తాత్ ॥ అని

ఈశ్వరసేవవలన చిత్తశుద్ధిని సంపాదించుకొనుము- సత్వ(చిత్త) శుద్ధియొక్క బలంవలన వ్యామోహసహస్రములతో మదించియున్న అవిద్యయొక్క వ్యామోహశక్తిని జయించుము- పిదప గురూపదేశమందును శాస్త్రోపదేశమందును విశ్వాసముంచుము-అవిశ్వాసముగల మనస్సుతో ఇంద్రియమనో నిగ్రహాత్మకమయిన యోగమార్గమును అనుసరింపుము- తరువాత పన్నెండు ముహూర్తముల కాలమయినను సమాధినిపొంది అపుడు కలిగిన ఆత్మదర్శనము (సాక్షాత్కారము) చే ఇతఃపూర్వము నీకున్న అజ్ఞానావృతమయిన బుద్ధివృత్తిరూపమగు రాత్రి ప్రభాతభావమును (పగటికాలధర్మమును) చెందుగాక- నీపురుషప్రయత్నమును దానిచే సాధ్యమయిన కేవలకర్మనూ కట్టిపెట్టుము- ఈశ్వరానుగ్రహము వలననే పొందదగిన దానిని మానవులు పొందుచున్నారు-

భరద్వాజా! ఆభిజాత్యము, సదాచారము, నీతి, పరాక్రమము, తపస్సు ఇవియేవియు ఫలించవు- వీటన్నికంటెను పురాకృతకర్మయే ప్రబలము- దానిని సాధింపవలెనన్న యీశ్వరానుగ్రహము అత్యంతావశ్యకము- అయితే వెనుకటి గ్రంథములో నేను పురాకృతకర్మకంటె ఇదానీంతన పురుషప్రయత్నమే ప్రబలమని చెప్పియున్నట్లును ఇపుడు అందుకు వ్యతిరేకముగ చెప్పుచున్నట్లును నీకొక సంశయము కలుగవచ్చును- పురాతనకర్మలు అనంతములు- ఇప్పటి పురుషప్రయత్నములు అత్యల్పములు- అందువలన ఈశ్వరానుగ్రహములేనిదే వానిని జయింప సాధ్యముకాదు- నేను వెనుకకూడా ఈశ్వరానుగ్రహముయొక్క సాహాయ్యమును హృదయమునందుంచుకొనియే ఐహికప్రయత్నమునకు ప్రాబల్యమును సాధించితిని- ఈశ్వరసాహాయ్యమును విడచికాదు- కావున పూర్వోత్తరగ్రంథ విరోధములేదు-

అయితే ఈశ్వరోపాసనయే చేయవలెనుకాని యమనియమాది యోగమెందుకు? జ్ఞానమెందుకు? అని నీకు సందేహము కలుగవచ్చును- కాని అది యుచితముకాదు- నీవు యీశ్వరునియెడల ఎంతటి ప్రపన్నుడ వయినను పురుషబుద్ధికి గమ్యముకానట్టియు శ్రుత్యేకసమాధిగమ్య మగునట్టియు, సమూల సర్వకర్మ నిరాసోపాయ మగునట్టియు, జ్ఞాన లక్షణమనే ప్రతిక్రియనుంచి నీవెందుకు భయపడెదవు- ఉపాసనాప్రసాదితమయిన యీశ్వరుడుకూడ లలాటస్థమయిన అక్షరపంక్తిని సాక్షాత్తు తనచేతితో తుడవలేడు- మరేమన జ్ఞానాకృతమయిన మూలోచ్ఛేద మను ఉపాయముచేతనే తుడువగలడు- కాన యీశ్వరోపాసనకాని తజ్జన్యమగు జ్ఞానముకాని వ్యర్థముకాదు- గురువునకూ, శాస్త్రమునకూ శిష్యునిగూర్చి బోధించెడిశక్తి శిష్యునకు చిత్తశుద్ధివల్ల ఊహాపోహశక్తి దానివలన చక్కగా గ్రహింపగలశక్తి రాగద్వేషాదిదోషములను మొదలంట రూపుమాపుకొనెడి యోగ్యతాప్రాప్తి ఈసామగ్రియంతయు నొకేమారుకలియుట ఇదియంతయు ఈశ్వరేచ్ఛారూపమగు

నియతివల్లనే జరుగును- లేకుంటే వక్త యెక్కడ! బుద్ధికుశలతయెక్కడ? ద్వంద్వపదార్థ మోహాలతయెక్కడ! కనుక ఓ భరద్వాజా! నీవు వివేకముచే మోహమును జయించుము- నీకిపుడు అసాధారణమగు జ్ఞానము లభింపగలదు- మహాసత్వము (బలము) గలవాడు మహాపదయందు గూడ జంకడు- (భయపడడు) కొద్ది బలముగలవాడు కొద్దిపాటి పని చెడిపోయినను భయపడును- మరియు గొప్పబలముగలరాజు యుద్ధము మున్నగు మహాపదలందు నిమగ్నుడయినను ధనభృత్యాది సామగ్రీ సంపన్నుడగుటచే ఇతరుల ఊహాకందని పృథివీపరిపాలన, దుష్టనిగ్రహ, శిష్టపరిపాలనాది కార్యమును ఆజ్ఞామాత్రముచే నెరవేర్చుకొనుటకు ఉత్సాహపడుచుండును- కొద్దిబలముగలవాడు, కొద్దిపాటి ధనాదులు క్షీణించినను ధైర్యాదిసామగ్రి లేనందున దుఃఖించును- జ్ఞానమనునది పుణ్యమునకు పరాధనమయినది- జీవన్ముక్తులను నిదర్శనముగా పెట్టుకుని "పుణ్యసామగ్రిఉంటే నాకు బోధకలుగుతుంది" అని ఊహించుకొని ఆపుణ్యసామగ్రిని సంపాదించుకొనవలెను- పుణ్యకర్మశత్రువుగా ఉంటే బంధమునిచ్చును- అది మిత్రునివలెనుంటే మోక్షమునిచ్చును- రాగముతో కూడిన పుణ్యమే శత్రువు- అదియే బంధకము- రాగరహితమయినకర్మ శత్రువుకాదు- మిత్రము- ఈయది మోక్షమున కుపయోగించును- కనుక రాగరహితముగ పుణ్యము చేయవలయును- పుణ్యాతిశయముచే ప్రాక్తన పాపము నశించును- దానిచే శమదమాది సంపత్తి కలుగును- దాన త్రివిధతాపములు ఉపశమించును-

భరద్వాజా! నీకు సంసారమనే సుడిగుండంలోపడి తిరగటం ఇష్టములేనిచో, పుణ్యమును సంపాదించుకొని, దానివల్ల వైరాగ్యమును పొంది అదిదృఢపడిన తరువాత అన్నికర్మలనూ సన్న్యసించి శ్రవణాదులను జేయుము- బాహ్యదృష్టి యున్నంతవరకు బ్రహ్మమునందాసక్తి యుండదు- కనుక వివేకదృష్టిని చెడగొట్టునట్టి (ఆచ్ఛాదించునట్టి) శోకమును నీవు ఆశ్రయించుట యెందుకు! ప్రజ్ఞాయష్టినే ఆశ్రయిం

చును అదియే నీకు కావలసిన దానినంతయు నిర్వహింపగలదు- హర్ష శోకముల యొక్క తరంగములకు స్వాధీనమగువారు ఉత్తములలో లెక్కకురారు- మునీంద్రా! ఈజీవజాతమంతా హర్ష విషాదలక్షణ ము ఐన ఊయెలలో ఆలింబవల్లో ఊగులాడుచున్నది- కాలమనేదానికి మాటిమాటికి లోకములను పుట్టించటం, పెంచటం, సంహారించటం అనేది మహోత్సాహం- ఎన్ని పర్యాయాలు అయినా విసుకులేదు- సర్వప్రాణిశరీరములు కాలపురుషునకు అశనములే- అదనీయమయిన అన్నము భుజింపదగినదే- ఈనిశ్చయంతో ఉండి శరీరంమీద అహంతా ద్యభిమానమును త్యజింపవలెను- దానశోకమునకు ప్రసక్తియుండదు నీకు- దేవతాకాయములే దుష్కాలమునకు గోచరములగుచుండ ఒక్కనిమిష కాల ముండునట్టి మానవశరీర పిండములయొక్క స్థితి యేమని చెప్ప వలెను! కనుక సాక్షిస్వరూపుడవగు నీకు సంసారవర్తన కౌతుకదర్శనమే యుక్తముకాని శోకమోహాది వికారములను జెంది స్వయముగ నాట్య మాడుట నీకుతగదు- నీవు నిశ్చలంగాఉండి సంసారనాటకం అంతా చూస్తూఉండు-

భరద్వాజా! వివేకిఅయినవాడు క్షణభంగురమయిన యీ సంసారమును గురించి దుఃఖించడు- యేమాత్రము- కనుక అమంగళ కరమయిన దుఃఖమును విడిచిపెట్టు- మంగళకరములగు దేవ, ద్విజ, గురు, శ్రద్ధా ప్రభృతులను అర్జించుము చిదానందఘనుడయిన పరమా త్మను భావించుము- మంగళకరమయిన పనులు ఈశ్వరానుగ్రహము నకు సాధనములు ఈశ్వరానుగ్రహము సాక్షాత్ జ్ఞానసాధనముచూడుము-

శ్లో॥ ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా ।
మహాభయపరిత్రాణా ద్విత్రాణామేవ జాయతే ॥ అని-

భర॥ వాల్మీకి మునీంద్రా! మీయనుగ్రహావశంచేత నేను అంతయు తెలిసికొన్నాను- సంసారముకంటె పరమశత్రువులేదు- వైరా గ్యముకంటె ముఖ్యబంధువులేదు- ఇది మీబోధలోని పరమరహస్యము-

ఇపుడు వసిష్ఠుడు యావద్గ్రంథంలో చెప్పిన శాస్త్రరహస్యమంతా ఒక్కపదంతో పిండీకృత్య నిశ్శేషంగా చెప్పండి వినవలెనని ఉన్నది—

వాల్మీ॥ భరద్వాజా! విను ఈమహాజ్ఞానాన్ని ఇదిముక్తిప్రదము—విన్నంతమాత్రమున భవాబ్ధిమగ్నుడుగాడు మానవుడు ఎవడు తానొక్కడయినను సృష్టిస్థితి సంహారభేదములతో అనేకవిధముల గోచరించుచున్నాడో అట్టి సచ్చిదానందమూర్తికొరకు నమస్కారము— ప్రపంచప్రవిలాపమును చేయగా తత్త్వము ప్రకాశించును— మాండూక్యోపనిషత్తందు చెప్పినక్రమమునను సరించి నీకాయుపాయమును జెప్పెదను విను— పూర్వాపరవిచారక్షమయిన నీబుద్ధి యిపుడేల చెడిపోయినది! ఆస్మృతి మరల నీకిపుడు కలుగగలదు! దానిచే కరతామలకమున అంతయు స్వయముగ నీవు తెలిసికొనగలవు—

ఇట్లు ౧౨౭వ సర్గ ముగిసెను.

## ౧౨౮. రామవ్యుత్థానము.

వాల్మీ॥ భరద్వాజా! శమదమాదిషట్కసంపత్తి కలిగి విహిత, నిషిద్ధ, కర్మలను మానుకొని, విషయేంద్రియసంయోగమువలన కలిగెడి సుఖమును మానుకొని, శ్రద్ధకలిగి మృదువయిన ఆసనమునకూర్చొని, మనోవ్యాపారములను కట్టిపెట్టి మనస్సు నిర్మలమగువరకు ప్రణవమును జపింపవలెను— పిదప అంతఃకరణశుద్ధికొరకు ప్రాణాయామమును చేయువలెను— తదుపరి ఇంద్రియములను విషయములనుంచి లాగివేయవలెను— దేహ, ఇంద్రియ, మనో, బుద్ధి, క్షేత్రజ్ఞులలో ఏదియేది, ఏయే దా(వా)నివలన బుట్టునో, దా(వా)నిని శ్రుత్యాదులవల్ల తెలిసికొని, ఆయాభూతములందును, దేవతలందును, వానిని విలాపనము చేయువలెను— విలాపనమనగా కారణముకంటె భిన్నముగ కార్యముండదని గ్రహించుట— ఇట్లు ఆధ్యాత్మిక దేహేంద్రియ భావమును విడిచిపెట్టి తత్కారణభూత దేవతాసమష్టి స్వరూపమయిన "విరాట్ పురుషుడే

నేనను" భావనతో మొట్టమొదట విరాట్టునందుండి పిదప తత్కారణమయిన సూక్ష్మభూత లింగసమష్టి స్వరూపుడయిన హిరణ్యగర్భుని యందు జీవాత్మను ప్రవిలాపమును జేసి (అనగా నేనే హిరణ్యగర్భుడనను భావనచేసి) తదుపరి తత్కారణమయిన త్రిగుణుడును మాయోపహితుడునునగు అవ్యాకృతాత్మయందుండి తరువాత సర్వప్రపంచమునకు మూలకారణమయిన అవ్యాకృతునితోగూడ సర్వమునకధిష్ఠానమయిన శుద్ధబ్రహ్మయందు ప్రవిలాపము చేసియుండవలెను– విరాట్, హిరణ్యగర్భ అవ్యాకృత, శుద్ధబ్రహ్మలు, యథాక్రమముగ అకార, ఉకార, మకార, అర్థమాత్రాస్వరూపులు– కాన ఈనలుగురును ప్రణవమునందిమిడియున్నారు– దేహేంద్రియాదుల ప్రవిలాపనమును వివరించి చెప్పెదను వినుము– మాంసాది పార్థివభాగమును పృథివియందు ప్రవిలాపము చేయవలెను. (పృథివీమాత్రమేనని చింతనజేయవలెను– ఆప్యమయిన (జలాత్మకమయిన) రక్తాదికమును, జలమునందును, తైజసభాగమును, తేజస్సునందును, వాయవ్యభాగమును, మహావాయువునందును, నాభసముగు, శారీరాకాశమును, ప్రసిద్ధాకాశమునందును ఉంచవలెను–

ఇట్లే ఘ్రాణాదీంద్రియములనుగూడ వానివాని కారణములగు, దేవతోపాధులగు సూక్ష్మపృథివ్యాదులందు ప్రవిలాపమొనర్పవలెను– వినుము ఆక్రమమును– శ్రోత్రేంద్రియమును దిగ్దేవతారూపముగ భావింపవలెను– త్వగింద్రియమును విద్యుద్దేవతారూపముగను, చక్షురింద్రియమును, ఆదిత్యదేవతారూపముగను, జిహ్వేంద్రియమును, వరుణదేవతారూపముగను భావింపవలెను–

అట్లే ప్రాణమును, వాయువునందును, వాక్కును, అగ్నియందును, హస్తమును ఇంద్రునియందును, పాదములను విష్ణువునందును, పాయువును మిత్రునియందును, ఉపస్థను, కశ్యపప్రజాపతియందును, మనస్సును చంద్రునియందును, బుద్ధిని బ్రహ్మయందును ఉంచవలెను– వీరందరూ ఇంద్రియాధిష్ఠాన దేవతలు– ఈ దేవతలే ఇంద్రియములను

పేరుతో శ్రుతివాక్యము ననుసరించి చెప్పబడుచున్నారు- అందువలన ఈ దేవతలకంటె ఇంద్రియములు వస్త్వంతరములుకావని, తత్త్వము నుపదేశించి ప్రవిలాపమును జేయుటకుగాను నేను చెప్పుచున్నాను- ఇదియును శ్రుతిప్రమాణమును బట్టియే కాని స్వకపోలకల్పితముకాదు- ఇలా ప్రవిలాపమొనర్చి తనదేహమును తాను విరాట్టునని చింతింపవలెను- బ్రహ్మాండములోపలనున్న అర్ధనారీశ్వరుడగు ప్రభువు నిఖిలభూతముల కాధారభూతుడు- ఆతడే నిఖిలప్రాణులకు కారణము- జీవనాధారముకూడా- అండముకంటె రెండురెట్లు పృథివి- పృథివికంటె రెండురెట్లు జలము- జలముకంటె రెండురెట్లు అగ్ని- దానికంటె రెండురెట్లు వాయువు- వాయువుకంటె రెండు ఆకాశము- ఇట్లు అపంచీకృతరూపములోను, పంచీకృతరూపములోను, ఒకదానికంటె మరొకటి పెచ్చుగా వ్యాప్తమయియున్నది ప్రపంచము-

గరు॥ పురాణములలో ఒకదానికంటె నొకటి పదిరెట్లు పెద్దదని చెప్పబడినది- ఇచట రెండురెట్లు పెద్దదని చెప్పబడినది- ఇది విరుద్ధకదా! యను శంకకలుగును- ఇచట ద్విగుణమున, ఒక్కొక్కగుణమున పంచగుణములు (అయిదురెట్లు) ఉన్నట్లు లెక్కించుకొనవలెను- అట్లు లెక్కించుకొనుచో ద్విగుణమున రెండయిదులు పదిరెట్లగును-

లేక పురాణప్రసిద్ధమయిన ఆవరణపరిమాణము- అపంచీకృతభూతావరణాభిప్రాయములో చెప్పబడినది- ఇయ్యది పంచీకృతభూతావరణాభిప్రాయములో చెప్పబడినది- కావునవిరోధములేదు- వీనినన్నిటిని వాటివాటి కారణములందు ప్రవిలాపమొనర్చి యోగి లింగశరీరమునుమాత్రము ధరించియుండవలెను- వాసనలు, భూతసూక్ష్మములు, కర్మావిద్యలు, దశేంద్రియములు, మనస్సు, బుద్ధి ఇవి లింగశరీరమనియందురు- ఆలింగ సమష్టి దేహమందు హిరణ్యగర్భుడనను భావననుంచవలెను-

చతుర్ముఖుడనగా పద్మమువలనబుట్టిన దేహముగలవాడని లోకములో ప్రసిద్ధము- భూతసూక్ష్మసమష్టి స్వరూపుడు చతుర్ముఖుడుగాడు-

కనుక నితడు హిరణ్యగర్భుడెట్లగును ? అని యడిగెదవేమో! వినుము- భూతసూక్ష్మము నందభిమానముగల చతుర్ముఖుడే బ్రహ్మాండ ప్రవిలాప నమునకు పూర్వము బ్రహ్మాండైశ్వర్యభోగముకొరకు పద్మోద్భవమయిన దేహమును కల్పించుకొని చతుర్ముఖుడయినాడు- కాన ఇందు అసామంజస్యము లేదు- ఈలింగ దేహమును అవ్యాకృతమునందును,అవ్యక్తమునందును నుంచవలెను- లేక నామరూపములు లేకుండ దేనియందు ఈజగత్తు ఉండునో అద్దానిని ప్రకృతియని సాంఖ్యులందురు- వేదాంతులు మాయయందురు- తార్కికులు అణువులందురు- బౌద్ధులు సంవృతిరూపమయిన అవిద్య యందురు- వీరందరు వారివారి యూహాలతో భ్రాంతచిత్తులై పలురకముల అభిప్రాయపడిరి-

ఈఅవ్యాకృతత్వమునందు ప్రలయకాలమున సకలపదార్థములు లయమును (ఆరవభావవికారమును) చెంది అనభివ్యక్తరూపములై అవ్యాకృతముయొక్క సత్తతోనే ఉంటున్నవి- వీటికపుడు పరస్పర సంబంధములేదు- చైతన్యమునకు భోగ్యములగుటయును ధర్మమున్ను లేదు- ప్రళయానంతరము మరల సృష్టికాలమున ఆ అవ్యాకృతము నుంచియే పుట్టుచున్నవి- ఆకాశాదిక్రమమున సృష్టియు దానికి విపరీత క్రమమున సంహారమున్ను జరుగును- కనుక విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతమను పేరుగల స్థానత్రయమునువిడిచి తదధిష్ఠానమగు తురీయ పదమును ధ్యానించవలెను- ఈవిధానము మాండూక్యమునందిట్లు చెప్ప బడినది- "నాంతఃప్రజ్ఞం నబహిఃప్రజ్ఞం నప్రజ్ఞం నాప్రజ్ఞం నప్రజ్ఞానఘనం" అని త్యాగవిధానమును, "అదృశ్య మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం శివం శాంత మద్వైతం చతుర్థం మన్యంతే" అని ధ్యేయవస్తువున్ను నిరూపించబడినది-

ఇట్టి ధ్యానమువలన కలిగిన చరమసాక్షాత్కారవృత్తిచే ధ్యానకర్తృకరణరూపమయిన లింగశరీరమునుకూడ మూలాజ్ఞానమును

బాధించుకొనుటచే ప్రవిలాపము చేసికొని నిరతిశయానందముగు బ్రహ్మను పొందవలెను- అప్పటికికాని కృతార్థుడుకాడు- లింగ నిగడముక్తియే ప్రధానమయిన మోక్షము- అన్నాడు వాల్మీకిమహర్షి-

భరద్వాజుడు॥ మునీంద్రా! నేను ఇపుడు లింగశరీరమునుంచి ముక్తుడనయినాను- సర్వదా నేను చిదంశుడను కనుక చైతన్యానంద సాగరంలో మునిగిపోయాను- సర్వోపాధివర్జితుడనై పరమాత్మాభిన్నుడ నయితిని- కూటస్థుడను- కేవలుడను- చిదచిచ్ఛక్తిమంతుడను- ఘటములేనిచో ఘటాకాశ మఠాకాశములు రెండును ఏకమయినట్లు ఒక్క అజ్ఞానము నశించేసరికి తత్ప్రయుక్తమయిన భేదబుద్ధులన్నీ నశించినవి- ఇలాగంటి అభేదమునే శ్రుతులన్నియు ఘోషించుచున్నవి- అగ్నిలో అగ్ని వేస్తే రెండూకలిసి ఒకటేయగును- మరుభూమియందు తృణాదికమును ఉంచినచో లవణమగును- అలాగే అచేతనమును చైతన్యము నందుంచినచో చేతనమే యగును- జలంలో జలము, క్షీరంలో క్షీరము, ఘృతంలో ఘృతము, ఈయవినశించవు- విశేషాకారముగ కనిపింపవు- అలాగే నేను సర్వభావములతో చేతనమునందు ప్రవేశించినవాడనై, నిత్యుడను, సర్వగతుడను, శాంతుడను, నిరవద్యుడను, నిష్కలుడను, నిష్క్రియుడను, శుద్ధుడను కేవల పరబ్రహ్మస్వరూపుడను అయితిని- అభ్యాసకాలమందుగూడ మీరునాకు ఇలాంటి బ్రహ్మనే ధ్యానించమని నాకుపదేశించినారు-

కావున సాధకుడు స్వవర్ణాశ్రమధర్మనిష్ఠుడగుచు ఇట్టిబ్రహ్మనే ధ్యానించవలెను- ఈవిధముగ ధ్యానాభ్యాసంలో నున్నవానికి మనోలయమగును- మనస్సులయమయినచో ఆత్మప్రకాశమగును- ఆత్మప్రకాశమగుచో సర్వదుఃఖములుపోవును-"నాకంటె చిదానందమయుడు వేరేలేడనీ, తానొక్కడననీ, పరబ్రహ్మస్వరూపడననీ, నిశ్చయము కలుగును-

వాల్మీకి॥ భరద్వాజా! సంసారమను సుడిగుండములో భ్రమణ

మును నీవు తప్పించుకొనదలచినచో సర్వకర్మలను సన్యసించి బ్రహ్మసక్తుడవగుము-

భరద్వాజుడు॥ మునీంద్రా! మీరు చెప్పిన జ్ఞానమంతా నాకు తెలిసినది- బుద్ధినిర్మలమయినది- సంసారము విలంబమును (ఆలస్యమును) జేయుటలేదు- జ్ఞానియగు జీవన్ముక్తునకు-

౧. కర్మకర్తవ్యమగునా! కాదా! అని మొదటిప్రశ్న-

౨. కర్తవ్యమగుచో ప్రవృత్తిరూపమయిన నిత్యనైమిత్తికకామ్య కర్మలంతయు వెనుకటివలె చేయవలసినదేనా!
లేక కామనారహితమయిన తమతమ ఆశ్రమోచితకర్మమాత్రము కర్తవ్యమా! అని రెండవప్రశ్న-

గమనిక॥ సర్వకర్మసన్న్యాసమును విన్న భరద్వాజునకు ఈ రెండు ప్రశ్నలు అనుపపన్నములని తోచవచ్చును- కాని, "యావజ్జీవమగ్నిహోత్రంజుహోతి" "కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః" ఇత్యాది శ్రుతులచే యావజ్జీవకర్తవ్యములుగా విధింపబడిన యాగదానహోమములకు "దీక్షితో నదదాతి నజుహోతి" ఇత్యాదివాక్యములచే దీక్షాకాలమందు పరిత్యాగము ప్రాప్తమయినను దీక్షవదలినతోడనే పునఃప్రాప్తించినట్లు, "త్యజతైవహి తజ్జ్ఞేయం" "ఏతమేవప్రవ్రాజినో లోకమిచ్ఛంతః ప్రవ్రజంతి" ఇత్యాది శ్రుతులచే బ్రహ్మజిజ్ఞాసను నిమిత్తముగ చేసికొని, విడిచిపెట్టబడిన కర్మలుకూడ జ్ఞానముసిద్ధించగా నిమిత్తము తొలగుటతోడనే పునఃపరిగ్రహము న్యాయసిద్ధముగ సంప్రాప్తమగును-

అయితే విద్వత్సన్న్యాసమును విధించుటచే జ్ఞానము సిద్ధించిన తరువాతకూడ కర్మలకు అనుష్ఠానప్రసక్తి లేదుకదా! అనియనరాదు- అయ్యది జన్మాంతరానుష్ఠిత వివిదిషాసన్న్యాసవశమున గృహస్థాద్యాశ్రమములందే తత్త్వజ్ఞానముకలిగి కృతార్థులయిన పురుషవిశేషులను గూర్చి విధింపబడుటచే అప్రాప్తసన్న్యాసాంతరవిధానపరమగు నద్దానికివివిదిషా

సన్న్యాసము ప్రాప్తించిన వానివిషయములో సన్న్యాసాశ్రమ పరిపా లనమును విధించుటకు శక్తి లేదు- కావున భరద్వాజును ప్రశ్నలు రెండును ఉపపన్నములు- ఇందుకు వాల్మీకి సమాధానము-

వాల్మీ॥ భరద్వాజా! మీబోటి ముముక్షువులు ఏకర్మ ఆచరించి నందున శ్రవణాదులకు విఘ్నము, చిత్తమునకు విక్షేపము, చిత్తమునకు మాలిన్యము, పాతకాదిదోషమున్ను కలుగదో, అట్టికర్మలనే ఆచరించ వలయును- ఇంతియేకాని కామ్యనిషిద్ధ దృష్టవిక్షేపసాధనాదికర్మలను చేయరాదు- వివిదిషాసన్న్యాసపరిపాలనమయితే విధిపూర్వకముగ విడిచి పెట్టబడినదానికి మరలవిధిలేనిదే పరిగ్రహము సంభవించనందువలనను,

శ్లో॥ ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః ।
ప్రాయశ్చిత్తం నపశ్యామి యేనశుధ్యేత్స ఆత్మహా ॥

అని పరావృత్తిలో దోషము వినబడుటవలననూ, అట్లు పరావృత్తి (పునఃపరిగ్రహము) చేసినందున ప్రయోజనము లేనందువలననూ, శిష్టు లనేకులు అట్టిపనిని నిషేధించుటవలననూ, సిద్ధింపగలదు-

వివరణము॥ భరద్వాజా! నీవు మొదట కామ్యనిషిద్ధకర్మలను జ్ఞానవిరోధి విక్షేపాదిదోషములకు హేతుభూతమయిన కర్మలనూ విడచి శాస్త్రాభ్యాసంచేత జ్ఞానమును సంపాదింపవలెను- ఆపైన "తస్యకర్మ కీదృశమ్" వానిపని యెట్టిది? అనుప్రశ్నకు జవాబును నీవే తెలిసికోన గలవు- ఆయాభూమికా పరిపాకక్రమంచేత ఆయాకర్మల నుపరమించుట అప్పుడప్పుడు నీకే అనుభవగోచరమగును- జ్ఞానులకు ప్రారబ్ధకర్మవైచి త్ర్యముచే ఏకరూపస్థితి కనుపించుటలేదు- వారికర్మప్రవృత్తిమనికాని, నివృత్తిమనికాని నియమించుట శక్యముగాదు- అని భావము- వీరికి జ్ఞానిత్వము మాత్రము సర్వమనోగుణములను త్యజించి పూర్ణానందా ద్వయ విశుద్ధ అసంగ చిదేకరసత్వాది బ్రహ్మగుణములు ప్రాప్తించి నపుడే కలుగును- ఇతరథా కలుగదు- దేహేంద్రియ మనోబుద్ధుల

పరమయినవాడు ఆనందమయుఁడో శాస్త్ర అతనికి పరమయినది సర్వాధిష్ఠానమయిన పరబ్రహ్మ- ఇట్టి పరబ్రహ్మమే నేనని యెవడు ధ్యానించునో అట్టిజీవుడు ముక్తుడగును- కర్తా, కార్యం, కరణం, భోక్తా, భోగ్యం, భోగః, జ్ఞాతా, జ్ఞానం, జ్ఞేయం అను మూడుత్రిపుటులతో సంబంధములేనివాడయి, దేహేంద్రియాద్యుపాధులతోను, తత్ఫలములయిన సుఖదుఃఖములతోను ఎప్పుడు వినిర్ముక్తుడగునో అపుడు ఆజీవుడు ముక్తుడగును- సర్వభూతములందు తాను తనయందు సర్వభూతములను అభేదముగ జూచువాడు ముక్తుడగును- జాగ్రదాది అవస్థాత్రయమును విడిచి తురీయమగు పదవినిచేరిన జీవుడు ముక్తుడగును- జీవునకు పరమాత్మభావమనే ఏతురీయస్థితికలదో అయ్యది అవస్థాబీజమయిన కర్మవాసనలు నిద్రయును అవస్థావిశేషమున్ను లేనిది- చిత్సుఖాత్మకము- ఆతుర్యాఖ్యమయినస్థితి నిదిధ్యాసనపరిపాక జన్యమయిన నిర్వికల్పసమాధి యోగమునకు పరిసమాప్తి లేక ముఖ్యాధికారియొక్క విచారమాత్రజన్యమయిన సాక్షాత్కారాత్మక జ్ఞానమునకు పరిసమాప్తి- మనోనాశమయిన తరువాత ఇతరవస్తువు గోచరించదు-ప్రశాంతమయిన అమృతతరంగములుగల అమృతవారిధియందు మునిగియుండు- ద్వైతభావ (భేదభావ) మనే ఉప్పుసముద్రమునందు మునగవు- కనుక భరద్వాజా! జగద్గురువగు పరమేశ్వరుని సేవించు- ఇది వసిష్ఠుడుపదేశించిన జ్ఞానము దానిని నేనునీకు సంగ్రహంగా చెప్పితిని- ఈ జ్ఞానమార్గముతోకాని, యోగమార్గముతోకాని విశ్రాంతిని చెందగలవు- శాస్త్రవిమర్శతోను, గురువాక్యార్థ బోధవలనను, స్వయమభ్యాసము వలనను సర్వము సిద్ధించునని వేదముయొక్క అనుశాసనము- కనుక నీవు మిగిలినదంతయు విడిచిపెట్టి అభ్యాసయోగమునందు మనస్సు నిలుపుము-

భరద్వాజ! మునీంద్రా! శ్రీరామచంద్రుడు చిద్రూపముతో బ్రహ్మయందు ఐక్యమును చెందెను- అట్టివానిని వసిష్ఠమహర్షి వ్యవహారతత్పరునిగ ఎల్లుచేసెను! ఈవిషయం తెలిసికొని నేనుకూడ

అభ్యాసయోగముకొరకు ప్రయత్నింతును— ఆయనకువలె నాకుగూడ వ్యుత్థానదశలో వ్యవహారము జరుగగలదు—

వాల్మీ॥ భరద్వాజా! శ్రీరామచంద్రుడు అపరిచ్ఛిన్న బ్రహ్మాకారచిత్తుడై స్వస్వరూపమునందు ఎపుడు నిలిచిపోయాడో, అపుడు విశ్వామిత్రుడు వసిష్ఠమహర్షితో ఇట్లన్నాడు—

విశ్వా॥ ఓ వసిష్ఠా! మహానుభావా! నీవు పరిపూర్ణానుగ్రహదృష్టిపాతమనే శక్తిపాతముచే శిష్యుని ఉద్ధరించుట రూపమయిన గురుత్వమును వెంటనే చూపించితివి— మీబోటివారలు స్వదేహమును విడచి శిష్యదేహమును ప్రవేశించి కుండలినీశక్తి సంచారాదికమును చేయవలసినపనిలేదు— మీరు సత్యసంకల్పులు— కనుక కృపాదృష్టితో గూడ సచ్ఛిష్యునకు కుండలినియొక్క షట్చక్రములను భేదించి బ్రహ్మరంధ్రమునందలి పరశివునితో సహావేశలక్షణమగు శక్తిపాతమున్ను జీవునియొక్క ఉపాధిపరిత్యాగముచే శుద్ధబ్రహ్మ సమావేశలక్షణ శక్తిపాతమున్ను చేయగలుగుదురు—

దర్శనము, స్పర్శనము, శబ్దము, కృప, ఇవియన్నియు శిష్యదేహంలో శక్తిపాతము చేయుటకు ఉపాయములే— గురువు ఈ ఉపాయములలో దేనిచేనయినను శిష్యుని యుద్ధరించగలడు—

శ్రీరామచంద్రుడు విశుద్ధాత్మ— విరక్తుడు— విశ్రాంతిమాత్రమును కోరువాడు— మీ సంవాదమువలన పరమపదమును పొందినాడు— గురువాక్యముకంటెకూడ శిష్యునిప్రజ్ఞయే బోధకు ముఖ్యకారణము— గురు వెంత చెప్పినా శిష్యునకు మలత్రయము పక్వముకానిచో బోధ యేమి ఫలించును? గురుశిష్యులిద్దరు యోగ్యులగుచో వారు సమస్త పురుషార్థములకు భాజనమవుదురు—

వసిష్ఠమునీంద్రా! ఇపుడు నీవు మాబోంట్లమీది కృపతో శ్రీరాముని వ్యుత్థితుడ జేయుము— నీవు కృతకృత్యుడవే కాని మేము

మాత్రము కార్యార్థులమై యున్నాము- నేనేపని తలంచి వచ్చితినో దానిని నీవు తలపున నుంచుకొనుము- అతిప్రయాసపడి నేను దశరథుని బ్రతిమాలుకున్నాను దానిని వ్యర్థపుచ్చకుము- నిష్కల్మష హృదయముతో మనము యజ్ఞకార్యమును (దేవ కార్యమును) నెరవేర్చుదము- ఆవల అవతారప్రయోజనమును చూచుకొందము. అదివేరువిషయము- ముందు నేను శ్రీరాముని సిద్ధాశ్రమమునకు గొనిపోవుదును. అచ్చట రాక్షససంహారమును అతడు చేయగలడు- అహల్యా శాపమోక్షమును చేయగలడు- శివధనుర్భంగమొనరించి సీతను వివాహమాడగలడు- పరశురాముని గర్వమణచగలడు- భయరహితుడై విరక్తుడై పితృపైతామహమగు రాజ్యమును విడచి వెళ్ళగలడు- వనవాసమను మిషతో దండకారణ్యవాసులయిన మునులను ఉద్ధరించగలడు- వివిధ ప్రాణులను, పుణ్యతీర్థములను పవిత్రము చేయగలడు- సీతాపహరణమనే దుర్గతిమిషతోను, రావణాది దుష్టరాక్షస వధవలననూ, లోకంలో స్త్రీలోలురందరకు శోచ్యతను అస్వాస్థ్యమును జూపగలడు- యుద్ధమున చనిపోయిన వానరులను, ఋక్షజాతివారిని మరల బ్రతికించగలడు- అగ్నిప్రవేశముచే సీతయొక్క పారిశౌద్ధ్యమునుమిషతో తనకుగల శిష్టలోకానుసరణమును లోకమునకు చాటగలడు- పిదప రాజ్యాభిషిక్తుడై తాను జీవన్ముక్తుడై నిస్పృహుడయినను, కర్మాధికారులయిన జనులకు కర్మానుష్ఠానముచేతనే గతిఅని చూపగలందులకు, తాను కర్మకాండయందు పరాయణుడు కాగలడు- జ్ఞానకర్మసముచ్చయము నందధికారులయినవారికి బ్రహ్మలోకాదిగతులను చూపుటకు జ్ఞాన(ఉపాసనా) కర్మ సముచ్చయమునుగూడ చూపగలడు- అతనిని చూచినవారలకు, స్మరించినవారలకు అతని నామమును విన్నవారలకు, బోధించినవారలకు, సర్వులకు జీవన్ముక్తి సుఖమును ఈయగలడు- ఈ రామచంద్రునిచే ఇలా నాకు ముల్లోకములకును హితము చేయుదగియున్నది-

ఓ మహాజనులారా! మీరందరు ఈ రామచంద్రునకు నమస్కారమును జేయుడు- ఆయనకు నమస్కరించినంతమాత్రముచేత మీకు

జయింపతగినదంతయు జితమేయగును- మీలో ఎవరయినను శ్రీరాముని వలె జీవన్ముక్తుడై చిరకాలము నిర్వికల్పసమాధియందు విశ్రాంతిని పొందుచో అవ్వారు వృద్ధినొందుగాక-

వాల్మీ॥ భరద్వాజా! విశ్వామిత్రముని చెప్పినమాటవిని, వసిష్ఠుడు మున్నగుమునీంద్రులు సిద్ధులున్న శ్రీరాముని పాదపద్మములకు నమస్కరించుటయందు సదా అతనిని స్మరించుటయందు ఆదరము కలవారయిరి- రామకథను వినుట ఇక దుర్లభముకదా! అని ఖేద పడ్డారు- వసిష్ఠుడు మిగిలిన మహర్షులును శ్రీరాముని కథ విన్నంతలో తృప్తిపడలేను- అనగా ఇంకను వినుటకు ఉత్సాహ (ఆశ) పడినారు- గుణాకరుడగు శ్రీరాముని గుణగణములను ఒకరికొకరు చెప్పుకున్నారు- వసిష్ఠుడు విశ్వామిత్రునితో ఇలా అన్నాడు-

వసి॥ విశ్వామిత్రా! శ్రీరామచంద్రుడు ఈజన్మకు పూర్వము దేవుడా! మానవుడా! అని అడిగాడు.

విశ్వా॥ వసిష్ఠా! శ్రీరామచంద్రుడు సాక్షాద్భగవంతుడగు వాసుదేవుడు ఈమాటనమ్ము- విశ్వకల్యాణముకొరకు క్షీరసముద్రమును మథించిన మహానుభావుడు- ఉపనిషత్తత్త్వగోచరుడు- సర్వప్రాణులకు పురుషార్థములను ఇచ్చెడివాడు- ప్రపంచోత్పత్తిస్థితిలయములకు కర్త- ఇతనిని వీతరాగులగు యతులు ఆనందసింధువని కీర్తింతురు-

జ్ఞానముక్తుడు- నిత్యముక్తుడు- మాయానియంత- మాయకు బద్ధుడు- త్రయీమయుడు- త్రిగుణాతీతుడు- వేదములకు పారమార్థిక స్వరూపుడు- బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఈతని స్వరూపులు-

ఇతనిని కుమారునిగ కన్న దశరథుడు ధన్యుడు- ఇతనిచే నెల్లపుడు "నాకితడు ప్రతియోద్ధ" అని మనసా చింతించబడిన దశకంఠుడు ధన్యుడు-

ఈతడు లేని స్వర్గపాతాళలోకములు శోచ్యములు ఇతడవతరించిన మధ్యమలోకము (మర్త్యలోకము). శ్రైష్ఠ్యమును చెందినది- క్షీర సాగరశాయియగు శ్రీమహావిష్ణువు శ్రీరాముడుగ అవతరించినాడు-

చిదానందమూర్తి- ఈతని తత్త్వమును జితేంద్రియులగు యోగులు తెలిసికొనినారు- మనము ఈతని ప్రాకృతరూపమునే తెలిసికొన నర్హులము- ఈతడు రఘుకులమున బుట్టి రఘుమహారాజుయొక్క- పాపమునుగూడ రూపుమాపి అతని పవిత్రపరచినాడు- వసిష్ఠా! ఇతనిని వ్యవహారలోలునిగా జేయుము- అన్నాడు విశ్వామిత్రుడు-

వాల్మీ॥ భరద్వాజా! ఇలాఅని విశ్వామిత్రుడు ఊరకున్నాడు- వసిష్ఠుడు రామచంద్రునితో ఇలా అన్నాడు-

వసి॥ రామచంద్రా! ఇదినీకు విశ్రాంతిసమయముకాదు- లోకానందకరుడవగుము- లోకపరామర్శము-(అధికారమును సంపాదించుట) నిరూఢముకానంతవరకు, రూఢసమాధినొందరాదు- కనుక వినశ్వరములగు రాజ్యకార్యములను ఆలోచించుము- దేహకార్యములనుకూడ నెరవేర్చి పిదప సమాధిని సేవింపుము - సుఖింపుము-

వాల్మీ॥ భరద్వాజా! వసిష్ఠుడు ఇలాచెప్పినప్పటికి శ్రీరాముడు బ్రహ్మైక్యమును పొందినవాడై జవాబు చెప్పలేదు- అప్పుడు వసిష్ఠుడు సంకల్పముచే అతని శరీరమును ప్రవేశించి అతని సుషుమ్నానాడీద్వారా మెల్లగా హృదయపుండరీకమును ప్రవేశించాడు- విలీనమయియున్న అతని లింగశరీరమును బయటికి ఆకర్షించెను- ఆలింగశరీరమున చైతన్యము ప్రతిఫలించగనే శ్రీరాముడు మెల్లగా కళ్లుతెరచి వసిష్ఠాదిమునులను జూచి కృత్యాకృత్యవిచారణలేని వాడగుచూ "మీరు నన్ను గురించి యేమిచెప్పెదరు? అను ఆలోచనతో అందరను చూస్తూ నిలబడ్డాడు- వసిష్ఠుని మాటవిని గురువాక్యము అనుల్లంఘ్యమని తలచి పితృభ్రాతృబంధ్వాదుల ప్రార్థనకూడవిని తన యవతార ప్రయోజనమునుగూడ తెలిసినవాడుకనుక వసిష్ఠాశయమునంగీకరించి యిట్లనినాడు.

శ్రీరా॥ మునీంద్రా! మీయనుగ్రహమువలన ఇతడు(ఈవ్యక్తి) విధినిషేధములకు సమర్థుడుగాడు- అయినను మీవాక్యము అవశ్యము కరణీయము- మునీ! వేదాగమపురాణములందు స్మృతులయందును

గురువాక్యము అవశ్యానుష్ఠేయమనీ, అద్దానిని అతిక్రమించుట అతి హేయమనీ చెప్పబడినది- అనిచెప్పి వసిష్ఠుని పాదములను శిరసాధరించి సర్వాత్మయగు శ్రీరాముడు అందరితో ఇలా అన్నాడు-

శ్రీరా॥ అయ్యా! మీరందరు వినండి- నిశ్చయములలోకి అతి నిశ్చితమయిన విషయము- "ఆత్మజ్ఞానముకంటె గొప్పది లేదు- ఆత్మ తత్త్వమును తెలిసికొన్న శిష్యునకు గురువుకంటె గొప్పవాడు లేడు-"

సిద్ధాదయః ॥ రామా! అందరకు ఇదే అభిప్రాయమున్నది- నీయనుగ్రహమువలననూ, నీమాటచేతనూ, అదిదృఢము చేయబడినది- రామచంద్రమహారాజా సుఖముగనుండుము- రామచంద్రా! నీకు నమస్కారము- మేము వసిష్ఠునియొద్ద శెలవుతీసికొని వచ్చిన త్రోవనే మా నివాసములకు చేరెదము.

వాల్మీ॥ భరద్వాజా! ఇలాఅని అందరూ రామచంద్రుని స్మరించుకుంటూ వెళ్ళారు- వెంటనే రాముని శిరస్సున పూలవృష్టి కురిసినది- భరద్వాజా! రామచంద్రునియొక్క జీవన్ముక్తి విశ్రాంతి పర్యంతమగు కథనుఅంతా నీకు చెప్పితిని- ఈ క్రమంలో నీవు సుఖింపుము- ఈ చరితమును విన్నవారికి శ్రవణమాత్రముచే ముక్తి లభింపగలదు- అన్నారు వాల్మీకి-

ఇట్లు ౧౨౮వ సర్గ సమాప్తము.

ఇట్లు నిర్వాణప్రకరణము పూర్వార్థము పరిసమాప్తము.

ఇట్లు మల్లావఝులవంశపయః పారావారరాకాసుధాకరుండును, విజయలక్ష్మీగర్భశుక్తి కాముక్తాఫలుండును, వేంకటకృష్ణార్యతనూభవుండును, కోసలశాఖీయుండును, ఆపస్తంబసూత్రుండును, కౌశికసగోత్రుండును, నగు వేంకటసుబ్బరామశాస్త్రిచే విరచితంబగు, ఆంధ్రవాసిష్ఠ రామాయణమునందు, నిర్వాణప్రకరణము నందలి పూర్వభాగము సమాప్తము.

నిర్వాణప్రకరణము పూర్వార్థము.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 12 | పురంధ్రి | పురంధ్రీ |
| 6 | 4 | మొలకరించి | మొలకరించ |
| 6 | 22 | చైతస్థితిని | చైతన్యస్థితిని |
| 11 | 8 | లోకంద్వారం | లోకంద్వారా |
| 11 | 8 | భూలోకముద్వారం | భూలోకముద్వారా |
| 22 | 15 | (　　　) | పుండు |
| 32 | 23 | సత్వా | సత్తా |
| 33 | 2 | ఈవిద్య | ఈయవిద్య |
| 37 | 10 | ఆపధ | ఆప్రధ |
| 38 | 8 | ఆత్మాని | ఆత్మని |
| 39 | 9 | బ్రహ్మావాహాూ | బ్రహ్మావాహం |
| 43 | 19 | అధ్యాసా | అధ్యాస |
| 52 | 2 | చందమును | చండమును |
| 57 | 5 | ఉన్నాయి | ఉన్నాము |
| 65 | 24 | కుండ | కూడా |
| 74 | 24 | తెరచితే | తెంచితే |
| 81 | 22 | ౨౩-సర్గ "చిరజీవిత హేతుకథనము" అని శీర్షిక | |
| 82 | 5 | చింతనమ | చింతనము |
| 83 | 4 | సుషి ప్తి | సుషు ప్తి |
| 85 | 8 | క్రొక్తికము | మౌక్తికము |
| 86 | 10 | సంకట | సంకటము |
| 87 | 24 | చిదా | చిద |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 96 | 13 | దేహంలో | దేహంలోఉండదు |
| 104 | 23 | రుద్రల | రుద్రుల |
| 112 | 6 | అమూర్గ | అమూలాగ్ర |
| 112 | 7 | దారల | ద్వారముల |
| 112 | 11 | చైతన్య | చైతన్యం |
| 139 | 8 | పోతా | పోదా |
| 161 | 26 | చిదా | చివ |
| 165 | 4 | జానము | జ్ఞానము |
| 165 | 6 | బుధ్యాది | బుద్ధ్యాది |
| 168 | 15 | పోక్రా | పోమా |
| 170 | 26 | క్షుద్రక్వం | క్షుద్రత్వం |
| 172 | 8 | ఆకలికి | ఆకవికి |
| 172 | 12 | ద్రవత్వ | ద్రవత్వము |
| 172 | 12 | చలన | చలనము |
| 177 | 12 | ప్రలమోదయాలు | ప్రలయోదయాలు |
| 185 | 12 | అజ్జాదులు | అబ్జాదులు |
| 205 | 9 | మహేశ్వ | మహేశ్వరం |
| 205 | 10 | జగత్ రగ | జగత్ |
| 205 | 10 | అను | అని |
| 208 | 3 | పరమాత్మ | పరిమాత్ర |
| 210 | 18 | దుర్వకుని | దుర్వాచముని |
| 211 | 18 | జ్ఞానం కలిగినదో | జ్ఞానంఎలాకలిగినదో |
| 220 | 15 | దేహాత | దేహాత్మత |
| 220 | 16 | స్థూలజమగుట | స్థూలజలమగుట |
| 233 | 11 | ఉత్పాదితమే | ఉత్తరితమే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 242 | 8 | అప్రియుడే | అక్రియుడే |
| 252 | 4 | పరమార్ధా | పరమార్ధ |
| 257 | 7 | సత్వ్యస్తువు | సద్వ్యస్తువు |
| 269 | 7 | ప్రయోజనము | ప్రయోజకము |
| 271 | 8 | పిశాలు | పిశాచాలు |
| 273 | 19 | వనలయందు | వనలతలయందు |
| 276 | 19 | గణపత్య | గాణాపత్య |
| 278 | 22 | ఆమృగ | ఆమృగము |
| 284 | 15 | శాటితో | వాటితో |
| 287 | 15 | చేరు | చేరి |
| 300 | 10 | బ్రహ్మకార | బ్రహ్మకారంగా |
| 316 | 11 | చంపేశాడు | చంపేవాడుకాదు |
| 317 | 5 | చెబుతున్నా | చంపుతున్నా |
| 337 | 26 | తెలిసికొంది | తెలిసికొంటుంది |
| 341 | 16 | మృణాళంకారము | మృణాళకాండము |
| 341 | 20 | మంద్ర | మంత్ర |
| 343 | 20 | హృదయంతర్వర్తి | హృదయాంతర్వర్తి |
| 345 | 17 | బాహా | బాహ్య |
| 356 | 2 | చిత్యం | చిత్సం |
| 373 | 10 | మరిత | మర్దిత |
| 386 | 19 | ఆకాశాది | ఆకాశాన |
| 389 | 18 | కృచాంద్ర | కృచ్ఛ్రచాంద్ర |
| 391 | 8 | కేగి | కేగినట్లు |
| 398 | 10 | ఉద్యుద్ధ | ఉద్బుద్ధ |
| 402 | 6 | త్పర్యా | త్పర్య |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 402 | 18 | కర్మణో | కర్మణా |
| 404 | 4 | లబ్ధజ్ఞాన | అలబ్ధజ్ఞాన |
| 404 | 11 | వదలి | పదవి |
| 409 | 21 | ముతె | మునతె |
| 412 | 17 | దుఃఖా | దుఃఖ |
| 416 | 19 | సిద్ధి | సిద్ధ |
| 417 | 14 | శుద్ధిచే | శుద్ధిచేసి |
| 440 | 13 | గొట్టుచూ | గొట్టుచో |
| 451 | 26 | శించదో | శించునో |
| 454 | 18 | తాతికి | రాతికి |
| 455 | 12 | పోదాన | తపోదాన |
| 468 | 18 | యధా త్రైలం | తావ త్రైలం |
| 480 | 8 | అత్యము | అత్యంతము |
| 480 | 25 | కమిషుం | క్షమింషుం |
| 482 | 26 | యేది | యేదినాటి ! |
| 483 | 9 | ఇల్లు | ఇల్లు |
| 484 | 24 | మాలిను | మలిను |
| 492 | 18 | చెందన | చెందినను |
| 493 | 11 | కాశంషణ | కాశరషణ |
| 504 | 20 | నాశముగు | నాశియగు |
| 505 | 15 | గుగుప్రచే | గురువుచేకాని |
| 510 | 17 | మోహా | మోహాము |
| 513 | 18 | సిద్ధుల | సిద్ధులను |
| 518 | 4 | అభిపా | అభివా |
| 515 | 18 | వైరాగ్యము | వైరాగ్యముచే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 519 | 9 | శ్రుంగా | సృగా |
| 519 | 11 | శ్రుంగా | సృగా |
| 519 | 13 | నిమిత్తిక | నైమిత్తిక |
| 527 | 21 | ప్రవేశించుట | ప్రవేశించుటకు |
| 527 | 22 | వది | వవి |
| 533 | 16 | మోహాసముల | మోహాఃసహస్రముల |
| 535 | 1 | కుశత | కుశలత |
| 535 | 26 | యుష్టిచే | దృష్టినే |
| 536 | 21 | సాధనముల | సాధనములను |
| 543 | 2 | భరద్వాజును | భరద్వాజుని |
| 546 | 25 | లోకమునకు | లోకములకు |
| 548 | 25 | సమర్థు | సమర్థుడు |

సమాప్తము.

విజయ ఆర్టుప్రెస్, తెనాలి.